ఓం

# మోక్షసాధన రహస్యము

రచయిత:

శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు



శ్రీ శుకబ్రహ్మాశ్రమము

శ్రీకాళహస్తి

1980 వెల రు. 12-00

# విషయసూచిక

పేజీ

# ప్రస్తావన



సంసారబంధనమున తగుల్కొని పుట్టుక, చావు, ముసలితనము రోగము మొదలైన బాధలను అనుభవించు చున్న జీవుడు వానినుండి తప్పించుకొని బాధారహితమైన స్థితిని బొందవలెనని సదా కాంక్షించుచుండును. బంధ విముక్తిని బడయవలెనని ఎల్లప్పుడు కోరుచుండును. దుఃఖము లవలేశమైన దరికి చేరగూడదని నిరంతరము వాంఛించు చుండును. అయితే తా ననుభవించుచుండు శారీరక మానసిక బాధలను అతడు బాహ్యచికిత్సలచే తాత్కాలికముగ పోగొట్టుకొను చున్నాడేకాని ఆత్యంతిక దుఃఖరాహిత్యమును కలుగజేసికొనుట లేదు. ప్రతెంపులేని ఆనంద మెచట దొరకునా యనియు యోచించుట లేదు. బహుకాలము తపస్సు చేసి, ధ్యానాదులను సలిపి, భగవంతుని కృపాకటాక్షమునకు పాత్రులైన మహర్షులు ప్రపంచములో ఆనందమొక్కగని ఎచట యున్నదో తెలిసికొని అద్దానిని చేరుటకు మార్గము గూడ కనుగొనిరి. కనుగొనుటయే తడవుగా వారు దానిని వెనువెంటనే లోకమునకు బాహాటముగ చాటి రైచిరి.___

> శృణ్వన్తు విశ్వే అమృతస్య పుత్రాః
> ఆయే ధామాని దివ్యాని తస్థుః
> వేదాహమేతం పురుషం మహాన్తం
> ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్.

అమృతస్వరూపులగు ఓ జనులారా! తమస్సుకు అవల నున్న ప్రకాశస్వరూపమగు దివ్యతత్త్వమును మేము కను గొంటిమి. అదియే మోక్షధామము. మీరున్ను దానిని గూర్చి తెలిసికొనుడు. అట్లు తెలిసికొని శీఘ్రముగ భవ బంధములనుండి విముక్తిని బడయుడు.' అని అ మహాసీయులు కరుణతో నచించుచున్నాడు. అట్టి శాశ్వత పరంధామమును జేరుటకు ఎన్నియో మార్గములను, ఉపాయములను ఉపనిష దాదులందు, తదితర శాస్త్రములందు వారు సెలవిచ్చి యున్నారు. మోక్షమార్గమున పయనించు సాధకుల కవి యన్నియు కరదీపికవలె ఎంతయో సహాయపడుచున్నవి.

అట్టి మోక్షసాధనలు, మోక్షోపాయములు అనేక ములు ఈ గ్రంథమందు లేటతెల్లముగ వివరింపబడియున్నవి. గీతామకరందము, వసిష్ఠగీత మొదలగు గొప్ప గ్రంథములను తెనుగుభాషలో రచించి, ఆంధ్రలోకమునకు మహోపకార మొనర్చినట్టి శాళహస్తి శ్రీ శుకబ్రహ్మాశ్రమస్థాపకులగు శ్రీవిద్యాప్రకాశానందగిరి స్వాములవారు మోక్షమార్గమును సులభముగ దిగ్దర్శనమొనర్చు ఈ బృహద్గ్రంథమును రచించి ప్రజలకు ఇంకను గొప్ప మేలును ఒనగూర్చిరి. ఇరు వది అధ్యాయములతో గూడిన ఈ మహాగ్రంథమునందు ఆధ్యాత్మికసాధకులకు వలయు మోక్షసాధనసామగ్రి విశే షముగ తెలుపబడుటయే కాక, మోక్షమునకు అవరోధము లైన ప్రతిపక్షశక్తులను జయించు విధానములుకూడ పెక్కు పేర్కొనబడియుండుటచే ముముక్షువులకీ గ్రంథ మెంతయో

సహాయభూతముగ నుండగలదు. ఇందు చివరి అధ్యాయమున మోక్షమునుగూర్చిన అనేక శాస్త్రప్రమాణములు కూడ ఒసంగబడినవి. మహర్షుల అనుభవపూర్వకమైన వాక్యములు సాధకులకు ఎంతయో ధైర్యమును చేకూర్చగలవు. ఈ గ్రంథమును ముముక్షువులు చక్కగ పఠించి, అందు తెలుపబడిన సాధనలను బాగుగ అనుష్ఠించి ఆత్మానుభూతిని బడసి జన్మ సార్థకత నొందుదురుగాక!

ఇట్లు,

ప్రకాశకులు

ఓం

# మోక్షసాధన రహస్యము

## 1 వ అధ్యాయము

### మోక్షమనగా నేమి?

మోక్షమనగా విడుదల. బంధమునుండి విడుదల. దుఃఖభూయిష్టమగు సంసారబంధమునుండి విముక్తి నొందుటయే మోక్షము. పుట్టుక చావులనుండి తప్పించుకొనుటయే మోక్షము. అవిచ్ఛిన్న ఆత్మానందానుభూతిని బడయుటయే మోక్షము. స్వస్వరూపమగు దైవమందు నిలుకడ కలిగియుండుటయే మోక్షము. దేహభారమును, మనోభారమును, జీవభారమును వదిలించుకొనుటయే మోక్షము. భారరహితమగు ఆత్మయందు నిలుకడ కలిగియుండుటయే మోక్షము.

అనాదికాలమునుండి జీవుడు సంసారబంధమునందు తగుల్కొని అజ్ఞానశృంఖలముచే బద్ధుడై, తన స్వస్వరూపమును మఱచి తాను దేహమని భ్రమించుచు నానాయాతనలను అనుభవించుచు జనన మరణ రూప సంసార చక్రమందు పరిభ్రమించుచున్నాడు. వాస్తవముగ అతడు బదుడు కాడు,

ముక్తుడు, మాంసమయుడు కాడు, మంత్రమయుడు. మృణ్మయరూపుడు కాడు, చిన్మయమూర్తి. పోతపోసిన సచ్చిదానంద విగ్రహమే మానవుడు. ఈ సత్యమును ఉపనిషత్తులు పని కట్టుకొని పదే పదే చాటుచున్నవి. కాని వ్యవహారమగ్నుడగు జీవుడు శ్రుతి భగవతియొక్క ఆ మహాత్వపూర్ణ వాక్యములను సరకుగొనక తన అల్పబుద్ధికి తోచినదే సత్యమని నమ్మి తద్రీతి ఆచరించుచున్నాడు. దృశ్యవైభవమే తన జీవితలక్ష్యమని భావించి, పాంచభౌతికమైన అల్పకాయమే తానని యెంచి, తన చుట్టునున్న బంధుమిత్రసుతాదులు ఆచంద్రతారార్కముగ విలసిల్లుదురని వెఱ్ఱిఊహలు గల్గి ప్రవర్తించుచున్నాడు. ఈ ప్రకారముగ సత్యవస్తువును ఉపేక్షించి అసత్యవస్తువును ఆశ్రయించి సంసారమను ఊబిలో దిగబడిపోవుచున్నాడు. ఇక కడతేరు మార్గమేది? ఇదియే ఇపుడు యోచించవలసిన ముఖ్యవిషయము.

జీవునకు దుఃఖమనునది స్వభావసిద్ధము కాదు, ఆగంతుకము. పరమానందమయుడగు జీవుడు తన నిజస్వరూపమును విస్మరించినందువలననే ఈ బంధము, ఈ జంజాటము నెత్తిన వచ్చి పడినది. శాస్త్రపరిచయము లేని కారణముచేతనే, పెద్దల సాంగత్యము లోపించుటవలననే మనుజునకు ఈసంసార తాపత్రయము తగుల్కొని బాధించుచున్నది. అసలు జీవునకు ఏకాలమందును బంధము లేదని, జీవుడు వాస్తవముగ నిత్యశుద్ధబుద్ధముక్త ఆత్మస్వరూపుడేయనియు సత్యాలను ముందుగా గుర్తెఱుంగవలెను. తాను బద్ధుడని, అల్పుడని, కాలగ్రస్తుడని

నిరంతరము భావించుచుండుటవలన ఇట్టి సంకుచిత భావము లచే హృదయమున తావోసంగుటవలన, జీవుడు క్రమశః అధోగతిని పొందుచున్నాడు.

> కృశోఽతిదుఃఖీ బద్ధోఽహం హస్తపాదాదిమానహమ్
> ఇతి భావానురూపేణ వ్యవహారేణ బధ్యతే, (వసిష్ఠగీత)

అని వసిష్ఠమహర్షి చెప్పిన చందమున 'నేను కృశించిన వాడను, అతి దుఃఖవంతుడను, బద్ధుడను, రెండు చేతులు రెండుకాళ్లు కలవాడను (ఇంతమాత్రమే నా స్వరూపము) అని తలంచువాడు, తదనుసారము వర్తించువాడు బంధింప బడుచున్నాడు.

> నాహం దుఃఖీ న మే దేహో బన్ధః కస్యాత్మనః స్థితః
> ఇది భావానురూపేణ వ్యవహారేణ ముచ్యతే.

'నేను దుఃఖవంతుడనుకాను, నాకు వాస్తవముగ దేహము లేదు. ఆత్మకు బంధమెచట?' అని తలంచువాడు, ఆప్రకారముగ వర్తించువాఁడు ముక్తిని బడయుచున్నాడు. సుఖదుఃఖములయొక్క, బంధమోక్షములయొక్క కీలక మిచ టనే యున్నది. అజ్ఞానమే దుఃఖహేతువు. ఆత్మచింతన లేక పోవుటయే అశాంతికి కారణము. జను లీ సత్యమును గుర్తె ఱిఁగి సత్యాన్వేషణను శీఘ్రముగ ప్రారంభించవలెను. దుఃఖ నివారణమునకు వేఱొక మార్గము లేదు.

చీకటిలో పామును చూచి కంగారుపడి ఒకడు నానా బాధలు పొందుచున్నాడు. దీపము తెచ్చి చూడగా అచట

పాము లేదు. త్రాడుమాత్రమే కలదు. చీకటిలో మనుజుడు పొందు దుఃఖపరంపరలు ఇతరమగు ఏ యుపాయము చేతను తొలగనేరవు. దీపము తెచ్చినపుడే అవి పోగలవు. అట్లే అంధకారబంధురమైన ఘోరతమస్సునందుపడి కోట్లకొలది జన్మలు నానాయాతనలు ననుభవించుచున్న జీవుడు ఆత్మజ్ఞానమను జ్యోతిని వెలిగించినపుడే పరమశాంతిని, దుఃఖరాహిత్యమును బొందగలడు. అట్టి యత్నమును శీఘ్రముగ ఈ మానవజీవితమందే ఒనర్చి లక్ష్యమును సాధించివేయు వలెను. అవకాశములన్నియు హస్తగతములైయున్న ఇట్టి అమూల్యసందర్భమును పోగొట్టుకొనుట దౌర్భాగ్యమే యగును.

సుప్తేరుత్థాయ సుప్త్యన్తం బ్రహ్మైకం ప్రవిచిన్త్యతామ్.

ఉదయము నిద్రలేచినది మొదలు మరల పరుండుపర్యంతము బ్రహ్మమును గూర్చియే లెస్సగ చింతన చేయుచుండ వలెనని శాస్త్రము లాదేశించుచున్నవి. ఆప్రకార మెందుల కాదేశించవలెనని యెవరైన ప్రశ్నించినచో దానికి ప్రత్యుత్తరము వెనువెంటనే శాస్త్రము లీ ప్రకారము చెప్పివైచినవి—

నాతిదూరే నృణాం మృత్యురితి వేదాన్తడిండిమః.

'ఓ జనులారా! మృత్యువు దూరముగా నున్నదని భ్రమించకుడు. అది చేరువలోనే యున్నది. కావున త్వరపడుడు. విజ్ఞానమును సముపార్జించుడు. మఱచిన మీ దివ్య

స్వరూపమును తిరిగి జ్ఞప్తికి తెచ్చుకొనుడు. మహాత్ముల నాశ్రయింపుడు. సాధన యొనర్చి కడతేరుడు! బంధనము నుండి విడుదల పొందుడు! మీ స్వస్వరూపమగు ఆత్మను బడయుటయే మోక్షమని యెఱుఁగుడు!!

## అజ్ఞానుల మనఃప్రవృత్తి

శాస్త్రము లీ ప్రకారముగ ముక్తకంఠముతో బలుకు చుండ, శంఖారావము బధిరుని కర్ణగోళమున ప్రవేశించని చందమున అజ్ఞులగు జనులు వాని నంతగా పట్టించుకొనుట లేదు. దైవమీమాంస చేయకపోగా 'దేహమీమాంస' లోనే కాలమునంతను వినియోగించుచున్నారు. అనగా దేహచింతన, దృశ్యపదార్థచింతనలోనే మునిగిపోవు చున్నారు. మాంసమయమగు శరీరమును గూర్చిన రంధి జనులను పట్టి పీడించుచున్నది. అజ్ఞులు మట్టిముద్దయగు దేహమే తమ జీవిత సర్వస్వమను భావన కలిగియున్నారు. తొమ్మిది రంధ్రముల తోలుతిత్తియే తానని, దానికి సంబంధించినవా రందరు తనవారని అహంకార, మమకారములు కలిగి భ్రమలో చిక్కుకొనుచున్నారు. రక్తమాంసములతో గూడి జడమైయున్న ఈ పంచభూత సముదాయ నిర్మిత వస్తువు యొక్క అందచందములను జూచి ఆనందపడుచు, దాని సౌందర్యమును జూచి మురిసిపడుచు దాని ఘనతనుగూర్చి, చర్చించుకొనుచున్నారు. దేహముయొక్క సౌందర్యనిర్ణయ మందు శిరోజములు (జుట్టు) సామాన్యముగ ప్రముఖపాత్ర వహించుచుండును. అయితే అట్టి అందమైన శిరోజములను

వ్రతప్రారంభమునగాని, మ్రొక్కుబడులు చెల్లించునపుడు గాని కొందఱు పూర్తిగ తొలగించివేయుదురు. సన్న్యాసాశ్రమ స్వీకరణమందును యతులు వానిని తీసివేయుదురు. దేహాభిమానమునకు ముఖ్యకారణమైనవి అగుటవలన వానిని తొలగించుటచే కొంత అయినను మమకారము ఈ శరీరముపై తగ్గునేమో యని పెద్దల అభిప్రాయమై యుండవచ్చును. ఏది యెట్లున్నను పంచకోశములలో ఎక్కడో అడుగున నున్నట్టి ఈ అన్నమయకోశమే జీవితసర్వస్వమని భావించుట విజ్ఞులకు పాడిగాదు. దీని యర్థము దానికి ఆహార మొసంగ గూడదని కాదు, దానికి అలంకారము చేయగూడదని కాదు, స్నానాదులచే దానిని శుభ్రపరచగూడదని కాదు—దానిపై అహంబుద్ధి, అభిమానము తొలగించుకొనవలెనని దీని పై వాక్యములయొక్క సారాంశము. ఈ సందర్భమున శ్రీ ఆదిశంకరులు పలికిన మహాత్మ్యపూర్ణ వచనములు ఉల్లేఖింపదగి యున్నవి—

> ఆత్మా చిద్విత్సుఖాత్మానుభవపరిచితః సర్వదేహాదియన్తా
> సత్యేవం మూఢబుద్ధిర్భజతి నను జనోఽనిత్యదేహాత్మబుద్ధిమ్
> బాహ్యోఽస్థిస్నాయుమజ్జాపలరుధిరవసాచర్మమేదోయుగన్త
> ర్విణ్మూత్రశ్లేష్మపూర్ణం స్వపరవపురహో సంవిదిత్వాపి భూయః. 1

ఆత్మ సత్, చిత్, సుఖస్వరూపమై యున్నది. అది సమస్త దేహములయొక్క ప్రభువై విలసిల్లుచున్నది. ఇది అనుభవసిద్ధము. ఇట్లుండ మూఢబుద్ధియగు జీవుడు అనిత్యమగు దేహమే తానని భావించి దేహాత్మబుద్ధి నాశ్రయించు

చున్నాడు. జనులు తమయొక్కయు, ఇతరులయొక్కయు శరీరములను బాహ్యమున ఎముకలు, మాంసము, రక్తము, క్రొవ్వు మున్నగు వానితోను, లోపల మలమూత్రకఫాదుల తోను నిండియున్నట్లు తెలిసికొనికూడ తిరిగి—

దేహస్త్రీపుత్రమిత్రాను చరహయవృషాస్తోష హేతుర్మమేత్థం
సర్వేస్వాయుర్నయన్తి ప్రథితమలమమీ మాంసమీమాంసయేహ
ఏతే జీవన్తి యేన వ్యవహృతిపటవో యేన సౌభాగ్యభాగ
స్తం ప్రాణాధీశమన్తర్గతమమృతమముం నైవ మీమాంసయన్తి. 2

'ఈ దేహము, పుత్రమిత్రసతీసుతులు, సేవకులు, గుఱ్ఱములు-ఎద్దులు మున్నగునవన్నియు నాయొక్క సుఖములకు సాధనములు' అని తలంచి ఈ 'మాంసమీమాంస' యందే తమ అమూల్య మానవ జీవితమును భ్రష్టమొనర్చుచున్నారు. మఱియు దేనిద్వారా జనులందఱు తమ తమ జీవితములను ధరించుచున్నారో, తమ తమ వ్యవహారములను గావింప గలుగుచున్నారో, ఎయ్యది వారియొక్క సౌభాగ్యమునకు హేతువైయున్నదో, ఏది వారియొక్క అంతఃకరణమందే స్థితిగల్గియున్నదో అట్టి ప్రాణాధీశుఁడైన అమృత ఆత్మయొక్క తత్త్వమునుగూర్చి వారొకింతైనను విచారణ యొనర్చుట లేదు! ఆహా! ఏమి ఆశ్చర్యము!'

అవతారమూర్తియైన శ్రీ శంకరభగవత్పాదుల ఈ గంభీర వచనములు జనులకు కనువిప్పు గలిగించునవిగా యున్నవి. మహనీయుల ఇట్టి ఉజ్జ్వల ప్రబోధములను విని యైనను జనులు తమ తమ జీవితములందు కొంతమార్పును,

సంస్కారమును కలుగ జేసికొనవలెను. బుద్బుదప్రాయమైన ఈ జీవితమందు మీనమేషములు లెక్కించుచు వ్యర్థముగ కాలయాపన చేయుటగాని, విషయభోగలాలసులై పారమార్థిక అవకాశములను జారవిడుచుటగాని, దేహేంద్రియాది దృశ్యపదార్థములపై మమత్వము అహంబుద్ధి కలిగియుండుట గాని, తన హృదయాంతర్గతమగు ఆత్మదేవుని విస్మరించుట గాని విజ్ఞులకు పాడికాదు. కావున దేహామీమాంసలోనే కాలమును వృథాచేయక దైవచింతన, తత్త్వచింతన, శాస్త్ర చింతన, ఆత్మచింతన గావించుకొనుచు జనులు తమ తమ జీవితములను సౌభాగ్యవంతములుగ నొనర్చుకొనవలయును. అంతియేకాని అజ్ఞానమును సమాశ్రయించి పెద్దలకు వెగటు కలిగించు నగుబాటుచేష్టలను గావించుచు లోకములో అపహాస్యపుపాలు కారాదు.

లోకమున అజ్ఞానుల ప్రవృత్తు లెట్లున్నవనగా—

అర్థా హసన్త్యుచిత దానవిహీనలుబ్ధం
భూర్హ్యా హసన్తి మమ భూమిరితి బ్రువాణమ్
ఆత్మా హసన్తి విషయేష్వధిమాఢచిత్తం
మృత్యుర్హసత్యమృతభక్తివిహీనమూఢమ్.

1. దానధర్మము లొనంగక లోభి డబ్బును కూడబెట్టుచున్నాడు.

—వానిని జూచి డబ్బు నవ్వుచున్నది.

2. 'ఇది నా భూమి'-అని మనుజుడు గొప్పగ చెప్పుకొనుచున్నాడు.

—వానిని జూచి భూమి నవ్వుచున్నది.

3. దృశ్యవిషయములపై వ్యామోహముగల్గి మనుజుడు వానివెంట పరుగిడుచున్నాడు.

—వానిని జూచి ఇంద్రియములు నవ్వుచున్నవి.

4. మరణరహితుడగు పరమాత్మను సేవింపక దేహమే తానని మానవుడు మురిసిపోవుచున్నాడు.

—వానిని జూచి మృత్యువు నవ్వుచున్నది.

అని ఒక కవిపుంగవుడు యుక్తియుక్తముగ ప్రతిపాదించెను. ఇందు అవాస్తవమైన దేదియునులేదు. మానవుడు అజ్ఞానవశమున తన అమూల్యజీవితమును నవ్వులపాలు కావించుకొనుచున్నాడు. తన వికృత చేష్టలచే విజ్ఞుల దృష్టియందు పరిహాసపాత్రుడగుచున్నాడు.

కొందఱు న్యాయమార్గముననో, అన్యాయమార్గముననో ధనమును సేకరించి, సేకరించి దానధర్మములకుగాని, పరోపకారమునకుగాని వ్యయముచేయక, స్వార్థపరులై, లుబ్ధచిత్తులై, త్యాగభావము ఒకింతైనను లేక తాము తినక, ఒకరికిపెట్టక, తుదకు జీవితమును సమాప్తము చేయుచున్నారు. పుణ్యసంపాదన లేకయే కన్నుమూయుచున్నారు. అట్టితఱి-ఎంతయో ప్రయాసతో, ఎంతయో అన్యాయతతో తాను ఇంతవరకు చేకూర్చుకొనిన సంపదలన్నిటితోను—

వారికి వియోగము సంభవించుచున్నది. తన సంపదనుండి, తన ధనరాసులనుండి ఇంత కాలము ఒక్కక్షణమైనను వేఱు పాటు నొందనివాడు, అట్టి వేఱుపాటును ఏ మాత్రము సహించనివాడు మరణకాలమున శాశ్వతముగ దానితో వేఱుపాటును పొందుచున్నాడు. బలాత్కారముగ దాని నుండి విడదీయబడుచున్నాడు. పుణ్యమునకా, పురుషార్థమునకా ?—ఆ సంపద అతనికి దేనికి ఉపయోగించినట్లు ? బ్రతికియున్న నాలుగురోజులలో మానవుడు తన చేతులారా తాను తన ద్రవ్యమును దానధర్మములకు వినియోగించనిచో, తుదకు రిక్తహస్తములతో బోవునపుడు ఏ పుణ్యము వానిని కాపాడగలదు ? లుబ్ధత్వము మహాపాపము. లోభమంత చెడ్డగుణము మఱియొకటి లేదు. కనుకనే నరకద్వారముల మూడిటిలో అది చోటును సంపాదించుకొనగలిగినది.* విజ్ఞుడగువాడు తన హృదయమున లోభమునకేమాత్రము తావొసంగక, త్యాగభావసంపన్నుడై మెలగవలెను. లక్షల కొలది ద్రవ్యరాశిని కూడబెట్టుకొని, కాకికైనను మెతుకు వేయని పరమలోభిని జూచి ధనము నవ్వినదట! నవ్వదు మఱి? రేపో మాపో శరీరము రాలిపోయినపుడు ఏమాత్రము సంబంధము లేకయుండు ఆ ద్రవ్యముపై లేనిపోని మమత్వము పెట్టుకొని సంబరపడుచు ఒక్కప్రాణికైనను సహాయము చేయని లుబ్ధాగ్రేసరులను జూచి ధనము నవ్వదా ?

* కామము, క్రోధము, లోభము—అను ఈ మూడును నరకద్వారము లని గీతాచార్యుడు వర్ణించెను. (17-21)

ఇక లోకములో జనులు కొంత భూమిని సేకరించుకొని 'ఇది నా భూమి' అని తలంచి ఆనందించుచుందురు. అతడు మరణించిన పిదప అతని కుమారుడుగాని, వారసుడుగాని 'ఇది నా భూమి' అని దానినే భావించుచుందురు. ఈలోగా అది ఎవరికైనను అమ్మివేయబడినచో, కొన్నవాడు 'ఇది నా భూమి' అని తలంచుకొనుచుండును. ఇంతకీ అది ఎవరి భూమి? భూమి మారుట లేదు, వస్తువు మారుట లేదు! 'నాది'ని తలంచువారు మారిపోవుచున్నారు. కనుకనే ఈ స్వల్పవ్యవధిలో, అల్పమైన జీవితకాలములో 'ఇది నా భూమి' అని తలంచి దానిపై మమతను పెంచుకొని, అది తన వెంట శాశ్వతముగ వచ్చుననను అపోహను గలిగియున్న వారిని జూచి భూమి నవ్వుచున్నదట! 'ఇట్టివారిని ఎంతమందిని నా కళ్ళముందు చూచితినో' అని భూమికి పట్టరాని నవ్వు వచ్చుట సహజమే.

మఱికొందఱు ఈ ప్రపంచమున దృశ్యవిషయములపై వ్యామోహముగల్గి, వానివెంట అహర్నిశములు పరుగెత్తుచు కాలమును గడుపుచున్నారు. అది చూచి ఇంద్రియములు 'ఆహా! ఎన్ని జన్మలు వీరీ ప్రకారము క్షణికసుఖములకై అఱ్ఱులు చాచుచున్నారు! కోట్లకొలది జీవితములు ఇంద్రియార్థముల ననుభవించినను వారికేమైన సంతృప్తికలిగినదా? విషయవాసనలు అభివృద్ధినొందుచు సంసారదుఃఖకూపమున వారినింకను కూలవేయుచున్నవే కాని ప్రశాంతిని, దుఃఖరాహిత్యమును వారికి కలుగజేయుట లేదే! ఎన్ని యాతనల

ననుభవించినను జనులు అక్షణిక పదార్థములనే వెన్నంటు చున్నారు. శాశ్వత ఆత్మసౌఖ్యమునకై తమ జీవితమును అంకితము చేయక, దైవసాక్షాత్కారమునకై యత్నింపక, విషయజాలమునే ఆశ్రయించి వారు భ్రష్టులగుచున్నారు! వివేకమును గోల్పోయి ఎండమావులవంటి భ్రమాత్మక పదార్థములకొఱకై పరిభ్రమించుచున్నారు'—అని తలంచి ఇంద్రియములు వారిని జూచి లోలోన నవ్వుకొనుచున్నవి.

నశ్వరమగు పాంచభౌతిక దేహమును ఎన్ని దేహపర్యాయములు ధరించి ధరించి సుకృతవశమున చక్కటి అవకాశములతో గూడిన మానవదేహము సంప్రాప్తించినపుడు అమృతస్వరూపుడగు పరమాత్మను అనన్యభక్తితో సేవించుట జీవుని ప్రథమ కర్తవ్యము. కాని అతడట్లు చేయుటలేదు. తాను జడమగు దేహమే అని తలంచుకొనుచు, దానినే నమ్ముకొని, దానిపైననే మమత్వమును పెంచుకొనుచు, దాని అందచందములనే చూచి మురిసిపోవుచు, అదియే తనకు శ్రీరామరక్షయని భావించుకొనుచు అమరరూపమగు ఆత్మను విస్మరించుచున్నాడు. 'నా దేహము శాశ్వతము, నా బంధుమిత్రాదులు శాశ్వతము, నా సంపదలు, నా కీర్తి శాశ్వతము'—అని భావించి గర్వోన్నతిని బొందు మానవులను జూచి మృత్యువు పకపక నవ్వుచున్నదట!

ఈ ప్రకారముగ ఇతరుల దృష్టిలో పరిహాసపాత్రుడగుట మానవునకు తగదు. మాయను జయించి దానిని

తానే అపహసించుటకు బదులు దానిచేతనే పరిహసింప బడుట విజ్ఞులకు పాడికాదు. ఈ నగుబాటు చేష్టలను ఎంత శీఘ్రముగ వదలివేసిన అంత శ్రేయస్కరము. కావున జనులు తామీ లోకమునకే తెంచినది అమృతస్వరూపమైన ఆత్మను సాక్షాత్కరించుకొనుటకే యని బాగుగ నిశ్చయించి, తాము క్షయశీలమగు దేహము కాదనియు, నిత్యశుద్ధముక్త అమృత రూపమగు ఆత్మయేయనియు పరిపూర్ణముగ విశ్వసించి, దృశ్యపదార్థములపై అభిమానమును ఆసక్తిని పారద్రోలి, నగుబాటుస్థితికి దిగజారక, మహోన్నత దైవశిఖరమునకు ఎగబ్రాకి మానవత్వమును చరితార్థ మొనర్చుకొనవలయును.

జీవుడు అనేక జన్మలందు తిరుగాడి తిరుగాడి పుణ్యపరిపాకముచే ఒకానొక జన్మయందు మానవుడై పుట్టి సద్గురు కటాక్షమును బడసి గురూపదేశముచే తాను ఏకాలమందును బద్ధుడు కాదనియు తాను నిత్య శుద్ధ బుద్ధ ఆత్మయే యనియు ఎఱుగగల్గును. తత్క్షణమే అతని అజ్ఞానహృదయ గ్రంథి విచ్ఛిన్నమై, సర్వసంశయములు పటాపంచలై పోగా, కర్మ బంధనము నిర్మూలమగును. అదియే మోక్షస్థితి. అదియే కైవల్యము, నిర్వాణము. అట్టి స్థితియందు జీవునకు కలుగు ఆనందము వర్ణనాతీతము. ఆత్మసాక్షాత్కారరూపమగు అట్టి దివ్యానుభూతియే ప్రతి జీవియొక్కయు చరమలక్ష్యము. అట్టి లక్ష్యమును కార్యాన్వితమొనర్చుటకొఱకే పవిత్రమగు ఈ మానవజన్మ ఏర్పడినది.

## మానవుని అపూర్వ శక్తిసామర్థ్యములు

మానవజన్మయందు ఒక ప్రత్యేకత కలదు. అది యేదనగా—

మృత్యువు అన్నిటిని మ్రింగివేయుచున్నను మానవుడు తన ప్రయత్నముచే మృత్యువును గూడ మ్రింగివేయగల్గు చున్నాడు. ఇదియే మానవుని విశిష్టత. అట్టి అలౌకిక శక్తిని ఈశ్వరుడు మానవుని కొసంగెను. ఆ శక్తిని వికసింపజేసి కొనెనా ధన్యుడు. లేకున్న నిరర్థకజన్ముడే కాగలడు. ఈ భూతలమున మానవజాతి కోట్లసంఖ్యలో నున్నప్పటికిని తమ యందు నిగూఢముగనున్న అట్టి అమరత్వశక్తిని అనుభూత మొనర్చుకొనవలెనను సంకల్పము కలిగియున్నవారు చాల తక్కువ. ఒకవేళ అట్టి సంకల్పము కలిగియున్నను తల్లక్ష్య సాధనకై ప్రయత్న మొనర్చువారు ఇంకను తక్కువ. ఒకవేళ ప్రయత్నము సల్పినను, కడవఱకు నిలువగలిగిన తాహతు ఏ కొద్దిమందికో యుండుచున్నది. తక్కినవారందఱున్నూ ఈ జననమరణరూప మహాప్రవాహమునబడి దరిగానక కొట్టు కొని పోవుచున్నారు. దాటగలిగిన శక్తియుండియు, పడవను నిర్మించుకొనగల సమర్థులయ్యు నదిలో కొట్టుకొనిపోవుట దౌర్భాగ్యమేయగును. అట్టివారిదశ అత్యంత శోచనీయమై యున్నది. డబ్బులేక దరిద్రులుగా నుండువారు కొందఱు. అట్టి దారిద్ర్యము వారికి సహజమే యగును. కాని డబ్బు ఉండియు దారిద్ర్యదశ ననుభవించు లోభులు కొందఱుందురు. సర్వ శక్తి సమన్వితమై, అమృతస్వరూపమై, అకళంకమై పరమా

నందమయమైనట్టి ప్రత్యగాత్మ తమ హృదయపీఠమున వెలుగుచున్నను అజ్ఞానావరణముచే నద్దానిని విస్మరించి సంచరించుచున్న జనులట్టి దరిద్రులనే బోలియున్నారు. ఇది చాల ఘోరము. మానవత్వమున కిది గొప్ప కళంకము. అపచారము.

దైవత్వమును బడయుటయే యథార్థ మానవత్వ చిహ్నమగును. ఈ విషయమును పదేపదే మహాత్ములుద్ఘోషించుచున్నారు. శాస్త్రములున్ను వక్కాణించుచున్నవి. కాబట్టి స్వల్పమగు ఆయుర్దాయమును వ్యర్థవిలాసములందు తుచ్ఛవిషయభోగములందు తగులబెట్టక మనుజుడు తన జన్మహక్కగు స్వారాజ్యసంపాదనమునందు యత్నశీలుడు కావలయును. భవిష్యచ్ఛ్రేయమును ఇప్పుడే నిర్ణయించు కొనవలెను. అట్లు నిర్ణయించుకొని తదనురీతి వ్యవహరించు వాడే విజ్ఞుడు.

వర్షార్థమష్టౌ ప్రయతేత మాసాన్
నిశార్థమర్థం దివసం యతేత
వార్ధక్య హేతోర్వయసా నవేన
పరత్ర హేతోరిహ జన్మనా చ.

"వర్షాకాలము నాలుగు నెలలు బయటకుపోయి కూలి నాలి చేసికొనుటకు అవకాశముండదు. కాబట్టి ఆ నాలుగు నెలలు చక్కగ ఇంటిలోనుండియే కూర్చుండి భుజించుటకుగాను తక్కిన యెనిమిది నెలలు బాగుగ కష్టపడవలెను. రాత్రి హాయిగా భుజించి విశ్రాంతి నొందుస్థితిని కలుగ జేసికొనుటకై

పగలంతయు బాగుగ శ్రమించవలెను. వార్ధక్యములో (పెన్షన్‌గాని, ప్రావిడెంటు ఫండ్‌గాని, లేక ఏదో రూపమున నిలువ జేసిన ధనముగాని లభించి) నిశ్చింతగ బ్రతుకవలె ననిన, బాల్య యౌవనములందు చెమటకార్చి, పనిచేయ వలసియుండును ఆ ప్రకారముగనే పరలోకమున శాంతి సుఖముల ననుభవించవలెననిన, ఇహలోకముననే అందు లకై తీవ్రకృషి సలుపవలెను"—అని శాస్త్రము లాదే శించుచున్నవి.

అయితే ఆ కృషి యెట్టిది? జీవుడు తనలో ఆత్మీక శక్తి నెట్లు వికసింప జేసికొనగలడు? సర్వోత్తమమైన ఆత్మ జ్ఞానమును పొందు విధానమేది? దానిని జీవు డెట్లు పడయు గలుగును? దానిని తెలిసికొనుటకు పద్ధతి ఏది?—అనగా, మొట్టమొదట అనుభవజ్ఞులగు మహాత్ములను వినయవిధేయ తలతో సమీపించి వారికి సాష్టాంగ దండప్రణామంబు లాచ రించి వారి సేవాశుశ్రూషాదులం గావించి భక్తితో వారిని ప్రశ్నించి పరమార్థవిషయములను తెలిసికొనవలెను.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః. (4-34)

అట్లు సవినయముగ ప్రశ్నించిన మీదట మహాత్ములు వానికి తత్త్వజ్ఞానమును బోధింతురు. దానిచే నతని అజ్ఞా నము శమించిపోగలదు. అతనిలోని దివ్యశక్తి వికసింపగలదు. జ్ఞానమును సముపార్జించుటకు భగవానుడు గీతయందు చూపిన

త్రోవ ఇదియే. సత్సాంగత్యము కలిగియుండుమని భగవానుడు ఆదేశించెను.

ఈ భవారణ్యమున దిక్కు తెలియక పరిభ్రమించుచుండు జీవుడను పాంథునకు మార్గము జూపునది సద్గురువే. కావున గురుసేవ, గురుభక్తి మొదలైనవి ముముక్షువునకు అత్యావశ్యకములని గీతాచార్యుడు హెచ్చరిక చేసెను. "ప్రణిపాతేన" అను పదప్రయోగముచే గీతయందు ఎంత వినయము బోధింపబడినదో చూడుడు! (పాతము - నిపాతము - ప్రణిపాతము) పాతమనగా పడుట; నిపాతమనగా తిన్నగ పడుట; ప్రణిపాతమనగా పూర్తిగ సాగిలబడుట, (సాష్టాంగ వందన మాచరించుట అని భావము)—శిష్యుడు గురువునొద్ద ఎంతెంత భక్తిప్రపత్తులు కలిగియుండునో, గురువునకు అతనిపై అంతంత వాత్సల్యభావ ముదయించుచుండును. అపుడు గురువు శిష్యుని చెంత తన హృదయమును విప్పివేయును. అర్జునుడు కూడ గీతోపదేశమునకు పూర్వము "శిష్యస్తేహం శాధి మాం త్వాం ప్రపన్నమ్" — అనుచు శ్రీకృష్ణుని పాదారవిందములకు నమోవాకము లర్పించియే యుండిన సంగతి గీతాపాఠకులకు విదితమే అయి ఉన్నది. ఇదియే ధర్మరహస్యము. ఇప్పటి నవనాగరికులకు ఈ పద్ధతి ఒకింత వెగటుగా తోచవచ్చును. కాని అహంకారము చచ్చినగాని ఆత్మ ఉదయింపదని వారు జ్ఞప్తియుంచుకొనవలసియుండును. ఎవరితల పెద్దలయొద్ద, భగవంతునియొద్ద వంగునో వారియొద్ద ప్రపంచమంతయు తన తల వంచును,

మఱియు నాతనికి జ్ఞానప్రాప్తి కలుగును. ఇదియే ధర్మ సూక్ష్మము.

కాబట్టి సాధకుడు శ్రద్ధాభక్తులు కలవాడై, "సద్విద్వానుపసర్ప్యతాం ప్రతిదినం తత్పాదుకే సేవ్యతామ్." అను శ్రీ శంకరాచార్యుల వచనానుసారము మహాత్ములను సేవించి సంసారతరణోపాయమగు ఆత్మజ్ఞానమును బడయుపలయును. శ్రద్ధ అన్నిటికంటెను ముఖ్యము. శ్రద్ధ కలవాడే జ్ఞానమును పొందగల్గును (శ్రద్ధావాన్ లభతే జ్ఞానం). నమ్మకము లేక, సందేహించుచు, డోలాయమానమగువాడు అధ్యాత్మమార్గమున ఎన్నటికిని వృద్ధికి రాడు. (సంశయాత్మా వినశ్యతి). కావున శాస్త్రమునందు, గురువునందు, దైవమునందు పరిపూర్ణ విశ్వాసము, అకుంఠితశ్రద్ధ యుండవలెనని గీతాచార్యుని యాదేశము.

"Faith, faith, faith in ourselves, faith, faith in God—This is the secret of greatness."

"నమ్మకము! నమ్మకము! తనయందు నమ్మకము, దేవునియందు నమ్మకము—ఇదియే ఔన్నత్యమునకు, విజయమునకు కీలకము"—అని వివేకానందు లుద్ఘోషించిరి. కాబట్టి జ్ఞానసంపాదనకై, జీవునియందలి అలౌకికశక్తియొక్క వికాసమునకై మొట్టమొదట శాస్త్రమునందు, దైవమునందు, సద్గురువునందు అత్యంత శ్రద్ధ కలిగియుండవలెను. ఈ శ్రద్ధ లోపించినందువలననే పెక్కురు లక్ష్యమును పొందలేక సంసారసముద్రమున పడిపోవుచున్నారు.

శ్రద్ధా విహీనస్య తు న ప్రవృత్తిః
ప్రవృత్తి శూన్యస్య న సాధ్య సిద్ధిః
అశ్రద్ధయైవాభిహతాశ్చ సర్వే
మజ్జన్తి సంసారమహాసముద్రే.

"శ్రద్ధలేనిచో కార్యమందు ప్రవృత్తి జనించదు. ప్రవృత్తిలేనిచో సాధ్యవస్తువు లభించదు. అశ్రద్ధచే గొట్టబడినవారై జనులు దుఃఖసాగరమున మునుంగుచున్నారు"—కాపున అధ్యాత్మపథమున పురోగమించు సాధకునకు, తన యందలి దివ్యశక్తిని సాక్షాత్కరించుకొనదలంచిన ముముక్షువునకు శ్రద్ధ ఎంతేని అవసరమైయున్నది. అట్టి శ్రద్ధగల వాడై మానవుడు తీవ్రమైన పట్టుదల గలిగి, తనయందలి మాలిన్యముల నన్నింటిని కడిగివైచి, మృత్యువునుకూడ ధిక్కరించగలిగినట్టి అలౌకిక దివ్య ఆత్మశక్తిని సాధనచే క్రమముగ వికసింప జేసికొని, అమరుడై జీవన్ముక్తుడై, పరమానందమయుడై చెన్నొందవలెను.

## మానవుని అలౌకికశక్తి

మానవునియందు అఖండమైన దివ్యశక్తి నిగూఢమైయున్నదని యింతదనుక తెలుపబడినది. ఇక ఆ శక్తిని వికసింప జేసికొను మార్గమేదియో విచారించెదము.

"తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి" (గీత 4-38)

ఈ అర్ధశ్లోకము గీతయందు చాల ప్రాముఖ్యత కలిగియున్నది. "తత్" అనగా ఆ ఆత్మజ్ఞానము, ఆపరమార్థశక్తి

యోగసంసిద్ధునకుమాత్రములభించును. అనగా కర్మయోగము నందు కుశలత్వమును సంపాదించినవారికి, అనాసక్త కార్యా చరణముచేతను, ఈశ్వరార్పణబుద్ధితో (కర్తృత్వాహంకార రహితముగ) నొనర్పబడిన క్రియలచేతను చిత్తశుద్ధిని బొందినవారికి అట్టి జ్ఞానము సంప్రాప్తమగునని భావము. దీనిని బట్టి నిష్కామకర్మాదులచే ముందుగా చిత్తశుద్ధిని బొందనివారికి జ్ఞానముదయించదని మరియొక విధముగ చెప్పినట్లయినది. మురికిగుడ్డకు రంగు పట్టనట్లున్ను, చవిటి నేలలో విత్తనము మొలవనట్లున్ను, పాపములతో గూడిన చిత్తమందు జ్ఞానమంకురింపదు. దానిని కర్మయోగాదులచే ముందు శుద్ధపఱచవలెను. కావుననే జ్ఞానము కొంతకాల మునకు ("కాలేన") లభించును అని చెప్పబడెను. ఎంత కాలమునకు? అని ఎవరైన ప్రశ్నించినచో అది వారి వారి ప్రయత్నాతిశయముపై ఆధారపడియుండునని భావము.

"తీవ్రసంవేగానామాసన్నః"

"తీవ్రప్రయత్నమాచరించినచో లక్ష్యము చేరువనే యుండునని పతంజలి నుడివియున్నాడు. 100 మైళ్ళ దూరము గల ప్రదేశమునకు రాకెట్టు అరనిమిషములో పోగలదు. విమానము అరగంటలో పోగలదు. రైలు నాల్గు గంటలలో పోగలదు. గుఱ్ఱపుబండి 4 రోజులలో పోగలదు. ఎద్దుబండి 10 రోజులలో పోగలదు. అట్లే జ్ఞానప్రాప్తియును గమ్యమును వారివారి సాధన తీవ్రతపై అధారపడియుండునని తెలుపు టకుగాను "కాలేన" (కొంతకాలమునకు) అని గీతయందు

వచింపబడెను. అయితే ఆజ్ఞాన మెచట కలుగును! ''ఆత్మని'' (తనయందే). అనగా ఆత్మానుభూతిని నిరతిశయానందమును జీవుడు తనయందే పొందకల్గునని భావము. మోక్షమనునది బయట ఎచటనో, ఏ లోకములోనో కలదను భ్రమ ఈ భగవద్వాక్యముచే తొలగిపోవుచున్నది. మోక్షము ప్రతి వారికిని తమయందే కలదని గ్రహింపవలెను.

''న మోక్షో నభసః పృష్ఠే పాతాలే నచ భూతలే
మోక్షో హి చేతో విమలం సమ్యగ్జ్ఞానవిబోధితమ్. (వసిష్ఠగీత)

''మోక్షము ఆకాశమున లేదు, పాతాళమున లేదు, భూతలమున లేదు. ఆత్మజ్ఞానముతో గూడిన నిర్మలచిత్తమే మోక్షము'' అని శ్రీ వసిష్ఠమునీంద్రు లుద్బోధించిరి.

మఱియు నిట్టి జ్ఞానమును తనకు తానే స్వయముగ సాధనచేసి తనయందు పొందవలసియుండును. గురువులు త్రోవమాత్రము చూపెదరు. నడువవలసినది శిష్యుడు తన కాళ్ళతో తానే. చూడవలసినది తన కండ్లతో తానే. దైవముగాని, గురువుగాని, మహాత్ములుగాని తనకు మోక్షము సంపాదించి పెట్టెదరని ఎవరైనను అనుకొనినచో వారు భ్రమయందున్నవారే యగుదురు. మోక్షముగాని జ్ఞానానుభవముగాని ''పరిమిట్లు'' వలె ఒకరిచ్చునది, ఒకరు పుచ్చుకొనునది కాదు. అది పెద్దల సహాయముచే, ఈశ్వరానుగ్రహముచే, తనయందు తాను తయారుచేసుకొను వస్తువు. కనుకనే భగవానుడు ''తత్స్వయం యోగసంసిద్ధః'' అని పలుకుచు జ్ఞానమును స్వయముగనే సాధింపవలెనని

ప్రకటించియున్నాడు. గురువులు దారిచూపు స్తంభముల (Sign-Boards) వంటివారు. రెండు మూడు మార్గములు కలియు చోట్ల కీలకస్థానములందు కొన్ని స్తంభములపై వ్రాతపలకలు కట్టియుందురు. అవి ఏ వూరు ఏవైపు ఎన్ని మైళ్లుందునో తెలుపును. అంతమాత్రమే వాని సహాయము. కష్టపడి నడువవలసినవాడు పాంథుడు.

ఈప్రకారముగ జ్ఞానమును సాధించి మనుజుడు తన మానవత్వమును సార్థకము చేసికొనవలయును. అజ్ఞానమును పోగొట్టుకొనుటయే మానవత్వచిహ్నము "మా=అజ్ఞానము, న=లేకుండ, వ=వర్తించువాడు" మానవుడని చెప్పబడును. మానవశబ్దము యొక్క వ్యుత్పత్త్యర్థ మిదియే. ఇవ్విధముగ జ్ఞానమును సముపార్జించక జీవితములను భోగవిలాసములందు భ్రష్టము చేయువారు మానవత్వమునకు అర్హులుకారు. పశు తుల్యప్రవర్తనను వదలి జనులు పశుపతి (శివుని)వలె వర్తించుటను నేర్చుకొనవలెను. ప్రాపంచిక సంపదల నెన్ని పొందినను అవి యన్నియు ఈ శరీరవియోగముతో వియోగమును బొందియే పోవుచున్నవి. కాని జ్ఞానసంపదను బడసినవాడు శాశ్వతముగ నద్దానిని తన వెంట నుంచుకొని పరమశాంతిని, నిరతిశయానందమును కైవల్యమును పొందుచున్నాడు. కాబట్టి జీవులు తమయందు నిగూఢమైయున్న దైవత్వమును వ్యక్తపఱచి ప్రయత్నాతిశయముచే తమయందలి అఖండాత్మ శక్తిని, అలౌకిక దివ్యతేజమును అనుభూత మొనర్చుకొని

ఆత్మజ్ఞానామృతమును తనివితీర గ్రోలి సంసారదుఃఖదాహోప శాంతిని బడయవలెను. అదియే మోక్షస్థితి.

## ముముక్షుత్వము

అట్టి మోక్షమును గూర్చిన తీవ్రకాంక్ష చే ముముక్షుత్వ మనియు, అట్లు కాంక్షించువానిని ముముక్షు వనియు చెప్పుదురు. అధ్యాత్మ వాఙ్మయమున ప్రముఖస్థాన మాక్రమించుకొని యున్న చతుర్విధ సాధనలలో ముముక్షుత్వము అగ్రతాంబూలమును బడసియున్నది. ఏలయనగా, తరించవలెనను కుతూహలమే లేనిచో తరించుటకు మార్గము నెవడు వెతకికొనును? కావున ముముక్షుత్వము అనగా ముక్తిని బడయవలెనను తీవ్రతర ఆవేదన ప్రతిజీవికిని అత్యంతావశ్యకమై యున్నది.

జగద్గురు శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారిని ఒకానొక శిష్యు డిట్లు ప్రశ్నించెను—మహాత్మా! మోక్షమునకు అత్యావశ్యకమైన నిత్యానిత్య వస్తువివేకము, ఇహాముత్రార్థఫలభోగవిరాగము, శమాదిషట్క-సంపత్తి, ముముక్షుత్వము - అను ఈ సాధన చతుష్టయములో ముఖ్యమైన దేది? అందులకు గురుదేవు డిట్లు సమాధాన మొసంగెను—

> "శిరో వివేక మత్యన్తం వైరాగ్యం వపురుచ్యతే
> శమాదయష్షడంగాని ముముక్షా ప్రాణ ఇష్యతే."

నాయనా! వినుము. వివేకము శిరస్సువంటిది. అనగా దేహమునందు శిరస్సు ఎట్టిస్థాన మాక్రమించుకొనియున్నదో,

అట్లే సాధన చతుష్టయమునందు వివేకమున్ను అట్టి ఉన్నత స్థానమును బొందియున్నది. ఇక వైరాగ్యము మొండెము వంటిది. శమదమాదులు చేతులు, కాళ్లు వంటిది. ముముక్షుత్వమో ప్రాణవాయువు వంటిది. అనగా ప్రాణవాయువు లేనిచో ఒక్కక్షణమైనను శరీర మెట్లు బ్రతుకజాలదో అది శరీరమునందు ఎంతటి ప్రధానమైన వస్తువో, అట్లే నాలుగు సాధనములందును ముముక్షుత్వము అంతటి ప్రధానమైనదని యెఱుగుము. ఆదిశంకరులయొక్క ఈ చక్కని ఉపమానమువలన ముముక్షుత్వము - అనగా మోక్షమును గూర్చిన ఆవేదన, తరించవలెనను తీవ్ర ఆకాంక్ష, ఈ సంసార కూపమునుండి ఎపుడు బయట పడుదుమా యను తీవ్రతర ఉత్కంఠ మోక్షసాధనములన్నిటియందును అత్యంత ప్రధానమైనదని స్పష్టమగుచున్నది.

అట్టి ముముక్షుత్వము కలిగినపుడు ఇక ప్రాపంచిక భోగవిలాసములందు అరుచి జనించును. విషయవిలాసముల యెడల రోతపుట్టును. ఇంద్రియ సుఖముల యెడల ఏవగింపు కలుగును. ఏ దృశ్యసౌఖ్యములు అజ్ఞాన కాలమున చాల గొప్పగ కన్పించినవో అవియే మోక్షసుఖమునకు గొప్ప అవరోధనములని తుదకు సాధకుడు గ్రహింప గలుగును. ఒక్క పరమాత్మ వస్తువుతప్ప. తక్కిన దేదియు అత్తఱి అతనికి రుచింపదు. రాజ్యపదవిగాని, ఇంద్రపదవిగాని, చంద్రపదవిగాని, దివ్యమగు ఆత్మపదవి చెంత తీసికట్టే యగును. కనుకనే ముముక్షువగువాడు రాజ్యవైభవములను, ప్రాపం

-చిర సంపదలను తృణమువలె త్యజించివైచి అన్ని లాభములకంటెను గొప్పలాభమగు దైవలాభమునే అన్వేషింప దొడగును. నీటిలో ముంచబడినవాడు ప్రాణవాయువుకొఱకై ఎట్లు తహతహలాడునో ఒక్క ప్రాణవాయువునుమాత్రము జ్ఞాపకముంచుకొని తక్కిన ప్రపంచమునంతను అత్తఱి యెట్లు మఱచిపోవునో, అట్లే మోక్షమును బడయవలెనను తీవ్ర ఉత్సుకతగలవాడు ఒక్క భగవంతునితప్ప తక్కిన వస్తుజాలమునంతను మఱచిపోవును. వానిపై ఆసక్తినుంచడు. తీవ్రముముక్షువుయొక్క లక్షణమిదియే అయియున్నది. అట్టి తీవ్రముముక్షువు తన ప్రయత్నాతిశయముచే అచిరకాలములోనే లక్ష్యమగు హృదయస్థపరమాత్మను బడసి జన్మసార్థకతను బొందగలడు.

## మోక్షముయొక్క ఆవశ్యకత

ఈ ప్రపంచమున ఎవడును బంధమును అపేక్షింపడు. తన్ను చుట్టుకొనియున్న పాశమును ఛేదించుకొని బయటపడవలెననియే ప్రతివాడును తలంచును.

వాసః కాంచన పంజరే నృపకరైర్నిత్యం తనోర్మార్జనం
భక్ష్యం స్వాదురసాలదాడిమఫలం పేయం సుధాభం పయః
వాచ్యం సంసది రామనామసతతం ధీరస్య కీరస్య భో
హాహా హన్త తథాపి జన్మవిటపి క్రోడం మనో ధావతి.

ఒకానొక రామచిలుకను ఒక రాజు బహుప్రీతితో పెంచుచుండెనట. దానిని బంగారు పంజరమునందుంచి,

రాజు తానే స్వయముగ దానికి స్నానము చేయించుచు, తియ్యటి మామిడిపండ్లు, దానిమ్మపండ్లు దానికి పెట్టుచు, అమృతోపమగు క్షీరమును త్రావించుచు, పెద్దపెద్ద సభల లోనికి దానిని తీసుకొనివెళ్ళి దానిచే రామనామమును పలికించుచు తద్ద్వారా మహాగౌరవమును దానికి కలుగ జేయుచు ఉన్నప్పటికిని, ఆ చిలుక తన కంటి వెంట ధార ధారగా బాష్పములు రాల్చుచు ఏడ్చుచుండెనట! దేని కొఱకు? అన్ని సంపదలు, గౌరవములు అనుకూలములు ఉన్నప్పటికిని అది దుఃఖించుటకు కారణమేమి? అస్వతంత్ర వాతావరణమే కారణము. "నా జన్మస్థలమైన అరణ్యము లోని చెట్టుపైకిపోయి స్వతంత్రవాయువు లెపుడు పీల్చుదునా" యని ఆ చిలుక అహర్నిశములు వాపోవుచున్నది. 'ఓ జను లారా! స్వస్థానమునందే పరమానందము లభించును. ఎంతటి సుఖవిలాసములతో కూడియున్నప్పటికిని పరకీయస్థానము భయహేతువేయగును' అని చిలుక చక్కటి గుణపాఠమును జనులకు బోధించుచున్నది.

ఒక చేపను తీసికొని వెళ్ళి సింహాసనముపై కూర్చుండ బెట్టి, వింజామరలు వీచుచు భక్ష్యభోజ్యము లారగింప జేయుచు దానికి రాజమర్యాదలు చేయుచునున్నప్పటికిని, ఆ చేపకు వానిచే కించిత్తైనను తృప్తికలుగదు. తన స్వస్థాన మైన నీటిలో వదలినపుడే అది పరిపూర్ణ సంతృప్తిని పొంద గలదు. అట్లే జీవుడు తన నిజస్వరూపమైన పరమాత్మను వదలి ఈ దృశ్యప్రపంచమునబడి నానా యాతనలను పొందు.

చుండ అట్టివాడు తిరిగి తన స్వస్థానమగు ఆత్మయందు చేరి నపుడే పూర్ణ సౌఖ్యమును బొందగలడు. స్వస్వరూపమును జ్ఞాపకము తెచ్చుకొని దుఃఖమును దులిపివైచి పరమానంద మును బొందుట అతనికి ఎంతయో ఆవశ్యకమైయున్నది. అట్టి మోక్షస్థితినిగూర్చి యోచించుటయు, అద్దానికై ప్రయ త్నించుటయు, ఎంతయో అవసరమైయున్నది.

# 2 వ అధ్యాయము

## మోక్షము యొక్క స్వరూపము

మోక్షస్థితియందు జీవుడు శివుడుగా మారును. నరుడు నారాయణుడై విలసిల్లును. భక్తుడు భగవంతుడై భాసించును. మానవుడు మాధవుడుగా పరిణమించును. అదియొక అపూర్వ ఆనందస్థితి. దుఃఖము లవలేశమైనను అచ్చోట గాన్పించకుండును. ప్రపంచములోని అన్నిలాభములకంటెను, గొప్పలాభకరమైన స్థితియని అద్దానిని గీతాచార్యుడు పేర్కొనెను.

> "యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః
> యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే"
>
> (భగవద్గీత-6-22)

అచ్చోట (మోక్షస్థితియందు) జీవునకు కలుగు ఆనందము అవర్ణనీయము. బ్రహ్మవేత్త సాక్షాత్ బ్రహ్మమే యగునని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. (బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి.) కావున అట్టి మోక్షస్థితియందు జీవత్వము అదృశ్యమై బ్రహ్మత్వమే శేషించును. ఆనందసాగరమే యగు అట్టి దివ్యానుభూతికొఱకై మహనీయు లెందఱో తమ భౌతిక సంపదలకు తిలాంజలి యొసంగి ప్రాపంచిక సౌఖ్యములను దూరముగ విడచిపెట్టి రాజ్యాదులను గూడ తిరస్క-

రించి అఖండ వైరాగ్యమును జేబట్టి, అమోఘమగు కృషి సలిపి తుదకు విజయమును గాంచిరి. అట్టి బ్రహ్మానందముతో లౌకిక సుఖములు పోల్చదగినవి కావు. ఒకటి నిత్యమైనది, మఱియొకటి అనిత్యమైనది. బింబసుఖము చెంత ప్రతిబింబ సుఖ మేపాటిది? జాగ్రతుని చెంత స్వప్నవస్తువు కేమైన విలువ యుండునా? కనుకనే శ్రీ శంకరాచార్యులవారు మోక్ష సుఖమునుగూర్చి ఈ ప్రకారముగ వర్ణించియున్నారు—

యత్సౌఖ్యాంబుధి లేశలేశత ఇమే శక్రాదయో నిర్వృతాః
యచ్చిత్తే నితరాం ప్రశాన్తకలనే లబ్ధ్వా మునిర్నిర్వృతః
యస్మిన్నిత్య సుఖాంబుధౌ గళిత ధీర్బ్రహ్మైవ హి బ్రహ్మవిత్
యః కశ్చిత్స సురేన్ద్రవందితపదం నూనం మనీషా మమ.

'ఆ బ్రహ్మానంద సముద్రముయొక్క ఒకానొక లవ లేశముతో సమానమైన కొద్ది సుఖమును బొంది ఇంద్రాదులు ఎంతయో సంతుష్టినొందుచున్నారు. మునీశ్వరులు తమ చిత్తములను అట్టి పరబ్రహ్మమునందే, ఆత్మయందే లయింపజేసి పరమానందమును బడయుచున్నారు.'

అట్టి ఆత్మవస్తువే ప్రపంచమున గల సమస్త పదార్థములకంటెను మహాసుందరమైనది. క్షణికవస్తువులందు సౌందర్యము లేదు. నేడో రేపో నశించు పదార్థములు సుందరము లెట్లగును? కాబట్టి ఆత్మ సౌందర్యమునే జనులు వీక్షించవలెను.

## దివ్య సౌందర్యము

ప్రపంచములో సుందరమైన వస్తువు జనులకు ఆనందమును గొల్పును. చక్కని పుష్పము ఆహ్లాదమును గలుగజేయును. అట్లే సుందరభవనము, సుందరచిత్రము, సుందరదేహము జనుల హృదయసీమలందు ఆనందముయొక్క సంచారమునకు హేతుభూతము లగుచున్నవి.

A Thing of beauty is a joy for ever

అను ఆంగ్లసూక్తి ఈ భావమునే స్పష్టీకరించుచున్నది. "సుందర పదార్థము పరమానందమును గలుగజేయు" నని ఆ వాక్యముయొక్క అర్థము. అయితే సుందరమైన వస్తు వేది? చపలమై, క్షణికమై నశించిపోవు పదార్థము సుందరమైన దెట్లగును? అది యెంత రమణీయముగ గన్పట్టినప్పటికిని దాని సౌందర్యము సౌందర్యము కానేరదు.

నేడు మహాసుందరముగ నగుపించిన గులాబిపువ్వు సాయంత్రమునకు వాడిపోయి, రేపటికి నశించి పోవుచున్నది. ఈనాడు అత్యంత రమణీయముగ కనుపించిన మహాభవనము కొద్ది సంవత్సరములకు శిథిలమైపోవుచున్నది. నేడు లోకైక సుందరి (Miss Universe) అని ఖ్యాతి వడసిన మగువ కొలది వత్సరములకు వృద్ధాప్యమునకు బలియై కురూపిణియై మరణించుచున్నది. ఇక ఆక్షణిక సౌందర్యమునకు ఏమి విలువ?

సన్తి రమ్యతరా భ్రమ్యాః సుస్థిరాదపి సుస్థిరాః
చిన్తా పర్యవసానేయం పదార్థశ్రీః కిమీహసే.

'ప్రపంచములో అతి రమణీయమైన పదార్థము లెన్నియో కలవు. కొంతకాలము స్థిరముగ నుండు పదార్థము లున్న ఎన్నియో కలవు కాని కాలగర్భమున అవియన్నియు ఎట్టకేలకు నశించిపోవుటవలన చింత (దుఃఖము) నే అవి కలుగజేయుచున్నవి. అందువలన వాని నాశ్రయింప వలదు, అని శ్రీ వసిష్ఠమహర్షి శ్రీ రామచంద్రునకు బోధించెను.

## That which is permanent is really beautiful

నాశములేని వస్తువే వాస్తవముగ సుందరమైనది. అట్లు నాశములేనివస్తువు ప్రపంచములో ఏది కలదు? ఒక్క దైవము తప్ప తదితరమైన ప్రతి వస్తువును కాలప్రవాహమున గొట్టుకొని పోవలసినదే. ఆత్మవస్తు వొకటి తప్ప తక్కిన దృశ్యపదార్థము లన్నియు కాలగర్భమున అంతరించి పోవలసినదే. దీనినిబట్టి అన్నిటికంటె గొప్ప సౌందర్యము దైవముననే, ఆత్మకే కలదని స్పష్టమగుచున్నది. కావున దానినే జీవులు ఆశ్రయింపవలసియున్నారు. అదియే జనులకు పరమానందమును గలుగజేయగలదు. నశ్వరపదార్థముల యొక్క ఆపాతరమణీయత్వమును జూచి మోసపోరాదు. తాత్కాలిక సౌందర్యములకు, పై పై తళుకుబెళుకులకు ఎన్నడును లోను కాగూడదు.

ఈమధ్య ఒక యువకుడు ఒకానొక జ్యోతిష్కునియొద్ద కేగి తనచేయి చూపించుకొని తన భవిష్యజ్జీవిత విషయమై ప్రశ్నించెను. జ్యోతిష్కు డాతని చేతిని చక్కగా పరిశీలించి ఈ విధముగా చెప్పెను—'నాయనా! నీ ధనరేఖ అద్భుత

ముగా నున్నది'—అ వాక్యము వినగనే ఆ వ్యక్తి పరమ సంతోషమును బొంది మనస్సులో "A Daniel has come for judgement" (మహానుభావుడు సాక్షాత్తుగా అవతరించెను) అని అనుకొనెను. తదుపరి జ్యోతిష్కుడు 'నీ విద్యారేఖ ఇంకను పొడుగుగా ఉన్నది. కాబట్టి గొప్ప గొప్ప డిగ్రీలను నీవు పొందెదవు నీ కీర్తిరేఖ అరెంటికంటెను పొడుగుగానున్నది. కావున లోకములో నీవు గొప్ప కీర్తిని కూడ పొందెదవు. అని చెప్పుచుండగా యువకుని మనస్సు ఆనందముతో చిందులు త్రొక్కసాగెను. తదుపరి ఆ దైవజ్ఞుడు తన భాషణము కొనసాగించుచు 'నాయనా! అన్ని రేఖలు నీకు చాల పొడుగుగా ఉన్నవి కాని ఆయువురేఖ మాత్రం పొట్టిగా నున్నది' అని చెప్పెను. దానితో యువకుని మనస్సు అత్యంత వ్యాకులమై పోయెను. అతడు క్షుబ్ధుడై అచ్చోటు వీడి చనెను.

కావున, ఎంత ధన ముండిన నేమి, ఎంత కీర్తి యుండిన నేమి, ఎన్ని ప్రాపంచిక విద్యలను గడించిన నేమి, ఎంత సంతాన ముండిన నేమి, బ్రతికే ఆశయే లేనపుడు వాటి కేపాటి విలువ! ఆయురేఖ లేనపుడు తక్కిన రేఖలు ఎన్ని యుండిన ఏమి ప్రయోజనము! అట్లే ప్రపంచ వస్తువులు ఎంత సుందరముగా తోచినను, అవి అశాశ్వతములు, కాబట్టి వాని సౌందర్యమునకు ఏమాత్రమును విలువ లేదు. పూర్వము బుద్ధదేవుడీ విధముగనే ప్రపంచస్థితినిగూర్చి తీవ్రముగ విచారించి, తన రాజ్యముయొక్కయు, పరిజనము

యొక్కయు, సతీసుతులయొక్కయు లావణ్యమును గొప్పగా తలంచక, వాని యన్నింటికంటెను మహాసుందరమైనట్టి నిర్వాణపదవినిగూర్చి అన్వేషించి ధన్యుడయ్యెను.

కావున విజ్ఞులగువారు ప్రపంచములోని పదార్థములను చక్కగ వివేచించి, వాని ఆపాత (Superficial) సౌందర్యములకు మురిసిపోక, వానిపై ఆసక్తిని తగ్గించుకొని, శాశ్వతమై, స్థిరమై, సనాతనమైనట్టి పరమాత్మయందు అనన్యభక్తిగలిగి, హృదయగుహాయం దట్టి లోకోత్తర సౌందర్యమును సదా వీక్షించుచు బ్రహ్మానుభూతిని బడసి జీవితమును ఆనందమయముగ నొనర్చుకొనవలెను.

మోక్షరూపమగు ఆ పరమాత్మ కేవలము స్వయంజ్యోతి యనియు తెలియవలయును. జాగ్రత్స్వప్న సుషుప్తులు మూడిటియందును ఆ యాత్మ సర్వసాక్షియై దృశ్యమునంతను ప్రకాశింప జేయుచు నిర్వికారమై చెన్నొందుచున్నది.

## ఆత్మజ్యోతి

ఆత్మయొకటియే ప్రపంచములో ఆరనిదీపము. ప్రమిదెలోని దీపము నూనె లేనిచో ఆరిపోవును. కరెంటు లేనిచో ఎలెక్ట్రిక్ లైటు ఆరిపోవును. బ్యాటరీ లేనిచో టార్చిలైటు ఆరి పోవును. లోకమునకంతకును వెలుగునిచ్చు సూర్యునకు నూనెతో పని లేకున్నను కరెంటుతో అవసరము లేకున్నను రాత్రింబగళ్లు వెలుగుచునే యున్నను ఒకానొకసమయమున అతడున్ను విలయమొందిపోవును; అదియే ప్రళయకాలము.

ఆ ప్రళయకాలమున సూర్యుడేమి, చంద్రుడేమి, నక్షత్రము లేమి, సమస్త బ్రహ్మాండమున్ను విలీనమై పోవును. అట్టిచో ఇక ఆరని దీప మేది? సృష్టికాలమున, స్థితి కాలమున, ప్రళయకాలమున గూడ తన అస్తిత్వమును నిలద్రొక్కుకొని ఆరకుండ ప్రకాశించు దీపమేదైన కలదా యనిన కలదని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. మహర్షులున్ను వక్కాణించుచున్నారు. అదియే ఆత్మ, అదియే పరబ్రహ్మము. సర్వజీవుల హృదయాంతరాళములందు వెలుగొందు దివ్య జ్యోతి అదియే. బాహ్యాభ్యంతరములందును భూతభవిష్య ద్వర్తమానములందును సమానముగ వ్యాపించియున్న పరం జ్యోతి అదియే, అది ప్రళయకాలమందును చెక్కు చెదరకయే నిలచియుండును.

సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్, ఏక మేవాద్వితీయం బ్రహ్మ,
నేహ నానాస్తి కించన

అని ఉపనిషత్తు లీ సత్యమునే బాహాటముగ చాటు చున్నవి. సూర్యు డన్నిటిని ప్రకాశింపజేయుచున్నను, ఆ సూర్యుని పరమాత్మ ప్రకాశింపజేయుచున్నాడు. పరమాత్మ యను స్వయంజ్యోతి ఉన్నందువలననే, ఆత డెల్లకాలము లందును వెలుగుచున్నందువలననే, తక్కిన (సూర్య చంద్రాది) జ్యోతులన్నియు ప్రకాశించుచున్నవి.

తమేవ భాన్తమను భాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి,

అను ఉపనిషద్వాక్యము ఈభావమునే పరిపోషించు చున్నది. సూర్యచంద్రాదులు లోకమును ప్రకాశింపజేయ

గలవుగాని పరమాత్మను ప్రకాశింపజేయజాలవు. గీతా చార్యుని ఈ యద్భుతవాక్యము నాలకింపుడు—

'న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః'

సూర్యుడుగాని, చంద్రుడుగాని, అగ్నిగాని, విద్యుల్లత, ఏ పదార్థముగాని పరమాత్మను ప్రకాశింపజేయలేవు. ఒకరి ప్రకాశముతో ఆత్మకు నిమిత్తము లేదు. అది స్వయంప్రకాశము, స్వయంజ్యోతి, సర్వసాక్షి. అది అన్నిటిని ప్రకాశింపజేయునుగాని, మఱియొకదానిచే అది ప్రకాశింపజేయబడదు. కావున అది సత్యమై, శివమై, సుందరమై, సర్వలోకారాధ్యమై వెలుగొందుచున్నది.

ఈ ప్రపంచమునగల సమస్తపదార్థములను మనుజుడు దేనివలన తెలిసికొనగల్గుచున్నాడు? సూర్యప్రకాశమువలన, చంద్రప్రకాశమువలన, దీపప్రకాశమువలన. (ఆ ప్రకాశములు లేనిచో) అంధకారబంధురమైన చోటనున్న వస్తువుల నతడు తెలిసికొనజాలడుగదా! అయితే ఆసూర్యాదులను దేనివలన తెలిసికొనుచున్నాడు? నేత్రముచే. నేత్రము లేనిచో ఆ సూర్యాదులున్నను లేనివారితో సమానమే యగుదురు. ఆ నేత్రమును దేనివలన తెలిసికొనుచున్నాడు? నేత్రప్రకాశము లేనపుడు ఏ ప్రకాశముయొక్క సాహాయ్యముచే అతడు కార్యముల నొనర్పగల్గుచున్నాడు? గ్రుడ్డివాడు దేనిసహాయముచే లోకమున వ్యవహరించుచున్నాడు? బుద్ధిచే. అనగా నేత్రమును తెలిసికొనునది, నేత్రమును ప్రకాశింపజేయునది, నేత్రము లేకున్నను వ్యవహరించునది బుద్ధి అని తేలినది.

అయితే ఆ బుద్ధిని తెలిసికొనునది ఏది? దానినిగూడ ప్రకాశింపజేయునది ఏది? రాత్రి గాఢనిద్రతో బుద్ధి విలీనమై యుండునపుడు ఏ ప్రజ్ఞచే ఆ లేమిని ఎఱుంగగల్గుచున్నాడు? అదియే ఆత్మ. కావున అదియే స్వయంజ్యోతి, పరంజ్యోతి, జ్యోతులకన్నిటికిని జ్యోతి.

'జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే'

అని శ్రీకృష్ణభగవాను డద్దానిని కీర్తించియుండెను. ఈప్రకారముగ అన్నిటిని వెలిగించి, తానుకూడ వెలుగుచు, ఏకాలమందును అరక స్వయంప్రకాశమానమై భాసిల్లు ఆత్మ జీవుని హృదయకుహరమందే వర్తించుచున్నది. అద్దాని నెఱుంగగల్గువాడు ధన్యుడు, కృతకృత్యుడు.

సామాన్యముగ లోకమునగల ప్రకాశములన్నియు, అనగా సూర్యచంద్రాదులన్నియు జాగ్రదవస్థకే పరిమితములై యున్నవి. జీవునకు ఒక జాగ్రదవస్థ మాత్రమే కాదు, ఇంకను రెండవస్థలు కలవు. అవియే స్వప్నావస్థ, సుషుప్త్యవస్థ అనబడును. జాగ్రదవస్థయందు గల ఈ సూర్యచంద్రాదులు స్వప్నమందలి పదార్థములను ప్రకాశింపజేయజాలవు. అట్లే స్వప్నమందలి సూర్యాదులు సుషుప్తిని ప్రకాశింపజేయజాలవు, కాని ఈ మూడవస్థలయందును అనుస్యూతమై ఒకానొక దివ్యప్రకాశము వ్యాపించియున్నది. ఈమూడిటిని అది ఏకకాలమున ఎఱుంగుచున్నది. మూడిటికిని అది చక్కని ప్రకాశము నొసంగుచున్నది. జాగ్రత్స్వప్న సుషుప్తులను ఆమూడవస్థలందు ఏయే

పదార్థములు కలవో, వాని నన్నింటిని ఆ స్వయంజ్యోతి యగు ఆత్మ ప్రకాశింపజేయుచు, వానితో తగుల్కొనక, సర్వసాక్షియై వర్తించుచున్నది.

త్రిషు ధామసు యద్భోజ్యం
భోక్తా భోగశ్చ యద్భవేత్
తేభ్యో విలక్షణ స్సాక్షీ
చిన్మాత్రోఽహం సదాశివః.

అని కైవల్యోపనిషత్తు పైన తెలిపిన సత్యమును చక్కగ నిరూపించియున్నది. రాత్రి నిదురపోవునపుడు స్వప్నమున మనుజుడు పదార్థములన్నిటిని జూడగల్గుచున్నాడు. జాగ్రదవస్థలోని సూర్యుడచట లేడు. మఱి ఏ ప్రకాశముచే అవియన్నియు వెలుగొందుచున్నవి? అట్లే గాఢనిద్రయందలి తమస్సును దేనిచే తెలిసికొనుచున్నాడు? నిద్రనుండి మేల్కాంచినపిదప 'నేను హాయిగా నిద్రపోయినాను' అని ఆ హాయిని ఎట్లు వర్ణింపగలుగుచున్నాడు? త్రికాలములను సాక్షిగా తన ఆత్మ ఎఱుంగగల్గుచున్నది కాబట్టియే ఇట్టి యనుభూతి జీవునకు సాధ్యమగుచున్నది. ఈ ప్రకారముగ ఆత్మయను స్వయంజ్యోతి భూతభవిష్యద్వర్తమాన, జాగ్రత్స్వప్న సుషుప్తు లన్నిటియందును సర్వకాల సర్వావస్థల యందును ఏకరూపముగ, అవిచ్ఛిన్నముగ వెలుగుచున్నది. అదియే తానని నిరంతరము భావనచేయవలెను.

జీవుడు తాను స్వయంజ్యోతియగునట్టి పరమాత్మయే గాని దేహేంద్రియాది సంఘాతము కాదని పదేపదే మననము చేయవలసియున్నది.

'తద్బ్రహ్మ నిష్కలమహం న చ భూతసంఘః'

''నిష్కళంకమగు ఆ పరబ్రహ్మమే నేనుగాని ఈ పాంచభౌతిక దేహసమువాయమును కాను'' అను శ్రీ శంకరాచార్యుల హితోక్తిని ప్రతిదినము సాధకుడు మరల మరల చింతనచేయవలయును. అపుడే జీవునకు అఖండ ధైర్యము, నిర్భయత్వము, పరమానందము చేకూరును. సంసారదుఃఖ మంతరించును. జీవన్ముక్తి లభించును. అట్టి మహోన్నత పరమోత్కృష్టస్థితిని బడయుటకై ముముక్షువు నిరంతము యత్నశీలుడు కావలయును.

శ్లో॥ అన్తర్జ్యోతిః బహిర్జ్యోతిః ప్రత్యగ్జ్యోతిః పరాత్పరః
జ్యోతిర్జ్యోతిః స్వయంజ్యోతిరాత్మజ్యోతిశ్శివో౽స్మ్యహమ్
ఆత్మజ్యోతిర్మనోజ్యోతిర్జ్యోతిశ్చక్షు స్సపశ్యతి
సబాహ్యాన్తరజ్యోతిస్స్వజ్యోతిశ్శివముచ్యతే.

## పరమానంద నిలయము

స్వయంజ్యోతియగు ఆ పరమాత్మ ప్రపంచములోని సమస్తసుఖములకును ఆధారభూతమైయున్నది. అది ఆనంద సాగరము. అట్టి అపూర్వ ఆనందధామమును బడయుటకై జీవుడు శక్తివంచన లేక పాటుపడవలసి యున్నది. ఏలయనగా, మానవుడు జన్మించినది క్షణికసుఖముల కొఱకు గాదు, శాశ్వత సుఖము కొఱకు. దానవు డగుటకు కాదు, దేవు డగుటకు. పశుత్వము నొందుటకు గాదు, పశుపతిగా మారుటకు. అట్టిచో ఎండమావులవంటి ఈ క్షణిక సుఖము లందే జీవితమంతయు ఆహుతి చేయనేల? సున్నపుముద్దలను

జూచి వెన్నముద్దలని భ్రమించి పరుగిడుట విజ్ఞుడు చేయనల సిన పనికాదు. తినుట, త్రాగుట, గంతులు వేయుట ఇదియేనా మానవత్వము?

"Man does not live by bread alone"

—అని క్రీస్తు వచించినట్లు కేవలము తిండియే మానవుని పరమావధి కాదు, దానిని మించిన మరికొన్ని విషయములు కలవు. అనిత్య వస్తువును విడనాడుట, నిత్యవస్తువును పరిగ్రహించుట, ఆత్మ నన్వేషించుట, ఆత్మేతరమునందు విరక్తి గల్గియుండుట—ఈ ప్రకారమగు నైతికజీవితము నలవరచుకొనుటయే మానవజన్మ సాఫల్యత.

అయితే ఈ సందర్భమున కొందరీ ప్రశ్న చేయుచున్నారు. "అయ్యా! ఇంద్రియార్థములగు శబ్దాదులను, విషయభోగములను పరిత్యజించవలసినదిగా గీతాది గ్రంథములు చెప్పుచున్నవే! మాకేమో అవి చాల సుఖకరములుగ గన్పట్టుచున్నవి. దైవసుఖ మెట్టిదో మాకు తెలియదు. మాకు అది అనుభవములో లేదు కూడను. అది లభించునని నమ్మకముకూడ లేదు. అట్టిచో ప్రత్యక్షముగనున్న ఈ ఇంద్రియసుఖములను పోగొట్టుకొని పరోక్షముగనున్న మఱి యొక (ఆత్మ)సుఖమునకై అఱ్ఱులుచాచుట హాస్యాస్పదమే యగును కదా! పొదలో నున్న పక్షికొఱకై చేతిలో నున్న పక్షిని జారవిడుచుకొనువాడు విజ్ఞుడేనా?" అని ఈ ప్రకారముగ పలుకుచుందురు. భోగ్యపదార్థములు సుఖకరములని వారు పలుకుచున్నారు. అది సరికాదు.

వాస్తవముగ సుఖము బాహ్యమున లేదు. పదార్థము లందు సుఖమున్నదని యనుకొనుట వట్టి భ్రమయే యగును. ఒకానొకవస్తువుపై ఆశ కల్గి దానినిగూర్చిపదేపదే చింతించు నపుడు మనస్సు స్వస్థానమగు హృదయమును విడిచి బయటకు పోవును. అపు డది చపలముగా నుండును. కాని ఎపు డా యభిలషిత పదార్థము చేఁజిక్కునో, లేక అనుభవింపబడునో అపుడు మనస్సు నిశ్చలమగును. పదార్థమును గూర్చిన సంకల్పము శమించును. అత్తఱి ఆ నిశ్చల మనస్సునందు అధిష్ఠానమగు ఆత్మానందము ఒకింత ప్రతిబింబించును. ఈ ప్రకారముగ తనలోని ప్రతిబింబిత ఆత్మసుఖమునే జీవుడు వస్తుజన్యముగ తలంచి పొరపడుచున్నాడు. ఆ సుఖము తన లోనిదే. బయటది కాదు. ఎట్లనిన——

ఒక కుక్క ఎచటనో ఒక ఎముకను సంపాదించి దానిని కొఱుకుచుండెను. ఎముక గట్టిగా నున్నందువలన విరుగ లేదు. కాని బలవంతముగా కొఱుకుటవలన ఒక పన్ను ఊడిపోగా, దాని నోటిగుండా నెత్తురు ఎముకపై కారుచుం డెను. పాపము, అమాయకమగు ఆ కుక్క ఎముకలో నుండి రక్తము స్రవించుచున్నదని భావించి తన భాగ్యముపండెనని ఊహించి నిర్విరామముగ ఆ రక్తమును నాకదొడగెను. ఇట్టి దియే అజ్ఞానుల పరిస్థితియు. భోగలాలసులగువారు పదార్థ ముల ననుభవించుచు ఆత్మసుఖమే ఆ పదార్థములందు ప్రతి బింబించుచున్నదని యెఱుగక "ఆహా! భోగ్యవస్తువులు ఎంత ఆనందకరములు!" అని తలంచుకొని మురిసిపోవుచున్నారు.

అసారే ఖలు సంసారే సుఖభ్రాన్తిః శరీరిణాం
లాలాపాన మివాంగుష్ఠే బాలానాం క్షీరవిభ్రమః.

—కొందరు చంటిబిడ్డలు నోటిలో వ్రేలు పెట్టుకొని చీకుచు, తమ ఉమ్మినే తాము మ్రింగుచు వ్రేలిలోనుండి పాలువచ్చుచున్నదని భ్రమింతురు. అట్లే ఈ అసార సంసారమున పదార్థములందు జనులకు సుఖభ్రాంతి కలుగుచున్నది. కాబట్టి బాహ్యవస్తువులందు సుఖము లేదు. మనస్సు శమించుటయే, సంకల్ప ముడుగుటయే సుఖమునకు కారణము. అది యెంతెంత అధికముగ శమించుచుండునో అంతంత అధికముగ జీవునకు సుఖము కలుగుచుండును.

నిజముగా సుఖము పదార్థమునందున్నచో అది అందఱికిని ఎల్లవేళలయందును సుఖకరముగ తోచవలెను. అట్లు లేదు. ఒకే వస్తువు కొందరికి ప్రీతికరముగను, కొందరికి అప్రీతికరముగను, ఒక కాలమున సుఖవంతముగను, మఱియొక కాలమున జుగుప్సాకరముగను స్ఫురించుచున్నది. వస్తువునందానంద మున్నచో ఇట్లున్నటికిని సంభవింపదు. దృష్టాంతమునకు జూడుడు—భోజనాత్పూర్వము ఎంతయో రుచికరముగ తోచిన పాయసము, గారెలు మున్నగునవి కడుపు నిండ భుజించిన పిదప ఇక తిన బుద్ధిగాక, ఎవరైన బలవంతముగ వడ్డించినచో విషప్రాయముగ భావించి తినక వదలివేయుదురు. "కడుపునిండితే గారెలు చేదు" అను ఆర్యోక్తి సత్యేతర మెన్నటికిని కాజాలదు. చేదుతనము గారెలలో

లేదు. రసాస్వాదనము అంతరంగమును లేదు. వారివారి ఆకలి, మన మనస్తత్త్వము ఆయా రుచులను కల్పించుకొనుచున్నది. ఇంతేమాత్రమే. కాబట్టి సుఖము బాహ్యపదార్థములందు లేదు. జీవుని అవిద్యయే ఆ ప్రకారముగ వస్తువు సుఖభ్రాంతిని కలుగజేయుచున్నది. బృహదారణ్యకోపనిషత్తునందు యాజ్ఞవల్క్యమహాముని తన భార్యయగు మైత్రేయికి వచించిన పరమసత్యముల నాలకింపుడు—

శ్లో. "న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి
ఆత్మనస్తు కామాయ పతిః ప్రియో భవతి, న వా అరే
జాయాయై కామాయ జాయా ప్రియా భవతి
ఆత్మనస్తు కామాయ జాయా ప్రియా భవతి.
ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః,"

—"ఓ మైత్రేయీ! భర్తగాని, కొమార్తెగాని, తదితరులు కాని, వెయ్యేల ప్రపంచములోని ఏ పదార్థముగాని ప్రియముగా తోచుచున్నచో, ఆ ప్రియత్వము వస్తువునందు లేదు తనయందే యున్నది. తనకొఱకే ఆ పదార్థములు ప్రియములుగా తోచుచున్నవి. కాబట్టి, అట్టి ప్రియాతిప్రియమైన ఆత్మనే దర్శించవలెను. దానిని గూర్చియే వినవలయును, చింతించవలెను, అనుభవించవలెను". కావున ఆనందముయొక్క మూలస్థానము, ప్రధానకేంద్రము (Headquarters) హృదయముననే కలదు, బయటకాదు. ఆనందఘనమగు పరమాత్మను తనయం దుంచుకొని అట్టి ఆనందధామమును తెలి

యక అజ్ఞుడు పేలాలకొరకై బాలురు పరువెత్తునట్లు అల్ప సుఖముల కొరకై వెతకుచున్నాడు. కావున, ఈ సత్యమును తెలిసికొని విజ్ఞుడు బాహ్యసుఖముల నపేక్షింపక ధ్యానాదుల ద్వారా హృదయస్థమగు పరమానందధామమును కైవస మొనర్చుకొని జన్మసాఫల్య మొనగూర్చుకొనవలెను.

వర్తకుడు సేరుతోగాని, మానికతోగాని ధాన్యమును కొలుచునపుడు ప్రారంభమున 'ఒకటి' అని అనడు. 'లాభం' అని పలుకును. అట్లే ఆరువఱకు కొలిచినపిమ్మట 'ఏడు' అని అనడు. 'ఆరున్నొకటి' అని చెప్పును. దీని అంతరార్థమేమిః ప్రతిప్రాణియు లాభమునే కోరుచున్నాడు కాని నష్టమును కోరుటలేదు. అదేవిధముగ 'ఏడుపు'ను 'దుఃఖమును' కాంక్షింపక 'నవ్వునే' (సుఖమునే) అపేక్షించుచున్నాడు. ప్రతిజీవికిని ఇట్టి స్వభావము నైజముగనే ఏర్పడుచున్నది. దుఃఖరాహిత్యము, ఆనందప్రాప్తి—అను లక్ష్యసిద్ధికొఱకే పిపీలికాది బ్రహ్మపర్యంతముగల సమస్తప్రాణికోట్లు పడరాని పాట్లు పడుచున్నవి. కాని లక్ష్యము సిద్ధించుచున్నదా అను నదియే ప్రశ్న.

మానవుడుగాని, జంతువుగాని ఇంద్రియములద్వారా పొందుసుఖము పరిపూర్ణమైనది కాదు. అది పరిచ్ఛిన్నసుఖము, ఆభాససుఖము, ప్రతిబింబితసుఖము, దుఃఖమిశ్రితసుఖము. విజ్ఞుడగు మానవుడు నిరతిశయపరిపూర్ణసుఖముకొఱకే

యత్నించవలెనుగాని, విషయజనిత అల్పసుఖముకొఱకుగాదు. ఇంద్రియసుఖము పశుపక్ష్యాదులుకూడ అనుభవించుచున్నవి. కావున, అద్దానికొఱకై ఉత్కృష్టమైన మానవజన్మను బడయవలసిన పనిలేదు. కరుణామయుడగు సర్వేశ్వరుడు జీవుల పుణ్యపరిపాకము ననుసరించి ఎపుడు మానవత్వమును అనుగ్రహించెనో, బ్రహ్మానందసామ్రాజ్యమున కది చక్కని నాందిగా తలంచి దానిని సద్వినియోగపఱచవలెను. పూర్ణ సుఖము తన ఆత్మయందే కలదని శాస్త్రములవలన, సద్గురూపదేశమువలన, స్వానుభవమువలన గుర్తెఱింగి, జీవిత మంతయు అట్టి అంతరంగసౌభాగ్యసంప్రాప్తిసాధనకై, ఆత్మానుభూతికై వినియోగించవలెను.

భౌతికప్రపంచములోగల సమస్త ఆనందములకంటెను చతుర్ముఖానందము చాల గొప్పదని ప్రతీతి. అట్టి చతుర్ముఖానందముగూడ బ్రహ్మానందసాగరమున ఒక చిన్న బొట్టు అని ఉపనిషత్తు లుద్ఘోషించుచుండుట చూడ దైవానంద మెంతటి మహోన్నతస్థాన మాక్రమించికొనియున్నదో విశద మగుచున్నది.

Aim at a lion and miss it, rather than hunt a jackal and catch it.

'గురి తప్పినను సరే సింహము వైపునకే గురిపెట్టుము, అత్తఱి జనులు నీసాహసమునుగూర్చి శ్లాఘింతురు. అంతియే

కాని, నక్కకు గురిపెట్టి దానిని పట్టి తెచ్చినప్పటికి నిన్ను గూర్చి అనుకొనువారే యుండరు' అని ఆంగ్లోక్తి. కావున మహోన్నతమగు ఆత్మానందసంప్రాప్తికొఱకే జీవుడు అహర్నిశములు పాటుపడవలయునుగాని అల్పమగు పశుపక్ష్యాదుల సుఖముకొఱకు గాదు.

ఎందఱో రాజాధిరాజులు ధనధాన్యసంపత్పరిపూరితములైనట్టియు, లక్ష్మీకటాక్షము తాండవించునట్టియు తమ సౌభాగ్యములన్నిటిని తృటిలో త్యజించివైచి అరణ్యముల కేగి ఏకాంతమున బ్రహ్మనిష్ఠులై యుండుట గమనించిన అద్వైతానందము ప్రపంచసుఖముల కన్నిటికంటెను మేటియని విస్పష్టముగ తెలియుచున్నది. కానిచో వారు రాజ్యముల నేల వదలవలెను? ఏదియో యొక గొప్పప్రయోజనము నుద్దేశించియే వారట్లు చేసిరి. రాజ్యసుఖముకంటె, భౌతికానందముకంటె మించినది మఱియొకటి ఉన్నపుడే వారు తమ రాజ్యాదులను త్యజించుట సంభవించును. అదియే ఆత్మసుఖము, దైవసుఖము, బ్రహ్మసుఖము. అది ఇంద్రియాతీతమైనది. ఇంద్రియములు, మనస్సు అత్యంతశుద్ధమైనపుడు మనుజుడు దానిని తనయందే అనుభవింపగల్గును. ఆత్మసుఖముయొక్క మహిమయెట్టిదో ఇంద్రియసుఖముయొక్క అల్పస్వరూపమెట్టిదో ఈక్రింది 'ఛార్టు' చక్కగ నిరూపింపగలదు.

| ఆత్మసుఖము | ఇంద్రియసుఖము |
|---|---|
| 1. త్రెంపులేనిది | మధ్యమధ్య తెగిపోవునది |
| 2. జన్మ రాహిత్యమును కలుగ జేయును. | కర్మను అభివృద్ధిపఱచి అంతులేని జన్మలను కలుగజేయును. |
| 3. దుఃఖము అవలేశమైనను లేనిది | కొద్ది సుఖము తరువాత కొండంత దుఃఖమును తెచ్చిపెట్టునది. |
| 4. పూర్ణ సంతృప్తిని కలుగ జేయును. | ఎంత అనుభవించినను సంతృప్తి ఉండదు. ఇంకను అనుభ వించవలెనను ఆశ పెరుగు చుండును. |
| 5. కోరిక లన్నిటిని రహిత మొన ర్చును. | కోరికలను దినదినము పెంచు చుండును. |
| 6. దృశ్య పదార్థములతో ఏమా త్రము సంబంధము లేనిది. | దృశ్యవస్తువులపై ఆధారపడునది. |
| 7. కర్మబంధమును త్రుంచి వేయును. | కర్మబంధమును ఇంకను దృఢతర మొనర్చును. |
| 8. బింబభూతమైనది | ప్రతిబింబరూపమైనది. |
| 9. సముద్రమువంటిది | ఒక నీటిబొట్టువంటిది. |
| 10. మహాత్ములు కాంక్షించునది | అజ్ఞానులు అపేక్షించునిది. |
| 11. చైతన్యవంతమైనది | జడమైనది. |

ఏది త్రెంపులేని ఆనందమో అదియే పరమసుఖము. జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయావస్థల నాల్గింటియందును అవిచ్ఛిన్నముగ నుండునదియే పరమసుఖము. దేనిని పొంది

నచో మఱి యితరమైన దేనినిగూడ కాంక్షింపడో అదియే పరమసుఖము. దుఃఖము లవలేశమైనను దేనియందు కలపడో అదియే పరమసుఖము. అట్టి సుఖమెపుడు లభించును? సంకల్పము లన్నియు రహితములై నిస్సంకల్పస్థితి చేకూరినపుడే జీవుడు తనయం దట్టి నిర్వికల్పసుఖము ననుభవింపగల్గును. సంకల్పము లన్నియు లయించిన జడమైన సుషుప్తియందే మనుజుడు పరమశాంతిని అనుభవించుచుండగా ఇక చైతన్యమైన తురీయస్థితియందు వేఱుగ చెప్పవలయునా?

ఇట్టి సుఖము దృశ్యవస్తువులందు లేదు. దృశ్యవస్తుజనితసుఖము పరిమితమైనది. కొద్దిసేపుండి మరల పోవునది. అది త్రెంపులేనిది కాదు. పైగా దుఃఖమునుకూడ వెంట తెచ్చుచుండును. పూర్ణతృప్తి దానివలన కలుగదు. దృశ్యపదార్థములందు గల ఆ కొంచెము సుఖముకూడ వాస్తవముగ ఆ పదార్థములనుండి వచ్చుటలేదని యెఱుంగవలెను. పదార్థములను అనుభవించినపుడు ఆ పదార్థములను గూర్చిన సంకల్పము ఉడుగుటచే అధిష్ఠానమగు ఆత్మానందము ఒకింత అనుభవమునకు రాగా జనులు పొరపడి అది యెదుటనున్న పదార్థములనుండి వచ్చుచున్నట్లుగా భావించుచున్నారు. కాబట్టి ఏ సుఖమున్ను యథార్థముగ బయటనుండి వచ్చుట లేదు. ఈ సత్యమును మనుజుడు శీఘ్రముగ గ్రహించి విషయవ్యామోహరహితుడై, ఆత్మవిచారణాపరుడై, అంతర్ముఖుడై స్వస్వరూపస్థితియందు నిలుకడ కలిగియుండులాగున ప్రయత్నించవలెను.

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః,
యస్మిన్‌స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే.

ప్రపంచములో ఎన్ని లాభములు కలవో, ఎన్ని ఆనందములు కలవో వానియన్నిటికంటెను ఆత్మలాభము సర్వోత్కృష్టమైనదనియు, అచ్చోట దుఃఖముయొక్క లవలేశమైనను కానరాదనియు శ్రీకృష్ణపరమాత్మ గీతయందు విస్పష్టముగ ఘోషించెను. అట్టి మహత్త్వపూర్ణస్థితికై జను లేల ప్రయత్నించరాదు? అవకాశములు (Opportunities) మరల మరల లభించునా? దేవతలుకూడ పొంద తహతహ లాడునట్టి ఈనరజన్మ పదేపదే వచ్చునది కాదని జను లెంత శీఘ్రముగ గ్రహించిన అంత మంచిది. అట్టి అదృష్టము లభించినపుడు దానిని సద్వినియోగపఱచుకొని, పరమసుఖ మగు ఆత్మలాభమును ఈజీవితమునందే పడయుటకై విజ్ఞుడు గొప్ప కృషి సలుపవలసియున్నాడు. మహోన్నత సుఖము కొఱకై అల్పసుఖమును త్యాగ మొనర్చవలసి యున్నాడు. ఆత్మానందముకొఱకై విషయానందమును బలి యివ్వవలసి యున్నాడు. ఇంద్రియాతీత నిర్వికల్ప సుఖముకొఱకై విషయ విరక్తి అను పణమును చెల్లించవలసియున్నాడు.

అట్లొనర్చుటలో జీవుడు కొంత ప్రయాసను పొంద వచ్చును. ప్రారంభములో కొంత అతృప్తిని అనుభవించ వచ్చును. అయినను వానిని లెక్కచేయక ముందునకు కొన సాగిపోయినచో, లక్ష్యమును వదలకయున్నచో అచిర కాలములోనే తన స్వరూపమును సాక్షాత్కరించుకొని జీవుడు

పరమానంద మనుభవింపగలడు. ఆనందముకొఱకై ఎక్కడెక్కడో బయట వెతకుచు తుదకు అది బయట ఏ పదార్థమందును లేదనియు తన హృదయమందే (ఆత్మరూపమున) కలదనియు గుర్తెఱింగి మనుజుడు పట్టరాని సంతోషమును బొందును. మానవజీవితము ఇందుకొఱకే యేర్పడినదని తలంచి తన జన్మ సార్థకమైనందుకు పరమసంతృప్తిని బడయును. అంతర్ముఖత్వమే మోక్షమునకు దారియని నిశ్చయించుకొని బహిర్ముఖమును త్యజించును. కావున ప్రతిజీవియు తన జన్మ మూలకమైన అట్టి ఆత్మానుభూతికొఱకై, పరమసుఖప్రాప్తి కొఱకై తీవ్రతర సాధన సలుపుగాక! అల్పమగు భౌతికసుఖమునకై అఱ్ఱులు చాచక అట్టి ఇంద్రియసుఖప్రాప్తియందే కాలమును దుర్వినియోగపఱచక రారాజులుకూడ ఆకాంక్షించునట్టి నిర్వాణాత్మసుఖమునకై తన జీవితమును అంకితమొనర్చుగాక!

ప్రపంచములో జనులు పలువిధములగు దుఃఖములను బొందుచున్నారు. ఆయా దుఃఖములను తొలగించుకొనుటకై సర్వవిధముల కృషియు చేయుచున్నారు. కాని ఆత్యంతిక దుఃఖశాంతి వారికి లభించుటలేదు. ఆకలిబాధ కలిగినపుడు ఆ బాధను తొలగించుటకై మనుజుడు అన్నము తినుచున్నాడు. దానివలన ఆ బాధ తాత్కాలికముగ తొలగివపఏటికిని మరల కొంతసేపటికి ప్రారంభించుచున్నది. అట్లే దాహము కలిగినపుడు నీరు త్రాగగా ఆ బాధ ఉపశమించినను తిరిగి కొంతసేపటికి ఆ బాధ మరల ప్రారంభించుచున్నది. రోగము

వచ్చినపుడు ఔషధమును స్వీకరింపగా రోగబాధ శమించి నప్పటికి మరల ఇంకొక రోగము ఆవిర్భవించుచున్నది. కావున అసలీ దుఃఖము లన్నిటికిని మూలకారణమేమిటో విచారించుట శ్రేయస్కరము.

Prevention is better than cure.

రోగము వచ్చినపిదప దానికి ప్రతిక్రియ చేయుట మంచిదే కాని అసలు రోగము రాకుండ చేసికొనుటయే ఉత్తమము. కాబట్టి ఈ భవరోగమునకు, ఈ సమస్త దుఃఖ జాలమునకు మూలకారణమేదియో విచారించెదము.

దేహమను ఉపాధిని ధరించుటవలన జీవుడు దుఃఖముల పాలుబడుచున్నాడు. దేహమో, కర్మమువలన ఏర్పడినది. కర్మము రాగద్వేషాదులవలన కలిగినది. రాగాదులు అజ్ఞానమువలన జనించినవి. కాబట్టి అన్ని ఆపత్తులకును మూలము అజ్ఞానము. ఆ అజ్ఞానమును జ్ఞానముచే తొలగించివైచినచో సమస్త దుఃఖములును తృటిలో అంతమైపోగలవు. పరిపూర్ణ దుఃఖరాహిత్యమునకు ఇది యొకటియే మార్గము. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ గీతలో—

అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః
జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః
తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్.

అని సెలవిచ్చెను. పరిశుద్ధమైన జ్ఞానస్వరూపము, ఆత్మచైతన్యము అజ్ఞానమను మాలిన్యముచే కప్పబడుటవలన

జీవులు లెక్కలేనన్ని క్లేశము లనుభవించుచున్నారనియు, జ్ఞానవిచారణచే ఆ అజ్ఞానము నశింపజేయబడినపుడు మేఘము తొలగిన సూర్యుని చందమున ఆత్మ దేదీప్యమానముగ ప్రకాశించుననియు భగవానుడు పలికెను. అదియే మోక్ష స్థితి. అదియే కైవల్యము. అదియే నిర్వాణము. అట్టి పరిపూర్ణాత్మానంద స్థితిని జీవులు ప్రయత్నపూర్వకముగ సంపాదించవలసియున్నారని భగవానుడు గీతయందు అసందిగ్ధముగ చెప్పివైచెను.

తనది కాని వస్తువును తనదని అంగీకరించి దానిపై వ్యామోహము కలిగియుండుటయే అజ్ఞానము. ఆ వస్తువుపై మమత్వమును వృద్ధినొందించుకొనుటయే అవిద్య. వాస్తవముగ ఈ దేహము తనది కాదు. ఇంద్రియములు తనవి కావు. మనస్సుగాని బుద్ధిగాని తనవి కావు. వీనియన్నింటికిని సాక్షియై వెలుగు ఆత్మయే తాను. దృశ్యవర్గముతో తన కేలాటి సంబంధము లేదు. తాను శాశ్వత దృక్-స్వరూపుడు. ఈ క్షేత్రముతో తనకు కించిత్తైనను ప్రసక్తి లేదు. తాను కూటస్థ, అచల, నిర్వికార క్షేత్రజ్ఞుడు. అజ్ఞాన ప్రాబల్యముచే జీవుడు తనవి కానట్టి దేహేంద్రియాదుల పైన నేకాక బయటనుండు ప్రాపంచిక దృశ్యపదార్థముల పైనగూడ మమత్వమును పెంచుకొని దుఃఖితుడగుచున్నాడు. దేహమే తనది కానపుడు దేహము వెలుపలనుండు బంధ్వాది పదార్థములు తన వెట్లగును? ఒక్కొక్క వస్తువుపై క్రమముగ మమకారమును పెంచుకొని, వానితో తాదాత్మ్యము



పెంపొందింపజేసికొనుచు, వాని, వియోగముచే తాను దుఃఖించుచు – బరువును పెంచుకొని పెంచుకొని, సంసార విషవృక్షమును చిలవలు పలువలుగా వృద్ధిజేసికొని, తుదకు దుఃఖభారముచే కృంగి కృశించిపోవుచున్నాడు.

కాబట్టి విచారణచే తన ఆత్మస్వరూపమును చక్కగ నెఱిఁగి, దానియందే నిలుకడ కలవాడై, తనది కాని వస్తువులగు దేహేంద్రియాదులందును, జగత్పదార్థములందును సక్తుడు కాన యున్నవాడై, అసంగముగ వ్యవహరించుచు పరమానందమును జీవుడు పడయవలెనే కాని, అజ్ఞానవశమున దుఃఖజాలమును వహింపరాదు. అట్లు వహించుట మానవత్వమునకే కళంక మాపాదించినట్లు, దుఃఖవిముక్తికై యత్నించుటకే మానవజన్మ ఏతెంచినది కాని దుఃఖభారమును మోయుటకు కాదని జనులు మున్మాటికిని జ్ఞాపకము చేసికొనవలెను. అజ్ఞానమే దుఃఖకారణము. జ్ఞానమే దుఃఖవిముక్తి మార్గము. తన ఆత్మస్వరూపమును మఱచుటయే దుఃఖమునకు కారణము. మహాత్ముల సాంగత్యముచే, శాస్త్రవిచారణచే, స్వకీయ అనుష్ఠానముచే, తిరిగి అట్టి ఆనందరూప ఆత్మస్వరూపమును జ్ఞాపకము తెచ్చుకొని, ఆద్దానియందు నిలుకడ కలిగియుండుటయే దుఃఖోపశమనమునకు ఏకైక మార్గము.

కావున ముముక్షువులగువారు వివేక వైరాగ్యాదుల ద్వారా అజ్ఞానమును తెగద్రుంచి, దేహాహంభావమును రూపుమాపి, తద్ద్వారా సంసారదుఃఖముయొక్క మూలో

చ్ఛేదమును గావించి ఆత్మరూప శాశ్వతసుఖాంభోనిధియందు నోలలాడుదురుగాక!

ఉపనిషత్తులందు ఒక చక్కని ఉపమానము చెప్ప బడి యున్నది—

ఒకానొక చెట్టు కలదు. ఆ చెట్టుయొక్క చిటారు కొమ్మపై ఒక పక్షి కూర్చుండి ప్రశాంతచిత్తముతో దిక్కులను వీక్షించుచు గంభీరభావములో వర్తించుచుండెను. ఇంకొక పక్షి ఆ చెట్టు మధ్యభాగమున ఇటునటు తిరుగుచు చంచలస్వభావముగల్గి, ఒక్కొక్కసారి మధురఫలమును తిని సంతోషించుచు, మఱియు ఒక్కొక్కసారి కటుఫలము భక్షించి ఏడ్చుచు, ఈ ప్రకారముగ సుఖదుఃఖములచే నానా యాతనల నొందుచు నుండెను. ఇట్లుండ కొంత సేపటికి క్రింద నున్న పక్షి పైన హాయిగ కూర్చొనియున్న పక్షిని పరికించి, నెమ్మది నెమ్మదిగ పైకి యెగిరి దాని చెంతకు చేరగనే క్రమముగ దానిలో విలయమై పోయెను. అపుడిక రెండు పక్షులు లేవు; పై పక్షి ఒకటియే శేషించియుండెను.

ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్నన్నన్యోఽభిచాకశీతి. (ముండక—ఉ. 3-1)

ఉపనిషత్తులందు కావింపబడిన చక్కటి చిత్రణ మిది. ఈ జగద్రూపవృక్షమున పరమాత్మ, జీవుడు అను రెండు

పక్షులు కలవు, ఆత్మరూపపక్షి నిశ్చలమై నిర్వికారమై సుఖదుఃఖాది ద్వంద్వవర్జితమై గంభీరముగ వెలయుచున్నది. జీవుడను పక్షి చంచలమై, అనిశ్చితభావము గల్గి సుఖదుఃఖములను ద్వంద్వములను అనుభవించుచు విషయానందము పొందినపుడు ఉబ్బిపోవుచు, దుఃఖము సంప్రాప్తమైనపుడు కృంగి కృశించుచు ఈప్రకారముగ చిత్తచాంచల్యము ననుభవించుచు, ఎట్టకేలకు పరమాత్మయను పైపక్షినిగూర్చి తెలిసికొని, క్రమక్రమముగ సాధనాతిశయముచే ఆ పక్షి సమీపమున కేగుచున్నది. ఏగుటయే తడవుగా, అగ్నిలో పడిన మిడుత అగ్నిభావమునే పొందునట్లును, సముద్రమును జేరిన నది సముద్రరూపమునే జెందునట్లును జీవుడు పరమాత్మరూపమునే పడయుచున్నాడు. అదియే జీవబ్రహ్మైక్యము. అపుడు జీవుడు, శివుడు అను రెండు రూపము లుండవు. జీవుడు శివుడే యగుచున్నాడు. మానవుడు మాధవుడుగా పరిణతి జెందుచున్నాడు. నరుడిక నరుడుగా నుండక నారాయణరూపుడై భాసించుచున్నాడు. ఇదియే జీవుని చరమస్థితి. జీవుని అంతిమ లక్ష్య మిదియే.

జీవుడు విషయసుఖములకై ప్రాకులాడుచు తనకున్న అమూల్యసమయమును ధారబోయక చక్కని ఆధ్యాత్మిక సేవ గావించుచు అభ్యాసయోగమును జేబట్టి భక్తి జ్ఞాన వైరాగ్యములను లెస్సగ సాధించుటద్వారా ఆత్మసాక్షాత్కారమును ఈ జన్మయందే సాధించవలెను. క్రిందనున్న పక్షివలె దుఃఖమునందు కాలము గడుపరాదు. జీవుడీ

లోకమునకు ఏతెంచినది శోకించుటకు కాదని ముమ్మాటికి జ్ఞప్తియందుంచుకొనవలెను. ఏడ్పును పోగొట్టుకొను ఉపాయమును పెద్దలవలన తెలిసికొని దుఃఖమునకు శాశ్వతముగ తిలాంజలి నొసంగుటకే మానవజన్మ ఏర్పడినదని నిశ్చయించుకొనవలెను. పైపక్షివలె గంభీరభావమును అలవఱచుకొనవలెను. తాను ఏకాలమందును పరిచ్ఛిన్నుడు కాదనియు, దేహరూపబంధము మధ్యలో వచ్చి మధ్యలో పోవునదే యనియు, తాను ఉపాధిరహితుడైన సచ్చిదానందస్వరూపుడనియు పరిపూర్ణముగ నిశ్చయించవలెను.

చిదానందరూపశ్శివోఽహం శివోఽహం-అని నిరంతరము ఎలుగెత్తి చాటుచు అట్టి బ్రహ్మానందాత్మానుభూతియందే కాలము గడుపుచుండవలెను. చక్కటి అధ్యాత్మిక పరిశ్రమచేతను, అకుంఠిత భక్తిశ్రద్ధలచేతను అట్టి అలౌకిక స్థితిని జీవుడు తప్పక చేరుకొనగలడు. కావున ముముక్షువగువాడు తాను పంచభూతాత్మకమై, జడమైనట్టి ఒక చిన్న అస్థిపంజరము కాదనియు, బంకమట్టితో చేయబడిన ఈ దేహమను ఇల్లు తాను కాదనియు, విశ్వవ్యాపకమై, జననమరణరహితమై, చిన్మయస్వరూపమైనట్టి ఆత్మయే తాననియు అహర్నిశము భావించుచుండవలెను.

తద్బ్రహ్మ నిష్కళమహం న చ భూతసంఘః-'నిష్కళముగు ఆ బ్రహ్మమునే నేనుగాని పంచభూతాత్మక జడసముదాయ మగు ఈ దేహమునుగాను' అను శ్రీ శంకరాచార్యుల వాక్యమును సదా స్మృతిపథమున నుంచుకొనవలెను.

మహోన్నత మగు ఈ మానవ జీవితమును సార్థక మొనర్చుకొన దలంచువారు, ఈ జీవితమందే మోక్ష సామ్రాజ్యాభిషిక్తులు కాదలంచువారు, మఱల గర్భనరక మందు పడి నానాయాతన లనుభవించకుండ తప్పించుకొన దలంచువారు పైన దెల్పిన ఉపనిషద్వాక్యములను నిరంత రము సంస్మరించుచు గంభీరాత్మభావమును అలవఱచుకొనుచు అభ్యాసప్రాబల్యముచే సాధనాతిశయముచే బ్రహ్మసాక్షా త్కార మొంది జీవన్ముక్తులై పఱగవలయును.

బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి—'బ్రహ్మమును తెలిసి కొనువాడు బ్రహ్మమే యగును' అను వాక్యమును సదా జ్ఞప్తియందుంచుకొని బ్రహ్మజ్ఞాన సముపార్జన ద్వారా సాక్షాత్ బ్రహ్మరూపులే అయి జనులు తమ జీవితములను సార్థక మొనర్చుకొనవలెను. అట్టి బ్రహ్మస్థితియందు, ఆత్మ స్థితియందు నిలుకడ కలిగియుండుటయే మోక్షము.

# 3 వ అధ్యాయము

## మోక్షసామ్రాజ్యము జీవుని జన్మహక్కు

నిరతిశయానందరూపమగు మోక్షధామము, మోక్ష సామ్రాజ్యము, స్వారాజ్యపదవి సమస్త ప్రాణులయొక్క జన్మహక్కై యున్నది. ఋషులందఱును ఈ సత్యమునే ఉద్ఘోషించి యున్నారు.

స్వరాజ్య, స్వారాజ్యము (మోక్షసామ్రాజ్యము)లు రెండును జీవునకు ఆవశ్యకములే. బాహ్యమున పరరాజుల బానిసత్వము, అభ్యంతరమున ఇంద్రియమనంబుల బానిసత్వము జీవుని ఆక్రమించి వేధించుచున్నవి; ఆతనిని అస్వతంత్రునిగ జేసివైచుచున్నవి. ఇట్లు బాహ్యాభ్యంతరములందెంతవఱ కాతనికి స్వాతంత్ర్యము లభింపకుండునో, అంతవఱ కాతనికి నిర్భయత్వము కలుగనే కలుగదు. నిర్భయత్వము కలుగనంతవఱకు దుఃఖ మాతనిని వెన్నంటుచునే యుండును. దీనినిబట్టి పూర్ణదుఃఖరాహిత్యముకొఱకై జీవునకు స్వరాజ్య, స్వారాజ్యములు రెండును అత్యంతావశ్యకములని తేలుచున్నది. భారతీయుల అహింసాత్మ కార్యదీక్షచే స్వరాజ్య మిట్టే కేలకు సంప్రాప్తించినది. కాని అంతటితో తృప్తిపొందరాదు. చేయవలసిన కార్య మింకను చాల గలదు. ఒక బాని సత్వము వదలినను, దానికి పదిరెట్లు బలవత్తరమైన మఱి

యొక్క దాసిసత్వము త్రిష్ఠ వేసికొనియున్నది. అది యీ జన్మ యందే కాదు, జన్మజన్మాంతరములనుండి జీవుని బాధించుచు ఆతనిని వివశునిగ జేయుచున్నది. ఆ ప్రబల శత్రువునున్మూలించినగాని పూర్ణశాంతి సౌఖ్యములు జీవునకు గలుగనేరవు. శారీరిక బాధ శమించినను మానసిక బాధ గలవారికి శాంతి యెచట? కాబట్టి ఇంద్రియ, మనంబుల దాసత్వమను ఆ రెండవదానినుండి కూడ విడివడిననాడే, కామక్రోధాదుల బారినుండి తప్పించుకొనిననాడే, ప్రకృతి పారతంత్ర్యమును పారద్రోలి ఇంద్రియ మనంబులపై నాధిపత్యము వహించి వాని దాస్యశృంఖలములనుండి విముక్తినొందిననాడే పూర్ణ స్వాతంత్ర్యము లభించినదని శాహాటముగా చెప్పుకొనవచ్చునుగాని అతఃపూర్వము కాదు.

ఈ సత్యమును మనస్సునందిడుకొనియే శ్రీ కృష్ణ భగవానుడు కామాదిరూపమగు ఆ యాంతరంగిక ప్రబల శత్రువు నెట్లైన జయించియే తీరవలెనని అర్జునునకు శాసించెను. 'ఓ అర్జునా, ఆ కామాదులు శత్రువులు, శత్రువులు! బహుజాగ్రతి! జ్ఞానము నంతను అని నాశముచేసి జీవుని అధోగతికి త్రోసివేయును! కావున వానిని ముందుగా జయించి వేయవలెను' అని హెచ్చరిక చేసియున్నాడు. 'ఇది శత్రువు' అను భావము అర్జునునకు తద్ద్వారా ముముక్షువు లందఱికిని లెస్సగ బోధించుటకు కాబోలు గీతాచార్యులగు శ్రీ కృష్ణభగవానులు ఒకే అధ్యాయమున, ఒకే ప్రసంగమున అనేక పర్యాయములు ఆ 'శత్రు' పద.

మును ప్రయోగించినారు; గీతయందలి మూడవ అధ్యాయమున చివరి భాగమున చూడుడు—

'జ్ఞానినో నిత్య వైరిణా'
'విద్ధ్యేన మిహ వైరిణమ్'
'తో హ్యస్య పరిపన్థినౌ'
'జహి శత్రుం మహాబాహో'

ఇట్లు చెప్పుటకు కారణ మేమి? 'ఓ ముముక్షువులారా! ఓ సాధకులారా! మీలో ఒక గొప్ప శత్రువు కలడు. లోకము లన్నిటిని మీరు జయించినప్పటికిని ఆ శత్రువునకు లొంగిపోయినచో మీరు యథార్థమైన విజేతలు కానేరరు! కావున ఈ విషయమై బహుజాగరూకులుగ వర్తింపుడు. మొదట వానిని జయించి అ పిమ్మట ఇంకే పని యైన చూడుడు' అని తెలుపుటయే యగును. కనుకనే,

ఆశాయా దాసా యే తే దాసా స్సర్వలోకస్య
ఆశా దాసీ యేషాం తేషాం దాసాయతే లోకః.

అని పెద్దలు చెప్పుటకు కారణమైనది. అనగా 'అంతరంగ శత్రువగు ఆశకు దాసులైనవారు లోకమున కంతకు దాసులే యగుదురు. కాని ఆశ యెవరికి దాసియై యుండునో, వారికి లోకమంతయు దాసియే యగును.

సామ, దాన, భేద, దండోపాయములచే బాహ్యశత్రువులను ఓడించవచ్చును గాని ఈ కామాదిరూప అంతరంగిక శత్రువు నోడించుట మాత్రము బహుకష్టము. ప్రహ్లా

డుడు తన తండ్రియగు హిరణ్యకశిపునకు వచించిన యీ క్రింది వాక్యములను పరికింపుడు—

లోకము లన్నియున్ గడియలోన జయించినవాడ వింద్రియా
నీకము జిత్తమున్ గెలువనేరవు నిన్ను నిబద్ధుజేయు నీ
భీకరశత్రులార్వుర బ్రభిన్నుల జేసిన బ్రాణికోటిలో
నీక విరోధి లేడొకడు నేర్పున జూడుము దానవేశ్వరా!

అయితే ఆత్మస్వాతంత్ర్యసంపాదన మొనగూర్చునట్టి ఆ యాభ్యంతర శత్రువిచ్ఛేదన మెట్లు సంభవించునో యిపుడు యోచింపవలసియున్నది. ఆ ప్రబలవైరిని తెగటార్చు ఉత్తమ ఉపాయమును మన మిక అన్వేషింపవలయును. ఆ యుపాయమును శ్రీ భగవానుడే సెలవిచ్చియున్నాడు. ఎట్లనిన,

ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్.

అనగా, బుద్ధికంటెను పరమైనట్టి ఆత్మను తెలిసికొని, అట్టి తురీయాత్మయందు నిలుకడ గలిగి ఇంద్రియ నిగ్రహము గావించుకొని కామరూపమగు మహాశత్రువును జయించి వేయవలెను!

సంపూర్ణమైన ఇంద్రియనిగ్రహము కలుగుట కిది యొకటియే ఉపాయము. వేదాంతమునొక్క కీలకమంతయు నిచటనే యున్నది. ఇతరములగు చిన్న చిన్న సాధనముల చేతను, ఉపాయములచేతను ఇంద్రియ మనంబుల నిగ్రహము

కొంతవఱకు మాత్రమే సాధ్యమగును గాని పూర్ణముగ గాదు. అట్టి వాసన ఒకింత శేషించియే యుండును. కావుననే భగవానులు,

'రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే'

అని ఆనతిచ్చియున్నారు. అనగా, శబ్దాదివిషయములను స్వీకరింపని వానిచే విషయములు నివృత్తము లగునుగాని విషయవాసన నశింపదు. పరమాత్మ దర్శనము గలుగునపుడు ఆ వాసనయు సంపూర్ణముగ నశించిపోవును.' కాబట్టి బుద్ధికి పరమగు ఆత్మయే తానని నిశ్చయించి అనాత్మరూపము లగు దేహాదులందు అభిమానము తొలగించినపుడు మాత్రమే ఇంద్రియనిగ్రహము సంపూర్ణముగ సిద్ధించును. అనగా, తాను మనోబుద్ధీంద్రియములకు విలక్షణుడనియు, సాక్షియనియు బోధ యెపుడు దృఢముగ గల్గునో, అపుడే మనస్సు, ఇంద్రియములు లెస్సగ స్వాధీనము లగును. అపుడే జీవుడు స్వారాజ్య (మోక్ష) స్థితిని బడయకలుగును. ఇదియే వేదాంతముయొక్క సారము.

అట్టి అనుపమస్థితిని బడయునప్పుడు, అనగా దేహేంద్రియమనంబులతో తాదాత్మ్యము నొందక ఆత్మయందే స్థితిగలిగియుండునపుడు జీవునకు అపూర్వమైన పరమార్థానుభవము గలుగును. తానేకాలమందును జన్మించలేదనియు మరణించలేదనియు, సుఖదుఃఖములను పొందలేదనియు, ఇంతవఱకీ మహానాటకమంతయు ఆడుచున్నది చిత్తమే

యనియు, కాని అజ్ఞానవశమున తానే సుఖదుఃఖాదులను పొందుచున్నట్లు వ్యర్థముగ తలంచియుంటిననియు, తానెప్పటి యట్లే పూర్వము ఇపుడునుగూడ స్వస్వరూపమున నిర్వి కారుడై చిత్తాదులకు సాక్షియై చెన్నొందుచున్నాడనియు తెలిసికొని నిరావరణజ్ఞానసంపన్నుడై బ్రహ్మానందమున నోలలాడుచుండును.

అట్టి ఆత్మజ్ఞాని కిక జన్మయుండదు. అతని కర్మరాశి యంతయు భస్మమైపోవును, సంస్కారములన్నియు నశించును, వాసన లుడిగిపోవును, దృశ్యవృత్తులు శమించును. హృదయ గ్రంథులు విచ్ఛిన్నములై పోవును. సమస్త సంశయములు దూరీకృతములగును. మాయయొక్క రహస్యమంతయు కరతలామలకముగ గోచరించును. ఇంద్రియమనంబుల దాస్యమంతరించును. విశ్వసౌభ్రాతృత్వ ముదయించును. అంతయు ఆత్మమయమై తోచును. అపుడే ప్రాణికోట్లయెడ అకృత్రిమప్రేమ, అవ్యాజకరుణ యుద్భవించును. కావుననే వారినిగూడ తనవలె తరింపజేయనెంచి అక్కార్యమున తన జీవితమంతయును ధారవోయును. అదియే స్వారాజ్యస్థితి. అట్టి పరిపూర్ణ అద్వయ ఆత్మస్థితి సర్వజీవుల జన్మహక్కై యున్నది.

శ్రుతి శిరస్సులగు ఉపనిషత్తులన్నియును ఐక్య కంఠముతో ఈ సత్యమునే ప్రతిపాదించుచున్నవి. ఉపనిష ద్వాక్యములు జనులకు పరమప్రమాణములై యున్నవి.

శరీరములో అన్ని అంగములకంటె శిరస్సు ప్రధానమైనరీతిగా శ్రుతులలో (వేదములలో) ఉపనిషత్తులు అత్యంత కీలకమైన స్థానమును ఆక్రమించుచున్నవి. ఉపనిషద్వాక్యము, ఉపనిషత్ప్రమాణము మహోన్నతమైనది. ఇక దానికి తిరుగులేదు. ఇప్పుడు ప్రభుత్వవిధానమందు సుప్రీంకోర్టు ఎట్టి స్థానమును వహించుచున్నదో, అచ్చోట తీర్మానించబడిన నిర్ణయము సర్వులకును ఎట్లు శిరోధార్యమైయున్నదో, ఆ తీర్మానమును అన్యథా భావించుటకు ఎవరికిని ఎట్లు శక్తిలేదో, అచటి పెద్దలు నిర్ణయించినదే ఎట్లు లోకమున పరమప్రమాణముగ చలామణియగుచున్నదో, అట్లే అధ్యాత్మవాఙ్మయమున ఉపనిషద్వాక్యము సర్వజనాదరణీయమై మహోన్నత ప్రమాణమై యలరుచున్నది.

## ఉపనిషత్సందేశము

ఆ యుపనిషత్తులు జనుల కేమి బోధించుచున్నవి? అవి ప్రజానీకమున కొరకు సందేశమేమి? ఒక్క వాక్యములో ఆ సందేశమంతయు ఇముడ్చవచ్చును. అదియే 'తత్త్వమసి'. ఇది వాక్యముకాదు మహావాక్యము. బోధము కాదు ప్రబోధము. 'ఆ పరమాత్మయే నీవు' అని ఉపనిషత్తులు శాసించుచున్నవి. ఎంతటి ఆహ్లాదకరమైన వాక్యమది! ఎంతటి ధైర్యోద్బోధకమగు సందేశమది! ఆ ఒక్క వాక్యమును అనుభూత మొనర్చుకొనినచో, ఇక జన్మజన్మాంతరము జీవునిపట్టి పీడించుచున్న అవిద్యాపిశాచము

ఒక్క-క్షణకాలములో పలాయనమంత్రమునుపఠింపవలసిన దే. 'భిద్యతే హృదయగ్రన్థిః' అనునట్లు ఆ సమయమున, అనగా జీవుడు 'తత్త్వమసి' మహావాక్యమును జీర్ణముచేసికొని, 'అహం బ్రహ్మాస్మి' అను అనుభూతి బడసినపుడు సమస్త భవబంధములు తొలగిపోవును. హృదయగ్రంథులన్నియు విచ్ఛిన్నములగును. ఇక మనుజుడు తన జీవిత చరమలక్ష్యమును సాధించినట్లే. అట్టి మంగళమయదశను శీఘ్రాతిశీఘ్రముగ అనుభవించి కృతార్థులు కండని ఉపనిషత్తులుద్ఘోషించుచున్నవి.

అయితే బహుజన్మాభ్యస్త దృశ్యసంస్కారమువలన మనుజుడు తాను దేహమని, తాను అల్పుడని, తాను బద్ధుడని తలంచుచున్నాడు. ఇట్టి దేహతాదాత్మ్యమువలన ఉపాధిజనిత దుఃఖములన్నిటిని తనపై ఆరోపించుకొని నానా అవస్థలు పడుచున్నాడు. మనుజుని దుఃఖమునకంతటికిని కారణమీ అజ్ఞానజనిత దేహతాదాత్మ్యమే అయియున్నది. కావున జీవునకు దుఃఖము సమూలముగ తొలగిపోగా శాశ్వతానందము కలుగవలెననిన, తనయొక్క స్వస్వరూప చిన్మయస్వరూపమును స్మృతిపథమునకు తెచ్చుకొనవలెను. ఉపనిషత్తులు చేయు మహోపకారమిదియే. అవి జీవునకు తన సహజస్వరూపమును జ్ఞాపకము చేయుచున్నవి. తలుపు తట్టి 'నీవు పరబ్రహ్మస్వరూపుడవ'ని చెప్పుచున్నవి. 'మేలు కొలిపి మరల తమస్సునందు పడవద్దని హెచ్చరించుచున్నవి. 'ఓ జీవుడా! నీవు ఏడుజానల మనిషివికావు, భూనభోంతరాళ

ములు పరివేష్టించిన విశ్వవ్యాపక దీర్ఘదేహుఁడవు. నీవు ప్రకృతి రథచక్రములక్రింద నలిగిచచ్చు అల్పకీటకముకాదు, ప్రకృతిని శాసించు పరమాత్మవు. నీవు బద్ధుడవుకావు, ముక్తుడవు, కర్మాధీనుడవుకావు. కర్మాతీతుడవు మృత్యురూపుడవుకావు. అమరుడవు. భృత్యుడవుకావు. రాజాధిరాజవు. పాదుషాచక్రవర్తివి. వెయ్యేల నీవు జీవుడవుకావు, సాక్షాత్ శివుడవే'—

ఇదియే ఉపనిషత్తులయొక్క సందేశము. శ్రుతి భగవతియొక్క ఈ సద్బోధను, ఈ హెచ్చరికను పాటించినవారియొక్క జన్మము ధన్యమైనట్లే. వేదమాతయొక్క ఈ వాత్సల్యప్రపూరిత వచనముల నాలకించినవారియొక్క శోకమోహములు పటాపంచలైనట్లే. దీనిచే వారికి కలుగు ధైర్యము అపారము. ఇట్టి వాక్యములను మననము చేయుట వలన మనుజుని హృదయములో గొప్ప ఉత్తేజము జనించుచున్నది.

It is strength and strength that we want, and the first step in getting the strength is to uphold the Upanishads and believe that I am the Atman.

అని స్వామి వివేకానందులు ప్రవచించినట్లు మనుజునకు పారమార్థిక వ్యావహారిక బలములు రెండునుకూడ ఉపనిషత్తులను సచ్ఛాస్త్రములను విశ్వసించి, తాను దేహముకాదు ఆత్మయే యని మననము చేయుటవలననే లభించుచున్నవి. ఇది ముమ్మాటికిని సత్యము. కావున

శోక మోహోపహతులగు జీవులందఱున్ను ఈ వేదాను శాసనమును, ఈ ఉపనిషన్నిర్ఘోషను ఆలకించి అనుష్ఠించి మహాబల సమన్వితులై, ఆత్మతేజోవిరాజితులై జన్మసార్థకతను బడయవలయును.

ఉపనిషత్ప్రతిపాదితమగు అట్టి అక్షర, నాశరహిత, శాశ్వత ఆత్మస్వరూపమును గూర్చిన విద్యనే జనులు తమ జీవితమునందు మొట్టమొదట సంపాదింపవలసియున్నది.

సామాన్యముగ పిల్లలకు దాదాపు ఐదు సంవత్సరముల వయస్సు పూర్తి కాగానే తలిదండ్రులు వారి విద్యాభ్యాస విషయమై యోచింప మొదలిడుదురు. వారికి అక్షరాభ్యాసము గావించుదురు. అక్షర మనగా నాశరహితమైనది. క్షర మనగా నశించునది. ప్రపంచములో దృశ్యమానమగు ప్రతిపదార్థమున్ను క్షయశీలమైనది. చావు పుట్టుకలు కలది. తుట్టతుదకు అతిసూక్ష్మములైన మనో బుద్ధి చిత్తాహంకారములు కూడ ఒకానొక సమయమున నశించిపోవునవియే అయి యున్నవి. కాని ఆత్మ (బ్రహ్మము) మాత్రము ఏ కాలమందును నశింపదు. అది అక్షరమైనది. అట్టి ఆత్మనుగూర్చి తెలిసికొనుటయే వాస్తవమగు అక్షరాభ్యాస మగును. అదియే అక్షరవిద్య. దీనిని గూర్చియే శ్రీ కృష్ణపరమాత్మ భగవద్గీత ఎనిమిదవ అధ్యాయమందు ప్రస్తావించెను. మఱియు రాజవిద్య యనియు వేఱొక సందర్భమున దానికి నామకరణ మొసంగెను. ఏది సర్వవిద్యలకును మకుటప్రాయమై యున్నదో, అది రాజవిద్య, బ్రహ్మవిద్య. రాజును విడిచి

సామాన్యుని ఆశ్రయించుట యెట్టిదో రాజవిద్యను విడిచి ఇతర విద్యల నాశ్రయించుటయు అట్టిదే యగును. బ్రహ్మవిద్యకు 'రాజత్వ' మాపాదించి శ్రీకృష్ణుడేల అద్దానికి ప్రాధాన్యత నొసంగెనో విజ్ఞులోకింత యోచింపవలెను. ఏది దుఃఖమును ఆత్యంతికముగ నివారించునో, ఎద్దానియందు నిలుకడ గల్గినచో భీషణతాపములు, క్లేశములు కూడ మనుజుని చిత్తమును వ్యాకుల మొనర్పజాలవో*, ఏది జీవితకాలముననే పరమానందము నొసంగగల్గునో, అట్టి అధ్యాత్మవిద్యను, బ్రహ్మవిద్యను, అక్షరవిద్యను ఉపేక్షించిన కారణమువలననే జనులు తక్కిన ఎన్ని విద్య లున్నప్పటికిని దుఃఖమును దాటలేకున్నారు.

నదీప్రవాహ మధ్యమున కావలసిన విద్యయేది? ఏ విద్య అత్తటి జీవున కుపయోగించును? 'ఈత' విద్య. ఆ విపత్కర సమయమున తర్కముగాని, మీమాంసగాని, జ్యోతిషముగాని, హిస్టరీగాని, జాగ్రఫీగాని, ఆల్జిబ్రాగాని, జ్యామెట్రీగాని, మఱేదిగాని జీవుని రక్షింపజాలదు. మనుగుడవానికి ఈత విద్య యొక్కటియే శరణ్యము. అట్లే జీవుడు సంసార సాగర మధ్యమున గ్రుంకులిడుచున్నాడు. జనన మరణ ప్రవాహమున బడి నానాదుఃఖముల ననుభవించుచున్నాడు. అట్టి వానికి తరణోపాయము బ్రహ్మవిద్యయే. అక్షర పరమాత్మ తత్త్వమే. ఆ విద్యయొక్కటియే జీవుని తరింపజేయగలదు. కనుకనే దానికి తారక విద్యయను పేరు గలిగినది. భయదుఃఖ

*యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే. (6-22)

శమనమునకై దుఃఖరాహిత్యమునకై మనుజుడద్దానిని తప్పక పరిగ్రహించవలయును. శాశ్వతానందమునకు మార్గమును యోచించుకొనువాడే ధన్యుడు. అద్దానిని నోచుకొనలేని జీవితము జీవితము కాదు.

కాబట్టి ఎంతటి గొప్ప పండితులైనను, కవిశేఖరులైనను, విద్యావాచస్పతులైనను, శాంతికై, దుఃఖరాహిత్యమునకై, అక్షర (బ్రహ్మ) విద్యను నేర్వవలసినదే. చతుష్షష్టికళలందు, విద్యలందు ప్రావీణ్యము సంపాదించినను, తిరిగి పలక, బలపము తెచ్చుకొని ఆధ్యాత్మరంగమున అక్షరాభ్యాసమును ప్రారంభించవలసినదే. శమదమాదులను, కరుణ, దయ, పరోపకారము, భగవద్భక్తి, వైరాగ్యము మున్నగు పరమార్థ గుణములను అభ్యసించవలసినదే. అక్షర బ్రహ్మతత్త్వము నెఱుంగవలసినదే. అపుడే వాస్తవముగ అక్షరాభ్యాసము పూర్తి అయినట్లు లేనిచో ఎన్ని లౌకిక విద్యలు సముపార్జించినప్పటికిని, జనులు 'ఓ, న, మా' లు రాని వారే యగుదురు.

షడంగాది వేదో ముఖే శాస్త్ర విద్యాః
కవిత్వాది గద్యం సుపద్యం కరోతి
హరేరంఘ్రి పద్మే మనశ్చేన్న లగ్నం
తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్.

"వేదములను సాంగోపాంగముగ చదివినప్పటికిని, సమస్త విద్యలయందును ఆరితేరినప్పటికిని, అనర్గళముగ కవిత్వము చెప్పగలిగి యున్నప్పటికిని, భగవంతుని పాదపద్మము

లందు మనస్సు సంలగ్నము కానిచో, వానివలన మనుజున కేమి ప్రయోజనము?''—అని శ్రీ శంకర భగవత్పాదా చార్యులవారు ఉద్ఘోషించియున్నారు.

ఏది చావును తప్పించగలదో అదియే నిజమగు విద్య. ఏది బంధమునుండి విడిపించగలదో అదియే నిజమగు శాస్త్రము. తక్కినవి యన్నియు 'భుక్తయే న తు ముక్తయే' అనునట్లు భుక్తికి ఉపయోగపడునవియే కాని ముక్తికి గాదు. అయితే భుక్తిమార్గమును చూచుకొనకూడదని కాదు; ముక్తిమార్గమును గూడ మఱువరాదని చెప్పుటయే యగును. అన్ని సంపదలు, అన్ని విద్యలు ఉండియు, తన ఆత్మను తాను తెలిసికొననిచో, అక్షరపరబ్రహ్మమును గూర్చిన పరిచయము లేనిచో అవి యన్నియు శవాలంకార సదృశములుగనే యుండును. ప్రాణము లేని శవమును ఎంత అలంకరించిననేమి ప్రయోజనము?

ఒక సుందరమైన కార్డు ఉన్నదనుకొనుడు. దాని చుట్టును అనేక నగిషీలు, కత్తిరింపులు, తళుకుబెళుకులు చేయబడినవని ఊహింపుడు. కాని స్టాంపు (బిళ్ళ) అతికించకుండ దానిని పోస్టులో వేసినచో గమ్యస్థానమును చేరునా? చేరదు. అతిసామాన్యమైన కార్డు అయినను, స్టాంపుబిళ్ల అతికించినచో ఎన్ని వేల మైళ్లైనను ప్రయాణము సాగించగలదు. అట్లే ప్రాపంచిక చదువు సంధ్యలు లేకపోయినను, పవిత్రత, హృదయనైర్మల్యము, బ్రహ్మానుభూతి గలిగియున్నచో ప్రపంచమున కంతకును అతడు వెలుగును ప్రసాదించగలడు.

తాను తరించి ఇతరులను తరింపజేయగలడు. శాంతిసుఖము లను ఈ జీవితమునందే యనుభవింపగలడు.

నిరక్షరస్యాపి తు యస్య వక్షో
బ్రహ్మైవ చాభాతి స ఏవ సాక్షరః
సర్వాక్షరస్యాపి తు యస్య చిత్తే
బ్రహ్మైవ నాభాతి స వై నిరక్షరః.

'విద్యాగంధము లేకున్నను, ఎవని హృదయమునం బ్రహ్మము భాసించుచుండునో, ఎవడు బ్రహ్మానుభూతి గలిగి యుండునో, ఆతడు సర్వవిద్యాపారంగతుడే యగును. అన్ని విద్యలు తెలిసికొనియున్నను ఎవని చిత్తమందు బ్రహ్మము భాసింపకుండునో ఆతడు అక్షరశూన్యుడే యగును—' అని తాత్పర్యము. ఇంతమాత్రముచేత లౌకిక విద్యలను చిన్న చూపు చూచిరని యెవరును భావింపరాదు. సంసారతరణ హేతువగు బ్రహ్మవిద్యనుగూడ వానితోబాటు కలిగియుండవల డని ప్రబోధించుటయే యగును. మఱియు రెండింటిలో నేదియో ఒకటిమాత్రము ఏరుకొనవలసిన పరిస్థితి వచ్చినచో 'జరామరణ విమోచనకర' మగు ఈ పరమాత్మ విద్యనే ఎన్నుకొనవలసి యుండును.

ఏలయనగా, జన్మించిన ప్రతివానియొక్క ప్రథమ కర్తవ్యము మఱల జన్మింపకుండుటకు వలసిన సాధన సామ గ్రిని సంపాదించుటయే యగును. దానిని ముందు సంపాదించి అటుపిదప తక్కిన వానినిగూర్చి యోచింపవచ్చును. మహాత్ము లనుసరించు పద్ధతి యిదియే. అట్లుకాక జీవితమంతయు చాకు

షష్టికళల సముపార్జనయందే ముందుగ వినియోగించినచో, అకస్మాత్తుగ మృత్యువాసన్నమైనచో అపుడు మనుజుడేమి చేయగలడు? ఆ విద్యలు వానిని అంత్యకాలమున రక్షించునా? లేక యమబాధలను అవి తప్పించగలవా? లేవు. అట్టి శక్తి ఒక్క బ్రహ్మవిద్యకు మాత్రమే కలదు. కావున అక్షర పరబ్రహ్మమునుగూర్చి, నిజాత్మ తత్త్వమును గూర్చి తెలిసికొనుటకై సత్వరము కృషి సలుపవలయును.

అట్టి బ్రహ్మవిద్యను సంపాదించువ్యక్తి తాను ఏకాలమందును భూతాకాశముగాని, చిత్తాకాశముగాని కాదనియు, అతిసూక్ష్మమై, నామరూపరహితమైనట్టి చిదాకాశమే యనియు చక్కగ గుర్తెఱుగును.

అధ్యాత్మవాఙ్మయమందు మూడు ఆకాశములను గూర్చిన ప్రస్తావన తఱచు వచ్చుచుండును. భూతాకాశము, చిత్తాకాశము, చిదాకాశము అని వాని పేర్లు. పరమార్థ శాస్త్ర విచారణయందు సాధకుడు ఈ మూటిని గూర్చిన పరిచయము తప్పక కలిగియుండవలెను. కాబట్టి వీనినిగూర్చి ఒకింత విచారించుట అవసరము.

మొదటిది భూతాకాశము — పంచమహాభూతములైన పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము — అను ఈ ఐదింటిలో చివరిదియగు ఆకాశము అతిసూక్ష్మమైనది. పృథివికంటె జలము, జలముకంటె అగ్ని, అగ్నికంటె వాయువు, వాయువుకంటె ఆకాశము — ఇట్లు ఒక దానికంటె

మఱియొకటి సూక్ష్మతరములై యున్నవి. మొదటి మూడును అనగా భూమి, జలము, అగ్ని జనులకు గోచరములగు చుండును. తక్కిన రెండు అనగా వాయువు ఆకాశము దృష్టికి గోచరముకాక అత్యంత సూక్ష్మములై యుండును. ఆకాశమునందు శబ్దము, వాయువునందు శబ్దస్పర్శములు, అగ్నియందు శబ్దస్పర్శరూపములు, జలమందు శబ్దస్పర్శరూప రసములు, పృథివియందు శబ్దస్పర్శరూపరసగంధములు — ఇమిడియున్నవి. ఈ భూతాకాశము అనంతమై తనయందు లక్షలకొలది సూర్యచంద్రాదులను, గ్రహ ఉపగ్రహాదులను కలిగి అగణితప్రాణికోట్లకు ఆలవాలమై, నిత్యము పరిణామ శీలమై యొప్పుచున్నది. నేడు ఒక వస్తువునందున్న అణువులు కొద్దిసేపటికే మఱియొకరూపమున ప్రకాశించుచుండును.

దృష్టాంతమునకు, ఈనాడు ఒకని శరీరమందున్న అణువులు ఏడు సంవత్సరములకు పూర్తిగా మారిపోవ దేహము నూతన అణువులతో గూడియుండును. ఆ అణువులు ఇతరములైన ఏ పదార్థములందో ప్రవేశించి మరల అట నుండి మారుచుండును. ఈ స్థూలప్రపంచమందు, అనగా ఈ భూతాకాశమందు స్థిరమై, అచంచలమైనట్టి వస్తువు ఒకటిన్ని లేదు. సముద్రమందు తరంగములు నిరంతరము చంచలములై, ఒక తరంగములోని బిందువులు కొంత సేపటికి మఱియొక తరంగములోనికి మారుచుండులాగున ఈ భౌతిక ప్రపంచవస్తువులందును అణువులు నిరంతరము మారిపోవు చుండును. ఈ విశాల బ్రహ్మాండమను మహాసముద్రమున

మనుష్యశరీరము ఒక తరంగము, దేవతాశరీరము మఱియొక తరంగము, కోతి ఒక తరంగము, కుక్క ఒక తరంగము, పక్షి ఒక తరంగము, దోమ ఒక తరంగము, చీమ ఒక తరంగము. ఆ యా జీవరాసులయొక్క భౌతిక శరీరములు దినదినము, క్షణక్షణము మారిపోవుచున్నవి. కాబట్టి భూతాకాశమంతయును, బ్రహ్మాండమునందలి పదార్థములన్నియును నిత్యము పరిణామమును బొందుచు సుడిగుండమునందలి జలమువలె అస్థిరములై, ఏకరూపము లేక యుండుచున్నవి. అందొకానొక పదార్థమే మానవుని ఈ భౌతిక దేహము.

చంచలమై, క్షణికమై, నశ్వరమై, పరిణామశీలమై, మృత్యుగ్రస్తమైన ఇట్టి పంచభౌతికశరీరముపై, అహంభావము, మమత్వము కలిగియుండు మానవుని అజ్ఞానము ఎంత ప్రగాఢమైనదో యోచించుకొనవచ్చును. పైగా విశ్వవ్యాపకమైన ఈ అనంతాకాశములో ఏ మూలనో ఒకచోట నక్కియున్న ఒక చిన్న భూగోళములో ఒక చిన్న దేశములో ఒక చిన్న ప్రాంతములో ఒక చిన్న గృహములో పరిచ్ఛిన్నమై యున్న ఒక చిన్న దేహము మాత్రమే తానని భావించి దానిపై అభిమానముగలిగి రాత్రింబగళ్లు దానినే ఆరాధించుచు విషయభోగములను దానిని భోగబోయుచు జీవితము వ్యర్థముగ గడిపివేయుట ఎంత శోచనీయమగు విషయమో ఆలోచించుకొనవలసియున్నది. కాబట్టి మానవుడు భూతాకాశ వికారమగు ఈ చిన్న జడ దేహము తాను కాదని ఎంత శీఘ్రముగ గమనించిన అంత శ్రేయస్కరము.

ఇక రెండవది చిత్తాకాశము. ఇది భూతాకాశము కంటెను అతిసూక్ష్మమైనది. అతి వ్యాపకమైనది. కనుకనే భూతాకాశమును తనయందు కలిగియున్నది. సర్వజీవుల యొక్క చిత్తములన్నియు చేరి చిత్తాకాశమగును. అనంత చిత్తాకాశ సముద్రములో మానవుని చిత్తము (మనస్సు) ఒక తరంగము, దేవతచిత్తము ఒక తరంగము, జంతువు చిత్తము ఒక తరంగము. సంకల్పములు, (కామక్రోధాది) వికారములు, వాసనలు, సంస్కారములు మొదలైనవన్నియు చేరి చిత్తమనబడును. చిత్తాకాశమందు భూతాకాశము ఇమిడియుండును. కాని పరమార్థమున రెండును జడమైనవే యగును. అట్లే చిత్తమందు దేహము ఇమిడియుండును. కాని వాస్తవముగ చిత్త దేహములు రెండును చైతన్యరహితములేయగును. చిత్తము తనయందలి వాసనలను అనుసరించి పెక్కు దేహములను ధరించుచుండును. స్థూలదేహము మరణించినను సూక్ష్మదేహమగు చిత్తము మరణించదు. అది వాసనానుసారము మఱియొక దేహమును ధరించు చుండును. మలిన వాసనలు, సంస్కారములు, ఉన్నంతవఱకు జీవునకు (చిత్తమునకు) ఈ దేహములు తప్పవు. పుట్టుట చచ్చుట తప్పదు. కాబట్టి ఆత్మవిచారణచేతను, భక్తిజ్ఞాన వైరాగ్యధ్యానాదులచేతను చిత్తమును శుద్ధమొనర్చుకొని, నిర్వాసనాయుక్తముగ చేసికొనిననే జీవుడు చిత్తరహితుడై, అమనస్కుడై, జననమరణాది క్లేశరహితుడై మోక్షము నొందగలడు.

ఇక మూడవది చిదాకాశము. దీనినే ఆత్మయనియు, బ్రహ్మమనియు పేర్కొందురు. ఇది వాస్తవముగ ఆకాశము కాదు. కాని అతిసూక్ష్మమైనదియగుటచే పోలికకు ఆకాశముతో ఉపమానముగ చెప్పిరి. అంతియే కాని ఆకాశమునకును దీనికిని సంబంధము లేదు. భూతాకాశము, చిత్తాకాశము జడములైనవి. చిదాకాశ మొకటియే చైతన్యవంతమైనది. చిదాకాశముయొక్క సన్నిధానముననే భూతాకాశ చిత్తాకాశములు రెండును ప్రకాశించుచున్నవి. (సూర్యుని సన్నిధానముచే చంద్రుడు ప్రకాశించునట్లు.) మఱియు భూతాకాశ, చిత్తాకాశములు రెండును రజ్జువునందు సర్పమువలెను, జాగ్రతునియందు స్వప్నమువలెను చిదాకాశమునందు కల్పితములై యున్నవి. చిదాకాశము నిత్యమైనది, శుద్ధమైనది, చిన్మయమైనది, పుట్టుక చావు లేనిది, శాశ్వతమైనది. అది సత్, చిత్, ఆనందస్వరూపము. జీవుడు ప్రతిబింబము. చిదాకాశరూపమగు ఆత్మ బింబము. బింబము సత్యము. ప్రతిబింబము అసత్యము. జీవుడు బింబరూపమగు తన ఆత్మను (చిదాకాశమును) మఱచి ప్రతిబింబమగు దేహమే (భూతాకాశవికారము) తానని భావించుచు అనాదికాలమునుండి ఈ సంసారచక్రమున తగుల్కొని పరిభ్రమించుచు పలువిధ దేహాదులను ధరించుచు, పుట్టుచు, చచ్చుచు నానాయాతనలను అనుభవించుచు క్రుంగి కృశించుచున్నాడు.

ఇట్టి శోచనీయస్థితి జీవునకు తగదు. ఏనాటికైనను తాను చిదాకాశమగు ఆత్మయే కాని దేహాదులు కాదని దృఢముగ తెలిసికొని జీవుడు బంధమును తెగద్రుంచుకొనవలసియున్నాడు. కాలము స్వల్పము. అవకాశములు తక్కువ. ప్రతిబంధములు ఎక్కువ. ఇట్టి పరిస్థితులలో మహోన్నత మానవజన్మమును బడసి జీవుడు అట్టి సదవకాశమును లభింప చేసిన పరమాత్మకు జోహారులర్పించి జీవితమును కడతేర్చుకొను ఉపాయమును శీఘ్రముగ అన్వేషించవలెను. తాను చిదాకాశస్వరూపమగు ఆత్మయే కాని భూతాకాశస్వరూపమగు ఉపాధి (దేహాదులు) కాదని నిరంతరము స్మరణ చేయుచు, అట్టి ఆత్మనే నిరంతరము భావించుచు మననము చేయుచు ఆత్మస్థితియందు నిలుకడకలిగి మహదానందమనుభవించుటయే జీవితమును కడతేర్చుకొనుటకు ఏకైక మార్గము. అట్టి ఆనందస్థితియే మోక్షము. కావున మోక్ష సంపాదనమునకై సర్వులును యత్నశీలురై మానవత్వమును సార్థకము చేసికొనవలెను.

## మోక్షసంపాదనము

జీవుని వాస్తవస్వరూపము నాశరహితమగు సచ్చిదానందము. అజ్ఞానవశమున అది తెలియఁగబడక, ఆవరణయుక్తమైనదానివలెను, నిద్రాణమైయున్నదానివలెను వర్తించుచున్నది. బ్రహ్మాత్మైక్యవిబోధముచే దానిని మేలుకొలుపవలెను. అపుడే 'పంజరాదివ కేసరీ, యనునట్లు స్వాత్మసింహము

ప్రకృతిశృంఖలమును ఛేదించుకొని స్వతంత్రరూపమున వినిర్గత మగును. ఈరీతిగ ప్రకృతిని విచ్ఛిన్న మొనర్చి జీవునకు స్వస్వరూపప్రాప్తి ద్వారా నిరతిశయానందమును సంప్రాప్తింప జేయునది యగుటచేతనే బ్రహ్మవిద్యకు లోకములో నెంతయో ప్రాధాన్యత యొసంగబడినది.

ఇట్టి అమూల్యమగు నిరుపమమగు అధ్యాత్మికవిద్యను మన పూర్వీక ఋషులు అనేక త్యాగములు గావించి, కష్టములకోర్చి, బహువిధసాధనల ననుష్ఠించి, అనుభూతి మొనర్చుకొని లోకమునకు బోధించిరి.

"స్వయం తీర్ణః పరాంస్తారయతి"
"స్వాత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ"

అనునట్లు అట్టి జ్ఞానముచే తాము తరించినవారై యితరులను గూడ తరింప జేసి తద్ద్వారా సనాతనధర్మమును కార్యాన్వితమొనర్చి ధన్యులైరి. అమ్మహనీయుల పాదరజముచే భారతావని పునీతమాయెను. వారి దివ్యబోధామృతధారలచే సంసిక్తమై యుండుటచేతనే నేటికినిగూడ మన భారతదేశము ప్రపంచమున కంతకును శాంతిసందేశము నివ్వగలుగుచున్నది.

అట్టి మహర్షుల సంతతియందు జన్మించిన మనము మనకు వారు సంపాదించి యిచ్చిన జ్ఞానధనమును పోగొట్టుకొనకుండ చూడవలెను. అపుడే భారతదేశము చిరకాలము

నుండి సముపార్జించుచు వచ్చిన అధ్యాత్మ ప్రతిష్ఠను మనము కాపాడిన వారమగుదుము.

'India is immortal if she persists in her search for God'—అని వివేకానందులు చెప్పినట్లు, తన భగవదన్వేషణ కార్యమును విడువక యున్నచో హిందూదేశము చిరస్థాయియై శాశ్వతకీర్తిని బడయగలదు. లేనిచో పతనమై పోవును. ఋషులుపొందిన పరమసత్యమును, ఆత్మ సాక్షాత్కారరూప మహోన్నతలక్ష్యమును, సర్వులును ప్రయత్నపూర్వకముగ తప్పక సంపాదించవలయును. 'మనము పాపులము కాము, పుణ్యాత్ములము, సచ్చిదానంద స్వరూపులము' అను భావము రూఢిపడవలయును. 'నేను అజ్ఞానిని, పాపిని, అల్పుడను, దుర్బలుడను, నీచుడను' అని యెంతకాలము జీవుడు తలంచుకొనుచుండునో, అంతవఱ కాతనికి వృద్ధియెచట? నిర్భయత్వము, అఖండధైర్యము, 'నేను దేహమునుగాను, మనస్సునుకాను, కేవలము పరబ్రహ్మమును, ఆత్మరూపుడను, అని అనవరతము చింతించుటవలననే కలుగును. వివేకానందుల ఈ క్రింది గంభీరవాక్యముల నాలకింపుడు.

"Ye divinities on earth! sinners! it is a sin to call a man so; it is a starding libel on human nature. Come up, o lions, and shake off the delusion that you are sheep. You are souls immortal, spirits free, blest and eternal; ye are not matter,

ye are not bodies, matter is your servant not you the servant of matter..................."

"It is strength and strength that we want, and the first step in getting the strength is to uphold the Upanishads and believe that I am the Atman,

అనగా, "అవనిపై మూర్తీభవించిన ఓ దివ్యాత్మ స్వరూపులారా! మీరు పాపులా? కాదు కాదు! మనుజుని ఆవిధముగ అనుటయే పాపము. ఆ ప్రకారముగ మనుజుని పాపియనుట మానవత్వముపైననే కళంక మాపాదించినట్లు. ఓ సింహములారా! లెండు! మీరు 'గొఱ్ఱెలు' అను భ్రమను పారద్రోలుడు. శాశ్వతమై, స్వతంత్రమై, ఆనందరూపమైనట్టి ఆత్మయే మీరు. మీరు భౌతిక పదార్థము కారు. ప్రకృతి మీ దాసి; మీరు ప్రకృతికి దాసులు కారు."

"మనకు కావలసినది బలము, బలము! అట్టి బల సంపాదనమునకై చేయవలసిన మొట్టమొదటి పని ఉపనిషత్తులందు అత్యధిక విశ్వాసము గలిగి (వానిని ప్రోత్సహించి) 'నేను ఆత్మను' అని తలంచుటయే యగును."

వివేకానందుల ముఖమునుండి వెలువడిన ఈ గంభీర నిస్వనము ముముక్షువుల కెల్లరకు తప్పక ధైర్యోత్సాహముల గలుగజేయుననియు, వారి ఆధ్యాత్మికసాధనలయొక్క తీవ్రతను ఇనుమడింపజేయగలదనియు తలంచుచున్నాను. అయితే మనుజుడు తాను నిత్యశుద్ధముగు ఆత్మయని ఒకప్రక్క భావించుచు మఱియొకప్రక్క అసురత్వమునకు, పాపాచరణము

నకు చోటీయకుండ చూడవలెను. అట్లుకాక, 'అంతయు బ్రహ్మమే, నేనూ బ్రహ్మమునే' అని చెప్పి యథేష్టాచరణమునకు గడంగకూడదు. అట్లు చేసినచో అది శుష్క వేదాంతము, మెట్టవేదాంతము అగునేగాని పరమార్థానుభవము కానేరదు. ఇవ్విషయమున సాధకు లందరు బహుజాగరూకులై మెలంగవలెను. తమ చరిత్రయందు, ఆచరణమందు ఏ మాత్రము కళంకము రానీయకుండ జాగ్రత్తగా పరిశీలించుకొనుచుండవలెను. లేకున్న తమ సంప్రదాయమునకు, తమ మతమునకు, తమ దేశమునకుగూడ అప్రతిష్ఠ తెచ్చినవారగుదురు.

ఋషులు, మహాత్ములు బోధించినట్టి పైన దెల్పిన స్వారాజ్య (ఆత్మసాక్షాత్కార) రూపమగు పరమలక్ష్యమును ఈ జన్మయందు, ఇపుడే సాధించివేయుట ఉత్తమము. ఏల యనగా యిట్టి సదవకాశములు మఱుజన్మయందు—కాదు కాదు—మరుక్షణమందును లభించునో లేవో చెప్పజాలము. జీవితమూ క్షణికమైయున్నది. కావున అత్యున్నతిశ్రైత్వరలక్ష్మి గడంగవలెను. ఒకవేళ సాధకు తన లక్ష్య ప్రాప్తికి పూర్వమే జీవితము సమాప్తమైనచో, అందు విచారపడవలసిన దేమియును లేదు. మఱుజన్మమున 'శుచీనాం శ్రీమతాం గేహే' అనునట్లు ఉత్తమగర్భమున జనించి మిగిలిన సాధనను పూర్తిచేసికొనవచ్చును. కాబట్టి పుణ్యవంతమగు జన్మగాని, పాపభూయిష్టమైన జన్మగాని, జన్మరాహిత్యముగాని గలుగ జేసికొనుట మన చేతిలోనే యున్నది. మన

చేత లన్నిటికిని కర్తలము మనమే, భోక్తలము మనమే. నేడు చేయు కర్మమును బట్టియే రేపు మనకు ఫలితము కలుగును.

'అవని జల్లిన విత్తులే అదియె పండు
కారణంబును బట్టియే కార్యముండు
చెడ్డ చెడ్డకును మంచి మంచికిని గల్గు
దీని దప్పించుకొనుటకు తెరవులేదు'

కావున ఇపుడే జాగరూకులమై పవిత్రాచరణ గల్గి ఎప్పటికైనను తప్పక పొందియే తీరవలసినట్టి మన జన్మహక్కైన స్వారాజ్యపదమును ఇపుడే పొందుటకు యత్నించి కృతార్థుల మయ్యెదము గాక !

'న మే భక్తః ప్రణశ్యతి'

'న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి'

అనగా 'నా భక్తు డెన్నటికిని చెడడు', 'సత్కార్య మాచరించువానికి దుర్గతి యెన్నటికిని గలుగదు'—అను ఈ ప్రకారములగు భగవంతుని ప్రతిజ్ఞాపూర్వక వచనములను సంస్మరించుకొని, జనులు అఖండ ధైర్యోత్సాహసమన్వితులై, వెనుక చూపులేక, ఆత్మమార్గమున ఇతోధికముగ యత్నించవలయును.

'ఉత్తిష్ఠత ! జాగ్రత ! ప్రాప్య వరాన్నిబోధత' !

మున్నగు ఉపనిషద్వాక్యములు 'అజ్ఞాననిద్రనుండి మేలుకొనుడు ! ఆత్మవిషయమున జాగరూకులై యుండుడు ! మహా

త్ములద్వారా ప్రబోధము నందుడు!' అని జనులను హెచ్చరించుచున్నవి. వాని నాలకించి దైవప్రోక్తములగు ఆ వాక్యములపై అచంచల విశ్వాసము కలిగి తద్రీతి అనుష్ఠించుటకై ఉపక్రమించవలయును. ఎపుడు జనులు తమ లక్ష్యప్రాప్తికై దృఢనిశ్చయులై, సర్వేశ్వరుని యెడల అనుపమ భక్తి కలిగి కార్యమున కుపక్రమించుదురో, అపు డిక ప్రపంచమునందలి ఏ శక్తియు అకార్యమునుండి వారిని నిరోధించుటకు సమర్థము గాజాలదు. మఱియు ఏ జాతివారైనను, ఏమతమువారైనను, స్త్రీలైనను, పురుషులైనను, హిందువులైనను, మహమ్మదీయులైనను, బ్రాహ్మణులైనను, అబ్రాహ్మణులైనను, చండాలురైనను శమదమాది గుణములు గల్గియున్నచో, అపరోక్షాత్మానుభూతి యను చరమలక్ష్యమును సాధించుటకు అర్హులే. బ్రహ్మత్వప్రాప్తి జాతి, నామ, ఆశ్రమాదులపై నెన్నటికిని ఆధారపడియుండదు. యోగ్యతయే ప్రధానము. ఎట్టి నీచకులమందు జన్మించినవాడైనను బాగుగ విద్య నభ్యసించి గొప్ప ఉద్యోగమును సంపాదించినచో, ఆ యుద్యోగమునకు సంబంధించిన అధికార మెట్లాతనికి లభించునో, అట్లే జాతివర్ణాశ్రమము లేవియైన యున్నప్పటికిని, బ్రహ్మనిష్ఠచే బ్రహ్మత్వమును తప్పక పొందగలడు. లేక బ్రహ్మరూపుడే కాగలడు.

దేశములన్నియు నేడు తమ స్వాతంత్ర్య 'హక్కు'నకై యెట్లు పోరాడుచున్నవో, అదేవిధముగ సర్వమానవులును అట్టి తమ నైజస్వారాజ్య 'హక్కు'నకై పోరాడవలసి

యున్నది. తన యాత్మస్వరూపమును బొందుటకు తనకు హక్కు లేదా? భగవత్ప్రోక్తమగు వేదవిద్య నభ్యసించుటకుగాని, లేక భగవంతుని పొందుటకుగాని, భగవంతుని బిడ్డలై యుగుటవలన సర్వమానవులకును గూడ సమానమైన హక్కు గలదు. కావున జాతి మత కుల వివక్షత లేక సాధన చతుష్టయరూప యోగ్యత గలిగియున్నచో, సర్వులును ఈ పరమోన్నతమగు బ్రహ్మవిద్యను బడసి జన్మరాహిత్యమును, నిత్యానందపదవిని అధిష్ఠింపవచ్చును. ఉత్తమ యోగ్యత, అనుష్ఠానము, సదాచరణ, భగవద్భక్తి, అకుంఠిత కార్యదీక్ష యున్నచో, ఇకార్యమున అనగా స్వారాజ్యసంపాదనమున ఎవ్వరికైనను విజయము తప్పక లభింపగలదు.

క్షణికములును అశాశ్వతములును పరమానందప్రాప్తి రహితములునగు స్వల్పస్వల్ప ప్రాపంచికలక్ష్యములకై జీవితములను ధారవోయుటకంటె శాశ్వతమై ఇహాపర శ్రేయోదాయకమై సర్వోన్నతమై నిత్యానందప్రదమైనట్టి బ్రహ్మాత్మైక్యరూప చరమలక్ష్యమును సాధించుటకై యేల ప్రయత్నము సలుపరాదు?

"Better to aim at a lion and miss it, rather than hunt a jackal and catch it"— అను నొక ఆంగ్ల లోకోక్తి గలదు. దానియర్థమేమనిన—వెంటాడి నక్కను బట్టుకొనుటకంటె తప్పిపోయినను సరే సింహమునకే గురిపెట్టుట మంచిది. అట్లే చిన్నచిన్న సాంసారిక లక్ష్యములను

జీవితాంతమువఱకు నట్టి ప్రేలాడుటకంటె పూర్ణశోకశాంతి ఆనందప్రాప్తి గలుగజేయు భగవత్సాక్షాత్కారమునకై యత్నించుట మేలు.

కాని బహుజన్మార్జితములగు ప్రాపంచిక వాసనలు, సంస్కారములు జీవులలో ఘనీభవించియుండుటచే ప్రారంభమునఁనే అకార్యమున విజయము కలుగకపోవచ్చును. కొన్ని యాటంకములు ప్రతిబంధములు కలుగవచ్చును. ప్రయత్నము మందముగానున్నచో, లక్ష్యప్రాప్తికి కొన్ని జన్మలైనను పట్టవచ్చును. తీవ్రముగనున్నచో, ఈ జన్మయే చాలును. ఏది యెట్లున్నను గమ్యము చేరువరకు ప్రయత్నమును మాత్రము వీడరాదు.

ప్రారభ్యతే న ఖలు విఘ్నభయేన నీచైః
ప్రారభ్య విఘ్నవిహతా విరమన్తి మధ్యాః
విఘ్నైర్ముహుర్ముహురపి ప్రతిహన్యమానాః
ప్రారబ్ధముత్తమగుణా న పరిత్యజన్తి.

అని భర్తృహరి వచించినట్లు అధములు అసలు సత్కార్యమును ప్రారంభింపనే ప్రారంభింపరు. మధ్యములు ప్రారంభించి విఘ్నములు వచ్చుసరికి దానిని వదలివేయుదురు. కాని ఉత్తములో ఎన్ని విఘ్నములు పదేపదే సంభవించినప్పటికిని, ఎన్ని ప్రతిబంధములు, ఇక్కట్లు దాపురించినప్పటికిని, ప్రారంభించిన సత్కార్యము నెన్నటికిని విడనాడరు. అయితే మనస్సను ప్రబల శత్రువును నిర్జించుటకు, ఆ గొప్ప ఆసురీశక్తి నెదుర్కొనుటకు ద్విగుణీకృతమగు దైవికశక్తి

అవసరము. సర్వేశ్వరుని యెడల నిర్మలభక్తి గలిగియున్ననే అయ్యది సాధ్యమగును. ఏలయనగా,

'మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరమ్'

అని చెప్పబడుటవల్ల ప్రకృతిరూపమగు మాయ ఈశ్వరునికి అధీనమైయున్నదిగావున ఆ మాయను జయింపవలెనన్న మాయాధీశుఁడగు ఈశ్వరుని యనుగ్రహము తప్పక పొందియేతీరవలెను. అదియో నిష్కామకర్మ, భక్తి మున్నగువానిచేతనే కలుగును. కాబట్టి హృదయపూర్వకముగ సర్వేశ్వరుని నిర్మలభక్తితో నారాధించుచు, వైరాగ్య, వివేక, విచారణాదులుగలవారై, శ్రద్ధతో ఆధ్యాత్మిక సాధనలను కొనసాగించిన, అచిరకాలములోనే ప్రతిబంధములన్నియు పలాయనములై పోయి లక్ష్యము చిరతలాభముగ గోచరించును. అత్తరి, దేనిచే జీవరాసులన్నియు బంధింపబడినవై సత్యవస్తువు నెఱుఁగజాలకున్నవో, నది యున్నదానిని లేనిదిగను, లేనిదానిని ఉన్నదిగను కల్పించి సంసారమొందుచున్నదో, అట్టి దురతిక్రమమగు మాయ క్షణకాలములో జీవునకు బేషరతుగ లొంగిపోవును. (Unconditional surrender of Maya) అట్టి స్థితియే మోక్షము. అదియే స్వారాజ్యము.

స్వారాజ్యప్రాప్తికై భారతీయులు ఎన్నియోవత్సరములు అనేక యిడుములఁ బడవలసివచ్చెను. లాఠీదెబ్బలను, ఫిరంగిగుండ్లను సహింపవలసి వచ్చెను, పెక్కు త్యాగములు గావింపవలసి వచ్చెను. అట్టిచో నిక స్వారాజ్యరూపమగు

బ్రహ్మత్వప్రాప్తికై ఎన్ని కష్టముల నోర్వవలెనో, ఎంత సాహసము చూపవలెనో, ఎన్ని త్యాగముల జేయవలెనో యోచించుకొనుడు ! ఒక చిన్న యుద్యోగమును సంపాదింపవలెనన్నగాని, ఒక పరీక్ష ప్యాసుకావలెనన్నగాని రాత్రింబగళ్లు జనులు కృషి చేయుచున్నారు కదా! ఇక ఎద్దానియందు గంధర్వ, ఇంద్ర, బ్రహ్మదేవుల సంపదయు, ఆనందమున్ను లవలేశములే అయియున్నవో, అట్టి బ్రహ్మానందపదవి నలంకరించుటకై అధిక ప్రయత్నమేల చేయరాదు?

కావున ఘోరతమస్సునందు కూలద్రోయు నాస్తికుల ప్రలాపములకు చెవియొగ్గక, నిర్భీకులై సత్యమార్గమున, ఆత్మమార్గమున జనుదురుగాక! త్రోవలో దుఃఖములు వచ్చునా?—అవియున్నియు సుఖములే? అనంతానందపదవి నొందబోవుచుండే మార్గమున తగులు శ్రమ శ్రమకాదు. శ్రేయమేయగును. ఇక భయము దేనికి? మృత్యువునకా? అది జీవులను పిలువకమునుపే, జీవులే తమపని పూర్తిచేసికొని దానిని ఆహ్వానించుస్థితిలో బాగుగ తయారైయున్నచో ఇక అది వారల నేమిచేయగలదు? చేయవలసినపని (ఆత్మజ్ఞానసంపాదనము) పూర్తి అయినచో ఇక మృత్యువు వచ్చిన నేమి, రాకున్న నేమి? 'మృత్యుస్తం న జిఘాంసతి' అనునట్లు అట్టి కృతకృత్యు నిక మృత్యువు హింసింపజాలదు. మఱియు 'మరణం మంగళం భవేత్' అనులాగున అట్టి మరణము మంగళమే యగును. కాబట్టి నిర్భయచేతస్కులై, గమ్యస్థానమగు పరమాత్మను చేరువరకు వెనుకకు మరలక, భక్తి,

జ్ఞానవైరాగ్యాది సాధనసంపత్తితోఁగూడి, ధైర్యోత్సాహములతో ఆత్మమార్గము ననుగమించుచు, సర్వేశ్వరుని కృపచే ఈజన్మయందే, జన్మహక్కైనట్టి స్వారాజ్యము (మోక్షము)ను సంపాదించి జనులు కృతకృత్యులు కావలయును.

'అథాఽస్మాకమలం మోహైరాత్మా బ్రహ్మేతి నిర్భయాః'

'దేహేంద్రియమనంబులకు సాక్షియై విలసిల్లు ఈ ప్రత్యగాత్మయే పరబ్రహ్మము! కాబట్టి దానిని తెలిసికొని నిర్భయులై యుండుడు' అని యీ ప్రకారముగ మహాత్ములగు గురువులు, ఋషిసత్తములు ప్రబోధించిన వేదాంతడిండిమము,—అద్వైతజయభేరి అప్రతిహతనాదంబున జనుల కర్ణగోళములందు నిరంతరము ప్రతిధ్వనించుచు కర్తవ్యమునకై పురిగొల్పుగాక! ఆ దివ్య నిస్వనము దశదిశలు పిక్కటిల్లునట్లు ముఖరితమై ఎల్లెడల వ్యాపించి, జనుల హృదయాంతరాళములను ఆత్మోన్ముఖమగునట్లు ప్రభావితమొనర్చుగాక!

—

# 4 వ అధ్యాయము

## మోక్షప్రాప్తికై ఎప్పుడు ప్రయత్నించవలెను?

ఋషులు ప్రబోధించిన మహోన్నతమగు అట్టి మోక్షస్థితిని బడయుటకొఱకై జనులు శీఘ్రముగ యత్నము సలుపవలెనేకాని ఏమాత్రము విలంబనము చేయరాదు.

సామాన్యముగ వార్ధక్యములో ఎక్కువమంది మనస్సు స్వతః దైవకార్యములందు ప్రీతిగొనుచుండును. ఏలయనగా, ప్రపంచములోని భోగ్యవస్తుజాల మంతయును అనుభవించి అనుభవించి, విసుగు జనింప, దానినుండి మరలి దైవమువైపునకు వారు తిరుగుదురు. గృహస్థకార్యములందు దారాపుత్రాదులందు, ధనధాన్యగోక్షేత్రాదులందు, ఏదో సుఖము, శాంతి కలదని భ్రమించి పరుగిడినవారికి ఎదురుదెబ్బలు తగులగా, దానినుండి చల్లగా మరలుదురు. ప్రవృత్తిని తగ్గించి నివృత్తిని చేబట్టుదురు. మఱియు ఉద్యోగములనుండి రిటైర్ (Retire) అగుదురు. కావున బోలెడు సమయము వారికి మిగులును దైవచింతనకు.

ఈ ప్రకారముగ వార్ధక్యమున మాత్రము దైవాన్వేషణ చేయుట అసలు లేనిదానికంటె మంచిదే అయినను అది చాలదు. ఏలయనిన ఆ సమయమున ఇంద్రియము లన్నియు శక్తిని గోల్పోయి దుర్బలములై భగవద్ధ్యానము

నను, దైవస్మరణ విచారణాదులకు, తీవ్రతర సాధనలకు బాగుగ నుపయోగపడకుండును.' విస్తరిసిండ పంచభక్ష్య పరమాన్నములు వడ్డించి రాక్షసులకు పెట్టి, వారు తినగా మిగిలిన పదార్థములను, ఎంగిలి విస్తరాకును దేవతలకు సమర్పించినట్లుగా నుండును వార్ధక్యమున ధ్యానము ప్రారంభించుట. ఈ శరీరమును విస్తరిలోగల బలసత్వమును, బలవీర్యాదులను బాల్యయౌవనకాలములలో కామక్రోధాది రాక్షసులకు నివేదించి, వారు పీల్చి పిప్పిచేసినపిదప ఆ నిర్వీర్య దేహమును వార్ధక్యములో భగవానున కర్పించిన ఎట్లుండును? అయినచో దీనియర్థము వార్ధక్యములో దైవచింతన చేయరాదని కాదు; చేయవచ్చును (శుభము ఒకింతైనను మంచిఫలితమే యగును). కాని అది చాలదు. 'సర్వేషు కాలేషు మామనుస్మర' ఎల్లకాలములయందు నన్ను స్మరింపుము) అను శ్రీకృష్ణుని ఆదేశమున కది సరిగా సరిపోయుండదు. నిజముగ విచారించినచో ఈ భగవత్కార్యము, ఈ దైవధ్యానము, ఈ పరమార్థసాధన బాల్యయౌవనములందే పూర్తిచేయవలసి యున్నది. అప్పుడు మంచి ఆరోగ్యము, శక్తిసామర్థ్యములు, ఇంద్రియ పటుత్వము, జ్ఞాపకశక్తి, ధీరత్వము ఉండును. వయస్సు పెరిగినకొలది అవి క్రమక్రమముగ తగ్గిపోవుచుండును.

నాటియు జీవితము క్షణభంగురము కనుక వార్ధక్యమనునది రాకపూర్వమే కొందఱికి అది అంతము కావచ్చును. అత్తఱి ఇక జీవుడు సాధించినది ఏమియుండును?

అమూల్యమగు ఈ మానవ జీవితము నిష్ఫలమైపోవు[illegible] గదా! కనుకనే బాల్యయౌవన వార్ధక్యములందును, [illegible] కాల సర్వావస్థలయందును భగవత్స్మరణ చేయు[illegible] గీతయం దాదేశింపబడినది. ఒకానొక భక్తుడు భగవ[illegible] ఈ ప్రకారముగ ప్రార్థించెను—

దేవ త్వదీయ పదపంకజ పంజరాన్త
మద్యైవ మే విశతు మానసరాజహంసః
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః
కంఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే.

"దేవా! నీ పాదపద్మములందు నా మనస్సను [illegible] హంస ఇప్పుడే ప్రవేశించుగాక! ఏలయనిన, ప్రాణప్రయాణ సమయమున కఫవాతపిత్తములచే కంఠము నిరుద్ధమగు[illegible] నిన్ను గూర్చిన స్మరణ అప్పుడు సంభవింపదు". కావున శరీ రము ఆరోగ్యముగ నున్నపుడే, ఇంద్రియములు వికల[illegible] కాకపూర్వమే, యౌవనము క్షీణించకమునుపే, పరిస్థి[illegible] అనుకూలములుగ నున్నపుడే జీవితలక్ష్యమగు పరమా[illegible] సాక్షాత్కారమునకై మహత్తరమగు యత్న మొనర్చ వలయును.

ప్రాప్తేన యేన నో భూయః ప్రాప్తవ్యమవశిష్యతే
తత్ప్రాప్తౌ యత్నమాతిష్ఠేత్కష్టయాపి హి చేష్టయా. (వసిష్ఠ[illegible])

"దేనిని పొందినచో ఇక పొందదగినది ఎద్దియు[illegible] మిగిలియుండదో, అట్టి ఆత్మప్రాప్తికై కష్టపడియైనను ప్రయత్నము చేయవలయును" అని వసిష్ఠమునీంద్రులు శ్రీరాము[illegible]

చంద్రునకు హితము చెప్పిరి. మరల మరల దైవవస్తువును చింతన జేయుటవలన అభ్యాస ప్రాబల్యముచే మనుజుడు దైవమునే పొందుచున్నాడు. దీనికే 'అభ్యాస యోగమ'ని గీతాచార్యుడు పేరుపెట్టెను.

అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచిన్తయన్. (8-8)

"ఓ అర్జునా! మనస్సును ఇతర విషయములపై జోర నీయక, అభ్యాసయోగము నవలంబించి, పరమాత్మను మరల మరల చింతన జేయుచుండినచో మనుజుడు దివ్యమగు ఆ పరమపురుషుని (భగవానుని) తప్పక పొందగలడు" అని చెప్పుటవలన ధ్యానమును, దైవచింతనను జీవితములో ఎల్ల వేళలందును కొనసాగ అభ్యసించిననే తప్ప మాయాబంధము నిర్మూలింపబడ నేరదని తేటతెల్లమగుచున్నది. కర్మయోగము, భక్తియోగము, జ్ఞానయోగము మొదలగునవికాక మఱి యొక క్రొత్తయోగమునుగీతయందు భగవానుడుసృష్టించెను. అదియే 'అభ్యాసయోగము'. పై యోగములన్నియు ఈ అభ్యాసయోగముతో కూడిననే వన్నెకెక్కును. ఇది ప్రత్యేకమగు ఒక యోగము కాదు. అన్ని యోగములతో చేరియుండి అనుష్ఠానమును ద్విగుణీకృత మొనర్చు క్రియయే ఈ అభ్యాసయోగము.

జీవితమంతయు ఏ క్రియ నభ్యసించుదురో, అదియే సంస్కారరూపముగ నేర్పడి అంత్యకాలమున అక్కఱకు వచ్చును. జీవితములో ఒక్కపర్యాయమైనను దైవచింతన

చేయనివానికి తుదిఘడియలయందు దైవస్మరణ కలుగదు. కనుకనే గీతాచార్యుడు 'సర్వేషు కాలేషు'—ఎల్లవేళలయందు తన్ను స్మరింపవలసినదిగా ఆదేశించెను. గాంధి మహాత్మునకు దేహావియోగసమయమున 'హే రామ్' అను రామనామ స్మరణ యెట్లు సంభవించినది? జీవితకాలమున సమయము దొరికినపుడెల్ల 'రఘుపతి రాఘవ రాజారాం, పతితపావన సీతారాం' అను పావన నామమును స్మరించుచుండుటవలన. కావున భగవత్స్మరణను అంత్యకాలము వఱకు ఆపియుంచక, వార్ధక్యము వఱకు వాయిదా వేయక విజ్ఞులగువారు ఇప్పుడే దానిని ప్రారంభించి ప్రణవాది దివ్యమంత్రములను, పవిత్రములగు భగవన్నామములను సదా సర్వకాలములందును జపించుచు, స్మరించుచు, భావన చేయుచు పాదప్రక్షాళన మొనర్చుకొని, హృదయశుద్ధిని బడసి జీవితకాలమునందే సర్వోత్తమ బ్రహ్మపదవి నలంకరించవలయును.

ఏ వస్తువైనను ఉన్నపుడు దానివిలువ తెలియదు. కంటియొక్క విలువ కన్నున్నప్పుడు అంతగా తెలియదు, గ్రుడ్డివాడు నేత్రములయొక్క విలువను చక్కగా అంచనా వేయగలడు, చేతులవలనను, కాళ్ళవలనను జనులు ఎంత లాభమును పొందుచున్నారో ఇపుడు తెలియదు. వాటికి వైకల్యము సిద్ధించినపుడు తెలియును. ఆరోగ్యముయొక్క విలువ అనారోగ్యము కలిగినపుడు బాగుగ తెలియగలదు. సూర్యునియొక్క విలువ పగలు గుర్తెఱుంగువారు చాల

అరుదు. రాత్రి చీకటిలో అవస్థపడునపుడు ఆ సూర్యుడు లోకమున కెంత ఉపకారము చేయుచున్నాడో చక్కగ అనుభూతమగుచుండును. అట్లే శరీర మున్నపుడు దాని విలువ యెంతటిదో మనుజుడు గ్రహించుట లేదు. అది పోయిన పిదప బాధ నొందుచున్నాడు. ఎన్నియో జన్మలు దాటి సుకృతవశమున మానవుడై పుట్టుచున్నాడు జీవుడు.

కదాచిల్లభతే జన్తుర్మానుష్యం పుణ్యసంచయాత్.

అని గరుడపురాణమున విష్ణుభగవాను డీ విషయమును గరుత్మంతునకు తెల్పియుండెను. కావున మానవజన్మ దుర్లభము. కాదు సుదుర్లభ మనియే చెప్పవలసియున్నది. మోక్షమునకు సోపానమువంటిదిది. పూర్వము సృష్ట్యాదియందు చతురాననుడు (బ్రహ్మ) వృక్షములను, సరీసృపములను, పశువులను, పక్షులను, మత్స్యాదులను సృజించియు వానిచే నేమాత్రము సంతుష్టిని బొందకయుండెను. కాని తదుపరి మనుజుని సృష్టించి పరమానందభరితు డయ్యెనట! ఏల? బ్రహ్మావలోకనమునకు వలసిన బుద్ధిబల మాతనికి మాత్రమే కలదు. తక్కిన జీవరాసుల కది లేదు. ఆ బుద్ధిబలమును సదుపయోగ మొనర్చుకొని పరమార్థ లక్ష్య ప్రాప్తియందద్దానిని వినియోగించినపుడు మాత్రమే అది సఫలమగును. లేనిచో, అదియున్నను లేనిదానితో సమానమే యగును. కాని మనుజుడట్లు చేయుచున్నాడా? మోక్షసౌధారోహణమునకు భగవానుడొసంగిన ఈ చక్కని సోపానమును మనుజుడు సదుపయోగ మొనర్చుకొనుచున్నాడా? 'హరి' ద్వార

మును చేరుటకు యత్నించుచున్నాడా? లేదు. 'అరి' ద్వారముననే తట్టుచున్నాడు. దేవునికొఱకు దేహమును వినియోగించుచున్నాడా? లేదు. దేహముకొఱకే దేవుని ఉపయోగించుకొనుచున్నాడు. ఈ ప్రకారముగ అమూల్యమగు సదవకాశమును భ్రష్టమొనర్చుకొని విషయవ్యామోహయుక్తుడై ఉన్నత శిఖరములనుండి క్రమక్రమముగ దిగజారిపోవుచున్నాడు. చిన్మయుడుగా వెలుగొందవలసియున్న యీతడు మృణ్మయముగ తయారగుచున్నాడు. ఇది చాల శోచనీయము. అతని దౌర్భాగ్యస్థితిని శాస్త్రము లెంత చక్కగ వర్ణించియున్నవో చూడుడు—

స్థాల్యాం వైడూర్యమయ్యాం పచతి తిలఖలం చాందనైరింధనాద్యైః
సౌవర్ణైర్లాంగలాగ్రైః విలిఖతి వసుధామర్కతూలస్య హేతోః
ఛిత్వా కర్పూరఖండాన్ వృతిమిహ కురుతే కోద్రవాణాం సమన్తాత్
ప్రాప్యేమాం కర్మభూమిం న భజతి పురుషో యస్తపో మందభాగ్యః.

'వజ్రవైడూర్యములతో పొదగబడిన పాత్రయందు తెలకపిండిని ఉంచి చందనపు కట్టెలతో దానిని వండుచున్నాడు! జిల్లేడుచెట్లు పైరుచేయుటకొఱకు బంగారపు నాగలితో పొలమును దున్నుచున్నాడు! ఆరికపైరును సంరక్షించుటకొఱకు అరటికొమ్మలను నఱికి పొలముచుట్టు నాటుచున్నాడు! అట్లే కర్మభూమియగు భూలోకమున జన్మించియు ఎవడు తపస్సు నాచరింపడో, దైవమును సాక్షాత్కరించుకొనుటకు యత్నింపడో, ఉత్తమమగు ఈ మానవశరీరమును తుచ్ఛవిషయభోగానుభవమునందును,

నశ్వర ప్రాపంచిక వస్తుసంపాదనమునందునే మాత్రము విని యోగించునో, అట్టివాడు మందభాగ్యుడే యగును!' అని శాస్త్రము లుద్ఘోషించుచున్నవి. మహాత్ములున్ను హెచ్చరిక చేయుచున్నారు.

కాబట్టి భగవానుడు కరుణించి మానవదేహమును చక్కని ఉపకరణముగను మనకొసంగినాడు, అది శిథిలము కాకపూర్వమే దానివలన ఎంత పారమార్థికలాభమును పొందగలుగుదుమో అంత పొందియే తీరవలెను. ఇట్టి మహావకాశములు మరి ఏ యితర లోకమునను, ఏ యితర జన్మయందును కూడ లభింపవు. గాలి ఉన్నప్పుడే తూర్పార బట్టవలెను. దీపమున్నప్పుడే ఇల్లు చక్కబెట్టుకొనవలయును.

Strike the iron when it is hot.

'ఇనుము వేడిగా నున్నప్పుడే దానిని సాగదీయవలెను' చల్లబడినచో కీలుపడదు. కావున దేహముయొక్క విలువను దేహమున్నప్పుడే బాగుగ తెలిసికొని, దానిచే చక్కటి సాధనలు గావించి చెఱకునుండి రసమువలెను, పాలనుండి వెన్నవలెను, పంచకోశాంతర్గతమగు పరమాత్మను అందుండి వెలికితీయవలెను (సాక్షాత్కరించుకొనవలెను).

ఏలయనగా, జీవితము క్షణభంగురమైనది. ఎత్తైన చెట్టుకొమ్మయొక్క చివరిభాగమునగల ఆకుకొనయందు వ్రేలాడు మంచుబొట్టువలె శరీరము ఏక్షణమున కాక్షణము రాలుటకు సిద్ధముగనున్నది. ఆయువను కొండలు పెనుగు

చవితో పోల్చిరి. మఱికొందరు కప్పయొక్క కంఠచర్మముతో దాని నుపమించిరి. కొందఱు మెఱుపువలె అతిచంచలమని సాదృశ్యము చెప్పిరి. కావున దీనిపై విశ్వాసము తగదు. చేయుదగిన పారమార్థిక కార్యములన్నింటిని బాల్యయావనములందే పరిసమాప్తము గావించి వేయవలెను. ఆరోగ్యము, ఇంద్రియసౌష్ఠవము, సదవకాశములు తీవ్రముగ ఆచరింపవలెను. వార్ధక్యములో జ్ఞాపకశక్తి తగ్గిపోవును. ఇంద్రియములు సడలిపోవును. శక్తి క్షీణముఖము పట్టును. అట్టితఱి తీవ్రసాధన లొనర్చుటకు అనుకూల్యత ఏర్పడదు.

కాబట్టి—

గృహీత ఇవ కేశేషు మృత్యునా ధర్మమాచరేత్.

అని పెద్దలు చెప్పినట్లు—మృత్యువు జుట్టుపట్టుకొని యున్నట్లు భావించి, ధర్మము నాచరింపవలెను. వాస్తవముగ నిది అతిశయోక్తి కాదు. యథార్థమే. కనుకనే శ్రీ శంకరాచార్యులవారు భగవంతుని గూర్చి ఈప్రకారముగ ప్రార్థించిరి.

రోగా ఘటన్తి సతతం ప్రబలాశ్శరీరం
కామాదయోఽప్యనుదినం ప్రదహన్తి చిత్తం
మృత్యుశ్చ నృత్యతి సదా కలయన్ దినాని
తస్మాత్త్వ మద్య శరణం మమ దీనబన్ధో.

"ఓ దీనబంధూ! భయంకరములైన రోగములు నా శరీరమును నిరంతరము సతమతము చేయుచున్నవి. కామక్రోధాదులు చిత్తమును దహించివేయుచున్నవి. మృత్యువు నాముందు నాట్యము సలుపుచు రోజులు లెక్కపెట్టుచున్నది.

కాబట్టి ఇపుడు నీవే నాకు శరణ్యము." పచ్చికుండలోని నీటివలె అయువు నశించిపోవుచున్నది. నూతన యౌవనశోభ మెఱుపువలె చంచలముగా నున్నది. వార్ధక్యము ఆడ సింహమువలె పరుగిడి వచ్చుచున్నది. కావున ఇపుడు నీవే నాకు శరణ్యము!" (శ్రీ) శంకరుల వాక్యములు వాస్తవికతను ప్రతిబింబింపచేయుచున్నవి. ప్రతిజీవియు 'మృత్యుసంసార ము'న తగుల్కొనియున్నాడు. కావున దానినుండి తప్పించుకొను తెఱవు యోచించుకొనియే తీరవలెను. తానీ ప్రపంచమున ఎన్ని భోగభాగ్యముల ననుభవించినను, మహావైభవములను కండ్లజూచినను, అవియన్నియు బంధనమధ్యమున తా ననుభవించినవే యగును. కాబట్టి విషయవిరక్తిగలిగి, భక్తిజ్ఞాన వైరాగ్యాది ముక్తిసాధనలను త్వరితముగ నాచరించి తరించవలెను.

'ఉత్తిష్ఠత జాగ్రత!' అని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. Awake, arise-లెండు మేలుకొనుడు! అని మహనీయులు ఉద్ఘోషించుచున్నారు. జన్మజన్మాంతరము అజ్ఞాన తమస్సునబడి నానాయాతనలు జెందుచు మత్తుగ కాలము గడుపుచున్న జీవరాసులనుగూర్చి మహాత్ములివ్విధముగ హెచ్చరిక చేయుచున్నారు. కావున వారి యీ వాక్యములను శ్రద్ధతో నాలకించి (మోహ) నిద్రనుండి లేచి మత్తును పారద్రోలి, సద్గురువుల సన్నిధికేగి ముక్తిమార్గములను వెతకికొనవలెను. శాశ్వత శాంతికై ఉపాయములను అన్వేషించవలెను.

మోక్షాధీశుడగు పరమేశ్వరుని శరణుబొందుటయే శాంతిసుఖముల బడయుటకు ఏకైకమార్గము. ఈ మార్గము నవలంబించియే యెందఱో మహనీయులు పూర్వము తరించి యుండిరి, తరించుచున్నారు, తరింపగలరు. అనంతానంద మొసంగునట్టి పరమేశ్వరుని జను లేల శరణుబొందరాదు? క్షణిక భోగవిలాసములందు జీవితములను ధారపోయనేల? ఎంతయో పుణ్యమను డబ్బును వెచ్చించి ఈ మానవశరీర మను నౌకను జీవుడు కొనియున్నాడు. నౌక ఎల్లకాలము చక్కని స్థితిలో నుండునా? ఉండదు. కొంతకాలమునకు చిల్లులుపడును, శైథిల్యము నొందును. అట్లు కాకపూర్వమే సముద్రమును దాటివేయవలెను. నావ చక్కని స్థితియం దున్నపుడే నావికుడు జాగరూకుడై దాటవలసిన జలమును దాటివేయవలసియున్నది.

మహతా పుణ్యపణ్యేన క్రీతేయం కాయనౌ స్త్వయా
పారం దుఃఖోదధేర్గన్తుం తర యావన్నభిద్యతే.

మహత్తర పుణ్యమను ఖరీదు చెల్లించి కొనినటువంటి ఈ మానవదేహము శిథిలము కాకపూర్వమే సంసారమను దుఃఖసాగరమును జీవుడు తరించవలెను. బాల్యము ఎంత త్వరితముగ దాటిపోయి యౌవన మేతెంచుచున్నది. 'ఆహా! యౌవన వైభవమెంత ఆహ్లాదముగనున్నది!' అని అనుకొను చుండగనే శరీరము ముడుతలుపడ నారంభించుచున్నది, జుట్టు తెల్లబడుచున్నది. పండ్లు ఊడుచున్నవి, చూపు తగ్గు చున్నది. వ్యాధులు బాధించుచున్నవి. క్రమముగ 'వార్ధ

క్యము జోరబడి తాను ముందుబోవుచు 'ఓయీ! మృత్యువా! ఇక నీవు వెనుక రావచ్చును' అని అంతకుని ఆహ్వానించుచున్నది. ఈ సన్నివేశమునే విష్ణుభగవానుడు పూర్వము గరుత్మంతునకు ఈప్రకారముగ చక్కగ వర్ణించి చెప్పెను—

జరా దర్శితపన్థానం ప్రచండ వ్యాధిసైనికమ్
మృత్యుశత్రు రధిష్ఠో౽సి త్రాతారం కిం న పశ్యసి.

(గరుడపురాణము)

“వార్ధక్యము దారిచూపుచుండ భయంకరరోగములను సైనికులతోగూడి మృత్యువను శత్రువు నీ మీదికి దండెత్తి వచ్చుచున్నాడు. రక్షించువానికొఱకు ఏల ప్రయత్నించుట లేదు?”

కావున అశాంతికరమగు ఈ సంసారవాతావరణంలో పడియున్న జీవుడు భగవచ్ఛరణాగతిద్వారా, ఆత్మానాత్మ వివేచనద్వారా శాంతికి మార్గము అతిశీఘ్రముగ వెతకవలసియున్నది. భావికాల శ్రేయస్సునుగూర్చి యోచించవలసియున్నది. వర్తమానకాలమును మాత్రము చూచునది పశువు. భూతభవిష్యత్తులనుగూడ చూచువాడు మానవుడు.

ఎన్నియో జన్మలు ఇప్పటికి గడచినవి. అజాగ్రత్తగనున్నచో ఇంకను ఎన్నియో జన్మలు రానున్నవి. ఈ అనంత జీవితము ఒక పెద్ద గొలుసువలె నున్నది. ఒక్కొక్క జన్మ ఒక్కొక్క రింగువంటిది. వెనుకటి జన్మలు దాటిపోయినవి. కావున వానిని మనమేమియు చేయజాలము. రానున్న జన్మలు మాత్రము ఇపుడు మన చేతిలో నున్నవి. వానిని

అంత మొనర్చుటకు తగిన శక్తి సామర్థ్యములు మానవునకు కలవు. శమదమాది సాధనసంపత్తిని అలవఱచుకొని వైరాగ్యము, భక్తి మొదలగు దైవగుణములను పెంపొందించుకొని క్రమముగ జ్ఞానాగ్నిని రగుల్కొలిపినచో 'కర్మ' కట్టెలన్నియు దగ్ధములుకాగా ఇక భవిష్యజ్జన్మలకు పూర్ణ విరామము (Fullstop) ఏర్పడి జన్మరాహిత్యము సిద్ధించ గలదు. కావున శరీరము ఆరోగ్యముగ నున్నపుడే, వార్ధక్యము రాకపూర్వమే, ఇంద్రియముల శక్తి క్షీణించక మునుపే, ఆయుస్సు క్షయించకముందే తన శ్రేయస్సును గుఱించి తాను బాగుగ యోచించుకొనవలెను. అట్లుకాక 'ఇప్పుడేమి తొందఱ, ఇంకను పిల్లలకు వివాహమే కాలేదు. వారి చదువులు పూర్తికాలేదు, వారికి ఉద్యోగములు రాలేదు, నేనింకను 'రిటైర్' కాలేదు...' ఈ ప్రకారముగా పరమాత్మధ్యానమునకు మీనమేషములు లెక్కించుకొనుచుండినచో మహాప్రమాదము ఘటిల్లగలదు.

కావున విజ్ఞుడగువాడు బాగుగ యోచించి అమూల్యమగు ఈ మానవజీవితమును భోగములందుగాక యోగమునందే వినియోగించి గురూపదిష్టమార్గముద్వారా ఆత్మజ్ఞానమును శీఘ్రముగ సంపాదించి జన్మసాఫల్యమును బొందవలెను. భగవంతుని పాదపద్మములను ఆశ్రయించి భవరోగమును బాపుకొనవలెను. అతిసూక్ష్మరూపుడును, నిర్మలుడును, విశ్వాధారుడును నగు పరమాత్మను తన హృదయమందు క్షణకాలమైనను ధ్యానింపనివాని జీవితము నిరర్థకమే యగు

నని పూర్వము శుకులవారు అనతిచ్చియుండిరి. ప్రాపంచిక భోగవిలాసములందు నిమగ్నుడు కాని మనుజుని జీవితము వ్యర్థమని రంభ పలుకగా, ఆమె వాక్యములను ధిక్కరించి శుకులు పైవిధముగా పలికిరి. శుకుని వాక్యములు పరమసత్యములు. రంభ పలుకులు అజ్ఞానిభావమునే ప్రతిబింబింపజేయుచున్నవి. శుకుని వాక్యములు శాస్త్రసమ్మతములై జ్ఞాని యొక్క భావమునే వ్యక్తమొనర్చుచున్నవి. అజ్ఞాని మాయకు లోబడియున్నందున దృశ్యపదార్థములనే సత్యమని నమ్మి, విషయానందమునే తన జీవితలక్ష్యముగ నొనర్చుకొనుచున్నాడు. బాగుగ విచారించి చూచినచో అ విషయములందలి సుఖము కేవలము మనఃకల్పితముగనే తేలుచున్నది.

"రోగశాంతికరకృత్యము భోగమనంగ జెల్లునే"

అని భర్తృహరి ప్రశ్నించుట చాల సమంజసముగనే యున్నది. ఆకలి, దప్పిక మొదలగు వ్యాధులకు భోజన పానాది ప్రతీకార చర్యల నొనర్చుచు అట్టివ్యాధి ప్రతీకారచర్యనే సుఖమని తలంచి మానవుడు భ్రమించుచున్నాడు. వాస్తవముగ అది సుఖముకాదు. సుఖాభాసమే. సుఖము భగవంతుని పాదపద్మములను సేవించుటయందే కలదు. హృదయమందు, సమస్త చరాచరములందు వెలుగొందుచున్న పరమాత్మను భజించుటయందే కలదు. అట్లు భజించువాడు, 'సుఖమక్షయమశ్నుతే' అనునట్లు అనంతసుఖమును బడయుచున్నాడు. కనుకనే శాస్త్రములు, అనుభవజ్ఞులగు మహనీయులు—

'ఉత్తిష్ఠత! జాగ్రత ! ప్రాప్యవరాన్ నిబోధత!' లెండు! మేలుకొనుడు! మహాత్ములకడకేగి ఆత్మవిజ్ఞానమును శీఘ్రముగ బడయుడు' అని ముక్తకంఠముతో బలుకు చున్నారు. కావున ఇట్టి వేదాంత గర్జనము నాలకించి తమ స్సును పారద్రోలి ముకుంద పాదపద్మములను శీఘ్రాతిశీఘ్ర ముగ నాశ్రయించవలెను. అజ్ఞానకుహరమునుండి వినిర్గతులై ఆత్మప్రకాశమును సత్వరమే అనుభూతమొనర్చుకొనవలెను. ఏమాత్రము జాగుచేయరాదు.

## సుదీర్ఘప్రయాణము

ఒక పెద్దప్రయాణము ప్రతివానికిన్ని వేచియున్నది. జీవితకాలములో రైళ్ళమీద, బస్సులమీద, విమానముల మీద చేయు ప్రయాణము చిన్నవి. జీవితాంతమున చేయు ప్రయాణము పెద్దది. ఆ ప్రయాణమును ఎవరును తప్పించు కొనలేరు. అది జరిగి తీరును. అజ్ఞానవశమున జీవుడు దానిని మఱచి లోకమున ప్రవర్తించుచున్నాడు. అన్నియు జ్ఞాపక ముంచుకొనునుగాని తనకొక దీర్ఘప్రయాణము కాచుకొని యున్నదని మాత్రము మఱచును. కనుకనే ప్రమాదమున పడిపోవుచున్నాడు.

'Think of Death always and you will realise the truth of every word I say'

(Swami Vivekananda)

'మరణమును సదా జ్ఞాపకమునందుంచుకొనినచో నేను చెప్పు వాక్యములన్నియు చక్కగ బోధపడగలవు' అని వివేకా

నందులు తన శిష్యునితో నొకపుడు పలికియున్నాడు. గూడ్సు పెట్టెలపై 'Return' (త్రిప్పిపంపవలెను) అని వ్రాసి దాని ప్రక్కన ఒక తేది వేయుదురు. అనగా ఆ తేదినాటికి ఆ పెట్టె అరిగిపోవును గాన దానిని గూడ్సుషెడ్డుకు 'రిపేరు'కు గాను త్రిప్పి పంపవలెనని అర్థము. ఆ త్రిప్పిపంపు తేదిని గూడ్సుపెట్టె తయారైనదినమే నిర్ణయించి దానిపై వేయుదురు. అట్లే బ్రహ్మదేవుడు ఈ దేహపంజరమును సృష్టిచేసి ప్రపంచమున వదిలినదినమే దాని నొసటపై 'త్రిప్పి పంపవలసిన దినమును' కూడ వ్రాసియుంచును. అయితే భేదమేమియనిన, గూడ్సుపెట్టెలపై తేది కనిపించును. జీవుని నొసట కనిపించదు. దానినే బ్రహ్మవ్రాత, విధిలిఖితము అందురు. కనిపించనంతమాత్రమున అది లేకపోలేదు. పుట్టినది గిట్టకమానదు. 'జాతస్య హి ధ్రువో మృత్యుః'. మహనీయులందఱున్ను తమ జీవితకాలములోనే ఈ మహాప్రయాణమును గురించి యోచించుదురు. వార్ధక్యము రాకపూర్వమే అనగా బాల్యయౌవనములందే దానినిగూర్చి చింతించి తన్నివారణకు తగినమందు కనిపెట్టుదురు. నచికేతుడు హఠముపట్టి యమధర్మరాజునుండి ఆ రహస్యమును కూడ తెలిసికొనెను. 'ఓ నచికేతా! నీవు ముల్లోకములనందలి భోగములు, ఐశ్వర్యములు, సంపదలు అన్నిటిని ఇచ్చెదను. "మరణం మానుప్రాక్షీః"—మరణానంతర విషయమును మాత్రము అడుగవద్దు అని యముఁడెంత చెప్పినను వినక జన్మరాహిత్యమునకు ఔషధమగు ఆత్మవిజ్ఞానమునే కోరు

కొనెను. అర్జునుడుకూడ ఈ కోవకు చెందినవాడే. కనుకనే శ్రీ కృష్ణపరమాత్మను,

'ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః' (8-2)

'అంత్యకాలమునందును నియతచిత్తులు నిన్నెట్లు తెలిసికొనగలరో వచింపుము' అని యడుగుటకు కారణము. ఈ ప్రకారము తమ జీవితకాలముననే మరణము సంగతి జ్ఞాపకముంచుకొని, మరల ఎన్నటికిని జన్మింపక, మరణింపకయుండు స్థితిని పొందుటకై యత్నించువారు ధన్యులు. అట్టివారే మానవత్వమును సార్థకపఱచుకొనినవారు.

జాతా స్త ఏవ జగతి జన్తవస్సాధుజీవితాః
యే పునర్నేహ జాయన్తే శేషా జరఠగర్దభాః. (వసిష్ఠగీత)

'ఓ రామచంద్రా! మఱల పుట్టకుండ చేసికొనగలుగు మహాత్ము లెవరు కలరో, అట్టి ఉత్తమశీలసంపన్నులు మాత్రమే ఈ ప్రపంచమున పుట్టినవారిక్రింద జమ. తక్కిన వారు స్వార్థజీవనులే యగుదురు అని వసిష్ఠులు శ్రీరామచంద్రునకు బోధించెను.

కాని ఇక్కాలమున జనులు కాయము శాశ్వతమని యెంచి, ప్రయాణముమాట పూర్తిగ మఱచిపోయి, అనేక సాంసారికవ్యామోహములందు మునిగి, కాలము గడచిపోవుచుండ దేబరించి చూచుచు, పారలౌకిక ప్రయత్నవిరహితులై మెలగుచున్నారు. ప్రజల ఈ అవివేకమును భర్తృహరి యెంత చక్కగ వర్ణించెనో చూడుడు—

ఆదిత్యస్య గతాగతై రహరహస్సంక్షీయతే జీవితమ్
వ్యాపారై ర్బహుకార్యభార గురుభిః కాలో న విజ్ఞాయతే
దృష్ట్వా జన్మ జరావిపత్తి మరణం త్రాసశ్చ నోత్పద్యతే
పీత్వా మోహమయీం ప్రమాదమదిరా మున్మత్తభూతం జగత్.

(భర్తృహరి)

"సూర్యుని ఉదయాస్తమానములచే రోజురోజుకు జీవితము తఱిగిపోవుచున్నది. కాని ఎడతెగని పనులలో మునిగి తేలుచు జనులా విషయమును గుర్తెఱుంగకున్నారు. పుట్టుచున్నవారిని, మరణించుచున్నవారిని, ముసలివారిని, బాధల నొందుచున్న వారిని చూచియుగూడ భయపడకయున్నారు. అజ్ఞానమను కల్లుద్రాగి జగమెల్ల మతిదప్పియున్నది!" నిజముగ లోక పరిస్థితి ఇట్లే యున్నది. భగవద్ధ్యానము చేసికొనుటకు తీరిక యే లేదని వారు చెప్పుదురు. ఉదయము నిద్రలేచినది మొదలు మరల పరుండువఱకును ఒక్కక్షణమైనను దైవస్మరణకు తావీయక నశ్వరప్రాపంచిక వస్తుసంపాదనము నందే వారు నిమగ్నులై యుందురు. ఈ విధముగ ఒకానొకడు వ్యాపారములో మునిగి తేలుచు, ఎవరో ప్రశ్నించుటకు 'I have no time even to die' 'నాకు చావటానికికూడ తీరిక లేదు'—అని చెప్పివేసెను. అట్లుండెను ఆధునిక మానవుని మనఃస్థితి. ఇక దైవచింతనకు వారి జీవితములో చోటెచట? కాబట్టియే అట్టివారు మానవులవలె మరణించక, క్రిమికీటాదులవలె మరణించుచున్నారు. వారి జన్మము నిరర్థకమై పోవుచున్నది.

కాబట్టి విజ్ఞుడగువాడు తన జీవిత కాలముననే అంత్య కాలప్రయాణమును గుఱించి యోచించి ఆధ్యాత్మికసాధనల ద్వారా భవరోగదుఃఖమును బాపుకొనవలెను. అర్జునున కట్టి యోచన యే కలిగినది. కనుక తత్క్షణమే శ్రీకృష్ణ పరమాత్మకు తన సంకల్పమును వెలిబుచ్చి శరీరవియోగ సమయమునగూడ జీవుడెట్టి భావనతో గూడియుండవలెనో, భగవంతుని యెట్లు ధ్యానించవలెనో ప్రశ్నించెను. అందులకు శ్రీ కృష్ణమూర్తి విపులముగ సమాధానమొసంగి అక్షర పరబ్రహ్మతత్త్వమును, ప్రణవధ్యానమును బోధించెను. "అంత్యకాలమునగూడ ఎవరు నన్నే స్మరించుచు దేహ మును వీడుదురో అట్టివారు పరమగతియగు నన్నే పొందు దురు. ఈ విషయము ముమ్మాటికిని సత్యము." అని భగ వానుడు పలికెను. అదేవిధముగ అంత్యకాలమున ఇతరముగు ఏ రూపమును స్మరించినను, సంస్కారబలమువలన ఆ రూపమునే మఱుజన్మయందు జీవుడు పొందుచుండును. తుచ్ఛవిషయమును చింతించినచో తుచ్ఛరూపమునే పడ యును. మరణకాలమున లేడిని భావించినందున జడభరతుడు లేడిజన్మ నెత్తవలసివచ్చెనుగదా! చిత్తము అద్దమువంటిది. దాని యెదురుగ ఏ రూపమునుంచిన, ఆ రూపమే అందు ప్రతిబింబించును. కాబట్టి మఱుజన్మకు హేతుభూతమైనట్టి అంత్యకాల సంస్కారము బహుపవిత్రముగ నుండవలెను. దీనికి ఉపాయమేమి? అంత్యకాలమున అకస్మాత్తుగ మంచి గుణము మనుజులపై ఊడిపడదు. జీవితకాలమంతయు

ఎంతయో కృషిచేసి పవిత్రగుణములను సంపాదించినవారికి మాత్రమే చిత్తము సత్త్వగుణమయమై అంత్యకాలమున భగవత్స్మరణ సంభవింపగలదు.

విద్యార్థి సంవత్సరకాలమంతయు బాగుగ చదివిననే పరీక్షాసమయమున చక్కగ వ్రాయగలడు. సంవత్సరము పొడుగునా సోమరియై తిరుగుచు సరిగా పరీక్షాసమయమున మాత్రము పుస్తకము తెఱచినచో ఏమి బోధపడును? ఏమి వ్రాయగలడు? ఎట్లు కృతార్థుడు కాగల్గును? తన చిత్తమును తానే బాగుచేసికొనవలయును. అదియో ఒక్కరోజుతో అగు పనికాదు. అనేక జన్మార్జిత ఘనీభూత పాపవాసనలుగల చిత్తము సద్వాసనామయము కావలసియున్నచో, భగవదున్ముఖమై చక్కగ ధ్యానముచేయు సమర్థతను బొందవలసియున్నచో జీవితకాలమంతయు తీవ్రతరప్రయత్న మావశ్యకమైయున్నది. రైలుయాత్ర చేయదలంచువారు ప్రయాణకాలమునకు ఎన్నిగంటలనుండియో మూట, ముల్లె సర్దుకొని సిద్ధపడుచుండుట మనము చూచుటలేదా? అట్లే దీర్ఘప్రయాణమగు మరణమునకై బాల్యకాలమునుండియే తగు సంస్కారము నేర్పఱచుకొనవలెను. అంత్యకాలమున అప్పటికప్పుడు ధ్యానము సిద్ధించవలెననిన అది సాధ్యపడు విషయముకాదు. అంత్యకాలమున భగవద్ధ్యానము చేసినచో మోక్షము కలుగునని శ్రీకృష్ణమూర్తి చెప్పెను గదా యని కొందఱు సోమరులు అపోహపడి 'ఇక పరవాలేదు. జీవితమంతయు పాపము చేసినప్పటికి అంత్యకాలమున దేవునకు

ఒక దణ్ణంపెట్టినచో కైవల్యప్రాప్తి కలుగగలద'ని భావించు చున్నారు. వారి వాదనను బలపఱచుకొనుటకు అజామిళుని దృష్టాంతముగ గైకొందురు. ఇటువంటి అలసుల విషయమై బాగుగ ఆలోచించియే అర్జునుడు, శ్రీకృష్ణుడు ఇరువురు బహుజాగ్రతగ మాట్లాడిరి. సోమరులకు అవకాశమే ఇవ్వలేదు. అర్జునుడు 'ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి' (మరణకాలమునకూడ నిన్నెట్లు తెలుసుకొనగలరు?) అని ప్రశ్నింప శ్రీకృష్ణుడు 'అన్తకాలే చ మామేవ స్మరన్' (అంత్యకాలమున కూడ నన్నే స్మరించువారు ముక్తిని బొందగలరు) అని జవాబిచ్చెను. ఇరువురి వాక్యములలోను 'చ' కారముండుట గమనింపదగినది. 'చ' అనగా సంస్కృతములో 'కూడ' అని అర్థము. 'అంత్యకాలములోకూడ నన్ను ధ్యానించువారు' అని చెప్పిరి కాని 'అంత్యకాలములో నే' అని చెప్పలేదు. 'అంత్యకాల ఏవ' అని శ్రీకృష్ణుడు చెప్పియుండినచో కొంప మునిగియుండెడిది. సోమరులు శ్రీకృష్ణుని బ్రహ్మరథము పట్టియుండెడివారు. కాని భగవానుడు వారి ఆటలను సాగనివ్వలేదు. 'చ' కార బాణప్రయోగముచే సోమరుల గుండెలను ఛేదించివేసెను. ఇంతియేకాదు. ఆ 'చ' కారమును సరిగా వారు అర్థము చేసికొందురో, లేదో యని భావించి వెంటనే ఈ క్రింది శ్లోకముద్వారా అర్థానికి భాష్యమునుగూడ చెప్పివైచెను—

> తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ
> మయ్యర్పితమనో బుద్ధి ర్మామేవైష్యస్యసంశయః.

'కాబట్టి ఓ అర్జునా! ఎల్లవేళలయందును నన్ను స్మరింపుము. నీ స్వధర్మమగు యుద్ధమునుగూడ జేయుము. నాయందు అర్పింపబడిన మనస్సు బుద్ధికలవాడవైనచో నీవు నన్ను తప్పక పొందగలవు. ఇట సంశయమేమియును లేదు' అని భగవానుడు 'అంత్యకాలములో కూడ' అను పదమునకు వివరణము చెప్పెను, ఎల్లకాలములందనగా, బాల్యయౌవన, వార్ధక్యములందని భావము. అనగా సర్వకాలములందని అర్థము. కావున విజ్ఞుడగువాడు తనకు రాగల దీర్ఘప్రయాణము గురించి యోచించి, దైవధ్యానాదులద్వారా అజ్ఞానిని ఇపుడే నివారించుకొని జన్మరాహిత్యకైవల్యపదవి నలంకరించవలెను.

## క్షణిక జీవితము

ప్రాణియొక్క జీవితము అత్యంత క్షణికమైనది. దీర్ఘజీవితమైనను, హ్రస్వజీవితమైనను కాలముచే గ్రస్తము యుండుటవలన అనంతకాలమున ఆ జీవితము లన్నియు క్షణికము లైనవే యగును. బుద్బుదప్రాయముగు అట్టి జీవితమును శాశ్వతమని నమ్మికొని సమయమునంతను ప్రాపంచిక విషయానుభవమునందే గడపివేయుట, భగవంతుని విస్మరించుట అత్యంత ప్రమాద హేతువై యున్నది.

ఒకపుడు ఒక కప్ప నోరు తెఱచుకొని ఎదుట నున్న ఒకానొక పురుగును భక్షించుటకై ఆనందముతో ముందుకు వచ్చెను. ఆ పురుగును చూడగనే, కప్పయందీ క్రింది భావ

పరంపరలు చిందులు త్రొక్క దొడగెను—"ఆహా! నా జీవితము ధన్యమైనది. చక్కని యాహారము లభించినది! ఎటువంటి భోగ్యపదార్థము! నా అదృష్టమే అదృష్టము! జీవితము ఎంత ఆనందమయమైనది! ఇట్టి పురుగు యిది వఱలో నాకేనాడును లభ్యముకాలేదు! ఇంక కొద్దిసేపటిలో దానిని భక్షించుటవలన నాకు అపూర్వముగు ఆనందము కలుగగలదు!"—కప్ప ఈ ప్రకారముగ ఎన్నియో భావములను తనలో కల్పించుకొని ఆనందపడుచు నుండున్న భోగ్యవస్తువును జూచి మురిసిపోవుచున్నదే కాని, తన వెనుక నేమి జరుగనున్నదో దానిని మాత్రము తెలిసికొన జాలకున్నది. వెనుక నొక పాము నోరు తెఱచుకొని ఆ కప్పను భక్షించుటకు వచ్చుచుండెను. కప్పకు ముందున్న పురుగు పైననే దృష్టికలదు కాని, వెనుకనున్న పాముపై కాదు. అసలు పాము అనునది అచ్చోట కలదని కాని, అది దానిని మ్రింగుటకు వచ్చుచున్నదనిగాని అది కలలోగూడ తలంచి యుండలేదు. దాని దృష్టి ఎదుట నున్న భోగ్యవిషయము పైననే కలదు; వెనుక నున్న మృత్యువుపై కాదు.

అట్లే అజ్ఞానులగు జీవులు తమ దృష్టినంతను ఎదుట నున్న ప్రాపంచిక భోగ్యపదార్థముల పైననే కేంద్రీకరించు దురు. వానినే తమ సర్వస్వముగ నెంచుకొనుచు శబ్దాది విషయములే గొప్ప యని భావించుచు రానున్న మృత్యువును గూర్చిన యోచనయే లేక యున్నారు.

. కాలస్తిష్ఠతి పృష్ఠతః కచధరః కేనాపి నో దృశ్యతే.

అనునట్లు కొప్పు పట్టుకొని ఆడించుచున్న కాలుని (మృత్యువును) ఎవరును కనుగొనుట లేదు. వాస్తవముగ ప్రతి ప్రాణియు భూలోకమున గాని, స్వర్గలోకమునగాని, పాతాళలోకమున గాని నివసించుట లేదు. మృత్యుముఖమున నివసించుచున్నాడు. కాలుని కరాళవదనమున ఆసీనుడై యున్నాడు. 'విశన్తి నాశాయ సమృద్ధవేగాః' - అని గీతాచార్యుడు పలికినట్లు ఆ కాలుని నోటిలో చప్పరించి వేయబడుటకుగాను ప్రాణికోట్లు వేగముగా ప్రవేశించుచున్నవి. కాబట్టి ఇటువంటి ప్రమాదకరమైన పరిస్థితియందున్నప్పటికిని మనుజుడు అజ్ఞానవశమున తన జీవితముయొక్క క్షణికత్వమును గుర్తెఱుంగక, పాంచభౌతిక శరీరమునందు శాశ్వతత్వమును ఆరోపించుకొనుచు, ఎదుటనున్న తళుకుబెళుకులతో గూడిన విషయములను జూచి హర్షాప్లావితుడగుచున్నాడు. సుందర భోజనము, సుందర శరీరము, సుందర భవనము- ఇవియే గొప్పగ తలంచినవాడై, వానికొఱకై రాత్రింబగళ్లు విరామములేక యత్నించుచు తుట్టతుదకు అన్నింటిని వదలివైచి కన్ను మూసికొని పోవుచున్నాడు. తన వెనుక పొంచుకొని యున్న మృత్యువును తెలిసికొనక ముందున్నదే సత్యమని భావించి దాని సంపాదనకై పడరానిపాట్లు పడుచున్నాడు. కాని ఆ తన ప్రయత్నమధ్యముననే మృత్యువాతనిని గ్రసించివైచుచున్నది. తత్ఫలితముగ నతడు నిష్ఫల జీవితుడగుచున్నాడు. కావున వివేకవంతుడగువాడు ప్రాపంచిక భోగములపై ఆసక్తిని విడనాడి తన వెనుక కాచుకొని

యున్న మృత్యువును గమనించి, ఆ మృత్యువు తన్ను కబళించి వేయుటకు ముందుగానే ఆ మృత్యువును తానే కబళించి వేయుటకు—అనగా ఆత్మానుభూతిచే అమరస్వరూపుడగుటకు ఉపాయముల నన్వేషింపవలయును. అట్లియే కాని కథలోని కప్పవలె కన్ను మూసికొని విషయభోగములకై గంతులిడుచు జీవితము నిరుపయోగము చేయరాదు.

ఇక కథలో ఇంకను ఏమి జరిగినదో చూతము. పురుగు వెనుక కప్ప, కప్ప వెనుక పాము, పాము వెనుక నెమలి, నెమలి వెనుక పులి, పులి వెనుక బోయవాడు—ఈ ప్రకారముగ ఒకదాని వెనుక నొకటి ఎదుటిదానిని చంపి వేయు ప్రయత్నములో నుండెను. వెనుక నేమి జరుగుచున్నదో ముందున్న వానికి తెలియదు. సాక్షాత్ మృత్యుదేవత అన్నిటికిని వెనుక కాచుకొనియున్నాడు. ఆ సంగతి ఆ ప్రాణులకు తెలియదు. ఇంకొక్క క్షణములో అవి యన్నియు మృత్యుదేవతకు బలి కానున్నవి. కాని ఆ విషయము నెఱుగక ఆ దౌర్భాగ్య జీవులన్నియు తమ ముందున్న భోగ్యవిషయమునే గొప్పగ దలంచి, వానికొఱకై పరుగులిడుచున్నవి. ఈ విషయమునే కవిపుంగవుడు ఈ క్రింది విధముగ చక్కగ వర్ణించి చెప్పెను.

భేకో ధావతి తం చ ధావతి ఫణీ సర్పం శిఖీ ధావతి
వ్యాఘ్రో ధావతి కేకినం విధివశాద్వ్యాధోఽపి తం ధావతి
స్వస్వాహారవిహార సాధనవిధౌ సర్వేజనా వ్యాకులాః
కాల స్తిష్ఠతి పృష్ఠతః కచధరః కేనాపి నో దృశ్యతే.

దీని యర్థము పైన దెలిపినదే. కాబట్టి శ్రేయఃకాములగు జీవులు ఈ పాంచభౌతిక కాయముపై విశ్వాసముంచక దానియొక్క క్షణికత్వమును మఱల మఱల జ్ఞాపకము చేసికొనవలెను. కబళించి వేయుటకు సదా సన్నద్ధమై యుండు మృత్యువును తెలిసికొని, ఎదుట నున్న ప్రాపంచిక భోగ్య వస్తువుల యెడల విరాగము గల్గి, దృష్టిని శాశ్వతపరమాత్మపైననే శీఘ్రముగ కేంద్రీకరించి వివేకాదులచే సచ్చిదానంద పరమాత్మరూప స్వస్వరూపమును సాక్షాత్కరించుకొనుట ద్వారా మృత్యువును జయించివైచి అమరులై, అక్షరులై, అవ్యయులై వఱగవలయును.

కాలచక్రము అతివేగముగా తిరుగుచున్నది. రోజులు, నెలలు, సంవత్సరములు త్వరత్వరగా గడచిపోవుచున్నవి. కొలదికాలము క్రిందటనే వచ్చిన సంవత్సరము అప్పుడే గడచిపోయి నూతన వత్సరమునకు అవకాశ మొసంగుచున్నది. కాలప్రవాహములో వత్సరములు ఎన్ని వచ్చినవో, ఎన్ని పోయినవో! ఎందఱు ప్రాణులు పుట్టిరో గిట్టిరో! ఎన్ని బ్రహ్మాండములు ఉదయించినవో అస్తమించినవో! అనాది కాలమునుండి జరుగుచున్న ఈ ప్రపంచ వ్యవహారమునంతను ఒక్క పర్యాయము సింహావలోకనము చేసినచో ఈ శరీరములుగాని, ఈ వస్తుజాలముగాని. ఈ సంపదలుగాని స్థిరములు కావని, పరిణామశీలములని, క్షణికములని, నశ్వరములని అవగతము కాగలదు. అట్టిచో వీనిపై మమత్వ మేల? అని వివేకవంతులకు తప్పక బుద్ధి పొడమును.

ఏ ప్రాపంచిక పదార్థములపై మానవుడు అభిమానము గలిగి అవియే తన సర్వస్వమని భావించి మురిసిపోవు చున్నాడో అవి యన్నియు కాలక్రమమున తేజోవిహీనములై, నిర్వీర్యములై అనంతకాలగర్భమున విలీనములై పోవుచున్నవి. మహామహా సంపదలతో తులతూగిన రాజులు అంతరించిరి. రాజ్యములు భూస్థాపితము లైనవి. ఇక శత వత్సరములకు లోబడి ఆయువు కలిగియున్న ఈ శరీరమా శాశ్వతము!

'ప్రయాతా పాంసువద్భూపా కా ధృతిర్మమ జీవితే' నా తాతలు, ముత్తాతలు విశాలసామ్రాజ్యములను పాలించి పాలించి తుదకు మట్టిలో కలిసిపోయిరి. ఇక నా జీవితమా శాశ్వతము'—అని జనకమహారాజు పలికిన పలుకులు పరమ వైరాగ్యబోధకములై వాస్తవస్థితిని ప్రతిబింబించునవై యున్నవి. ముముక్షువులు ప్రాపంచిక దృశ్యపదార్థములను గూర్చియు, బంధ్వాదిపరిజనమును గూర్చియు ఈ ప్రకారము బాగుగ చింతనచేసి అవి ఎంత ఆకర్షణీయముగ నున్నప్పటికిని వానిపై మమత్వముగాని, అభిమానముగాని ఉంచుకొనరాదు. వానిలో తగుల్కొనరాదు. అవియన్నియు కాలగర్భమున అంతరించిపోవునవి యనియు, ఒకవేళ అవి కొంత దీర్ఘకాల మున్నప్పటికిని వానిని అనుభవించు ఈ దేహమైనను కొంతకాలమునకు శిథిలమై పోగలదనియు నిశ్చయించి, బహు జాగరూకులై, వానియెడల విరాగము కలిగి

శాశ్వత అక్షయ ఆత్మకొఱకే అన్వేషింపవలెను. ఆత్మను గూర్చియే మననము చేయవలెను.

మాయావశమున జగచ్చక్రమంతయు నిరంతరము అతివేగముగ పరిభ్రమించుచున్నదనియు, ఆ చక్రమును త్రిప్పువాడు తానే యనియు, తన్నాశ్రయించిన వారిని ఆ కాలచక్రముగాని, కర్మచక్రముగాని ఏమాత్రము బాధింపదనియు శ్రీకృష్ణభగవానులు గీతయందు సెలవిచ్చియున్నారు. కాబట్టి కాలచక్రమును గూర్చిగాని, దాని భయంకర స్వభావమును గూర్చిగాని ఎవరును భీతిల్లక, ఆ చక్రముయొక్క అధినాయకుడై, కాలకాలుడై పఱగు పరమాత్మను ఆశ్రయించువారు, ఈ జననమరణరూప ప్రవాహమును తప్పించుకొని బంధవిముక్తులై, శాశ్వతకై వల్యము ననుభవించగలరు.

'కాలకాలప్రపన్నానాం కాలః కిం ను కరిష్యతి'— 'యమునికూడ శాసించునట్టి భగవానుని ఆశ్రయించు మహాత్ములను, కాలకాలుడైన పరమాత్మును సేవించునట్టి ధీశాలురను ఇక కాలమేమి చేయగలదు!' ప్రపంచములోని సమస్తమును మృత్యువు గ్రసించుచున్నప్పటికిని, ఆ మృత్యువునుకూడ గ్రసించివైచు దేవదేవుని నమ్ముకొని యుండువారికి అద్దానిని గూర్చిన భయము ఏకోశమునను ఉండజాలదు.

కాలచక్రము వేగముగా జనుగాక! నష్టమేమి? భీతియేల? దానియందు తగుల్కొని యున్నవారికి భీతిగాని, దానికంటె వేఱుగా నుండి, దానిని సాక్షిగా జూచువారికై

దాని ప్రభావమేమి యుండగలదు? చక్రముపైనున్న పురుగు చక్రముతోపాటు తిరుగును, దుఃఖ మనుభవించును. చక్రమునకు వేఱుగా నున్న ప్రాణి అట్టి బాధలకు లోనుగాక ఆనందముగ నుండును. బుద్ధికంటె పరమై వెలుగు ఆత్మయందు స్థితికలిగి బుద్ధిని, బుద్ధిజన్య మగు ప్రపంచమును సాక్షిగ వీక్షించు వివేకవంతులకు కాలచక్ర ప్రభావ మేమియును ఉండజాలదు.

కావున జనులు కాలచక్రమును జూచి భీతిల్లక, కాలముగాని, మృత్యువుగాని దేహమునే బాధించును గాని దేహసాక్షియగు ఆత్మను గాదని పరిపూర్ణముగ నిశ్చయించుకొని తాను పాంచభౌతిక మగు దేహము (ఉపాధి) ఏ కాలమందును కాదనియు, తత్సాక్షియై జాగ్రత్స్వప్న సుషుప్తులందు ఏకరీతిగ నిర్వికారమై వెలయు ఆత్మయే తాననియు బాగుగ అనుభూతి మొనర్చుకొనవలెను. అమరత్వమునకిదియే మార్గము. తీరమును జేరినవానికి ప్రవాహజనిత బాధలేవియు ఉండజాలవు. అట్లే ఆత్మరూపతీరమున జేరిన విజ్ఞునకు కాలప్రవాహ జనిత విక్షేపము లెవ్వియును ఉండనేరవు. అతడు చావు పుట్టుకలు లేక పరమానందమునే నిరంతర మనుభవించుచుండును. అట్టి మహోన్నత ఆత్మరూప కైవల్య పదవిని ఈ జీవితమునందే పడసి జనులు ధన్యులు కావలయును. ఆలసింపరాదు. వెంటనే సద్గురువును, సచ్ఛాస్త్రమును ఆశ్రయించి తరణోపాయమును వెతకికొని తరించవలెను. జీవితము క్షణికమని మఱువరాదు.

మానవుని నూఱు సంవత్సరముల ఆయుర్దాయము అనంతకాలములో ఒక త్రుటివంటిది. కనురెప్పపాటువంటి ఈ జీవితములో మానవుడు తన కర్తవ్యమును విస్మరించి ప్రవర్తించుట మహాప్రమాదకరము. గడచిన కాలము తిరిగి రాదు. పోయిన అవకాశములు మఱల లభించుట దుస్తరము. చేయవలసిన సాధన లెన్నియో కలవు. తెలిసికొనవలసిన విషయము లెన్నియో యున్నవి. అట్టి స్థితిలో చేజిక్కిన ఈ స్వల్ప అవకాశమును సద్వినియోగ పఱచుకొనుట, తన్ను తాను తెలిసికొని పరమశాంతి బొందుట విజ్ఞుల పరమ కర్తవ్యము.

లోకములో స్థిరమైన వస్తువొకటియును లేదు. ప్రతి వస్తువు షడ్భావ వికారములకు లోనగుచున్నది. పుట్టిన వస్తువు పెరుగుచున్నది. పెరిగిన వస్తువు క్రుళ్లుచున్నది. క్రుళ్లిన వస్తువు నశించుచున్నది. బ్రహ్మాండము లావిర్భవించు చున్నవి. బ్రహ్మాండములు అంతరించి పోవుచున్నవి. రాజులు పుట్టుచున్నారు. రాజులు నశించుచున్నారు. కాలరూప ఝంఝామారుతముచే ఎగురగొట్టబడని పదార్థమే లేదు. అట్టి స్థితిలో, ప్రపంచమున స్థిరమైన వస్తువేదియో యోచించుట ముముక్షువులకు పరమధర్మమై యున్నది. ఆ స్థిర వస్తువే ఆత్మ. అదియే దైవము, దాని నాశ్రయించినవాడిక జనన మరణరూప సంసార ప్రవాహమున తగుల్కొనక తప్పించుకొనును. కావున అనాత్మరూప దృశ్యపదార్థములపై ఆసక్తినుంచక ఆత్మరూప దృగ్వస్తువునే అపేక్షించుట

ధర్మము. దేహాది నశ్వరవస్తువులపై మమత్వముంచక దేహాంతర్గత సర్వసాక్షియగు దేహి (ఆత్మ) పై దృష్టి నుంచుట శ్రేయస్కరము.

ఈ ప్రపంచమున విలువైన వస్తువు లన్నిటిలోను మిగుల విలువైనది కాలము. అట్టి అమూల్య పదార్థ మేవిధముగ వినియోగపడుచున్నది గమనించుట విజ్ఞుని కర్తవ్యము. సర్వోన్నత లక్ష్యమగు ఆత్మసాక్షాత్కారమునకై అది ఉపయోగింప బడుచున్నదా యని ముముక్షువు వేయికండ్లతో నిరంతరము పరీక్షించుచుండవలెను.

> యన్ముహూర్తం క్షణమపి వాసుదేవో న చిన్త్యతే
> సా హాని స్తన్మహచ్ఛిద్రం సా భ్రాన్తి స్సా చ విక్రియా.

ఏ క్షణము దైవస్మరణ లేక వెచ్చింపబడుచున్నదో అది చాల హానితో గూడినదని శాస్త్రములు ఘోషించుచున్నవి - కాబట్టి పారమార్థిక దినచర్యకు సంబంధించిన కార్యక్రమము (Spiritual Time - table) ఒక దానిని ఏర్పాటు చేసికొని దానిప్రకార మనుష్ఠించుచు వచ్చినచో ఒక్క సంవత్సర కాలములో గొప్ప ఉన్నతిని సాధింపవచ్చును. ఈ విధముగ ఒక పంచవర్ష ప్రణాళికగాని, వర్షత్రయ ప్రణాళికగాని, ఏకవర్ష ప్రణాళిక గాని, నిర్ణయించుకొని ముముక్షువు తన ఆధ్యాత్మిక అభ్యుదయమును ఆ గడువు లోపల సాధించుకొనుచు నుండుట ఉత్తమము.

సంవత్సర ప్రారంభసమయమున జనులు గత సంవత్సర అభ్యున్నతిని ఒక పర్యాయము సింహావలోకనము చేసి,

నూతన సంవత్సరమునకు కార్యక్రమమును నిర్ణయించుకొనవలెను. "ఈ సంవత్సరములో—

(1) ప్రతిదినము నియమము తప్పక ఒక అధ్యాయము గీతాపారాయణము చేసెదను.

(2) కనీసము ఒక గంటసేపైనను ఉదయము, రాత్రి పరమాత్మను ధ్యానించెదను.

(3) సాత్త్విక మితాహారమునే సేవించెదను.

(4) మనస్సునం దేలాటి దోషములు, వికారములు ఉదయించకుండా ప్రయత్నించెదను. ఒకవేళ ఉదయించుచో విచారణాబలముచే వానిని తొలగించుకొనెదను."

అని ఈ ప్రకారముగ సాధకుడు కొన్ని నియమము లేర్పాటుచేసికొని, దృఢవ్రతుడై పట్టుదలతో వానిని సాధించుటకై యత్నశీలుడు కావలయును. కాలమును సద్వినియోగపఱచుచు, ప్రకృతిని, మాయను, అజ్ఞానమును ఏవిధముగనైనను జయించుటకే కృతనిశ్చయుడు కావలయును గాని వానిచే పరాభూతుడు ఎన్నటికిని కాగూడదు.

ప్రపంచములో గల సమస్త పదార్థములలోను విలువైనది కాలమని జ్ఞప్తియందుంచుకొనవలయును. పోయిన ఏ వస్తువునైనను తిరిగి సంపాదించుకొనవచ్చును. కాని గడచిన కాలమును మాత్రము మరల ఎవరును సంపాదింపలేరు.

ఆయుషః క్షణ ఏకోఽపి సర్వరత్నైర్న లభ్యతే
నీయతే తద్వృథా యేన ప్రమాదస్సుమహానహో.

ప్రపంచములోని సమస్త రత్నముల నొసంగినను గడచిన ఆయుస్సుయొక్క ఒక్క క్షణమును మనుజుడు తీసికొనిరాలేడనియు, అట్టి అమూల్యమగు ఆయువును వ్యర్థముగ గడపివేయువానికి మహాప్రమాదము దాపురించినట్లేయనియు శ్రీ వసిష్ఠమునీంద్రుడు శ్రీరామచంద్రున కుపదేశించియుండెను. కావున ఆయుర్దాయమును సద్వినియోగము చేయవలెను. భగవద్వ్యతిరిక్తములగు కార్యములందు దానిని ఖర్చుచేయరాదు. శాశ్వతపదార్థమగు పరమాత్మకొరకే దానిని వినియోగించవలెను. ప్రతిదినము ఒక "టైమ్‌టేబిల్" (దినచర్య) వ్రాసికొని, దానిప్రకారము నియమపూర్వకముగ అధ్యాత్మసేవ గావింపవలయును. విద్యార్థి పాఠశాలయందు ఒక్కనిముషమైనను వ్యర్థముచేయక అనేకపాఠ్యవిషయములను ఉపాధ్యాయులవలన ఎట్లు నేర్చుకొనుచుండునో, అలాగుననే అధ్యాత్మక్షేత్రమున ముముక్షువు ఒక్కక్షణమైనను వ్యర్థముగ ఖర్చుచేయక ఆత్మాన్వేషణమందే గడుపవలయును.

"నే నెవరు? ఈ జగత్తు ఎట్లేతెంచినది? నా గమ్యస్థానమెద్ది?" అని ఈ ప్రకారముగ విచారణ సలుపుచు సద్గురువులయొక్కయు, సచ్ఛాస్త్రములయొక్కయు సహాయముచే కర్తవ్యమును నిర్ణయించుకొనవలెను. పుట్టినపుడు ఏడ్చుచు పుట్టినను, ఆ ఏడ్పును ఇక ఏమాత్రము ముందుకు

కొనసాగింపక దుఃఖరహితమగు పరమానందాత్మస్థితిని శీఘ్రముగ చేరులాగున యత్నించవలెను. జీవితము అంతమగులోపల సాధనయు సమాప్తి కావలయును. ఇందులకు పట్టుదల చాలా యవసరము. దుర్బలచిత్తునకు మాయ ఎన్నటికిని వశము కాదు. కావున భల్లూకపు పట్టుతో ఆత్మసాక్షాత్కారమునకై తీవ్రతరసాధనము గావింపవలయును.

పూర్వమొక చిన్న పక్షి (టిట్టిభము) సముద్రమునందు కొట్టుకొనిపోయిన తన గ్రుడ్లను తిరిగి తెచ్చుకొనుటకై సముద్రజలమునంతను పుక్కిలించి ఆవల పారవేయుటకు నిశ్చయించినదై ఒక్కొక్క బిందువును నోటితో పీల్చి యుమిసి వేయ నారంభించినదట! ఆహా! ఎట్టి వజ్రసంకల్పము! కార్యసిద్ధికై ఆ పక్షి యవలంబించిన ధీరత్వము, పట్టుదల మానవులకు అనుసరణీయములై యున్నవి. ఎన్ని ఆటంకములు సంభవించినను, ఎన్ని ప్రతిబంధకములు కలిగినను, లక్ష్యమును విడనాడరాదను అప్రతిహత సంకల్పము ముముక్షువు కలిగియుండవలెను.

భగీరథుడు తీవ్రతరయత్నమాచరించి ఎట్టకేలకు గంగను భూలోకమునకు తీసికొని రాగల్గెను. ధ్రువుడు స్థిరనిశ్చయముగలవాడై ఘోరతపం బాచరించి నారాయణుని సాక్షాత్కరించుకొనగల్గెను. బుద్ధదేవుడు నిర్వాణప్రాప్తి కలుగువరకు 'ఈ ఆసనముపైనుండి లేవను' అను భీష్మప్రతిజ్ఞ గావించి ఎట్టకేలకు శత్రువగు మారుని జయించి నిర్వాణస్థితిని బడసెను. ఈ ప్రకారముగ మహనీయులెందరో పర

మార్గరంగమున గొప్ప పట్టుదలగలవారై వారి వారి కార్యములను సాధించివైచిరి.

కాబట్టి ముముక్షువులు సర్వేశ్వరునిపై, సద్గురునిపై అచంచలవిశ్వాసము, భక్తిగలవారై అమూల్యమగు తమ యీ మానవజీవితమునందు ఒక్కక్షణమైనను వ్యర్థము చేయక, సాధనయందు పురోగమించుచు ఆత్మసాక్షాత్కారమను లక్ష్యమును అచిరకాలములోనే సాధించివేయవలెను. కాలము అన్నిటిని గ్రసించివేయుచున్నను కాలాతీతమగు ఆత్మనెఱుగుటద్వారా కాలమునుగూడ తాను గ్రసించివైచి అంతకాంతకుడై పరగవలయును. ఇట్టితఱి అమరుడగు తన్ను ఇక మృత్యువేమి చేయగలదు? కాలకాలుడగు తన్ను కాలమేమి బాధించగలదు?

ముముక్షువులెల్లరు ఇట్టి మహోన్నత సునిశ్చయములు గలవారై, స్థిరసంకల్పయుతులై అధ్యాత్మక్షేత్రమున అగ్రసరులు కావలయును. ఈ జీవితమునందే లక్ష్యమును కార్యాన్వితమొనర్చెదమను అకుంఠితదీక్ష గలిగియుండవలెను. సత్కార్యమును 'రేపు, రేపు' అని వాయిదా వేయరాదు. 'రేపు'నకు రూపులేద'ని కబీరుదాసు పలికియుండెను. కావున చేయవలసిన దైవసాధనను వెనువెంటనే ప్రారంభించవలెను.

తస్మాజ్జాగ్రత । జాగ్రత ।

ఒకానొక తుమ్మెద కమలసరోవరమందలి కమలమునందు ప్రవేశించి మకరందము నాస్వాదించుచుండెను.

సాయంత్రము ఆరుగంటలు దాటినది. సూర్యభగవానుడు అస్తమించెను. కమలము ముడుచుకొనెను. తుమ్మెద కమలములో చిక్కుకొనిపోయెను. బయటకు వెడలుటకు దారి లేదు. ఆ పుష్పములోపలనే తిరుగుచు తిరుగుచు విసుకెత్తి అది తనలో యిట్లనుకొనెను.

> రాత్రిర్గమిష్యతి భవిష్యతి సుప్రభాతం
> భాస్వానుదేష్యతి హసిష్యతి పంకజశ్రీః ।
> ఇత్థం విచింతయతి కోశగతే ద్విరేఫే
> హా హంత హంత నలినీం గజ ఉజ్జహార.

'ఇక కొద్దిసేపటిలో రాత్రి గడచిపోవును. తెల్లవారును. సూర్యుడు ఉదయించును. కమలము వికసించును. అపుడు నేను బయటకు ఎగిరిపోవుదును'—ఈప్రకారము తుమ్మెద తనలో తాను భావికాలమునుగూర్చి చింతించుచుండ ఇంతలో ఒక ఏనుగు ఆ కొలనులో ప్రవేశించి తొండములో ఆ కమలమును పెరికివైచి కాలిక్రిందపడవేచి త్రొక్కి నాశనముచేసెను. తుమ్మెద చనిపోయెను.

ఏనుగు వచ్చునని తుమ్మెద కలలోనైన నూహించలేదు. అది గాలిలో మేడలుకట్ట ప్రారంభించినది. ఏమేమో ఊహలు చేసికొనినది. కాని ఒక్కత్రుటిలో పరిస్థితిఅంతయు తారుమారైపోయినది. తుదకు ప్రాణమునుగూడ తుమ్మెద దక్కించుకొనలేకపోయెను. లోకస్థితి ఇట్లే యుండును. భవిష్యత్తులో ఏమి జరుగబోవునో ఎవరికిని తెలియదు. ఎవరికి ఏక్షణమున ఏ ప్రమాదము వాటిల్లగలదో ఎవరును

చెప్పలేరు. ఒక గ్రామములో శోభాయమానముగ పెండ్లి జరుగుచుండ పందిరి తగులబడిపోగా అక్కడికక్కడే అటు వదిమంది కుప్పకూలిపోయిరట!

ఇట్టి సంఘటనలనుగూర్చి వినినపుడైనను జనులకు కనువిప్పు కలుగవలసియున్నది. మానవుడు ఏవేవో కలలు గనుచుండును. భవిష్యత్తునుగూర్చి అనేక ఊహలు (Speculation) చేయుచుండును. అంతయు సవ్యముగా జరుగగలదని అతడు భావించుచుండును. కనివిని యెఱుగని ఘోరవిపత్తులు రాబోవుచుండునని ఏనాడును అతడు తలంపడు. కనుకనే దైవమును విస్మరించి ప్రపంచమును సత్యమని నమ్మి క్షణిక సుఖములకై అఱ్ఱులు చాచుచుండును. లోకానుభవము చూచియైనను అతడు తనపద్ధతిని మార్చుకొనవలసియుండును. జరామరణములు సంభవించకమునుపే, పరిస్థితులు అనుకూలముగా నున్నపుడే, ఆరోగ్యము చక్కగ నున్న కాలముననే పరమార్థవిచారణ గావింపవలెను. ఏ సమయమున ఏ ఆపత్తు సంభవించునో యని తలంచి ఎప్పటికప్పుడే దైవచింతనాదులను ఒనర్చుచుండవలెను. అపరిమితముగు పుణ్యమును సంపాదించుచుండవలెను.

'తస్మాత్సర్వేషు కాలేషు' అను గీతాచార్యుని ఆదేశమును గుర్తెఱిగి జనులు ఎల్ల కాలములందును ఆ లోకాధీశుని సంస్మరించుచు, వారి వారి కార్యములను జరుపుకొనుచుండవలెను. జీవితము స్వల్పము, ఆచరింపవలసిన సాధనలు అనేకములు. కాబట్టి ఎంత శీఘ్రముగ మనుజుడు ఆత్మోన్నతికై

సాధనలను ఉపక్రమించునో అంత ధన్యుడు. గడచిన కాలము తిరిగిరాదు. ఈ జన్మము గడచిపోయినచో మరల ఇట్టి జన్మమే వచ్చునను హామీ ఏదియు లేదు. కాబట్టి విజ్ఞుడగువాడు లోకములో జరుగుచున్న ఘోరసంఘటలను వినియైనను, కనియైనను తన జీవితమును సంస్కరించుకొని, అధ్యాత్మపథమున దానిని మళ్లించి నిరంతరసాధనలచే, ధ్యానాద్యనుష్ఠానములచే సర్వేశ్వరుని సాక్షాత్కరించుకొనుటకై గొప్పయత్నము నాచరింపవలయును. పట్టుదల (Perseverence)గలవానిచే సాధింపరాని దెద్దియును ఉండదు. కావున ఆత్మసాక్షాత్కారరూప మహోన్నతలక్ష్యమును ఈ జీవితమందే ఎట్లైన సాధించివేయుటకై మనుజుడు కృతనిశ్చయుడు కావలయును.

ఇందులకై కాలయాపన చేయరాదు. గడచిన ఒక్క క్షణకాలము ఎన్నిరత్నములను వెచ్చించినప్పటికిని తిరిగిరాదు. భయంకరములైన జరామరణములు (వార్ధక్యము, మృత్యువు) అను ప్రబలశత్రువులు - రాక్షసులు ప్రాణిని మ్రింగివేయుటకై కాచుకొనియున్నారు.

జరాదర్శితపన్థానం ప్రచండవ్యాధిసైనికః
మృత్యుశత్రురధిష్ఠోఽసి త్రాతారం కిం న పశ్యసి.

'ముసలితనము అనువాడు దారిచూపుచుండ, ప్రచండ వ్యాధులను సైనికులను వెంటనిడుకొని, మృత్యువను శత్రువు నీపై దండెత్తుటకు వచ్చుచున్నాడు. ఓ మానవుడా! రక్షకుడగు పరమాత్మకొఱకై ఇప్పటికైనను ఏల యత్నింప

కున్నావు?' అని పెద్దలు హెచ్చరిక చేయుచున్నారు. కావున ఆలసింపక మోక్షప్రాప్తికై సత్వరమే ప్రయత్నము సలుప వలయును. దూరదృష్టితో యోచించి శరీరమును మృత్యువు గ్రసించకపూర్వమే తన పారమార్థిక కార్యక్రమమును పూర్తిచేయవలయును.

## దూ ర దృ ష్టి

పూర్వకాలమున శుద్ధోదనమహారాజు తన కుమారుడగు బుద్ధదేవుడు సన్న్యసించి భిక్షాటన మొనర్చుచు గ్రామగ్రామము లందును సంచరించుచున్నాడని విని, చాల దుఃఖించి ఈ క్రింది సందేశ మాతనికి ఒకానొక వార్తాహారుని ద్వారా పంపెను. 'నాయనా! నీవు మహారాజుల కుటుంబము నందు జన్మించితివి. రాజ్యపాలన నీ జన్మహక్కు. భోగైశ్వర్యములు నీ వంశసు. నా తండ్రి రాజాధిరాజు, నా తాత మహారాజు, నేనును రారాజును. ఇక నాకు జనించిన నీవును రాజవే కాని మరియొకడ వెట్లగుదువు? బాగుగా యోచించుకొనుము. బిచ్చగానివలె తిరుగుచు దౌర్భాగ్య జీవితము గడపకుము. వెంటనే తిరిగిరమ్ము. నీ జన్మహక్కగు సామ్రాజ్యాధిపత్యమును స్వీకరింపుము' – తండ్రి యా దేశమును విని బుద్ధదేవుడు తీవ్రముగ యోచించి యా వార్తాహారుని ద్వారా మరల ఈ క్రింది సందేశమును జనకునకు పంపివైచెను. బుద్ధిని మహోత్తరముగు యా దివ్య సందేశము ముముక్షువు లెల్లరకును వెలుగును ప్రసాదించునది కావున దానిని తప్పక గమనించవలసియున్నది—

'తండ్రీ! నీవు మహారాజువు నిజమే. పూర్వజన్మలో కూడ నీవు మహారాజువే. అంతకు పూర్వజన్మలో కూడ మహారాజువే. నేనో నా పూర్వజన్మలో సన్న్యాసిని. అంతకు పూర్వజన్మలో సన్న్యాసిని. ఇపుడును సన్న్యాసినైతిని. నీది మహారాజ పరంపర. నాది భిక్షు పరంపర. ఎవరి దారి వారిదే. ఏదియో కాకతాళీయముగ, లేక ఋణానుబంధముచే ఈ జన్మయందు మన యిద్దరము కలసికొంటిమి. ఈ కలయిక మరల ఎక్కువకాల ముండదు. మరణానంతరము నీ దారి నీదే. నా దారి నాదే. ఒక నదీ ప్రవాహమున అనేకములగు పుల్లలు, చెత్త చెదారము కొట్టుకొని పోవుచుండును. ఒక్క క్షణకాలమున ఏవియో రెండు పుల్లలు కలిసికొని మరల తరంగముల తాకిడికి వెంటనే విడిపోవును.

ఇదం కాష్ఠ మిదం కాష్ఠం నద్యాం వహతి సంగతః
సంయోగాశ్చ వియోగాశ్చ కా తత్ర పరిదేవనా.

సంసారమున జీవులయొక్క స్థితియు అట్టి ప్రవాహస్థ కాష్ఠముల పగిదియే యుండును. పూర్వజన్మములందు ఎక్కడెక్కడ నున్నవారో వచ్చి కుటుంబమునందు జేరి కొంత కాలము జగన్నాటకమాడి ఎవరిదారిని వారు చక్కా పోవుదురు. కావున విజ్ఞు లగువారు ఇట్టి సంయోగ వియోగములను గూర్చి దుఃఖింపరాదు. పైపెచ్చు ని మహారాజత్వమున కే కాలమందును భంగము కలుగలేదు. నీ రాజ పరంపర తెగకుండగనే వచ్చుచున్నది. అట్టిచో నా సన్న్యాసి పరంపర ఏల తెగవలెను?

పోనిండు నాపై మక్కువచే నన్ను చటికి అహ్వానము చేయుచున్నారేమో, మంచిది. అట్లే వచ్చెదను కాని—

'న భవే న్మరణాయ జీవితం మే
విహరేత్ స్వాస్థ్యమిదంచ మే న రోగః
న చ యౌవనమాక్షి పేజ్జరా మే
న చ సంపత్తి మిమాం హరేద్విపత్తిః.'

'తండ్రీ! నాకు మరణము ఎన్నడును కలుగకుండ చేయవలెను. అట్లు నీవు చేయగలవా? చేయగలశక్తి నీకు ఉండిననే నన్నాహ్వానింపుము. పోనీ, నాకు రోగ మెన్నడును జీవితములో సంభవింపకుండ చేయగలవా? అట్లు చేయగల స్తోమత నీకుండిననే నన్ను పిలువుము. పోనీ, నాకు ముసలి తనము రాకుండచేయగలవా? అట్టి అలౌకికశక్తి నీకున్నదా? ఉండినచో నేను వచ్చుటకు ఏ ఆక్షేపణయులేదు. పోనీ, నాకు విపత్తులే కాలమునందును నంభవింపక ఎల్లప్పుడు సదా సర్వకాలములందును సంపదలయందే నేను మునింగి యుండు లాగున చేయగల ధీమా నీకున్నదా? ఈ నా ప్రశ్నలకు ముందుగా జవాబిమ్ము. తదుపరి నా రాకవిషయమై అలోచించెదను.' ఈ వాక్యములను బుద్ధదేవుడు వార్తాహారుని ద్వారా తనతండ్రియగు శుద్ధోదనునకు తెలిపెను. తనయుని విజ్ఞానభరితములగు అమృతవాక్యములను విని శుద్ధోదనుడు నిరుత్తరుడై తన యాలోచనను విరమించుకొనెను.

శుద్ధోదనుడు భవిష్యత్కాలమునుగూర్చి విచారించ లేదు, దూరదృష్టితో వ్యవహరించలేదు. మృత్యువు అను

నది ఒకటి యున్నదని పూర్తిగ మరచిపోయెను. రోగము, వార్ధక్యము, విపత్తులు వీనినిగూడ మరచిపోయెను. బుద్ధదేవుడు దూరదృష్టిగల్గి, భవిష్యత్కాలమును సంస్మరించి, రాబోవు మహావిపత్కర పరిస్థితులను తండ్రికి జ్ఞాపకము చేసెను.

'మృత్యువనునది జీవితములో అతిముఖ్యమైన సంఘటన. తానెట్లు మరణించవలనో ఆలోచించుటకు మనుజునకు బోలెడు సమయము కలదు' అని యొక మహనీయుడు నుడివి యున్నాడు. కావున విజ్ఞుడగువాడు తన జీవితకాలముననే మరణమునుగూర్చి యోచించి, మరణరహితమగు అమృత పదవికి మార్గమును వెదకవలెను. భీష్ముడు, ద్రోణుడు మున్నగువారు జీవించియుండగనే శ్రీకృష్ణపరమాత్మ అమాంతముగ భవిష్యత్కాలములోనికి దూకి వారి మృత దేహములను విశ్వరూపమున అర్జునునకు జూపెను. శ్రీకృష్ణ మూర్తివలెనే ఈ ప్రకారముగ వర్తమానమున భావికాల చిత్రమును చూడగల, లేక కనీసము ఊహించగల మానవు లెవరైన కలరా? ఉన్నచో వారు ధన్యులు. మోక్షము యొక్క కీలకము వారికి లభించినదే యగును.

జనులు ప్రాపంచిక విషయభోగలాలసులై అహర్నిశ ములు వానివెంటనే పరుగులిడుచుండుటకు హేతువేమి? ఏమియో మునిగిపోయినట్లు రోజంతయు ఊపిరి తిరుగకుండ లౌకిక కార్యకలాపములందు మగ్నులై యుండుటకు కారణ మేమి? దైవమును విస్మరించుటకు, పాపకార్యములను

M—9

చేయుటకు నిమిత్తమేమి? శబ్దస్పర్శాదివిషయములు వారికి ఆనందముగ తోచుటకు కారణమేమి? ముందు జరుగబోవు దానిని మరచుటయే కారణము. మరణమును ఉపేక్షించు టయే కారణము.

'స్వదస్తే తావదేవైతే భావా జగతి ధీమతే
యావత్స్మృతిపథం యాతి న వినాశకరాక్షసః.'

(వసిష్ఠగీత)

''వినాశము, మృత్యువు అను దుష్టరాక్షసుడు జ్ఞాప కము రానంతవరకే ఈ ప్రపంచమునందలి పదార్థములు, భోగములు అన్నియు రుచించును. అది జ్ఞాపకమునకు వచ్చెనా, ఇవి అన్నియు చప్పబడిపోవును'' అని వసిష్ఠులు శ్రీరామచంద్రులకు బోధించిరి.

శ్లో॥ యది జన్మజరామరణం న భవేత్
యది చేష్టవియోగభయం న భవేత్
యది సర్వమనిత్య మిదం న భవేత్
ఇహ జన్మని కస్య రతిర్నభవేత్.

'జన్మదుఃఖము, వార్ధక్య మరణబాధలు లేనిచో, ఇష్టపదార్థములయొక్క వియోగము సంభవింపనిచో ఈ సమస్తప్రపంచము అనిత్యము కాకుండినచో, ఇక ఈజన్మము నందు (ఈ సంసారమునందు) ఎవనికి ప్రీతియుండదు – అని మహనీయులు పల్కుచున్నారు. నిజమే; పైనజెప్పిన దోష ములులేనిచో ఇక మోక్షమునకై జనులు ప్రయత్నింపవల సిన పనియే లేదు. ముక్తి సర్వులకును ఈ దృశ్యపదార్థము

లందే దొరకియుండెడిది. కాని అట్లు లేదు. ఏది పుట్టినదో అది గిట్టుచున్నది. వికారములకు లోనగుచున్నది. కావుననే దృశ్యవస్తువులయెడల విరక్తికల్గి విజ్ఞానవంతులు నిర్వికారమై, జననమరణ రహితమైనట్టి ఆత్మవస్తువుకొరకు అన్వేషించుచున్నారు. పాంచభౌతికమగు ఈ శరీరము ఎల్లప్పుడును నవయౌవనశ్రీని నోచుకొనలేదనియు, కొంతకాలమునకు శిథిలమై కృంగి కృశించిపోగలదనియు, మరి కొంతకాలమునకు రూపమే లేకుండ తొలగిపోగలదనియు (మృత్యుగ్రస్తమై పోవుననియు) ఎంచి జనులు దూరదృష్టి గలిగి, ఇప్పటి నుండియే దైవసాక్షాత్కారముకొరకు అహర్నిశములు పాటుపడవలెను.

# 5వ అధ్యాయము

## మోక్షమునకై ఎచట వెతకవలెను?

### దేహమందే దైవము

ఇక మోక్షముకొరకై ఎచట వెతకవలయునో యోచించెదము. అనాదికాలము నుండియు దేవునిపొంది మోక్షము బడయుటకొఱకు, ప్రపంచమున కృషి, అన్వేషణ జరుగుచున్నది. దేవు డెక్కడఉన్నా డను ప్రశ్నగాని, ఆతని నెట్లుపొందగలమను ప్రశ్నగాని ఈనాటిది కాదు. సృష్ట్యాది నుండియు ఆ ప్రశ్నను విడదీయుటకు ప్రయత్నములు కొనసాగుచున్నవి. ఆ జటిలసమస్యను కొందఱు మహానీయులు చాకచక్యములో, తమ నిరంతర నిష్ఠలో, ఆత్మవిశ్వాసములో, దృఢమైన పట్టుదలలో, అకుంఠిత అధ్యవసాయములో ఎదుర్కొని చివరకు దాని అంతు చూచిరి. వారు తుట్టతుదకు

'వేదాహమేతం పురుషం మహాన్తం
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్'

అని ఎలుగెత్తి చాటిరి. అనగా 'ఓ జనులారా! ఓ భగవంతుని బిడ్డలారా! ఓ ఆత్మస్వరూపులారా! ప్రకాశవంతమై, దేదీప్యమానమై, అజ్ఞానరూప తమస్సునకు అవల నున్నట్టి మహాపురుషుని, మహాశక్తిని, మహాతేజస్సును మేము ప్రత్య

క్షముగ చూడగల్గితిమి. తెలిసికొనగల్గితిమి. మీరున్ను చూడవచ్చును. మీరున్ను తెలిసికొనవచ్చును.” ఈ ప్రకారముగ లోకమున చాటినవారే ఋషులు. వారు భగవంతుని ఎచ్చట కనుగొనగల్గిరి? బయటా? కాదు. లోన. తమ శరీరములోనే. మట్టితో చేయబడిన శరీరములోనే ఆత్మరూప మాణిక్యమును కనుగొనిరి. వారు తమ అన్వేషణను బయట కొనసాగించలేదు. లోపలనే సాగించిరి. పంచకోశములను బాగుగ వెతికి వెతికి, గాలించి గాలించి ఆత్మదేవుని పట్టుకొనిరి.

ఈ శరీరము సామాన్యమైనది కాదు. ఆత్మదేవునకు మందిరము. భగవంతుడు ఊరేగుటకు దివ్యరథము. రథము లోపల రథికు డుండునట్లు శరీర మను రథములో జగన్నాథుడు వెలయుచున్నాడు. కావున బయట దూరముగ వెతకి వెతకి వేసారుటకంటె, అతి సమీపమునగల శరీరమునందు దైవమును వెతకి పడసి ధన్యతజెందుట శ్రేయస్కరము. పైగా, మానవశరీరమందు ఒక విశిష్టత గలదు. అదియే బ్రహ్మవలోక ధిషణము. అనగా మానవ మేధస్సునందు పరబ్రహ్మమును ప్రత్యక్షముగ సాక్షాత్కరించుకొనగల్గు శక్తి సామర్థ్యమును కలవు. ఇతర దేవతా శరీరములకుగాని, పశుపక్ష్యాది శరీరములకుగాని, వెయ్యేల సృష్టిలో గల ఎనుబదిమూడు లక్షల పైచిలుకుగల ఇతర దేహములకుగాని అట్టి ప్రజ్ఞావిశేషము లేదు. కొద్దికొద్ది పుణ్యమను మూల్యమును చెల్లించిన వారికి ఈసంసార సముద్రమును దాటుటకు చిన్న

చిన్న పడవలను భగవంతుడు ప్రసాదించెను. కాని మానవు డట్లు గాదు. 'మహతా పుణ్య పణ్యేన' అనునట్లు గొప్ప పుణ్య మను ఖరీదును చెల్లించినందు వలన అతనికి మానవ దేహమను సర్వసౌకర్యములతో గూడినట్టియు, సంసార దుఃఖాంబుధిని అవలీలగ దాటివేయుటకు శక్తివంతమైనట్టియు దివ్యనౌకను భగవంతుడు ప్రసాదించెను. అట్టిది లభించి నపుడు ఇక మనుజుడు ఇతర వ్యాసంగములను తగ్గించుకొని, లేక కట్టిపెట్టి, అతిముఖ్యమైన ఈ దైవసాక్షాత్కారరూప ప్రధానతమ విషయమందే దత్తచిత్తుడు కావలయును. తిరిగి ఇట్టి అవకాశము దొరకుట మహా దుర్లభము.

జడమైన ఈ శరీరమందు వెతకుచు రాగారాగా ఒక మహాచైతన్యము ప్రత్యక్షము కాగలదు. మట్టితో చేయబడిన ఈ దేహమును గాలించగా గాలించగా ఆత్మయను రత్నము, అందుండి బయటపడగలదు. కావున పంచకోశములను చక్కగా విచారించి, అవి జడములని నిశ్చయించి, క్షేత్రమును వేఱుచేసి శేషించు క్షేత్రజ్ఞుని కనుగొనవలెను. క్షేత్రమును ఉపేక్షించి, క్షేత్రజ్ఞుని యందు చిత్తమును నెల కొల్పవలయును. ఇదియే ధ్యానము. ఇదియే సమాధి. వివే కముచేతను, విచారణచేతను ఇట్టి స్థితి ప్రతివానికిని సాధ్య పడగలదు. కావున వైరాగ్యముచే ప్రాపంచిక దృశ్య సము దాయము యెడల అనాసక్తి గలిగి, అయా విషయవ్యామో హాముల నుండి చిత్తమును మఱలించి, అంతర్ముఖ మొనర్చి పంచకోశాంతర్గతమగు ఆత్మదేవుని దర్శించవలయును. అట్లు

దర్శించగల నేత్రమే నేత్రము. 'యః పశ్యతి స పశ్యతి' అని గీతాచార్యుడు వక్కాణించినట్లు అట్టివాని దృష్టియే సఫలమగు దృష్టి. అట్టివాడే వాస్తవముగ నేత్రములు కలవాడు. తక్కినవారు నేత్రము లుండియు, లేని వారితో జమ. కావున చర్మనేత్రములతోబాటు జ్ఞాననేత్రమును కూడ సంపాదించవలయును. ఇదియే శ్రీకృష్ణభగవానుని దివ్యాశయము. 'జ్ఞాన చక్షుషా' అను పవిత్రపదము ద్వారా ఈ సత్యమునే గీతాచార్యుడు ఉద్ఘాటించియుండెను. 'ఓ అర్జునా! జడమైన దేహమందు చైతన్యమగు ఆత్మను జ్ఞాననేత్రముచే దర్శించి ధన్యుడవు కమ్ము. క్షేత్ర క్షేత్రజ్ఞు లిరువురు అనాదికాలము నుండి కలిసిపోయి యున్నారు. జీవుని దుఃఖమునకు కారణ మిదియే. ఇపుడు జ్ఞానవిచారణచే వానిని వేఱుచేసి జడమును జడముగను, చైతన్యమును చైతన్యముగను వీక్షింపుము.' అని భగవానుడు కరుణతో పలికెను.

మట్టితో, నీళ్ళతో, నిప్పుతో, గాలితో, ఆకాశముతో నిర్మింపబడిన ఈ శరీరము, పంచభూతాత్మకమైన ఈ జడస్వరూపము తనలో ఒక గొప్ప మాణిక్యమును దాచుకొని యున్నది. దేహపేటికను వివేకముచే తెఱచి చూచినపుడు ఆత్మరూప మాణిక్యము, ప్రత్యక్షదైవము దృగ్గోచరము కాగలదు. కాని జనులీ రహస్యమును తెలిసికొనజాలక దేవునికొఱకై ఎక్కడెక్కడో వెతకుచున్నారు. నలుమూలల గాలించుచున్నారు. మనుజునకు తక్కిన వస్తువు లన్నిటికంటె అతి సమీపముగ నొక వస్తువు కలదు. అదియే దేవుడు.

అజ్ఞానవశమున ఈ సత్యమును జను లెఱుంగజాలకున్నారు. 'కశ్చిద్ధీరః' అనునట్లు ఏ ఒకానొక ధీరుడో అమృతత్వమును వాంఛించినవాడై తన దృష్టిని బహిర్ముఖవస్తుజాలమునుండి అంతర్ముఖముగ మఱలించి, ప్రత్యగాత్మను తనయందే వీక్షించి పరమానందమును బడయుచున్నాడు. కాబట్టి ఈ శరీరమును ఉపేక్షించరాదు. 'శరీరమాద్యం ఖలు ధర్మసాధనం'— ఈ శరీరము ద్వారానే జీవుడు ధర్మసాధన మొనర్చి తరింపవలసి యున్నాడు. ఓడ సరిగా లేనిచో సముద్రము నెవరైన దాటగలరా? సాధనము సరిగా లేనిచో సాధ్యము నెవరైన బడయగలరా? కావున యుక్తాహార విహారములచే దేహమును ఆరోగ్యవంతముగ, బలవంతముగ, శక్తివంతముగ నుంచుకొని, అందు దాగియున్న పరంజ్యోతిని ధ్యానవిచారణాదులద్వారా వీక్షించి జీవుడు తరించవలసియున్నాడు, జీవితలక్ష్య మిదియే యని జనులు మఱువకుందురు గాక! మట్టిగోడలతో నిర్మింపబడిన దేహమను దేవాలయములో మాణిక్యమువంటి మూలవిరాట్టును దర్శించి సాక్షాత్కరించుకొనుటయే జీవితమందలి ప్రధాన కర్తవ్యమని మనుజుడు జ్ఞప్తియందుంచుకొని అట్టి మహోన్నత ఆశయసిద్ధికొఱకై అనవరతము యత్న మాచరింపవలెను.

మట్టిలో వెతకుచుండినచో మాణిక్యము ఏ అదృష్టవంతునకో లభించవచ్చును, ఏ దురదృష్టవంతునకో లభించకపోవచ్చును. కాని శరీరములో వెతకుచుండినచో, బుద్ధి

గుహలో గాలించుచుండినచో ఆత్మయను మాణిక్యము దొరకకపోవుట అని ఉండదు. ప్రతివానికిని అది లభించును. ఇచట అదృష్ట, దురదృష్టములతో సంబంధము లేదు. జాతి మతముల ప్రసక్తి లేదు. లింగ వయో విచక్షణ లేదు. స్త్రీ అయినను పురుషుడైనను, మనుష్యుడైనను, దేవతయైనను, జంతువైనను, పక్షియైనను, కీటకమైనను ఎవరైనను సరియే ఆత్మరూప సాక్షాత్కారమును బడయవచ్చును. తన స్వరూపమును తాను తెలిసికొనుటలో ఒకరి అభ్యంతరమేమియుండగలదు ? మఱియొకటి ఏది అడ్డుపడగలదు ? కాబట్టి తనకు అతిసమీపములో తన హృదయగుహలో తన బుద్ధ్యంతరాళములో సహస్రసూర్య కాంతితో, బ్రహ్మాండమైన తేజముతో వెలుగుచున్నట్టియు సూర్యులకు సూర్యుడై చెన్నొందుచున్నట్టియు ఆత్మభాస్కరుని దర్శించి జీవుడు కృతార్థుడు కావలయును. ఇవ్విషయమున ఎవరి ఆక్షేపము ఉండదు. తన ప్రయత్నలోపమే తను పైకి రానీయకుండ చేయుచున్నది. తన బద్ధకమే తన్ను చెడగొట్టుచున్నది. కావున తమోగుణమును దులిపివైచి, బద్ధకమునకు తిలాంజలియొసంగి, సోమరితనమునకు స్వస్తిచెప్పి మనుజుడు తన దేహగేహమునందు, తన బుద్ధిగుహయందు ఆత్మరూప పరంజ్యోతికై అన్వేషణ ప్రారంభించవలెను. ప్రారంభించి వెనుకచూపు లేనిచో తప్పక గమ్యస్థానమును చేరగలడు. మధ్యలో ఎన్ని అవాంతరములు తటస్థించినను మహోన్నతమైన ఈ ఆత్మాన్వేషణ కార్యక్రమమును ఎవరును వదలరాదు.

జడమైనదే యని శరీరమును ఉపేక్షింపరాదు. ఐదు అడుగుల మట్టిబొమ్మ మనకేమి ఉపయోగించగలదని ఎవరును తాత్కారము చేయరాదు. మట్టిబొమ్మలో మాణిక్యమూర్తి ఉన్నాడు. 'Seek and it shall be found' 'వెతకండి! దేవుడు కనిపించగలడు!' అని పెద్దలు ఘోషించుచున్నారు.

స్వశరీరే స్వయంజ్యోతిః స్వరూపం సర్వసాక్షిణమ్
క్షీణదోషాః ప్రపశ్యన్తి నేతరే మాయయాఽఽవృతాః.

(అన్నపూర్ణోపనిషత్తు)

'ఓ జనులారా! మీ శరీరములోనే స్వయంజ్యోతియు, సర్వసాక్షియు ఐన పరమాత్మస్వరూపము వెలయుచున్నది. పాపము నశించినవారు మాత్రమే అద్దానిని చూడగలరు. తక్కినవారు చూడలేరు అని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. కాబట్టి చిత్తమందలి దోషములను, పాపములను తొలగించుకొని హృదయమును సత్త్వగుణమయముగ గావించుకొనినచో ఆత్మదేవుడు అమాంతముగ కనుపించును. ఇది అసలు కీలకము. దేవుడు కనిపించలేదే అని ఆక్షేపణ చేసిన ప్రయోజనము లేదు. దేవునకును జీవునకును మధ్య ఉన్న అడ్డుగోడను నిర్మూలించవలెను. అదియే మాయ, అవిద్య, అజ్ఞానము, తమోగుణము, రజోగుణము. వీనిని తొలగించనిదే, ఈ తెరను ఎత్తనిదే ఆవలఉన్న మూలవిరాట్టుయొక్క దర్శన మెట్లు కాగలదు? పెన్న దాటనిదే పెరుమాళ్లు ఎట్లు కనిపించును? 'తమసస్తు పారే' అన్నట్లు

భగవంతుడు తమస్సునకు ఆవలనున్నాడు. 'బుద్ధేః పరం' అని గీతాచార్యుడు సెలవిచ్చినట్లు బుద్ధికిపైగా వర్తించు చున్నాడు. బుద్ధికి సాక్షిగా వెలుగొందుచున్నాడు. కావున బుద్ధిని దాటు స్థితికి రావలయును. ప్రాపంచిక జనులందఱును బుద్ధికి ఈవలఉన్నారు. జ్ఞానియైనవాడు బుద్ధిని శుద్ధమొనర్చుకొని, అద్దానికి సాక్షియై వెలుగు పరమాత్మను కనుగొన గల్గుచున్నాడు.

అంగుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః
తం స్వాచ్ఛరీరాత్ప్రవృహే
న్ముఞ్జాదివేషీకాం ధైర్యేణ
తం విద్యాచ్ఛుక్రమమృతం
తం విద్యాచ్ఛుక్రమమృతమితి.

(కఠోపనిషత్తు 6-17)

ఆత్మ ఎల్లపుడు ప్రాణికోట్లయొక్క హృదయములో నివసించుచుండును. ముంజగడ్డినుండి దర్భగడ్డిని వేఱుచేయునట్లు ఆ పరమాత్మను శరీరమునుండి ధైర్యముతో విడదీయవలెను. అతడు శుద్ధుడు, అమృతుడు అని తెలిసికొనవలెను' అని కఠోపనిషత్తు పలుకుచున్నది. దీనినిబట్టి పరమాత్మ అతి సమీపముగ శరీరమున హృదయగుహయందే విరాజిల్లుచున్నాడని స్పష్టమగుచున్నది. పూజకు అవసరమైన దర్భగడ్డి ముంజగడ్డిలో దాగుకొనియుండును. దానిని ముంజగడ్డి నుండి విడదీసి, వేఱుచేసి జనులు ఉపయోగించుచుందురు. అట్లే క్షేత్రమునుండి క్షేత్రజ్ఞుని, జడమైన ఉపాధినుండి

చైతన్యమైన ఆత్మదేవుని ధైర్యముతో, వివేకసహాయమున వేఱుచేయవలెను. ఉపనిషత్కారుడు 'ధైర్యేణ' అను పదమును ప్రయోగించుటకు కారణము దుర్బలుడు, నిరుత్సాహవంతుడు, ధైర్యరహితుడు, తమోగుణయుక్తుడు, బద్ధకమునకు చోటిచ్చువాడు, పిరికితనమును ఆహ్వానించువాడు ఇట్టి ఘనకార్యమును ఎన్నడును సాధించలేడని తెలుపుటకొఱకే. 'బుద్ధ్యా ధృతిగృహీతయా' ధైర్యయుక్తమగు బుద్ధిచే ఇంద్రియములను నిగ్రహించినవాడే 'బ్రహ్మభూయాయ కల్పతే'—పరబ్రహ్మమును సాక్షాత్కరించుకొనగలడు అని కృష్ణపరమాత్మ గీతయందు సెలవిచ్చియున్నాడు. కావున శరీరమను మట్టిలో ఆత్మయను రత్నమును పొందుటకు వివేకము, ధైర్యము అత్యంతావశ్యకములు. అవి కలిగి అన్వేషణ సాగించువాడు నిరభ్యంతరముగ ఆత్మను తనయందే సాక్షాత్కరించుకొనగలడు.

అయితే ఈ ఆత్మ ప్రతివాని శరీరములో ఉన్నప్పటికిని అత్యంతసమీపమున వెలయుచున్నప్పటికిని ఏల అభివ్యక్తమగుట లేదు? జను లద్దాని నేల చూడజాలకున్నారు? దాని యనుభూతి జనుల కేల కలుగుట లేదు? ఈ ప్రశ్నకు కఠోపనిషత్తు చెప్పిన ఈ క్రింది సమాధానము బహురోచకముగానున్నది.

ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః.

'ఈ ఆత్మ సకలప్రాణులందును అతిగూఢముగా నున్నది. అది అందఱికిని కనుపించుటలేదు. సూక్ష్మదృష్టికల వారు మాత్రము తమ ఏకాగ్రబుద్ధిచే అద్దానిని చూడగలుగు చున్నారు.' అహా! ఎంత చక్కని సమాధానము? ఈ కాలమున అనేకులు దేవుడున్నాడా? ఉన్నచో మా కెందులకు కనుపించుటలేదు?' అని ప్రశ్నించుచున్నారు. దేవుడున్నాడు. కాని సూక్ష్మదృష్టి కలవారికి మాత్రమే గోచరించుచున్నాడు. పాపరహితమగు పవిత్ర చిత్తము కలవారికి మాత్రమే అనుభూతుడగుచున్నాడు. మలినమై, అధర్మయుక్తమై, అన్యాయసహితమై, రజోగుణాభిభూతమై, తమోగుణావశిష్టమై, పాపరూప దుర్గంధముతో గూడిన పాడుమనస్సులకు భగవంతు డెట్లు దృష్టిపథమున మెలగగలడు?

నీటిలో అనేక క్రిములుండును. అవి సామాన్య నేత్రమునకు కనుపించవు. భూతద్దముతో చూచినచో చక్కగా కనుపించును. అట్లే భగవంతుడు అతిసమీపమున హృదయగుహలో కాపురముండుచున్నప్పటికిని జ్ఞాననేత్రముతో చూచినపుడు మాత్రమే గోచరించగలడు. ధ్యాననేత్రములో అవలోకించినపుడు మాత్రమే ప్రత్యక్షము కాగలడు. అట్టి జ్ఞానమును, అట్టి ధ్యానమును, అట్టి ఏకాగ్ర నిర్మలచిత్తమును, అట్టి ఆత్మానాత్మ వివేచనాశక్తిని బడయనివానికి, దేవుడు చెంతనున్నప్పటికిని ప్రయోజనము లేకుండును, అట్టి వానికి సంసారదుఃఖము, జన్మబంధము కొనసాగుచునే యుండును. కాబట్టి చక్కని వివేకము నార్జించి, మనస్సు

నందు ఏవిధమైన పాపము, దోషము లేకుండ చేసికొని అట్టి పవిత్రమానసముచే పంచకోశమును గాలించి లోన అఖండముగ వెలుగుచున్న ఆత్మరూప మాణిక్యమును బడయవలయును.

పుష్పమాలలోని ప్రతిపుష్పమందును దారము అంతర్భూతమై యుండును. రత్నమాలలోని ప్రతిరత్నమందును దారము వ్యాపించియుండును. దారము లేనిదే మాల నిలవదు. మాలకు అస్తిత్వమును కలుగజేయునది దారమే. అయితే ఆ దారమును చేరుటకుగాని, దానిని పొందుటకుగాని, దానిని దర్శించుటకుగాని మార్గమేమి? పుష్పమును పరిశోధించుటయే అందులకు ఏకైకమార్గము. పుష్పము లోపల దారము కలదు కాబట్టి ఆ దారమును చేరుటకు పుష్పసంశోధన మొకటియే మార్గము.

ఈ శరీరమే పుష్పము. ఆత్మయే దారము. సమస్త భూతకోట్ల శరీరములను పుష్పములందు చిద్రూప పరమాత్మయను సూత్రము వ్యాపించియున్నది. 'సూత్రే మణిగణా ఇవ' అని భగవానుడు వ్రాక్రుచ్చియున్నాడుగదా! 'ఓ అర్జునా! నాకంటె వేఱుగ ఈ ప్రపంచమున మఱియొకటి ఏదియు లేనేలేదు. దారమునందు మణులవలె ఈ సమస్తప్రపంచమునందు నేను అనుస్యూతుడనై యున్నాను' అని గీతాచార్యుడు ఏ ప్రకారము తాసి జగత్తునందు వ్యాపించియున్నదియు తేటతెల్లము మొనర్చెను. కాబట్టి మనకు అతిసమీపమున నున్న ఈ శరీరరూప ఉపాధిని సంశోధించుటయే

పరమాత్మను చేరుటకు సులువైన ఉపాయము. పంచకోశ ములలోపల పరమాత్మ దాగియున్నాడు. కావున ఆ కోశ ములను చక్కగ విడదీయవలెను. సాంఖ్యవిచారణచే వాని అంతు చూడవలెను. విచారించగా విచారించగా ఆ కోశము లన్నియు జడములే యనియు, మట్టికి ఎంత విలువకలదో వానికి అంతియే విలువ కలదనియు, తుదకు మనస్సుకూడ పంచభూతములయొక్క సూక్ష్మాంశమే కాబట్టి అదియు జడమైనదే యనియు, ఆత్మయను మాణిక్యముయొక్క అపూర్వ తేజముయొక్క సాన్నిధ్యముచేతనే అవియన్నియు ఉనికిని, తేజమును, అస్తిత్వమును బడయుచున్నవనియు తేలగలదు.

పంచకోశాత్మకమైన ఈ జడమగు దేహోపాధియందు చైతన్యరూప పరమాత్మ కాపుర ముండుటవలన ఉపాధిని లయమొనర్చుటయే పరమాత్మను బడయుటకు ఉపాయమై యున్నది. లయమొనర్చుట యనగా, దానిని బలాత్కార ముగ నిర్మూలించుటగాని, దానిని బాధించుటగాని, ఛేదిం చుటగాని కాదు. ధ్యానముద్వారా అధిష్ఠానమగు ఆత్మ యందు నిలుకడగలిగి, ఉపాధిని విస్మరించుటయే యగును. అనాత్మయం దాసక్తిని తగ్గించినపుడే, లేక తొలగించినపుడే ఆత్మయం దాసక్తి పెంపొందును. కనుకనే ఆత్మసాక్షా త్కారమునకు వైరాగ్యము అత్యవసరమని పెద్దలు పేర్కొ నుటకు కారణము.

ప్రపంచము, దేహము, మనస్సు-అను ఈ మూడిం టిని దాటినచో, అనగా వానిభావన లేనిచో-ఆత్మ దానం తట నదియే ప్రత్యక్షము కాగలదు. ప్రాపంచిక పదార్థము లన్నియు క్షణికములనియు, అవి పరిపూర్ణ సుఖమును కలుగ జేయజాలవనియు, వానియందు అల్పసుఖము, అధిక దుఃఖము కలదనియు చక్కగా నెఱిగినచో వానిపై విరక్తి జనించును. ఈ ప్రకారముగ మొదటి అవరోధమగు 'దృశ్యప్రపంచ మును' దాటిపోవచ్చును. ఇక రెండవ అవరోధము దేహము, సాత్త్విక, మిత, దైవార్పిత, న్యాయార్జిత ఆహారసేవనము ద్వారా దేహమును ఆరోగ్యవంతముగ నుంచుకొనినచో, ధ్యానమందు దాని స్ఫురణయే ఉండదు. అత్తఱి ఆ దేహము బెండువలె, దూదిపింజవలె, బహు తేలికగా నున్నదై, ధ్యాన కాలమున అసలు స్ఫురించకయే యుండును. ఈప్రకారముగ రెండవ అవరోధమగు దేహమునుకూడ దాటిపోవచ్చును. ఇక మూడవది మనస్సు. సంకల్పములు, వాసనలు, సంస్కారములు——ఇవి అన్నియుచేరి మనస్సు అగుచున్నది. కాబట్టి దుస్సంకల్పములను పారద్రోలుటద్వారా, దుర భ్యాసములను రూపుమాపుటద్వారా, సత్త్వగుణసంసేవనము ద్వారా, వివేకముద్వారా, ఆత్మవిచారణద్వారా వాసనలను క్షీణింపజేసికొనినచో, మనస్సు దానంతట నదియే నశించి పోవును. ఈ ప్రకారముగ మూడవ అవరోధమగు మనస్సును కూడ దాటిపోవచ్చును.

ఇట్లు అనవరత సాధనలద్వారా 'దృశ్యప్రపంచము, దేహము, మనస్సు' అను ఈ మూడిటిని దాటినచో 'బుద్ధేః పరం' అనునట్లు బుద్ధికి అవలనున్న పరమాత్మ సాక్షాత్కరింపబడగలడు. ధ్యానమందు ఉపాధి లయమగునపుడు ఆత్మ యొకటియే శేషించును. 'ఇది కాదు, ఇది కాదు' (నేతి, నేతి) అని దృశ్యవర్గమునంతను తొలగించినపుడు శేషించు దృక్ వస్తువే ఆత్మ. కావున ఆత్మను చేరుటకు మార్గము, క్రొత్తగా ఆత్మను సృష్టించుటకాదు. ఎక్కడనుండియో ఆత్మను తెచ్చుకొనుటకాదు. ఉన్న ఆత్మను కప్పివేసిన దృశ్యమును తొలగించుటయే మార్గము. ధ్యానముద్వారా దేహాదిరూప ఉపాధిని విస్మరించుటయే మార్గము.

ఈ ప్రకారముగ దేహము (ఉపాధి) యొక్క తత్త్వమును చక్కగ సంశోధించి, వివేకమును కాగడా పుచ్చుకొని దానిలోపల బాగుగ వెతకినచో హృదయగుహయందు ఆసీనుడైయున్న సహస్రభాను తేజోవిలసితుడగు జ్యోతిర్మయుడైన శాశ్వత పరమాత్మ అనుభూతుడు కాగలడు. మట్టితో చేయబడిన ఈ శరీరములోపల ఆత్మరూపరత్నము ప్రకాశించుచున్నది. కావున శరీరముద్వారానే దానిని బడయవలసియున్నది. శరీరమును ఆరోగ్యవంతముగను, స్వస్థముగను ఉంచుకొని మనస్సును అదుపులో పెట్టుకొని ధ్యానాదులద్వారా లోన హృదయగుహలోనికి ప్రశాంతముగజొచ్చి ఆత్మయను అపురూపరత్నమును సంగ్రహించి జీవితమును ఆనందమయముగ నొనర్చుకొనవలయును.

ఆత్మకు 'దేహీ' అను పేరు కలదు. దేహమందు కలదు కాబట్టి దానికి ఆ పేరు వచ్చినది. అట్లే 'శరీరీ' అని పేరుకూడ దానికి కలదు. శరీరమందు వసించియున్నది కాబట్టి దానికి ఆ పేరు ఏర్పడినది. ఆ ప్రకారముగనే 'క్షేత్రజ్ఞుడు' అను నామధేయముకూడ ఆత్మకు కలదు. క్షేత్రమగు శరీరములో నివసించుచు ఆ శరీరమును (ఉపాధిని) తెలిసికొనుచున్నది కాబట్టి ఆ పేరు దానికి ఖ్యాతి పడినది. కావున భగవంతుడు అతిసమీపమున నున్న దేహమందే ప్రతిష్ఠితుడై యున్నాడని స్పష్టమగుచున్నది.

పూర్వకాలమున రాజులు వసించు పట్టణమునకు చుట్టు ప్రహరీగోడ (ప్రాకారము) ఉండి అచటచట దానిలో ద్వారములు నిర్మింపబడియుండును. అట్లే ఒకానొక పట్టణము కలదు. దానికి తొమ్మిది ద్వారములు కలవు. దానిలో ఒక రాజు నివసించుచున్నాడు. ఆ పట్టణమే దేహము. ఆ రాజే ఆత్మ. ఈ ఉపమానము గీతాచార్యునకు నచ్చినది కాబట్టియే యతడు గీతలో దానికి శాశ్వతమగు స్థానమును కల్పించి 'నవద్వారే పురే దేహీ' అని వక్కాణించెను. నవద్వార పురమగు దేహమున ఆత్మయను విఖ్యాతుడైన భూపాలుడు తానేమియు చేయకయు, చేయింపకయు తటస్థుడై వెలయుచున్నాడని గీతాబోధ.

దీనినిబట్టి భగవంతుడగు ఆత్మ ఎంత సమీపమున నున్నాడో వ్యక్తమగుచున్నది. మృణ్మయమగు ఈ శరీరమున చిన్మయుడగు పరమాత్మ తనకు తానే వెలుగుచు,

ఒకరి ప్రకాశమును అపేక్షించక, ఒకరిచో లికి పోక, మఱి యొకరి ఊసు తాను పట్టించుకొనక తటస్థుడై సర్వసాక్షియై వెలుగొందుచున్నాడు. తేజోవంతమగు అట్టి ఆత్మను ప్రత్యక్షము సేయుటకు మట్టితో చేయబడిన ఈ శరీరమును గాలించుట తప్ప వేఱు దారి లేదు. శరీరమందు వెతకుచుండి నచో బుద్ధి కనిపించును. ఆ బుద్ధియందు వెతకుచుండినచో ఆత్మ కనిపించును. కనుకనే మహాసీయులు అంతర్ముఖులై, బహిర్ముఖవృత్తిని ఏ మాత్రము దరికి చేర్చక, దృశ్యజాలమును విస్మరించి, పంచకోశాంతర్గతమగు ఏకాంతస్థానమున ఆత్మను కనుగొన గల్గిరి.

కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్
ఆవృత్త చక్షురమృతత్వ మిచ్ఛన్. (కఠోపనిషత్తు)

ఏ ఒకానొక ధీరుడో దృష్టిని లోపలికి మరల్చి బయటకు పోనీయక ఆత్మను సందర్శించుచున్నాడని కఠోపనిషత్తు పలుకుచున్నది. కావున శరీరములోపల వెతకుటయే ఆత్మను పొందుటకు దివ్యమైన సాధనము. హృదయమును గాలించుటయే హృదయేశ్వరుని బడయుటకు చక్కని మార్గము. పెట్టెను తెఱచుటయే పెట్టెలోని వస్తువును పొందుటకు ఉపాయము. అది మినహా మఱి ఏ యితర ఉపాయముల చేతను ఆ వస్తువు పొందబడదు.

విలువ గలిగిన వస్తువులను సామాన్యముగ ఎవరును బయట పారవేయరు. వీ ఇనుపపెట్టెలోనో భద్రపఱచుదురు. విలువలేని సామగ్రిని బయట నిర్లక్ష్యముగ పడవేయుదురు.

క్లే పరమార్థవిలువ ఏమాత్రము లేని ఈ క్షణిక నామరూపాత్మక ప్రాపంచిక పదార్థములకు, క్షణభంగురములైన ఈ దృశ్య విలాసములకు స్థానము దేహమునకు బయట ఏర్పాటు చేయబడినది. అతి మూల్యవంతమై, శాశ్వతమై, నాశరహితమైనట్టి ఆత్మకు శరీరములోపల స్థానము కేటాయించబడినది. అది రత్నములకంటె, మాణిక్యములకంటె, వజ్రవైడూర్యములకంటె ఉపరిస్థానమును ఆక్రమించుకొనినది. ధ్యానము ద్వారా, సమాధినిష్ఠద్వారా అంతర్ముఖులైన మహనీయులద్దానిని కనుగొని జన్మసార్థకతను బడసిరి.

సామాన్యముగ దేవాలయములోనికి పోయినవారు దేవునకు నమస్కరించినపుడు నేత్రములను మూసికొందురు. కారణమేమి? బాహ్యమున విగ్రహమున్నప్పటికిని, ఆ విగ్రహమునకు బింబభూతమై విరాజిల్లు హృదయస్థ పరమేశ్వరుని సందర్శించు నిమిత్తమే వారట్లు తమ నేత్రములను మూయుచుందురు. వాస్తవముగ విచారించినచో ఆత్మయనునది ఒక పరిమితవస్తువు కాదు. అది ఆకాశముకంటెను అతిసూక్ష్మమై సర్వవ్యాపకమై యున్నది. ప్రపంచములోని సమస్తపదార్థములకంటెను ఆకాశము సూక్ష్మమైనను, దానికంటె చిత్తాకాశము ఇంకను సూక్ష్మమైనది. దానికంటె చిదాకాశము (ఆత్మ) సూక్ష్మతరమైనది. అట్టి సర్వవ్యాపక పదార్థము ఒక చిన్న శరీరములో ఎట్లు ఇమిడి యుండగలదు అని సందేహింపనక్కఱ లేదు. ఏలయనగా నేత్రములు మూసికొని ధ్యానమందు మనస్సును లయింపజేసి శోధించు

ఆత్మయొక్క అనుభూతి బడిసినపుడు ఇక శరీరభావనయే యుండదు. శరీరస్ఫురణమే లేనపుడు ఇక దేహమునకు బయట, లోపల అను ప్రశ్నయే ఉదయించదు. అత్తరి దేహాది దృశ్యమంతయు చిద్రూప పరమాత్మయందు విలీనమై ఒక ఆత్మ మాత్రమే శేషించియుండును.

ఈ ప్రకారముగ ఆత్మానుభూతిని బడసినవారికి, ఇక దేహము కాని, మనస్సుకాని, బుద్ధికాని, నామరూపాత్మక ప్రపంచముగాని ఏవియు ప్రత్యేకముగ లేక అంతయు చిదాకారమయమై, 'సర్వంఖల్విదం బ్రహ్మ' అనురీతి బ్రహ్మస్వరూప పరిపూర్ణమై వెలుగొందుచుండును. అదియే మోక్షస్థితి. మట్టితో చేయబడిన జడమైన ఈ శరీరమును ఒక దేవాలయముగ భావించి, దాని ఆరోగ్యమును జాగ్రత్తగ కాపాడుకొనుచు, ఆ దేవాలయముయొక్క గర్భగుడి యగు మనస్సును (సూక్ష్మదేహమును) అతిపవిత్రముగ నుంచుకొని దానియందలి మాలిన్యమును రహితమొనర్చి రత్నమువంటి లోని మూలవిరాట్టును ధ్యానాది సాధనములద్వారా చక్కగ సాక్షాత్కరించుకొని, మానవజీవితమును చరితార్థమొనర్చుకొనవలెను.

శరీరమును ఎవరును ఉపేక్షించరాదు. శరీరియగు ఆత్మను పొందుటకు శరీరమే శరణ్యము. దేహముగుండా దేహిని సందర్శింపవలసి యుండును. నంది చెవులగుండా ఈశ్వరుని సందర్శించినట్లు క్షేత్రముగుండా క్షేత్రజ్ఞుని వీక్షించవలసియుండును. శరీరమును పడవద్వారా సంసార

సముద్రమును దాటవలసియుండును. కాబట్టి అద్దాని స్వాస్థ్య మును బహు జాగ్రతగ కాపాడుకొనుచు, క్రమముగ మన స్సును లొంగదీసికొని ఆత్మసందర్శనమును బడయవలసి యున్నది. అపుడే జీవితము పరిపూర్ణత్వమును బొందును. కోట్లకొలది జన్మపరంపరలను, గర్భనరకములను అనుభ వించి అనుభవించి విసిగి వేసారియున్న జీవు డపుడు శాశ్వత ముగ విరామమును బడయును. సాంసారిక దుఃఖపరితప్తు డగు జీవుడు అట్టి మహోన్నత పరమానందస్థితికై ఏల యత్నింపరాదు? అట్లు యత్నించువాడు ధన్యుడు, కృతా ర్థుడు, కృతకృత్యుడు.

మృణ్మయాత్మకమగు ఈ శరీరమున వెతకి వెతకి చిన్మయాత్మకమగు పరంధాముని కనుగొనుటయే జీవిత పరమావధి. మోక్షరూప పరమాత్మను సాక్షాత్కరించు కొనుటయే జీవితలక్ష్యము. సూర్యకాంతి సర్వత్ర ప్రసరించి నను అద్దమునందు చక్కగ ప్రతిబింబించులాగున దైవశక్తి సర్వత్ర వెలయుచున్నను ఉపాధియందు (మనస్సునందు) చక్కగ అనుభూతము కాగలదు. సూర్యకాంతి మట్టిమీద పడినచో సరిగా గోచరించదు. నీటియందు పడినచో ఒకింత గోచరించును. గోడమీద పడినచో ఇంకను చక్కగ ప్రకా శించును. కాని అద్దముపై పడినచో దేదీప్యమానముగ భాసిల్లును. కారణము అద్దము స్వచ్ఛముగను నిర్మలముగను ఉండుటయే. అట్లే పరమాత్మ సత్తాసామాన్యరూపమున సచ్చిదానందరూపమున ప్రపంచమం దెల్లెడల విద్యమానమై

యున్నప్పటికిని, దేహాస్థమగు నిర్మలమనస్సునందు ప్రత్యక్షముగ గోచరించుచున్నాడు. ఎవనియొక్క మనస్సు విమల సరోవరముమాదిరి స్వచ్ఛముగ, దోషరహితముగ, రజోగుణ తమోగుణ వర్జితముగ, వాసనాశూన్యముగ వెలయుచుండునో అట్టి పవిత్రమానసమే భగవన్నిలయము కాగలదు. ఆత్మసాక్షాత్కారమనగా నిదియే.

దేవునికొఱకై దూరదూరమున వెదకుట సామాన్యులు చేయుపని. 'సర్వస్య చాహం హృది'—అని గీతావాక్యులు సెలవిచ్చినవిధముగ అందఱియొక్క హృదయమున భగవంతుడు తన నివాసమును ఏర్పఱచుకొని యుండుటవలన, అతనిని కనుగొనుటకై మహనీయులు దూరవస్తుపరిశోధనను విరమించి ఆత్మపరిశోధన కుపక్రమింతురు. అంతర్ముఖులై హృదయమును గాలించుదురు. 'ఆవృత్త చక్షు రమృతత్వమిచ్ఛన్'—అని యమధర్మరాజు పేర్కొనిన చందమున నేత్రాదిఇంద్రియములను లోనికి త్రిప్పి, దృష్టిని అంతర్ముఖము చేసి, శరీరములోపల, మనస్సులోపల పరమాత్మను ధీరులు వెదకుచుందురు.

"స్వగృహే పాయసం త్యక్త్వా భిక్షామటతి దుర్మతిః"
తనయింటియందు వండబడిన పాయసమును వదలివైచి ఊరిలో బిచ్చమెత్తుకొనువాడు మందమతియే యగును. తన శరీరమందు ప్రజ్ఞారూపమున వెలయుచున్న పరమాత్మను వదలి బయట ఎక్కడనో దేవునికొఱకై అన్వేషణ జరుపువాడు సత్యవస్తుపరిజ్ఞానము లేనివాడే యగును. ప్రతివాని

శరీరమందును 'ప్రజ్ఞ' కలదు. ఆ ప్రజ్ఞయే భగవంతుడు. "ప్రజ్ఞానం బ్రహ్మ". ఏ శక్తిచే మనుజుడు చూచుచున్నాడో, వినుచున్నాడో, రుచిని తెలిసికొనుచున్నాడో, అదియే ప్రజ్ఞ. ఆ ప్రజ్ఞయే దైవము. మట్టితో చేయబడిన ఈ శరీరము నందు ధ్యానముద్వారా ఆ ప్రజ్ఞారూపరత్నమును కనుగొనుటకు వీలున్నది. జీవితము పరిసమాప్తము కాకపూర్వమే ఈ మహత్తర లక్ష్యమును సాధించుటకు ప్రతివారును బద్ధకంకణులు కావలయును.

జడమైన శరీరమను మట్టిముద్దను 'నేను నేను' అని అనుకొని జన్మను వృథాచేసికొనుటకంటె అందలి చైతన్యమగు ఆత్మయే 'నేను నేను' అని భావించుకొని మానవత్వమును సార్థకము చేసికొనుటమేలు. మట్టియొక్క వికారమగు శరీరము మట్టిలో కలిసిపోవుటకు పూర్వమే ఆ మట్టియందు వెలుగుచున్న దివ్యరత్నమునుగూర్చి విచారణ సల్పువాడు ధన్యుడు. శ్రద్ధాభక్తులతో ప్రయత్నము చేయువారికందఱికీ ఆ ఆత్మరూప మహారత్నము చేతికి చిక్కగలదు.

కాని కొందఱు ఆత్మసాక్షాత్కారమునకై వినియోగపడవలసిన ఈ పవిత్ర మానవశరీరమును విషయసుఖభోగ సంపాదనమునకే వెచ్చించుచు దురుపయోగము చేయుచున్నారు. ఇది యెట్లున్నదనగా—

స్థాల్యాం వైడూర్యమయ్యాం పచతి తిలఖలం చాన్దనై రిన్ధనాద్యైః
సౌవర్ణై ర్లాంగలాగ్రై ర్విలిఖతి వసుధామర్కతూలస్య హేతోః

ఛిత్వా కర్పూరఖణ్డాన్ వృతిమిహ కురుతే కోద్రవాణాం సమన్తాత్
ప్రాప్యేమాం కర్మభూమిం న భజతి పురుషో యస్తపో మన్దభాగ్యః.

ఒకానొకడు వజ్రవైడూర్యములు పొదగబడిన ఒక బంగారుపాత్రను పొయ్యిమీద పెట్టి చందనపు కట్టెల మంట వేయుచు తెలికపిండిని దానియందు వండుచున్నాడు. ఇంతియేకాదు. బంగారపు నాగలితో నేలదున్ని జిల్లేడుచెట్లు నాటుచున్నాడు. కర్పూరపు చక్కెరకేళి చెట్లు నరికి పొలముచుట్టు కంపకట్టి లోపల ఆళ్లు చల్లుచున్నాడు. కర్మ భూమియగు ఈ భరతఖండమున జన్మించి చక్కని మానవ శరీరమును బడసి ఎవడు పరమాత్మను ధ్యానింపక క్షుద్రము లగు భోగవిలాసములందే కాలము గడుపుచున్నాడో అతడు పైన తెలిపిన ఉన్మత్తక్రియ లొనర్చువానితో సమానుడే యగును.

పై దృష్టాంతమునందు పాత్ర గొప్పది. కట్టెలు గొప్పవి. లోపల వండు పదార్థము అల్పమైనది. నాగేలు విలువైనది. కంచె విలువైనది. కాని లోపలవేయు పైరు అల్పమైనది. అట్లే మానవశరీరము విలువైనది. కాని దానితో జనులు సాధించు వస్తువు అల్పమైనది. శరీర మేర్పడినది ఇంద్రియార్థముల కొఱకుగాదు. ఆత్మకొఱకు, దైవముకొఱకు, మానవత్వము లభించినది. బంధనమును దృఢపఱచుటకుగాదు, బంధమును వదిలించుకొనుట కొఱకు. కావున శరీరమును ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని విషయభోగములపైకి విచ్చలవిడిగా పరుగిడనీయక, అదు

పులోనుంచి, జీవితలక్ష్యమగు పరమాత్మను వెతకుటలో వినియోగించవలెను.

అద్భుతమగు ఈ శరీరము మఱల మఱల లభించునది కాదు. బ్రహ్మవలోకనసమర్థమగు ఈ మనస్సు మఱల మఱల దొరకు పదార్థముకాదు. సృష్టియందలి చరాచరా ప్రాణికోట్లన్నియు, తుదకు దేవతలు సైతము ఈ అపూర్వ మానవదేహమును బడయుటకొఱకై తహతహలాడు చున్నారు. అట్టి సౌభాగ్యమును బడసిన మానవుడు ఇక మీనమేషములు లెక్కించుచు కూర్చొనక, ఉన్న కొలది ఘడియలు తానెవరో, జగత్తేమియో, ఎచటికి వెళ్ళవల యునో, లక్ష్యమేమిటో, బాగుగ విచారించి క్షేత్రమగు ఈ శరీరమందు క్షేత్రజ్ఞుడగు పరమాత్మను తెలిసికొని భార భూతమగు ఈ సంసారమును పరమానందమయముగ మార్చు కొనవలయును.

జడమైన శరీరమునందు చైతన్యవంతమగు ఆత్మ కాపురముండుచున్నదని నిరూపించుటకు కొన్ని ప్రబల సాక్ష్యములు ఈ క్రింద ఒసంగబడుచున్నవి—

ఉపనిషత్తులు :

1. అన్తశ్శరీరే జ్యోతిర్మయో హి శుభ్రో
యం పశ్యన్తి యతయః క్షీణదోషాః.

(ముండకోపనిషత్తు).

శరీరములోపల జ్యోతిస్వరూపమై, నిర్మలమై వెలుగు చున్న ఆత్మను పాపరహితులగు మహానీయులు దర్శించు చున్నారు.

2. స్వశరీరే స్వయంజ్యోతిస్స్వరూపం సర్వసాక్షిణమ్
క్షీణదోషాః ప్రపశ్యన్తి నేతరే మాయయాఽఽవృతాః.
(అన్నపూర్ణోపనిషత్తు)

తన శరీరమున స్వయంజ్యోతియై, సర్వసాక్షియై వెలుగొందుచున్న పరమాత్మను పాపాదిదోషములు నశించిన పుణ్యాత్ములే చూడగలరు కాని మాయచే కప్పబడిన అజ్ఞానులు కాదు.

3. అశరీరం శరీరేషు అనవస్థేష్వవస్థితం
మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి.
(కఠోపనిషత్తు)

అశాశ్వతములైన శరీరములందున్నదియు, రూప రహితమైనదియు, మహత్తరమైనదియు, సర్వవ్యాపక మైనదియునగు ఆత్మను తెలిసికొనిన ధీరుడు శోకింపడు.

4. భూతముక్తావలీతన్తుం చిన్మాత్రమవలోకయేత్.
(మహోపనిషత్తు)

ప్రాణికోట్ల శరీరములను ముత్తెములందు దారము వలె వ్యాపించియున్న చిన్మాత్రస్వరూపమగు ఆత్మను దర్శించవలయును.

భగవద్గీత :

1. దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత.

ఓ అర్జునా! సమస్తజీవులయొక్క దేహములందు వెలుగొందుచున్న దేహియగు ఆత్మ నిత్యమైనది. అది చంపబడదు.

2. శరీరస్థోఽపి కౌన్తేయ న కరోతి న లిప్యతే. (13-32)

ఓ అర్జునా! శరీరమందున్నను ఆత్మ దేనిని చేయుట లేదు, దేనిచేతను అంటబడుట లేదు.

3. క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత. (13-3)

ఓ అర్జునా! అన్ని ఉపాధులందును ఆ ఉపాధులను తెలిసికొను సాక్షియైన ఆత్మను నేను.

4. సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే. (13-33)

సకల శరీరములందును వెలయుచున్న ఆత్మ దేని చేతను అంటబడకనున్నది.

5. నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్. (5-13)

తొమ్మిది ద్వారములుగల పట్టణమగు శరీరమందు దేహియగు ఆత్మ ఏమియుచేయుకయు, చేయింపకయు తటస్థముగ నున్నది.

ఈ ప్రకారము భగవానుడగు ఆత్మ అతిసమీపమగు దేహమందు వెలయుచున్నాడని శాస్త్రములన్నియు ఉద్ఘోషించుచుండ ముముక్షువగువాడు అట్టి అతిసమీపవస్తువునకై

ఏల అన్వేషించరాదు? దేనిని పొందినచో ఇక పొందదగిన వస్తువేద్దియు మిగిలియుండదో, దేనిని తెలిసికొనినచో ఇక తెలిసికొనవలసిన వస్తువేదియు శేషించియుండదో అట్టి ఆత్మవస్తువు ఈ శరీరమందే దాగియున్నదని స్పష్టమగుచున్నది కావున అద్దానిని బడయుటకై సాధకుడు సర్వవిధముల యత్నములు సలుపవలసియున్నాడు.

ఈ శరీరము జడవస్తువు అయినప్పటికిని దానిద్వారా చైతన్యమగు ఆత్మ లభించుచున్నది. అందుచే దానిని అలక్ష్యము చేయరాదు. ఈ శరీరము అసద్రూపమైనప్పటికిని దానిద్వారా సద్రూపమగు ఆత్మ భగవానుడు సాక్షాత్కరింపబడుచున్నాడు. కావున దానిని చిన్నచూపు చూడరాదు. ఈ తనువు మృత్యురూపమైనప్పటికిని అమృతస్వరూపుడగు పరమాత్మ దానిద్వారా లభించుచున్నాడు. కావున దానిని తిరస్కరించరాదు. జడములో చైతన్యము కాపురముండుచున్నది. అసత్తులో సత్తు నివసించుచున్నది. మృత్యువులో అమృతత్వము తొంగిచూచుచున్నది. తమస్సులో జ్యోతి వెలుగొందుచున్నది. కాబట్టి ఘటసదృశమైనప్పటికి ఈ పంచభూతాత్మక శరీరముయొక్క ఆరోగ్యమును బహుజాగ్రత్తగ కాపాడుకొనుచు, విజ్ఞుడగువాడు దానియందు వెలయు ఆత్మరూప రత్నమునకై పరిశోధన ప్రారంభించవలెను.

పుట్టలో పామున్నదని తెలిసినవాడు ఏదియోవిధముగ ఆ పుట్టనుత్రవ్వి పాము నెట్లు వెలికి తీయుచున్నాడో,

భూమియందు జలమున్నదని తెలిసినవాడు భూమిని త్రవ్వి ఆ జలము నెట్లు బహిర్గతము చేయుచున్నాడో, విలువైన వస్తువు ఇంటియందున్నదని తెలిసిన చోరుడు తన శాయ శక్తుల ప్రయత్నించి ఆ వస్తువు నెట్లు అపహరించుకొని పోవు చున్నాడో, అట్లే ఈ ఉపాధియందు ఆత్మదేవుడు భాసిల్లు చున్నాడని శాస్త్రప్రమాణములవలన, గురూపదేశమువలన తెలిసికొనిన ముముక్షువు ఇట్టి తద్దైవసాక్షాత్కారమునకై అహర్నిశములు పాటుపడవలసియున్నది.

'యద్దృశ్యం తన్నశ్యం'—'ఏది కనుపించుచున్నదో అది కాలగర్భమున అంతరించిపోవును, నశించితీరును'— అను శాస్త్రోక్తివలన బయట కానుపించు నామరూపములను నమ్ముకొని వానియందు శాంతిని అన్వేషించుట, దైవము కొఱకై బయట గాలించుట విజ్ఞులొనర్పదగిన కార్యములు కావు. దృష్టిని అంతర్ముఖమొనర్చి, బాహ్యప్రపంచమువైపు పరుగిడనీయక, హృదయగుహలోనికి దానిని మఱలించి ధ్యానముద్వారా పరమాత్మను ముఖాముఖి దర్శించుట, అనుభూతి మొనర్చుకొనుట తరింపదలచిన మానవునియొక్క ప్రప్రథమకర్తవ్యమైయున్నది. తన నిజస్వరూపము నెఱింగిన పిదప ప్రపంచము ఆనందమయముగ గన్పించును. అత్తఱి యతడుచేయు కార్యములన్నియు నిర్దుష్టములుగను, ఆదర్శ వంతములుగను, పరోపకారపరాయణములుగను నుండును. కనుకనే 'యోగస్థః కురు కర్మాణి' అని పెద్దలు సెల విచ్చిరి. అనగా నీ ఆత్మను తెలిసికొని, ఆత్మస్థితియందుండి

ప్రపంచమున విహరింపుము. కర్తవ్యకర్మల నాచరింపుము అని యర్థము. అత్తరి ప్రపంచమంతయు నందనవనముగ భాసించును. దుఃఖమయమగు సంసారమంతయు సుఖమయముగ విరాజిల్లును.

శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారు ఒక చక్కని ఉపమానమును సెలవిచ్చియున్నారు. ఒక కుండ. దానికి కొన్ని రంధ్రములు. రాత్రిపూట ఆ కుండలో ఒక దీపము వెలిగించబడినది. అపుడు ఆ దీపపు కాంతి ఘటముయొక్క రంధ్రములద్వారా బయటకు స్ఫుటముగ గోచరించుచున్నది. అట్లే ఈ శరీరం ఒక ఘటము. ఇంద్రియములు రంధ్రముల వంటివి. శరీరమందు ఆత్మ యను జ్యోతి కలదు. ఆ జ్యోతి యొక్క శక్తి ఇంద్రియములద్వారా ద్యోతకమగుచున్నది. కన్ను చూచుచున్నది, ఏ శక్తిచేత? లోన ప్రజ్ఞ కలదు. ఆ ప్రజ్ఞయే ఆత్మ. ఆ ప్రజ్ఞయే బ్రహ్మము. 'ప్రజ్ఞానం బ్రహ్మ' అని ఉపనిషత్తు లుద్ఘోషించుచున్నవి కదా! ఆ ప్రజ్ఞచేతనే ఇంద్రియములు వానివాని వ్యాపారములను కొనసాగించు చున్నవి. ఏ తెలివిచేత కన్ను చూచుచున్నదో, చెవి విను చున్నదో, ముక్కు వాసన చూచుచున్నదో అదియే ప్రజ్ఞా స్వరూపమగు ఆత్మ.

> యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ
> స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞాన ముదీరితమ్.

అను శాస్త్రవాక్య మీ సత్యమునే ఋజువు చేయుచున్నది.

మట్టితో చేయబడిన ఈ శరీరమను కుండయందు రత్నమువంటి ఆత్మజ్యోతి ప్రకాశించుచుండ ఆ జ్యోతి యొక్క కాంతి ఇంద్రియముల ద్వారా బహిర్గతమగు చున్నది. శ్రీ శంకరుల ఉపమానము యొక్క సారాంశ మిదియే. వారు ప్రవచించిన శ్లోక మిచట పూర్తిగా ఉదాహ రింపబడుచున్నది.

> నానాచ్ఛిద్రఘటోదరస్థితమహాదీపప్రభాభాస్వరం
> జ్ఞానం యస్య తు చక్షురాదికరణద్వారా బహిః స్పన్దతే
> జానామీతి యమేవ భాన్తమనుభాత్యేతత్సమస్తం జగత్
> తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే.

ఏ ప్రజ్ఞారూపమగు పరమాత్మదీపము యొక్క ప్రకా శముచే ఇంద్రియము లన్నియు వానివాని కార్యములు చేయ గల్గుచున్నవో, వానివాని శక్తులను ఉజ్జీవింపజేయుచున్నవో, ఆ ప్రకాశముయొక్క ప్రకాశముచేతనే ఈ జగత్తంతయు ప్రకాశించుచున్నది. ఆ జ్ఞానభాస్కరుని ఉనికిచేతనే ఈ జగ త్తంతయు ప్రకాశించుచున్నది. ఆ జ్ఞానభాస్కరుని ఉనికి చేతనే ఈ భాస్కరుడు లోకమునందు తన తేజఃపుంజములను ప్రసరింప జేయుచున్నాడు. (తస్య భాసా సర్వమిదం విభాతి).

దీనినిబట్టి దేవదేవుడు అతి సమీపముననే వెలయు చున్నాడని స్పష్టమగుచున్నది. శరీరమందే ఆత్మరూపమున ప్రకాశించుచున్నాడని విదితమగుచున్నది. ఇక చింత యేల? దుఃఖమేల? ఆనందమే జీవుని వాస్తవరూపమై యుండ ఇక దుఃఖమునకు తావెచట? అజ్ఞానమే దుఃఖము

నకు హేతువు. తన యథార్థ రూపముయొక్క పరిజ్ఞానము లేమియే జీవుని వడుపునకు కారణము. మహాత్ములయొక్క అనుభవపూర్వకమైన బోధలచేతను, శాస్త్ర ప్రమాణముల వలనను, ఇక జీవుడు బహుజన్మలనుండి అజ్ఞానవశమున కొనసాగించుచున్న పరితాపమును, చింతను పారద్రోలి, ఘటమందు దీపమువలె మట్టిలో మాణిక్యమువలె తనలో సాక్షాత్ పరమాత్మ వసించుచున్నాడని స్పష్టముగ ఎఱింగి, ధ్యాననిష్ఠద్వారా ఆ పరమాత్మయే తన వాస్తవరూపమను అనుభూతిని బడసి జీవితమును ధన్య మొనర్చుకొనవలెను. ఈ ప్రకారముగ ఆత్మసాక్షాత్కారముచేత కర్మబంధమును తొలగించుకొని, కర్మరాహిత్యము ద్వారా జన్మరాహిత్యమును పొందవలెను. ఇదియే జీవిత లక్ష్యము. ఇదియే మోక్షము.

# 6 వ అధ్యాయము

## మోక్ష ప్రయాణసూత్రములు

ఇక, మోక్షప్రయాణమందు సాధకు డవలంబించ వలసిన కొన్ని సూత్రములను గుఱించి విచారించెదము.

తిరుమలేశుని సన్నిధానమునకు పోవుదారిలో రోడ్డుకు ప్రక్కగాగల ఒకానొక బోర్డుపై ఈ క్రింది వాక్యములు వ్రాయబడియున్నవి :

Start early
Drive slowly
Reach safely

వీని అర్థము—

త్వరగా బయలుదేరుము
వాహనమును శాంతముగా నడుపుము
సుఖముగా చేరుము

రహదారి శాఖాధికారులు మోటారుబండ్లు మొదలైనవి నడుపువారి జాగ్రతకొఱకు వ్రాసిన హెచ్చరిక వాక్యము లివి. 'ఓ జనులారా! శ్రీ వేంకటేశ్వరుల సన్నిధానమునకు త్వరగా బయలుదేరుడు. కంగారు పడకుండ, ఒడుదుడుకులు లేకుండ మీ మీ వాహనములను జాగ్రతగ నడుపుకొనుచు పోవుడు. ఇవ్విధముగ జాగరూకతతో

ప్రయాణము సల్పి గమ్యస్థానమును సుఖముగా చేరుకొనుడు! అని ఆ వాక్యములు ప్రయాణీకులను ఆదేశించుచున్నవి.

పై మూడు సూత్రములు కేవలము ప్రయాణమునకు సంబంధించినవి అయినను, అధ్యాత్మమార్గమున జను దైవాన్వేషణతత్పరులకును అవి బాగుగ అన్వయించును. ముముక్షుజనహితవాక్యములుగ వానిని పరిగణించవచ్చును. ఏల యనగా, ప్రయాణములు రెండు రకములుగ నున్నవి. సామాన్య ప్రయాణము, దీర్ఘప్రయాణము అని. లోకములో బండ్లపై, మోటార్లపై, విమానములపై, రాకెట్లపై జరుపు ప్రయాణములు సామాన్యమైనవి. పుట్టుచు, చచ్చుచు జననమరణరూప సంసార ప్రవాహమున కొట్టుకొనిపోవుచు, నానాయాతన లనుభవించుచు జీవుడు కావించు ప్రయాణము దీర్ఘమైనది. ఈ రెండవ ప్రయాణమునుగూర్చియే అర్జునుడు, శ్రీ కృష్ణపరమాత్మ యిరువురును భగవద్గీతయందు ప్రస్తావించిరి. 'ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి' అని అర్జునుడున్ను 'ప్రయాణకాలే మనసాఽచలేన' అని శ్రీకృష్ణుడున్ను ఇద్దఱు ఆ దీర్ఘప్రయాణము నుద్దేశించి ఎనిమిదవ అధ్యాయమున కొంత ప్రసంగమును నడిపిరి.

ఉపర్యుక్త ప్రయాణసూత్రములు రెండు ప్రయాణములకునుగూడ ఉపయోగించును. ఎట్లనగా—

1. <u>మొదటి సూత్రము</u> "Start early—త్వరగా బయలు దేరుము"—ఓ జీవుడా! మోక్షరూప గమ్యస్థాన

మునకై త్వరితముగ బయలుదేరుము. ఇప్పటికి ఎన్నికోట్ల జన్మలెత్తితివో, ఎన్ని యోనులందు తిరుగాడితివో, ఎన్ని గర్భనరకము లనుభవించితివో లెక్కలేదు. ఇకనైనను ఈ దుర్భర సంసారచక్రపరిభ్రమణమునకు స్వస్తిచెప్పి, పరమాత్మను ఈ జన్మయందే సాక్షాత్కరించుకొని అతిదుర్లభమైన ఈ మానవజీవితమును సార్థక మొనర్చుకొనుము. ఏమాత్రము ఆలస్యము చేయకుము. నీ అమూల్యసమయమును ప్రాపంచిక విషయభోగ విలాసములందు వ్యర్థము చేయకుము. గడచిపోయిన ఒక్క నిమిషము కోట్లకొలది రూప్యములను వెచ్చించినను తిరిగిరాదు. ప్రమాదము జరిగిన వెనుక పరితాపము నొందుటకంటె ప్రమాదము జరుగక పూర్వమే జాగ్రతపడి దానిని తప్పించుకొనుట విజ్ఞుని లక్షణము.

బాల్యము, యౌవనము అను ఈ రెండు సమయములు సాధన చేయుటకు చాల అనుకూలమైనవి. వార్ధక్యమునందు ప్రతిబంధకములు చాల మెండుగా నుండును. కావున శరీరమునందు జవసత్వములున్నపుడే, ఆరోగ్యము క్షీణించకమునుపే, బాల్య యౌవనములందే పరమార్థ సాధనలను చక్కగ గావించుకొనుడు. 'త్వరగా బయలుదేరుము' అను ప్రయాణసూత్రముయొక్క భావమిదియే.

2. ఇక రెండవ సూత్రము— "Drive slowly—శాంతముగా నడుపుము"—భగవంతుని జేరుటకై ప్రయాణము సలుపువాడు ఏమాత్రము కంగారుపడక, గంభీరముగా తన యాత్రను కొనసాగించవలెను.

Slow and steady wins the race.

శాంతముగా, నిబ్బరముగా జనువాడు పందెమును తప్పక గెలుచుకొనును. లక్ష్యమును త్వరితముగ చేరుకొన వలెనను సంకల్పము మంచిదే అయినను, ఆ తొందరలో అసలు కార్యమునకే వైఫల్యము సంభవించునట్లు చేసికొన గూడదు. పరుగిడి పాలు త్రాగుటకంటె నిలబడి నీళ్ళు త్రాగుట మేలు.

Haste makes waste
Waste makes worry
So don't be in a hurry.

'తొందరపాటు వినాశమును కలుగజేయును. వినాశము మనస్సును క్రుంగదీయును. కాబట్టి ఏ కార్యమందును త్వరపడకుడు. శాంతముగ, గంభీరముగ మీ మీ లౌకిక, ఆధ్యాత్మిక కార్యములను చేసికొనుచు పోవుడు' అని పెద్దలు వచించుచున్నారు.

శరీరము ఒక బండి, మనస్సు దానిని నడుపు సారథి, కావున మోక్షమార్గమున జనునపుడు బండికి ఏమియు దెబ్బ తగులనీయక ఆరోగ్యమును జాగ్రతగ కాపాడుకొనుచు బహుజాగరూకతతో ఆ దేహరథమును నడుపుకొనుచు పోవలెను. కొందఱు దీర్ఘోపవాసాదులు చేసి శరీరమును శుష్కింపజేసికొనుటకు ప్రయత్నింతురు. తద్ద్వారా వారేదియో ఘనకార్యమును సాధించినట్లు భావింతురు. అట్టి యత్నము దూరాలోచనతో కూడినది కాదు. శ్రీ కృష్ణ

పరమాత్మయు గీతయందు (17-వ అధ్యాయమున) అట్టి శరీరశోషణ భావమును ఖండించియున్నాడు. ముముక్షువులు ఎల్లపుడు మధ్యమార్గమునే అనుసరించుట ఉత్తమము. శాంతముగ మెల్లమెల్లగ సాధనను కొనసాగించవలెను. 'శనైః శనైరుపరమేత్'—అను వాక్యమును స్మృతిపథమునందుంచుకొని సాధకుడు ప్రశాంతముగా, గంభీరముగా తన ఆధ్యాత్మిక యత్నములను నెరవేర్చుకొనవలెను. శాంతముగ నడుపుము - అను రెండవ సూత్రముయొక్క అర్థమిదియే.

ఇక మూడవ సూత్రమగు "Reach safely—సుఖముగా చేరుము"—అను దానినిగూర్చి యోచింతము. పై రెండు సూత్రములను చక్కగ అమలు పఱచువాడు తన గమ్యస్థానమును నిరాటంకముగా చేరగలడు. వానిని ధిక్కరించి చనువాడు లక్ష్యమును చేరకపోవుటయే గాక తనకు, తన వాహనమునకు ప్రమాదమును తెచ్చిపెట్టుకొనగలడు. ఇచట వాహనము దేహము. తీవ్రమైన ప్రయోగములకు దేహము తట్టుకొనలేదు. 'శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్'—(శరీరముయొక్క ఆరోగ్య పరిస్థితి ముందుగా చూచుకొనవలెను. ధర్మసాధన, మోక్షసాధన — తరువాతయే) అను ఆర్యోక్తిని జ్ఞాపకముంచుకొనుట శ్రేయస్కరము. 'అతి'గా పోక మధ్యమార్గమును అనుసరించి చనువాడు మోక్షధామమును సుఖముగ చేరుకొనగలడు. సుఖముగ చేరుకొనుము - అను మూడవ సూత్రముయొక్క భావమిదియే.

జననమరణరూప దీర్ఘప్రయాణమున పడి సతమత మగుచున్న ఈ జీవుడు తన యాత్ర సుఖముగ పర్యవసించు టకై పైన తెలిపిన ప్రయాణసూత్రములను మూడిటిని జాగ్రతగ అమలు పఱచుకొనవలెను. అత్తఱి ఈ జీవిత మందే యితడు దైవసాక్షాత్కారరూప మహోన్నత లక్ష్య మును సులభముగ సాధించివేయగలడు. కావున ముము క్షువు లగువారు బహుజాగరూకులై పైన దెల్పిన ప్రయాణ సూత్రత్రయమును జ్ఞప్తియుందుంచుకొని శాంతముగ, గంభీ రముగ ప్రయాణము సల్పి పరమాత్మరూప గమ్యస్థానమును నిర్విఘ్నముగ చేరుకొనవలెను.

రైలుపెట్టెలలో అచటచట ఈ క్రింది వాక్యము వ్రాయబడి యుండును

Less luggage, more comfort make travel a pleasure.

దీని అర్థము—

సామానుతక్కువగానున్నచో ప్రయాణము హాయిగా జరుగును.

రైల్వే అధికారులు ప్రయాణీకుల సౌకర్యార్థము ఈ వాక్యములను వ్రాసిరి. ఈ వాక్యములం దెంతయో సత్యము ఇమిడియున్నది. అనుభవ పూర్వకముగ తెలిపిన వాక్యము లివి. ఎక్కువ సామానుతో చేయు ప్రయాణములు పరమ బాధాకరములుగ నుండును. ప్రయాణీకునకు ఏమాత్రము

వానివలన మనశ్శాంతి ఉండదు. సామాను తగ్గించుకొనిగాని, అసలు లేకగాని చేయు ప్రయాణములు మనస్సునకెంతయో ఉల్లాసమును, ఆహ్లాదమును, సంతృప్తిని కలుగచేయును.

ప్రతి జీవియు ఇపుడొక ప్రయాణము చేయుచున్నాడు. కాని అట్లు చేయుచున్నాడని అతనికి తెలియదు. కన్ను మూసికొని ఏవేవో వ్యవహారములు చేయుచు కాలము గడపి వేయుచున్నాడు. కొంతకాలమునకు దేహము పతనమై పోగా, జీవుడు మరల పుట్టుచున్నాడు. ఈ ప్రకారముగ అనాదికాలమునుండి ఈ సంసారప్రవాహమున పరిభ్రమించుచు, తానెవరో, ఎచటికి పోవుచున్నాడో తెలియక జీవితమును నిరుపయోగము చేయుచున్నాడు.

జీవుని గమ్యస్థానము పరమాత్మ. జీవుడు ప్రతిబింబము, పరమాత్మ బింబము. ప్రతిబింబము బింబమును ఏనాటికైనను చేరవలసియున్నది. అట్లు చేరినచే పరిపూర్ణశాంతి. బింబభూతుడగు అట్టి పరమాత్మను చేరుటకై కోట్లకొలది జన్మలనుండియు జీవుడు ప్రయాణము సలుపుచుండ సుకృతవశమున మనుష్యత్వమను చక్కటి అవకాశము చేజిక్కుట సంభవించినది. అట్టి అపూర్వ అవకాశము జారవిడువక ఈ జన్మయందే తన ప్రయాణలక్ష్యమును, తన గమ్యస్థానమును చేరుకొనుట ఉత్తమోత్తమము. ఇట్టి అభిప్రాయము జీవుడు కలిగియుండి తల్లక్ష్యసాధనకై యత్నములను ప్రారంభించినచో ధన్యుడగును. కావున గమ్యస్థానమును త్వరలో చేరుకొనుటకు, ప్రయాణమును సంక్షేమముగ జరుపుటకు, తాను

ఎన్నడో ప్రారంభించిన ఈ దీర్ఘయాత్రను విజయవంతముగ పరిసమాప్తము చేయుటకు మార్గములను, సూత్రములను అన్వేషించవలసియున్నది. అట్టి సూత్రముల నెన్నిటినో పెద్దలు అనుభవపూర్వకముగ వచించియున్నారు. శాస్త్రములున్ను విస్పష్టముగ వానిని పేర్కొనినవి. అందొకానొకసూత్రము పైన వివరింపబడినది-'ప్రయాణము చేయునపుడు సామాను తగ్గించుకొనవలసినది' అని ఆ సూత్రము పేర్కొనుచున్నది.

జీవుడు చేయుచున్న ప్రయాణములో సామాను (Luggage) ఏది? బరువు ఏది? తాను కానిదంతయును బరువే. తనకు వేఱుగ నున్నదంతయును బరువే. దృశ్యమంతయును బరువుక్రింద లెక్క. సామానుక్రింద జమే. తాను నిత్యశుద్ధముక్త ఆత్మయైయుండ, అనాత్మభూతములగు దేహేంద్రియాదులను తనపై ఆరోపించుకొని, అవియే తానని భ్రమించి, ఆ భారమంతయు నెత్తిన వేసికొని ఈడులాడుచున్నాడు జీవుడు! తాను తానుగా నిలువక, తాను మేనై కూర్చుండుచున్నాడు. అంతేకాదు. ఆ మేనుకు (దేహమునకు) బయటనుండు బంధ్వాదులు తనవారని మురిసిపోవుచు, బయటనుండు గృహారామక్షేత్రాదులు తనవని ఆనందపడుచు, దేహముపై అహంభావము, దేహమునకు బయటనుండువానిపై మమత్వము కలిగియుండి, ఈ జంజాటమంతయు వెంట ఈడ్చుకొనిపోవుచు ప్రయాణము సలుపుచున్నాడు. తత్ఫలితముగ మహాభారముచే క్రుంగిపోవుచున్నాడు.

ఈమధ్య ఒకరు బదరీనాథ్‌కు యాత్ర ప్రారంభించి నారట. పన్నెండు ట్రంకు పెట్టెలతో, ఆరుగురు చంటిపిల్లలతో సహా! ఆ యాత్ర ఎంత చక్కగా జరుగగలదో మన మూహించుకొనవచ్చును. బహుశా మార్గమధ్యముననే బదరీనాథుడు వారికి కనిపించియుండవచ్చును. జీవితయాత్రలో బరువు తగ్గించుకొనుమని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత యందు పదే పదే అర్జునునకు బోధించియుండుట గమనింప దగినది. జీవుడు యథార్థముగ క్షేత్రజ్ఞుడే కాని క్షేత్రమును బరువుకాదని ఢంకా మ్రోగించి భగవానుడు చెప్పెను. ప్రతివాని హృదయములో దేదీప్యమానముగ ప్రకాశించు నాశరహితమగు క్షేత్రజ్ఞరూప ఆత్మయే తానుగాని దేహము, మనస్సు, బుద్ధి, ఇంద్రియములు, ప్రాణము, పంచభూతములు, బాహ్యవస్తుసముదాయము—అను క్షేత్రముకాదు. ఈ క్షేత్ర మంతయు జీవుని ప్రయాణమందు సామానువంటిది. తన కంటె వేఱుగా నున్నదంతయు బరువే. కావున దానిని ఎంత తగ్గించుకొనిన అంత మంచిది. తగ్గించుకొనుట యనగా దానిని తొలగించివేయుట కాదు. విసర్జించుట కాదు. వానిపై మమత్వము, అహంభావము వదలుటయే యగును. తాను ఆత్మయే కాని దేహముకాదని చక్కగ భావన చేయవలెను. అంతియే కాదు. దేహమునకు బయటనున్న బంధుమిత్రాదు లందు, క్షేత్రాదులందు మమత్వమును విడనాడవలెను. ఏనాటికైనను వాని యన్నింటితో తనకు వియోగము సంభ వింపగలదని ముందుగనే నిశ్చయించి వానియెడల విరక్తి

భావమును అభ్యసించుచుండవలెను. స్వస్వరూపముగు ఆత్మ యందే సదా నిలుకడ కలిగియుండులాగున ప్రయత్నించు చుండవలెను.

ప్రయాణము సలుపుచున్న ఈ జీవునకు తటస్థపడు భారములు రెండువిధములుగా నుండును. బాహ్యవస్తువుల యొక్క భారము, అభ్యంతర సంకల్పాదులయొక్క భారము. ఈ రెండిటిని జీవుడు మోయుచున్నాడు. సామాను పెరిగి పోవుచున్నదే కాని తరగిపోవుట లేదు. కనుకనే శాంతిని జీవుడు నోచుకొనలేక పోవుచున్నాడు. సామాన్యముగ బ్రహ్మ చారిగ నున్నపుడు మనుజునకు తన ఒక్కని కష్టసుఖములే తనకు ఉండుచున్నవి. ఇంతలో వివాహము కాగానే తన కష్టసుఖములతోబాటు తన భార్యయొక్క కష్టసుఖములు కూడ తనపై ఆరోపించుకొనుచున్నాడు. ఆ పిమ్మట తన సంతానముయొక్క కష్టసుఖములనుగూడ తనవిగా భావించి తనపై ఆరోపించుకొనుచున్నాడు. మనుమలు కలిగినచో వారియొక్క కష్టసుఖములనుకూడ తన నెత్తిన వేసికొను చున్నాడు. వారికి వచ్చిన బాధలెల్ల తనకు వచ్చినట్లే తలంచి కుమిలిపోవుచున్నాడు. ఈ ప్రకారముగ సంసార దుఃఖరూప వృక్షము శాఖోపశాఖలుగ విస్తరించి, చిలవలు పలవలు పెట్టి మహాభారతరూపముగ పరిణమించుచున్నది. ఇది యంతయు బయటనున్న భారము.

దీనికి మించిన భారము లోన గలదు. అనేకజన్మల నుండి వాసనారూపముగ హృదయమున వర్తించు దుర్వృ

త్తులు, దురభ్యాసములు, దుస్సంకల్పములు—అసూయ, ద్వేషము, కామము, క్రోధము, లోభము—ఈ మొదలైన వన్నియు లోనగల భారము. ఈ రెండిటియొక్క సంసర్గముచే జీవుడు సతమతమై పోవుచున్నాడు. కావున బాహ్య, అభ్యంతర భారములను రెండిటిని తగ్గించుకొనవలెను. క్రమముగా తొలగించుకొనవలెను. దీని అర్థము దేహమును వదలవలెననిగాని, దారాసుతాదులను త్యజించవలెననికాదు. వానిపై మమత్వమును, సంసక్తిని (Attachment) వదలుటయే యగును. సంసారమందు తా నుండవచ్చునుగాని తనయందు సంసారము లేకుండ చూడవలెను. చివరకు ఏ ఒక్క దృశ్య సంకల్పమైనను ధ్యానకాలమున భారభూతముగనే ఉండును. కావున బాహ్య, అభ్యంతరవస్తువులపై మమత్వమును, సంగమును విడనాడి, ఏ బరువు లేకుండ, అనగా దేనిని గూర్చిన సంకల్పమున్ను లేకుండ కేవలము తాను తానుగా నిలిచినచో, అనగా ఆత్మయందే నిలుకడ కలిగియున్నచో, ఎంతయో హాయిగా నుండును. పరమానందము కలుగుచుండును.

కనుకనే భగవానుడు అట్టి ఆత్మైకస్థితిని, దృశ్యరహిత స్వస్వరూపస్థితిని ప్రపంచములోని అన్ని లాభములకంటెను గొప్ప లాభముగ వర్ణించి చెప్పెను.* అట్టి పరమ లాభము ప్రాణు లందఱియొక్కయు జన్మహక్కై యున్నది. ప్రతి వారును దానిని అనుభవించవచ్చును – అనుభవించియే తీర

* యం లబ్ధ్వాచాపరం లాభం మన్యతే నాధికం తతః (గీత-6-22)

వలెను. దానికి ఒక్కటే ఉపాయము. 'నేతి, నేతి' (ఇది ఆత్మకాదు, ఇది ఆత్మ కాదు) అను పద్ధతి ద్వారా దృశ్య వస్తువు లన్నింటిపై, నామరూపములపై మమత్వమును వీడుటయే. భారమును పెంచుకొనక తగ్గించుకొనుటయే. ఇపుడు సాధకుడు చేయునది ఒకానొక ప్రయాణమని గుర్తించుకొన వలెను. అదియే మోక్షప్రయాణము. ఆ మోక్ష ప్రయాణమందు బరువును ఎంత తగ్గించుకొనిన అంత శ్రేయస్కరము. అత్తటి ధ్యానము నిరాటంకముగ జరుగగలదు. కావున ముముక్షువులు మహోన్నతమైన ఈ ప్రయాణసూత్రమును (Less luggage... భారము తగ్గించుకొనుడు... అను దానిని) సదా స్మృతిపథమున నుంచుకొని, దృశ్యపదార్థములపై ఆసక్తిని తగ్గించుకొనుచువచ్చి, క్రమముగ స్వస్వరూపముగు ఆత్మయందు నిలుకడకలవారు కావలయును. అట్టి ఆత్మస్థితియే మోక్షము.

# 7 వ అధ్యాయము

## మోక్షసౌధముయొక్క ద్వారపాలకులు

### శమము

ప్రతిజీవియు మహోన్నతమగు మోక్షసౌధములోనికి ప్రవేశించి అచటగల అక్షయ పరమాత్మను సందర్శించి పరమానందమును అనుభవింపవలెనని కుతూహలపడు చున్నాడు. కాని అచటగల ద్వారపాలకులు అనుమతించుట లేదు. నలుగురు ద్వారపాలురు మోక్షసౌధముకడ అహర్నిశము కావలి గాచుచుందురు. తమ్ము మంచిచేసికొనిన వారిని మాత్రమే వారు లోనికి పోనిచ్చుదురు. అందులో మొదటిద్వారపాలకుడు శమము. ఎవరు తమ జీవిత కాలములో శమమును అనగా ఇంద్రియనిగ్రహమను సుగుణమును చక్కగ సేవించుదురో, ఎవరు తమ తమ ఇంద్రియాదులపై అదుపుగలిగి వర్తించుదురో అట్టివారికి మోక్షద్వారము అమాంతముగ తెరువబడును. మోక్షసౌధముకడ వారికి చక్కని సన్మానము లభించును. వారు మోక్షద్వారముకడకు రాగానే మొదటి ద్వారపాలకుడగు శమము ద్వారమును ఉద్ఘాటమొనర్చి సగౌరవముగ, రాజమర్యాదలతో మోక్ష సౌధాంతరాళములోనికి వారిని గొనిపోయి పరమాత్మయను ప్రభువును సందర్శింపజేయును. కావున ముముక్షువులందఱును

తమ జీవిత కాలములో శమమను మొదటి ద్వారపాలకుని సేవించుటకై తీవ్రతరయత్న మాచరింపవలయును.

సామాన్యముగా శాస్త్రవిచారణయందు శమము, దమము అను రెండు పదములు తఱచుగా వచ్చుచుండును. శమమనగా అంతరేంద్రియనిగ్రహమని, దమమనగా బాహ్యేంద్రియనిగ్రహమని వాడుకలో కలదు. కాని ప్రథమ మోక్షద్వారపాలకుడైన శమమునకు సర్వేంద్రియనిగ్రహ మని అర్థము చెప్పుకొనవలసియుండును. బాహ్య, అభ్యంతర ఇంద్రియముల రెండిటియొక్క సంయమమే శమము. త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములను పంచజ్ఞానేంద్రియ ములు, వాక్పాణిపాదపాయూపస్థములను పంచకర్మేంద్రియ ములు కలిసి బాహ్యేంద్రియములనియు, మనస్సనునది అంత రేంద్రియమనియు చెప్పబడును. ఈ ఏకాదశేంద్రియములను వశమునందుంచుకొనుటయే శమమను మొదటి ద్వారపాల కుని సేవించుట యగును.

అయితే, అట్టి ఇంద్రియనిగ్రహము (శమము)యొక్క అవసరమేమని కొందఱు ప్రశ్నించవచ్చును. శరీరమను రథ మును ఇంద్రియములను గుఱ్ఱములు మోక్షమను గమ్యస్థాన మునకు లాగుకొనిపోవుచున్నవి. ఆ గుఱ్ఱములు మదించినవై, తమ యిష్టమువచ్చినట్లు లాగుకొనిపోయినచో తుదకు రథ మును ఏ గోతిలోనో పడవైచి జీవుడను రథికునకు అవి అపాయము తెచ్చిపెట్టును. అందుచే బుద్ధి అను సారథి ఒకింత వివేక మవలంబించి మనస్సను పగ్గమునుబట్టిలాగి ఆ

యింద్రియములను గుఱ్ఱములను సవ్యమైన మార్గమున నడిపించినచో పరమాత్మయను గమ్యస్థానమునకు నిరాటంకముగ చేర్చగలడు. కావున ఆత్మసాక్షాత్కారమునకై ఇంద్రియ నిగ్రహము అత్యావశ్యకమని తేలుచున్నది. కనుకనే గీతలో భగవానుడు—

'తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ' అని వక్కాణించి ఇంద్రియనిగ్రహమును మొట్టమొదటనే సాధించులాగున ఆదేశించెను—'ఆదౌ' (=మొట్టమొదట) అను పదముయొక్క ప్రయోగముచే ఇంద్రియసంయమము యొక్క అత్యావశ్యకత తేటతెల్లమగుచున్నది.

ప్రభుత్వమువారు అపుడపుడు ధరలపై 'కంట్రోలు' విధించుచుందురు. అట్లు ధరలను అదుపులో నుంచనిచో అవి పెరిగి సామాన్యులకు బాధాకరములుగ పరిణమించునని వారి భావము. అట్లే రైల్వేవారు నడుపు ప్రతిరైలుబండియు 'కంట్రోల్' అధికారుల అదుపు ఆజ్ఞలకు లోబడియే నడుచు చుండును. మిలిటరీశాఖలోగాని, పోలీసుశాఖలోగాని ప్రతి సైనికుడు, ప్రతి రక్షకభటుడు తమ అధిపతియొక్క, నాయకునియొక్క అదుపాజ్ఞలలోనే ప్రవర్తించుచుండును. ఈ ప్రకారముగ 'కంట్రోల్' లేనిచో, క్రమశిక్షణ లేనిచో ఏ శాఖయు చక్కగ జరుగదు. ఇక పరమార్థరంగమున వేఱుగ చెప్పవలయునా ?

జన్మజన్మాంతరములనుండి బాగుగ విషయజాలమును అనుభవించుచు, భోగములలో మునిగి తేలుచు, దృశ్యసౌఖ్య

ములే పరమావధియని భావించుచు మదించియున్నట్టి ఇంద్రియములయొక్క కైపును ఈ మానవజన్మలోనైన ఒక్కింత అదుపులో పెట్టనిచో ఇక జీవితముయొక్క ప్రయోజనమేమి? పశుపతి(శివుడు)గా రూపొందవలసిన మానవుడు పశువుగా ప్రవర్తించుట చాల ఘోరముకదా! కావున బుద్ధివికాసముతోగూడి పెక్కు అనుకూల అవకాశములు కలిగియున్న ఈ మానవజీవితమును చతుష్పదజీవుల భంగి భ్రష్టమొనర్పక, మనస్సును, ఇంద్రియములను, ఇంద్రియార్థములపై పరుగిడనీయక, పగ్గముపట్టిలాగి సంసారప్రవాహములో కొట్టుకొనిపోవు జీవితనౌకకు లంగరువేసి, దైవోన్ముఖముగ నొనర్చి కడతేరుట జనుల విధ్యుక్తధర్మము. కామక్రోధముల వేగమును జీవితాంతములోపలనే అరికట్టి ధన్యులు కండని గీతాచార్యుడు ఘోరీప్రయోగించి చెప్పుచున్నాడు. కావున ఇంద్రియములపై అదుపు చాల అవసరము. దీనినే శమమని చెప్పుదురు.

విషయవాసనలుగల జీవునకు ధ్యానకాలమున మనస్సు ఏమాత్రము నిలుకడ లేక బయటకు పరుగెత్తుచు విచ్చలవిడిగ సంచరింప నారంభించును. అత్తఱి సమాధినిష్ఠ జరుగనే జరుగదు.

భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసామ్
వ్యవసాయాత్మికాబుద్ధి స్సమాధౌ న విధీయతే.

అను శ్లోకముద్వారా శ్రీ కృష్ణమూర్తి ఈ భావమునే స్పష్టీకరించెను. ధ్యానకాలమున మనస్సు ఏకాగ్రముగ

నుండనిచో ఆత్మానందమనుభూతము కానేరదు. మనస్సు ఏకాగ్రముగ నుండవలెననిన ఇంద్రియములు బహిర్వ్యాపార మును మాని, శబ్దస్పర్శాది విషయములపై పరుగిడక అంత ర్ముఖములు కావలెను. అంతర్ముఖములు కావలెననిన, విషయాదులందు దుఃఖదోషానుదర్శనమును గావింపవలెను. విషయములు నశ్వరములని, పరిణామమున దుఃఖమునే కలుగ జేయునని, దైవమార్గమున అవి ప్రతిబంధములని వివేకముచే బాగుగ నిశ్చయించి దృశ్యచింతనను వీడవలెను. అట్టి వైరాగ్యభావనచే ఇంద్రియములు, మనస్సు బాహ్యవ్యాపార ములనుండి మఱలి అంతర్ముఖములై ఆత్మధ్యానమున కెంతయో సహాయకారులు కాగల్గును. కాబట్టి ఇంద్రియనిగ్రహము, మనస్సంయమము జీవునకు అత్యంతావశ్యకమని తెలుచున్నది. దీనినే శమమని చెప్పుదురు. ఇట్టి శమ మను మోక్షద్వార పాలకుని జనులు శ్రద్ధాపూర్వకముగ సేవించి, ఆదరించి తత్ఫలితముగ మోక్షసౌధమందు నిరాటంకముగ ప్రవేశించి ప్రభుదర్శనముచే పరమానంద మనుభవించవలయును.

## విచారణ

ఇక మోక్షసౌధముయొక్క రెండవ ద్వారపాలకుడు 'విచారణ'. జీవితకాలములో ఒకింతైనను ఆత్మవిచారణ సలి పినవానికి, 'విచారణ' యను ద్వారపాలకుని మంచి చేసి కొనినవానికి అ ద్వారపాలకుడు మోక్షసౌధకవాటమును ఉద్ఘాటమొనర్చివేసి పరమాత్మ యను ప్రభువును సందర్శింప చేయును. సంసారదుఃఖమును తరింపదలంచువానికి తత్త్వ

విచారణ అత్యంతావశ్యకము. భ్రాంతిలోపడి తల్లడిల్లుచున్న వానికి విచారణతప్ప వేఱు శరణ్య మేదియును లేదు.

త్రాటినిజూచి పామని భయపడువానికి, ఎండమావులను జూచి నీరని భ్రమించువానికి, రాత్రికాలమున చెట్టు మోడును జూచి దొంగని భ్రాంతి నొందువానికి విచారణ తప్ప మఱియేది శాంతి చేకూర్చగలదు? అట్లే సచ్చిదానందస్వరూపుడై, నాశరహితుడై సర్వవ్యాపకుడై యున్న జీవుడు తాను అల్పమైన దేహ మను భ్రమలో చిక్కుకొనినపుడు విచారణ యొకటియే అతనిని గట్టెక్కించ గలదు. కనుకనే శాస్త్రకారులు విచారణకు గొప్ప ప్రాముఖ్యత నొసంగిరి. ఈ విచారణనే బుద్ధియోగమనియు, వివేకమనియు అందురు.

రెండు వస్తువులు కలిసిపోయినపుడు, విచారణచే వాటిని వేఱుచేసి మంచి వస్తువును గ్రహించుట, చెడ్డ వస్తువును వదలుట విజ్ఞుల కర్తవ్యము. అరటిపండులో గుజ్జు, తొక్క అను రెండు వస్తువులు కలిసియున్నవి. వివేకము కలవాడు యుక్తాయుక్తములను చక్కగ వివేచన చేసి గుజ్జును తొక్కనుండి వేఱుచేసి గుజ్జును స్వీకరించి తొక్కను పారవేయును. బియ్యము రాళ్లు కలిసియున్నపుడు రాళ్ళను ఏరిగివేసి బియ్యమును మాత్రము స్వీకరించుదురు. పాలు నీళ్లు కలిసియున్నపుడు హంస ఆ రెండిటిని తన ముక్కుతో వేఱుచేసి పాలను స్వీకరించి నీటిని విడిచివేయును. అట్లే పరమహంసలగు వివేకులు సత్యాసత్యములు క్షేత్రక్షేత్ర

జ్ఞులు, దృగ్దృశ్యములు కలిసియున్న ఈ ప్రపంచమును తత్త్వవిచారణచే చక్కగ వివేచించి, విభజించి దృశ్యముపై ఆసక్తిని వీడి దృగ్రూపమగు పరమాత్మనే స్వీకరించి తదేక పరాయణులై వర్తింతురు. కనుకనే గీతాచార్యుడగు శ్రీ కృష్ణపరమాత్మ భగవద్గీతలో జ్ఞానషట్కమును వివరించు నపుడు విభాగయోగములను నెక్కింటిని చెప్పుకొనుచు పోయెను.

1. క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగము
2. గుణత్రయ విభాగయోగము
3. దైవాసురసంపద్విభాగయోగము
4. శ్రద్ధాత్రయ విభాగయోగము

విభాగమనగా వేరుచేయుట. మంచి, చెడ్డ, ధర్మము, అధర్మము, సారము, అసారము కలిసియున్నపుడు వాటిని వేరుచేయుట అత్యవసరము. ఈ శరీరమందుగాని, శరీరమునకు బయటగాని రెండు వస్తువులు కలిసియున్నవి. వాటినే ఆత్మ, అనాత్మయనియు క్షేత్రజ్ఞుడు క్షేత్రము అనియు అందురు. విజ్ఞుడగువాడు చక్కని వివేకమును ఆశ్రయించి ఈ శరీరమును విభజించి పంచకోశాంతర్గతుడగు పరమాత్మను తెలిసికొని, సాక్షాత్కరించుకొని ఆతడే తానని భావించి, జడమగు దేహముపైనను, బయటగల నామరూపములపైనను అహంభావముగాని మమత్వముగాని లేకుండును. ఇకార్యమును సాధించుటలో విచారణ ఎంతయో ఉపక

రించును, విచారణచే పంచకోశములను విభజించి, 'నేతి, నేతి' (ఇదికాదు, ఇదికాదు) అను పద్ధతిద్వారా అనాత్మను వేఱుచేసి శేషించిన ఆత్మస్వరూపమును అనుభూత మొనర్చుకొనవలెను.

శ్రీ వసిష్ఠులవారు శ్రీ రామచంద్రునకు బోధించిన ఈ క్రింది హితవాక్యము ముముక్షువులకు శిరోధార్యమై యున్నది—

మనాగపి విచారేణ చేతసః స్వస్య నిగ్రహః
మనాగపి కృతో యేన తేనాప్తం జన్మనః ఫలమ్.

'ఒకింత విచారణచేనైనను ఎవడు తన మనస్సును కొంచెమైనను నిగ్రహింపగల్గునో, సత్యమును ఎఱుఁగగల్గునో అతడు జన్మసాఫల్యము నొందినవాఁడగును.' కావున తత్త్వవిచారణ సాధకునకు అత్యంతావశ్యకమై యున్నది. కనుకనే అది మోక్షద్వారపాలకుడుగ శాస్త్రములందు వర్ణింపబడినది. జీవితమునందు శాంతి ననుభవింపదలంచువారు, మోక్షసౌధము నధిరోహించి ఆత్మరూప ప్రభువుయొక్క సాక్షాత్కారము నొంద దలంచువారు, జననమరణరూపశృంఖలములనుండి తప్పించుకొని శాశ్వతసౌఖ్యము ననుభవింపగోరువారు తమ జీవితకాలమున శీఘ్రముగ ఇట్టి విచారణను చేబట్టి, తత్త్వంపదార్థశోధనను గావించి అనిత్యమునుండి నిత్యమును వేఱుచేసి, అట్టి నిత్యవస్తువగు ఆత్మయే తానని దృఢవిశ్వాసముగల్గి బ్రహ్మానుభూతిచే జీవితమును పరమానందమయముగ నొనర్చుకొనవలెను.

## సంతుష్టి

ఇక మోక్షసౌధముయొక్క మూడవ ద్వారపాలకుడు సంతుష్టి (Satisfaction). జీవిత కాలములో ఈసంతుష్టి యను సద్గుణమును అలవఱచుకొనినవారికి, అ ద్వారపాలకుడు మోక్షసౌధ ప్రాంగణమున స్వాగతసత్కారము లొసంగి సగౌరవముగ వారిని సౌధాంతరాళములోనికి తీసికొని వెళ్ళి పరమాత్మరూప ప్రభువును సందర్శింపజేయును. అహా! ఎట్టి సౌభాగ్యము! కావున సంతుష్టియను సుగుణరాజమును ముముక్షువు తప్పక ఆశ్రయింపవలెను.

మాయాప్రభావముచే జీవునకు తనకున్న ఆస్తిపాస్తులందుగాని, కీర్తిప్రతిష్ఠలందుగాని, సంపదలందుగాని తృప్తి కలుగుటలేదు. ఉన్నదానితో సంతృప్తినొందక ఇంకను కావలెనని అతడు ఉబలాటపడుచున్నాడు. దీనివలన అమూల్యమైన సమయము వృథా యగుటయే కాక, అధర్మమార్గములను అవలంబించుటవలన పాపమునుగూడ మూటగట్టుకొనుచున్నాడు. కోరిక పెరిగి ఆశగా మారి, ఆశ పెరిగి తృష్ణగా పరిణమించి, తృష్ణ పెరిగి వ్యసనముగా రూపొంది, వ్యసనము పెరిగి వాసనగా మారిపోయి జీవుని అధోగతికి త్రోసివేయుచున్నది. 'ఆశాపాశశతైర్బద్ధాః'—అని గీతాచార్యులొసగిచ్చినట్లు ఆశలను వందలకొలది త్రాళ్ళచే అజ్ఞానులగు జీవులు బద్ధులై దారితెన్ను తెలియక ఈ సంసారపథమున నానావిధములుగ సంచరించుచు తుదకు దుఃఖమను మహాగర్తమున

పడిపోవుచున్నారు. తృష్ణ యను రక్కసి అవివేకియగు జీవుని కబళించి వేయుచున్నది.

నిస్స్వో వష్టి శతం శతీ దశశతం లక్షం సహస్రాధిపో
లక్షేశః క్షితిపాలతాం క్షితిపతిశ్చక్రేశతాం వాంఛతి
చక్రేశః సురరాజతాం సురపతిర్బ్రహ్మాస్పదం వాంఛతి
బ్రహ్మా శైవపదం శివో హరిపదం హ్యాశావధిం కో గతః.

అని శాస్త్రకారులు వచించినట్లు—ఏమియు లేనివాడు భగవంతుని నూరురూప్యము లిమ్మని ప్రార్థించుచున్నాడు. ఆ నూరు వచ్చినపుడు అంతటితో తృప్తినొందక వెయ్యికై తిరిగి ప్రార్థించుచున్నాడు. వెయ్యి రాగానే లక్షకొఱకై అర్థించుచున్నాడు. లక్ష రాగానే రాజత్వ మపేక్షించుచున్నాడు. రాజత్వము రాగానే ఇంద్రత్వమును కోరుచున్నాడు. ఇంద్రుడు కాగానే బ్రహ్మపదవిని, బ్రహ్మపదవి రాగానే శివపదవిని, శివపదవి రాగానే విష్ణుపదవిని—ఈ ప్రకారముగ అంతులేని ఆశలతో కొట్టుమిట్టాడుచున్నాడు జీవుడు.

ఈ తృష్ణారూపరోగనివారణకు ఒకటే మందు కలదు. అదియే సంతుష్టి. జీవితములో ఎచటనో ఒకచోట సంతృప్తి బడయనిచో, 'ఓ భగవంతుడా! నీ విచ్చినది నాకు చాలు. ఎట్లో సంతృప్తిపడి దానితో సర్దుకొని జీవించెదను' అను నిశ్చయములేనిచో, కోరికలకు ఫుల్‌స్టాప్ (పూర్ణవిరామము) పుట్టనిచో—మానవుడు చుక్కానిలేని పడవవలె జీవితరంగమున నానావ్యథలకు లోనగుచుండును. కాబట్టి సంతుష్టియే

పరమౌషధము. భవరోగ భేషజము. దానిని సేవించిన జీవుడు పరమశాంతిని బడయగలడు.

పూర్వము శంకరభగవత్పాదాచార్యులను 'మహాత్మా! ఈ ప్రపంచమున అందఱికంటె దరిద్రు డెవడ'ని ఒకరు ప్రశ్నింప, అమ్మహానీయుడు 'ఎక్కువ ఆశ కలవాడే దరిద్రుడ'ని వచించెను. అట్లే 'ఈ ప్రపంచమున అందఱికంటె ధనవంతు డెవడ'ని ప్రశ్నింప ఆ పావనమూర్తి 'పూర్ణసంతుష్టి కలవాడే మహాధనికుడ'ని పేర్కొనెను.

కో వా దరిద్రో హి విశాలతృష్ణః
శ్రీమాంశ్చ కో యస్య సమస్తతోషః॥

ఇంతియే కాదు, 'కౌపీనవన్తః ఖలుభాగ్యవన్తః' అని సెలవిచ్చి కౌపీనధారియే, వైరాగ్యశీలుడే, సంతుష్టాంతరంగుడే, భగవద్భక్తిపరాయణుడే విశ్వమందుగల ధనవంతులలోకెల్ల పరమధనవంతుడని శ్రీ శంకరులు వాక్రుచ్చెను. కావున సంతుష్టి యనునది మహత్తర సుగుణరాజమై యలరారుచున్నది. ముముక్షువు లెల్లరు దీనిని తప్పక అశ్రయించవలసియున్నది.

సంతుష్టి లేనివానికి, ఆశలు కలవానికి ధ్యానము సరిగా జరుగనే జరుగదు. ధ్యాననిష్ఠలో కూర్చొనియున్నపుడు ఏవియో వాంఛలు, విషయవ్యామోహములు అతనిని వెన్నంటుచునే యుండును. ఆ కోరికలను అనుభవించవలెనని యతనికి అభిలాష పొడముచుండును. ఒక వేళ అనుభవించినను

అంతఃశాంతో ఆగునా యనిన, అదియును లేదు. కోరికలు ఎంతెంతగా అనుభవింపబడుచుండునో, అంతంత అధికముగ అవి పెరిగిపోవుచుండును. రెండుయౌవనములు ఏకధాటిగా అనుభవించిన యయాతి తన యనుభవమునుగూర్చి తుదకు ఏమిచెప్పెనో ఆలకింపుడు—

న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే.

కోరికలు అనుభవించుటచేత అవి తరగనే తరగవు. పైగా, నిప్పులో నెయ్యిపోసిన చందమున అవి ద్విగుణీకృతముగ పెరిగిపోవును. కావున జీవితమున ఎక్కడో ఒకచోట మను జుడు తృప్తినొంది మనస్సును దిట్టపఱచుకొని 'ఓ మనస్సా! జరిగినది చాలును. ఇకమీదట నన్ను వేధించకుము' అని దానికి హితము చెప్పి, దృష్టిని పరమాత్మవైపునకు మఱలించి సంతుష్టాంతరంగుడై శేషజీవితమును ఆనందముగ గడిపివేయ వలెను. సంతుష్టియను ద్వారపాలకుని ఇచటనే మంచిచేసి కొని మోక్షసౌధమున ప్రవేశించి శాశ్వతసుఖమును బడయ వలయును.

## సత్సాంగత్యము

మోక్షద్వారే ద్వారపాలాశ్చత్వారః పరికీర్తితాః
శమో విచారః సంతోషశ్చతుర్థస్సాధుసంగమః.

మోక్షద్వారమున నలుగురు ద్వారపాలకులు కలరని శ్రీయోగవాసిష్ఠమందు (వసిష్ఠగీతయందు) వసిష్ఠమహర్షి

పేర్కొనిరి. వారు క్రమముగ (1) శమము, (2) తత్త్వ విచారణ, (3) సంతుష్టి, (4) సజ్జన సాంగత్యము— అనువారు. ఈ నలుగురు ద్వారపాలకులలో ముగ్గురను గురించి ఇంతదనుక విచారించినాము. ఇక నాల్గవవాడగు సత్సాంగత్యమును గూర్చి ఇపుడు విచారించెదము.

చీకటిలో పోవువానికి దీపము గలవాని సహాయము చాల అవసరము. అవివేకవశమున ప్రపంచము అంధకార బంధురమై యున్నది. జనులు యుక్తాయుక్తములు తెలిసికొనుట లేదు. ఏది సత్యమో, ఏది అసత్యమో గ్రహించలేని స్థితిలో ఉన్నారు. దృశ్యప్రపంచము సత్యమని నమ్ముచున్నారు. సత్యస్వరూపమగు పరమాత్మను గూర్చిన పరిచయమే జనులకు లేకున్నది. నామరూపాత్మక జగత్తు యొక్క వ్యామోహములో పడిపోయి అయోా క్షణిక భోగ విలాసములను గొప్పగ దలంచి వానివెంట అహర్నిశము పరుగెత్తుచు, తుట్టతుదకు దుఃఖరూప దావానలములో తగులొ్కని నానావ్యథలను పొందుచున్నారు. పాంచభౌతికమై, వికారవంతమై, బుద్బుదప్రాయమై జడమైనట్టి దేహమును చైతన్యవంతముగను అత్యంతరమణీయముగను భావించుకొని దానిపైనను, దానికి సంబంధించిన బంధ్వాది దృశ్యపదార్థములందును మమత్వమును పెట్టుకొని, ఆ మమత్వమును క్రమక్రమముగ పెంచుకొని తాపత్రయములచే దగ్ధులై దిక్కుతోచక పరిభ్రమించుచున్నారు. సంసృతి (సుడి) లో చిక్కుకొనిపోయి, గిరగిర తిరుగుచు, పుట్టుచు చచ్చుచు, కర్మ

బంధనమున తగుల్కొని, దారి తెన్ను గానక హాహాకారము లొనర్చుచున్నారు.

ఇట్టి విపత్కరస్థితిలో వారికి గత్యంతర మేమి? అజ్ఞాన తమమున బడి నానాయాతనల నొందువానికి జ్ఞానప్రకాశము కలవాడే దిక్కు. అతడే శరణ్యము, కనుకనే సత్సాంగత్యము జీవునకు అవసరమై యున్నది. మహాసీయులయొక్క అండ దండలు సంసారదుఃఖపరితప్తునకు అత్యావశ్యకము. వారి యనుగ్రహము, వారిబోధలు, వారి సాంగత్యము, అజ్ఞాన పంకపరిమగ్నులకు అవసరములు. శాస్త్రములలో ఎచట చూచినను సత్సాంగత్యముయొక్క మహిమ కొనియాడ బడుట కానంబడుచున్నవి. ఎంత గొప్పవారైనను ఒకా నొక గురువును ఆశ్రయించుటయో, అనుభవజ్ఞులైన మహా నీయుల సాంగత్యమును బడయుటయో చరిత్రయందును మనము చూచుచున్నాము. సత్సాంగత్యముయొక్క మహి మను గమనించియే శ్రీ వసిష్ఠమహర్షి మోక్షద్వారపాలకులు నలుగురిలో అగ్రానికి స్థాన మొసంగియున్నారు. కావున ముముక్షువులు అధ్యాత్మరంగమున ప్రప్రథమముననే పెద్దల సేవచేసి వారి సాంగత్యశ్రీని అనుభవించి, వారి ప్రేమకు, అనుగ్రహమునకు పాత్రులై, వారియొక్క బహుకాలార్జిత మగు బ్రహ్మవిజ్ఞానమును, అనుభవపూర్వక పరమార్థ తత్త్వ మును తాముస్న సంపాదించి ధన్యులు కావలయును.

పూర్వము భగీరథుడు గంగను భూలోకమునకు దెచ్చుటకై ఘోరతపంబు సల్పి గంగాదేవిని భూలోకము

వలె రమ్మని ప్రార్థింపగా అ దేవి 'ఓ రాజా! నేను భూలోక మునకు రాను; నేను వచ్చినచో పాపాత్ములు నాలో స్నానముచేసి వారి పాపమునంతను నాయందు వదలివేయు దురు. ఆ పాపపురాశినంతను నేనెట్లు మోయగలను?' అని పలికెను. గంగాదేవియొక్క ఆ పలుకుల నాలకించి భగీరథు డీట్లు చక్కని సమాధాన మొసంగెను——

సాధవో న్యాసినశ్శాన్తా బ్రహ్మిష్ఠా లోకపావనాః
హరన్త్యఘం తేఽఙ్గసఙ్గాత్తేష్వాస్తేఽఘభిద్ధరిః.

'అమ్మా! తల్లీ! గంగాదేవీ! పాపులు నీలో తమ పాపమును వదలినంతమాత్రముచేత నీకు కలిగిన నష్ట మేమియు లేదు. ఏలయనగా, నీలో కేవలము పాపాత్ములే కాదు, పుణ్యాత్ములుకూడ స్నానము చేయుదురు. సాధు పుంగవులు, త్యాగశీలురు, శాంతస్వభావులు, ధర్మపరాయ ణులు, లోకపావనతత్పరులు ఎందఱో నీలో స్నానము చేయు చుందురు. వారు తమ పవిత్రస్పర్శచే అ పాపజాలమునంతను దూరీకృత మొనర్చివేయుదురు. పాపహారకుడు శ్రీహరి వారిలో కాపుర ముండును. కావున ఇక పాప మెట్లు నిలువ గలదు? వారి స్పర్శమాత్రముచేతనే పాపము పలాయనము చిత్తగించును. కావున తల్లీ! నీ కేక భార మేమియు నుండదు. అవతరించుము! భూలోకమునకు విచ్చేయుము':——భగీరథుని యీ హేతుపూర్వక వాక్యములను విని గంగాదేవి తత్క్ష ణము భూలోకమునకు పయనమయ్యెను.

భాగవతమందలి ఈ గంగావతరణ ఘట్టము ద్వారా ఒక గొప్ప సత్యము వెల్లడి యగుచున్నది. పుణ్యాత్ములు తపస్సంపన్నులు, ధ్యాననిష్ఠులు, దైవాయత్తచిత్తులు, తత్త్వ విచారణాపరులు తమ చిత్తములను నిరంతరము భగవంతుని యందు కేంద్రీకరించి యుందురు. కాబట్టి వారి వాక్కు, వారి స్పర్శ, వారి సంకల్పము, వారి అనుగ్రహము మహత్తరశక్తి సమన్వితమై, పాపప్రభంజకమై, పుణ్యదాయకమై యలరు చుండును. మహాత్ముల సాంగత్యములో ఇట్టి అమోఘశక్తి యిమిడియుండుట వలననే శాస్త్రములలో ఎచట చూచినను సత్సాంగత్యముయొక్క ప్రశంసయే కానంబడుచున్నది. కావున ముముక్షువులకు, సంసారదుఃఖతరణాభిలాషులకు, మోక్షసౌధారోహణతత్పరులకు ఈ సత్సాంగత్యము అవశ్యము ఆశ్రయింపదగియున్నది.

'మహత్సంగస్తు దుర్లభోఽగమ్యోఽమోఘశ్చ'

అని నారదులవారు సత్సహవాసముయొక్క ప్రాశస్త్యమును తమ భక్తిసూత్రములలో వెల్లడించిరి. అనుభవజ్ఞులైన పెద్దల సాంగత్యము మహాదుర్లభమైనదనియు, అత్యంత ప్రభావసంయుక్తమైనదనియు ఆ భక్తశిఖామణి వాక్రుచ్చెను.

కావున మోక్షద్వారపాలకుడగు ఈ సత్సాంగత్యమును జనులు శీఘ్రముగ ఆశ్రయించి తమ బహుజన్మార్జిత హార్దికతమఃపటలమును మహనీయుల జ్ఞానప్రకాశపుంజములచే విచ్ఛిన్నమొనర్చివైచి, క్షణికమగు ఈ జీవితమును

విజ్ఞానసముపార్జనముచే సార్థకపఱచుకొని, ఆత్మసాక్షాత్కారముచే జన్మాదిదుఃఖపరంపరను ఛేదించివేసి పరమ శాంతిని బడయుదురుగాక!

ఈప్రకారముగ ప్రతివారును శమ, విచారణాది సాధనలను చక్కగ అవలంబించి, అయా మోక్షద్వారపాలకులను మంచిచేసికొని మోక్షసౌధమున ప్రవేశించి అనిర్వచనీయమగు మోక్షానంద మనుభవించవలయును.

# 8 వ. అధ్యాయము

## మోక్షప్రాప్తికై ఉపదేశ చతుష్టయము

### 1. సద్గురువును ఆశ్రయింపుము

మోక్షప్రాప్తికై వేదశాస్త్రాదులందు మహర్షులు తెలిపిన సద్బోధనంతను నాలుగు చక్కని వాక్యములలో ఇమిడ్చి చెప్పవచ్చును. ఆ మహోన్నత ఆదేశములనే ఇంగ్లీషు భాషలో F⁴ అని అందురు. అవి యేవి యనిన—

Follow the master
Face the devil
Fight to the end
Finish the game

వీని యర్థము—

సద్గురువును ఆశ్రయింపుము
మాయను ఎదుర్కొనుము
చివరివరకు పోరాడుము
జగన్నాటకమును అంత మొనర్చుకొనుము.

తరింపనెంచు పరమార్థసాధకునకు ఈ నాలుగు ఆదేశములు చాలును. వీనిని జ్ఞప్తియందుంచుకొని, తదనురీతిగ అనుష్ఠించినచో అతడు గట్టెక్కి పోగలడు. లేనిచో ఈ దుర్భర

సంసార దవానలమున తగుల్కొని ఇంకెంతయో కాలము దుఃఖజాల మనుభవింపవలసియుండును.

'సద్గురువును ఆశ్రయింపుము'— అనునది వీనిలో మొదటి ఆదేశము. కోట్లకొలది జన్మలు ఈ సంసారఘటీ యంత్రమున తిరుగాడి పుట్టుచు, చచ్చుచు ఏదియో సుకృత వశమున ఒకింత వివేకము జనింప మనుజుడు "ఇది యేమి విచిత్రము! ఈ శరీర మేమి? ఈ సృష్టియేమి? ఈ పుట్టుట యేమి? ఈ చచ్చుటయేమి! ఈ ప్రకారము కలకాలము జరుగవలసిన దేనా? ఈ దుస్సహ యాతనాపరంపరను నిలుపుదలచేయుట కేదైన ఉపాయము కలదా?" అని ఆలోచింపదొడంగును. దీనినే 'శుభేచ్ఛ' యందురు. ఇది సప్తజ్ఞానభూమికలలో మొదటిది. బహుజన్మ పుణ్యావిశేషము చేతనే ఇట్టి వివేకము జనులయం దుదయించును.

ఈ ప్రకారముగ వివేకోదయము కలిగినపుడు అతడు చేయవలసిన మొట్టమొదటి పని సద్గురువును వెతకికొనుట. 'ప్రేక్ష్యేఽహం శాస్త్రసజ్జనైః' అనునట్లు వైరాగ్యోదయ కాలమున మనుజుడు తనకు దారిచూపువా రెవరా యని పరితపించుచు, 'మహాత్ములను సందర్శించి నా యభీష్టమును వారికి తెలిపి అంధకారమున ఒకింత వెలుగును సంపాదించు కొందును' అని నిశ్చయించుకొనును. మఱియు శాస్త్రము లందు, సద్గ్రంథములందు ఆసక్తికలిగి వానిని పరిశీలించు చుండును. జీవితములో ఇదియొక గొప్పపరిణామము (Turning point). ఇక్కడనుండియే వాని జీవితము ఒక

మలుపు తిరుగును. ఇంతవఱకు గడపిన కోటానుకోట్ల సంవత్సరముల అసురజీవితము ఒకరకము. ఇక ఇపుడు గడుపనున్న దివ్యజీవితము మఱియొకరకము. ఈ రెండింటికిని పొత్తు ఉండదు. ఏ ప్రాపంచిక సంపదలను నమ్ముకొని ఇంతవఱకు అతడు తన జీవితము గడపెనో, ఏ విషయభోగములే సర్వస్వమని భావించి, అవియే తన యేడుగడయని నమ్మియుండెనో, ఏ విషయానందమును జూచి 'ఇంతకుమించిన సౌఖ్యము మఱియొకటి ముల్లోకములందును లేద'ని భావించెనో, అట్టి ఇంద్రియసుఖములే వైరాగ్యోదయకాలమున వెలవెలబోవ, నీరసింప, వానిపై విరక్తి జనించును. విషయసుఖములే అహర్నిశము అనుభవించుచుపోయిన ఇక పశువులకును తనకును భేదమేమి యను వితర్కమపుడు వానియందుదయించును.

అత్తఱి జీవితనౌకను అతడు నూతనమార్గమునకు మళ్ళించుకొనును. దక్షిణాయనమున నున్నవాడు ఉత్తరాయనమునకు మఱలును. అసురసంపదలో మునిగియున్నవాడు క్రమముగ దైవసంపదను చేకూర్చుకొనదొడగును. అట్టి శుభలగ్నముననే మనుజుడు గుర్వన్వేషణ ప్రారంభించును. పుణ్యము ఫలించినపుడు మాత్రమే జీవునకు సద్గురువు లభించును. సద్గురువుగాని, సచ్ఛాస్త్రముగాని, సద్బోధగాని ఎవరికైన లభించినచో అది బహుజన్మపుణ్యఫలమని, భగవత్కృపాకటాక్షలబ్ధమని నిశ్చయించుకొనవలెను.

గురువు లభించిన మీదట వారు కావించు ఆదేశమును శిరసావహించి తదనురీతిగ అనుష్ఠించుటకై ముముక్షువు తీవ్రతర యత్నము కావింపవలెను. శ్రద్ధాభక్తులతో, పరిపూర్ణ విశ్వాసముతో గురువాక్యమును, శాస్త్రవాక్యమును పరిపాలించవలెను. Follow the master — సద్గురువును ఆశ్రయించుము, అనుసరించుము—అను ప్రథమోపదేశము యొక్క అర్థమిదియే.

అధ్యాత్మవిద్య అనుభవైకవేద్యమగు శాస్త్రము (Practical Science) అయియున్నది. ఒక చిన్న ఉపదేశమును జిజ్ఞాసువు కొన్ని సంవత్సరముల పర్యంతము సాధన చేయవలసియుండును. మార్గమధ్యమున అనేక సంశయము లుదయించుటచేతను, అనేక వితర్కములు జనించుటచేతను ఈ విద్యను సాధింపదలచువాడు అనుభవజ్ఞుడైన వ్యక్తినే ఆశ్రయించుట సముచితము. మహర్షులందఱును అట్టి అనుభవజ్ఞులైన సద్గురువులే. కనుకనే వారు బోధించిన, రచించిన శాస్త్రములన్నియు సాధకునకు పరమప్రమాణములై యొప్పు చున్నవి. గురోర్గురువై, జగద్గురువైనట్టి శ్రీకృష్ణపరమాత్మ బోధించిన గీతాశాస్త్రము, అట్లే వ్యాసమహర్షి, శంకరాచార్యులు మున్నగు మహనీయులు కావించిన సద్బోధలు ముముక్షువులకు అత్యంత శిరోధార్యములై, అనుసరణీయములై యున్నవి. ఈప్రకారము పూర్వకాలిక గురుసత్తముల పైనను, వారు బోధించిన సచ్ఛాస్త్రములపైనను అకుంఠిత విశ్వాసముగలిగి సాధకుడు వానిని అనుసరించుచు జీవితమును

ఆధ్యాత్మికముగ పరిణత మొనర్చుకొనవలెను. గురుసేవ, గురువాక్యానుసరణము — ఈ రెండును సాధకునకు అత్యావశ్యకము లని ఎన్నటికిని మఱువరాదు.

తాను గొప్పవాడనియు, సమస్తము తనకు తెలియు ననియు తలంచి శిష్యుడు ఏకాలమందును అహంకరించరాదు. ఒకరియొద్ద తన తల వంగినపుడే ప్రపంచమంతయు తనయొద్ద తలవంచును. ఈ సూత్రమును జ్ఞప్తియందుంచుకొని ముముక్షువు భగవంతునియెడల సద్గురువులయెడల, పెద్దలయెడల వినయవిధేయతలుగలిగి, వారి వాక్యములను అకుంఠిత శ్రద్ధతో పరిశీలించుచు, జీవితమునందు గొప్పపరిణామమును సాధించవలెను. మోక్షప్రాప్తి కిదియె ఏకైకమార్గము. ఈ ప్రకారముగ సద్గురుసమాశ్రయణము మానవుని బంధవిముక్తికి అత్యావశ్యకమై యున్నది.

ప్రపంచములో గురువులు దొఱకవచ్చునుగాని సద్గురువులు దొఱకుట చాల దుర్లభము. శిష్యులను సద్వస్తువగు ఆత్మయొద్దకు చేర్చువాడే సద్గురువు. సచ్ఛీలమును వాక్కునందేగాక అనుష్ఠానమునందును దిగ్దర్శనమొనర్చువాడే సద్గురువు. శిష్యుల అజ్ఞానాంధకారమును రూపుమాపి జ్ఞానాలోకమును వారికి ప్రసాదించువాడే సద్గురువు. కావున అట్టి యోగ్యతలుగలవారు సహజముగనే జనులలో చాల అరుదుగా నుందురు. భగవానుడు ఎన్నుకొనిన ఏకొలదిమంది మహనీయులో అట్టి సద్గురుపీఠ మలంకరించి లోకములో విరాజిల్లుచుందురు.

అట్టి మహనీయుల జీవితము వాస్తవముగ ప్రజలకు వసంత సదృశములుగనే యుండును. ఆధ్యాత్మిక విషయము లందు పండినయనుభవముగల మహనీయులగుటవలనను, పారమార్థిక సూత్రములన్నియు వారికి కాచి వడబోసినవే అయి యుండుటవలనను, భక్తులకు వారి సాన్నిధ్యమందు నిగూఢ దైవతత్త్వావగాహనము సులభతర మనిపించుచుండును. బ్రహ్మజ్ఞానము పుస్తకమునుండి గ్రహింపదగిన విద్య కాదు. హృదయమునుండి ప్రవహింపవలసిన అనుభవమిది. బ్రహ్మానుభూతి నొందిన సద్గురుని హృదయక్షేత్రమునుండి పొంగి పొరలి అధికారియగు సచ్ఛిష్యుని హృదయసీమయుందు దొరలునట్టిదియే బ్రహ్మజ్ఞానము. కావున నిర్మలచరిత్ర ద్వారా తమ తమ హృదయస్థానములను పునీత మొనర్చు కొనిన భక్తకోటియంతయు అట్టి మహాత్ములు వర్షించు బ్రహ్మజ్ఞానామృతమును గ్రహించి, అనుష్ఠించి, అనుభూతి మొనర్చుకొని, జన్మసార్థక మొనర్చుకొందురు. మహాత్ముల దివ్యావతరణముచే గలుగు పరమలాభమిదియే.

మహనీయులగు సద్గురువులు తమ జీవిత కాలమంతయు అనుష్ఠానమునుగూర్చియే ఎక్కువగ నొక్కి చెప్పుచుందురు. వారు స్వతః అట్లాచరించుచుందురు కనుకనే ఆ యనుష్ఠానముపై వారికంత నమ్మకము ఏర్పడును. (1) గురువు (2) దైవము (3) అనుష్ఠానము అను మూడింటిని ఏ కాలమందును విస్మరించరాదనియు, అట్లు విస్మరించనందువలననే తమకెంతయో శాంతి జీవితమునందు లభించినదనియు వారు

చెప్పుచుందురు. కావున వారి జీవితమునుండి మొట్టమొదట గ్రహింపదగిన మహోపాఠ మిదియే-'అనుష్ఠానము నెన్నడును తప్పువరాదు', ప్రతిదినమున్ను ప్రతివారును నియమపూర్వకముగ భోజన మెట్లాచరించుచున్నారో, అట్లే దైవధ్యానమున్ను నియమపూర్వకముగ చేయువలయుననుట వారి బోధలలో ప్రముఖమైనది. ఈ చిన్ననియమమే సక్రమముగ నాచరింపబడుచో అదియే సాధకుని మెల్లమెల్లగ మహోన్నత ఆధ్యాత్మిక శిఖరములకు గొనిపోగలదని వారి విశ్వాసము.

ప్రతిప్రాణియందును గొప్పగొప్ప శక్తులు విరాజిల్లుచున్నవి. అయ్యవి నిగూఢములుగ నుండుటవలన ఎవరికిని వానియొక్క పరిచయము కలుగుటలేదు. నిదురించుచున్న కుండలినీశక్తి యోగాభ్యాసముచే ఏప్రకారము పైకిలేచునో, ఆప్రకారమే మానవుని యందంతర్లీనములైయున్న దివ్యపారమార్థికశక్తులు అతని సత్ప్రయత్నముచే లెస్సగ ప్రస్ఫుటములు కాగలవు. బంగారము ఇతరలోహములతో గూడి యుండినపుడు దానికేమంత విలువయుండదు. కాని, బాగుగ ప్రస్ఫుటము గావింపబడి మేలిమిగా మారునపుడు దానికి గొప్ప విలువ యేర్పడుచుండును. అట్లే అజ్ఞానపరివేష్టితుడై, అసురగుణాభిభూతుడై, అపవిత్రహృదయుడై యుండునపుడు జీవునకు విలువ యుండదు, అతని నెవరును లెక్కచేయరు. అయినను అంతమాత్రముచేత నతడు నిర్లక్ష్యము చేయదగినవాడుకాడు. ఏలయనిన, ఆతనియందు పవిత్రాత్మ యుండియే

యున్నది. దానిని వ్యక్తమొనర్పవలెను. సత్సాంగత్యము చేతను, మహనీయుల సద్బోధలచేతను అట్టి ఆత్మస్థితి తప్పక చేకూరగలదు. అత్తటి యింతదనుక ఎంతయో నీచుడుగ పరిగణింపబడువాడు సంఘమున సర్వోత్తముడుగ గణుతి కెక్కును. కావున పాపము చెడ్డదికాని పాపి చెడ్డవాడుకాడు. పాపి ఏనాటికైనను పుణ్యాత్ముడు కాగలడు. ప్రయత్నాతి శయముచే మానవుడు మాధవుడు కాగలడు. పశువు పశుపతి కాగలడు. ఈ సత్యమునే సద్గురువులు తమ జీవితమందు పదే పదే యుద్ఘాటించుచుందురు. కాబట్టి ప్రతిజీవియు తన నికృష్టస్థితిని జూచి నిరుత్సాహము జెందక, హృదయమును చక్కగ పరిశోధించుకొని, అసురగుణములు, దుస్సంకల్ప ములు, దుర్వాసనలు తమయం దేవైనయుండిన వానిని సమూలముగ తొలగించివేసి, దైవసముడై — కాదు కాదు, దైవమే అయి శోభిల్లవలెను. ఈ ప్రకారముగ అల్పుడు మహాత్ముడు కాగల్గు సదవకాశమును శాస్త్రములు జనుల కొసంగియున్నవి. కావున ప్రతిజీవియు తన హృదయమును చక్కగ వికసింపజేసికొని జీవిత పరమావధియగు స్వస్వరూప (ఆత్మ) సాక్షాత్కారమును బడసి ధన్యుడు కావలయును.

ఈ ప్రకారములైన సర్వజీవ సంతారణరూపములగు మహత్తర సద్బోధలను మహనీయులగు సద్గురువులు కావిం చుచు జనులకు త్తేజమును గలిగించుచుందురు. వారిద్వారా ఎందరో సామాన్యజనులు ముముక్షువు లగుదురు. ఎందరో ముముక్షువులు ముక్తులగుదురు. శుష్కవేదాంత తత్త్వా

జాలమును ప్రజల హృదయవీథులనుండి దూరీకరించుటకును అట్లే వేదాంతభేరిని దశదిశల మారుమ్రోగించుటకును వారు కంకణము కట్టుకొందురు. అట్టి సద్గురువులను వెదకి వెదకి సంపాదించి, చిత్తశుద్ధితో వారిసేవచేసి వారు బోధించు మోక్షమార్గమును చక్కగ అనుసరించి బ్రహ్మవిద్యను బడసి జీవితమును కృతార్థ మొనర్చుకొనవలెను.

## ప్రకృతిని (మాయను) ఎదుర్కొనుము

ఇక మోక్షప్రాప్తికై రెండవ ఉపదేశము—'ప్రకృతిని (మాయను అవిద్యను) ఎదుర్కొనుము' అనునది. దొంగ ఇంటిలో ప్రవేశించినను కనిపెట్టలేనివారు కొందఱు: కనిపెట్టినను వానిని ఎదుర్కొనలేనివారు కొందఱు; ఎదుర్కొని చివఱకు వానితో ఘర్షణపడి తరిమివేయువారు కొందఱు—ఈ ప్రకారముగ జనులలో మూడుతరగతులవారుందురు. మూడవతరగతివారు జీవన్ముక్తులు. చిత్తమందిరమున ప్రవేశించిన అహంకారాది శత్రువులతో యుద్ధము చేసి వారలను పరిమార్చి తన్మందిరమున పరమాత్మను ప్రతిష్ఠింపజేసి ఈ జీవితమున పరమానంద మనుభవించువారే అట్టి మహనీయులు. మఱికొందఱికి సరియైన ఆయుధములు లేకయు, ఉన్నను ఎదుర్కొన శక్తిలేకయు శత్రువుపై విజయమును పొందజాలకయుందురు. ఇట్టివారు పెద్దల సహవాసముచే చక్కని పారమార్థిక ఆయుధములను సమకూర్చుకొని ఏనాటికైనను శత్రువును తరిమివేయగలరు. వీరు

మధ్యములు. ఇక అధములు శత్రువు ప్రక్కనే యున్ననూ వాని జాడ కనిపెట్టలేక తమోగుణాభిభూతులై, అహంకారులై అజ్ఞానాంధత్వముచే స్తబ్ధులై పడియుండి శత్రువు యొక్క దుఃఖరూప ఆఘాతములకు లోనగుచు జననమరణ ప్రవాహమున పూర్తిగ తగుల్కొని యున్నవారలు. ఇక వీరి తారణము ఎప్పటికో ఆ పరాత్పరునకే ఎఱుక!

జీవుని హృదయగేహములో అజ్ఞానమను దొంగ ఎప్పుడు ప్రవేశించెనో ఎవరికినీ తెలియదు. ఆ 'ఎప్పుడు' అను ప్రశ్నకు శాస్త్రములలో సమాధానము లేదు. సమాధానముకొఱకు యత్నించుటయు కేవలము అప్రస్తుతమే యగును. జీవుడు చేయవలసినపని ఆ చోరుని కనుగొని త్వరలో సాగనంపుటయే. అంతియేకాని తర్కవితర్కములచే కాలయాపన చేయుటకాదు. శత్రువు బహుకాలము నుండి హృదయక్షేత్రమును ఆక్రమించుకొని యుండుటచే బలమును కూడగట్టుకొనియున్నాడు. చక్కగ కాలు నిల ద్రొక్కుకొని యుండుటవలన ఒకరాగాన అతడు కదలుటలేదు. తనకేవియో హక్కుభుక్తములు ఏర్పడినట్లు అతడు భావించుకొనుచున్నాడు. ఇట్టి పరిస్థితియందు ఇక జీవుడేమి చేయవలెను? శత్రువుయొక్క బలముచూచి, శక్తినిజూచి అపార సామర్థ్యమును జూచి బిత్తరపడి ఊరకయుండవలసిన దేనా? కాదు. అట్లెన్నటికిని చేయరాదు.

జీవునియందు అనంతశక్తి కలదు. దానిని విజృంభింప చేయవలెను. జీవుడు గొఱ్ఱెవంటివాడుకాదు. అతడు నిద్రించు

సింహము. సింహముయొక్క సింహత్వమునకు ఏ కాలమునను లోటు ఉండదు. సింహము మేలుకొనిన చాలును. అట్లే అనాదికాలమునుండి అజ్ఞాననిద్రలో పడిఉండి తనయొక్క దైవత్వమును మఱచి, కర్మబంధమున తగుల్కొని పుట్టుచు చచ్చుచు నానాయాతన లనుభవించుచున్న ఈ జీవుడు ఇపుడు నిద్రలేచి అజ్ఞానమను శత్రువును ఎదుర్కొని తన దివ్యాత్మస్వరూపమును వ్యక్తము చేసికొనవలెను. పిరికి పందవై అజ్ఞానస్థితిని, బంధదశను ఇంకను దీర్ఘముగ కొన సాగించుట ధర్మము కాదు. ఇప్పటికే బహుకాలము దాటి పోయినది. ఇక నిద్రించుట కిది తరుణము కాదు. లేచి కర్తవ్యమునకు గడంగవలెను. మాయను ఎదుర్కొనవలెను.

సామాన్యముగా లోకములో కోతిగాని, కుక్కగాని పిరికివారలను చూచినచో తరుముకొనును. ధైర్యముగ నిల బడినవారిని చూచి పారిపోవును. అట్లే జీవునియందుగల విరుద్ధశక్తులు (Negative forces) దుర్బలురను నానా బాధలు పెట్టును. ధైర్యవంతులకు తలయొగ్గి యుండును. మహనీయులయొక్క జీవితచరిత్రలను పరికించినచో, వారు శత్రువుయొక్క దాడులకు ఏమాత్రము జంకక తమ శక్తి యుక్తులచే వారిని జయించివేసిన సంఘటనలు అనేకము కానిపించుచున్నవి. ఈనాటి శత్రువే జయింపబడినచో రేపు మిత్రుని పగిది వ్యవహరింపగలడు. అట్లే ఇంద్రియములను శత్రువులు జయింపబడినచో, అవి మనకు అనుకూలముగ ప్రవర్తించును. కాబట్టి ధైర్యమును కూడగట్టుకొని, పిరికి

తనమునకు ఏమాత్రము తావొసంగక, మాయారూప శత్రువుతో సంగ్రామమునకు దిగవలెను. మన జన్మ హక్కైన ఆత్మవస్తు సంపాదనమునకై ఎన్ని త్యాగముల కైనను సంసిద్ధులై యుండవలెను. సాహసవంతుని జయము వరించియే తీరును.

In the worlds broad field of battle
In the bivouac of life
Be not like dumb driven cattle
Be a hero in the strife.

అని 'లాంగ్ ఫెలో' అను కవిసత్తముడు నుడివినట్లు ఈ విశాలజీవిత సంగ్రామక్షేత్రమందు నోరులేని మూగపశువుల వలె వ్యవహరించక ప్రచండయోధుని భంగి అపార ధైర్య సాహసములతో వర్తించవలెను. శత్రువునకు ఏకాలమందును వెన్ను చూపరాదు.

లోతుగ విచారించి చూచినచో ఈ మాయకుగాని, అజ్ఞానమునకుగాని, అవిద్యకుగాని వాస్తవమగు అస్తిత్వము లేదు. అది నీడవంటిది. మాయను జూచి భయపడుట తన ఛాయను జూచి భయపడుటవంటిదే యగును. నీడను తృణీకరించి, నిజవస్తువగు ఆత్మప్రకాశముపైపునకే దృష్టిని మరలించి, దానినే ఆశ్రయించినచో జన్మకడతేరిపోవును. దైవ బలమును చేకూర్చుకొనినవారినుండి మాయ తప్పక పలాయనము చిత్తగించివేయును. భగవంతుని ఆశ్రయించినవారిని మాయ ఇక ఏమియు చేయజాలదు.

మా మేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే.

అని భగవానుడు సెలవిచ్చియే యున్నాడు. తన్నాశ్రయించినవారు భయంకరమైన మాయను అవలీలగ దాటివేయగలరని గీతాచార్యుల హితవచనము. చేతిలో పడవగలవారికి సముద్రముయొక్క లోతుతో పనిలేనట్లు, తన ఆత్మస్వరూపమే యగు భగవంతుని ఆలంబనమును పొందినవారు మాయయొక్క భీషణత్వమును జూచి జంకవలసిన పనిలేదు. మాయ ఎంత శక్తివంతమైనప్పటికిని, అనాది కాలమునుండియు ఉన్నది అయినప్పటికిని, చీకటివంటిదే యగును. ప్రకాశముయొక్క ధాటికి అది తట్టుకొనలేదు. కావున జీవుడు ఆత్మజ్ఞానమను జ్యోతిని వెలిగించి ప్రకృతిని, మాయాతిమిరమును ఎదుర్కొని, దానిని అంతమొనర్చి భవబంధరహితుడై ఈ జీవితమునందే మోక్షసామ్రాజ్యాధిపత్యమును బడయవలయును.

## చివరివఱకు పోరాడుము

ఇక మోక్షప్రాప్తికి గావింపబడిన మూడవఉపదేశము— 'చివరివఱకు పోరాడుము' అనునది. సామాన్యముగ పర్వతారోహకులు శిఖరమును చేరనంతవఱకు తమ లక్ష్యము నెరవేరినదని తలంపరు. సంగ్రామమున పాల్గొను సైనికులు శత్రువు జయింపబడనంతవఱకు తమ ధ్యేయము సఫలమైనదని భావింపరు. అట్లే అధ్యాత్మమార్గమున యత్నశీలుడగు సాధకుడు బహుజన్మలనుండియు వేధించుచున్న మాయను

అజ్ఞానమును, ప్రతిపక్షశక్తులను పూర్తిగ తుడిచిపెట్టనంతవఱకు తన కర్తవ్యము పరిసమాప్తమైనదని తలంపరాదు. మాయ నివురుగప్పిన నిప్పువలె నుండును. మనుజుడు దానిని జయించి నట్లే భావించి సంబరపడుచుండును. కాని ఇంతలో ఏదియో యొక అవకాశము చూచుకొని అది తలవని తలంపుగ వచ్చి అమాంతముగ మీదపడుచుండును.

The mind has the knack of making the aspirant feel that he is its master, while in fact it makes a hopeless fool of him.

అని ఒక మహాత్ముడు నుడివినట్లు మనస్సు జిత్తుల మారిది, తన్ను జయించివేసినట్లు తన యజమానికి అది విశ్వాసమును కలుగజేయును. కాని తృటిలో వానిని పరాభవించి తనచేతి పైచేయిగ గావించుకొనును. కావున సాధకులు బహుజాగరూకులై ఇంద్రియములను, మనస్సును వెయ్యికళ్ళతో కనిపెట్టి చూచుచుండవలెను. జన్మార్జిత మలినవాసనాప్రభావముచే ఇంద్రియాదులు తమకు ప్రియములైన దృశ్యవిషయములపైకే ఉరుకుచుండును. అత్తఱి విజ్ఞుడగువాడు వివేకమను ఆయుధమును ఆశ్రయించి వానికి ఈ క్రిందివిధముగ బోధించవలెను——

‘ఓ మనస్సా! ఓ యింద్రియములారా! ఎన్ని జన్మల నుండి ఈ ప్రకారము విషయములవైపునకు మీరు పరుగెత్తుచున్నారు? మీకేమైన తృప్తికలిగినదా? ఇంకను కోటాను కోట్ల జన్మలు ఈప్రకారముగ అనుభవించినను తృప్తికలుగు

నను నమ్మకమేమైన మీకున్నదా? విషయములవలన మీరు పొందు ఆనందము ఏపాటిది? ఎంతసేపుండును? అది శాశ్వతమా, లేక నశ్వరమా? అవిచ్ఛిన్నమా, లేక దుఃఖమిశ్రితమా? అతుకులబొంతవంటి ఈ అల్పసుఖముకొఱకై బహుమూల్యమైన ఈ మానవజన్మను వృథాచేయుట మీకు పాడియా? దివ్యమైన ఇట్టి అవకాశములు మఱల మఱల దొఱకునా? అనంత బ్రహ్మానంద పారావారమునకు వారసులైయున్న మీరు ఈ ప్రకారముగ కక్కుర్తిపడి అల్పవస్తువుకొఱకు జీవితమును ధారపోయుట న్యాయముకాదు. లెండు! పరాత్పరుని పాదయుగములను సేవించుటకై తత్క్షణమే కృతనిశ్చయులు కండు!'

ఈ ప్రకారముగ మనస్సునకు, ఇంద్రియములకు చక్కని హితబోధచేసి వానియొక్క దర్పమును సాధకుడు అడంచవలెను. అయితే బహుకాలమునుండి ప్రాపంచిక వాసనలు రూఢిపడియుండుటవలన అవి వెంటనే చెప్పినమాట వినకపోవచ్చును. అయినను ప్రయత్నమును వీడరాదు. ఏనాటికైనను తత్త్వజ్ఞాన సహాయముచే వాసనాక్షయము పరిపూర్తిగ సంభవించి మనోనాశము లెస్సగ సిద్ధించినపుడే ఆత్మసాక్షాత్కారము కలుగగలదు. వాసనలు పైపైన నశించినట్లు కనిపించినను లోన వేరు పాతుకొనియుండును. తీగె ఎండిపోయినను దుంప నశింపనట్లు. సాధకుడు తాను చేయు సత్ప్రయత్నములవలన వాసనలయొక్క ప్రకోపము ఒకింత ఉపశమించినను దానిని నమ్మరాదు. 'రసవర్జం' అని.

గీతాచార్యులు ఈ స్థితినే గీత రెండవ అధ్యాయమున చక్కగ వర్ణించి చెప్పిరి. వివేక వైరాగ్యాదులచే వాసనలు, దుర్గుణములు, దురభ్యాసములు, విషయప్రవృత్తులు సమూలముగ తొలగిపోనంతవఱకు మనుజుడు సాధనచేయుచునే యుండవలెను. మధ్యలో నిలుపరాదు. Fight to the end- చివరివరకు పోరాడుము అను సూక్తియొక్క భావమిదియే.

స్థిత్వాఽస్యామన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి.

అని శ్రీకృష్ణపరమాత్మ గీత రెండవ అధ్యాయమున బ్రాహ్మీస్థితినిగూర్చి వర్ణించు సందర్భమున సాధకులకు చక్కని హెచ్చరిక చేసియున్నారు. 'ఓ సాధకులారా! పరమార్థ సాధనను అంత్యకాలముపఱకు, దేహావియోగ సమయమువఱకు నిలుపరాదు. మాయ టక్కులమారిది. మహాశక్తివంతమైనది. ఎప్పుడెప్పుడు సాధకుని పడగొట్టుదునాయని అది పొంచియుండును. కాబట్టి సాధకులారా! ఏమరుపాటులేక శత్రువుతో చివఱివరకు పోరాడి జయించుడు.

జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్.

భయంకరమైన ఈ కామక్రోధాదిరూప శత్రువును విచారణాబలముచే జయించివేయుడు. అభ్యాసముచే దానిని పారద్రోలుడు. ఇకార్యమున ప్రమత్తతగాని, పరాకుగాని, అలసత్వముగాని పనికిరాదు. అంత్యకాలమువఱకుకూడ సాధనవిషయమై బహుజాగ్రత్తగ నుండుడు' అని భగవానుని హితోపదేశము.

పరుగిడు పందెములో ఏ కొద్దిమందో పాల్గొందురు. పాల్గొనిన కొద్దిమందిలో మధ్యలోనే కొందఱు నిలిచిపోవుదురు, చివరివఱకు పోరాడి పందెము గెలుచుకొనువారు ఏ ఒక్కరిద్దరో ఉందురు. వారే ధీమంతులు. విజయలక్ష్మిని వరించువారు వారే. అట్లే అధ్యాత్మక్షేత్రమునను అకుంఠిత మగు దీక్ష, అప్రతిహత అధ్యవసాయము తీవ్రముగు పట్టుదల, ఆత్మవిశ్వాసము కలవారుమాత్రమే మాయతో చివరివఱకు పోరాడి విజయశ్రీని చేపట్టుదురు. అనేకమంది మోక్షప్రాప్తికై యత్నములు చేయుచుండినను, కడవఱకు పోరాటమును సాగించుచునిలిచిన ఏ ఒకానొకధీరుడో విజయవంతుడు కాగలుగుచున్నాడు. 'కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షత్'- విషయవిరక్తికలిగి అంతర్ముఖుడైన ఒకానొకధీరుడుమాత్రమే ప్రత్యగాత్మను చూడగలుగుచున్నాడని ఉపనిషత్తులున్ను ఘోషించుచున్నవి.

కాబట్టి ముముక్షువు లక్ష్యప్రాప్తివఱకు తన పోరాటమును సాగించుచునే యుండవలెను. ఒక జన్మకాలము పట్టినను, రెండు జన్మలకాలము పట్టినను, అనేక జన్మలు పట్టినను మోక్షము పొందువఱకు ప్రయత్నమును విరమించరాదు. లోకమున అధములు దైవకార్యమును ప్రారంభించనే ప్రారంభించరు. మధ్యములు ప్రారంభించి విఘ్నములు ఎదురుకాగానే నిలిపివేయుదురు, ఉత్తములు ఎన్ని విఘ్నములు తటస్థించినను తాము ప్రారంభించిన సత్కార్యమును - దైవకార్యమును విడువనే విడువరు. పరమార్థ

సాధకులు ఉత్తములవలె వ్యవహరించి గొప్ప పట్టుదలతో లక్ష్యమగు భగవత్సాక్షాత్కారమును ఎట్లైనను సాధించియే తీరవలెనుగాని, పిరికిపందలై మధ్యలోనే విరమించి పెద్దల దృష్టిలో హాస్యాస్పదులు కారాదు.

వాసనలు, అగ్ని, ఋణము, రోగము, శత్రువు, విషము—అనునవి ఏ కొంచెము మిగిలియున్నను బాధించుచునే యుండును. వానిని సమూలముగ తొలగించవలెనని నీతిశాస్త్రము బోధించుచున్నది. కావున అనాది మాయారూపశత్రువును అజ్ఞానవైరిని హృదయగేయమునుండి తరిమివైచుటలో ఏమాత్రము వెనుకాడక, అతడు పూర్తిగ వైదొలగనిదే శాంతిని ఏకాలమందును నోచుకొనలేమని దృఢముగ నమ్మి అకార్యమును సాధించుటకు ఈ జన్మయే చక్కటి అవకాశమని విశ్వసించి, దైవముపై పరిపూర్ణ విశ్వాసముంచి, మాయతో, ప్రకృతితో కడవఱకు పోరాటము సాగించి, విజయశ్రీని చేపట్టి ఆత్మసాక్షాత్కారము చే పరమానందమును అనుభవించవలెను.

## జగన్నాటకమును అంతమొనర్చుకొనుము

ఇక మోక్షప్రాప్తికై నాలుగవ ఉపదేశము— 'జగన్నాటకమును శీఘ్రముగ పరిసమాప్తము గావించుకొనుము'—అనునది. శిరస్సుపై కట్టెలమోపు పెట్టుకొని పోవుచుండు గ్రామస్థుడు దానిని ఎప్పుడు క్రిందకు దింపి భారమును తొలగించుకొందునా యని తహతహ పడు

చుండును. పగలంతయు పనిచేయు ఉద్యోగి ఎప్పుడు సాయంసమయము మేతెంచునా యనియు, కార్యభారము ముగించుకొని ఇంటికి వెళ్ళి హాయిగ ఎప్పుడు కాలము గడుపుదునా యనియు పరితపించుచుండును. కాని చిత్రమే మనగా కోట్లకొలది జన్మలు పుట్టుచున్నను చచ్చుచున్నను, దేహభారమును మోయుచున్నను తద్ద్వారా దుఃఖభారమును వహించుచున్నను జీవుడు ఆ భారము ఎప్పుడు తొలగిపోవునా యని ఆలోచించుట లేదు. పైపెచ్చు అజ్ఞానముచే దేహముతో, ఇంద్రియములతో, మనస్సుతో చేయరానిపనులు చేయుచు జన్మబంధనమును ఇంకను దృఢతరమొనర్చు కొనుచున్నాడు. దుఃఖభారమును ద్విగుణీకృత మొనర్చు కొనుచున్నాడు. ఈ జగన్నాటకమును అంతులేకుండ కొన సాగించుచున్నాడు. ఇది అత్యంత శోచనీయము.

All the world is a stage
And all the men and women merely players
They have their exits and their entrances

'ఈ ప్రపంచమంతయు ఒక మహానాటకరంగము. పురుషులు, స్త్రీలు అందఱును ఆ నాటకమందలి పాత్ర ధారులు. వారు రంగస్థలముపైకి వచ్చుచుందురు, పోవు చుందురు,' అని షేక్స్పియర్ మహాకవి నుడివినట్లు ఈ విచిత్ర జగన్నాటకరంగములో జీవుడు వేయని వేషము లేదు. ధరించని పాత్ర లేదు. ఎనుబదినాలుగులక్షల రూపములు ధరించి ఈ విశ్వరంగస్థలిపై అతడు అనాదికాలమునుండి

అభినయ మొనర్చుచున్నాడు. కాని విసుగుపుట్టుట లేదు. ఈ వేషధారణకు స్వస్తిచెప్పి తనకు తానై మిగిలి పరిపూర్ణ సుఖ మనుభవించు భాగ్యము నోచుకొనలేదు. ఇప్పటికే కాలము మీరిపోయినది. బంధవిముక్తినిగూర్చి తేల్చుకొనవలసిన అపూర్వమానవజన్మ ఏతెంచినది. భగవంతుడు ఎంతయో విజ్ఞాన మొసంగినప్పటికిని మనుజుడు బంధనమును దృఢపఱచుకొని బుద్ధిపూర్వకముగ గోతిలోపడుటకే సిద్ధపడుచుండుట హాస్యాస్పదమైన విషయము. ఇకమీదటనైనను మానవుడు తన విజ్ఞతను ఉపయోగించి ఈ జన్మపరంపరకు ఉద్వాసన చెప్పుట శ్రేయస్కరము. ఈ అనాది జగన్నాటకమున కింతటితో భరతవాక్యము పలికి, తాను ధరించు అగణితవేషముల కొక నమస్కారము చెప్పి, జీవుడు తన సహజ నిర్వికల్ప స్వస్వరూపాత్మయందు స్థితిగల్గి పరిపూర్ణ శాంతి ననుభవించుట యుక్తము.

శాంతి బాహ్యావస్తువులనుండి లభించునది కాదు. అట్లు లభించునని తలంచుటయు కేవలము వెఱ్ఱి. శాంతిసుఖములు బయటనుండి కూరబడునవి కావు. అవి లోపలనుండియే ఊరునట్టివి. ఒకవేళ బయటనుండి ఒకింత శాంతిగాని, సుఖము గాని లభించినట్లు తోచినను అది ఎల్లకాలము నిలువదు. మఱుక్షణమే అదృశ్యమై భయంకరదుఃఖరూపముగ పరిణమింప జీవుడు దానిచే సతమతమైపోవును. కావున ఆత్మశాంతియే పరిపూర్ణశాంతి, పదార్థజనితశాంతి కేవలము భ్రాంతిమాత్రమే యగును.

రాత్రి గాఢనిద్రలో జీవుడు అవిచ్ఛిన్నముగ కొంత సేపు సుఖ మనుభవించుచున్నాడుగదా! ఆ సుఖ మెక్కడ నుండి వచ్చినది? బయటనుండియా? కాదు. దేహము, ఇంద్రియములు, మనస్సు అత్తరి లయించియుండుటవలన అ సుఖము బాహ్యపదార్థ జనితముకాదనుట స్పష్టము. అది అంతరమునుండియే ఆవిర్భవించినది. జడమైన సుషుప్తియందే అంతటి ఆనందము, శాంతి మానవునకు లభించుచుండ ఇక చైతన్యవంతమగు సమాధి స్థితియం దాతని కెట్టి మహోన్నత శాంతి లభించునో ఊహించుకొనవచ్చును. అదియే ఆత్మ శాంతి. అది అపరిచ్ఛిన్నమైనది. అదియే మన జన్మహక్కు, అదియే మన స్వస్వరూపము. భక్తి, జ్ఞానవైరాగ్యముల ద్వారా ఇంద్రియములను, మనస్సును చక్కగ నిగ్రహించు కొనుటద్వారా అట్టి స్వస్వరూపశాంతి జీవునకు తప్పక లభించగలదు. ఏ నిర్వికల్ప ఆనందమును జీవుడు సుషుప్తి యందు తెలియకుండ అనుభవించుచున్నాడో, దానిని జాగ్రత్తునందు తెలిసి అనుభవించుటయే సమాధిస్థితియగును. ఇంద్రియ మనస్సంయమాదులచేతను, చక్కని విచారణ చేతను, దృశ్యమునందు విరక్తిభావము జనింప, మనస్సు అంతర్ముఖముకాగా ఇట్టి సమాధి సుఖము, పూర్ణవిశ్రాంతి జాగ్రత్తునందే జీవునకు చక్కగ లభింపగలదు. కావున అద్దానికొఱకే ముముక్షువు లెస్సగ పాటుపడి గమ్యస్థానమగు పరమాత్మను శీఘ్రముగ చేరుకొనవలెను.

సామాన్యముగ దూరప్రయాణము చేయునపుడు యాత్రికుడు కొద్ది సామానును మాత్రమే తన వెంట తీసికొని పోవుచుండును. ప్రయాణము సల్పువాడు తన వెంట భారమును ఎంత తగ్గించుకొనిన అంత హాయిగ ప్రయాణము సలుపగల్గుచుండును.

Less luggage makes travel a pleasure

అని రైల్వే అధికారులు ఈ సత్యమునే ప్రయాణీకులకు చక్కగ ఉద్బోధించుచున్నారు. అట్లే జీవుడు అనాదికాలము నుండి చేయుచున్న ఈ జననమరణరూప దీర్ఘసంసారయాత్రయందు మనస్సు, దేహము, భోగ్యపదార్థములు—ఇత్యాది రూప దృశ్యవస్తువులను గూర్చిన సంకల్పములను ఎంత తగ్గించుకొనిన అంత శాంతిని, సుఖమును బడయగల్గుచుండును. అపుడే మోక్షరూప గమ్యస్థానమును జీవుడను సాంధుడు ఆనందముగ చేరుకొనగల్గును. సంకల్పభారము తగ్గుటయే, లేక తొలగుటయే శాంతికి ఏకైకమార్గము. పూర్ణశాంతికి వేఱొక ఉపాయ మొద్దియు లేదు. అనాత్మస్వరూపములైన దేహాది దృశ్యపదార్థములయెడల విరక్తిగలిగి, ఆత్మయందు ఆసక్తిని పెంపొందించుకొని అట్టి ఆత్మయందు మనస్సును స్థాపిత మొనర్చుటయే పూర్ణశాంతికి ఉపాయము.

కాబట్టి ఉదయము నిద్రలేచినది మొదలు రాత్రి పరుండువరకును లోకవ్యవహారము లనేకము లున్నప్పటికిని అవకాశమును కలుగజేసికొని ఆత్మనుగూర్చియే చింతించుచు, ధ్యానించుచు, తదేకనిష్ఠులై మెలగుచు తద్ద్వారా

అవిచ్ఛిన్నసుఖమును, పరిపూర్ణశాంతిని జీవుడు పడయవలెను. ఈ మానవజీవితమునే చరమజన్మగ నొనర్చుకొని, జగన్నాటక వేషముల కింతటితో తిలాంజలి యొసంగి అనాదికాల సంసార దుఃఖజాలమును విచ్ఛిన్న మొనర్చివైచి ఆత్మస్థితుడై బ్రహ్మానంద మనుభవించవలయును. అదియే కైవల్యస్థితి. అదియే పరమపురుషార్థమగు మోక్షము.



# 9 వ. అధ్యాయము

## మోక్షవిజ్ఞానసర్వస్వము

మోక్షమును గూర్చిన విజ్ఞానమంతయు మూడు గొప్ప సాధనలందు ఇమిడియున్నది. అవియే వాసనాక్షయం, మనోనాశ, తత్త్వజ్ఞానములు. మోక్షసంబంధమైన ఏప్రయత్నమైనను ఈ మూడింటియందంతర్భూతమైయే యుండును.

### వాసనాక్షయము

కాబట్టి ముముక్షు వగువాడు వీనిని తప్పక ఆశ్రయించవలెను. వీనిలో తత్త్వజ్ఞానముచే వాసనాక్షయము, వాసనాక్షయముచే తత్త్వజ్ఞానము ప్రబల మగుచుండును. అవి పరస్పరము ఒక దానిచే మఱియొకటి సంపుష్టిని బొందుచుండును. కనుకనే వసిష్ఠమహర్షి ఆ రెండింటిని ఏకకాలమందే అభ్యసించుట శ్రేయస్కరమని సెలవిచ్చియుండెను. పైన దెలిపిన మూడు ప్రయత్నములు సాధకులకు పరమావశ్యకములై యున్నవి కావున అందొక్కొక్క దానినిగూర్చి విచారింతము——

మొదటిది వాసనాక్షయము. వాసన యనగా నేమి? సామాన్యముగ వాసనయను పదమునకు సుంగధ మనియో, దుర్గంధ మనియో అర్థము చెప్పుచుందురు. ఆధ్యాత్మిక పరి

భాషయందు మాత్రము వాసన యనగా బహుజన్మార్జిత సంస్కారమని భావము. ఆ సంస్కారము చెడ్డగా నున్నచో దానిని దుర్వాసనయనియు, మంచిగా నున్నచో సద్వాసన యనియు చెప్పుదురు. మొదట దుర్వాసనలను పోగొట్టుకొని సద్వాసనలను అభ్యసించవలెను. ఆ పిదప క్రమముగ నిస్సంకల్పాత్మస్థితిని చేరుకొనవలెను.

ఏదైన ఒక కార్యమును చేసినపుడు అది మనస్సుపై ఒక చిహ్నమును కలుగజేయును. ఆ కార్యమునే మఱుసటి రోజు మఱల చేసినపుడు ఆ చిహ్నము బలపడును. తిరిగి దానిని మూడవరోజు చేసినపుడు అది యింకను బలపడి అలవాటుగా మారును. ఆ అలవాటే బలపడినపుడు సంస్కారముగా, వాసనగా పరిణమించును.

Sow an action reap a tendency.
Sow a tendency reap a habit.
Sow a habit reap a character.
Sow a character reap a destiny.
So destiny is in your own hands.

'అనగా ఏదైన ఒక పని చేసినచో అది మనస్సునందు స్థానమును కల్పించుకొనును. దానినే మఱల చేసినచో అది అలవాటుగా మారును. ఆ అలవాటు గట్టి పడినచో శీలము (Character) గా రూపొందును. ఆ శీలమే మానవుని గమ్యమును నిర్ణయించును. కాబట్టి ఉత్తమగమ్యమగు

మోక్షముగాని, అధమగమ్యమగు నరకముగాని నీ చేతుల లోనేయున్నది' అని ఒక మహనీయుడు పలికెను.

కాబట్టి తనయొక్క చేష్టలను మానవుడు అతిజాగరూకతతో గమనించుచు వానిని పరిశుద్ధమొనర్చుకొనుటకై ప్రయత్నించవలెను. ఇంతవఱకు అజాగ్రతవలన జీవుని చిత్తకుహరమున అనేక పాపవాసనలు, దుర్వృత్తులు, దుస్సంకల్పములు రాశీపడి స్థానమును కల్పించుకొని హక్కు భుక్తములను ఏర్పఱచుకొని యుండెను. కారణ దేహమున అవ్వియే అతిసూక్ష్మముగ బీజరూపముగ నెలకొని యున్నవి. ఆ బీజములే క్రమముగ వికసించి అదను చూచుకొని మహా విషవృక్షములుగ పరిణమించి జీవుని అధోగతికి త్రోసివేయుచున్నవి. కాబట్టి ఆ దుర్వాసనలను విచారణచే పెకలించివైచి వివేకఖడ్గముచే రూపుమాపి చిత్తమును వాసనారహితముగ నొనర్పవలెను. చిత్తము నిర్మలముగ నున్నపుడే అధిష్ఠానమగు ఆత్మ చక్కగ అనుభూతము కాగలదు.

అయితే ఆ వాసనలలో ఏ ఒకటి రెండిటినైన తొలగించిన చాలునని భావింపరాదు. అన్నిటిని నిశ్శేషముగ తొలగించి వేయవలెను. 'శేషః స్వల్పోఽపి బాధతే' అనునట్లు అగ్నిగాని, ఋణముగాని, వ్యాధిగాని, వాసనగాని ఒకింత మిగిలియున్నను ప్రమాదమును గలుగజేయును. శ్రీకృష్ణ పరమాత్మ 'ప్రజహాతి యదా కామాన్ సర్వాన్' అని చెప్పుటకు కారణమిదియే. కోరికలన్నిటిని సంపూర్తిగ విడనాడినపుడే మనుజుడు స్థితప్రజ్ఞుడు కాగలడని, పరమ శాంతిని

బడయగలడని గీతాచార్యుడు నుడివెను. కోరికలు మనస్సు యొక్క మారుమూలలందు దాగుకొని యుండును. వాసనా రూపమున మనస్సులోన జలించియుండును. దోషముగాని, బంధముగాని బయట లేదు. మనస్సునందే కలదు. కాబట్టి మనస్సను అగాధ అంధకార కుహరమున వివేకమను దీపము యొక్క సహాయముచే ఏయే వాసన లున్నవో చక్కగా వెదకి వానిని ఏరి పారవేయవలెను. అన్నములో రాతిబెడ్డలను, పైరులో కలుపుమొక్కలను, ఈ ద్యానవనమున కంటకములను, కూరచెట్లలో చీడపురుగులను ఏరి దూరముగ పారవేయునట్లు మనస్సునందలి వాసనారూప మాలిన్యమును దూరముగ తొలగించి వేయవలెను, ఇదియే వాసనా క్షయము.

అధ్యాత్మరంగమున ఈ వాసనాక్షయ మొక మహోన్నత మగు యత్నము. ముముక్షువులకు పరమావశ్యకమైన అంగము. కావున సాధకు లిద్దానిని తప్పక ఆశ్రయించి, సాధించి పరమానందమును బడయవలయును.

## మనోనాశము

వాసనాక్షయ, మనోనాశ, తత్త్వజ్ఞానములను మహోన్నత పరమార్థ యత్నత్రయమందు మొదటిదియగు వాసనా క్షయమును గుఱించి ఇంతవఱకు విచారించియున్నాము. ఇపుడు రెండవదియగు మనోనాశమునుగూర్చి విచారింతము. మనస్సు నశించిన మిగుళునదే ఆత్మ. మనోనాశముచే మను

జుడు స్వస్వరూప మగు ఆత్మస్థితియందు నిలుకడ కలిగియుండక గలడు. అనేక జన్మలనుండి ఈ మనస్సు జీవునకు ఒక పెద్ద ప్రతిబంధకముగ వర్తించుచున్నది. తెర వేయబడినపుడు తెర వెనుకనున్న వ్యక్తి కానుపించనటుల, రజస్తమోగుణా యుక్త మగు మనస్సు అడ్డుగా నున్నందున వెనుకనున్న పరమాత్మ మనుజునకు దృగ్గోచరము కాకయున్నాడు. పరమాత్మసాక్షాత్కారమునకై ఇపుడు చేయవలసిన పని మనోరూప ప్రతిబంధ నిర్మూలనమే యగును. దీనినే మనోనాశ మని యందురు.

మనస్సు అనునది ఒక ప్రత్యేక పదార్థము కాదు. అనేక వాసనలు, సంస్కారములు, సంకల్పములు, వృత్తులు చేరి మనస్సు అను ఒక వస్తువుగ ఏర్పడినది.

'కామసంకల్ప విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధాధృతిరధృతి
హ్రీర్ధీర్భీరిత్యే తత్సర్వం మన ఏవ'

అను ఉపనిషద్వాక్య మీ సత్యమునే నిరూపించుచున్నది. కట్టెలు మండుచున్నపుడు ఏర్పడిన అగ్నిహోత్రమును శమింప జేయుటకు ఉపాయము ఒక్కొక్క కట్టెను లాగి పారవేయుటయే యగును. ఈ ప్రకారము అన్ని కట్టెలను తొలగించినచో అగ్నిహోత్రము దానంతట నదియే చల్లారిపోవును. అట్లే మనస్సునందుగల వాసనలు, కోరికలు ఒక్కొక్కటి విచారణచే తొలగించి వేయబడినపుడు తమోగుణ, రజోగుణములు అంతరించి మనస్సు దానంతట నదియే శమించి

పోవును. ఇదియే అమనస్కస్థితి. ఇట్టి స్థితి విచారణచేతనే సాధ్యపడగలదు.

మనోనాశము సిద్ధించునపుడు ధ్యానకాలమున జీవునకు కలుగునది శూన్యావస్థకాదు. అపుడు ఆత్మ మాత్రము శేషించియుండును. అది పరమానందస్థితి. దృశ్యరహిత పరబ్రహ్మముయొక్క అనుభూతి అచ్చోట సిద్ధించుచుండును. దానినే సమాధిస్థితి యని అందురు. అది సుషుప్తి కాదు. సుషుప్తియందు జనులకు తమస్సు వ్యాపించియుండును. కావున అట్టిచో సంభవించు మనోలయము అభిలషణీయము కాదు. అట్టి మనోలయము నిద్రయందు పశువులకు కూడ సంభవించుచుండును. సమాధిస్థితియందో జీవుడు ఆత్మయందు మేల్కొని యుండును. ఆ స్థితిని తురీయ మనియు అందురు. జీవన్ముక్తులగు మహనీయులు వ్యవహారము సలుపుచున్నను ఆత్మస్థితిని మఱువక నిత్యము అట్టి తురీయపదముననే వెలయుచుందురు. కోరికలు, సంకల్పములు, జన్మార్జితవాసనా సమూహములు విచారణా బలముచే తొలగి మనస్సు నిస్సంకల్పాత్మకమైనపుడు మాత్రమే జనుల కట్టి తురీయస్థితి కలుగుచుండును. కావున వాసనాక్షయముచే మనోనాశమును సిద్ధింపజేసికొనిన మహనీయునకు ఆత్మస్థితి స్వయముగనే యేర్పడి బంధవిముక్తి చేకూరగలదు. ఇక్కారణమున మోక్షప్రాప్తికై మనోనాశము అత్యంతావశ్యకమైన అంగమని తేలుచున్నది. కావున ముముక్షువులు ప్రయత్నపూర్వకముగా అద్దానిని సాధించి మనోనాశముచే కేవలాత్మస్వరూపమున నిష

కలవారై, మహోన్నతమగు అట్టి లక్ష్యమును ఈ జీవితము నందే సాధించి కృతార్థులు కావలయును.

## తత్త్వజ్ఞానము

జీవుని కైవల్యధామమును జేర్చ గల్గు ప్రముఖ యత్నములగు వాసనాక్షయ, మనోనాశ, తత్త్వజ్ఞానము లందు మొదటి రెండిటినిగూర్చి ఇంతదనుక విచారించి యున్నాము. ఇక మూడవదియగు తత్త్వజ్ఞానమును గురించి ఇపుడు యోచించెదము—

ఉన్నదానిని ఉన్నదిగను లేనిదానిని లేనిదిగను తెలిసి కొనుటయే జ్ఞానము 'జ్ఞానం సమ్యగవేక్షణమ్'— లెస్సగ జూడగల్గుటయే జ్ఞానమని శ్రుతి భగవతి పేర్కొనుచున్నది. అయితే జనులు లెస్సగ చూచుట లేదా యనిన, చూచుట లేదనియే చెప్పవలసియున్నది. జ్ఞాననేత్రమును సంపాదించ నిచో వస్తువుయొక్క నిజతత్త్వము గోచరింపదు. అట్టి జ్ఞాన నేత్రము ఏ కొలదిమంది మహనీయులకో తప్ప తక్కిన వారికి లేదు. అందుచే వారు భ్రమలో చిక్కుకొని ప్రపంచమును వక్రముగ, లేక తలక్రిందులుగ జూచుచు నానా బాధలకు లోనగుచున్నారు. క్షేత్రక్షేత్రజ్ఞ సమ్మిశ్రితమగు ఈ ప్రపం చమునుండి వారు క్షేత్రజ్ఞుని విడదీయలేక, పెక్కు యిడుము లకు లోనగుచున్నారు. సాధనాతిశయముచే జ్ఞాననేత్రమును సంపాదించినచో జనులకు ఇట్టి బాధ లుండవు. 'క్షేత్రక్షేత్ర జ్ఞయోరేవమన్తరం జ్ఞానచక్షుషా' — అను వాక్యము

ద్వారా భగవానుడు 'ఓ జనులారా! జ్ఞాననేత్రమును సంపాదించి దృక్, దృశ్యములను విభజించి దృక్స్వరూపముగు పరమాత్మయందే నిలుకడ గలిగి పరమానందమును బొందుఁ'డని ఆదేశించుచున్నాడు.

ప్రపంచములో వస్తుతత్త్వమును విచారించినపుడే మనుజునకు శాంతి, సుఖము కలుగుచున్నవి. జనులీ భోగవిలాసములపై ఏల పరుగిడుచున్నారు? ఈ నామరూపాత్మక క్షణిక ప్రపంచమును ఏల వెంటాడుచున్నారు? అవి సత్యమని నమ్మినందున; వానియందు దోషమేమియు లేదని విశ్వసించినందువలన, కాని మహాత్ముల సాంగత్యము చేతను, శాస్త్రవిచారణచేతను దృశ్యవస్తువులందు ఒక పెద్దదోషము కలదని మనుజుడు గుర్తెఱుగుచున్నాడు. అదియే క్షణికత్వము, నశ్వరత్వము, అశాశ్వతత్వము, దృశ్యవస్తువులన్నియు ఏదియో యొక సమయమున కాలగర్భమున విలీనములై పోవుచున్నవి. సూర్యచంద్ర నక్షత్రాదులే ప్రళయకాలమున విలయమై పోవుచుండ ఇక చిన్న రాజ్యముల విషయమై, భోగముల విషయమై శరీర, ఆరామ క్షేత్రాదుల విషయమై వేఱుగ చెప్పవలెనా? ప్రాపంచిక పదార్థములందు ఇట్టి దోషమును విచారించి వానిపై విరక్తి కలిగి శాశ్వతముగు పరమాత్మవైపునకు మరలుటయే విజ్ఞత యనిపించుకొనును. "దుఃఖదోషానుదర్శనమ్" అను సాధనను గీతయందు పదేపదే భగవానుడు నొక్కి చెప్పుటకు కారణమిదియే. ఒకానొక వస్తువునందుగల దోషమును కప్పిపుచ్చి,

దానిని సుందరముగ కొండంతలుగ భావించుచు దానివెంట పరుగిడుటయే అజ్ఞానము. వస్తువునందు గల వాస్తవతత్త్వ మును గమనించి, దానియందున్న దోషమును గుర్తెఱిగి దానినుండి దృష్టిని మరలించి, శాశ్వతమైన పదార్థముపై ప్రసరించుటయే తత్త్వజ్ఞానము. ఇట్టి తత్త్వజ్ఞానముచే తప్ప మఱి దేనిచేతను జీవునకు బంధరాహిత్యము కలుగ నేరదు.

చీకటిలో త్రాడును చూచి సర్పమని భ్రమించి నానాయాతనల నొందుచుండువానియొక్క దుఃఖము దేనిచే శమించును? 'ఇది సర్పము కాదు, త్రాడుమాత్రమే' యని తెలిసికొనుటవలననే. రాత్రికాలమున స్థాణువును జూచి దొంగయని తలంచి భీతిల్లి జ్వరగ్రస్తుడైన పిల్లవాని తాపము దేనిచే శాంతించగలదు? తాను చూచినది దొంగకాదు కొయ్యమొద్దు-అని తెలిసికొనుటవలననే. పదిమంది ఏరు దాటి అవలియొడ్డున కూర్చొని తమలో ఒకడు ఏటిలో మునిగిపోయినాడని ఏడ్చుచు పెడబొబ్బలు పెట్టుచుండువారి సంతాపము దేనిచే శమించును? అప్పుడు వచ్చి 'మీలో ఎవరును చావలేదు. అందరు క్షేమముగా నున్నార'ని లెక్కించి చూపుటవలననే. అట్లే 'నేను జీవుడను, నేను దేహమును, నేను పుట్టువాడను, నేను చచ్చువాడను'— అని బాధ నొందుచుండు వాని క్లేశమును పోగొట్టునది 'ఓయీ! నీవు జీవుడవుకాదు, దేహముకాదు, నీవు చచ్చు వాడవుకాదు, పుట్టువాడవుకాదు, సంసారబంధములో తగులు

కోనిన మాంసపుకాదు, జననమరణరహిత నిత్యశుద్ధబుద్ధముక్త చిదాత్మవు. నీవు పంజరములో బంధింపబడిన పక్షివి కాదు; ప్రకృతిశృంఖలములను త్రెంచివేసి సర్వవ్యాపకమై వెలుగొందు పరమాత్మవు' అని తెలుపు విజ్ఞానమే అయియున్నది. దీనినే తత్త్వజ్ఞానమందురు. వాసనాక్షయ, మనోనాశ, తత్త్వజ్ఞానములను మోక్షసాధనత్రయమున ఈ తత్త్వజ్ఞానము ప్రముఖస్థానమును ఆక్రమించియున్నది. ఏలయనగా తత్త్వజ్ఞానముచే వాసనాక్షయము, వాసనాక్షయముచే మనోనాశము, మనోనాశముచే ఆత్మయందు స్థితి, అద్దానిచే మోక్షప్రాప్తి మానవునకు సిద్ధించుచున్నవి. కాబట్టి తత్త్వజ్ఞానమే మూడిటిలో కీలకస్థానమును బడసియున్నది.

బహుజన్మార్జిత వాసనాబలముచే మనస్సు బాహ్యవస్తువులపై, విషయభోగములపై పరుగిడునపుడు, దానినచ్చోటినుండి మరలింపగల సామర్థ్యము తత్త్వజ్ఞానమొక్క దానికే కలదు. వస్తువునందలి గుణదోషములను చక్కగ విమర్శించి చూచునపుడు తెలివిగల మనస్సు దోషమునుండి మరలి గుణమునే ఆశ్రయించును.

ప్రదృశ్యతే వస్తుని యత్ర దోషః
న తత్ర పుంసోఽస్తి పునః ప్రవృత్తిః.

వస్తువులందెచట దోషము కలదని వివేచనచే మనుజుడు తెలిసికొనుచున్నాడో తిరిగి దానియందాతడెన్నటికిని ప్రవృత్తుడు కానేరడని కాళిదాసకవీశ్వరుడు నుడివియున్నాడు. అట్లే తత్త్వజ్ఞానముయొక్క సహాయముచే,

అనగా 'బ్రహ్మసత్యం, జగన్మిథ్యా' అను సిద్ధాంతముయొక్క బలముచే ప్రపంచమును ఉన్నది ఉన్నట్లుగ చూచినచో, దానియందు మనస్సు తగుల్కొనక ఉండును. అత్తటి వాసనాక్షయము సంభవించును. ఎపుడు వాసనలు సన్నగిలునో అపుడు ఇంధనములేని అగ్నివలె మనస్సు ఉపశమించును. అట్టి అమనస్కస్థితియందు ఆత్మమాత్రము శేషించియుండును. అదియే మోక్షస్థితి. ఈ ప్రకారము తత్త్వజ్ఞానము మోక్షప్రాప్తికి అత్యంత ప్రధానమైన హేతువుగ వర్తించుచున్నది. కావున ముముక్షువు లిద్దానిని ప్రయత్నపూర్వకముగ సంపాదించి తమ జన్మహక్కైన స్వారాజ్యమును, ఆత్మసామ్రాజ్యమును బడసి కృతకృత్యు లగుదురుగాక!

# 10 వ. అధ్యాయము

## మోక్షోపాయములు

పూర్వము శ్రీ వసిష్ఠమహర్షి శ్రీరామచంద్రునకు పలువిధ మోక్షోపాయములనుగూర్చి వివరముగ తెలిపి యుండెను. అవి యన్నియు శ్రీమహర్షి వాల్మీకి విరచితమగు యోగవాసిష్ఠమున (వసిష్ఠగీతయందు) చక్కగ పొందు పఱుపబడినవి. కనుకనే ఆ మహాగ్రంథముయొక్క ప్రతి అధ్యాయము చివర "ఇతి శ్రీమద్వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే..." అను వాక్యము ఉల్లేఖింపబడియున్నది. వసిష్ఠప్రోక్తములగు ఆ మోక్షోపాయములనుగూర్చి తెలిసికొనుట సాధకులకు అత్యంతావశ్యకమై యున్నది. కావున వానిని గుఱించి సంక్షేపముగ ఇచట విచారించెదము—

శాస్త్రానుకూలమగు పురుషప్రయత్నము నాశ్రయించి జీవుడు బంధవిముక్తికొఱకు అహర్నిశములు పాటుపడ వలయును.

### పురుషప్రయత్నము

గతదినమందలి అజీర్ణాది దోషములు నేటి ఔషధాది గుణములచే క్షయించులాగున ఈ జన్మయందలి శుభ పురుష

ప్రయత్నముచే పూర్వజన్మపు అశుభ పురుషప్రయత్నము నిస్సందేహముగ శమించిపోవును.

> సంసార గహరాదస్మా న్నిర్గన్తవ్యం స్వయం బలాత్
> పౌరుషం యత్నమాశ్రిత్య హరిణేవారిపంజరాత్. (వసిష్ఠగీత)

"ఉత్తమ పురుషప్రయత్నము నాశ్రయించి ఈ సంసారమను గోతినుండి-శత్రుపంజరమునుండి సింహామువలె-స్వయముగ బలాత్కారముగ బయల్వెడలవలెను". విశ్వామిత్రుడు తనయొక్క తీవ్రపురుషప్రయత్నమువలననే బ్రహ్మర్షి కాగల్గెను. భగీరథుడు తనయొక్క ప్రయత్నాతిశయము వలననే గంగను భూలోకమునకు రప్పింపగల్గెను. బుద్ధదేవుడు తనయొక్క అకుంఠిత ప్రయత్నముయొక్క ప్రాబల్యము చేతనే నిర్వాణమను లక్ష్యమును తనజీవితమందే చేరగల్గెను. ఇదేప్రకారముగ ఎందరో ఋషులు, మునులు, మహానీయులు తమయొక్క పురుషప్రయత్నముయొక్క మహిమచే లక్ష్యమగు పరమాత్మను బొందగల్గిరి. కావున, మెఱుపువలె చంచలమైనట్టి ఈ సంసారమును బొందిన మనుజుడు సచ్ఛాస్త్ర, సాధుజన సాంగత్యములచే అజ్ఞానమను బురద నుండి సారవస్తువగు ఆత్మను ఉద్ధరింపవలెను. వార్ధక్యము రాకమునుపే, బాల్య, యౌవనములందే ఈ సంసారమను మహాసముద్రమును విశుద్ధబుద్ధియను నావచే దాటివేయ వలెను. ఏది శ్రేయమో దానిని ఇపుడే ఆచరించవలెను. వృద్ధుడైనపిదప మనుజు డేమిచేయగలడు ? అత్తటి అతని సొంత అవయవములుకూడ అతనికి భారతభూములుగ

-లోచును. ఆత్మజ్ఞానార్థము దృఢప్రయత్నము గావించినచో తనకుతానే బంధువగును. అట్లు కాకున్న తనకుతానే శత్రువగును. ఇవ్విధముగ వివేకాదులద్వారా పురుషప్రయత్నముచే తన్ను తాను ఉద్ధరించుకొనినచో ఇక తనయొక్క రక్షణమందు వేఱు ఉపాయమెద్దియును లేదు.

> ఇహైవ నరకవ్యాధేశ్చికిత్సాం న కరోతి యః
> గత్వా నిరౌషధం స్థానం సరుజః కిం కరిష్యతి.

'నరకమను వ్యాధికి ఈ లోకమున ఎవడు చికిత్స గావించుకొనడో, అట్టి భవరోగగ్రస్తుడు (శాస్త్ర సత్సాంగత్యాది) ఔషధములులేని ఇతరలోకములకు జని ఏమి చేయగలడు?' కావున సంసారదుఃఖనివారకమగు పురుషప్రయత్నము నాశ్రయించి తరింపవలెనను అభిలాషకలిగి ముముక్షువు ప్రప్రథమమున సద్గురువులగు మహాత్ముల నన్వేషించి వారి సాంగత్యము నలవఱచుకొనవలెను. ఏలయనగా,

> న తపాంసి న తీర్థాని న శాస్త్రాణి జయన్తి చ
> సంసార సాగరోత్తారే సజ్జనాసేవనం వినా.

సంసార సముద్రమును దాటుటయందు తపస్సులుకాని, తీర్థములుకాని, శాస్త్రములుకాని సజ్జనులగు మహాత్ముల సేవనము లేనిచో విజయవంతములు కానేరవు. నావికునియొద్ద నౌక లభించునట్లు మహానుభావుడగు జ్ఞానియొక్క సాంగత్యమువలన సంసార సముద్రమును దాటుటకు యుక్తి లభించును. దారిద్ర్యము, మరణము, దుఃఖము-ఇత్యాది విషయములతో గూడిన ఈ సంసార భ్రమ యను రోగము సాధుజన

సాంగత్యమను ఔషధముచే సంపూర్ణముగ నశించిపోవును. కావుననే సత్సాంగత్యము మోక్షసాధమునకు ద్వారపాలకుడుగ ఏర్పడియున్నది.

(1) మోక్షద్వారే ద్వారపాలా శ్చత్వారః పరికీర్తితాః
శమో విచారః సంతోష శ్చతుర్థః సాధుసంగమః.

(2) ఏతే సేవ్యాః ప్రయత్నేన చత్వారో ద్వౌ త్రయోఽథవా
ద్వారముద్ఘాటయన్త్యేతే మోక్షరాజ గృహే తథా.

(3) ఏకం వా సర్వయత్నేన ప్రాణాం స్త్యక్త్వా సమాశ్రయేత్
ఏకస్మిన్వశగే యాన్తి చత్వారోఽపి వశం యతః.

(శ్రీ వసిష్ఠగీత - ముముక్షుప్రకరణము)

అనగా, 'మోక్షద్వారమున శమము, విచారణ, సంతోషము, సాధుజన సాంగత్యము-అను నలుగురు ద్వారపాలురు గలరు. ఈ నాల్గింటిని, లేక శక్తిలేనిచో, మూడింటిని, లేక రెండింటిని ప్రయత్నపూర్వకముగ సంపాదించవలెను. ఏలయనగా, ఇయ్యవి మోక్షమను రాజుయొక్క గృహద్వారమును తెఱచును. లేక పై నాల్గు సాధనములలో ఒక్కదానినైనను ప్రాణములకు తెగించియైనను సర్వప్రయత్నములచే సాధించవలెను. ఏలయనిన, "అందొక్కటి వశపడినచో, తక్కిన మూడున్ను వశమగును.' సంసార సముద్రమును దాటుటకు ఈ నాలుగున్ను మనుజులకు ఉపాయములై యున్నవి. వానిని సంపాదింపనంతవరకు మనుజులైనను, దేవతలైనను, యక్షులైనను - ఎవరైనను సరే - సంసారతరణమున వేఱొక ఉపాయ మెద్దియును లేదు.

కాబట్టి మహాకష్టపరిస్థితులు సంప్రాప్తించి నప్పటికిని గూడ మనుజులు సాధుజనసాంగత్యమును ఒకింతైనను వదల రాదు. మఱియు, దరిద్రుడు మణులను వెదకునట్లు పరమాత్మ యందు విశ్రాంతినొందిన మనస్సుగలవారును, ధన్యులు నైన సాధుమహాత్ములను ప్రయత్నపూర్వకముగ వెదకి సేవించ వలెను.

ఇవ్విధముగ సజ్జనసాంగత్యము నలవఱచుకొని, అమ్మహనీయుల ముఖతః పరమాత్మబోధను శ్రవణము చేయుచు శమదమాది సద్గుణములను మొట్టమొదట సంపా దించవలెను. వానిచే చిత్తము శుద్ధమగును. మలినమగు అద్దమందు పదార్థముయొక్క ప్రతిబింబము పడనట్లు, మలిన చిత్తమున గుహ్యపవిష్టజ్ఞానము, వివేకము ప్రవేశింపదు. మఱియు మలినవస్త్రమందు రంగు నిలువనట్లు, మలినచిత్త మున అద్వైతాత్మజ్ఞానము స్థితిఁబొందదు. చిత్తము పాప పంకిలమై యున్నపుడు అందు ఆత్మజ్ఞాన ముదయింపదు. ఎపుడు సచ్ఛాస్త్ర పఠన, సజ్జనసాంగత్య, పుణ్యకర్మాచర ణాముల ద్వారా ఆ పాపము నశించి పోవునో అపుడు దీపము వలె సార (ఆత్మ) పదార్థము నవలోకింప శక్తిగల వివేక యుక్తమగు బుద్ధి మనుజునకు జనించుచున్నది. తెల్లని వస్త్రము రంగును గ్రహించునట్లు, శుభగుణములను జల ముచే నిర్మలమైనట్టి మనస్సు బ్రాహ్మీవృష్టిని గ్రహించు చున్నది. కాబట్టి మొట్టమొదట సచ్ఛాస్త్రముల చేతను,

ఉత్తమ వైరాగ్యముచేతను, సజ్జన సాంగత్యము చేతను మనస్సును పుణ్యవంతముగను, శుద్ధముగను నొనర్పవలెను.

## ఇంద్రియ మనోనిగ్రహము

ఆప్రకారముగ మనస్సు పుణ్యవంతముగ నొనర్పబడునపుడు అది రజస్తమస్సులను వీడి సత్త్వగుణమును జేపట్టును గాన అద్దాని నిగ్రహ మపుడు సులభసాధ్యమగును, కఠినమగు ఇనుమును ఎవరును వంచజాలరు. కాని అగ్ని సమ్మేళనముచే ఎపు డది మెత్తబడునో అపుడే వంచుటకు వీలగును. ఆ రీతిగనే జన్మజన్మాంతర వాసనాసమూహములచేతను, పాపపుంజములచేతను నిండి నిబిడీకృతమై, మూర్తీభవించిన తమోరాశిచందమున నుండు ఘనరూపమైన మనస్సును ఎవరును ఏ కాలమందును ఏ యుపాయము చేతను నిగ్రహింపజాలరు. మనస్సు నిగ్రహింపబడనిచో ఆత్మప్రాప్తి కలుగదు. ఆత్మప్రాప్తి కలుగనిచో సంసార దుఃఖము శమింపదు. కావున మోక్షప్రాప్తికి మనోనిగ్రహ మొకటియే ఉపాయము.

> సంసారస్యాస్య దుఃఖస్య సర్వోపద్రవదాయినః
> ఉపాయ ఏక ఏవాస్తి మనసః స్వస్య నిగ్రహః.
>
> (వసిష్ఠగీత – ఉపశమప్రకరణము)

అనగా, సమస్త ఉపద్రవములను కలుగజేయునదియు, దుఃఖరూపమునగు ఈ సంసారముయొక్క శమనముకొఱకు ఒకే ఉపాయము కలదు. అది యేదనిన – తనయొక్క మన

స్సును నిగ్రహించుకొనుటయే. మఱియు ఈ సమస్త దృశ్య ప్రపంచమున్ను మనస్సుయొక్క స్వరూపమే. కావున అద్దానికి చికిత్స చేసినచో సంసారరోగమంతయు చికిత్సగావింపబడినదగును. ఈ సంసారచక్రముయొక్క, మాయాచక్రముయొక్క నాభి (బొడ్డు) మనస్సే అయియున్నది. ఆ మనస్సును ఎవరు జయించుదురో, వారిని ఆ మాయ, సంసారము ఒకింతైనను బాధించకుండును. ఈ రీతిగ మనస్సును జయించుటమాత్రమను పరమౌషధము లేకున్న ఇక ఈ సంసారమను మహారోగము ఎన్ని ఇతర ప్రయత్నములచేతనుగూడ శమింపనేరదు. అయితే ఆ మనస్సు ఇంద్రియములకు లోబడియున్నది. కావున మొట్టమొదట ఇంద్రియములను జయించనిదే మనస్సు స్వాధీనపడదు. ఆత్మసాక్షాత్కారమునకు ప్రధానమైన ప్రతిబంధకము ఈ ఇంద్రియములే అయియున్నవి. అయ్యవి వానివాని విషయములగు శబ్దస్పర్శాదులపైకి మనస్సును ఈడ్చుచున్నవి. వివేకముచేతను, వైరాగ్యముచేతను, ఆ యింద్రియములను శబ్దాదులనుండి మరలించి ఆత్మయందు నెలకొల్పవలెను. దీనినే ప్రత్యాహారమని చెప్పుదురు. ఈ ఇంద్రియసుఖములు మోక్షమార్గమున పెద్ద పర్వతమువలె అడ్డుగ నున్నవి. కావుననే "ప్రోల్లఙ్ఘ్యేన్ద్రియ పర్వతమ్"-ఇంద్రియములను పర్వతములను లెస్సగ దాటి "పారం గచ్ఛ పరం పదమ్"-వానికి ఆవలనున్న పరమాత్మ పదమును బొందుడు' అని బోధింపబడినది. ఎంతవఱకు మనుజుడు స్వయముగ తనయందు ఆత్మశాంతి నొందకుండునో,

అంతవఱకును ఇంద్రియములను శత్రువులను మరల మరల జయించుచునే యుండవలెను.

> ఉత్థితానుత్థితానేతా నిన్ద్రియాహీన్పునః పునః
> హన్యాద్వివేకదణ్డేన వజ్రేణేవ హరిర్గిరీన్.
>
> (వసిష్ఠగీత - ఉపశమప్రకరణము)

ఇంద్రుడు వజ్రాయుధముచే పర్వతములయొక్క ఱెక్కలను ఛేదించునట్లు ఇంద్రియములను సర్పములు పైకి లేచినపుడెల్ల వివేకమను కఱ్ఱచే వానిని మరల మరల చితుకగొట్టవలెను. మఱియు భగవద్గీతయందు శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు—

> 'తస్మా త్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ'

'కావున ఓ భరతశ్రేష్ఠా! నీవు మొట్టమొదట ఇంద్రియములను నిగ్రహింపుము' అని బోధించిన విధముగనే వసిష్ఠగీతయందును శ్రీ వసిష్ఠమునీంద్రులు శ్రీరామచంద్రునకు—

> 'పూర్వం హృదయశత్రుత్వాజ్జేతవ్యానీన్ద్రియాణ్యలమ్'
>
> (శ్రీ వసిష్ఠగీత - స్థితి ప్రకరణము)

అని వక్కాణించిరి - అనగా ఇంద్రియములు మనకు అతి సమీపమున నున్న శత్రువులగుటవలన తక్కిన శత్రువులందఱికంటెను ముందర హృదయమందలి ఈ యింద్రియరూప శత్రువులనే లెస్సగ జయింపవలెనని బోధించిరి. ఇంతే కాదు. 'చేతిని చేతితో నలిపి, పండ్లను పండ్లచే కొఱికి, అవయవములను అవయవములచే నాక్రమించి, ఏవిధముగనైనను (సర్వప్రయత్నములచే) మొట్టమొదట ఇంద్రియము

లను శత్రువులను జయించవలె' ననియు ఆనతిచ్చిరి. ఇంద్రియనిగ్రహమను వారధిచేతనే ఈ సంసారసముద్రము దాటబడునుగాని మఱి ఏ యితర కర్మచేతను గాదని స్పష్ట పఱచిరి.—

ఇన్ద్రియ గ్రామసంగ్రామ సేతునా భవసాగరః
తీర్యతే నేతరేణేహ కేనచిన్నామ కర్మణా.

(వసిష్ఠగీత - స్థితిప్రకరణము)

ఈ ప్రకారముగ ఆత్మావరోధకములగు ఇంద్రియ, మనంబుల జయించినవారే ఈ జగన్మాయను అరచేతియందలి మారేడుపండువలె ప్రత్యక్షముగ గాంచగలరుకాని తక్కిన వారు కాదు. తక్కినవారు తమ ఇంద్రియములకు దాసులై, తమ మనస్సు చెప్పినట్లు ఆడుచు, సంసారమగ్నులై, పదపదమున దుఃఖమును ఎదుర్కొనుచు జన్మపరంపరలనుండి విముక్తిని బడయుకున్నారు. చిత్తము నిర్మలముగా నున్నపుడు, ఇంద్రియములు జయింపబడినపుడు కలుగు పరమ సాత్త్వికమగు స్థితి యేది కలదో అదియే మోక్షము. మలిన చిత్తముతోఁగూడి విషయవ్యామోహము గలిగియుండుటయే బంధము ;

న మోక్షో నభసః పృష్ఠే న పాతాళే న భూతలే
మోక్షో హి చేతో విమలం సమ్యగ్జ్ఞాన విబోధకమ్.

(వసిష్ఠగీత - ఉపశమప్రకరణము)

'మోక్షము ఆకాశమందుగాని, పాతాళమందుగాని, భూతలమందుగాని లేదు. ఉత్తమజ్ఞానముచే లెస్సగ బోధిత

మైనట్టి నిర్మలచిత్తమే మోక్షము!' ఏ విధమైన ఆశలు లేకుండుటచే స్వయముగ సంభవించు చిత్తముయొక్క నైర్మల్యస్థితి యేదికలదో, అదియే మోక్షమని విజ్ఞులచే చెప్పఁబడినది. ఏలయనగా, కోరికలన్నియు సంపూర్ణముగ శమించినపుడు ఆత్మలాభ ముదయించును. అదియే మోక్ష స్థితి. దీనినిబట్టి ఇంద్రియమనంబులను జయించినవానికి మోక్షము కరతలామలకమైయున్నదని స్పష్టమగుచున్నది. వేయేల, ఈ జీవితమునందు తత్త్వవిచారణాదులచే ఒకింతైనను మనస్సు నిగ్రహింపబడినచో మనుజుడికి జన్మసాఫల్యము నొందినట్లే యని ఈ క్రింది శ్లోకముద్వారా శ్రీ వసిష్ఠు లానతిచ్చియున్నారు—

మనాగపి విచారేణ చేతసః స్వస్య నిగ్రహః
మనాగపి కృతో యేన తేనాప్తం జన్మనః ఫలమ్.
(వసిష్ఠగీత - ఉపశమప్రకరణము)

ఆహా! మనోనిగ్రహముయొక్క మహిమ యెట్టిదై యున్నది! అయితే దీనిని సాధించు టెట్లు? జన్మాంతర మలిన సంస్కారములచే ప్రబలమైయున్నట్టి ఈ మనస్సును లొంగదీయుట ఎట్లు? అనునదియే ఇపుడు ప్రశ్న. కరుణామయుడును, ముముక్షుజనులకు కల్పవృక్షమువంటివాడునగు వసిష్ఠమునీంద్రు డివ్విషయమున చక్కటి సమాధాన మొసంగెను-"ఓ రామచంద్రా! మదించియున్న ఏనుగు అంకుశము లేనిచో జయింపబడనట్లు, శాస్త్రోక్తమగు ఉత్తమయుక్తి

(ఉపాయము) లేనిచో ఈ మనస్సున్ను నిగ్రహింపబడజాలదు. ఆ యుక్తు లెవ్వియో వచించుచున్నాను, వినుము—'

(1) అధ్యాత్మవిద్యాధిగమః సాధుసఙ్గమ ఏవ చ
వాసనాసంపరిత్యాగః ప్రాణస్పన్దనిరోధనమ్.

(2) ఏతాస్తా యుక్తయః పుష్టాః సన్తి చిత్తజయే కిల
యాభిస్తజ్జీయతే క్షిప్రం ధారాభిరివ భూరజః.

(వసిష్ఠగీత - ఉపశమప్రకరణము)

'అధ్యాత్మవిద్యాసంపాదనము, సాధుజనసాంగత్యము, వాసనాక్షయము, ప్రాణాయామము-అను నివి మనోనిగ్రహమునకు ప్రబలఉపాయములై పరగుచున్నవి. వర్ష ధారలచే భూమిపై గల దుమ్ము అణగిపోవునట్లు ఈ యుపాయములచే మనస్సు శీఘ్రముగ జయించివేయబడును.'

## వాసనారాహిత్యము

మనస్సు అనునది ఒక ప్రత్యేకవస్తువుగా లేదు. అనేక వాసనలు, సంస్కారములు, సంకల్పములు చేరి మనస్సుగా ఏర్పడినవి. అనేక జలబిందువులు మేళవించి మేఘముగా ఏర్పడినవి. జలబిందువులయొక్క సంపుటీకరణమే మేఘముయొక్క రూపము. ఆ బిందువులు లేనిచో మేఘమునకు నామరూపములే యుండవు. పెక్కు కట్టెలను ఒకచో చేర్చి మండించినచో గొప్ప అగ్నిజ్వాలగా పరిణమించును. ఒక్కొక్క కట్టెను తీసివైచినచో అగ్నికి రూపమే మిగులదు. అదేవిధముగ జన్మాంతర వాసనలు, అభ్యాసములు, సంకల్ప

ములు చేరి మనస్సనకు రూపము నేర్పరచినవి. కావున మనస్సు క్షయించవలెనన్న, వాసనలు, సంకల్పములు క్షయింపవలెను. వాసనాక్షయముచే, సంకల్పరాహిత్యముచే మనోనాశము సులభముగ సిద్ధించును. అదియే మోక్షస్థితి. ఈ సత్యమునే శ్రీ వసిష్ఠులు వసిష్ఠగీతయందు స్థితిప్రకరణమున ఎంత చక్కగ నిరూపించియున్నారో చూడుడు—

'ఓ రామచంద్రా! అనేక వేల సంవత్సరములు నీవు ఘోరతపము సల్పినను, లేక ఈ నశ్వరదేహమును శిలపై బాగుగా చూర్ణమొనర్చినను, లేక నీవు అగ్నియందుగాని బడబాగ్నియందుగాని ప్రవేశించినను, లోతైన గోతియందు ఖడ్గధారపై బడినను, లేక బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు నీకుపదేశించువారైనను, దత్తాత్రేయుడు, దుర్వాసుడు, బుద్ధదేవుడు మహాకరుణతో గూడినవారై నీయొక్క ఉపదేష్టలై పరగినను, లేక పాతాళమందుగాని, భూలోకమందుగాని, స్వర్గమందుగాని నీవు వసించినను సంకల్పక్షయము తప్ప మోక్షమునకు వేఱొక ఉపాయ మెద్దియును లేదని గ్రహింపుము :'

కావున మోక్షమునకు కీలకమంతయు ఈ సంకల్పక్షయ, వాసనాక్షయములందే ఇమిడియున్నదని గ్రహింపనగును. వాసనయనగా నేమి? అనేకజన్మలందలి కోరికలు, అలవాట్లు, అభ్యాసములు, సంస్కారములు ఒకదానితో నొకటి చేరి బాగుగ దృఢపడి వాసనగా నేర్పడును. అద్దాని ప్రభావముచే జీవుడు వివశుడై పూర్వాపరవిచారణలేక,

కాను తలంచిన వస్తువును సత్యముగ నమ్మి, అందు ఆసక్తి గలిగియుండును. శ్రీ వసిష్ఠులిట్లు ప్రకారముగ 'వాసన'ను నిర్వచించి చెప్పిరి—

దృఢభావనయా త్యక్తపూర్వాపరవిచారణమ్
యదాదానం పదార్థస్య వాసనా సా ప్రకీర్తితా.

(వసిష్ఠగీత - ఉపశమప్రకరణము)

దృఢభావనచే పూర్వాపరవిచారణను వదలివైచి పదార్థమును గ్రహించుట యేది కలదో, అదియే వాసనయని చెప్పబడినది. తీవ్రవేగముతో మనుజుడు దేనినిగూర్చి భావించునో, ఇతరస్మృతు లన్నిటిని వదలి ఆ రూపమే అతడు శీఘ్రముగ నగును. వాసనలచే వివశుడగు మనుజుడు అట్టి వాసనారూపమును ధరించి దేనిని గాంచునో, అదియే సత్యమని తలంచి విమోహితుడగును. వాసనావేగవైవశ్యముచే మనుజుడు తన వాస్తవస్వరూపమును బాగుగ త్యజించివైచి, దోషయుక్తమగు దృష్టికలవాడై-కల్లుత్రాగి మత్తెక్కియున్నవానివలె - సమస్తమును భ్రాంతిసహితముగ గాంచును. కామాదివాసనలను త్రాళ్ళచే బంధింపబడి ఆశాపాశములందు తగుల్కొని యున్నవారు త్రాళ్ళచే బంధింపబడిన పశువులవలె లోకమున వశీభూతులగుదురు. మఱియు అట్టివారు లోకమున ఎంత గొప్పపాండిత్యమును గలిగియున్నను, ఎట్టి గొప్పపదవియందున్నను చిన్నబాలునిచే గూడ జయించివేయబడుదురు. ఎవని యంతఃకరణమున కామాదివాసనలుండునో అతడు పిరికితనమును, దీనత్వమును

బొందును. అవి లేనిచో చిన్నదోమకూడ మేరుపర్వతమంత గంభీరముగ నగును. ('మశకోఽప్యమరాచలః') మఱియు జీవునియొక్క బంధ, మోక్షములు వాసనలయొక్క అస్తిత్వ, రాహిత్యములపైననే ఆధారపడియుండునని వసిష్ఠులు ఈ క్రింది శ్లోకముద్వారా చక్కగ నిరూపించి చెప్పిరి—

వాసనాతానవం రామ మోక్ష ఇత్యుచ్యతే బుధైః
పదార్థవాసనాదార్ఢ్యం బన్ధ ఇత్యభిధీయతే. (వసిష్ఠగీత)

ఓ రామచంద్రా! (దృశ్యపదార్థములఁగూర్చిన) వాసనారాహిత్యమే మోక్షమనియు, వాసనాదృఢత్వమే బంధమనియు పెద్దలు వచించిరి. కావున—

యది సర్వం పరిత్యజ్య తిష్ఠస్యుత్క్రాన్తవాసనః
అమునైవ నిమేషేణ తన్ముక్తోఽసి న సంశయః.
(వసిష్ఠగీత – ఉత్పత్తిప్రకరణము)

'ఓ రామచంద్రా! నీవు సమస్తమును పరిత్యజించి వాసనారహితుడవై యున్నచో, ఈ క్షణమందే ముక్తుడవు అయినట్లు, ఇందు సంశయమేమియును లేదు.' ఈ సత్యమునే నిరూపించుచు మఱియొక సందర్భమున శ్రీ వసిష్ఠమునీంద్రులు శ్రీరామచంద్రులకు ప్రేమాతిశయముతో నిట్లాన తిచ్చిరి—

విచారితమలం శాస్త్రం చిరముద్గ్రాహితం మిథః
సంత్యక్తవాసనాన్మౌనాదృతే నాస్త్యుత్తమం పదమ్.
(శ్రీ వసిష్ఠగీత)

'ఓ రామచంద్రా! మేము శాస్త్రములన్నింటిని బాగుగ విచారించితిమి. మఱియు చిరకాలము ఆత్మజ్ఞులతోటి పరస్పర సంవాదముద్వారా ఆత్మతత్త్వమును బాగుగ దృఢ మొనర్చుకొంటిమి. కాని, ఎన్ని విచారించినను వాసనలను (కోరికలను, ఆశలను) సంపూర్ణముగ త్యజించి (ఆత్మయందు) మౌనముగ నుండుటకంటె ఉత్తమమైనపదవి ఇంకొకటి యెద్దియు మాకు కానిపించలేదు.' సాక్షాత్ బ్రహ్మదేవుని తనయుడును, అవతారమూర్తియగు శ్రీరామచంద్రుని గురుదేవుడును, మహర్షులలో నగ్రగణ్యుడునైన శ్రీ వసిష్ఠ మునీంద్రుని ముఖతః వెలువడిన ఈ వాక్యము లెంతటి ప్రమాణమో యూహించుకొనుడు!

ఇంతవరకు వాసనయొక్క స్వరూపమును తెలిసి కొంటిమి. అయ్యది నశించిననే మోక్షము కలుగుననియు ఎఱింగితిమి. ఇక అ వాసన లెట్లు నశించునో, విచారించె దము—విచారణచేతను, తత్త్వజ్ఞానముయొక్క సహాయము చేతను మనుజుడు ఈ ప్రపంచమందలి పదార్థము లన్నియు మిథ్యారూపములనియు, నశ్వరము లనియు, అస్థిరము లనియు, కేవలము పంచభూతములయొక్క వికారమాత్ర ములే యనియు ఎపుడెఱుంగునో, మఱియు తన దేహము కూడ పాంచభౌతికమే కావున అదియు కొద్దికాలములో నశించిపోవునదే యనియు, జీవునకు మృత్యువు తథ్యమనియు ఎపుడు దృఢముగ తెలిసికొనునో, అపుడిక వాసన ఉదయిం పదు. పదార్థముల యెడల ఆశ కలుగదు. ఈ సత్యమే

వైరాగ్య ప్రకరణమున ఈ క్రింది రెండు శ్లోకముల ద్వారా చక్కగ నిరూపింపబడినది—

ధనానిబాన్ధవా భృత్యా మిత్రాణి విభవాశ్చ యే
వినాశభయభీతస్య సర్వం నీరసతాం గతమ్.

(వసిష్ఠగీత – వైరాగ్యప్రకరణము)

అనేక విధములగు ధనములు, బంధువులు, సేవకులు, మిత్రులు, వైభవములు – ఇవియన్నియు వినాశచింతచే భయభీతుడగు మనుజునకు నీరసములుగా తోచును.

స్వదన్తే తావదేవైతే భావా జగతి ధీమతే
యావత్స్మృతిపథం యాతి న వినాశకరాక్షసః.

వినాశమను దుష్టరాక్షసుడు జ్ఞాపకము రానంతవరకే బుద్ధిమంతునకీ ప్రపంచమున ఈ ధనాది పదార్థము లన్నియును రుచించును. ఉపశమ ప్రకరణమందును వసిష్ఠు లీ భావమునే స్పష్టీకరించిరి.

శరీరనాశదృత్వాద్వాసనా న ప్రవర్తతే
వాసనావిభవే నష్టే న చిత్తం సంప్రవర్తతే.

(వసిష్ఠగీత – ఉపశమ ప్రకరణము)

శరీరము ఎప్పటికైనను నశించిపోవునదే యను జ్ఞానముచే వాసన పుట్టకుండును. వాసనా వైభవము నశింప ఇక చిత్తము జనింపకుండును.

ఈ ప్రకారముగ ఏదియో యొక యుక్తిచే ఎవరికి దృశ్యమునుండి ప్రీతి తొలగిపోవునో అట్టివాని నిర్మలబుద్ధి

సంసారసాగరమున ఎచటను మునుఁగనేరదు. అయ్యది దుఃఖము నెన్నటికిని బడయకుండును. ఈజగద్రూపదృశ్యము యొక్క సర్వథా అత్యంతాభావము (లేమి) తప్ప సంసార దుఃఖరూప అనర్థ నివారణమునకు వేఱొక ఉపాయ మొద్ది యును లేదు. మనస్సు (వాసన) అను వ్యాధియొక్క చికిత్సకు దృశ్యముయొక్క అత్యంతాభావమే (లేమి) పరమోత్తమ ఔషధమై యున్నది. దృశ్యముమీదికి మనస్సు పరుగిడుచున్నకొలది ఆ మనస్సు ఆత్మకు దూరమై పోవుచుండును. మఱియు దానికి ఏకాగ్రత, నిలుకడ లేకుండును. చిత్తము ఏకాగ్రముగ లేనిచో లోని ఆత్మవస్తువు అందు చక్కగ ప్రతిబింబించదు. సంసారదుఃఖమునకు కారణ మిదియే.

## దృశ్యముయొక్క మిథ్యాత్వము

దృశ్య విషయములందు నిమగ్నుడగువాడు ఆత్మానుభూతిని ఎన్నడును పొందజాలడు. దృశ్యప్రపంచముచే ఆక్రమింపబడిన బుద్ధిగలవానికి స్వస్వరూపస్థితి ఎన్నటికిని ఉదయింపజాలదు. బ్రహ్మము ఆకాశమువలె నిర్మలమై సర్వత్ర వెలయుచున్నప్పటికిని దృశ్యబుద్ధిగల వారికి యత్నముచే గూడ అయ్యది లభింపనేరదు. మనస్సు దృశ్యమును మిథ్యగ తలంచి అద్దానిని త్యజించుచు వచ్చినచో, అత్తఱి ఆ దృశ్య పదార్థములచే జనించు సుఖదుఃఖములచే నది ఏమియు ఈడ్వబడక యే యుండును. కావుననే శ్రీ వసిష్ఠులు శ్రీరామచంద్రునకు ఈ క్రిందివిధముగ బోధించిరి —

దృశ్యమాశ్రయసీదం చే త్తత్సచిత్తోఽసి బద్ధవాన్
దృశ్యం సంత్యజసీదం చే త్తదచిత్తోఽసి మోక్షవాన్.

(వసిష్ఠగీత - ఉపశమ ప్రకరణము)

'ఓ రామచంద్రా! దృశ్యము నాశ్రయించుచో నీవు చిత్తముతో గూడినవాడవై బంధము కలవాడవగుదువు, దృశ్యమును లెస్సగ త్యజించుచో చిత్తరహితుడవై మోక్షమును పొందినవాడ వగుదువు' మఱియు,

యావత్సర్వం న సంత్యక్తం తావదాత్మా న లభ్యతే,
సర్వావస్థా పరిత్యాగే శేష ఆత్మేతి కథ్యతే.

(వసిష్ఠగీత - ఉప.)

దృశ్యమును పూర్ణముగ త్యజింపనంతవఱకును ఆత్మ లభింపదు. సమస్త దృశ్యమును త్యజింప, శేషించునదే ఆత్మ యని చెప్పబడును. కాబట్టి స్వాత్మదర్శనము కొఱకై సమస్త దృశ్యమును మిథ్యాత్వదృష్టిచే పరిత్యజింపవలయును. దృశ్య వస్తువులయొక్క మిథ్యాత్వబోధచే వానియెడల ఆశ సన్నగిలును. ఆశ సన్నగిల వాసనలు నశించును. వాసనలు నశింప, తైలములేని దీపమువలె మనస్సు నశించును. మనస్సు నశింప తదధిష్ఠానమగు ఆత్మమాత్రము శేషించును. అదియే పరమానందమగు నిర్వాణస్థితి. అదియే మోక్షము.

అయితే, దృశ్యముయొక్క అట్టి మిథ్యాత్వ నిశ్చయము, భోగాదులయొక్క నీరసత్వము మొదలగునవి జీవునకు ఎట్లు అనుభూతము కాగలవు? తత్త్వజ్ఞానముచే, తత్త్వ విచారణచే వాసనాక్షయము కాగలదు. వాసనాక్షయముచే

మనోనాశము సంభవింపగలదు. మనోనాశనముచే ఆత్మానుభూతి సంప్రాప్తించగలదు. ఇదియే మోక్షక్రమము. కాబట్టి మొట్టమొదట ప్రపంచమునుగూర్చియు, దేహమునుగూర్చియు విచారించుట అవశ్యకమైయున్నది. అట్లు విచారించుటచే తానెవరో జగత్తుయొక్క స్వరూపమెట్టిదో విశదము కాగలదు. రజ్జుసర్పభ్రమయందు 'ఇది సర్పము కాదు-త్రాడుమాత్రమే' అని విచారణచే నెపుడు తెలిసికొనబడునో, అపుడే సర్పభ్రాంతి జనితములగు దుఃఖ, భయ, కంపాదులు నశించును. అట్లే మృగతృష్ణాభ్రమయందును 'ఇది నీరు కాదు - ఎండమావులు' అని విచారణచేత తెలిసికొనినపుడు మాత్రమే నీటికొఱకు పరుగిడుట, బాధపడుట నిలిచి పోవును. కాబట్టి మహనీయుల సాంగత్యము ద్వారా దృశ్య ప్రపంచముయొక్కయు, తనయొక్కయు యథార్థస్వరూపమును గూర్చి విచారించుటయే దుఃఖనివారణమునకు ఏకైక మార్గము.

శ్లో॥ కోఽహం కథమిదం చేతి యావన్న ప్రవిచారితమ్
సంసారాడమ్బరం తావదన్ధకారోపమం స్థితమ్.

(వసిష్ఠగీత - స్థితి.)

'నే నెవండను? ఈ జగత్తు ఎట్లుద్భవించినది?'— అను నీ ప్రకారముగ బాగుగ విచారింపబడనంతవఱకును అంధకారమువంటి ఈ సంసారాడంబరము ఉండుచునే యుండును? విచారణ, గురువాక్య విశ్వాసము, స్వచిత్తశోధనము మున్నగువాని అభ్యాసము ద్వారా దృశ్యమంతయు క్షయించువఱకు, తద్ద్వారా ఆత్మపదము సంప్రాప్తించు

వఱకు తత్త్వ విచారణ తప్పక చేయుచునే యుండవలెనని శ్రీ వసిష్ఠమునీంద్రులు సెలవిచ్చిరి. ఉత్తమమగు ఆత్మ సుఖమును వదలి దృశ్యవిషయముల వైపునకు పరువిడు మనస్సును - అంకుశముచే మదగజమునువలె తత్త్వవిచారణచే వశమొనర్చుకొనవలెను. ఇక, ఆ విచారణ యెట్టిదో యోచించెదము.—

> యన్నాదౌ యచ్చ నాన్తే౽స్తి తన్మధ్యే భాతమప్యసత్
> అతోమిథ్యా జగత్సర్వమితి వేదాన్త డిండిమః.

(వేదాంతడిండిమము)

‘ఏది మొదటను, తుదియందును ఉండదో, మధ్య కాలమున మాత్రముండునో అది మిథ్య యగును. ఈ జగత్తంతయున్ను సృష్టికి పూర్వము లేదు. ప్రళయమందును ఉండదు. కావున మధ్యకాలమున తోచినను పరమార్థమున లేనిదే యగునని శ్రీ శంకరభగవత్పాదులు వేదాంత డిండిమము గ్రంథమున తెలిపియుండిరి. ప్రపంచమునందలి ప్రతి వస్తువును గూర్చియు ఈ ప్రకారముగనే యోచించుకొనవచ్చును. దేహము పుట్టుక పూర్వము లేదు. చనిపోయిన వెనుక ఉండదు. కాబట్టి మధ్యకాలమున (ఘటము వలె) కానిపించినను అలీకమే యగును. జగత్తునందలి ఏ వస్తువైనను కాలమునకు, మృత్యువునకు, వినాశమునకు వశీభూతము కానిది లేదు. చెట్టు నశించును; పుట్ట నశించును; గృహము నశించును; దేహము నశించును; రాజులు నశించుదురు; రాజ్యములు నశించును; పర్వతములు నశించును;

బ్రహ్మాండము నశించును. కాబట్టి నశింపని వస్తువు (ఆత్మ) ఏదిరయో దానికొఱకే విజ్ఞుడు అన్వేషింపవలెను గాని నశించు వస్తువులనుగూర్చి కాదు. నిత్యనిరతిశయానందమును గలుగ జేయు సద్వస్తువు కొఱకే ప్రయత్నము సలుపవలెను గాని, దుఃఖదాయకములగు ప్రాపంచిక దృశ్యపదార్థముల కొఱకు గాదు.

'సత్యవస్తువు (ఆత్మ) లేనిచో మనుజుడు అసత్య వస్తువు (దృశ్యపదార్థము)ను కోరవచ్చును. కాని సత్య వస్తువు (ఉండియుండ దానిని వదలి ఎవడు అసత్య వస్తువు కొఱకు పరువిడునో అట్టివాడు వినాశమొందుననియు, పరమ పురుషార్థమునుండి భ్రష్టుడగు'ననియు శ్రీ వసిష్ఠ మునీం ద్రులు తెలిపిరి. ఆత్మవస్తువు బింబము. దృశ్యజగత్తు ప్రతి బింబము. బింబభూతమగు స్వాత్మనువదలి ప్రతిబింబరూపము లగును. దృశ్యపదార్థములకొఱకు పరువిడువాడు బాలుడే (అజ్ఞుడే) కాని తత్త్వజ్ఞుడు కాడు. ఈ శబ్ద స్పర్శాది గుణ సమూహమును చింతించుచు దానినుండి సుఖమును బడయ గోరువాడు తన మనోరథముచే కల్పింపబడిన అగ్నిచే చలిని పోగొట్టుకొన గోరువాడే యగును.

విచారించి చూచినచో ఈ ప్రపంచము మాంస, అస్థి, దారు, మృత్తికా, శిలామయమైయే యున్నది కాని అన్యముగ లేదు. కావున కోరదగిన వస్తువెద్దియు లేనిదైన ఈ శిథిల జగంబున ఇక విజ్ఞులచే నేది కోరబడును? ముల్లోకము లందును పర్వతములు, సముద్రములు, వనములు, పంచ

భూతములు, ప్రాణులు—ఇట్టి పదార్థములే కలవు. ఇవి యన్నియు సత్యత్వశూన్యములై, మిథ్యయై యున్నవి. కావున ఈ దృశ్యప్రపంచమున సారమేమియును లేదు. సారభూతమైనట్టి శమరూపమగు చిదాత్మయను అమృతమును వదలి ఎవరు అట్టి తుచ్ఛములగు భోగముల వైపునకు పరువిడుదురో, అట్టివారు మందారవనమును త్యజించి విషవృక్షములతో గూడిన అరణ్యము వైపునకు బోవువారే యగుదురు. ఇట్టి వశ్వర ప్రాపంచిక వస్తువులగూర్చిన ఇచ్ఛాద్వేషములచే జనించిన సుఖదుఃఖాది మోహముచే జనులు భూబిలమందు వసించు పురుగులతో సమానత్వమును బొందినవారైరి. ఆహా! ఎంత శోచనీయము! అని శ్రీ వసిష్ఠులు ప్రాపంచిక భోగలాలసులగు అజ్ఞులనుగూర్చి పలికిరి.

## భోగవిగర్హణము

వాస్తవసుఖ మొకింతైనను ఈ ముల్లోకములందును గలదా యని ప్రశ్నించిన, లేదనియే చెప్పవలసివచ్చును. ఏలయనగా, రాజ్యాధిపత్యమును బొందియు మనుజు డింకను గోరుచునే యున్నాడు. సమస్తసుఖమున్ను చిదాత్మయందే కలదు. కాని జను లద్దానిని అనుభవించుటలేదే! ఆశ్చర్యము! అట్టి అపరిచ్ఛిన్నమగు ఆత్మపదమును త్యజించి పరిచ్ఛిన్నమగు సంసారపదమును మూర్ఖుడే కోరుకొనునుగాని జ్ఞాని కాదు. ఉత్తమఫలయుక్తములగు ద్రాక్షాది లతలను వదలివైచి కంటకములవైపునకు పరువిడునది ఒంటెయే కాని

మతేజంతువు కాదుకదా? ఈ దృశ్యపదార్థములు జీవునకు వివిధవికారములను గలుగజేయునవియై యున్నవి. దూరమునుండి చూచినచో పర్వతశిలలు రమణీయములుగ గన్పట్టినట్లును, కాని, సమీపించిన అరణ్యములై యొప్పు నట్లును, ఈ ప్రాపంచిక పదార్థములున్ను విచారింపని కారణముచే పైకి రమణీయములుగ తోచినను, వాస్తవముగ అట రమణీయత్వముగాని, నిరతిశయసుఖముగాని లేదు.

పర్యాలోచించి చూచినచో పాతాళమున, భూతలమున, స్వర్గమున అజ్ఞానులచే సారములని తలంపబడుచున్న స్త్రీ, రత్న, శిలాది భోగ్యపదార్థము లెవ్వికలవో, అవి యన్నియు కాలము (మృత్యువు) చే శీఘ్రముగ మ్రింగివేయబడి అల్పకాలముననే నశించుచున్నవి. ఈ ఛత్రచామరాది చంచల రాజ్యాదిపదార్థము లెవ్వి కానిపించుచున్నవో, అవి యన్నియు స్వప్నరూపములే యగుచు, మూడునాళ్ళ ముచ్చటలుగా పరిణమించుచున్నవి. భూమియూ మృత్తికామయము; వృక్షములా కాష్ఠమయములు; దేహములా మాంసమయములు, క్రింద చూతమూ భూమి; పైన ఆకాశము, ఇక ఈ ప్రపంచమున సుఖమును గలిగించు అపూర్వవస్తువేమి కలదు? ఏమియును లేదు.

అన్నపానాఙ్గనాసఙ్గాదృతే నాస్తీహ కించన
శుభమస్త్వితి సంవాది మహోన్కామిత వాఞ్ఛతు.

(వసిష్ఠగీత - స్థితి)

ఈ ప్రపంచమున (జిహ్వా, ఉపస్థాదీంద్రియవిషయము లగు) అన్నపాన, స్త్రీసంగాది విషయములు తప్ప అన్యమగు శుభపురుషార్థ మెద్దియును లేదని శ్రుతి, స్మృతి, ఆప్తోప దేశ, స్వానుభవాదులద్వారా నిశ్చయించిన వివేకియగు మహాత్ముడు ఇక ఆ భోగములందు దేనిని వాంఛించును?

సర్వత్ర పఞ్చభూతాని షష్ఠం కించిన్న విద్యతే
పాతాలే భూతలే స్వర్గే రతిమేతు క్వ ధీరధీః

(వసిష్ఠగీత - స్థితి)

పాతాళమునగాని, భూతలమునగాని, స్వర్గమునగాని అంతయు పంచభూతములే కాని ఆఱవవస్తు వేదియును లేదు. అట్టిచో ధీరబుద్ధి గలిగిన మనుజుడు ఇక ప్రాపంచిక వస్తువు లలో దేనియందు ప్రీతి గొనును?

ఆధివ్యాధిపరీతాయ ప్రాతర్వాఽద్య వినాశినే
ప్రయతన్తే శరీరాయ హితమజ్ఞాస్తు నాత్మనే.

(వసిష్ఠగీత - స్థితి)

శారీరక మానసిక వ్యాధులచే పరిపూర్ణమైనదియు, నేడో రేపో నశించిపోవునదియు నగు ఈ శరీరముయొక్క హితముకొఱకే అజ్ఞాని మహాప్రయత్నము సలుపుచున్నాడు. కాని శాశ్వతమగు ఆత్మకొఱకుగాదు! మఱియు అకస్మాత్తుగ జారిపడినట్టి ఒక్క తేనెబొట్టు నాకి గాడిద మరల దానికొఱకే తలపైకెత్తి ఆశతో జూచుచుండునట్లు మనస్సున్ను స్వసం కల్పిత విషయముయొక్క ఆనందలేశ మనుభవించి మరల దానికొఱకే తలెత్తి ఆశతో జూచుచున్నది. కావున—

ధీరోఽప్యతిబహుజ్ఞోఽపి కులజోఽపి మహానపి
తృష్ణయా బధ్యతే జన్తుః సింహః శృఙ్ఖలయా యథా.

(వసిష్ఠగీత - స్థితి)

ఎంతటి ధీరుడైనను, మహాపండితుడైనను, గొప్పకుల మందు జన్మించినవాడైనను, ఎంత గొప్పవాడైనను - గొలుసుచే సింహమువలె - దృశ్యపదార్థములం గూర్చిన ఆశచే జీవుడు బంధింపబడుచున్నాడు. "అట్టి ఆశచే వివశుడై దేహాభిమానియగు పురుషుడు రక్తమాంసముల బొమ్మను 'ఇది సుందర స్త్రీ' యని తలంచి ఆ యెముకలగూడును మహాప్రీతితో కౌగలించుకొనుచున్నాడు. మోహముయొక్క విలాస మిట్లే యుండును." కావున విజ్ఞుడగువాడు ప్రపంచముయొక్క సారాసారములను బాగుగ వివేచించి దృశ్యపదార్థములయెడల కోరికను, భోగములయెడల ఆశను పూర్ణముగ విడనాడవలయును. అట్లు దానిని విడిచిపెట్టుటయే సమస్తశాస్త్రములయొక్క బోధనాసారమని గ్రహింపవలెను. కావుననే శ్రీ వసిష్ఠమునీంద్రులు శ్రీరామచంద్రుని ఉద్దేశించి జ్ఞానసారమంతయు నిట్లు ఒక్క శ్లోకములో చెప్పివైచిరి——

శ్రూయతాం జ్ఞానసర్వస్వం శ్రుత్వా చైవావధార్యతామ్
భోగేచ్ఛామాత్రకో బన్ధస్తత్త్యాగో మోక్ష ఉచ్యతే.

(వసిష్ఠగీత - స్థితి)

'ఓ రామచంద్రా! సమస్తశాస్త్రములయొక్క సిద్ధాంతసారమును వచించుచున్నాను, వినుము. దానిని విని హృద

యమున బాగుగ ధారణ యొనర్చుకొనుము - భోగముల యెడలగల వాంఛయే బంధము, అట్టి వాంఛను త్యజించుటయే మోక్షము.' భోగాదులను ఆశ్రయింపని మనస్సు పంజరమునుండి పక్షివలె సంసార మోహమునుండి లెస్సగ బయల్వెడలిపోవును. ఎవనికి విషయభోగములు రుచింపకుండునో, అతనికి మోక్షమను శ్రేయము ఎదుటనే యున్నదగును. ఏలయనగా-అంధకారరూపమగు భోగాసక్తి నశింప ఇక మోక్షమునకు వేఱు ప్రతిబంధ మేమియును లేదు. కైవల్యప్రాప్తికి ఇదియొకటియే ముఖ్యమైన ఉపాయమని శ్రీ వసిష్ఠులీప్రకారముగ శ్రీరామచంద్రున కుద్బోధించిరి-

కిమన్యైః శాస్త్రసందర్భైః క్రియతామిదమేవ తు
యద్యత్స్వాదిష్ఠా తత్సర్వం దృశ్యతాం విషవహ్నివత్.

(వసిష్ఠగీత - స్థితి)

'ఓ రామచంద్రా! ఇతరములగు శాస్త్రసందర్భములతో నీకేమి ప్రయోజనము? ఈ ఒక్క ఉపాయమును ఆచరించిన చాలును——ఈ ప్రపంచమున ఏదేది నీకు రుచికరముగ తోచునో దానినంతను విషమువలెను, అగ్నివలెను పరిత్యజించి వేయుము'— విషయభోగముల యెడల మనుజుని కొంచెమైన అప్రీతి (వైరాగ్యము) జనించినచో అత్తఱి ఆతడు ఉన్నతపదమును పొందెననియే శ్రుతులు పలుకుచున్నవి.

జాతా చేదరతిర్జన్తోర్భోగాన్ప్రతి మనాగపి
తదసౌ తావతైవోచ్చైః పదం ప్రాప్త ఇతి శ్రుతిః.

(వసిష్ఠగీత - ఉత్పత్తి)

ఈ ప్రకారముగ ఆయా విషయభోగములయెడల అరుచిని, విరాగభావమును జనింపచేసికొనవలెను. అపుడే మనస్సు బాహ్యవిషయములపై బరువిడక, అంతర్ముఖమై ఆత్మయందు లీనమగును. అపుడే జీవునకు జ్ఞానోదయమగును. కావుననే "ఇంద్రియార్థములగు శబ్దస్పర్శాదులు నీ కెపుడు స్వతఃహృదయమందు రుచింపకుండునో అపుడే విజ్ఞానరూపమగు ఆత్మ నెఱిఁగినవాడవును, సంసారసముద్రమును దాటినవాడవు నగుదు" వని శ్రీ వసిష్ఠమునివర్యుడు శ్రీ రాఘవున కెఱింగించెను.—

యదా తే నేన్ద్రియార్థశ్రీః స్వదతే హృది రాఘవ
తదా విజ్ఞాతవిజ్ఞానః సముత్తీర్ణ భవార్ణవః.		(శ్రీ వసిష్ఠగీత)

మెఱుపువలె క్షణభంగురమై, ఇంద్రజాలమువలెను, మృగతృష్ణవలెను అసత్యరూపముగ గానిపించు ఈ ధనదారాపుత్రాదులం దాసక్తియేల? అవి వృద్ధినొందిన హర్షింపనేల? ఎండమావులు వృద్ధినొందిన, దానిచే జలార్థులకు వచ్చిన లాభమేమి? నిజముగ విచారించిన, ఆ ధనదారాపుత్రాది ప్రాపంచికపదార్థములు వృద్ధినొందుటచే (సంసారరోగమున్ను వృద్ధియగుటవలన) దుఃఖించుటయే తగును గాని సంతోషమొందుట కాదని శ్రీ వసిష్ఠులు తెలిపిరి. ఆ నశ్వరపదార్థములయొక్క భయంకర భావిదుష్ఫలితములను విచారించునట్టి సాధుపుంగవులు వానియెడల విరక్తియే కలిగియుండుచున్నారు కాని ఆసక్తిని గాదు.

'మానవజీవితము అతిస్వల్పము. ఒక వేళ నూఱు సంవత్సరముల ఆయుర్దాయము అనుకొనినప్పటికిని అయ్యది అనంతకాలముయొక్క అతిస్వల్పమగు ఒకానొక అంశము మాత్రమే అయియున్నది. అట్టి స్వల్పకాలమందును 'ఈ దేహమే నేను!' అని అభిమానము గలిగి భోగాదులవైపునకు పరువిడుట చాల విడ్డూరముగ నున్నది. తమ దేహమే ఆత్మగా తలంచు స్వభావముగలవారైన మనుష్య, దేవ, అసురాదులు కామభోగములను తృణములను భక్షించుచు ఈ సంసారారణ్యమున మృగముల పగిది విహరించు చున్నారు.'

భోగదూర్వాఙ్కురాకాంక్షీ శ్వభ్రపాతమచిన్తయన్
మనో హరిణకో బ్రహ్మన్దూరం విపరిధావతి.

(వసిష్ఠగీత - వైరాగ్యప్రకరణము)

'మహాత్మా! భోగములను తృణములను కాంక్షించు మనస్సను లేడి గోతియందు (నరకమందు) పడుటను గూర్చి చింతింపకయే విషయములనుగూర్చి దూరముగ పరువిడు చున్నది. మహానికృష్టములును, ఆదిమధ్యాంతములందును పేలవములు నగు భోగములం దెవరు లోకమున పశుపక్ష్యాదులవలెను, మూఢులవలెను విశ్వాసము గలిగియుందురో, అట్టి మనుష్యుల జీవితము వ్యర్థమేయగునని శ్రీ వసిష్ఠులు పదే పదే హెచ్చరించియుండిరి. ఈ ప్రపంచమున అత్యంత రమణీయములైనట్టియు, అత్యంతస్థిరములైనట్టియు పదార్థము లున్నప్పటికిని వాని యన్నింటియొక్క పర్యవసానము( అర్జున,

రక్షణ, వియోగాదులవలన) దుఃఖమే అయియున్నది. కావున విజ్ఞులగువారు ఆ భోగ్యపదార్థములయొక్క పూర్వాపరములను బాగుగ విచారించి (ఆత్మోపలబ్ధికై) వానియెడల విరక్తి గలిగియుండుచున్నారు.

జగత్తు సత్యమనుభావము దృఢపడుటవలన భోగేచ్ఛాసహితమగు ఆశచే బాహ్యవిషయములపైకి పరుగిడుట యేదికలదో అదియే బంధమనియు, సంసారశృంఖలమనియు పెద్దలు వచించిరి. ఏలయనిన, దానివలన జీవునకెన్నటికిని శాంతికలుగదు. దృశ్యపదార్థములయెడల ఆశను త్యజించుటయే శాంతికి ఉపాయముకాని విషయసంపాదనముద్వారా దానిని అభివృద్ధిపఱచుట కాదు. కనుకనే భోగాశాయుక్తుడగు మనుజునకును, పశువునకును భేదము లేదని శ్రీ వసిష్ఠులవారిట్లు తెలిపిరి—

కిం కిల స్ఫారమనసాం పశూనాం చ విశేషణమ్
కృష్యన్తే పశవో రజ్జ్వా మనసా మూఢచేతసః.

(వసిష్ఠగీత - ఉపశమ.)

అనగా, దృశ్యవిషయములందు విస్తరింపబడిన మనస్సుగలవారికిని, పశువులకును ఏమిభేదముకలదు ? పశువులు ముక్కుత్రాటిచే ఈడ్వబడుచున్నవి. మూఢచిత్తులు మనస్సుచే నీడ్వబడుచున్నారు. జడమగు మనస్సు ఎంతకాలము వఱకు గోతియందు కాబేలువలె దుర్వాసనలందు లీనమై భోగప్రాప్తికి ద్వారభూతములగు ఇంద్రియములద్వారా విషయములందు ప్రవర్తించుచు విమూఢమై, ఆత్మవిచారణను

మఱచియుండునో, అంతకాలమువఱకును సంసారమను అంధకారము చంద్ర, అగ్న్యాది సహితమగు ద్వాదశ సూర్యులచే గూడ ఒకింతైనను ఛేదింపబడజాలకుండునని అమ్మునీంద్రుడు శ్రీరామచంద్రునితో ఘంటాపథముగ వాక్రుచ్చియున్నాడు. ప్రాపంచికసుఖమే గొప్పదని తలంచు అజ్ఞానులకు శ్రీ వసిష్ఠులీ క్రింది చక్కని సలహా నిచ్చియున్నారు. 'ఓ జీవులారా! ఈ చంచల సంసారసుఖమును, ఉపశమ (ఆత్మ) సుఖమును రెండిటిని త్రాసునందు పెట్టి తూచి ఏది సారవంతమైనదో బాగుగ పరీక్షించిచూచి, ఒకవేళ దృశ్యసౌఖ్యమే గొప్పదని తెలిసచో అట్లే దానిని ఆశ్రయింపు' డని చెప్పెను. అట్లు మున్మాటికిని కానేరదు. ఏలయనగా కల్పిత సౌఖ్యము, ప్రతిబింబసుఖము, ప్రాతిభాసిక అనందము ఎంత గొప్పదైనను, స్వప్నపదార్థమువలె దానికి విలువలేదు; అస్తిత్వము లేదు. శాశ్వతమై, సత్యమై, బింబభూతమైనట్టి ఆత్మానందమే, బ్రహ్మానందమే ముల్లోకములందు సారభూతమైన వస్తువని శాస్త్రప్రమాణములచే, గురువాక్యములచే స్వానుభవముచే విస్పష్టముగ నెఱుంగబడుచున్నది. కావున విజ్ఞులు దానినే ఆశ్రయింతురు.

ఈ ప్రకారముగ ప్రాజ్ఞుడగు వాడు విషయముల యొక్క దోషములను, భోగాదులయొక్క నీరసత్వమును చక్కగ విచారించి, గొప్ప పట్టుదలతో, పురుషప్రయత్నములో—ఆత్మశ్రేయమను ద్వారమును మూసివేయుట

యుండు గడియలవంటివగు—భోగములను దూరముగ తొలగించి వేయవలయును.

'దన్తైర్దన్తాన్ప్రసంపీడ్య భోగేష్వరతిమాహరేత్'

పండ్లతో పండ్లను గట్టిగ కొఱికి (పట్టుదలతో) ఏవిధముగనైనను ఈ భోగవిరక్తిని సంపాదింపవలెను. ఏలయనగా—కట్టెలచే అగ్ని వృద్ధియగునట్లు విషయచింతనచే దుఃఖము వృద్ధినొందును. కట్టెలు లేకున్న అగ్ని తనంతట నదియే నశించునట్లు, విషయచింతన లేకున్న దుఃఖము స్వయముగనే నశించును. సమస్త విషయములయెడల సర్వథా ఏ విధమైన కోరిక లేకుండుటయే మనస్సును జయించుటకు, దుఃఖనివారణకు ఉపాయమై యున్నది. బాగుగ మదించి యున్న స్వమనంబను మదగజము ఈ యుపాయముచే అతి శీఘ్రముగ అణగ ద్రొక్కి వేయబడును. దుఃఖము అంతమగును. ఈ రీతిగ వైరాగ్యము నభ్యసించువానినుండి - సింహమునుండి లేడివలె - మాయ పారిపోవును. పరమ శాంతి లభించును. ఎచ్చోట ముల్లోకములందలి ఐశ్వర్యము లన్నియునుగూడ తృణమువలె నుపకరింపకుండునో, అట్టి సర్వోత్తమమగు పరమశాంతి జీవునకు ఇట్టి ఆశారాహిత్యము వలననే లభించును. అందుచేతనే శ్రీ వసిష్ఠులవారు సమస్తశాస్త్రములయొక్క సంగ్రహమును ఈ ప్రకారము వివరించిరి—

చిచ్చేత్య కలనా బన్ధస్తన్ముక్తిర్ముక్తిరుచ్యతే
చిదచేత్యాఖిలాత్మేతి సర్వసిద్ధాన్త సంగ్రహః.
(వసిష్ఠగీత - ఉపశమ.)

అనగా, చైతన్యముయొక్క విషయాకార (దృశ్య) కల్పనయే బంధము. అట్టి (విషయాకార) కల్పన లేకుండుటయే ముక్తి. విషయాకార రహితమగు చైతన్యమే పూర్ణాత్మ. ఇదియే సమస్త సిద్ధాంతములయొక్క సార సంగ్రహము.

ఆశారాహిత్యము ద్వారా వాసనలు క్షయించుటచేతనే చిత్తము నిశ్చలమై, శుద్ధమై, ఆత్మయందు విలీనమగుననియు, అదియే మోక్షస్థితి యనియు ఇంతదనుక మనము విచారించి తెలిసికొంటిమి. అట్టి వాసనాక్షయము విచారణచేత కలుగుననియు ఎఱిఁగితిమి. ఇట్టి వాసనాక్షయ ప్రయత్నముతో బాటు తన యథార్థస్వరూపముయొక్క చింతనముకూడ అనగా తత్త్వజ్ఞానాభ్యాసముకూడ ఏకకాలమందే జరుపవలెనని శ్రీ వసిష్ఠులవారు సెలవిచ్చిరి. అనగా, ఈ నెవరు? దేహమా? మనస్సా? ఇంద్రియములా? ప్రపంచవస్తుసముదాయమా?- అను విషయమునుగూర్చి పదే పదే విచారణసలుపవలెనని తెలియజేసిరి. అట్లు విచారణచేయుటచేత క్రమక్రమముగ తాను పంచభూతాత్మక 'సంఘాత' రూప దేహము కాదనియు, సంకల్పవికల్పరూప చంచలమనస్సు కాదనియు, ఆ రెంటికిని సాక్షిగా జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థల మూడింటి యందును ఏకరూపముగా, నిర్వికల్పముగా, నిర్వికారముగా

వెలయుచున్న ఆత్మస్వరూపమే యనియు, తా నేకాల మందును బంధింపబడలేదనియు, బంధము, మోక్షము కేవలము మనస్సునకే యనియు, తాను అ మనస్సునకు సాక్షిగా వెలయుచు సదా సర్వకాలములందును సచ్చిదానంద పరబ్రహ్మస్వరూపుడుగనే యుండుచున్నట్లును జీవుడు తెలిసికొనగల్గును. ఇట్టి నిర్మలస్థితిదృశ్యవాసనలు, సంస్కారములు, సంకల్పములు ఉన్నంతవఱకు కలుగనేరదు. గనుక వాసనాక్షయము తత్త్వజ్ఞానముయొక్క నిలుకడకు అత్యంతావశ్యకమై యున్నది. అట్లే తత్త్వజ్ఞానమున్ను వాసనాక్షయాభ్యాసమునకు చాల ఉపకరింపగలదు. కనుకనే ఆ రెండింటిని ఏకకాలముననే అభ్యసింపవలెనని శ్రీ వసిష్ఠులవారు సెలవిచ్చుటకు కారణమైనది.

ఉత్తమ సాధువులతోఁగూడి సేవాది ప్రయత్నముల ద్వారా ప్రాజ్ఞుడగు సద్గురువును ప్రసన్నముచేసికొని 'ప్రభూ! నే నెవరను? ఈ సంసారాడంబర మెట్లుదయించినది?' ఇత్యాది వినయపూర్వక ప్రశ్నల నడిగి లెస్సగ విచారణ సలుపవలయును. వాసన యను జలముచే పూర్ణమైయున్న ఈ సంసారసముద్రమున విచారణ, వివేకము (ప్రజ్ఞ) అను నావ యెక్కినవారే దానిని దాటివైచిరి. తక్కినవారు అందు మునిగిపోయిరికా. బట్టి తత్త్వవిచారణద్వారా తాను దేహము కాదనియు, పూర్ణాత్మస్వరూపమనియు లెస్సగ నెఱిఁగినవారే ధన్యులై, జీవన్ముక్తులై పఱగుచున్నారు. అట్లుకాక 'దేహమే

నేను' అని తలంచువారు సంసారశృంఖలయందు తగుల్కొని కర్మబంధముచే మహాదుఃఖ మనుభవించుచున్నారు.

> సా కాలసూత్రపదవీ సా మహావీచివాగురా
> సాఽసిపత్రవనశ్రేణీ యా దేహోఽహమితి స్థితిః.
>
> (వసిష్ఠగీత - స్థితి)

'ఈ దేహమే నేను' అని తలంచియుండు స్థితి యేది కలదో అదియే, కాలసూత్రనరకము; అదియే మహావీచి నరకము; అదియే అసిపత్రనరకము.' కాబట్టి దేహాహంభావము సర్వప్రయత్నములచేతను త్యజింపదగినదై యున్నది. స్వాధిష్ఠానమగు విశుద్ధాత్మయందు పొరవలె కప్పియున్న ఈ దేహాహంభావము సుదూరముగ త్యజింపబడ, మేఘ రహితమగు చంద్రప్రకాశమువలె సర్వోత్తమమగు ఆత్మ దృష్టి ఉదయించును. అట్టి ఆత్మదృష్టి యొక్క ఉదయముచే మనుజుడు సంసారసాగరమును దాటివేయుచున్నాడు.

కావున అస్థిరములగు శరీర, అహంకారాదులనుండి దృష్టిని మరలించి, ముత్తెములందు వ్యాపించియున్న దారము వలె సర్వదేహ, అహంకారాదులందు వ్యాపించి వానికి సాక్షిభూతముగ వెలయు మహాశుభస్వరూపమైన చిన్మాత్రా త్మను వీక్షింపవలెను. ముక్తిని గోరువాడివ్విధమున ఆత్మనే దర్శించుటకు యత్నింపవలెను. ఏలయనగా— ఆత్మసందర్శనముచే సమస్త దుఃఖములయొక్క శిరశ్ఛేదనము సంభవించి జన్మరాహిత్యము, పరమశాంతి కలుగును. 'ఈ శరీరాదులు నేను' 'ఈ ధనాదులు నావి'—ఇత్యాది భావనలను త్యజించి,

మనస్సుచేతనే మనస్సును ఛేదించి ఆత్మను దర్శింపకున్నచో చిత్రపటమందలి సూర్యునివలె ఈ జగత్సంబంధదుఃఖము అస్తమింపదు. మహాసముద్రమువలె అపరమితమైన ఆపత్తు పైన వచ్చిపడును.

## బంధమోక్షములు

కృశోఽతిదుఃఖీ బద్ధోఽహం హస్తపాదాదిమానహమ్
ఇతి భావానురూపేణ వ్యవహారేణ బధ్యతే.

(వసిష్ఠగీత - ఉత్పత్తి ప్రకరణము)

'నేను కృశించినవాడను, మహాదుఃఖవంతుడను, బద్ధుడను, హస్తపాదాదులతో గూడినవాడను'—ఇట్టి భావములతో గూడి వ్యవహరించుటచే జీవుడు బంధనమున తగుల్కొనును.

నాహం దుఃఖీ న మే దేహో బంధః కస్యాత్మనః స్థితః
ఇతి భావానురూపేణ వ్యవహారేణ ముచ్యతే.

(వసిష్ఠగీత - ఉత్పత్తి)

'నేను దుఃఖినిగాను, నాకు దేహము లేదు. ఆత్మకు బంధ మెట్లుండగలదు?—ఇట్టి భావములతో గూడి వ్యవహరించుటచే జీవుడు ముక్తుడగును. బంధ మెట్లు కలుగునో, మోక్ష మెట్లు కలుగునో ఈ ప్రకారముగ సంక్షేపముగ శ్రీ వసిష్ఠమునీంద్రులు బోధించియున్నారు. 'నేను కృశించినవాడను, అతిదుఃఖవంతుడను, మూఢుడను'—అను నిట్టి అసత్యభావనలను భావించు మనస్సు తన వికల్పముచేతనే

జనించినదైన సంసారిత్వమును బొందుచున్నది. బ్రహ్మమను సముద్రముతో అభిన్నులైయుండియు, ఇవ్విధమున జీవులు తాము బ్రహ్మముకంటె వేఱనియు, పరిచ్ఛిన్నులనియు తలంచుచు, దానిచే భయంకరములగు సంసారక్షేత్రము లందు పడి మోహమొందుచున్నారు. జీవులయొక్క ఇట్టి శోచనీయస్థితిని గమనించి వారియెడల కరుణగలిగి, వారి నుద్ధరించు తలంపుతో పరమకారుణికులైన జగద్గురువులగు శ్రీ వసిష్ఠమునీంద్రులు ఎట్టి గంభీరమగు పరమార్థబోధను గావించిరో ఈ క్రింది వాక్యములద్వారా తేటతెల్లము కాగలదు.

"ఓ జనులారా! ఆత్మ తెలియబడకయున్నచో దుఃఖము కలుగును. తెలియబడినచో అనంతసుఖము కలుగును. కావున నిర్మలమై, శుద్ధమై, సర్వాత్మకమై, సర్వకర్తయైనట్టి బ్రహ్మమే మీయొక్క నిజస్వరూపమనియు, ఈ ప్రపంచమంతయు శాంతమై, జన్మరహితమైనట్టి ఆపరబ్రహ్మమే యనియు భావించుచు సుఖముగ నుండుడు! ఈ తుచ్ఛ (నశ్వర) దేహముతో మిశ్రితమై యున్నట్టి మీ ఆత్మను పంచకోశవివేకముచే శీఘ్రముగ వేఱుపఱచి స్వస్థతను (శాంతిని) బొందుడు! బురదయందున్నప్పటికిని బంగారము నకు ఆ బురదతో లేశమైనను సంబంధము ఉండనట్లు, నిర్మల మగు ఈ ఆత్మకున్ను దేహము (ఉపాధి)తో ఒకింతైనను సంబంధములేదని యెఱుగుడు! వాస్తవముగ నిట శోకము గాని, మోహముగాని, జన్మగాని, జన్మను బొందునదిగాని

లేవు. ఏది కలదో అదియే (ఆత్మయే) కలదు. అని యెఱింగి దుఃఖరహితులు కండు! దృశ్యపదార్థములతో మీ కొకింతైనను సంబంధము లేదు. ఏలయనగా, అది మిథ్య. మిథ్యావస్తువుతో మీ కెట్లు సంబంధము కలుగును? కావున 'అహంకారముగాని ఈ దృశ్యముగాని వాస్తవముగ లేవు' అని చింతించుచు పర్వతమువలె స్థిరముగ నుండుడు. మీరు అనంతాకాశము మాడ్కి అతివిశాలమైన రూపముగల హృదయేశ్వరుడగు ఆత్మయే అయియున్నారు." అని యీ ప్రకారముగ అమ్మునీంద్రుఁ డుద్బోధించెను.

మఱియు తన ప్రియశిష్యుడగు శ్రీరామచంద్రుని ఉద్దేశించి యిట్లు పలికెను—ఓ రామచంద్రా! దేహము పుట్టుటచే నీవు పుట్టుటలేదు. దేహము నశించుటచే నీవు నశించుటలేదు. నీవు నిష్కళంకమైన ఆత్మవు. దేహముతో నీ కేమియు సంబంధము లేదు. చిదాత్మ నిర్మలమై, నిత్యమై, స్వయంప్రకాశమై, నిర్వికారమై యున్నది. దేహమో, అనిత్యమైనది, మలినమైనది. కాబట్టి అట్టిదానితో ఆత్మ కెట్లు సంబంధముండగలదు? ఓ రామచంద్రా! జగన్నాథుడవును, చిద్రూపసూర్యుడవును, నిత్యోదితుడవునగు ఆత్మ ఉండియుండ ఈ సంసారరూప స్వప్నమంతయు భాసించుచున్నది.

సర్వమాత్మాహమేవేతి నిశ్చయో యో మహామతే
తస్మాదాయ విషాదాయ న భూయో యాతి మే మతిః.

(వసిష్ఠగీత - ఉపశమ)

మహామతివగు ఓ రామచంద్రా! 'ఈ సమస్త బ్రహ్మాండమున్ను ఆత్మయే; ఆ ఆత్మ నేనే' అను నిశ్చయ మెదికలదో అద్దాని నవలంబించి యుండుటవలన నాబుద్ధి మరల ఎన్నటికిని దుఃఖమును బొందకయే యున్నది. అవివేకముచేతనే దుఃఖము జనించును. ఏది అవివేకముచే జనించునో, అది వివేకముచే నశించును. ప్రకాశాభావముచే జనించు అంధకారము ప్రకాశముచే నశించునుగదా! కాబట్టి ఓ రామచంద్రా! పూర్వాపరములను చక్కగ విచారించి – అజ్ఞానముతో గూడిన పామరజనులవలె – నీ వెన్నడును దుఃఖమును బొందకయుండుము.

మరిష్యామి మరిష్యామి మరిష్యామీతి భావసే
భవిష్యామి భవిష్యామి భవిష్యామీతి నేక్షసే.

(వసిష్ఠగీత - నిర్వాణప్రకరణము)

'నేను మరణించెదను, మరణించెదను, మరణించెదను' అని యేల చెప్పుచున్నావు? (చిద్రూపుడవగుటంబట్టి) 'నే నెల్లపుడు (మరణరహితుడనై) ఉందును ఉందును ఉందును' అను సత్యమును ఏల గాంచకయున్నావు? ఓ రామచంద్రా! ప్రక్కల, పైన, క్రింద, అంతటను ఆత్మయొక్క మహిమ వ్యాపించియున్నది. కాబట్టి ఈ సమస్తమున్ను ఆత్మయే అను నిశ్చయము అంతఃకరణమున గలిగియుండినచో జీవు డెన్నటికిని బద్ధుడు కానేరడు. మఱియు అట్టివాని కిక భయమనునది యుండదు. ఏలయనగా, ఆత్మజ్ఞానికంటె వేఱుగ ఏ దేయునిన్నచో దానిని పొందుటకు అతడు హర్షమును

గాని, శోకమునుగాని బడయువచ్చును. కాని అతనికి అన్యముగ ఏదియును లేదు. కావున అతనికి శోకమేల, భయమేల? ఆ సత్యమునే ఈ క్రింది శ్రుతివాక్యము నిరూపించుచున్నది.

యస్మిన్సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః
తత్ర కో మోహః కశ్శోక ఏకత్వమనుపశ్యతః.
(ఈశావాస్యోపనిషత్)

ఈ ప్రకారముగ శ్రీ వసిష్ఠమునీంద్రులు శ్రీరామచంద్రునకు అఖండతత్త్వోపదేశము గావించి, ముముక్షువులు వారి వారి అంతస్తు ననుసరించి ఎట్లెట్లు దైనందిన అధ్యాత్మిక కార్యక్రమము నడుపవలెనో, కాలమును ఎవ్విధముగ సద్వినియోగపఱచవలెనో, అభ్యాసము నెట్లు కొనసాగించవలెనో ఈ క్రిందివిధముగ సందర్భానుసారము అచటచట చక్కగ విశదీకరించిరి—

చిత్తస్య భోగైర్ద్వౌ భాగౌ శాస్త్రేణైకం ప్రపూరయేత్
గురుశుశ్రూషయా భాగమవ్యుత్పన్నస్య సత్క్రమే.
(వసిష్ఠగీత - ఉపశమప్రకరణము)

సన్మార్గమున జన నుంకించువాడు ప్రారంభదశయందు తన చిత్తమందలి నాల్గుభాగములలో రెండింటిని దేహయాత్రారూపములగు అన్నపానాది భోగములచే నింపవలెను. ఒక భాగము శాస్త్రాధ్యయనాదులచే పూరించవలెను. తక్కిన యొక భాగము గురుశుశ్రూషచే నింపవలెను.

కించిద్వ్యుత్పత్తియుక్తస్య భాగం భోగైః ప్రపూరయేత్
గురుశుశ్రూషయా భాగౌ భాగం శాస్త్రార్థచిన్తయా.
(వసిష్ఠగీత - ఉపశమ)

ఒకింత జ్ఞానము కలవాడు తన చిత్తముయొక్క ఒక భాగమును దేహయాత్రోపయుక్తములగు అన్నపానాది భోగములతో నింపవలెను. రెండుభాగములను గురుశుశ్రూష, గురువాక్యశ్రవణాదులచే పూరింపవలెను. శేషించిన యొక భాగమును శాస్త్రార్థచింతనతో నింపవలెను.

వ్యుత్పత్తిమనుయాతస్య పూరయేచ్చేతసోఽన్వహమ్
ద్వౌ భాగౌ శాస్త్రవైరాగ్యే ద్వౌ ధ్యానగురుపూజయా.
(వసిష్ఠగీత - ఉపశమ)

'తత్త్వనిశ్చయము బాగుగ కలవాడు తన చిత్తముయొక్క రెండుభాగములను ప్రతిదినము శాస్త్రాభ్యాస, వైరాగ్యసంపాదనములతో నింపవలెను. తక్కిన రెండుభాగములను ధ్యానముతోను, గురుపూజతోను నింపవలెను'-ఈ ప్రకారముగ సాధకుడగువాడు తన చిత్తమునకు చక్కటి అధ్యాత్మికశిక్షణ గఱపవలయును. అనవరతము తీవ్రతరమగు అభ్యాసము చేయుచుండవలెను. ఏనయునగా,

## తత్త్వబోధ

జన్మాన్తరశతభ్యస్తా రామ సంసారసంస్థితిః
సా చిరాభ్యాసయోగేన వినా న క్షీయతే క్వచిత్.
(వసిష్ఠగీత - ఉపశమ)

ఈ 'సంసారస్థితి (ద్వైతవాసన) అనేక జన్మలనుండియు బాగుగ అభ్యసింపబడుచు వచ్చినది. కాబట్టి అది చిరకాలాభ్యాసము లేనిచో ఎచటను క్షయింపనేరదు.' దీర్ఘకాలము, నిరంతరము, మిక్కిలి శ్రద్ధతో నాచరించిననే మనోనిగ్రహాదులు సాధ్యపడునని పతంజలి మహర్షియు నుడివియున్నారు. అభ్యాసముచేతను వైరాగ్యముచేతను మాత్రమే మనస్సు నిగ్రహింపబడగలదని శ్రీకృష్ణభగవానులున్ను గీతయందుపదేశించియున్నారు. కాబట్టి వాసనాక్షయ, మనోనాశ, తత్త్వజ్ఞానములు మూడును చక్కగ అలవాటు కావలసియున్నచో శ్రద్ధాపూర్వకముగు గొప్పసాధన, అభ్యాసము నిరంతరము ఆవశ్యకమై యున్నది. అగ్నియం దుంచబడిన ఇనుపగుండు అగ్నిరూప మగునట్లు, దృఢనిశ్చయముగల చిత్తము ఏ పదార్థమును నిరంతరము అధికముగ భావించునో, అ పదార్థరూప మే యగును. కావున, మనస్సు ఆ పరబ్రహ్మవస్తువును గూర్చియే అనవరతము చింతించుచు, బాహ్యపదార్థముల యెడల విరాగభావమును ఉత్పన్నమొనర్చుకొనుచో, తద్రూపముగనే పరిణతి జెందగలదు. ఏది మహత్తరమైనదో, దుఃఖములేనిదో, ఉపాధిరహితమో, భ్రమశూన్యమో అట్టి ఆత్మనే ప్రయత్నపూర్వకముగ ధ్యానింపుమనియు, అట్టిచో ఆ యాత్మరూపమే కాగలవనియు శ్రీవసిష్ఠులు శ్రీరామచంద్రునకుపదేశించిరి. మఱియు ఏ శ్రద్ధ, ఏ ఆసక్తి, ఏ రుచి, ఏ విశ్వాసము మనుజునకు ప్రాపంచిక వస్తు సంపాదనమందు కలదో, ఆ శ్రద్ధ, ఆ విశ్వాసము

ఆత్మజ్ఞానసంపాదనమునందు గలిగియుండవలెననియు అమ్మునీంద్రు డుద్బోధించెను.

> య ఏవ యత్నః క్రియతే బాహ్యార్థోపార్జనే జనైః
> స ఏవ యత్నః కర్తవ్యః పూర్వం ప్రజ్ఞావివర్ధనే.
>
> (వసిష్ఠగీత - ఉపశమ.)

మఱియు సంసారదుఃఖము యెడల భీతిల్లిన మనుజులకు (వైరాగ్య, ఆత్మ విచారణా రూపమగు) స్వప్రయత్నము తప్ప అదృష్టము గాని, ధనములుగాని, బంధువులు గాని, ఇతరు లాచరించు కర్మములుగాని, శరణ్యము కాజాలవు. మహాబలవంతుడైనప్పటికిని ఉన్నచోటునుండి కదలనిచో అతఁడు మఱియొక ప్రదేశమును చేరజాలనట్లు, అభ్యాసము చేయకున్నచో విషయవిరక్తిని, తత్త్వజ్ఞానమును ఎవడును బొందజాలడు. అహంకారముయొక్క అనుసంధానమును వర్జించుట వలనను, శ్రవణ మననాదిరూప పురుషప్రయత్నముచేతను జీవునిచే ఈ సంసారసాగరము దాటివేయబడగలదు. జీవునకీ సంసారమాలిన్యము బొగ్గుయొక్క నలుపుదనమువలె సహజమైనది కాదు. అది బియ్యముపైని పొట్టు, రాగియొక్కచిలుమువలె ఆగంతుకమైనది. దంచుట, తోముట అను క్రియలచే అ మాలిన్యము లెట్లు నశించిపోవుచున్నవో అట్లే జీవునియొక్క అజ్ఞాన మాలిన్యమున్ను జ్ఞానాభ్యాసమను పురుషప్రయత్నముచే తప్పక నశించిపోగలదు. కాబట్టి అజ్ఞాన రాహిత్యమునకై జనులు నిస్సంకోచముగ ప్రయత్నించవచ్చును. ('తస్మా దుద్యమవాన్ భవ!')

బ్రహ్మచర్యము, స్థైర్యము, తీవ్రవైరాగ్యము, జ్ఞానయుక్తి లేనిచో వాంఛితమగు పరమాత్మపదమును ఎవరును పొందజాలరు. యత్నముగాని, యుక్తిగాని లేనివారికి గోవుపాదమంత స్థలముకూడ దాట నశక్యమై యుండును. ఇక సంసార సాగర విషయమై వేఱుగ చెప్పవలెనా? కావున నిరతిశయానందరూపమగు మోక్షముయొక్క ఉపలబ్ధికొఱకై ఒకింత శ్రమపడి ప్రయత్నమాచరింపవలెను. సామాన్యమైన గృహారామ క్షేత్రాది పదార్థములు కూడ వేఱొక వస్తువు (డబ్బు)ను త్యజింపనిదే లభింపక యుండ ఇక స్వాత్మలాభమును గూర్చి వేఱుగ చెప్పవలయునా? కావున ఆత్మప్రాప్తికై త్యాగము అతి ముఖ్యమై యున్నది. "త్యాగేనైకే అమృతత్వ మానశుః" అల్పమగు ఇంద్రియ సుఖమును త్యజించినచో అనంతమగు ఆత్మసుఖము లభించును.

కాబట్టి విజ్ఞుడగువాడు భుజించుచున్నను, నిదురించుచున్నను, మేలుకొనుచున్నను, కూర్చొనుచున్నను, నడచుచున్నను, తన చిత్తముతో, ప్రజ్ఞతో ప్రతిదినము ఆత్మను గూర్చి లెస్సగ విచారణ సలుపవలయును. మఱియు ఈ దృశ్య ప్రపంచము మిథ్యయని మనస్సునందు నిశ్చయించి, విషయ భోగములయెడల అసక్తిని వదలవలయును, యుక్తులచేతను గురుశాస్త్రాదుల పవిత్రోపదేశముచేతను శాస్త్రార్థముయొక్క చిరపరిశీలనముచేతను చిత్తమను బాలకుని మెల్లమెల్లగ లాలించి, పాలించి ఆత్మోన్ముఖ మొనర్పవలెను. మనస్సు బాలుని చందమున ఏయే ప్రదేశములందు (దృశ్యపదార్థము

లందు) నిమగ్నమగునో వానివానినుండి అద్దానిని మరలించి ఆత్మయందే నియోగించవలెను. ఆత్మనే సదా అన్వేషింప వలెను. దానినే సదా స్తోత్రము చేయువలెను. దానినే ధ్యానించవలెను. అట్లు చేయుటచే మనుజుడు జరామరణ రూపమగు సంసారమోహమును దాటివేయుచున్నాడు.

"కించిజ్జాత వివేకేన స్వస్థవ్యం నేహ ధీమతా!"

"ఒకింత వివేకముదయించిన ధీమంతుడు ఇక (సాధన విషయములో) నిదురపోరాదు." తామసింపక ఆత్మప్రాప్తి పర్యంతము నిరంతర ప్రయత్నము చేయుచునే యుండవలెను. ఏలయనగా ఈ మాయ అతి భయంకరమైనది—

'అసావధానమనసం సంయోజయతి సంకటే'

"ఒకింత అజాగ్రతగ నున్నవానిని తిరిగి అది సంసార సంకటమున బడద్రోయును! భద్రము!" అని కరుణా మూర్తియగు శ్రీ వసిష్ఠమునీంద్రుడు భక్తవాత్సల్యముచే ముముక్షువులను పదేపదే హెచ్చరించియున్నాడు. ఇంతే కాదు, సంసారకూపమునబడి మలినచిత్తముగలవారలై, పరమార్థదృష్టిలేకయుండు జనులయొక్క దుఃఖపరంపరను జూచి తన చిత్తము మిగుల పరితపించుచున్నదని ఒకానొక సమయమున శ్రీ వసిష్ఠులు అజ్ఞానులఁగూర్చి తన హృద యాందోళనను వ్యక్తపఱచిరి. కావుననే అట్టి ఆత్మజ్ఞాన శూన్యులయొక్క సముద్ధరణముకొఱకై జ్ఞానప్రబోధకము లగు ఉపాయముల నెన్నిటినో వారుపదేశించుటయే కాక, వారలను అజ్ఞాననిద్రనుండి మేలుకొలుపుటకొఱకై ఈ క్రింది

విధమున ఆచటచట హెచ్చరిక చేసియున్నారు. "ఓ జీవులారా! వ్రణమందు పురుగులవలె గృహములందుండి స్వల్పములగు కాంతాన్నపానాదిభోగములందే మీ మీ జీవితములను ధారబోయకుడు!"

"అనర్థేనావిచారేణ వయః కుర్యాన్న భస్మసాత్
బోధేన జ్ఞానసారేణ దృశ్యం కర్తవ్య మాత్మసాత్."
(వసిష్ఠగీత - నిర్వాణప్రకరణము)

'అనర్థకరమగు అవిచారణ (ఆత్మవిచారణలేమి) చే మీ ఆయువును వ్యర్థము చేయకుడు. జ్ఞానసారమగు పరమాత్మబోధచే దృశ్యమును ఆత్మతో నైక్యమొనర్చి పరమశాంతిని బడయుడు! ఇంద్రియములను త్రాళ్ళచే కట్టువడి ఈ సంసారమను పాడువడిన చీకటినూతులందు పడి నశింపకుడు! దౌర్భాగ్యదాయకమును, అశుభమునగు సాంసారిక విచారణయను ఘనీభూతమగు దీర్ఘ అజ్ఞాననిద్రనుండి మేలుకొనుడు! చిన్నదారువునందలి ముసలి తాబేలువలె నిదుర బోవుచు ప్రమత్తులై యుండరాదు. వార్ధక్యమరణాది సంసార దుఃఖమును అంతమొనర్చుటకై, జన్మరాహిత్యము నొందుటకై లెండు! యత్నశీలురుకండు! దృశ్యవిషయములందు నిమగ్నమై కామమను దారువునందు ఎద్దువలె చిక్కుకొని పోయినట్టి మీ మనస్సును బలాత్కారముగ లేవదీయుడు! దేహాది తాదాత్మ్యాధ్యాసరూపమగు శయ్యపై పరుండియున్న మనస్సును సంసారదుఃఖవినాశముకొఱకును, ఉత్తమ జ్ఞానప్రాప్తికొఱకును నిరంతరము మేలుకొలుపుడు! సంసా

రము మహాదుఃఖప్రదమైనదిసుమీ! కావున చిత్తమను గొలుసును ఆత్మస్వరూపజ్ఞానమను యుక్తిచే ఛేదించివైచి మహాధైర్యమవలంబించి మాయ యను బోనునుండి స్వాత్మ యను సింహమును విడిపింపజేయుడు!

'న స్వధైర్యాదృతే కశ్చిదభ్యుద్ధరతి సంకటాత్'

ధైర్యమొకటి తప్ప మఱి యేదియును మిమ్ములను సంసారసంకటమునుండి ఉద్ధరింపజాలదు! అని ఈ ప్రకారముగ శ్రీ వసిష్ఠులు మాటిమాటికి జనుల నుద్బోధించిరి.

అనుభవజ్ఞులగు మహనీయుల అట్టి జ్ఞానవైరాగ్యోద్బోధకములగు వాక్యములను ముముక్షువు లెల్లరును శ్రద్ధతో పాలించి, అనుష్ఠించి భవరోగవిముక్తులు కావలసి యున్నారు. ఆత్మవస్తువు, సచ్చిదానందపరబ్రహ్మము ప్రతి జీవియొక్క జన్మహక్కు అయియున్నప్పటికిని అనాది అవిద్యావశమున విస్మృతిజెంది జీవుడు జన్మకర్మలందు తిరుగాడుచున్నాడు. కాని సుకృతవశమున ఏనాడట్టి మహాత్ముల అమృతబోధల నాలకించునో, అప్పటినుండియు కృతార్థుడై, భక్తి, జ్ఞాన, వైరాగ్యాదుల నభ్యసించుచు అచిరకాలముననే స్వస్వరూపానుభూతిని బడసి బంధవిముక్తుడు కాగలడు. అట్లు ఆత్మజ్ఞానమును బడసిన మహనీయుడు తిరిగి దుఃఖమును గాని, సాంసారిక క్లేశమునుగాని బొందక నిత్యనిరతిశయానందసాగరమున నోలలాడుచు జన్మసాఫల్యము నొందును. అతడు మేరువువలె గంభీరముగ నుండును. పిల్లవాయువులు పర్వత

మును కదలింపజాలనట్లు ఘోరమగు ఆపత్తులుకూడ అట్టి వాని శాంతిని. ఏమాత్రము భంగపఱచజాలవు; అతని ముఖమున వైమనస్యమును కలుగజేయజాలవు.

శీతోష్ణ, సుఖదుఃఖాది ద్వంద్వములం దాతడు సమరూపమున నుండును. సర్వదా ఆనందభరితుడై, ఈ జగన్మాయను వెంబడించుచుండు అజ్ఞులను జూచి నవ్వుచుండును. సమస్తసంకల్పములయొక్క ఆవలియొడ్డగు పరమాత్మపదమున విశ్రాంతినొందిన అట్టి మహానీయులకు జగత్తు శిథిల తృణలేశమువలె నుండును. గోష్పదజలమందు గజరాజము మునుంగనట్లు సాంసారికవృత్తులం దాతడు మునుఁగనేరడు. నందనవనమును బడసినవారు కంటకారణ్యముపై పునకు బోనట్లు, నిరతిశయానందమనుభవించు అట్టి మహానీయులు తుచ్ఛభోగాదులపై పునకు ఎన్నడును పరువిడరు. మఱియు కవచమును ధరించినవానిని బాణములు వేధింపనట్లు, అట్టి విజ్ఞానవంతుని అశగాని, దానియొక్క పరివారమగు క్రోధలోభాదులుగాని బాధింపనేరవు. ఆత్మసాక్షాత్కారమొందిన ఇట్టి మహాత్ములే లోకమున మనుష్యు లనదగినవారు. ఏలయనగా వారు మానవజన్మయొక్క పూర్ణసాఫల్యతను బొందినవారై, శివస్వరూపులై పఱగుదురు. అట్టి మహానీయులు సమాధియందున్నను, లేక లోకసంగ్రహార్థము వ్యవహరించినను రెండిటియందును చిత్తసామ్యమును గోల్పోవకయే యుందురు.

సమాధిమథ కర్మాణి మాకరోతు కరోతు వా
హృదయేనా స్త సర్వాస్థో ముక్త ఏవో త్తమాశయః.

(వసిష్ఠగీత - స్థితి ప్రకరణము)

అనగా ఎవడు తన హృదయము నుండి సమస్త ఆశలను, వాసనలను పారద్రోలునో, అట్టి శుద్ధాంతఃకరణుడు సమాధియందున్నను, లేక కర్మలఁ జేసినను అతడు ముక్తుడే యగు నని జెప్పబడినది. కనుకనే శ్రీ వసిష్ఠమునీంద్రులు శ్రీరామచంద్రునకు తత్త్వోపదేశము చేయునపుడు బాహ్యారాజ్యాదికార్యములను విరమించుమలాగున చెప్పక, అవి చేయుచునే హృదయమందు ఏ కర్తృత్వమున్ను లేక నిర్వికారముగ ఆత్మస్థితియం దుండుమని సెలవిచ్చిరి.

'కర్తా బహిరకర్తా న్తర్లోకే విహార రాఘవ'

"ఓ రాఘువా! బయటకు కర్తగను, లోన అకర్తగను ఉండి లోకమున విహారింపు' మని బోధించితి. చేపకన్ను నీటియం దున్నను నీటిచే తడుపబడనట్లు, అసక్త బుద్ధి గల ఆత్మజ్ఞుడు వ్యవహారతత్పరుడై యున్నను కర్మచే నంటబడడు. సంగరహితమగు మనస్సుచే కార్యములఁ జేయుచున్నను - కల్పితమనోరథ దశలందువలె - మనుజుడు సుఖదుఃఖములచే అంటబడకయే యుండును. శ్రీమద్భగవద్గీతయొక్క ఆశయమున్ను ఇట్టి అనాసక్తకర్మయోగమే అయి యున్నది. మహానుభావు లగువారు అట్టి అనాసక్తి, నిస్సంగత్వము, ఆత్మస్థితి కలుగువరకు ఏకాంతమందు ధ్యానాదులను శీలించి తదుపరి లోకసంగ్రహార్థము వ్యవహారమును సలుపుచుందురు.

రాజ్యాది కార్యములను గూడ నిర్వహించుచుండురు. జనకుడు, బలిచక్రవర్తి, ప్రహ్లాదుడు, చూడాల, శిఖధ్వజుడు, భగీరథుడు మొదలైన మహామహులందఱున్ను ఇదేవిధముగ చిరకాలము చక్కగ ఆత్మవిచారణ సలిపి జగత్తుయొక్క అనిత్యత్వమును, ఆత్మయొక్క శాశ్వతత్వమును అనుభూత మొనర్చుకొని, ఆ పిమ్మట రాజ్యాది కార్యములను, వర్ణాశ్రమోచితవ్యవహారములను నిస్సంగముగ నాచరించిరి. శ్రీరామచంద్రుడున్ను శ్రీ వసిష్ఠమునీంద్రులద్వారా పరమార్థతత్త్వమును లెస్సగ నెఱింగి తదుపరి ధైర్యముతో కర్మరంగమున ప్రవేశించి విశ్వామిత్రుని తపస్సంరక్షణార్థము బయల్వెడలెను.

ప్రతిజీవియు ఆహారసంపాదనము కొఱకు కర్మ చేయవలసియే యుండుననియు, కాని ఆ కర్మ ధర్మవిరుద్ధము, నింద్యము. కానిదై యుండవలెననియు శ్రీ వసిష్ఠులాదేశించిరి. ఈ సందర్భమున వచింపబడిన ఈ క్రింది శ్లోకమును ముముక్షువు లెల్లరును తప్పక గమనించ దగియున్నది—

అత్రాహారార్థం కర్మ కుర్యా దనిన్ద్యం
కుర్యా దాహారం ప్రాణసంధారణార్థం,
ప్రాణాస్సంధార్యా స్తత్త్వజిజ్ఞాసనార్థం
తత్త్వం జిజ్ఞాస్యం యేన భూయో న దుఃఖమ్.

(వసిష్ఠగీత - నిర్వాణ ప్రకరణము)

ఓ జనులారా! ఆహారసంపాదనము కొఱకై, మీరేదైన నింద్యముకాని కార్యమును చేసికొనవచ్చును. అయితే

ఆ యాహారము ప్రాణసంరక్షణము కొఱకే కాని, భోగము కొఱకు కాదను సత్యమును జ్ఞాపకముంచుకొనుము! ఆ ప్రాణ సంరక్షణయో తత్త్వజ్ఞాన సంపాదనకొఱకే యను విషయ మును మఱచిపోకుము! ఆ తత్త్వజ్ఞాన సంపాదనమో ఈ జనన మరణ సంసార చక్రమునుండి విముక్తి నొందించి తిరిగి దుఃఖము లేకుండ జేయుటకొఱకే యని యెఱుఁగుము!!'

ఇవ్విధముగ బోధామృతమును అనర్గళముగ వర్షించి మోక్షోపాయముల నెన్నిటినో ప్రవచించి శ్రీ వసిష్ఠమునీం ద్రులు తుట్టతుదకు శ్రీరామచంద్రునితో విశ్వాసజనకము లగు ఈ క్రింది వాక్యములను పరమప్రేమతో వచించిన వా డాయెను.

> యదేత దఖిలం రామ భవతే వర్ణితం మయా
> యదిదం వర్ణయామ్యద్య వర్ణయిష్యామి యచ్చవా,
> త్రికాల దర్శినా నిత్యం చిరం చ కిల జీవతా
> విచారితం చ దృష్టం చ మయా తదఖిలం స్వయమ్.
> తదేతామమలాం దృష్టి మవలమ్బ్య మహామతే
> జ్ఞానమాసాదయ పరం జ్ఞాత్వా మ్బ్రక్తిర్వా లభ్యతే.

(వసిష్ఠగీత - ఉపశమ ప్రకరణము)

"ఓ రామచంద్రా! ఇంతవరకు నీకు వర్ణించి చెప్పి నదియు ఇపుడు చెప్పునదియు, ముందు చెప్పబోవునదియు, అంతయును త్రికాలదర్శియు, చిరంజీవియు నగు నేను స్వయ ముగా మరల మరల విచారించి నిత్యము ప్రత్యక్షముగ

గాంచుచున్నదే యగును. కాబట్టి మహామతివగు నీవున్ను అట్టి నిర్మలదృష్టినే అవలంబించి ఉత్తమమగు జ్ఞానమును బొందుము. ఏలయనగా జ్ఞానముచేతనే మోక్షము లభించును.''

దీనినిబట్టి శ్రీ వసిష్ఠ మునీంద్రులు బోధించినది యంతయు ప్రత్యక్షముగ అనుభవించి చెప్పినదే యనియు, కావుననే పరమ ప్రమాణ మనియు స్పష్టమగుచున్నది. వారి బోధయందు విశ్వాసము కలుగుటకు ఇంతకు మించిన వాక్యములు ఇంకేమి కావలయును? అట్టి మహామహుడును పరమ గురువునైన బోధకుడగు శ్రీ వసిష్ఠమునీంద్రునకును, బోధకు నిమిత్తమాత్రుడైన పటిగిన శ్రీరామచంద్రునకును, బోధను గ్రంథరూపమున లోకమున కందించిన శ్రీ వాల్మీకిమునీంద్రునకును లోక మెంతయో ఋణపడియున్నది. ఈ ప్రకారముగ శ్రీ వసిష్ఠమునీంద్రులు శ్రీరామచంద్రునకు బోధించిన మోక్షోపాయములను ముముక్షువు లెల్లరు చక్కగ హృదయస్థ మొనర్చుకొని ఆచరించి తరించుదురు గాక!

# 11 వ. అ ధ్యా య ము

## మోక్షసాధనకై ప్రారంభిక చర్యలు

ఇక మోక్షప్రాప్తికి వలసిన సాధన సామగ్రిని గురించి, అనుష్ఠానమును గురించి వివరముగ తెలిసి కొందము—

### సాధ్యవస్తువు - సాధన

సిద్ధాంతప్రతిపాదనకంటె అనుష్ఠాన నిర్వహణమే చాల గొప్పది. అట్టి అనుష్ఠానమును నొక్కి చెప్పుట గీతా చార్యునకున్న పరమప్రీతి. కావున్న 2-వ అధ్యాయమున స్థితప్రజ్ఞుని ఘట్టమందు సాధకులకు అత్యంతోపయుక్తములైన ఎన్నియో పద్ధతులను నేర్పి భగవానుడు అంతటితో తనివి నొందక మరల 12-వ అధ్యాయమున అద్వేష్టృత్వాద్యనేక సుగుణములను పేర్కొనెను. వానితో తృప్తినొందెనా యనిన, మరల వెనువెంటనే 13-వ అధ్యాయమున అమా నిత్వాది జ్ఞానిలక్షణములను పెక్కింటిని వరుసగా చెప్ప సాగెను. అంతటితో ఇక సాధనసంబంధవిషయములకు భరత వాక్యము చెప్పెనా యనిన కాదు. ముముక్షువులపై కరుణా మృతవర్షమును గురిపించెనా యనునట్లు మరల 16-వ అధ్యాయమున అభయం అని మొదలుపెట్టి ఇరువదియారు దైవికగుణములతో గూడిన ఒక పెద్ద జాబితా తయారుచేసి

పెట్టెను. కావున చక్కని అనుష్ఠానము, శీలసంపత్తి ముముక్షువునకు అత్యావసరమని తేలుచున్నది.

మనుజునకు సాధ్యవస్తువుపై గల ప్రీతిలో ఏ కొంత భాగమైనను సాధనయందు వినియోగింపబడినచో లక్ష్యము కరతలామలకము కాగలదు. కాని అట్లు జరుగుటలేదు. ప్రతివారికి కావలసినది దేవుడు. ఆ దేవుడు చాల గొప్పవాడే; అయితే ఆ దేవుని పొందుటకు వలయు మార్గమును గూర్చి అతడు యోచించుచున్నాడా అనునది ప్రశ్న. తన్ను జేరుటకు అవలంబించవలసినపద్ధతి పరమాత్మ కరుణతో గీతాది సద్గ్రంథములందు, ఉపనిషత్తులందు, వేదశాస్త్రములందు ప్రబోధించి అద్దాని ననుసరించవలసినదిగా హితవు జెప్పుచున్నాడు. ఆ మార్గమును జేపట్టిననే జీవుడు దేవుని పొందగలడు. సాధనను గట్టిగ పట్టుకొనిననేకాని అది సాధ్యవస్తువు దగ్గరకు జీవుని గొనిపోజాలదు.

పుంసః ప్రధానసిద్ధ్యర్థమంగస్యాశ్రయణం ధ్రువమ్
కర్తవ్యమంగహీనం చేత్ప్రధానం నైవ సిధ్యతి.

ప్రధానవస్తువు లభించవలెననిన దాని అంగమును, సాధనను తప్పక ఆశ్రయించవలెను. అట్లాశ్రయించనిచో ఆ ప్రధానవస్తువు ఎన్నటికిని లభించదు. భారతదేశము తన పూర్వపు ఔన్నత్యమును ఇపుడు పొందజాలకపోవుటకు కారణము లక్ష్యమునందుగల ఆసక్తి లక్ష్యసాధనయందు లేకపోవుటయే యని జ్ఞప్తియం దుంచుకొనవలెను. గీత

యందు భగవానుడు లక్ష్యమునుగూర్చి ఒకింత చెప్పి లక్ష్య సాధననుగూర్చి ఎక్కువగా జెప్పెను. ధ్యేయమును ఒకింత జెప్పి ధ్యానమును విస్తారముగా బోధించెను. సాధ్యమును మితముగ దెల్పి సాధనను మిక్కుటముగా ప్రతిపాదించెను. గీతలోని ప్రతి అధ్యాయమందును పాఠకునకీ స్థితియంతయు కండ్లకు గట్టిన ట్లగపడగలదు. కావున మనుజుడు సాధనయందారితేరి సచ్ఛీలమును పెంపొందించుకొని, జ్ఞానసంపదను, దైవసంపదను లెస్సగ అభివృద్ధిపఱచుకొనవలెను. ఇదియే జీవుని ప్రథమ కర్తవ్యము.

సామాన్యముగ లోకములో సువర్ణము, ఆభరణములు, భవనములు, క్షేత్రములు, కరెన్సీనోట్లు, డాలర్లు మున్నగునవి ధనమని, సంపదయని ప్రాపంచికజనులు తలంచుచుందురు. కాని భగవంతుని దృష్టియందు సచ్ఛీలమే ధనము. సదాచారమే సంపద. బ్రహ్మజ్ఞానమే ఐశ్వర్యము. ప్రాపంచిక ధనముతోడి సంబంధము మనుజునకు ఈ శరీరముండువరకే యుండును. శరీరవియోగముచే ఆ రెండిటికిని ఎడబాటు కలుగును. జ్ఞానసంపద అట్లు కాదు. ఉత్తమసంస్కారరూపమున అయ్యది అమోక్షము వాని వెంటనే యుండి నీడవలె వెంబడించుచు అభ్యుదయపథమున అతనిని ప్రవేశపెట్టుచు తుట్టతుదకు గమ్యమును చేర్చును. కాబట్టి భౌతికసిరిసంపదల కంటె ఎన్ని రెట్లో శ్రేష్ఠతరమైనది ఈ అధ్యాత్మికసంపద. కనుకనే మహనీయులు భౌతికముగా ఈశ్వరు డిచ్చిన దానితో సంతృప్తిపడి పారమార్థిక ఐశ్వర్యమునే అభివృద్ధి

నొందించుటకు యావచ్ఛక్తి ప్రయత్నింతురు. మనుజుని విలువ అతని రూపసౌందర్యములందు లేదు. ఆస్తిపాస్తులందు లేదు. సంతతియందు లేదు, క్షేత్రవిత్తాదులందు లేదు. శీలమందుమాత్రమే, భక్తియందుమాత్రమే కలదు. పారమార్థికసుగుణములందుమాత్రమే కలదు. కాబట్టి అట్టి సదాచారమును అభివృద్ధిపఱచుకొని, సాధనయందు దారితేరినవాడై తద్ద్వారా జీవుడు సాధ్యవస్తువగు పరమాత్మను ఈ జీవితమందే సాక్షాత్కరించుకొని ధన్యుడు కావలయును.

## అంతర్యుద్ధము

ప్రతి జీవియొక్క హృదయమున ఒక మహాయుద్ధము చెలరేగుచున్నది.

రామరావణ యుద్ధము కొద్దిదినములు జరిగిన పిదప నిలిచిపోయెను. పాండవ కౌరవ యుద్ధము పదునెనిమిది దినములు మాత్రము జరిగి ఆగిపోయెను. ఏ యుద్ధమైనను కొంత కాలము జరిగిన పిమ్మట విరమణ మొందుచుండును. కాని జీవుని హృదయమున చెలరేగు యుద్ధము మాత్రము అవిరళముగ కొనసాగుచునే యున్నది. ఇప్పటికి ఎన్నికోట్ల జన్మలో గడచిపోయినవి. యుద్ధము అంతరించలేదు. ధర్మమునకు అధర్మమునకు, న్యాయమునకు అన్యాయమునకు, దైవసంపదకు అసుర సంపదకు, సత్యమునకు అసత్యమునకు, ఆత్మకు అనాత్మకు, దృక్కునకు దృశ్యమునకు, పురుషునకు ప్రకృతికి హోరాహోరి సంగ్రామము జీవునిలో కలుగుచున్నది.

మాయ (ప్రకృతి, అవిద్య) తన బలమును కూడ గట్టుకొని జీవునిపై విజృంభించుచున్నది. కామక్రోధాది అరి షడ్వర్గమును, దంభ అసూయా ద్వేషాది దుర్వృత్తులను చేర బిలుచుకొని తన పక్షమును అది బహుకాలమునుండి పదిల పఱచుకొని జీవునితో ముఖాముఖి యుద్ధమునకు దిగినది. ఇట్టి పరిస్థితిలో జీవుడు తటస్థుడుగా నున్నచో ఘోరప్రమా దము సంభవించగలదు. తాను గూడ తగిన బలమును చేకూర్చుకొని తన యంతశ్శత్రువులతో పోరునకు దిగవలెను. దుర్బలత్వమును ప్రదర్శింపరాదు. వెన్ను చూపరాదు. దైవ సంపద యను ఆయుధములను చేబూని రణరంగమున దుమికి శత్రువులు కాలికి బుద్ధిచెప్పునట్లు చూడవలెను. ఇంతవఱ కెన్ని జన్మలనుండియో జీవుడు చేసిన అశ్రద్ధ వలననే శత్రు వునకు కాలు నిలద్రొక్కుకొనుటకు చక్కని అవకాశ మేర్ప డినది. ఇక మీదట అట్లు చేయరాదు. 'జహి శత్రుం మహా బాహో' అని శ్రీకృష్ణమూర్తి ఆనతిచ్చినట్లు శత్రువు యొక్క అంతు చూడవలెను ఈ మానవజన్మలోనే.

కాని అట్లు చేయుచున్నారా జనులు అనునది ప్రశ్న. తీవ్రముముక్షుత్వముగల ఏ కొలదిమంది పుణ్యాత్ములో తప్ప తక్కినవారు శత్రువుల ఆ దాడివిషయమై అంతగా పట్టించు కొనుటలేదు. తత్ఫలితముగ నానావిధ దుఃఖయాతనలలో పడి, కామాదిశత్రువులకు దాసానుదాసులై, అవి చెప్పినట్లు నడచుచు, అవి ఆడించినట్లు ఆడుచు బానిసలపగిది వర్తించు చున్నారు. ఇది మానవులకు తగదు. ఇట్లు చేయుట మానవ

త్వమునకే కళంక మాపాదించినట్లు. మా=అజ్ఞానము, న= లేకుండ, వ=వర్తించువాడు మానవుడు—అని గుర్తించు కొనవలెను.

కావున అజాగ్రత పనికిరాదు. ప్రమత్తత, సోమరి తనము మృత్యువుతో సమానమని సనత్కుమారుడు వచించి యుండెను. (ప్రమాదో మృత్యురిత్యాహ భగవాన్ బ్రహ్మణ స్సుతః). దీప మారినచో అంధకార మావరించగలదు. కావున ప్రజ్ఞయను దీపశిఖ ఆరకుండ చూడవలెను. వార్ధక్యము రాక పూర్వమే, బలజవసత్వములు సన్నగిల్లకముందే, ఆయువు పదిలముగ నున్నపుడే, ఆరోగ్యము స్థిమితముగనున్న కాల మున నే అంతశ్శత్రువుల పని పట్టించవలెను. 'నా హృదయ గేహమును వదలిపొండు (Quit my heart)' అని వానికి తుది హెచ్చరిక (అల్టిమేటమ్) చేయవలెను.

అయితే పైపై హెచ్చరికలు చేసినా అవి ఒక రాగాన జీవుని వదలి పెట్టననుట నగ్నసత్యము. కావున క్రియారంగ మునను దిగవలెను. మాటలను చేష్టలుగా రూపొందించ వలెను. నిర్భయత్వము (Fearlessness) అను ఆయుధమును చేబూని గీతయందు చెప్పబడిన అద్వేష్టృత్వాది, అమా నిత్వాది సద్గుణరూప అస్త్రశస్త్రములను ధరించి కామాది శత్రువులతో తలపడవలెను. ధైర్యము, పవిత్రత, పట్టుదల, సహనము భగవద్భక్తి, వివేకము కలవాడు ఈ యుద్ధమున తప్పక విజయమును గాంచగలడు. 'కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్'—ఏ ఒకానొక ధీరుడో యుద్ధమున విజయమొంది

ప్రత్యగాత్మను సాక్షాత్కరించుకొనగలడు - అని ఉపనిషత్తు లుద్ఘోషించుచున్నవి. కాబట్టి అచంచల ధైర్యమే జీవుని పరమాయుధము.

ఎందరో మహనీయులు, తపస్సంపన్నులు, పుణ్యాచరితులు తమ అప్రతిహత నిశ్చయాత్మబుద్ధిచే ప్రకృతిని ఎదుర్కొని విజేతలై లోకమున పరిఢవిల్లిరి. వారి యాదర్శమును గైకొని ముముక్షువు వెనుక చూపులేక ముందునకే చనుచు ఈ ధర్మాధర్మయుద్ధమున ఉత్తీర్ణుడై విజయపతాకమును ప్రతిష్ఠించి ధన్యుడు కావలెను. జీవిత లక్ష్యమిదియే యని జ్ఞాపకమునం దుంచుకొనవలెను. బాహ్యశత్రువులను జయించుటతో తృప్తి నొందక అంతశ్శత్రువులను కూడ జయించుటకు పూనుకొనవలెను. స్వరాజ్యప్రాప్తితో తనివినొందక స్వారాజ్యప్రాప్తినికూడ బడయవలెను. తాను మోక్ష సామ్రాజ్యాధిపతియగు ఆత్మయేకాని దేహాది దృశ్యపదార్థముకాదని ముమ్మాటికి నిశ్చయించి, అట్టి మహోన్నత నిశ్చయము ద్వారా హృదయమును ప్రకాశవంతముగ నొనర్చుకొనవలెను. చీకటిని ఆశ్రయించు రాక్షసులు ప్రకాశముచెంత నిలువజాలరు. జ్ఞానజ్యోతిచెంత దుర్వృత్తిరూప నిశాచరులు పలాయనము చిత్తగింతురు. ఇదియే శత్రు విజయము. ఈ ప్రకారముగ జీవుడు తన బుద్ధికుశలత చేతను, కార్యదక్షతచేతను, సాధనాతిశయముచేతను తన అంతర్యుద్ధమున విజయముగాంచి మోక్షసామ్రాజ్యమునకు ఏకైకప్రభువై విలసిల్లవలెను.

శాంతి సుఖములను కోరువాడు, జనన మరణరూప దుఃఖదావాగ్నికి దూరముగనుండ దలంచినవాడు, బంధ విముక్తిని అభిలషించువాడు, దుర్భర నరక దుఃఖములకు వెరయువాడు జీవితమును సంస్కరించుకొని దైవగుణములను ఆశ్రయించి అసురగుణములకు తిలోదకము లివ్వవలసి యున్నది. అయితే ఈ సిద్ధాంతము ఆచరణకు వచ్చునపుడు ప్రతిపక్షమువారగు రాక్షసగుణములనుండి జీవుడు గొప్ప తిరుగుబాటును ఎదుర్కొనవలసివచ్చును. కోట్లకొలది జన్మల నుండి హక్కుభుక్తముల నేర్పరచుకొని బాగుగ తిష్ఠవేసి యున్న ఆ కామక్రోధాది రాక్షసులు శాంతముగా వెడలిపోవుదురా? అసలు వెడలుటకు యిష్టపడుదురా? లేదు. తమ ప్రాణమునకే ఎసరు వచ్చినందువలన ఎంత గందరగోళము చేయవలెనో అంతచేసి వదలుదురు. ఇట్టి క్రాంతి నెదుర్కొను నపుడే సాధకులలో పెక్కురు దిగజారిపోవుదురు. సర్వేశ్వరుని యెడల అచంచలమైన విశ్వాసము, సాహసోపేతమగు బుద్ధి, ధైర్యస్థైర్యములు, గొప్పపట్టుదల, కష్టసహిష్ణుత, లక్ష్యమును జేరవలెనను తీవ్రమగు ఆకాంక్ష ఉన్నవారు మాత్రమే ఈ యుద్ధమున విజయమును జేపట్టుదురు.

పాఠశాలలో విద్యార్థులు త్రాడులాగుపందెము (Tug of war)లో పాల్గొనుచుందురు. ఒకే త్రాడును ఒకవైపు కొందఱు మఱియొకవైపు కొందఱు పట్టి లాగు చుందురు. ఎవరివైపు త్రాడు ఎక్కువగ జరుగునో వారు గెలుపొందినట్లు. అట్లే ప్రతిముముక్షువుయొక్క హృదయ

మందును దైవాసురసంగ్రామము జరుగుచునే యున్నది. మంచికి చెడ్డకు, ధర్మమునకు అధర్మమునకు, న్యాయమునకు అన్యాయమునకు, దైవసంపదకు అసురసంపదకు ఘోరమగు యుద్ధము సంభవించుచునే యున్నది. కేవలము అజ్ఞాని యగువానియొక్కయు కేవలము జ్ఞానియగువానియొక్కయు హృదయమందుమాత్రము ఈ సంగరముండదు. ఏలయనిన అజ్ఞానిమనంబున ఒకేఒక పక్షము (అసురపక్షము) కాపుర ముండును. రెండవపక్షమగు దైవత్వమును గూర్చిన వాంఛయే వాని కుండదు. ఇక జ్ఞానియో ప్రతిపక్షమగు అసురత్వమును రూపుమాపి యుండుటచే ఒకేఒక దైవ పక్షముమాత్ర మతనియం దుండును. ఇక మధ్యగల జిజ్ఞాసు వునకు మాత్రమే . ముముక్షువునకు మాత్రమే ఈ యుద్ధ ప్రసక్తి కలుగును. కాబట్టి సాధకుడు అతిజాగరూకుడై ప్రయత్నపూర్వకముగ గొప్ప ఆధ్యాత్మికబలమును చేకూర్చు కొనవలెను.

నీటిలో కుండను పెట్టినచో నీటియందు గుంటగా ఏర్పడును. కాని ఆ కుండను పైకితీయగనే అ గుంట తత్క్షణమే పూడిపోవును. నీరు తనయందు గుంటలను సహింపదు. అట్లే ముముక్షువు తన యంతఃకరణమును బాగుగ పరిశీలించి, దానియందేవైన గుంటలు (loop-holes) ఉన్నచో, దోషము లున్నచో వెనువెంటనే విచారణాదులచే వానిని తొలగించు కొని హృదయము సమముగ, నిర్మలముగ నొనర్చుకొన వలెను.

'నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః' అనునట్లు, ఎపుడు చిత్తము దోషరహితమై, సమమై వెలయునో అపుడు వారు బ్రహ్మమందు స్థితినొందియున్న వారే యగుదురు. ఏలయనగా బ్రహ్మము సమరూపమును, దోషవర్జితమును అయియున్నది. జీవుడు తన యంతఃకరణమును శుద్ధమొనర్చుటయందే విలంబముగాని, మోక్షమును పొందుటయందుగాదు. హృదయనైర్మల్యస్థితి ఏర్పడినప్పుడు మోక్షము తృటికాలములో లభించును. ఫోటోతీయుట ఏమంత ఆలస్యముగాదు. సెకండులోని నూఅవభాగమంత కాలము దానికి చాలును. కాని ఆలస్యమంతయు కుర్చీలు సర్దుటలోను, బెంచీలు సరిచేయుటలోను, ముఖవైఖరులను సరిదిద్దుటలోను జరుగుచుండును. మోక్షావశ్యకమగు ఇట్టి చిత్తశుద్ధి జీవునకు కలిగించు నిమిత్తమే శ్రీకృష్ణభగవానుడు గీతయందు పూర్ణముగ ఒక అధ్యాయమంతయు (16 అధ్యా) దానిక్రింద వినియోగించి విధినిషేధముల రెండిటిని అద్దానియందు ప్రతిపాదించివేసెను. అదియే దైవాసుర సంపద్విభాగయోగము. దైవసంపద విధి. అసురసంపద నిషేధము. దేనిని వదలించుకొనవలెనో, దేనిని గ్రహించవలెనో రెండిటిని జీవుడు తెలిసికొని యుండినచో మంచిదని యెంచి గీతాచార్యుడు ఆ విధి నిషేధముల రెండిటిని అట పొందుపఱచెను.

భగవానుడు చూపిన ఈ మార్గముద్వారా జీవునకిక మోక్షప్రయాణము సులభతరమై పోగలదు. తన

హృదయకవాటము యొద్ద రాత్రింబవళ్లు కావలి కాయుచు శత్రుపక్షము వారిని లోనికి రానీయక ఆత్మీయులను మాత్రము రానిచ్చుచుండినచో అచిర కాలములో దేహము దేవాలయమై తనరగలదు. జీవుడే దేవుడై చెన్నొందగలడు. నిరోధింపబడిన శత్రువు తిరుగబడినచో సంఘర్షణము గావించి, పోరుసలిపి, బుద్ధిబలము నుపయోగించి ఎట్లైనను లోనికి రానీయకుండ చేయుటయే జీవుని కర్తవ్యము. తన మనస్సుతో ఘర్షణ పడువానికి ప్రపంచములో నెచటను ఘర్షణ యుండనేరదు. అభ్యంతర శాంతి నొందినవానికి బాహ్యశాంతి దానియంతట నదియే వచ్చిచేరును. కాబట్టి ఉత్తముడగువాడు తన మనస్సులోని మలినభాగముపై యుద్ధప్రకటనగావించి దైవ సంపద్రూప తీక్ష్ణాయుధములచే అద్దానిని హతమార్చి కేవలము శుద్ధభాగమే శేషించులాగున నొనర్చినచో, ఇక మోక్షలక్ష్మి వానిని వెతకికొనుచువచ్చి మెడలో పూల హారము వేయును.

"సత్త్వపురుషయోః శుద్ధిసామ్యే కైవల్యమ్" (పతంజలియోగసూత్రము)-'ఆత్మ ఎంత శుద్ధముగ నున్నదో మనస్సున్ను అంతశుద్ధత్వము నొందినచో అట్టిస్థితియే మోక్షమని చెప్పబడున'ని పతంజలిమహర్షి నుడివియున్నాడు. కావున పరమార్థసాధనకై త్వరపడవలెను. ఆయువు క్షయింపక పూర్వమే, దేహనౌక భగ్నముకాక పూర్వమే ఈ సంసార మహాసముద్రమును దాటివేయవలెను. దీపమున్నపుడే యిల్లు చక్కబెట్టుకొనవలయును. సంసారసంగ్రామమున ప్రణవ

పతాకమును జేపట్టి వివేకమను తీక్ష్ణ ఖడ్గముయొక్క ధవళ ధారలచే దంభదర్పాద్యసుర సమూహమును ఛేదించివైచి, అభయత్వాది దేవతాగణము నాదరముతో హృదయగుహ లోనికి ఆహ్వానించి, సత్కరించి నిరతిశయాత్మానందామృత మును వారివలన గ్రోలి తమ తమ జీవితములను జనులు పునీత మొనర్చుకొనవలెను.

ప్రతి దేశమునకును, ప్రతి ప్రభుత్వమునకును అయా దేశవాసుల సిద్ధాంత, స్వభావ లక్ష్యములను ప్రతిబింబించు పతాకము (జెండా) ఒకటి యుండును. అట్లే పరమార్థ క్షేత్రమున యత్నశీలు రగు ముముక్షు జనులందఱికిని ఒకా నొక పతాకము కలదు. అదియే ప్రణవపతాకము. దానిని ముందిడుకొని, దానిని గౌరవించి, దానిని పూజించి, దానికి మోకరిల్లి సాధకులు అధ్యాత్మరంగమున ముందునకు పయ నమై పోవుచుందురు. పరబ్రహ్మసాక్షాత్కారమను గమ్య మును చేరుటకై వారా ప్రణవపతాకమును చేబూని, అహ ర్నిశము గమనము సల్పుచుందురు. ప్రణవధ్యానము, ప్రణవోచ్చారణము, ప్రణవార్థశ్రవణము – ఇవియే వారి నిత్యక్రియాకలాపములు.

సైనికునకు పతాకము ప్రాణతుల్యమైనది. దానికి అగౌరవము జరిగినచో ప్రాణములనైనను ఒడ్డి అద్దాని పరువు ప్రతిష్ఠలను కాపాడును. అట్లే పరమార్థసాధకునకును ప్రణవ పతాకము ప్రియతమమైనది. గమ్యమును నిరంతరము స్ఫురింపజేయుట చేయుటవలనను, దర్శకుల హృదయసీమ

లలో అనవరతము వైరోగ్యోత్సాహములను పురిగొల్పుటవల
నను, ఆ ప్రణవపతాకము సాధకులకు పరమవంద్యమై యల
రారుచున్నది. ప్రణవ మనగా ఓంకారము. ఓంకారము పర
బ్రహ్మముయొక్క వాచకము; నామధేయము. నామో
చ్చారణముచే నామియొక్క స్వరూపస్వభావములెల్ల చిత్త
ఫలకమున నెట్లు ద్యోతకములగునో, అట్లే ప్రణవోచ్చార
ణముచే ప్రణవవాచ్యమగు పరమాత్మ సాధకుల హృదయ
కుహరమున స్ఫురించుచుండును. కావున అట్టి ప్రణవరూప
పవిత్ర చిహ్నముతో గూడిన పతాకము ముముక్షు లోక
మున కత్యాదరణీయమై యొప్పుచున్నది.

మంత్రములలోకెల్ల ప్రణవము అతిముఖ్యమైనది. అది
ప్రాణతుల్యమైనది. ప్రణవముతో జేరినపుడే, తక్కిన మంత్ర
ములకు చైతన్యము కలుగుచుండును. వేదములు, ఉపనిష
త్తులు, స్మృతులు, పురాణేతిహాసములు, వెయ్యేల సమస్త
శాస్త్రములు ప్రణవముయొక్క మహత్తరశక్తిని వేనోళ్ళ
శ్లాఘించుచున్నవి. ఉచ్చారణ మాత్రముచే నది మానవుని
పునీత మొనర్చుచున్నది. అర్థమననముచే మోక్షమును ప్రసా
దించుచున్నది.

"ప్రణవో ధనుః, శరోహ్యాత్మా బ్రహ్మతల్లక్ష్యముచ్యతే
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్,"

అని ఉపనిషద్వాక్యము. సాధకుడు ప్రణవమను ధనుస్సును
ధరించి, చిత్తమను బాణమును దానియందనుసంధించి, ఏకా
గ్రతతో గూడి, ఆ చిత్తరూప బాణమును బ్రహ్మయను

లక్ష్యముయొద్దకు జేర్చవలయును. 'అప్రమత్తేన' (పొరపాటు లేక) అని చెప్పుటవలన భగవచ్చింతనాపరుడు, ప్రణవధ్యానతత్పరుడు బహుజాగరూకుడై, దృశ్యసంకల్పము లెవ్వియులేక, ఏకాగ్రచిత్తము గలిగి యుండవలెనని స్పష్టమగుచున్నది. ఏలయనిన చిత్తము విక్షేపముతో గూడి యుండినచో, బహిర్ముఖవృత్తులందు చరించుచుండినచో, బ్రహ్మధ్యానము సరిగా జరుగదు. కావున విక్షేపరహితమగు చిత్తముగలవాడై సాధకుడు ప్రణవమును ఊతగా గైకొని తద్వాచ్యమగు పరబ్రహ్మమును సతతము ధ్యానించుచు, భ్రమరకీటన్యాయము పగిది, తదాకారాకారితుడై తైవమయుడై చెన్నొందవలెను. ఇదియే ప్రణవధ్యాన ఫలము. అయితే,

'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్'

అని గీతయందు భగవానుడు హెచ్చరించుటవలన ప్రణవము (ఓంకారము) యొక్క ఉచ్చారణ మాత్రము చాలదనియు, దాని భావమును గూడ (లక్ష్యార్థమగు పరబ్రహ్మమును) హృదయమున మఱల మఱల చింతన జేయవలెననియు స్పష్టమగుచున్నది. మంత్రమును మాత్ర ముచ్చరించి మంత్రార్థమును భావించనిచో ఆ మంత్రమువలన పూర్ణఫలము కలుగనేరదు. ఫిరంగిలో మందుమాత్రము కూరి గుండులేక కాల్చినచో శబ్దము వచ్చునే కాని లక్ష్యము నది ఛేదింపదు. అట్లే ప్రణవమున్ను అర్థయుక్తముగ మననము చేయబడిననే బ్రహ్మమను లక్ష్యమును చేర్చగలదు.

అయితే ప్రణవార్థమేమి? దీని నొకింత తెలిసికొన లసి యున్నది. 'ఓమ్' అను శబ్దము 'అ'కార 'ఉ'కార 'మ'కారములను శబ్దముల సంయోగముచే (అ+ఉ+మ) ర్పడినది. జాగత్స్వప్నసుషుప్తులు, భూతభవిష్యద్వర్త మానములు, విశ్వతైజస ప్రాజ్ఞులు, సత్త్వరజస్తమోగుణ ములు మున్నగువానిని (దృశ్యజగత్తును) అకార, ఉకార, మకారములు సూచించును. అ దృశ్యజగత్తంతటిలోను అను స్యూతమై వ్యాపించి, దాని కాధారభూతమై, దాని కతీత ముగ అర్ధమాత్రాస్వరూపమై సర్వసాక్షియై విలసిల్లు పర మాత్మయే తానని సాధకుడు ప్రణవజపము చేయునపుడు భావన చేయవలెను. ప్రణవధ్యానమనగా నిదియే. ఈ ప్రకారముగ మంత్రార్థమును చక్కగ భావించుచు, ముము క్షువు ఆ ప్రణవరూప దివ్యమంత్ర ప్రభావముచే పునీతుడై, దివ్యతేజోవిలసితుడై, పరమానందమయుడై చెన్నొందును.

ఇట్టి మహోన్నత పరబ్రహ్మరూపలక్ష్యమును సంస్ఫు రింపజేయు ప్రణవచిహ్నముతోగూడిన పతాకమును ధరించి, ముముక్షువు పరమార్థక్షేత్రమున శీఘ్రముగ పురోగమనము సల్పుచు, సాధనద్వారా మాయారూప శత్రువును నిర్జించి, విజయోత్సాహముతో ఆత్మసామ్రాజ్యాధిపత్యమును జేబట్టి బ్రహ్మానందమయుడై విలసిల్లవలెను. నిరంతర సాధనద్వారా అట్టి మహోన్నతస్థితిని బడయవలెను.

## ఆధ్యాత్మిక కార్యక్రమము

## (Spiritual Programme)

జీవుడు కడతేరుటకై సాధన అవసరము. క్రమశిక్షణ అవసరము. ఒకానొక కార్యక్రమము అవసరము. ఆ కార్యక్రమమేదియో భగవానుడే గీతయందు సెలవిచ్చియున్నాడు. సాధకు లద్దానిని తప్పక తెలిసికొనవలసియున్నది.

మచ్చిత్తా మద్గత ప్రాణా బోధయన్తః పరస్పరమ్
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ. (10-9)

(1) దైవభావముతో గూడి భగవంతుని భజించుట.

(2) చిత్తమును భగవంతునియందే సంలగ్న మొనర్చుట.

(3) భగవంతునిగూర్చియే పరస్పరము బోధించుకొనుట, సంభాషించుట.

(4) దైనమునందే సంతుష్టినొందుట, క్రీడించుట, ఆత్మానందము నొందుట.

విజ్ఞులయొక్క కార్యక్రమ మీ విధముగా నుండును. పరమాత్మయొక్క మహిమను ముందుగ తెలిసికొనినచో ఆతనియందు భక్తి లెస్సగ ఏర్పడగలదు. ఒక వస్తువుయొక్క గొప్పతనమును మున్ముందు గ్రహింపనిచో దానియందు జనుల కాసక్తి యెట్లేర్పడగలదు? కాబట్టి భగవానుని విశ్వాధారత్వము, ఆద్యంతరహితత్వము, జన్మరాహిత్యము

కున్నగు మహిమలను ముందుగా తెలిసికొని ఆతనియొక్క నిత్యశుద్ధ బుద్ధ ముక్తస్వరూపమును బాగుగ యెఱిగినచో,

"సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః." (10-7)

అనునట్లు నిశ్చల మనస్సుతో నతడు భగవానుని సేవించును, ఇట ఏ సంశయమున్ను లేదు. ఇక్కాలమున ప్రపంచములో నాస్తికు లెవరైన యుండినచో, భగవతత్త్వమును, భగవత్స్వరూపమును బాగుగ అవగాహనము చేసికొనకపోవుటయే అందులకు కారణము. ఏ క్షణమున వారద్దానిని తెలిసికొందురో. వెంటనే అస్తికులుగ, మహాభక్తులుగ మారిపోవుదురు. కావున వస్తుస్వరూపములు మున్ముందు చక్కగ తెలిసికొనవలయును. గ్రుడ్డిగ నమ్ముడని యెవరును చెప్పరు. చెప్పినను ఈ విజ్ఞానయుగమున ఆ వాక్యమునకు విలువే యుండదు. దైవత్వము హేతువాదము (Logic) నకు విరుద్ధము కాదు. పైపెచ్చు దానిని పోషించి ఇంకను పైకిపోవును. కనుకనే దానిని మనోబుద్ధ్యతీతస్థితి (Super-Conscious State) అని పేర్కొనిరి. మనస్సు పవిత్రముగ నున్ననే జనులు దాని నర్థము చేసికొనగలరు. కేవలము తెలివి మాత్రము చాలదు. కావున సర్వేశ్వరునియొక్క అనంత విభూతిని, మహిమాతిశయమునుగూర్చి తెలిసికొని తుచ్ఛములగు ప్రాపంచిక విషయభోగములనుండి మనస్సును మరలించి ఆ దైవమునందే ప్రవేశపెట్టవలెను,

మనస్సు ఊరకనున్నచో ఏవియో దుష్టచింతనలు చేయుచుండును. కావున ఏదియో యొక దైనకార్యమును

దానికి ఒప్పగించవలెను. భగవంతుని జగత్ప్రభువుగా గుర్తించి దైవభావముతో నాతనిని భజించవలెను, సేవించవలెను.

"భావసమన్వితాః" అని గీతయందు చెప్పబడుటవలన అర్థరహితమగు జపముగాని, భావవర్జితమగు చింతనగాని ఎక్కువ ప్రయోజనకరముగ నుండదని తెలియుచున్నది. కావున భావయుక్తముగ చింతన చేయవలెను. మరియు మనస్సు నిరంతరము పారమార్థిక విషయములందే నిమగ్నమై యున్నచో, ఇక దైవేతర వస్తువులనుగూర్చి తలంచుటకే దానికి అవకాశముండదు. కనుక కొంతసేపు పూజలొనర్చి పిమ్మట జపముచేసి, అ పిదప ధ్యానము సల్పి తదుపరి భక్తులందరుకాని లేక ఒకరిద్దరుకాని చేరి పరస్పరము భగవత్కథలనుగూర్చికాని, ఆత్మతత్త్వమునుగూర్చికాని సంభాషించుకొనుచు ఒకరికొకరు బోధించుకొనుచు నుండినచో, ఈ ప్రకారము సంతత సావధానులై యున్నచో, ఇక మాయ ఎట్లు ప్రవేశించగలదు? చేతిలో నిరంతరము దీపమున్నచో చీకటి ఏకాలమందును దరికి చేర సాహసింపనట్లు హృదయమందు అఖండభావన గలిగియున్నచో అజ్ఞానము ప్రవేశించుటకుగాని జీవుని బాధించుటకుగాని అవకాశమే యుండదు.

"తవ సావహితం చిత్తం కామః కవలయిష్యతి
సావధానస్య చిత్తస్య పిశాచః కిం కరిష్యతి." (వసిష్ఠగీత)

"ఓ రామచంద్రా! అజాగ్రత్తగ నున్నచో నీ చిత్తమును కామపిశాచము మ్రింగివేయగలదు. జాగ్రత్తగ

నున్నచో (నిరంతర ఆత్మచింతన గలిగియున్నచో) ఇక నిన్నది ఏమి చేయగలదు?'' అని శ్రీ వసిష్ఠమునీంద్రుడు శ్రీరామచంద్రునకు బోధించెను.

ప్రాపంచిక మనుజునియొక్క చిత్తము అహర్నిశము ఇంద్రియార్థముల ననుభవించుటయందు, భోగసంపాదనము నందు, నశ్వరవస్తుసేకరణమునందు గడచిపోవును. ప్రపంచము అనిత్యమని, దైవము (ఆత్మ) నిత్యమని తెలియక దృశ్యపదార్థములందే అతడు సదా రమించుచుండును. మేడిపండునందు పురుగులు పుట్టి గిట్టినట్లు ఈ బ్రహ్మాండమను ఉదుంబరఫలమున ఇట్టి జీవరాసులు అనేకములు పుట్టుచు గిట్టుచున్నవి. వానికి పుణ్యము లేదు, పురుషార్థము లేదు. ఎంత ఆసక్తితో వారు భౌతిక ప్రపంచమున, భౌతిక కార్యములందు, వ్యవహారములందు మెలంగుచుందురో అంత ఆసక్తితో భగవద్భక్తులు; జ్ఞానులగు మహనీయులు పరమార్థకార్యములందు మెలంగుచుందురు. ఒక క్షణమైనను మనస్సునకు విషయాదులను చింతించుటకు వారు అవకాశ మివ్వరు.

పూర్వము దయానందసరస్వతీస్వాములవారు ఆర్య సమాజసిద్ధాంతములను ఒకచోట బోధించుచుండిరి. బోధ అంతయు పూర్తిఅయిన వెనుక ఒక వ్యక్తి యాతని సన్నిధికి వచ్చి ''మహాత్మా! మేము బక్కపలుచగా నున్నప్పటికి కామవికారములు మమ్ములను మిక్కుటముగ బాధించుచున్నవి. తాము బలిష్ఠులుగా నున్నారు. తమరిని అవి ఏవియు బాధించుటలేదా?'' అని ప్రశ్నించెను. అందులకు

ఆ మహర్షి "ఆ వికారము లెట్లుండునో చింతనచేయుటకై నను నాకు తీరిక లేదు. నేను నిరంతరము దైవకార్యముల యందు, పరోపకార క్రియలందు నిమగ్నుడనై యుందును'- అని ప్రత్యుత్తరమిచ్చెనట! కావున సాధకుడు గీతయందు తెలిపినలాగున పూజాదులందో, జపమునందో, ధ్యానము నందో, సేవయందో, దైవకథాశ్రవణమునందో, దైవసంభాషణమునందో, చిత్తమును నియుక్తమొనర్చి దైవేతరములగు అసురచింతలు జొరబడుట కవకాశమే లేకుండ జేయవలెను. మహాత్ముల జీవితములను పరికించినచో గీతోక్తమగు ఈ ధర్మమును వారెట్లు కార్యాన్వితమొనర్చిరో తేటతెల్లము కాగలదు. మహనీయుల ఈ యాచరణను, ఈ కార్యక్రమమును సర్వులు అనుసరించి, సమయమును వ్యర్థము చేయక ఆధ్యాత్మిక పరిశ్రమచే నిరంతరము దైవసాన్నిధ్యశ్రీని అనుభవించుచుండవలెను.

పరిశ్రమ చేయనిదే ఏ కార్యమున్ను సాధింపబడదు. అసలీ బ్రహ్మాండమంతయును ఒక గొప్ప పారిశ్రామిక రంగమని యెఱుగవలయును. ఈశ్వరుడు అద్దాని సంచాలకుడు. ఎన్నియో విశాలములైన నక్షత్రములు, గ్రహములు గోళములు ఆ ప్రభువుయొక్క ఆదేశము ననుసరించి భూతభవిష్యద్వర్తమాన కాలములందు ఒక్కక్షణమైనను వ్యత్యాసము లేక నియమము తప్పక సంచరించుచున్నవి. కోట్లకొలది జీవరాసులయొక్క శరీరములందు ఫ్యాక్టరీలయందువలె అహర్నిశము, రక్తప్రవాహా, ప్రాణవాయుసంచార, నాడీచల

నాదిరూపములైన వివిధక్రియలు మానవుని స్థూలనేత్రములకు అవిదితములై జరుగుచున్నవి. జడమైన యంత్రములను మనుజు డెట్లు చలింపజేయుచున్నాడో, అట్లే జడమైన ఈ దేహాది దృశ్యప్రపంచమునంతను ఈశ్వరుడు శక్తివంతముగ చేయు చున్నాడు. అధిష్ఠానమగు చైతన్యము (పరమాత్మ) లేనిచో జడమగు ఈ ప్రకృతి ఏమియును చేయజాలదు.

కాబట్టి భౌతికశక్తియొక్క అభివృద్ధితోపాటు దానికి అధారభూతమైన ఆధ్యాత్మికశక్తినిగూడ పెంపొందించుకొన వలసి యుండును. దాని ఉన్నతికిగూడ విశేషకృషి సలుప వలసియుండును. మనుజునకు ఎన్ని భౌతిక సంపద లున్నప్ప టికిని, ఎన్ని ప్రాపంచిక శక్తులను అతడు వశము చేసికొని నప్పటికిని, వెయ్యేల విశ్వమున కంతకును ఏకచ్ఛత్రాధి పత్యమును సంపాదించుకొనినప్పటికిని, దైవానుగ్రహము, దైవశక్తి, దైవసంపద (Divine Qualities) ఒకింతైనను లేనిచో అతడు పూర్ణశాంతిని ఎన్నడును బడయజాలడు.

ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥

గిరగిర తిరుగుచున్న యంత్రముయొక్క చక్రముపై తగుల్కొనియున్న పురుగు ఏలాగున ఆ చక్రముతోపాటు అతివేగముగ తిరుగుచుండునో, అలాగున సంసారచక్రమున తగుల్కొనియున్న జీవులున్ను ఈశ్వరాధీనమైన మాయ యొక్క ప్రాబల్యముచే జననమరణరూపక్లేశములందు తిరు గాడుచున్నాడు. అయితే దానినుండి విముక్తి నొందుటెట్లు?

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్।

ఈ బ్రహ్మాండరూపమహాయంత్రమును త్రిప్పుచున్నట్టి ఆ భగవానుని శరణుబొందుటయే ఏకైకమార్గము. అతని యనుగ్రహముచే పరమశాంతిరూపస్థానము లభించగలదు.

కావున ఈ భౌతికయుగమున మనుజుడు తన శక్తి సామర్థ్యములచే ఎన్ని యంత్రములను, తంత్రములను కనిపెట్టి నప్పటికిని తాను స్వయముగనే ఒక గొప్పయంత్రమున తగు లొక్కొనియున్నాడనియు అద్దానిని త్రిప్పువాడు ఈశ్వరుడనియు మఱువరాదు. ఈ రీతిగ భౌతికశక్తులన్నిటికిని ఆధ్యాత్మికశక్తి పునాదియై యున్నది. పునాది దిట్టముగ లేనిచో ఎంత గొప్ప భవనమైనను ఏదెరొక సమయమున కూలిపోవునట్లు నైతిక ఆధ్యాత్మిక ఔన్నత్యమును ఉపేక్షించి కేవలము భౌతికసంపదలనే అభివృద్ధిపరచుకొనుచు పోయి నచో పూర్ణశాంతి, పూర్ణసుఖము జీవునకు ఎన్నటికిని కలుగ నేరదు. ఇది ముమ్మాటికిని నిక్కము! కనుకనే అఖండ ప్రజ్ఞానిధియగు శ్రీ శంకరభగవత్పాదాచార్యులవారు ఇట్లు నుడివియున్నారు—

యశో మే గతం దిక్షు దానప్రతాపా
జ్జగద్వస్తు సర్వం కరే యత్ప్రసాదాత్
మహేశాంఘ్రి పద్మే మనశ్చే న్న లగ్నం
తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్.

గొప్ప కీర్తిని బడసి జగత్తునందలి సమస్తవస్తువులను అరచేతియం దుంచుకొనినప్పటికిని, భగవంతుని పాదారవిందములందు మన చిత్తము లగ్నము కానిచో ఆ వైభవము, అ సంపద, అ యశస్సు ఎందుకును కొరగానిదియే యగునని భావము.

మానసికశక్తి ఒక 'టార్చిలైటు' వంటిది. దానిని బాహ్యముగ ప్రసరింపజేసినచో ప్రకృతియందు నిగూఢములైయున్న అనేక గొప్పగొప్ప రహస్యములు బయల్పడగలవు. అట్లే దానిని అంతర్ముఖముగ త్రిప్పినచో, అవగా ఆత్మపరిశోధన (self introspection) గావించినచో అమూల్యమైన దైవభండారమంతయు సాక్షాత్కరింపబడగలదు. ఇదికూడ ఒక గొప్ప పరిశ్రమయే యగును.

పూర్వకాలమందలి ఋషులందరున్ను ఆధునిక యుగమందలి మహాప్రవక్తలందరున్ను ఇట్టి పరిశ్రమచేతనే దైవశక్తి సమన్వితులైరి. ఏ సంఘముగాని, ఏ మతముగాని, ఏ దేశముగాని సర్వశక్తులకు ఆధారభూతమైన ఇట్టి ఆధ్యాత్మిక పరిశ్రమ చేయనిచో దీర్ఘకాలము అది వర్ధిల్లజాలదు. అచిరకాలములో పతనమైపోవును. కావుననే వివేకానందులు ఇట్లు వ్రాక్రుచ్చియున్నారు—

"India is immortal if she persists in her search for God" అనగా ఎంతవరకు భారతదేశము దైవమును గూర్చిన తన యన్వేషణమును వదలక యుండునో అంతవరకు దానికి పతనమే యుండదని భావము. ఆధ్యాత్మికశక్తి

సన్నగిల్లిన జాతిగాని, సంఘముగాని, దేశముగాని క్రమముగ నిర్జీవమై పోవును. ఏ ఒకింతయో అధ్యాత్మిక గంధము అచ టచట వెలయుచుండుట వలననే భారతదేశము నేటికిని తన శాంతి సందేశమును లోకమునకు చాట గల్గుచున్నది.

లోకము లన్నిటిని క్షణములో జయింపవచ్చును. పరమాణుశక్తి మొదలగు భౌతికశక్తులన్నిటిని తృటిలో స్వాధీనపరచుకొనవచ్చును. రాజాధిరాజు లందరిని దాసాను దాసులుగ చేసికొనవచ్చును. కాని ఎన్ని భౌతిక సామర్థ్యము లున్నను తన ఇంద్రియములను తాను స్వాధీనపరచుకొని నచో, తన అంతశ్శత్రువులగు కామక్రోధాదులను జయింప నిచో తన యథార్థరూపమగు ఆత్మ (దైవము) యొక్క పరి జ్ఞానము కలిగియుండనిచో ఆ బాహ్యపరిశ్రమలు అన్నియును క్షణిక సుఖదాయకములే యగును గాని అవిచ్ఛిన్నపూర్ణా నందమునకు హేతువు లెన్నటికిని కాజాలవు.

కాబట్టి బాహ్యపరిశ్రమలతోబాటు అంతరపరిశోధ నలు (Spiritual Exercises) కూడ చేయవలెను. భౌతిక వస్తుజాలముపైని ఏకాగ్రతతోబాటు (అభ్యంతర) దైవము పైని ఏకాగ్రతనుగూడ అలవరచుకొనవలెను. పూర్ణశాంతికి సుఖమునకు ఇదియే ఏకైక మార్గము.

అధ్యాత్మ విద్య ఆచరణావిద్య (Practical science) శాస్త్రములు ప్రతిపాదించిన సిద్ధాంతములన్నియు ఆచరణా యోగ్యములే అయియున్నవి. వేదములు బోధించిన ప్రతి

విషయమును ఆచరణయందుంచుకొని, చక్కగా అనుష్ఠించి ఋజువు చేసికొనవచ్చును. ఆ ప్రకారముగా అనుష్ఠించవలె నని యే వేదములు శాసించుచున్నవి. వేదవేత్తలును ఘోషించుచున్నారు. రానురాను అట్టి అనుష్ఠానము లోపించినందువలననే ఆత్మశక్తి, దైవశక్తి జనులందు చక్కగా అభివ్యక్తము కాకయున్నది. సాధనచే అట్టి పరిస్థితి చక్కబడి జనులందు నైతిక, ఆధ్యాత్మిక శక్తులు పునరుద్దీపింపబడగలవు.

సాధన లేనిచో భౌతికశక్తులుకూడ లభింపనేరవు. ఇక ఆధ్యాత్మికశక్తులను గురించి వేరుగా చెప్పవలయునా?

అనగననగ రాగ మతిశయిల్లుచునుండు
తినగతినగ వేము తియ్యనుండు
సాధనమున పనులు సమకూరు ధరలోన
విశ్వదాభిరామ వినుర వేమ.

అను వేమనపద్యము చూచుటకు చిన్నదిగా కన్పించినను జనులకు విశాలమైన బోధను చేయుచున్నది. ప్రతిదినము నియమముతప్పక కొంతకొంత సాధనచేయుచు రాగా, అచిర కాలములో జీవుడు అధ్యాత్మశిఖరములకు ఎగబ్రాకగలడు. మోక్షసౌధమును సులభముగా నధిరోహించగలడు. కాబట్టి సాధనను ఎవరును వదలరాదు. భోజనమును నియమము తప్పక ఏ ప్రకారము ప్రతిదినము గ్రహించుచున్నారో, ఆ ప్రకారముగా ప్రార్థనా, జప, ధ్యాన, విచారణాదులను అను దినము ఒకింతైనను ఆచరించి ఆ పిదప మాత్రమే భోజనాది

వ్యవహారములను సాగించునట్లు నియమ మేర్పఱచుకొనవలెను. ఆ నియమమును ఏ కాలమందును, ఎట్టి అవాంతర పరిస్థితియందైనను సడలింపరాదు. 'న శ్రేయో నియమం వినా'-అనునట్లు నియమబద్ధమైన జీవితము లేనివాడు పశుతుల్యుడే యగును.

ఏ ప్రకారము ప్రభుత్వమువారు పంచవర్ష ప్రణాళిక, సప్తవర్ష ప్రణాళిక మున్నగునవి ఏర్పాటుచేసి, ఆ గడువు లోపల గొప్పగొప్ప కార్యముల నెట్లు సాధించుచున్నారో, ఆ ప్రకారమే ముముక్షువగువాడు అధ్యాత్మరంగమున సాధనకు సంబంధించిన కొన్ని ప్రణాళికలను తానే స్వయముగ రూపొందించుకొని, లేక, సద్గురువులయొద్ద తెలిసికొని తత్ప్రకారము అనుష్ఠించి చిత్తశుద్ధియందు మహత్తర పరిణామమును బొందవలెను. లేనిచో జీవితము నిరుపయోగమై పోవును. పశువు పశువుగా పుట్టి పశువుగా చనిపోవును. కాని మానవుడు అట్లు కారాదు. మానవుడు పుట్టినను మాధవుడుగా పరిణతిని బొందవలెను. అనవరత సాధనచే అట్టి స్థితి చేకూరగలదు. ప్రతిరోజు చేయు సాధన ఎంత చిన్నదైనప్పటికిని ఒకటి రెండు సంవత్సరములలో గొప్ప మార్పు తీసికొని రాగలదు. కఠినమైన రాతి నేలమీద చీమలు రోజూ నడచినచో దానిపై ఒకదారి ఏర్పడగలదు. బావిగట్టుపై రోజూ నీళ్ళకడవను పెట్టుచుండినచో ఒకటి రెండు సంవత్సరములకు రాతిపై కుదురు ఏర్పడగలదు. దుర్బలమగు పిపీలిక, అల్పమగు ఘటము, దుర్భేద్యమగు శిలను.

విషయమును ఆచరణయందుంచుకొని, చక్కగా అనుష్ఠించి ఋజువు చేసికొనవచ్చును. ఆ ప్రకారముగా అనుష్ఠించవలె ననియే వేదములు శాసించుచున్నవి. వేదవేత్తలును ఘోషించుచున్నారు. రానురాను అట్టి అనుష్ఠానము లోపించినందువలననే ఆత్మశక్తి, దైవశక్తి జనులందు చక్కగా అభివ్యక్తము కాకయున్నది. సాధనచే అట్టి పరిస్థితి చక్కబడి జనులందు నైతిక, ఆధ్యాత్మిక శక్తులు పునరుద్దీపింపబడగలవు.

సాధన లేనిచో భౌతికశక్తులుకూడ లభింపనేరవు. ఇక ఆధ్యాత్మికశక్తులను గురించి వేఱుగా చెప్పవలయునా?

అనగననగ రాగ మతిశయిల్లుచునుండు
తినగతినగ వేము తియ్యనుండు
సాధనమున పనులు సమకూరు ధరలోన
విశ్వదాభిరామ వినుర వేమ.

అను వేమనపద్యము చూచుటకు చిన్నదిగా కన్పించినను జనులకు విశాలమైన బోధను చేయుచున్నది. ప్రతిదినము నియమముతప్పక కొంతకొంత సాధనచేయుచు రాగా, అచిర కాలములో జీవుడు అధ్యాత్మశిఖరములకు ఎగబ్రాకగలడు. మోక్షసౌధమును సులభముగా నధిరోహించగలడు. కాబట్టి సాధనను ఎవరును వదలరాదు. భోజనమును నియమము తప్పక ఏ ప్రకారము ప్రతిదినము గ్రహించుచున్నారో, ఆ ప్రకారముగా ప్రార్థనా, జప, ధ్యాన, విచారణాదులను అనుదినము ఒకింతైనను ఆచరించి ఆ పిదప మాత్రమే భోజనాది

వ్యవహారములను ,గావించునట్లు నియమ మేర్పఱచుకొన వలెను. ఆ నియమమును ఏ కాలమందును, ఎట్టి అవాంతర పరిస్థితియందైనను సడలింపరాదు. 'న శ్రేయో నియమం వినా'-అనునట్లు నియమబద్ధమైన జీవితము లేనివాడు పశు తుల్యుడే యగును.

ఏ ప్రకారము ప్రభుత్వమువారు పంచవర్ష ప్రణాళిక, సప్తవర్ష ప్రణాళిక మున్నగునవి ఏర్పాటుచేసి, ఆ గడువు లోపల గొప్పగొప్ప కార్యముల నెట్లు సాధించుచున్నారో, ఆ ప్రకారమే ముముక్షువగువాడు అధ్యాత్మరంగమున సాధనకు సంబంధించిన కొన్ని ప్రణాళికలను తానే స్వయముగ రూపొందించుకొని, లేక, సద్గురువులయొద్ద తెలిసికొని తత్ప్రకారము అనుష్ఠించి చిత్తశుద్ధియందు మహత్తర పరిణామమును బొందవలెను. లేనిచో జీవితము నిరుపయోగమై పోవును. పశువు పశువుగా పుట్టి పశువుగా చనిపోవును. కాని మానవుడు అట్లు కారాదు. మానవుడు పుట్టినను మాధవుడుగా పరిణతిని బొందవలెను. అనవరత సాధనచే అట్టి స్థితి చేకూరగలదు. ప్రతిరోజు చేయు సాధన ఎంత చిన్నదైనప్పటికిని ఒకటి రెండు సంవత్సరములలో గొప్ప మార్పు తీసికొని రాగలదు. కఠినమైన రాతినేలమీద చీమలు రోజూ నడచినచో దానిపై ఒకదారి ఏర్పడగలదు. బావిగట్టుపై రోజూ నీళ్ళకడవను పెట్టుచుండినచో ఒకటి రెండు సంవత్సరములకు రాతిపై కుదురు ఏర్పడగలదు. దుర్బల మగు పిపీలిక, అల్పమగు ఘటము, దుర్భేద్యమగు శిలను.

నేల భేదింప గలుగుచున్నది? సాధనచే, అనవరతనిష్ఠచే, అనుదినవ్రతపరిపాలనచే ఆ ప్రకారమే జీవుడు జప, ప్రార్థనా, పూజా, అధ్యయనాదులందు, యమనియమాద్యనుష్ఠానము లందు కొన్ని నియమము లేర్పరచుకొని, తదనుగుణ్యముగ వ్యవహరించుచుండినచో అచిరకాలములో ఆశ్చర్యకరమైన సత్పరిణామమును బొందగలడు.

'మాయ' పట్టి మాటలచే లొంగునది కాదు. దుర్భేద్యమైన మాయను, జన్మాంతర దుస్సంస్కారయుత మైన మలినమనస్సును లొంగదీసికొనుట సామాన్యమైన పని కాదు. 'మమ మాయా దురత్యయా' అని గీతాచార్యుడు మాయయొక్క దుస్తరత్వ, దుర్నిగ్రహత్వములను గూర్చి చెప్పనే చెప్పెను. కావున 'సర్కస్'లో భయంకరమగు వ్యాఘ్రాది హింస్రజంతువులను యజమాని పెక్కు సాధనోపా యములచే క్రమముగ వశపరచుకొని ఆడించునట్లు, ఈమన స్సునుగూడ ముముక్షువు నియమములచే, వ్రతములచే, సాధ నలచే నెమ్మదిగ లోబఱచుకొనవలెను. ఇది ఒక్క రోజులో పూర్తియగు పని కాదు. 'శనైః శనైః' అనునట్లు మెల్ల మెల్లగా దానిని సాధనచే వశపఱచుకొనవలెను.

మనస్సును లొంగదీసికొనుటకు ఇతరులు సాధనోపా యములను మాత్రము వచించెదరే కాని చివఱకు వానిని సాధించవలసినది తానే అయియున్నాడు. గురువులు, శాస్త్ర ములు, భగవానుడు దారి చూపుదురే కాని నడవవలసినది తానే యగును. అర్జునుడటువంటి యోధాగ్రేసరుడు, శ్రీ

కృష్ణునకు సమీపబంధువు, సఖుడు, 'నామనస్సు సరిగా నిలుచుటలేదు మహానుభావా!' అని భగవానునితో మొరపెట్టుకొనినపుడు, 'నేనేమి చేతును అర్జునా! నీవే అభ్యాసముచే దానిని లొంగదీసికొనుము' అనియే అతడు సమాధాన మిచ్చియుండుట గమనించదగినది. 'వైరాగ్యముచేతను, సాధనచేతను నీవే స్వయముగ దానిని వశమునకు తెచ్చుకొనుము' అనియే భగవాను డాదేశించెను. ఈ సంఘటనను ముముక్షువులు బాగుగ జ్ఞప్తియుందుంచుకొని, పెద్దలయొక్క, గురువుయొక్క, పరమాత్మయొక్క అనుగ్రహమును సంపాదించుకొనుచు స్వయము తానే సాధనాతిశయముచే తన యంతఃకరణమును అరిషడ్వర్గవిముక్తముగ నొనర్చుకొనవలెను. అంతియేకాని, 'వాచా' వేదాంతముతో సంతృప్తిపడరాదు. 'వాచా' వివేకము అవివేకముతో సమానమని వసిష్ఠుడు పూర్వము శ్రీరామచంద్రున కుపదేశించియుండెను.

కాబట్టి సాధనను ఏ కాలమందును ముముక్షువు వదలరాదు. ఒక చిన్న దీపమును చేతబట్టుకొని నడచుచున్నచో మైళ్ళకొలది గాఢాంధకారముకూడ ప్రకాశయుతమై పాంథునకు దారి చూపగలదు. ఒక చిన్న తెప్పచే మహా సముద్రమునుగూడ దాటివేయవచ్చును. అట్లే ఒక చిన్న జపము, ధ్యానము, పూజ, ప్రార్థన, పారాయణము మున్నగువానిచే క్రమముగ జీవుని యంతఃకరణము శుద్ధపడ, అపార సంసార పారావారము అవలీలగ దాటివేయబడుచున్నది. అన్నిటికి శ్రద్ధ అవసరము. పట్టుదల అవసరము. సహనశక్తి అవస

రము. ఒక్కరోజైనను సాధనను విడవగూడదను ధీశక్తి అవసరము. ఇవియున్నచో ఇక జీవున కేమి కొదువ? అచిర కాలములో అతడు నారాయణుడై చెన్నొందగలడు. భువిపై అవతరించిన బ్రహ్మాండనాథుడై విలసిల్లగలడు. అట్టి మహో న్నతస్థితిని ఏల సాధించరాదు? కావున సోమరితనమును, అలసత్వమును విడనాడి పరమార్థసాధనను పట్టుదలతో అచరించవలెను.

అధ్యాత్మికోపన్యాసములు వినునపుడుగాని, పురాణ శ్రవణము చేయునపుడుగాని, హరికథల నాలకించునపుడు గాని జనులకు సహజముగ వైరాగ్యోద్దీపనము, భక్తిపర వశత్వము కలుగుచుండును. కాని ఎక్కువమంది కది పాల పొంగువలె ప్రాదుర్భవించుచుండును. వక్త తన భాషణము ముగించుసరికి శ్రోత తన వైరాగ్యమునుకూడ కట్టిపెట్టు చుండును. ఉపన్యాసస్థలము వదలి యింటికి వెళ్లువరకైనను దానికి అయుర్దాయముండదు. ఎవరో చెప్పినట్లు గురువిచ్చిన దానిని గురువుకే ఒప్పగించినట్లుండును. దీనికే పురాణ వైరాగ్యమని పేరు. ఇట్టి తాత్కాలికావేశములు సాధకులగు ముముక్షువులకు తగవు. ఏ ఒకింతభక్తి, విరాగము మహా త్ముల వాక్యములను వినుటవలన హృదయమున జనించినను వానిని కడు జాగ్రతతో కాపాడుకొని, వృద్ధినొందించి జన్మ సాఫల్యము నొందవలెను. అధ్యాత్మికరంగములో సోమరితన మునకు సీమాత్రమున్ను చోటీయరాదు. పరమార్థసాధన నిప్పులతోటి చెర్లాటవంటిది, బెబ్బులితోటి యుద్ధమువంటిది.

ఏ ఒకింత అజాగ్రత్త చూపినను పొంచియున్న మాయ మాంతముగ మీదపడి జీవుని భవసాగరమున ముంచి వేయును.

"ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం న కర్తవ్యః కదాచన
ప్రమాదో మృత్యురిత్యాహ భగవాన్ బ్రహ్మణస్సుతః.
(వివేక చూడామణి)

"బ్రహ్మనిష్ఠయందు, తత్త్వవిచారణయందు అధ్యాత్మిక సాధనలయందు, మందత్వము, సోమరితనము పనికిరావు, సోమరితనమే మరణమని భగవంతుడగు సనత్కుమారుడు పల్కెను." అని శ్రీ శంకరాచార్యులవారు వాక్రుచ్చిరి, కాబట్టి ముముక్షువు తన లక్ష్యమగు పరమాత్మసాక్షాత్కారము చేకూరువరకును వెనుకచూపులేక వైరాగ్యాది సాధనలను తీవ్రముగ అభ్యసించుచుండవలెను. "ఇంకను చాల సమయమున్నదిలే" అని ఏమరుపాటు కల్గియుండరాదు.

భారతము శాంతిపర్వమునందు భీష్ముడు ధర్మరాజునకు ఒక చక్కటి ఇతిహాసమును బోధించెను. ఒక చిన్న చెఱువు కలదు. దానిలో జలము పరిమితముగ నుండెను. అందు మూడు చేపలు కాపురముండెను. ఒకదాని పేరు దీర్ఘదర్శి, ఇంకొక దాని పేరు ప్రాప్తకాలజ్ఞుడు, వేఱొక దాని పేరు దీర్ఘసూత్రి. ఇట్లీ మూడును పరస్పరము ఐకమత్యముగ చాలకాలము ఆ చెఱువులో నివసించుచుండెను. ఇట్లుండ గ్రీష్మర్తు వేతెంచెను. మార్తాండుని ప్రచండతాప్రభావముచే

దిక్కులెల్లను కంపించిపోవుచుండెను. ఎల్లెడల ఉష్ణవాయువులు హోరున వీచుచుండెను. బావులలోను చెరువులలోను నదుల లోను నీరు ఇంకిపోవుచుండెను. అత్తఱి దీర్ఘదర్శియను చేప తక్కిన రెండు చేపలను పిలిచి "సోదరులారా! కాలవిపర్యయముచే మన చెరువులోని నీరు క్రమక్రమముగ తగ్గిపోవు చున్నది. పూర్తిగ తగ్గిపోక పూర్వమే, మనము ముప్పురము సమీపముననున్న బ్రహ్మాండమైన చెఱువులో ప్రవేశించెదము. అందు నీ రెన్నడును తరుగదు. ఏ పనియైనను వేళకు చేసినపుడే శోభించును. కాబట్టి త్వరపడుడు. అలస్యముచేసినచో రేపు జాలరులు వచ్చి వలలుపన్ని మనలను యమసదనమునకు పంపగలరు" అని బోధించెను. అద్దానిహితవును విని రెండవదియగు ప్రాప్తకాలజ్ఞుడు "నీవు చెప్పినది చాల బాగుగ నున్నది. అయినను ఇంత తొందర యేల? నెమ్మదిగ పోవచ్చును. లేక, జాలరివాడు వలవేసి నపుడు అందులో తగుల్కొనినచో మన తీక్ష్ణదంతావళులచే వలను కొరికి పారిపోనచ్చును" అని నుడివెను. మూడవది యగు దీర్ఘసూత్రి "మీ ఇద్దరికిని వెఱ్ఱిపట్టినది. కనుకనే ఇట్టి చాదస్తపు వచనములను పల్కుచున్నారు. నీరు ఇంకుట ఏమి? జాలరివాడు వచ్చుట ఏమి? వల పన్నుట ఏమి? మనము తగుల్కొనుట ఏమి? అంతయు బూటకము. అట్లెన్నడును సంభవింపదు. ఒకవేళ సంభవించినచో అప్పుడు చూచుకొనెదములే" అని దబాయించెను. "వినని వారితో మన కేమి పొత్తు, వారి కర్మ వారిది" అని నిశ్చయించుకొని

మొదటి చేప నాటిరేయి మెల్లగ చెరువును వీడి గంతులు వేసికొనుచు ప్రక్కనున్న పెద్ద మడుగులోనికి దూకెను. మరుసటిరోజు అనుకొనిన ప్రకారము జాలరివాడు వలగైకొని యచ్చోటికి వచ్చెను. రెండవ చేప వలలో తగుల్కొనెనుగాని దానిని కొరికివైచి ఎట్లో తప్పించుకొని ప్రాణమును కాపాడు కొనెను. మూడవదియగు దీర్ఘసూత్రి వలలో పడి ప్రాణము లను గోల్పోయెను.

ఈ దీర్ఘసంసారమే చెఱువు. ఆయువే అందలి జలము. జీవులే చేపలు. చేపలందువలె జీవులలో మూడు తరగతుల వారు కలరు. అయువు తరిగిపోకమునుపే, మృత్యువను జాలరివాడు రాకపూర్వమే బాల్యయౌవనములందే సంసార తరణోపాయమును వెదకికొనువాడు ఉత్తముడు. ఆతడు వాస్తవముగ దీర్ఘదర్శియే అగును. వార్ధక్యములోగాని మరణాసన్నమగుటకు ఒకింతముందుగాగాని "కృష్ణా" "రామా" యని స్మరించువాడు మధ్యముడు. ఈతడు చివరికాలములో నైన దైవస్మరణచేసి తెప్పరించుకొనును. కాని ఏ కాల మందును భగవద్విషయమై పట్టించుకొననివాడు అధముడు. ఈతడు ఏమాత్రము భక్తిజ్ఞానములు సంపాదించక మృత్యు ముఖమున పడి ఘటీయంత్రమువలె "పునరపి జననం పునరపి మరణం" అను కీర్తన పాడుకొనుచు పాతాళనరకములకు తిరుగాడుచుండును. అట్టివాని పేరు దీర్ఘసూత్రి. అనగా సోమరి యని భావము. దీర్ఘసూత్రి యనగా అర్థమేమి యని ఒక రడిగిరి. దానికి మరియొక రిట్లు సమాధానము చెప్పిరి. "One

that has a long rope to tie himself.'' తన్ను తాను బంధించుకొనుటకు పొడవైన త్రాడుగలవాడు అని. ఈ నిర్వచనము చాల సొంపుగ నున్నది. సోమరి తన మెడకు తానే ఉచ్చు తగిలించుకొనునని తాత్పర్యము. (విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే). కావున వివేకవంతు డగువాడు సోమరితనమును, అలసత్వమును పారద్రోలి భవ దుఃఖమును బాపుకొనుటకై శ్రద్ధాపూర్వకముగ తీవ్రతర యత్నము గావింపవలెను. పట్టుదలతో కొన్ని వ్రతములను, నియమములను పరిశీలించవలెను.

## వ్ర త దీ క్ష

అజ్ఞానతిమిరమునబడి దిక్కుతోచక నానాయాతన లనుభవించుచున్న ప్రాణికోటిని పరికించి, వాత్సల్యముతో శ్రుతిభగవతి (వేదమాత) వారల సముద్ధరణకై ఇట్టి చక్కని జ్ఞానబోధలను గావించుచున్నది. వారికి వెలుగును చూపి దుఃఖమును శాశ్వతముగ దూరీకరించి వైచుచున్నది. 'అమృతస్య పుత్రాః' అని వారలను సంబోధించి 'ఓ జీవులారా! మీరు అల్పులు కాదు. అమృతస్వరూపమగు ఆత్మకు వారసులు, నిత్యశుద్ధబుద్ధముక్త పరమానంద స్వరూపులు' అని పలికి ధైర్యోత్పాదనము కావించుచున్నది. వేదమాత యొక్క ఆ దివ్యవాణి సంసారపంక పరిమగ్నుల హృదయాంత రాళమునందు ఉత్సాహమును రేకెత్తించి సంతాపమును

పారద్రోలుటయందు సమర్థమగుచున్నది. అట్టి వేదఘోషను వినువారి జన్మ ధన్యము. ఆచరించువారి జన్మ పావనము.

ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్య వరాన్నిబోధత.

"జీవుడా! లెమ్ము! ఎన్ని జన్మ లీ తమోమయ జీవితము! మార్జాలకిశోరము (పిల్లి పిల్ల) కళ్లు తెరవనంతవఱకు తల్లి దానిని బుట్టలోనుండి తట్టలోనికి, తట్టలోనుండి బుట్టలోనికి మార్చునట్లు జ్ఞాననేత్రము వికసించనంతవఱకు ఓ జీవుడా! ప్రకృతిచే నీకు ఈ జన్మ పరంపర తప్పదు. నిన్ను నీవు తెలిసికొననంతవఱకు మాయాప్రభావముచే దుఃఖము తప్పదు. తాపత్రయములు తప్పవు. జనన మరణములు తప్పవు. కావున ఈ మహోన్నత అవకాశమును జారవిడుచుకొనకుము. అజ్ఞాన నిద్రనుండి మేలుకొనుము. అనుభవజ్ఞులైన మహాత్ములను సేవించి జన్మతరణోపాయమును శీఘ్రముగ వెతకికొనుము. ఆత్మసాక్షాత్కారమును బడయుము"— అని వేదమాత కరుణతో బోధించుచున్నది.

ఆత్మజ్ఞానమును బొందనిచో, తన నిజస్వరూపమును గూర్చిన పరిజ్ఞానమును బడయనిచో అంధకార పరిపూర్ణములగు అసురలోకములే జీవులకు గతియని ఉపనిషత్తులు పేర్కొనుచున్నవి. ఆత్మను మఱచినవారికి, 'దేహమే నేన'ను భ్రాంతిలో దొర్లాడువారికి కనుచూపు మేరలో మహాద్దుఃఖములు కాచుకొని యుండును. శరీరపతనములోగానే, అనగా మృత్యువాసన్నమగుటకు పూర్వమే సాధన లన్ని

టిని పరిపూర్తిచేసి, ఆత్మానుభూతిని బడయువాడు ధన్యుడు, కృతార్థుడు. అట్లు కావింపనివాడు కర్మప్రభావముచే పుట్టుచు చచ్చుచు కాలచక్రమందు తగుల్కొని పెక్కు శరీరములను బడయుచు, పెక్కు జన్మలందు తిరుగాడుచు యమయాతనలకు లోనగుచుండును. ఇట్టి దుర్గతిని కొని తెచ్చుకొనుట విజ్ఞులకు పాడికాదు.

ఇతరలోకములందు భగవంతుని విస్పష్టముగ సాక్షాత్కరించుకొనుటకుగాని, తపస్సు కావించి ఇంద్రియ జయమును చక్కగ సాధించుటకుగాని వీలుపడదనియు అద్దమందు ముఖమును స్పష్టముగ, నిర్దుష్టముగ ప్రత్యక్షముగ గాంచ గలుగునట్లు, మానవజీవితమందే పరమాత్మను ప్రత్యక్షముగ సాక్షాత్కరించుకొనుటకు వీలుకలదనియు, కఠశ్రుతి పలుకుచున్నది. కాబట్టి కర్మభూమియగు ఈ లోకమున జన్మించి మహోన్నతమగు మానవత్వమును జేబట్టిన జీవుడు అట్టి అపూర్వావకాశమును సద్వినియోగపఱచుకొని సద్గురూపదేశము వలనను, సచ్ఛాస్త్రాభ్యాసముచేతను ధ్యానాధ్యనుష్ఠానము వలనను పంచకోశాంతర్గతమగు పరమాత్మను చక్కగ తెలిసికొని తాను జడమగు దేహము కాదనియు, చిన్మయమగు సచ్చిదానందాత్మయే యనియు, లెస్సగ అనుభూతి మొనర్చుకొని జీవితమును సార్థకము చేసికొనవలయును. వేదమాతయొక్క ఈ సదుపదేశమును ఆలకించి ఆచరించి జనులు నిశ్శ్రేయసపదమును బడయుటకై శీఘ్రముగ యత్నింపవలయును.

భయంకరమగు మాయతో పోరు సల్పువానికి వ్రతములు, జపములు, తపములు, నియమములు, నిష్ఠలు, పరమావశ్యకములు. సామాన్యముగా మనస్సు చెప్పినమాట వినదు. మదగజమునకు అంకుశము అవసరమయినట్లు, తిరుగుబాటు చేయు మనస్సునకు వ్రతాదుల సహాయము లేనిచో దానిని లొంగదీయుట కష్టసాధ్యము. కనుకనే మనోనిగ్రహము కొఱకు ఇంద్రియ దమనము కొఱకు పూర్వీకులు ఎన్నియో వ్రతములను ఏర్పరచిరి.

అట్టి వ్రతములను జనులు అపుడపుడు శీలించుచు, జన్మార్జిత ప్రాపంచిక దుష్టవాసనలను దూరీకరించుచు విశుద్ధ సత్త్వగుణాశ్రయము ద్వారా ఈ జన్మమునందే కైవల్యమును బడసి పరమానంద మనుభవించవలయును.

అయితే ఇట్టి వ్రతసంబాధమైన చర్యల నియమములను, ఆధ్యాత్మిక క్రమశిక్షణను, ఇంద్రియ సంయమమును కేవలము వ్రతకాలమునకు మాత్రమే పరిమితము చేయుట సామాన్యసాధకుని లక్షణము. వ్రతానంతరము కూడ, అనగా ఎల్లకాలములందును వానిని ఆచరించుచు, దైనందిన జీవితమునందు వానిని కార్యరూపమును ధరింపజేయుచు, వానిని ఒక అలవాటుగ జేసికొనుట ఉత్తమ సాధకుని లక్షణము. కాబట్టి వ్రతనిష్ఠులు తమ వ్రతకాల పవిత్రతను, నిర్మల భక్తిని, సౌమ్యత్వమును, సాత్త్విక హృదయమును ఎల్ల వేళలందును - జీవితాంతమువఱకు కొనసాగించుట శ్రేయస్కరము. ఈ ప్రకారముగ వ్రతాదుల ద్వారా, నియమ

ములద్వారా మానవుడు తన జీవితమునందు గొప్ప ప్రగతిని సాధించవలెను.

ప్రగతిశీలత్వము (Progress) గంభీరమానవుని స్వభావము. ఎల్లపుడు ఒకే స్థితియందుండుట కాతడు ఒప్పుకొనడు. దినదినము ఒక్కొక్క మెట్టు పైకి పోవుచు ఉన్నత శిఖరముల నధిష్ఠించవలెనని మనుజుడు సంబరపడుచుండును. తదనుకూలముగ వ్యవహరించును గూడ. కొందఱు భౌతిక విజ్ఞాన (Science) రంగమున, కొందఱు సాహిత్యరంగమున, కొందఱు రాజకీయక్షేత్రమున తమ విజ్ఞతను అభివృద్ధిపఱచుకొనుచు ముందునకు పోవుచుందురు. కాని అది చాలదు. నైతిక, ఆధ్యాత్మిక రంగములందు గూడ పురోభివృద్ధిని సాధించవలెను.

'డార్విన్' అను పాశ్చాత్యవైజ్ఞానికుని పరిణామవాదము (Theory of evolution) ననుసరించి కోతి క్రమవికాసము నొంది మానవుడుగా మారినదని కొందఱు చెప్పుదురు. కోతి మానవుడగుట అట్లుండ అసలు ప్రాణి కోతియగుటకు ఎన్ని కోట్ల జన్మల నెత్తియుండునో యోచించుకొనవలెను. ఈప్రకారముగ మానవత్వమును బడయుటకు జీవుడు ఎంతటి ప్రయత్నము నాచరించెనో, ఎన్ని యోనులందు తిరుగాడెనో, ఎన్ని మజిలీలు దాటెనో గ్రహించుకొనవలెను. ఇదియంతయు అతిదీర్ఘకాలమున జరిగిన పరిణామము. కాని ఈ పరిణామము, ఈ క్రమవికాసము ఇంతటితో ఆగరాదు. మానవ

త్మోపలబ్ధిమాత్రముతో జీవుని వికాసమునకు 'బ్రేక్' (నిలుపుదల) పడరాదు.

వానరుడు నరుడగుట మంచిదే కాని, నరుడు నరుడుగనే ఎల్లపు డుండుట వాంఛనీయము కాదు. నరుడు నారాయణుడు కావలయును. పురుషుడు పురుషోత్తముడై పఱగవలయును. అంతటితో జీవుని ప్రయత్నము పరిసమాప్తమగును. ఎపుడు మానవుడు మాధవుడగునో, ఇక అతనికి చేయువలసిన కార్యమేమున్నది? సమస్త సాధనలు అచ్చోట అంతమైపోవును. దైవత్వమును బడయుటలో జీవుని క్రమవికాసము పరాకాష్ఠ నందుకొనును. అదియే చరమస్థితి. అదియే కైవల్యము. అదియే సంసారబంధవిచ్ఛిత్తి. పరమానందదాయకమగు అట్టి అనుపమదైవస్థితిని మోక్షస్థానమును బడయుటయే జీవుని పరమావధి. ఏకైకలక్ష్యము.

అట్టి లక్ష్యమును జేరుటకై ముముక్షువు గొప్ప తపస్సు నాచరింపవలయును. ఇంద్రియములను చక్కగ నిగ్రహించవలెను. మనస్సును అదుపులోనికి తీసికొని రావలెను. సర్వేశ్వరునియెడల, సద్గురునియెడల భక్తిని సంపాదించుకొనవలెను. ప్రాపంచిక విషయముల యెడల, దృశ్యభోగములయెడల, క్షణికవిలాసముల యెడల పరిపూర్ణ విరక్తిని సంపాదింపవలెను. మనస్సును బహిర్ముఖ పదార్థములవెంట పరుగిడనీయక, అరికట్టి, ప్రత్యాహార మొనర్చి, అంతర్ముఖముచేసి ఆత్మయందు స్థాపించవలెను. అయితే బహుజన్మార్జిత దృశ్యవాసనాబలముచే మనస్సు శీఘ్రముగ

లోంగదు. అందులకు శిక్షణ (Spiritual discipline) చాల అవసరము. కొన్ని నియమములు, కొన్ని వ్రతములు, కొన్ని సాధనపద్ధతులు అవలంబించి అకుంఠితదీక్షతో వానిని కార్యాన్వితమొనర్చుటకై యత్నింపవలెను. మన పూర్వీకు లందువలననే ఏకాదశీవ్రతము, మౌనవ్రతము, కార్తీకవ్రతము, మాఘవ్రతము, చాతుర్మాస్యవ్రతము మున్నగు వ్రతములను సృష్టించి వానిని దీక్షతో కొనసాగించినచో మనస్సుపై గొప్ప విజయమును సంపాదించవచ్చునని బోధించిరి. అట్టి ప్రముఖ వ్రతములలో చాతుర్మాస్య మొకటి.

చాతుర్మాస్యవ్రతము ఆషాఢశుద్ధ ఏకాదశినాడు ప్రారంభమగును. దానినే 'తొలి ఏకాదశి' అనియు, 'శయనైకాదశి' అనియు అందురు. శ్రీ విష్ణుభగవానుడు ఆ దినమున యోగనిద్రయందు ప్రవేశించును గావున దానికి శయనైకాదశి అని పేరు వచ్చినది. ఆ ప్రకారము విష్ణువు యోగనిద్రయందు నాలుగుమాసములు ఉండి, మఱల కార్తీక శుద్ధ ఏకాదశినాడు లేచును గావున అ దినమునకు 'ఉత్థానైకాదశి' అని పేరు వచ్చినది. కావున ఈ నాలుగు మాసములు (చాతుర్మాస్యకాలము) అతిపవిత్రమైన సమయము. వాతావరణమున్ను అపుడు చాల చల్లగా నుండును కావున ధ్యానమునకు, చాల అనుగుణ్యముగా నుండును. అందుచే ముముక్షువు లాసమయమున తీవ్రతరసాధనలను గావింపవచ్చును. పూర్వకాలమున సాధువులు, సన్యాసులు కొంతకాల మేకాంతమున చక్కగ తపస్సు నాచరించి, నియమనిష్ఠలుగలవారై,

పరమార్థానుభూతిని బడసి తదుపరి దేశమున సంచారమొన ర్చుచు గృహస్థులు మున్నగువారికి అధ్యాత్మిక బోధలను గావించుచుండిరి. ఈ నాలుగు నెలలు వర్షాకాలము, చలి కాలము అగుటచే సంచారమునకు ప్రతిబంధముగా నుండుట వలన వారు తమ ప్రయాణములను విరమించి ఎక్కడో ఒక చోట నిలుకడగ నున్నవారై అచటి జనులకు దైవతత్త్వ మును ప్రబోధించుచుండెడివారు. అదియే చాతుర్మాస్య కాలము. చాతుర్మాస్యవ్రతమును సాధు, సన్యాసులే కాక గృహస్థులు, బ్రహ్మచారులున్ను అవలంబించవచ్చును. కాని ఎవరైనను ఈ నాలుగునెలలు బయటి సంచారమును విరమించి ఒకేచోట చక్కగ భగవద్ధ్యానాదులను గావింప వలయును.

ఈ చాతుర్మాస్యమునందు ఏమిచేయుదురు. ఏమి చేయవలెను అనునది ఒక ప్రశ్న. చాతుర్మాస్య మొక వ్రతము. ఒకరోజు రెండు రోజులతో గూడిన వ్రతముకా దిది; దీర్ఘకాలికవ్రతము. ఈ వ్రతమునకు గడువు నాలుగు మాసములు. కనుకనే దీనికి మహావ్రత మని పేరు పెట్టిరి. అది వర్షాకాలము కాబట్టి సాధకుడు చల్లని వాతావరణ మును బాహ్యమున అనుభవించుచు అట్టి శీతల ప్రశాంత స్థితిని అంతఃకరణమునగూడ అనుభవించుటకై యత్నించు చుండును. తాపత్రయమును పోగొట్టుకొనుటకై యోచించు చుండును.

ఈ వ్రతమును అచరించువారు అ నాలుగు నెలలు ఎక్కడకును వెళ్ళక దీక్షతో ఆధ్యాత్మిక సాధనలను అమలు పరచుచుందురు. భగవత్తత్త్వ విచారణయందే కాలము గడుపుదురు. కాలమును వృథాచేయరు. ఏదియో యొక పరమార్థ కార్యమును చేయుచుందురు. బోధనాశక్తి గలవారు ఇతరులకు ప్రబోధించుచును ఉందురు. కొందఱు ఈ నాలుగు నెలలు కొన్ని నియమములు పెట్టుకొందురు. కొందఱు అహార సంయమము కావించుదురు. 'జితం సర్వం జితే రసే' అను నట్లు జిహ్వను జయించినచో సమస్తమును జయించినట్లే; కావున నాలుకను అరికట్టుటకై రుచులను తగ్గించుకొందురు. తమ కిష్టమైన పదార్థములను తినకుండ నిషేధించుకొనుచుందురు. కొందఱు పప్పులో ఉప్పు మాని వేయుదురు. మఱికొందఱు పాలలో చక్కెర మాని వేయుదురు. మఱికొందరు కొన్నిరకముల కూరలను విసర్జించుచుందురు. ఇదియంతయు జిహ్వేంద్రియ సంయమముకొఱకై ఏర్పడినది—ఈ ప్రకారముగ ఆ నాలుగు నెలలు చక్కని ఇంద్రియసంయమమును శీలించుచుందురు.

అయితే ఇది చాలదు. అహారాది నియమములతో బాటు ఈ క్రింది విషయములయెడలగూడ జాగ్రత వహించవలెను - కోపము రానీయగూడదు. బ్రహ్మచర్యమును శీలించవలెను. తన హృదయమను బిలమును బాగుగ పరిశోధించుకొని అసూయ, ద్వేషము మున్నగు విషసర్పము లేవైన అందు కాపురముండుచున్నవేమో చూచి, ప్రయత్న

పూర్వకముగ వానిని బయటకు గెంటివేయవలెను. భగవద్భక్తిని, గురుభక్తిని బాగుగ పెంపొందించుకొనవలెను. ప్రతిదినము ఒక అష్టోత్తరము (108) నకు తక్కువ లేకుండ ఏదైన దివ్యమంత్రమును (పంచాక్షరి, అష్టాక్షరి మున్నగు వానిని) జపించుటయు చాల శ్రేష్ఠము. తీరికగా ఉన్నపుడు రామనామమునుగాని, కృష్ణనామమునుగాని, శివనామమును గాని, విఠల్ నామమునుగాని లిఖించవచ్చును. వెయ్యేల, ఏదియో యొక దైవకార్యముచే మనస్సునకు బహిర్ముఖ ప్రవృత్తి తగ్గించి, విషయచింతనకు అవకాశమే లేకుండ చేయవలయును. పలువురు చేరుటకు వీలున్నచో సమష్టి భజనయు ఏర్పాటు చేయవచ్చును. లేక వ్యక్తిగతముగా నైన సంకీర్తనాదులను గావించుకొనవచ్చును. ఈ ప్రకారముగ చాతుర్మాస్యకాలము నాలుగు నెలలు వ్రతనిష్ఠునకు దైవవాతావరణము నందే గడచిపోవును. నాలుగు నెలలు దృఢవ్రతమును శీలించుటవలన మనస్సు సత్త్వగుణమును ఆశ్రయించి, తనయందలి దోషములను దూరీకరించి నిర్మల భక్తి గలిగి పరిశుద్ధమగు స్థితిని బొందును. పరిశుద్ధాంతఃకరణము గలవారికే బ్రహ్మానుభూతి సిద్ధించును. ఈ వ్రతము యొక్క ఫలిత మిక చెప్ప తరమా? వ్రతము పూర్తియగు సరికి సాధకుడు కోలెడు పుణ్యమును సముపార్జించును. ఇది యంతయు జీవుని లక్ష్యసాధనకు అనగా బ్రహ్మసాక్షాత్కారమునకు మిక్కుటముగ ఉపకరించును.

ఈ సందర్భమున ఒక విషయమును సర్వులును జ్ఞాపకమునందుంచుకొనవలెను. అది యేదనగా, ఈ వ్రతములు, జపములు, తపములు వాస్తవముగ ఏదియో యొక కాలమునకు పరిమితములై యుండలేదు. సామాన్యులకు మోక్షమార్గమున ఆసక్తిని జనింపజేయుటకే ఈ పరిమిత కాల వ్రతాదు లేర్పడినవి కాని, యథార్థముగ దైవధ్యానమందు, తత్త్వవిచారణయందు కాలనిర్ణయ మేమియు లేదు. జనులు ఒక చాతుర్మాస్యమునందే కాదు. ఎల్లకాలము నందును పరమార్థసాధనలను గావింపవచ్చును. 'తస్మాత్సర్వేషు కాలేషు - మామనుస్మర' అని గీతయందు భగవానుడు చెప్పనే చెప్పెను. తీవ్రతర ముముక్షువు లెల్లపుడును 'ద్వాదశమాస్య' వ్రతములనే ప్రతిసంవత్సరము నాచరించుచుందురనుటలో సందేహము లేదు. అనగా వారు నిరంతరము అధ్యాత్మక్షేత్రమందే కాలము గడుపుచుందురు. అట్టి స్థితికి ఎగబ్రాకుటకై ప్రతివారును యత్నించవలెను. అయితే ప్రారంభమున చిన్నచిన్న వ్రతములనారంభించి, క్రమముగ ఊర్ధ్వస్థితిని బడయవచ్చును. ఇట్టి చాతుర్మాస్యాదివ్రతములు జనుల హృదయాంతరాళములను పరిశుద్ధపఱచి, ఆత్మసాక్షాత్కారమను మహోన్నత శిఖరము నధిరోహించుటకై చాల సహాయపడును. కావున ముముక్షువులు వాని నవలంబించి చిత్తశుద్ధినిబడసి భగవత్కృపకు పాత్రులు కావలయును. అనుభవజ్ఞులగు మహానీయులు ఈ క్రింద తెలుపబడిన అధ్యాత్మిక దినచర్యను (Time-table) బోధించి

యున్నారు. మోక్షసామ్రాజ్యము నభిలషించు సాధకులు దానిని చక్కగ గమనించి ఆ ప్రకార మాచరించుట శ్రేయస్కరము—

"(1) ఉదయమున 4 గంటలకు పడకనుండి లెమ్ము. అది బ్రహ్మముహూర్తము. భగవద్ధ్యానమునకు మిక్కిలి యనుకూలమైన సమయము.

(2) తూర్పు ముఖముగగాని లేక ఉత్తర ముఖముగ గాని పద్మ లేక సిద్ధ లేక సుఖాసనమున ½ గంటవఱకు జప ధ్యానములందు కూర్చుండుము. కాలవ్యవధిని కాలక్రమముగ 3 గంటలకు అధికము చేయుము. బ్రహ్మచర్యమును, ఆరోగ్యమును కాపాడుకొనుటకు శీర్ష సర్వాంగాసనములను వేయుము. నడచుట మున్నగు తేలికయైన శరీరవ్యాయామమును సక్రమముగ జరుపుము. ఒకింత ప్రాణాయామమును చేయుము.

(3) నీ యభిరుచి, లేక యిష్టమున కనుగుణ్యముగ ఓం, ఓం నమోనారాయణాయ, ఓం నమఃశివాయ, ఓం నమో భగవతే వాసుదేవాయ, ఓం శరవణభవ, ఓం సీతారామ్, ఓం శ్రీరామ్, హరిః ఓం, అను మంత్రములను గాని, లేక గాయత్రీ మంత్రమునుగాని 108 సార్లుగాని అంతకు అధికముగగాని జపము చేయుము.

(4) సాత్త్వికాహారమును భుజింపుము. మితాహారము నవలంబింపుము. పొట్టను ఎక్కువగ నింపకుము. ఏ

వస్తువులను మనస్సు అధికతమముగ కాంక్షించునో, ఆ వస్తువులను సంవత్సరములో కొంతకాలము తీసికొనకుము. సామాన్యాహారమును భుజించుము. పాలు, పండ్లు ధారణకు దోహదమిచ్చును. జీవనము గడచుటకై ఆహారమును ఔషధమువలె తీసికొనుము. భోగముకొఱకు భుజించుట మంచిది కాదు.

(5) ఒక ప్రత్యేక ధ్యానపుగదిని నీ స్వాధీనమునందుంచుకొనుము.

(6) ప్రతినెల, లేక ప్రతినిత్యము నీ ఆదాయము ననుసరించి, లేక రూపాయకు ఐదుపైసలవంతున సక్రమముగ దానము చేయుము.

(7) ప్రతినిత్యము నియమబద్ధముగ గీత, రామాయణము, భారతము, భాగవతము, విష్ణుసహస్రనామము, లలితాసహస్రనామము, ఆదిత్యహృదయము, ఉపనిషత్తులు లేక యోగవాసిష్ఠము (వసిష్ఠగీత)ను అరగంటనుండి ఒక గంటవఱకు స్వాధ్యాయము చేసి విచారణ సల్పుము.

(8) జీవశక్తియగు వీర్యమును బహుజాగ్రత్తగ కాపాడుకొనుము.

(9) ప్రార్థనాశ్లోకములను, స్తోత్రములను కొన్నింటిని కంఠస్థమొనర్చి జపధ్యానములకు ముందు ఆసనముననూర్చుండిన వెంటనే వానిని పురశ్చరణచేయుము. ఇది మనస్సును త్వరితముగ ఉన్నతపఱచును.

(10) నిరంతరము సత్సాంగత్యమును కలిగి దుస్సాంగత్యమును విడువుము. పొగ త్రాగుటను, మాంసమును, సారా ద్రవ్యములను పూర్తిగ వదిలివేయుము. ఏ చెడ్డ యలవాటులను అలవఱచుకొనకుము.

(11) ఏకాదశినాఁడు ఉపవాస ముండుము. లేక పాలు, పండ్లను మాత్రమే తీసికొనుము.

(12) ఒక జపమాలను నీ మెడలోగాని, దిండు క్రింద గాని రాత్రులం దుంచుకొనుము.

(13) ప్రతిదినము ఒకగంటకాని రెండుగంటలుకాని మౌనవ్రతమును అవలంబింపుము.

(14) సత్యమునే పల్కుము. మితముగ మాటాడుము. మధురముగ మాటాడుము.

(15) నీ కోర్కెలను తగ్గించుకొనుము. తృప్తికరముగు ఆనందజీవితమును గడపుము. నిరాడంబరమైన జీవితమును ఉన్నతభావములను కలిగియుండుము.

(16) ఎన్నడు ఎవరిని నొప్పించకుము. కోపమును ప్రేమ, క్షమ, దయలచే నిగ్రహింపుము,

(17) శయనించుటకుముందు నీవు ఆ దినమున చేసిన తప్పులనుగుఱించి యోచింపుము (ఆత్మపరిశీలన గావించుకొనుము.) దినచర్యపుస్తకమును ఉంచుకొనుము. గడచిన తప్పులనుగూర్చి పశ్చాత్తాపపడుము. క్రొత్తవానిని చేయకుము.

(18) ప్రతిక్షణము మృత్యువు వేచియున్నదని జ్ఞాపక ముంచుకొనుము. సత్ప్రవర్తనను కలిగియుండుము.

(19) నిదుర లేచినవెంటనే, మరల నిదురించుటకు ముందు భగవంతుని స్మరింపుము. నీ సర్వస్వమును భగ వంతునకు అంకితము చేయుము.

(20) అనంతవిశ్వములో ఈ భూగోళము ఒక చిన్న నలుసని భావించి, అహంకారమును దులిపివైచి, నీ సిరి సంపదలను గొప్పగా భావింపక, ఈ విశ్వమునకంతకును ప్రభువైన పరమాత్మయెడల భక్తిప్రపత్తులు కలిగి యుండుము.

సమస్త ఆధ్యాత్మికసాధనలయొక్క సారమిదియే. ఈ కార్యక్రమము మోక్షమునకు దారి చూపును. ఈ నియమములన్నిటిని బహుజాగ్రతగ అనుసరించి బాగుగ అభ్యాసమొనర్చవలెను. అభ్యాసముచే మనస్సు బాగుగ లొంగగలదు.

కొందఱు సాధకులు గురువులయొద్దకువెళ్ళి 'మహా ప్రభో! ధ్యానకాలమందు మా మనస్సు ఏకాగ్రముగ నిలుచుటలేదు. పరిపరివిధముల ఆలోచనలు చేయుచుండును. దైవమునందు స్థిరత్వమును బడయుటలేదు. ప్రపంచములో ఎక్కడెక్కడనో ఉన్న వస్తువులపై వ్రాలి, వానినిగూర్చియే తలపోయుచు లేనిపోని సంకల్పములు చేయుచుండును. దీనికి నివారణోపాయము సెలవిండు. మనస్సును అరికట్టుటకు

ఏదైన మార్గమును సూచింపుడు' అని ప్రశ్నించుచుందురు. ఇతరులమాట అట్లుండనిండు. సాక్షాత్ అర్జునుడే తన గురు వగు శ్రీకృష్ణపరమాత్మను ఈ ప్రశ్న అడిగియుండెను. రణ రంగమున శ్రీకృష్ణుడు అనర్గళముగ గీతాబోధను గావించు చుండగా అర్జునుడు మధ్యలో గురుదేవుని ఈ ప్రకారముగ ప్రశ్నించెను—'మహాత్మా! ఎన్నియో ధర్మరహస్యములను తాము సెలవిచ్చుచున్నారు. పరమానందముగా నున్నది. కాని ఆచరణలోకి వచ్చునపుడు నాకొక గొప్పప్రతిబంధకము కలుగుచున్నది. మనస్సు మహాబలవత్తరమైనది. చపల మైనది. వాయువును అరికట్టుటకంటెను దానిని నిగ్రహించుట కష్టతరముగ నున్నది. అట్టి మనస్సును దారికి తెచ్చుట కేదైన ఉపాయమును సెలవిండు?'

శిష్యుని వినయాన్వితపరిప్రశ్నకు గురుదేవుడు చక్కని సమాధానమొసంగెను — 'నాయనా! కంగారుపడవద్దు. మనస్సు వాస్తవముగ చపలమైనదే. కాని రెండు ఉపాయ ములచే దానిని నిగ్రహించవచ్చును. మొదటిది అభ్యాసము, రెండవది వైరాగ్యము.'

ఈరీతిగ మనోనిగ్రహమును బడయుటకు, ఆత్మశాంతిని చేకూర్చుకొనుటకు శ్రీకృష్ణమూర్తి రెండు మార్గములను బోధించి అర్జునునకు ధైర్యప్రదానము గావించెను. వస్తువు గాని, వ్యక్తిగాని బలశాలి అయినంతమాత్రమున ఎవరును జంకవలసినపనిలేదు. దానిని అణచుటకు తగిన ఆయుధమును వెతకికొనిన చాలును. ఏనుగు చాల గొప్పదే అయినను

చిన్న అంకుశముచే అది వశీభూతమగుచున్నది. సింహము మహాభయంకరమైనను చిన్న తుపాకికి లొంగిపోవుచున్నది. ఎద్దు బలిష్ఠమైనను ముక్కుత్రాటికి లోబడిపోవుచున్నది. అట్లే మనస్సు మహాబలీయమై యున్నప్పటికిని అభ్యాస వైరాగ్యములను ఉపాయములచే 'దాసోఽహం' అనక తప్పదు.

ఇందు మొదటిదియగు అభ్యాసమునుగూర్చి విచారించెదము.

> అజ్ఞోఽపి తజ్జ్ఞతామేతి శనైః శైలోఽపి చూర్ణ్యతే
> బాణోఽప్యేతి మహాలక్ష్యం పశ్యాభ్యాస విజృంభితమ్.

'అభ్యాసముద్వారా అజ్ఞాని జ్ఞాని యగుచున్నాడు. ప్రతిరోజు కొంత కొంత కొట్టుచుండినచో కొండకూడ పిండి పిండి అయిపోవుచున్నది. గురి బాగుగ అభ్యసించినచో సుదూర లక్ష్యమునుగూడ బాణము ఛేదించివేయుచున్నది. అభ్యాసమున కెట్టి ప్రభావము కలదో చూడుము'—అని శ్రీ వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు బోధించెను. లౌకికరంగమున గాని, పరమార్థరంగమునగాని ప్రయత్నము లేనిచో, అభ్యాసము గావింపనిచో ఏ కార్యమున్ను సాధింపబడదు. సైకిల్ త్రొక్కునపుడు ప్రారంభములో మహాభీతిగా నుండును, కాని కొన్నాళ్ళు అభ్యాసము చేసిన పిదప రెండు చేతులు వదలివేసికూడ సునాయాసముగ దానిని మనుజుడు త్రొక్కగల్గును. పాఠశాలయందు విద్యార్థి సోమరితనమును వీడి పట్టుదలతో కొన్ని సంవత్సరములు సాధించినపుడుమాత్రమే

పట్టభద్రుడు కాగల్గుచున్నాడు. ఒక చిన్న డిగ్రీ సంపాదించుటకే ఇంత ఓపిక, అధ్యవసాయము, స్థిరనిశ్చయము, అభ్యాసము ఆవశ్యకమైయుండ ఇంక ఎన్ని జన్మలనుండియో కరుడు కట్టియున్న కఠినమగు మనస్సును కరిగించుటకు, లొంగదీయుటకు ఎంత శ్రమ, ఎంత సాధన, ఎంత అభ్యాసము గావింపవలసియుండునో యోచించుకొనవచ్చును.

రసరీ ఆవత జాతతే శిల పర్ హోత నిశాన్

చీమ ప్రతిదినము ఒక శిలపై నడుచుచుండినచో కొన్నాళ్ళకు అ శిలపై ఒక చిహ్నము ఏర్పడును. కఠినమైన శిలను భేదించు సామర్థ్యము అల్పమగు చీమ ఎట్లు కల్గినది ? అభ్యాస ప్రాబల్యముచే, నిరంతర ప్రయత్నముచే. బావిగట్టుపై ప్రతిదినము ఒక కుండను పెట్టుచుండినచో కొంత కాలమునకు గట్టుపై కుదురు ఏర్పడును. రాతిని ఖండించు శక్తి కుండకు ఎట్లేర్పడినది? నిరంతరసాధనచే. అట్లే భయంకరమైన అజ్ఞానమును జీవుడు సంతత ఆత్మవిచారణచే పటాపంచలు చేసి వేయగల్గుచున్నాడు. దేనికి వశీభూతులై జనులు అనాది కాలమునుండి ఈ సంసారసాగరమునబడి దరిగానక ఈదులాడుచున్నారో, ఈ జననమరణాది దుఃఖములకు లోనగుచున్నారో, ఏది ఆత్మానుభూతికి ప్రధానమగు అడ్డుగోడగా నిలిచియున్నదో అట్టి మనస్సుయొక్క నిగ్రహమును సాధకుడు అభ్యాసముచే అవలీలగ సాధించివేయగల్గుచున్నాడు.

కాబట్టి ప్రతిదినము మనస్సును లొంగదీయుటకు కనీసము ఒకగంటసేపైనను చక్కగ సాధనచేయవలెను. మనస్సు

ఎక్కడికి పరుగెత్తుచున్నదో బాగుగ కనిపెట్టి, విచారణచే దాని నచ్చోటునుండి తెచ్చి ఆత్మయందు స్థాపించుచుండవలెను. దైవమునుగూర్చియే చింతించుట, దైవమును గూర్చియే పరస్పరము బోధించుకొనుట, దైవప్రతిపాదకములగు అధ్యాత్మశాస్త్రములనే నిరంతరము శీలించుట, అధ్యయనము చేయుట మొదలగు కార్యములను గావించుచుండవలెను. అపుడు మనస్సు దైవభావనామయమై యుండును. ప్రపంచ వాసనలు చెలరేగుట కపుడు అవకాశము ఉండదు. దీనినే అభ్యాసమందురు. గీతాచార్యుడీ అభ్యాసమునకు ఒక యోగముయొక్క అంతస్తు (Status) నిచ్చి దానిని మిక్కుటముగ గౌరవించెను. అభ్యాసయోగమును ఆశ్రయించి మనస్సును జయించుకొనుడని పలుచోట్ల నొక్కిచెప్పెను. కర్మయోగము గాని, భక్తియోగముగాని, రాజయోగముగాని, జ్ఞానయోగముగాని ఈఅభ్యాసయోగముతో చేరినపుడుమాత్రమే ఫలవంతమగును. కాబట్టి ఇది చాల ముఖ్యమైనది. సాధకులు తమ మనోనిగ్రహమునుగూర్చికాని, ఆత్మజ్ఞానసంప్రాప్తిని గూర్చికాని కలవరపడవలసినపనిలేదు. అభ్యాసయోగము నాశ్రయించి అచిరకాలములో వాటిని బడయవచ్చును. భగవన్ముఖారవిందసంజనితజ్ఞానగంగాప్రవాహమున ప్రముఖస్థాన మలంకరించి సాధకులకు మోక్షప్రాప్తియందు మహోపకృతిని ఒనగూర్చు ఈ అభ్యాసయోగము నెవరును వదలరాదు. ముక్తిసోపానాధిరోహణమందు జీవునకు ప్రబల

ఆటంకమై కూర్చొనియున్న మనస్సును లొంగదీయుటయందు అభ్యాసమునకు మించిన ఉపాయము మఱియొకటి లేదు.

కావున అభ్యాసము, క్రమశిక్షణ ముముక్షువునకు చాల అవసరములై యున్నవి. ప్రతిదినము ఉషఃకాలముననే అనగా బ్రహ్మముహూర్తముననే (ఉదయము 4 గం॥, 5 గం॥ మధ్య) నిద్రలేచుట, పడకమీదనుండి క్రిందకు దిగక పూర్వమే కొంత దైవప్రార్థన చేయుట, తదుపరి కాలకృత్యములు తీర్చుకొని కనీసము ఒకగంటసేపైనను ధ్యానమును శీలించుట, మనోనిగ్రహమును అభ్యసించుట, తదుపరి ఒక అధ్యాయము గీతాపారాయణము చేయుట, తన యిష్టదైవమునుగూర్చిన మంత్రమును అష్టోత్తరము (108) స్మరించుట మొదలగు పారమార్థిక క్రియలను చేయుచుండవలెను. మనోనిగ్రహమునుగూర్చి ఎవరును దిగులుపడవలసినపని లేదు. అనవరతము సాధనచేయుచుండినచో అన్నియును దారికి రాగలవు. సముద్రము ఎంత లోతు ఉండిన నేమి? ఒక చిన్నపడవను తెచ్చుకొనిన చాలును. అవలీలగ దానిని దాటివేయవచ్చును. అట్లే అభ్యాస సాధ్యమగు మనోజయమును చిన్న ఉపకరణముచే అపార సంసారసముద్రమంతయు త్రుటిలో దాటివేయబడగలదు.

సామాన్యముగ జనులు వ్యవహారమందే ఎక్కువ కాలమును గడిపివేయుచున్నారు. ఆ కాలమును తగ్గించుకొని, సాధనకు, అనుష్ఠానమునకు, పరమార్థఅభ్యాసమునకు సాధ్యమైనంత ఎక్కువకాలమును వినియోగించవలెను.

దుష్కార్యములు ఏ ప్రకారము మరల మరల ఆచరించుట వలన అనేక జన్మలనుండి బలపడి వాసనారూపముగ పరిణామించినవో, ఆ ప్రకారమే జప, ధ్యాన, విచారణాది సత్కార్యములున్ను బహుకాలదృఢాభ్యాసముచే బలపడి చిత్త నైర్మల్యమునకు దోహదమును కలుగజేయును. మోక్ష సిద్ధి ఆత్మవిచారణవలనను ఆత్మవిచారణ హృదయనిర్మలత్వమువలనను, హృదయ నిర్మలత మనోజయము వలనను, మనోజయము నిరంతరాభ్యాసమువలనను మనుజునకు చేకూరుచుండును.

అట్టి అభ్యాసము ఏ అంతరాయము లేకుండ చక్కగ జరుగుటకొఱకై సాధకునకు ఆరోగ్యము బాగుగ నుండవలెను. ఆరోగ్య సిద్ధికొఱకై ఆహారనియమములను కడు జాగరూకతతో పాలించుచుండవలెను. 'శరీరమాద్యం ఖలు ధర్మసాధనం' అనునట్లు మోక్షసాధనయందు దేహము యొక్క స్వస్థత ప్రముఖస్థాన మాక్రమించుచున్నది. కాబట్టి ఆహారవిహారాదులందు సంయమము గలిగి సంసార సముద్రములు దాటుటయందు నావవంటి ఈ శరీరముయొక్క ఆరోగ్యమును బహుజాగ్రతగ కాపాడుకొనుచుండవలెను.

# 12వ. అధ్యాయము

---

## ఆహార నియమములు

### ఆహారశుద్ధి

సాధనరంగమున ఆహారముయొక్క స్థానము చాల ముఖ్యమైనది. ఆహారముయొక్క సూక్ష్మాంశముచేతనే మనస్సు ఏర్పడుచుండుటవలన, ఆహారము శుద్ధముగ నున్ననే మనస్సున్ను శుద్ధముగ నుండును. ఆహారము సాత్త్వికముగ నున్ననే మనస్సున్ను సాత్త్వికముగ నుండును.

"ఆహార శుద్ధౌ సత్త్వశుద్ధిః, సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః; స్మృతిలాభే సర్వగ్రన్థీనాం విప్రమోక్షః"—అని ఉపనిషత్తు లుద్ఘోషించుచున్నవి. అనగా ఆహారశుద్ధిచే మనశ్శుద్ధి కలుగుననియు, మనశ్శుద్ధిచే ఆత్మస్మృతి సంభవించుననియు, తత్స్మృతిలాభముచే భవబంధములన్నియు, అజ్ఞాన హృదయగ్రంథులన్నియు విచ్ఛిన్నములై పోవుననియు భావము. ఆహారవిషయము చాల చిన్నదని తలంచి యెవరును ఉపేక్షింపరాదు. పరమార్థరంగమున పెద్దపెద్ద విషయములే యోచించవలయునుగాని చిన్నవి కావనియు, జప ధ్యాన విచారణాదులు చక్కగ గావించవలెనే గాని ఆహారమెట్లున్న యేమి యనియు, దానియెడల దృష్టి యెందులకనియు యెవరును తలంపరాదు. ఏలయనిన, చిన్నవిషయ

ముల యెడల జాగరూకత వహించినపుడే పెద్దవానియందు జయము సంభవించును.

ఒకదృష్టితో జూచినచో ఆహారమనునది చిన్న విషయమున్ను కాదు. అది అధ్యాత్మరంగమున కీలకస్థాన మాక్రమించుచున్నది. ఆహారముయొక్క సూక్ష్మాంశములు మనస్సుగా రూపొందుచుండుటవలన అశుద్ధాహారము వలన మనస్సుయొక్క పవిత్రతకు భంగము కలుగు ప్రమాద మున్నది. కాబట్టి ముముక్షువు లీ యాహార విషయమున ఎంతయో జాగరూకత వహింపవలసియున్నది. మోక్షసిద్ధికి వలయు సాధనోపాయము లనేకములు తెలుపబడిన శ్రీ భగవద్గీతయందును శ్రీ కృష్ణభగవాను డీ యాహారవిషయమున పలుచోట్ల సాధకులకు హెచ్చరికలు చేసియుండుట గమనింప దగినది—

"నాత్యశ్నతస్తు యోగోఽస్తిన చైకాన్త మనశ్నతః"
"యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు"
"ఆయుస్సత్త్వ బలారోగ్య......సాత్త్వికప్రియాః"
"కట్వామ్ల లవణాత్యుష్ణ......దుఃఖశోకామయప్రదాః"
"యాతయామం గతరసం...... భోజనం తామసప్రియమ్."

ఈ ప్రకారముగ గీతాచార్యుడు ఆహారశుద్ధినిగూర్చి, ఆహారసంయమమునుగూర్చి నొక్కి వక్కాణించెను.

రైలుపట్టాలమీద నున్న ఒక చిన్న చీల ఊడిపోయినచో రైలుబండి యంతయు పడిపోయి ప్రయాణీకుల కెట్లు

ఘోరమగు అపాయము వాటిల్లునో, అట్లే ఆహారముయొక్క అజాగ్రతవలన ఆధ్యాత్మిక సాధనసౌధమంతయు ఒక్కుమ్మడి కూలిపోగలదు. కనుకనే మహానీయులు, తమ సాధన కాలమందును, తదుపరి కూడను ఆహారవిషయమై సంయమ శీలురై వర్తించుదురు.

ఆహారముయొక్క సూక్ష్మాంశముచేతనే మనస్సు ఏర్పడుచుండుటవలన పవిత్రాహారమువలననే మనస్సు సాత్త్వికమై యలరగలదు. మఱియు మనస్సు సాత్త్వికమై యుండునపుడు మాత్రమే ధ్యానము, దైవచింతన, తత్త్వ విచారణ చక్కగ జరుగగలవు. కావున మనోనిర్మాణము నకు హేతుభూతమైనట్టి ఆహారముయెడల సాధకుడు బహు శ్రద్ధగలిగి గీతయందలి 17-వ అధ్యాయమందు భగవానునిచే సూచింపబడిన రాజసిక, తామసికాహారములను వర్జించి సాత్త్వికాహారమునే సేవించుటను అభ్యసించవలెను. తరింప దలచువాడు ఏదియో కొంత శిక్షణకు తప్పక లోనుకావలసి యుండును. అన్ని యింద్రియములను జయించుట ఒక ఎత్తు. నాలుకను జయించుట ఒక ఎత్తు.

"జితం సర్వం జితే రసే"

రసనేంద్రియమగు నాలుకను జయించినచో సర్వేంద్రియములున్ను నిగ్రహింపబడినట్లే యని శ్రీ కృష్ణమూర్తి ఉత్తరగీతయందు తెలిపియున్నారు. ఇంద్రియము లన్నిటిలో జిహ్వా, గుహ్యేంద్రియములు రెండును మహాబలవత్తరము లైనవని యెఱుఁగవలెను. ఆ రెండును ఒకదానిచే మఱి

యొకటి సంపుష్టము లగుచుండును, కావున జిహ్వాను అరికట్ట నిచో బ్రహ్మచర్యమును సాధించుట మహా కష్టతరమే యగును. "యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి"—అను భగవద్వాక్యమునుబట్టి పరబ్రహ్మసాక్షాత్కారమునకు బ్రహ్మచర్య మొక అత్యావశ్యకమైన అంగమని స్పష్టమగుచున్నది. ఈ కారణమున పరబ్రహ్మప్రాప్తికి హేతుభూతమైన బ్రహ్మచర్యమును సాధించుటకును ఆహారసంయమము, జిహ్వేన్ద్రియ నిగ్రహము అత్యంతావశ్యకములని తేలుచున్నది.

అయితే బహుకాలమునుండి బాగుగ రుచులు మరగి యున్న నాలుక, సంయమమునకుగాని, సాత్త్వికాహారసేవనమునకు గాని ప్రారంభమున ఇయ్యకొనదు. తిరుగబడును. కూరలలో కొంచెము ఉప్పు తగ్గినను, కారము తగ్గినను పెద్ద తిరుగుబాటు చేయును. ఆహారమునకు సంబంధించిన ఇంద్రియములు రెండు కలవు. ఒకటి నాలుక, మఱియొకటి పొట్ట. ఈ రెండింటిలో నాలుక మహాప్రమాదకరమైనది. పొట్ట అమాయకమైనది. దానికి 'అశుభము, శుభము' ఏమియు తెలియదు. ఏదివేసిన దానిని స్వీకరించును. కడుపు నిండినచో 'ఇక వేయవద్దు' అని మాత్రము హెచ్చరిక చేయును. కాని ఆ హెచ్చరికను నాలుక లక్ష్యపెట్టదు. సంయమము తప్పి ఇంకను భుజించును. తత్ఫలితముగ అజీర్ణము, రోగము, తల తిరుగుడు సంభవింప ఒక నాలుకకే కాక, పొట్టకే కాక, అన్ని యింద్రియములకును కీడు వాటిల్లును. మఱియు ఉదరమునకు ఇంకొక సుగుణమున్ను కలదు. అది రుచులు కోరదు.

ఆకలిని తీర్చుమని మాత్ర మాదేశించును. దాని కోరిక అంత వఱకే. పదార్థము తీపిగా నున్నదా, పులుపుగా నున్నదా యను ప్రశ్నను అది లేవదీయదు. కాని నాలుక అట్లుకాదు. అది సాధకుని కొంప ముంచివేయును. పెక్కురుచులను, రుచికర పదార్థములను అయ్యది వాంఛించును. జీవుని వేధించుచుండును. ఈ నాలుకను జయించుట సాధకునకు ఒక గొప్ప సమస్యగా తయారై యున్నది.

జిహ్వేంద్రియములను జయించుట కొకే ఉపాయము కలదు. అదియే అభ్యాసము. అది కోరినది దానికి ఇవ్వకుండ కొంతకాల మభ్యాసము చేయవలెను. మొదటిలో కొంత కష్టముగనే యుండును. కాని అధిక సుఖముకొఱకు అల్ప సుఖమును ఎట్టైనను త్యాగము చేయవలసియున్నది. రుచుల వలన మనకు లభించు సుఖముకంటె బ్రహ్మానందము ఎన్నిరెట్లో అధికము కదా! లడ్డు మొదలైన తినుబండారముల వలన కలుగు సుఖ మెంతసేపుండును? పోనిండు, వానిని తినిన పిదప దానిని మఱచిపోవు స్థితి కలదా? లేదు. దానిని గూర్చిన సంస్కారము వెంటనే యుదయించుటచే మఱల అవి యెపుడు లభించునా యని ఒకే కలవరము పుట్టుచుండును. దానిచే మనశ్చాంచల్యము, అతృప్తి, తీరని వాంఛ ఒకదానివెంట మఱియొకటి పరుగులిడుచుండును. కాబట్టి కొంతబాధగా తోచినప్పటికిని ఆయారుచులను నిగ్రహించిననే జీవునకు ఎప్పటికైనను శ్రేయఃపదము సంప్రాప్తము కాగలదు. ఆ యల్పసుఖమును త్యజించిననే అనంతసుఖమును జీవుడు

నోచుకొనగల్గును. అట్టి త్యాగమువలన వానికి నష్టమగునది ఏమియు నుండదు. "శతే పంచాశత్" న్యాయము ననుసరించి, అనగా నూటిలో యాభై యిమిడియున్న చంద మున వారికి సంప్రాప్తించు బ్రహ్మానందమున విషయానందము లన్నియు కూడియే యున్నవని యెఱుగవలెను. కాబట్టి ప్రయత్నపూర్వకముగ నాలుక సరికట్టి, అల్పవిషయ సుఖ మును త్యజించి అనంతబ్రహ్మసుఖమును జీవుడు చేబట్ట వలయును.

ఈ ప్రకారముగా ఆహారశుద్ధి మోక్షప్రాప్తికి హేతు భూతమగుచున్నది. మోక్షము దేనివలన లభించుచున్నది? తత్త్వజ్ఞానమువలన? అది యెట్లు కలుగుచున్నది? శ్రవణమనన నిదిధ్యాసనములవలన, ఆ శ్రవణాదులు దేనిచే సంభవించు చున్నవి? బుద్ధిశక్తివలన. ఆ బుద్ధిశక్తి దేనివలన పరిపో షింపబడుచున్నది? ఆహారశక్తివలన ('తస్మాదన్నమయం మనః'). ఇవ్విధముగ ఆహారశుద్ధి మోక్షోపలబ్ధికి కారణ భూతమగుచున్నది. కనుకనే ఉత్తములగు సాధకులు ఆహార సంబంధమైన ఎన్నియో నియమనిష్ఠలు శీలించుచుందురు. కొందఱు అప్పుడప్పుడు ఉపవాసములు చేయుచుందురు. కొందఱు ఒకప్రొద్దు ఉందురు. కొందఱు పప్పులో ఉప్పు మాని వేయుదురు. కొందఱు పాలలో చక్కెర వదలివేయు దురు. కొందఱు భోజ్యవస్తువులలో కొన్నిటిని గయలో వదలిపెట్టి మఱల జీవితాంతమువఱకు వానిని తాకక యుందురు. కొందఱు చాతుర్మాస్యవ్రతము నాలుగు నెలలు

కొన్ని కొన్ని ఆహారపదార్థములను వారికి వారే నిషేధించు కొనుచుందురు. అట్లే కార్తీకమాసములోను, మాఘ మాసములోను, మఱికొన్ని పర్వదినములలోను కొందఱు ఆహారసంయమమును లెస్సగ శీలించుచుందురు. ఇది యంతయు దేనికొఱకు? స్వల్పమగు ఆహారవిషయమునందు ఇంత రాద్ధాంతమెందులకు? మహాత్ములకు తెలియక కాదు ఈ నియమము లేర్పఱచినది. వారా మార్గమున నడచిరి కనుక సాధనలందు ఎక్కడెక్కడ ప్రమాదమున్నదో, ఎక్కడెక్కడ పతనమునకు అవకాశమున్నదో స్వయముగ గుర్తించుకొని లోకులను ఆ విషయమందు హెచ్చరించిరి.

కావున ముముక్షువులు అధ్యాత్మరంగమున కీలక స్థానము వహించియున్న ఆహారవిషయమును చులకనగ త్రోసివేయక సంయమనతత్పరులై యుండవలెను. 'అన్నం బ్రహ్మ, భోక్తా చ బ్రహ్మ' అని ఉపనిషద్వాక్యము. తిన బడు అన్నము, తినునట్టి వ్యక్తి ఇరువురును బ్రహ్మస్వరూపులే యని దాని యర్థము. ఈ సత్యమును గీతయు బాగుగ ఋజువుచేసినది ఎట్లనిన—'సస్యములలో దాగి వానిని వృద్ధిపఱచుచు ధాన్యరూపముగ నేనున్నాను. ప్రాణుల దేహములందు జఠరాగ్నిగ వర్తించుచు భోక్తరూపముగ నేను వెలయుచున్నాను' అని శ్రీకృష్ణపరమాత్మ గీతయం దానతిచ్చెను. ఇవ్విధముగ భోక్త, భోజనము—రెండును భగవత్స్వరూపములే యని తెలిసినందున భోక్త తాను శుద్ధ

ధముగ నుండుటకును, భోజనము పవిత్రముగ నుండులాగునను జీవుడు ప్రయత్నించవలెను.

ఆహారమును బ్రహ్మభావనతో, దైవబుద్ధితో భుజించినచో ఆ యన్నము అమృతరూపముగ పరిణమించగలదు. భోజనమునకు పూర్వము భగవన్నామస్మరణ, గోవిందనామ సంకీర్తనచేయుటయో, లేక గీత 15 వ అధ్యాయము పఠించుటయో కావించిన చాల ఉత్తమము. అనేక ఆశ్రమములందు, మఠములందు, గృహములందు భోజనాత్పూర్వము గీత 15 వ అధ్యాయము పఠించు ఆచారము కలదు. భుజించుటకు పూర్వము చేతిలో తీర్థమును గ్రహించి—

బ్రహ్మార్పణం బ్రహ్మ హవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మ సమాధినా.

(భగవద్గీత 4-24)

అను మంత్రమును పఠించి తీర్థమును ఆహారముపై సంప్రోక్షించి తదుపరి భుజించవచ్చును. భోజనకాలమున వాగుడు మానివేయవలెను. లోకాభిరామాయణములు, 'ప్రపంచ' కబుర్లు, కోర్టు వ్యవహారములు అచటికి తీసికొని రాగూడదు.

'స్నానే చ భోజనే హోమే జపే మౌనం సమాశ్రయేత్.'

స్నానము చేయునపుడు, భుజించునపుడు, హోమమాచరించునపుడు, జపము సల్పునపుడు మౌనమును లెస్సగ నవలంబించవలెనని శాస్త్ర మాదేశించుచున్నది. మౌనముతో, పరిపూర్ణదైవభావనతో ఆహారమును భుజించుట మొదటి

పద్ధతి. ఇది ఉత్తమోత్తమము. గోవిందనామకీర్తన చేయుచు భుజించుట రెండవపద్ధతి. ఇది ఉత్తమము. లౌకిక సమాచారములు, వ్యాపారకబుర్లు, మార్కెట్ విషయములు మున్నగునవి చెప్పుకొనుచు భుజించుట మూడవ పద్ధతి. ఇది అధమము. కాబట్టి మొదటి పద్ధతులనే జను లాశ్రయించవలెను. ఇవ్విధంబుగ దేహమనంబుల పరిపోషణ కాధారభూతమై, అతిప్రధానమైనట్టి ఈ యాహారమును గ్రహించు పద్ధతిని శాస్త్రములవలన, పెద్దలవలన తెలిసికొని ముముక్షువులు తమ శరీరమును, మనస్సును పరిశుద్ధమొనర్చుకొనవలెను.

ఆత్మానందమను మహత్తర ఫలితము లభించవలెనని, ఇంద్రియార్థములవలన గలుగు అల్పసుఖమును ఎట్లైనను త్యాగమొనర్చి ఇంద్రియములను సంయమనముగావించవలెను. నోరు, ముక్కు, కన్ను, చెవి, స్పర్శేంద్రియము—వీనిని అదుపులో నుంచవలెను. అవి కోరినవన్నియు వానికి సమర్పించగూడదు. ఇంద్రియములు తమ సుఖమును గోరుకొనునే కాని మన సుఖమును గాదు. తమ శ్రేయస్సునే అవి లెక్కకు తీసికొనునుగాని మన శ్రేయస్సును గాదు. ఆ యింద్రియములందును ఆహారమునకు సంబంధించిన జిహ్వేంద్రియము, మఱియు గుహ్యేంద్రియము అతిబలవత్తరములైనవి. కావున వాని విషయమున సాధకులు అతిజాగరూకులై వ్యవహరింపవలసియుందురు. ముఖ్యముగ నాలుకను అరికట్టవలెను.

యోగస్య ప్రథమం ద్వారం వాఙ్నిరోధః. (వివేక చూడామణి)

అని శ్రీ శంకరాచార్యులవారు తెలిపినట్లు యోగము నభిలషించువాడు అనగా జీవాత్మ పరమాత్మల ఐక్యమును వాంఛించువాడు మొట్టమొదట తన నోటిని నిగ్రహింప వలెను. సృష్టికర్తచే జిహ్వేంద్రియమునకు రెండుపనులు (double work) ఏర్పాటుచేయబడినవి—మాట్లాడుట, రుచి చూచుట-అని. గుహ్యేంద్రియమునకున్ను అట్లే రెండుపనులు విధింపబడినది—మూత్రవిసర్జన, జననకర్మ-అని. తక్కిన ఇంద్రియములన్నిటికి ఒకేపని నిర్దేశింపబడుటవలన వాని యన్నింటికంటెను ఈ రెండును బలవత్తరములై వర్తించు చున్నవి. వీనిని జయించినచో ఇక జగత్తంతయు జయింప బడినట్లే. కాబట్టి నడుము బిగించి రణరంగమున దూకిన ఆధ్యాత్మికవీరుడు ఈ రెండిటిని నిగ్రహించుటయందు గొప్ప అధ్యవసాయమును, సాహసమును జూపును. తుట్టతుదకు వానిని సంయమముచేసి పరమార్థవిజయమును జేబట్టును.

కాబట్టి జిహ్వేంద్రియ సంయమమునకు సంబంధించిన కొన్ని నియమములు, వ్రతములు తప్పక శీలించవలెను. రుచులు కోరగూడదు. సాత్త్వికాహారమునే సేవించవలెను. అదియు మితముగా భుజించవలెను. భుజించుటకు ముందుగా ఆ పదార్థమును దైవమున కర్పించవలెను. మఱియు సేవింప బడు ఆహారము న్యాయార్జితముగా నుండవలెను. ఈ ప్రకారముగ ముముక్షువు తాను గైకొనునది. (1) సాత్త్వి కాహారము (2) మితాహారము (3) దైవార్పితాహారము

(4) న్యాయార్జితాహారము అయియుండులాగున చూడవలెను. చిత్తశుద్ధిని, తద్ద్వారా మోక్షమును అభిలషించు ప్రతి మానవుడును తన దేహాద్యుపాధియొక్క ప్రధానపరిపోషక పదార్థమగు ఆహారవిషయమై ఈ నాలుగు జాగ్రత్తలను తప్పక వహించవలసియున్నది. ఈ నాల్గింటినిగూర్చి ఇపుడు వివరముగ యోచించెదము.

(1) సాత్త్వికాహారము :— ఆహారముయొక్క సూక్ష్మాంశముచే మనస్సు ఏర్పడుటచేఁబట్టి సాధకుడు తాను గైకొను ఆహారము తమోగుణ, రజోగుణ ప్రేరకమైనది కాకుండ సత్త్వగుణాభివృద్ధికరముగనే యుండునట్లు చూడవలెను. ఆహారమునందు కారము, పులుపు, ఉప్పు క్రమముగ తగ్గించుకొనుచు రావలెను. మధుమాంసములను వర్జించవలెను. గీత 17 వ అధ్యాయమున భగవానుడు తెలిపిన రాజసతామసాహారములను విసర్జించి సాత్త్వికాహారమునే సేవించవలెను. అత్తఱి మనస్సున్ను సాత్త్వికములైన యుణువులచే విరాజిల్లుచుండును. ఇంతమాత్రముచేతనే ఆహార సంబంధమైన కట్టుబాటు పూర్తి అయినదా యనిన, కాదు, ఇంకను అనేక జాగ్రత్తలు దానినిగూర్చి వహింపవలసియున్నవి. ఆహారము సాత్త్వికమైనను దానిని అధికముగా భుజించుటవలనగూడ ప్రమాదము కలదు. కాబట్టి మితాహారపద్ధతినిగూడ అవలంబించవలెను.

(2) మితాహారము :—మన చుట్టును కావలసినంత గాలియున్నదిగదా యని యెవరైనా గాలిని ఎక్కువగా పీల్చు

చున్నారా? లేదు. ఎంత అవసరమో అంతే తీల్చుచున్నారు. మన చుట్టును బావులందు, చెఱువులందు, పంపులందు కావలసినన్ని నీళ్లున్నవిగదా యని యెవరైనా అధికముగా నీళ్లు త్రాగుచున్నారా? లేదు, ఎంత ఆవశ్యకమో అంతే స్వీకరించుచున్నారు. అట్టిచో ఒక్క ఆహారమును మితము దప్పి యేల భుజించవలయును? అట్లు భుజించుటవలన కడుపు బరువెక్కి ధ్యానము సరిగా జరుగదు.

ధ్యానముమాట అట్లుండనిండు. కొంచెముసేపు కూర్చొనుటకు కూడ సాధ్యపడదు. అధిక భుక్తుడు క్రిందపడి దొర్లుచు నానావస్థలు పడుచుండును. ఆయాసమును పోగొట్టుటకు భోజన మేర్పడినది. కాని మితిమీరి తినినచో ఆ భోజనమే ఆయాసమును గలుగజేయును. దానిపేరే 'భుక్తాయాసము.' జనులుకోరి తెచ్చుకొను జబ్బు ఇది.

మితిమీరి ఆహారమును గైకొనుటవలన మూడు అనర్థములు కలుగుచున్నవి. (1) భుక్తాయాసము తీర్చుకొనుటకై క్రిందపడి దొర్లుటలోను, నిద్రించుటలోను ఒకటి రెండు గంటలసమయము అమూల్యమగు ఈ మానవజీవితములో ప్రతిదినము వ్యర్థమైపోవుచున్నది. (2) తాను అధికముగా తినుటవలన, ఒకప్రాణియొక్క ఆహారములో కొంతభాగము తస్కరించినట్లే యగుచున్నది. తాను మితముగ భుజించినచో తనకు మిగిలిన ఆహారమువలన 'అన్నమో, రామచంద్రా' యని అల్లాడు బీదజను డొకడు పోషింపబడునుగదా! కావున అధికభోజనమువలన పరప్రాణియొక్క ఆహారమును దొంగి

లించిన మహాపాతకము జీవునకు సంభవించుచున్నది. (3) అతిశయభోజనముచే మనుజునకు ఆరోగ్యము భంగమై పోవుచున్నది. వైద్యులను ప్రశ్నించినచో ఎక్కువ రోగములు సంయమము తప్పి భుజించుటవలననే కలుగుచున్నవని చెప్పెదరు. ఇవియన్నియు మానవుడు కొని తెచ్చుకొను వ్యాధులే యని చెప్పవలసియున్నది. కాబట్టి పైన దెలిపిన మూడు అనర్థములును లేకుండుటకొఱకై సాధకుడు ఆహార విషయమునందు బహుజాగ్రత్త వహింపవలసియుండును. మితాహారమునే సేవించవలెను.

మితాహారముయొక్క లక్షణము లేవి యనిన—

ద్వౌ భాగే పూర యేద న్నైస్తోయేనైకం ప్రపూరయేత్
మారుతస్య ప్రచారార్థం చతుర్థమవశేషయేత్.

కడుపు మొత్తమును నాలుగు భాగములుగ ఊహించినచో, అందు రెండు భాగములను అనగా సగము కడుపును అన్నశాకాదులతో నింపవలెను. ఒకభాగమును అనగా పాతిక కడుపును నీళ్ళతో నింపవలెను. మిగత పాతిక భాగమును గాలియాడుటకొఱకు ఖాళీగా నుంచవలెను. శాస్త్రము లీప్రకారముగ ఆదేశించుచుండ కొందఱు రెండు భాగములు కాదు, మూడు భాగములు కాదు, నాలుగు భాగములున్ను అన్నముతో నింపి, నీళ్లు త్రాగుటకు కూడ చోటులేక, గాలి ఆడుటకు అవకాశమే లేక నానావస్థలు పడుచున్నారు. ఇట్టి వారికి ధ్యానాదులబ్బుట బహుప్రయాసము.

అయితే ఆహారముఏమాత్రము స్వీకరింపక కేవలము నిరాహారులుగ నుండువారికిన్ని ధ్యానము సరిగా కుదరదని గీతయందు చెప్పబడినది. ఏలయనగా, ఆహారము లేనందుచే శరీరము, మనస్సు రెండును శుష్కించును. అట్టిచో దైవ చింతనకే అవకాశముండదు. జడముగ రాతివలె పడియుండవలసివచ్చును. లేక నిద్రించవలసివచ్చును. తమోగుణ సంబంధమగు అట్టి స్థితివలన జీవునకేమాత్రమున్ను ప్రయోజనము లేదు. పూర్వము 'ఉరూవల' అను యరణ్యమున తపస్సు చేయునపుడు బుద్ధదేవుడు ఆహారమును బొత్తిగా మానివైచి శరీరమును క్షీణింపజేసెను. దానివలన మనస్సున్ను చింతనాశక్తిని గోల్పోవ, ధ్యానమే యాతనికి కొనసాగ లేదు. కూర్చొనుటకున్ను శక్తిలేకయుండెను. అట్టిచో సమీప గ్రామమునకు చాల ప్రయాసతో జని కొంచెమాహారమును స్వీకరించి తెప్పరించుకొనెను. అప్పటినుండియు బుద్ధదేవుడు తన ధ్యానాదులందు ఆహారవిషయమున మధ్యమార్గమును అవలంబించుచు చక్కని ఫలితములను బడయగల్గెను. కనుకనే భగవద్గీతయందు—

> యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు
> యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా.

అని బోధింపబడినది. అనగా ఆహార, విహార, నిద్రాదులందు యుక్తత్వమును (మితత్వమును) శీలించువానికి యోగము, (ధ్యానము) చక్కగా జరుగగలదని భావము. కాబట్టి ధ్యాననిష్ఠుడు తన సాధనలందు విజయమును జేబట్టు

టకై, పురోభివృద్ధిని బడయుటకై ఆహారాదులందు మితత్వ మును అభ్యసించవలెను.

(3) దైవార్పితాహారము:—ఆహారము సాత్త్వికము గను, మితముగను నున్నప్పటికిని భగవంతున కద్దానిని నివేదింపకుండ భుజించినచో అది సత్ఫలితముల నొసంగ జాలదు. అన్నమును మానవుడు సృష్టించలేదు. సర్వేశ్వరుడు తనయొక్క అమోఘదివ్యశక్తిచే భూమినుండి ఓషధులను సృజించి వానిని జీవుల కాహారముగ నొసంగెను. ఈ సత్య మును భగవాను డీక్రింది శ్లోకముద్వారా గీతయందు స్పష్టీక రించియుండెను.

గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా
పుష్ణామి చౌషధీస్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః.

కాబట్టి భగవాను డొసంగిన యాహారమును తిరిగి భగవానునకు సమర్పింపకుండ భుజించువాడు కృతఘ్నుడే యగును. మఱియు నట్టివాడు పాపమును భుజించువాడే యని గీతాచార్యుడు పేర్కొనియుండుట గమనింపదగినది. (భుఞ్జతే తే త్వఘం పాపా యే పచన్త్యాత్మకారణాత్). కావున ప్రతి వారును ఆహారమును భుజించుటకు ముందు దానిలోని కొంత భాగమును లేక ఒక కబళమును ఏదైన యొక ప్రాణికి పెట్టి, చేతియందు తీర్థమును గ్రహించి—

బ్రహ్మార్పణం బ్రహ్మ హవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా.

అను మంత్రమును ఉచ్చరించి, ఆ తీర్థమును అన్నాదులపై ప్రోక్షించి దైవభావనతో భుజించవలెను. ఈ ప్రకారముగ భగవానునకు నివేదించి దైవభావముతో భుజింపబడు యాహారము అమృతతుల్యమై జీవునకు పరమశ్రేయమును ఒనగూర్చగలదు.

4. న్యాయార్జితాహారము :—అన్యాయముగ ఆర్జించిన విత్తముతో ఏర్పడు ఆహారము అపవిత్రమై యుండును గావున దానిని స్వీకరించుటవలన సాధకుని చిత్తమునకు మాలిన్య మేర్పడగలదు. ఇక్కారణమున ఆహారమున సంపాదించుమార్గము న్యాయమైనదిగ, ధర్మపూర్వకమైనదిగనుండుట అత్యావశ్యకము. ఇతరులను కొల్లగొట్టి, బాధించి, మోసముచేసి తెచ్చు ద్రవ్యముచే నేర్పడు ఆహారము పవిత్రమైనది కాదు. కాబట్టి ఈ విషయమై కూడ సాధకులు చాల జాగరూకులై యుండవలెను.

ఇవ్విధముగ ముముక్షువు తాను గ్రహించు ఆహారము సాత్త్వికమైనదియు, మితమైనదియు, దైవార్పితమైనదియు, న్యాయార్జితమైనదియు అయి యుండినచో, అద్దానిచే నేర్పడు, శరీరము, మనస్సు—రెండును పవిత్రవంతములై యలరుచు పరమాత్మసాధనమున యాతనికి మహోపకృతి నొనగూర్చగలవు.

మఱియు భుజించునపుడు మౌనముగా నుండవలెను. ప్రాపంచికవిషయము లెవ్వియు అచ్చోట ప్రస్తావింపబడ

రాదు. దైవభావముతో భుజించవలెను. అత్తటి యా భోజనము అమృతముగా పరిణమించి, జీవుని రక్తమును, మేదస్సును పరిశుభ్రపఱచి దైవగంధయుతముగ నొనర్పగలదు.

భోజనవిషయమై ఈ క్రింది నియమములనుగూడ పాటించుట మంచిది—

(1) దినమున కనేకసార్లు భుజింపరాదు. రెండు పర్యాయములు లేక సాధ్యమైనచో ఒక పర్యాయము భుజించుట ఆరోగ్యకరము.

(2) భోజనమునకు భోజనమునకు మధ్య చిరుతిండి తినరాదు.

(3) మితముగా పెట్టించుకొని, పెట్టించుకొనిన పదార్థమును పారవేయక భుజించవలెను. పారవేసినచో బ్రహ్మస్వరూపమగు అన్నమును నిందించినట్లే యగును. (అన్నం బ్రహ్మ—అన్నం న నిన్ద్యాత్, తద్వ్రతమ్).

(4) భోజనకాలమున ఏమియు మాట్లాడరాదు. దైవభావము గల్గి భుజించవలెను.

ఈ ప్రకారముగ ఆహారవిషయమై తగుజాగ్రతలు వహించినచో సాధకుని దేహమనంబులు పరిశుద్ధములు కాగా, అధ్యాత్మమార్గ మతనికి అత్యంతసుగమమై యొప్పారగలదు. ఆరోగ్యవిషయమున అపక్వాహారమున్ను గొప్ప సత్ఫలితములను కలుగజేయగలదు.

## అపక్వాహారము

సృష్టియందు 84 లక్షల జీవరాసులున్నప్పటికిని వంట చేసికొని భుజించువాడు అందు మానవుడొక్కడే అయి యున్నాడు. తక్కిన (84 లక్షలు - 1) జీవరాసులన్నియు అపక్వాహారమునే భుజించుచున్నవి. ప్రకృతిసిద్ధమగు ఆహారమునే కైకొనుచున్నవి. తత్ఫలితముగ ఆరోగ్యముగ నుండుచున్నవి. మానవుడో, ప్రకృతియందు నైజముగ లభించిన ఆహారపదార్థములను వికృతమొనర్చి, జిహ్వాచాపల్యముచే వానికి పెక్కురుచులను కల్పించి భుజించుటవలన ఆరోగ్యము చెడుటచే పెక్కువ్యాధులకు లోనగుచున్నాడు.

ఈ ప్రపంచమున ఆరోగ్యమునకు మించిన వస్తువు మఱియొకటిలేదు. ఆరోగ్యమే మహాభాగ్యము. (Health is Wealth). రోగియగువాడు ప్రపంచమున ఏ కార్యమును సాధించలేడు. మఱియు ఐహిక, ఆముష్మికసుఖములను వేనినిగూడ అనుభవించనులేడు. కోటిరూప్యము లున్నప్పటికిని కడుపునొప్పితో బాధపడువాని కేమైనా సుఖముండునా? భూమండలమున కంతకును ఏకచ్ఛత్రాధిపతియైనప్పటికిని, గొప్పఅధికారము, పదవి లభించినప్పటికిని, జీర్ణకోశమునం దేదైన లోపముండినచో మనుజుని ముఖమున ఆనందము కన్పించునా? కాబట్టి సమస్తసుఖములకును, సాధనలకును, వ్యావహారిక, పారమార్థికక్రియలకును ఆరోగ్యమే మూలకందము. "శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్" అని శాస్త్రజ్ఞులు చెప్పనే చెప్పిరి.

అట్టి ఆరోగ్యమును కాపాడుకొనుటకు ఎట్టి ఆహారము మనుజునకు ఆవశ్యకమో విచారించవలసియున్నది. ప్రకృతి యందు స్వతస్సిద్ధముగ లభించిన వస్తువులను ఉడకబెట్టి నపుడు వానియందలి కొన్ని జీవాణువులు నశించిపోవును. దృష్టాంతమునకు ఒక పెసరగింజగాని, శనగగింజగాని, కంది గింజగాని యున్నదనుకొనుడు. దానిని భూమిలో పెట్టి ఒకటి రెండురోజులు నీళ్లు చల్లినచో వెంటనే మొలకెత్తును. దాని యందలి జీవశక్తుల త్తటె వికసించును. కాని ఆ గింజనే పెన ముపై వేయించి లేక ఉడకబెట్టి భూమియందు నాటినచో కోటిసంవత్సరములకైనను అది మొలకెత్తనేరదు. కారణ మేమి? దానిలోని జీవకణములు కొన్ని నశించిపోయినవి. జీవశక్తులచే పరిపూర్ణమైయున్న పదార్థమును గైకొనుటయే మనుజునకు ఉత్తమము. అనగా పక్వముకాని వస్తువును, అపక్వాహారమును స్వీకరించుటయే ఆరోగ్యకరము. అయితే గోధుమలుకాని, పెసలుకాని, శనగలుకాని పచ్చివి నమలు టకు కఠినముగా నుండును గావున వానిని కొంతసేపు నీటిలో నానవేసి భుజించవచ్చును. తాజాఫలములను స్వీకరించుట వలన ఆరోగ్యమెంతయో పెంపొందును.

అపక్వాహారము గైకొనువారికి నారికేళము (కొబ్బరి కాయ) అతిముఖ్యమైనది. మనపూర్వులు నారికేళమునకు ఎంతయో పూజ్యత్వమును కల్పించిరి. దేవతలందరికిని నారి కేళము ప్రియమగు నైవేద్యముగా సమర్పింపబడుచున్నది. ఇంటియందుగాని, దేవాలయమునందుగాని ఏపూజ జరిగినను

ఆహారమును స్వీకరించుట మంచిది. బాగుగ అభ్యాసమైన వెనుక పూర్తిగ అన్నమును విసర్జించవచ్చును. ఈ అపక్వాహారమును సాధించు కాలములో పాత మురికి రక్తముపోయి మనుజునకు దాని స్థానమందు క్రొత్తనిర్మల రక్తమేర్పడును. కావున ఆ మార్పుదల సమయమున ఒకవేళ ఏవైన కురుపులు, దగ్గు, మొదలైన వికారము లొకింత కనుపించినను దాని చే సాధకుడు ఏమాత్రము జంకరాదు. బెదిరిపోరాదు. తన నియమమును అప్రతిహతముగ కొనసాగించుచునే యుండవలెను. అట్లు చేసినచో కొంత కాలమునకా వికారములన్నియు తొలగిపోయి చక్కని ఆరోగ్యము మనుజున కేర్పడగలదు. కొందఱు కొబ్బరి అజీర్ణమును గలుగజేయుననియు, అరటిపండు వాతమనియు, గోధుమలు వేడిచేయుననియు, శనగలు కడుపుబ్బరము కలిగించుననియు - ఇట్లు పరిపరివిధములుగ ఆయా వస్తువులను గుఱించి చెప్పెదురు. కాని, ఆయా వికారములన్నియు ఉడికిన పదార్థముల (అన్నాదుల)తో బాటు వానిని అధికముగ స్వీకరించినపుడు ఒకవేళ కలిగిన కలుగవచ్చునేమోగాని, ఉడికిన పదార్థమును పూర్తిగ త్యజించి కేవలము వానినే సేవించునపుడు అనగా అపక్వాహారమును గైకొనునపుడు ఎంతయో ఆరోగ్యమును గలుగజేయును. పైగా పెక్కు రోగాదులను నివారించును. కాబట్టి ఆరోగ్యమును కాంక్షించువారు, రోగబాధను తొలగించుకొనదలంచువారు ప్రయత్నపూర్వకముగ కొంతకాలమైనను ఈ అపక్వా

హారమును శీలించుట ఉత్తమము. అధ్యాత్మరంగమున ప్రవర్తించు సాధకులకీ యుపక్వాహారము ఎనలేని సహాయమును చేకూర్చును. ఏలయనగా సత్త్వగుణము నయ్యది మిక్కుటముగ అభివృద్ధిపఱచి రజోగుణ తమోగుణములను పారద్రోలును. కావున ముముక్షువుల కీయాహారము వరప్రసాదమే యగును.



టెంకాయ కొట్టవలసినదే. కలశములపై నారికేళములనుంచి వానిని దైవస్వరూపములుగ భావించి పూజించుచుండుట పూజాదులందు జనులకు నిత్యాచారమై యున్నది. కొబ్బరి కాయయొక్క యాకారమును జూచినను అది మానవుని శిరమును బోలియుండును. రెండునేత్రములు, ఒకనోరు, జుట్టు, నోరు, మెదడు, రక్తము (నీరు) గలిగి యలరుచుండును, దీనిని 'విశ్వామిత్రప్రియ' యనియు కొందఱు చెప్పుదురు.

ఆరోగ్యమునకు ఎంతయో సహాయపడునట్టిదియు, అతివిలువ గలిగినదియునగు 'రేడియం' అను పదార్థము కొబ్బరికాయయందు ఎక్కువగ గలదని ఇటీవల శాస్త్రజ్ఞులు పరిశోధనచే కనిపెట్టిరి. ఇంకను కొబ్బరియందు ఈ క్రింది పదార్థములు కలవని తేల్చబడెను.

—(నూరు వంతులలో)

| | |
|---|---|
| మాంసకృతులు (Protieds) | 6.6 |
| క్రొవ్వుపదార్థములు (Fats) | 56.2 |
| పిండిపదార్థములు (Carbo-Hydrates) | 13.7 |
| లవణములు (Mineral Salts) | 1.6 |
| పిప్పి (Crude fibre) | 8.9 |
| నీరు (Water) | 13.0 |
| | 100.0 |

దీనినిబట్టి శరీరపుష్టికి, ఆరోగ్యమునకు వలసిన పదార్థములు నారికేళమునందు విశేషముగ కలవని స్పష్టపడుచున్నది. దంతపుష్టికలవారు కొబ్బరిని ముక్కలుగా చేసి తినవచ్చును. దంతపుష్టిలేనివారు తురుముకొని తినవచ్చును. కొబ్బరి, అరటిపండ్లు, గోధుమలు, శనగలు లేక పెసలు— ఈ నాలుగున్ను అపక్వాహారము స్వీకరించువారికి చాల అవసరములై యున్నవి. గోధుమలు, శనగలు, లేక పెసలు నానవేసికొని భుజించవలెను. మొలకవచ్చినపిదప తినుటయు మంచిదే. వారివారి జీర్ణశక్తిననుసరించి, ఆకలి ననుసరించి పూటకు ఒక గుప్పెడుగాని, రెండు గుప్పెళ్లుగాని, లేక మూడు గుప్పెళ్లుగాని గోధుమలు, శనగలు, లేక పెసలు వాడుకొనవచ్చును. పండ్లు ఏవి భుజించినను మంచిదే. కాని అన్నిటికంటె అరటిపండు శ్రేష్ఠమైనది. అది సులభముగను, చవుకగనుగూడ లభించును. పండ్లుదొరకనిచో పచ్చి కాయగూరలు కూడ వాడుకొనవచ్చును. ఉడికిన పదార్థమేమియు లేక, రెండుపూటలు ఈ అపక్వాహారము భుజించుట సర్వశ్రేష్ఠము. దానిచే రోగములున్ను హరించిపోవును. కావున రోగములు కలవారు కనీసము వారి రోగములు తొలగువఱకైనను ఈ అపక్వాహారమును శీలించుట చాల ఉత్తమము. ఇక, ఎల్లప్పుడును శీలించినచో అంతకు మించినదే లేదు.

ఒకవేళ రెండుపూటలు అపక్వాహారమును సాధింపలేనిచో కనీసము రాత్రిపూటయైన అన్నము మాని ప్రకృతి

# 13 వ అధ్యాయము

---

## వైరాగ్యసాధన

ఈ ప్రకారముగ ఆహారనియమముద్వారా సాధకుడు తన ఆరోగ్యమును చక్కగ కాపాడుకొని మోక్షసాధనలను ఉపక్రమించవలెను. మోక్షసాధనలలో మొట్టమొదటిది వైరాగ్యము. మనస్సుయొక్క మదమును అణచుటకును, మనస్సును బాహ్యమునుండి మరల్చి అంతర్ముఖము చేయుటకును వైరాగ్యమును మించిన సాధనోపాయము వేఱొకటి లేదు. వైరాగ్యముచేతను, అభ్యాసముచేతను మనస్సుయొక్క నిలుకడ సాధింపవచ్చును. మనస్సు నిలుకడలేనిచో శాంతి ఎవరికిని లభించదు. రాజాధిరాజయి సమస్త భోగభాగ్యములతో తులతూగుచున్నవాడైనప్పటికి మనస్సు చపలముగా నున్నచో ఆతనికి శాంతి ఏమాత్రము కలుగనేరదు. మనస్సు నిశ్చలముగాను, నిర్మలముగాను ఉన్నవాడు ప్రపంచములోని సమస్తసుఖములను పుణికిపుచ్చుకొనినవాడే యగును. కావున మనోనిశ్చలత్వము మోక్షకాంక్షులకు అత్యంతావశ్యకమై యున్నది. అయితే దానిని సాధించుటెట్లు? సర్వజ్ఞుడగు శ్రీకృష్ణపరమాత్మ అందులకు రెండు ఉపాయములను సెలవిచ్చియుండెను. అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను మనస్సును సులభముగ జయించవచ్చుననియు, దాని ఆటను వెంటనే కట్టివేయవచ్చుననియు ఆతడు

పేర్కొనెను. అట్టివైరాగ్యమను మహత్తర సాధననుగూర్చి ఇపుడు పర్యాలోచించెదము.

సృష్టిలోని జీవరాసులన్నిటిలో మహాచపలమైన ఒకానొక జీవి కలదు. అదియే కోతి. ఆ కోతి ఒకనాడు కల్లు త్రాగినదట. కల్లు త్రాగి గంతులు వేయుచుండగా తేలు కుట్టినదట. తేలుకుట్టి నానావస్థలు పడుచుండగా దయ్యము పట్టినదట. ఇక ఆ కోతియొక్క చపలత్వము చెప్పతరమా? శాస్త్రకారులు మనస్సును ఆవిధమైన కోతికి పోల్చి చెప్పిరి. అంత మహాచపల వస్తువును దారికి తెచ్చుటెట్లు? దానిని ఒకచోట స్థిరముగా నుంచుటకు మార్గమేమి? గీతాచార్యుడీ ప్రశ్నకు సూటియైన సమాధాన మొసంగివైచెను. 'అభ్యాసము చేయుడు, మనస్సు లొంగిపోవును. వైరాగ్యమును చేపట్టుడు. మనస్సు దారికివచ్చును—' అని భగవానుడు చక్కని హితబోధ కావించెను.

వైరాగ్యమనగా ఇల్లు, వాకిలి విడిచి ఏకాంతమునకు బోవుట కాదు. సంసారమునకు తిలాంజలి యొసంగి కొండ గుహాలో దాగుకొనుట కాదు. కుటుంబమును, వ్యవహారమును వదలివేయుట కాదు. గీతాచార్యుడాప్రకారము బోధించలేదు. భగవద్గీతను సాకూతముగ వినిన అర్జునుడే రాజ్యమును పరిత్యజించలేదు. ఇక తక్కినవారిమాట చెప్పవలెనా? వ్యవహారమును మాత్రము అతడు సరిదిద్దుకొనెను. ధర్మపూర్వకముగ సంగ్రామ మాచరించెను.

Bhagavad Geeta teaches not renunciation of action, but renunciation in action.

'గీత బోధించినది కర్మత్యాగము కాదు, కర్మయందలి కర్తృత్వత్యాగము, కర్మయందలి అహంభావత్యాగము.'

కాబట్టి వైరాగ్య మవలంబించువారు కర్మత్యాగము చేసి ఎక్కడికిని పోనక్కర లేదు. వస్తువునందలి దోషము తెలిసికొని ఆ వస్తువుయెడల మమత్వము విడనాడుటయే వైరాగ్యము. వస్తువుయెడల అనాసక్తి, విరాగము కలిగి యుండుటయే వైరాగ్యము. కాని బహుజన్మార్జితవాసనా బలముచే జనుల మనస్సు ఇంద్రియార్థములగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములపైకి ఉరుకుచున్నది. తన పుట్టిల్లగు ఆత్మయందు క్షణకాలమైనను ఉండక మనస్సు బహిర్ముఖముగ ప్రవర్తించుచున్నది. ఇక్కారణమున అది శాంతిని నోచుకొనలేక పోవుచున్నది. శాంతినిలయమగు ఆత్మకు చేరువగుచుండుకొలది మనస్సు పరమానందమును, పరమ శాంతిని అనుభవించుచుండును. దూరమగుచుండుకొలది దుఃఖమును, అశాంతిని బొందుచుండును. కాబట్టి శాంతికి ఏకైకమార్గము బయటకు బరుగెత్తుచుండు మనస్సును లోపలికి తీసికొని వచ్చుటయే; దానికి చక్కగ హితబోధచేసి అంతర్ముఖ మొనర్చుటయే. బాహ్యవస్తువులయందుగల దోషమునుగూర్చి బాగుగ నచ్చచెప్పి అంతరాత్మయందు ప్రీతిని వర్ధిల్లచేయుటయే. ఇట్టి ప్రక్రియ వైరాగ్యమువలననే సాధ్యపడగలదు.

దృశ్యవస్తువులయెడల విరాగము ఏల కలిగియుండవలెనో విచారించుట అవసరము. మానవుడు ఒక గొప్ప లక్ష్యమును సాధించుటకొఱకు ఈ దేహమును ధరించియున్నాడను సత్యమును ఎవరును విస్మరించరాదు. తన నిజ స్వరూపమగు ఆత్మను అనుభూతమొనర్చుకొని, బంధవిముక్తుడై, అనాదికాలమునుండి కొనసాగుచున్న ఈ జననమరణ రూప భీషణ సంసారపరిభ్రమణమును నిలుపుదలచేసికొని ఆత్యంతిక శాంతిసుఖములను అనుభూతమొనర్చుకొనుటకే ఈ జన్మ ఏర్పడినదని మనుజుడు మఱువరాదు. అట్లితఱి, మనస్సు ఆత్మను వదలి, బహిర్ముఖముగ జనుచు దృశ్యవస్తువులపై మోజుకలిగి నిరంతరము ఆయా పదార్థములపైననే వ్రాలుచుండినచో ఇక ఆత్మసాక్షాత్కారమను జీవితలక్ష్యమెట్లు కార్యాన్వితమొనర్పబడగలదు? అక్కార్యమెట్లు సాధింపబడగలదు?

## Nobody can ride on two horses.

'రెండు గుఱ్ఱములపై ఒకేసారి ఎవరును స్వారిచేయలేరు.' అనాత్మపై వ్యామోహము కలిగియుండి ఆత్మను ఎవరును సాక్షాత్కరించుకొనలేరు. భోగైశ్వర్యప్రసక్తిగలవారి చిత్తమును ఆయా విషయభోగములు హరించివైచి ధ్యానమందు నిలుకడ కలుగనీయక చేయునని గీతాచార్యుల వాక్యము.

భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసామ్
వ్యవసాయాత్మికాబుద్ధిః సమాధౌ న విధీయతే. (భగవద్గీత 2_44)

కావున విజ్ఞులగువారు తమ మనస్సు పరిపరివిధములా బాహ్యావస్తువులపైకి పరుగిడక ఆత్మయందు నిలుకడ కలిగి యుండుటకై విరాగమును తప్పక అవలంబించవలసియున్నది. అది యెట్లేర్పడగలదు? దానిని సాధించుటకు మార్గమేమి? దీనికి ఒకేఒక సులభమైన పద్ధతికలదు. వస్తువునందుగల దోషమును చక్కగ విచారించినచో ఇక మనస్సు ఆ వస్తువుయెడల విరక్తికలిగియుండును. దానిని వాంఛింపదు. దృష్టాంతమునకు - ఒకడు పంచభక్ష్యపరమాన్నములతో గూడిన రాజభోజనము తినుటకు ఉద్యుక్తుడై, అత్యాసక్తితో భుజించుటకు ఉపక్రమించు సమయమున ఎవడో వచ్చి—'అయ్యా! అన్నము వండునపుడు దానిలో ఒక పెద్ద పురుగు పడి చచ్చినది'—అని చెప్పినచో ఇక ఆ భోజనము నాతడు ఆరగించునా? దానిపై పూర్తిగ విరక్తి జనించును. అట్లే భోగ్యపదార్థములందుగల దోషములు తెలిసియున్నచో వానిపై జనులకు వాంఛ ఉదయించదు. దీనినే భగవానుడు 'దుఃఖదోషానుదర్శనము' (13-9) అని గీతయందు వచించి యున్నాడు.

అయితే, దృశ్యవస్తువులందలి ఆయా దోషములు కల్పింపబడినవి కావు, కృత్రిమములు కావు, ఊహాజనితములు కావు. అవి వానియందు స్వతఃఉండియున్నవే యగును. ఆ దోషములలో అన్నిటికంటె ప్రధానమైనది పదార్థముల నశ్వరత్వము, క్షణికత్వము. ప్రపంచములో ఎంత చక్కని వస్తువైనను కొలదికాలములో నశించిపోవుచున్నది. శాశ్వ

తమై, స్థిరమై, అవిచ్ఛిన్న ఆనందమును కలుగజేయునదైన వస్తువొకటియు ఈ దృశ్యప్రపంచమున లేదు. మహామహా రాజు లుద్భవించిరి. సామ్రాజ్యములు వెలసినవి. కాని అవి యన్నియు కాలగర్భమున చితికిపోయి నామమాత్రావశిష్టము లైనవి. అనుభవించిన ఆ రాజులందఱు అదృశ్యులైరి. అనుభవింపబడిన ఆ భోగములన్నియు క్షీణించిపోయినవి. ఇక అట్టి క్షణికవస్తువులకొఱకై విజ్ఞుడు పరువిడునా? పూర్వము జనక మహారాజు ఈ ప్రకారముగనే చక్కని విచారణచేసి సత్యమగు ఆత్మవస్తువును తెలిసికొని అసత్యమగు రాజ్యభోగాదు లందు విరక్తి కలిగి, వానియందు తగులుకొనకుండ లోకమున వ్యవహరించెను.

ప్రదృశ్యతే వస్తుని యత్రదోషః
న తత్ర పుంసోఽస్తి పునః ప్రవృత్తిః.

వస్తువునందలి దోషమును తెలిసికొనినవాడు ఇక ఆ వస్తువుకొఱకై ఎన్నడును పరుగిడడు. కావున దృశ్యవస్తువునందుగల 'నశ్వరత్వము, క్షణికత్వము' అను దోషములను తెలిసికొని మనుజుడు వానిపై ఎగబడక శాశ్వత ఆత్మకొఱకే అన్వేషించుట శ్రేయస్కరము.

ఈ సందర్భమున భర్తృహరి వచించిన చక్కని వాక్యములు ఉదాహరింపదగినవి—

రమ్యం హర్మ్యతలం న కిం వసతయే శ్రావ్యం న గేయాదికం
కిం వా ప్రాణసమాసమాగమసుఖం నైవాధికప్రీతయే

కావున విజ్ఞులగువారు తమ మనస్సు పరిపరివిధములా బాహ్యవస్తువులపైకి పరుగిడక ఆత్మయందు నిలుకడ కలిగి యుండుటకై విరాగమును తప్పక అవలంబించవలసియున్నది. అది యెట్లేర్పడగలదు? దానిని సాధించుటకు మార్గమేమి? దీనికి ఒకేఒక సులభమైన పద్ధతికలదు. వస్తువునందుగల దోషమును చక్కగ విచారించినచో ఇక మనస్సు ఆ వస్తువుయెడల విరక్తికలిగియుండును. దానిని వాంఛింపదు. దృష్టాంతమునకు - ఒకడు పంచభక్ష్యపరమాన్నములతో గూడిన రాజభోజనము తినుటకు ఉద్యుక్తుడై, అత్యాసక్తితో భుజించుటకు ఉపక్రమించు సమయమున ఎవడో వచ్చి— 'అయ్యా! అన్నము వండునపుడు దానిలో ఒక పెద్ద పురుగు పడి చచ్చినది'—అని చెప్పినచో ఇక ఆ భోజనము నాతడు ఆరగించునా? దానిపై పూర్తిగ విరక్తి జనించును. అట్లే భోగ్యపదార్థములందుగల దోషములు తెలిసియున్నచో వానిపై జనులకు వాంఛ ఉదయించదు. దీనినే భగవానుడు 'దుఃఖదోషానుదర్శనము' (13-9) అని గీతయందు వచించి యున్నాడు.

అయితే, దృశ్యవస్తువులందలి ఆయా దోషములు కల్పింపబడినవి కావు. కృత్రిమములు కావు. ఊహాజనితములు కావు. అవి వానియందు స్వతఃఉండియున్నవే యగును. ఆ దోషములలో అన్నిటికంటె ప్రధానమైనది పదార్థముల నశ్వరత్వము, క్షణికత్వము. ప్రపంచములో ఎంత చక్కని వస్తువైనను కొలదికాలములో నశించిపోవుచున్నది. శాశ్వ

తమై, స్థిరమై, అవిచ్ఛిన్న ఆనందమును కలుగజేయునదైన వస్తువొకటియు ఈ దృశ్యప్రపంచమున లేదు. మహామహా రాజు లుద్భవించిరి. సామ్రాజ్యములు వెలసినవి. కాని అవి యన్నియు కాలగర్భమున చితికిపోయి నామమాత్రావశిష్టము లైనవి. అనుభవించిన ఆ రాజులందఱు అదృశ్యులైరి. అనుభవింపబడిన ఆ భోగములన్నియు క్షీణించిపోయినవి. ఇక అట్టి క్షణికవస్తువులకొఱకై విజ్ఞుడు పరువిడునా? పూర్వము జనక మహారాజు ఈ ప్రకారముగనే చక్కని విచారణచేసి సత్యమగు ఆత్మవస్తువును తెలిసికొని అసత్యమగు రాజ్యభోగాదులందు విరక్తి కలిగి, వానియందు తగులుకొనకుండ లోకమున వ్యవహరించెను.

ప్రదృశ్యతే వస్తుని యత్రదోషః
న తత్ర పుంసోఽస్తి పునః ప్రవృత్తిః.

వస్తువునందలి దోషమును తెలిసికొనినవాడు ఇక ఆ వస్తువుకొఱకై ఎన్నడును పరుగిడడు. కావున దృశ్యవస్తువునందుగల 'నశ్వరత్వము, క్షణికత్వము' అను దోషములను తెలిసికొని మనుజుడు వానిపై ఎగబడక శాశ్వత ఆత్మకొఱకే అన్వేషించుట శ్రేయస్కరము.

ఈ సందర్భమున భర్తృహరి వచించిన చక్కని వాక్యములు ఉదాహరింపదగినవి—

రమ్యం హర్మ్యతలం న కిం వసతయే శ్రావ్యం న గేయాదికం
కిం వా ప్రాణసమాసమాగమసుఖం నైవాధికప్రీతయే

కిన్తు భ్రాన్త పతఙ్గపక్షపవన వ్యాలోల దీపాంకుర
చ్ఛాయా చంచలమాకలయ్య సకలం సన్తో వనాన్తం గతాః.

'నివసించుటకు పెద్దమేడ బాగుండదా? వినుటకు చక్కని పాటలు శ్రావ్యముగా నుండవా? దేహాసంబంధ ఐహికసుఖములు ఆనందమును గొల్పవా? ఇవియన్నియు సుఖమును గలిగించునవియే. కాని ఎంతవఱకు? అవి అనిత్యమని తెలియనంతవఱకు. ఏక్షణమందు ఆ ప్రాపంచిక సుఖములు దీపముచుట్టు తిరుగాడు మిడుతల రెక్కలచే కదలు అగ్నిశిఖవలె అస్థిరమని యెఱుగుదురో ఆక్షణమందే మహనీయులు వానియెడల విరక్తి కలిగి ఆ అల్పసుఖములను ఆశింపక పరమాత్మనే ధ్యానించుటకు ఉపక్రమించుచున్నారు.'

ఎపుడు మనస్సు ఆత్మేతర వస్తువులందు విరాగము కలిగియుండునో, అపుడు సహజముగనే అది ఆత్మవైపునకు మఱలును. ఎపుడు బహిర్ముఖ పదార్థములను వివర్జించుకొనునో, అపుడు అంతర్ముఖ ఆత్మవస్తువునందు ప్రీతిగొనును. ఎపుడు ఆత్మయందు మనస్సు స్థాపితమగునో అపుడు ఉప్పుకల్లు సముద్రమునందు కరిగిపోవువిధమున మనస్సు అధిష్ఠానాత్మయందు లయమై ఆత్మాకారముగ భాసించును. అదియే మోక్షస్థితి. అట్టి ఆత్మసాక్షాత్కారమే మానవజీవితము యొక్క చరమలక్ష్యము. కావున సాధకుడు అభ్యాసవైరాగ్యములను రెండు మహత్తర సాధనలద్వారా మనస్సును క్రమక్రమముగ విశుద్ధసత్త్వగుణోపేతముగ నొనర్చి దాని

జన్మస్థానమగు ఆత్మయందు విలీనముగావించి ఈ జన్మయందే మోక్షధామ మలంకరించుటకై అపూర్వప్రయత్నములను గావించవలెను.

## యోగము - భోగము

అజ్ఞాని మాయకు, ప్రకృతికి లోబడి దృశ్యపదార్థములనే సత్యముగ నమ్మి విషయానందమునే తన జీవితలక్ష్యముగ నొనర్చుకొనుచున్నాడు. బాగుగ విచారించి చూచినచో ఆ విషయములందలి సుఖము కేవలము మనఃకల్పితముగనే తేలుచున్నది.

'రోగశాంతికరకృత్యము భోగమనంగ జెల్లునే'— అని భర్తృహరి నిలదీసి ప్రశ్నించెను.

భోగము వాస్తవముగ భోగముకాదు; అది రోగమును శమింపజేయుటకు గావించు కార్యము మాత్రమే అని యాతడు వచించెను. ఎట్లనిన 'దప్పిక' అను రోగము వచ్చినపుడు చల్లటి పానీయములు, సోడా, లైమ్‌జ్యూస్, క్రష్-ఇత్యాది పదార్థములను త్రాగి ఆ రోగమును మనుజుడు తొలగించుకొనుచున్నాడు. అట్టిచో ఆ పదార్థములు ఔషధములే యగునుగాని భోగ్యవస్తువు లెట్లగును? అదేవిధముగ ఆకలి అను రోగము తగులుకొనునపుడు అన్నము, కూరలు, పిండివంటలు మున్నగు వస్తువులను సేవించి ఆ రోగమును తొలగించుకొనుచున్నాడు. కావున అన్నము, ఫలహారములు మున్నగునవి మందులే యగును. అట్లే కామాగ్ని యను

జ్వరము రగుల్కొనినపుడు శృంగారచేష్టలను ఔషధము సేవించి దానిని శమింపజేసికొనుచున్నాడు. కాబట్టి మనుజుడు తాను గొప్పగ తలంచునట్టి ఆ యా భోగములన్నియు రోగ నివారణకృత్యములే యగుచున్నవి.

ప్రతీకారో వ్యాధే స్సుఖ మితి విపర్యస్యతి జనః

వ్యాధిప్రతీకారచర్యనే సుఖమని తలంచి మానవుడు భ్రమించుచున్నాడు. వాస్తవముగ అది సుఖము కాదు. సుఖాభాసమే. సుఖము భగవంతుని పాదపద్మములను సేవించుటయందే కలదు. యోగమునందే కలదు. హృదయమందు వెలుగొందుచున్న పరమాత్మను భజించుటయందే కలదు. 'సుఖమక్షయమశ్నుతే' అని భగవానుడు తెలిపినట్లు అట్టి పరమాత్మను ఆశ్రయించినవారు అక్షయసుఖమును పొందుచున్నారు. కనుకనే శ్రీకృష్ణమూర్తి గీతయందు సమయము దొరికినపుడంతయు 'మయ్యాసక్తమనాః'—నాయందే ఆసక్తిగల మనస్సుకలవాడై యుండుము; మదాశ్రయః—నన్నే ఆశ్రయింపుము; 'మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాంతరన్తి తే'–నన్ను ఎవరు శరణుబొందుదురో వారే మాయను దాటగలరు—అని ఈ ప్రకారముగ మరల మరల నొక్కి చెప్పుటకు కారణము. కాబట్టి ప్రాపంచిక విషయవిలాసములపైకి మనస్సును పోనీయక, అరికట్టి, శాశ్వతమగు ఆత్మవైపునకు అద్దానిని మరల్చవలెను. ఇదియే యోగము.

జ్యోతిర్గమయ'— అజ్ఞానమునుండి జ్ఞానములోనికి తీసికొని పొమ్ము. 'మృత్యోర్మా అమృతం గమయ - మృత్యువునుండి అమృతత్వస్థితిని పొందింపజేయుము' — అని భగవానుని ప్రార్థించవలెను. ఇట్టి భగవదాశ్రయముచే అచిరకాలములోనే జీవుడు పరమశాంతిని, జీవన్ముక్తిని తప్పక బడయగలడు. భోగమును తిరస్కరించి యోగమును ఆశ్రయించుటవలన మహోన్నత సద్గతిని ఆతడు పొందగలడు. కాబట్టి విజ్ఞులగువారు పూర్వాపరములను చక్కగ విచారించి, దేనిని గ్రహించవలెనో, దేనిని త్యజించవలెనో బాగుగ నిర్ణయించి వైరాగ్యమును జేపట్టి భోగవిగర్హణత్వ, భగవదాశ్రయత్వములచే పరిపూర్ణాత్మానందమును పొందవలయును.

## వైరాగ్యస్వరూపము

ఘోరసంసారాటవియందు దరిగానక దుఃఖాక్రాంతుడై పరిభ్రమించు జీవునకు తరణోపాయము తన నైజసంపూర్ణాత్మస్థితి నెఱుంగుటయే. దుఃఖరాహిత్యమునకును ఆనందప్రాప్తికిని అది యొకటియే సర్వజీవులకును కర్తవ్యము. అట్టి అంతిమలక్ష్యసిద్ధికొఱకై జీవులు వారివారి మనస్తత్త్వములనుబట్టి కొందఱు కర్మమార్గమును, కొందఱు భక్తిమార్గమును, కొందఱు యోగ (ధ్యాన) మార్గమును, కొందఱు జ్ఞానమార్గమును జేపట్టుచున్నారు. శ్రద్ధాభక్తులతో ఏ మార్గము నన్వేషించినను తుదకు సర్వులును పైదెల్పిన ఒకే

పరమాత్మోపగమ్యమును చేరుదురనుటలో సంశయము లేదు. కాని ఏ మార్గము ననుసరించినను వైరాగ్యము మాత్రము తప్పనిసరిగా ఎల్లరకును ఆవశ్యకమైయే యున్నది. విరాగమన్నను, వైరాగ్యమన్నను ఒకటే. అది ఆ మార్గము లన్నిటియందును అంతర్వ్యాప్తమై అన్నిటికిని ఆవశ్యకమై యలరుచున్నది. కావుననే 'వైరాగ్యమార్గము' అని ప్రత్యేకముగ పేర్కొనబడకుండుటకు కారణము. మోక్షభవనమునకది పునాది.

'మోక్షస్య హేతుః ప్రథమో నిగద్యతే
వైరాగ్యమత్యన్తమనిత్యవస్తుషు'.

అనగా 'అనిత్యములగు దృశ్యపదార్థములందలి మిక్కుటమగు వైరాగ్యమే మోక్షమునకు ప్రప్రథమ హేతువు'- అని శంకరులు వివేకచూడామణియందు దెలిపిరి. కనుకనే మోక్షమునకు అత్యంతావశ్యకమైనట్టి సాధనచతుష్టయ సంపత్తియందు 'ఇహాముత్రార్థఫలభోగవిరాగము' అనునది యొక ప్రధాన అంగమై వెలయుచున్నది. ఇట్టి వైరాగ్యమును మొట్టమొదట బాగుగా దృఢపఱచుకొనక ఎన్ని ఆధ్యాత్మికసాధనలను చేసినప్పటికిని ఫలితమంతగా గోచరింపదు.

'ఇంద్రియార్థేషు వైరాగ్యం'
'వైరాగ్యం సముపాశ్రితః'

శివాలయములలో నందికేశ్వరుడు, విష్ణ్వాలయములలో గరుత్మంతుడు, రామాలయములలో హనుమంతుడు ఏప్రకారముగ దైవసమ్ముఖమున ఆసీనులైయుందు గమనించదగియున్నది. వారి ముఖములు భగవంతునకు నేరుగలో నుండును. అనగా దృశ్యవిముఖత్వము, దైవసుముఖత్వము వారి వైఖరిలో దృగ్గోచరమగుచుండును. వారిముఖపద్మముల యందు భక్తిప్రపత్తులు, వినయవిధేయతలు, ఆధ్యాత్మికతన్మయత్వము ఉట్టిపడుచుండును. ఆవిధముగ వారు కూర్చుండి సర్వజనులకును ఈ ప్రకారముగ చక్కటిబోధ యొనర్చుచున్నారు—"ఓ జీవులారా! సత్యవస్తువు నాశ్రయింపుడు. క్షణికజీవితమును ఇంద్రియార్థముల ననుభవించుటయందే వ్యర్థముచేయక, శాశ్వత సచ్చిదానంద పరబ్రహ్మము నవలోకించుటయందు వినియోగించి ధన్యులుకండు. ఎండమావులకొఱకై పరుగెత్తకుడు. ఊర్ధ్వదృష్టికలిగియుండుడు. దైవదృష్టినవలంబింపుడు" అని వారు ప్రబోధించుచున్నారు. అట్టి బ్రహ్మమును, దైవమును ఆశ్రయించువారు, ధ్యానించువారు జీవితమున కృతార్థతను బడయగలరు. స్వల్పవస్తువుల నాశించువారు, స్వల్పసుఖములను వెన్నంటువారు తుదకు పశ్చాత్తాపపడవలసివచ్చును.

కావున చంచలసుఖములయందు జీవితమును ధారవోయక, నిరతిశయాత్మానందమునే గ్రోలుటకు జనులు యత్నించవలెను. "ఓ దేవా! 'అసతో మా సద్గమయ'—అసద్వస్తువునుండి సద్వస్తువునకు గొనిపొమ్ము, 'తమసో మా

జ్వరము రగుల్కొనినపుడు శృంగారచేష్టలను ఔషధము సేవించి దానిని శమింపజేసికొనుచున్నాడు. కాబట్టి మనుజుడు తాను గొప్పగ తలంచునట్టి ఆ యా భోగములన్నియు రోగ నివారణకృత్యములే యగుచున్నవి.

ప్రతీకారో వ్యాధే స్సుఖ మితి విపర్యస్యతి జనః

వ్యాధిప్రతీకారచర్యనే సుఖమని తలంచి మానవుడు భ్రమించుచున్నాడు. వాస్తవముగ అది సుఖముకాదు. సుఖాభాసమే. సుఖము భగవంతుని పాదపద్మములను సేవించుటయందే కలదు. యోగమునందే కలదు. హృదయమందు వెలుగొందుచున్న పరమాత్మను భజించుటయందే కలదు. 'సుఖమత్యయమశ్నుతే' అని భగవానుడు తెలిపినట్లు అట్టి పరమాత్మను ఆశ్రయించినవారు అత్యయసుఖమును పొందుచున్నారు. కనుకనే శ్రీకృష్ణమూర్తి గీతయందు సమయము దొరికినపుడంతయు 'మయ్యాసక్తమనాః'—నాయందే ఆసక్తిగల మనస్సుకలవాడై యుండుము; మదాశ్రయః—నన్నే ఆశ్రయింపుము; 'మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాంతరన్తి తే'-నన్ను ఎవరు శరణుబొందుదురో వారే మాయను దాటగలరు—అని ఈ ప్రకారముగ మరల మరల నొక్కి చెప్పుటకు కారణము. కాబట్టి ప్రాపంచిక విషయవిలాసములపైకి మనస్సును పోనీయక, అరికట్టి, శాశ్వతమగు ఆత్మవైపునకు అద్దానిని మరల్పవలెను. ఇదియే యోగము.

శివాలయములలో నందికేశ్వరుడు, విష్ణ్వాలయము లలో గరుత్మంతుడు, రామాలయములలో హనుమంతుడు ఏప్రకారముగ దైవసమ్ముఖమున ఆసీనులై యుండుట గమనించదగియున్నది. వారి ముఖములు భగవంతునకు నేరుగా నుండును. అనగా దృశ్యవిముఖత్వము, దైవసుముఖత్వము వారి వైఖరిలో దృగ్గోచరమగుచుండును. వారిముఖపద్మముల యందు భక్తిప్రపత్తులు, వినయవిధేయతలు, ఆధ్యాత్మికతన్మయత్వము ఉట్టిపడుచుండును. ఆవిధముగ వారు కూర్చుండి సర్వజనులకును ఈ ప్రకారముగ చక్కటిబోధ యొనర్చుచున్నారు—“ఓ జీవులారా! సత్యవస్తువు నాశ్రయింపుడు. క్షణికజీవితమును ఇంద్రియార్థముల ననుభవించుటయందే వ్యర్థముచేయక, శాశ్వత సచ్చిదానంద పరబ్రహ్మము నవలోకించుటయందు వినియోగించి ధన్యులుకండు. ఎండమావులకొఱకై పరుగెత్తకుడు. ఊర్ధ్వదృష్టి కలిగియుండుడు. దైవదృష్టినవలంబింపుడు” అని వారు ప్రబోధించుచున్నారు. అట్టి బ్రహ్మమును, దైవమును ఆశ్రయించువారు, ధ్యానించువారు జీవితమున కృతార్థతను బడయగలరు. స్వల్పవస్తువుల నాశించువారు, స్వల్పసుఖములను వెన్నంటువారు తుదకు పశ్చాత్తాపపడవలసివచ్చును.

కావున చంచలసుఖములయందు జీవితమును ధారవోయక, నిరతిశయాత్మానందమునే క్రోలుటకు జనులు యత్నించవలెను. “ఓ దేవా! ‘అసతో మా సద్గమయ’— అసద్వస్తువునుండి సద్వస్తువునకు గొనిపొమ్ము, ‘తమసో మా

జ్యోతిర్గమయ'— అజ్ఞానమునుండి జ్ఞానములోనికి తీసికొని పొమ్ము. 'మృత్యోర్మా అమృతం గమయ - మృత్యువునుండి అమృతత్వస్థితిని పొందింపజేయుము' — అని భగవానుని ప్రార్థించవలెను. ఇట్టి భగవదాశ్రయముచే అచిరకాలములోనే జీవుడు పరమశాంతిని, జీవన్ముక్తిని తప్పక బడయగలడు. భోగమును తిరస్కరించి యోగమును ఆశ్రయించుటవలన మహోన్నత సద్గతిని ఆతడు పొందగలడు. కాబట్టి విజ్ఞులగువారు పూర్వాపరములను చక్కగ విచారించి, దేనిని గ్రహించవలెనో, దేనిని త్యజించవలెనో బాగుగ నిర్ణయించి వైరాగ్యమును జేపట్టి భోగవిగర్హణత్వ, భగవదాశ్రయత్వములచే పరిపూర్ణాత్మానందమును పొందవలయును.

## వైరాగ్యస్వరూపము

ఘోరసంసారాటవియందు దరిగానక దుఃఖాక్రాంతుడై పరిభ్రమించు జీవునకు తరణోపాయము తన నైజ సంపూర్ణాత్మస్థితి నెఱుంగుటయే. దుఃఖరాహిత్యమునకును ఆనందప్రాప్తికిని అది యొకటియే సర్వజీవులకును కర్తవ్యము. అట్టి అంతిమలక్ష్యసిద్ధికొఱకై జీవులు వారివారి మనస్తత్త్వములనుబట్టి కొందఱు కర్మమార్గమును, కొందఱు భక్తిమార్గమును, కొందఱు యోగ (ధ్యాన) మార్గమును, కొందఱు జ్ఞానమార్గమును జేపట్టుచున్నారు. శ్రద్ధాభక్తులతో ఏ మార్గము నన్వేషించినను తుదకు సర్వులును పైదెల్పిన ఒకే

పరమాత్మసామీప్యమును చేరుదురనుటలో సంశయము లేదు. కాని ఏ మార్గము ననుసరించినను వైరాగ్యము మాత్రము తప్పనిసరిగా ఎల్లరకును ఆవశ్యకమైయే యున్నది. విరాగమన్నను, వైరాగ్యమన్నను ఒకటే. అది ఆ మార్గము లన్నిటియందును అంతర్వ్యాప్తమై అన్నిటికిని ఆవశ్యకమై యలరుచున్నది. కావుననే 'వైరాగ్యమార్గము' అని ప్రత్యేకముగ పేర్కొనబడకుండుటకు కారణము. మోక్షభవనమునకది పునాది.

'మోక్షస్య హేతుః ప్రథమో నిగద్యతే
వైరాగ్యమత్యన్తమనిత్యవస్తుషు'.

అనగా 'అనిత్యములగు దృశ్యపదార్థములందలి మిక్కుటమగు వైరాగ్యమే మోక్షమునకు ప్రప్రథమ హేతువు'- అని శంకరులు వివేకచూడామణియందు దెలిపిరి. కనుకనే మోక్షమునకు అత్యంతావశ్యకమైనట్టి సాధనచతుష్టయ సంపత్తియందు 'ఇహాముత్రార్థఫలభోగవిరాగము' అనునది యొక ప్రధాన అంగమై వెలయుచున్నది. ఇట్టి వైరాగ్యమును మొట్టమొదట బాగుగా దృఢపఱచుకొనక ఎన్ని ఆధ్యాత్మికసాధనలను చేసినప్పటికిని ఫలిత మంతగా గోచరింపదు.

'ఇంద్రియార్థేషు వైరాగ్యం'
'వైరాగ్యం సముపాశ్రితః'

ఇత్యాది వాక్యములద్వారా శ్రీకృష్ణభగవానుడు గీతయందు వైరాగ్యముయొక్క ఆవశ్యకతనుగూర్చి అసందిగ్ధముగా ప్రకటించియున్నాడు.

సంసారచక్రమునకు నాభివంటిదగు చిత్తమును నిగ్రహించుటలో ఈ వైరాగ్యము కీలకస్థానము నాక్రమించియున్నది. ఏలయనగా ఆత్మకు ఆవరణము మనస్సు. మనస్సు ఇంద్రియములకు లోబడియున్నది. ఇంద్రియములు ఇంద్రియార్థములగు బాహ్యవిషయములపై ప్రవర్తించుచున్నవి. దానిచే బంధము దుఃఖము ఏర్పడుచున్నవి. కాబట్టి బంధవిచ్ఛిత్తి, దుఃఖరాహిత్యము అపేక్షితమై యున్నచో మొట్టమొదట దృశ్యవిషయములందు వైరాగ్యము జనించవలెను. అపుడు ఇంద్రియములు ఇంద్రియార్థములందు ప్రవర్తింపక నిశ్చలముగ నుండును. ఇంద్రియసంయమముచే మనస్సు స్వాధీనపడి నిగ్రహింపబడును. అట్టి మనోనిరోధముచే ఆత్మయొక్క ఆవరణము భంగమైపోయి ఆత్మ నిరావరణముగ ప్రకాశించును.

'తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్'

అనునట్లు, అపుడు జీవుడు తన యథార్థ (ఆత్మ స్వరూపమున స్థితిగలిగియుండును. అదియే మోక్షము. దీనిని బట్టి మోక్షసాధనమున వైరాగ్యమెట్టి పాత్రను ధరించుచున్నదో సువిదిత మగుచున్నది.

అభ్యాసము, వైరాగ్యము—అను ఈ రెండిటివలన ముముక్షువుయొక్క ప్రధానకర్తవ్యమగు చిత్తవృత్తినిరోధము సులభముగ సాధ్యమగునని అనుభవజ్ఞులమగు మహాత్ములు శాస్త్రములందు పలుచోట్ల నొక్కి వక్కాణించియున్నారు. అర్జునుడు శ్రీకృష్ణపరమాత్మనుగూర్చి 'మహాత్మా! ఈ మనస్సు బహుచంచలమై, సుదృఢమై నిగ్రహించుటకు కష్టసాధ్యమై యున్నది. ఇద్దాని నిరోధమున కుపాయము చెప్పుమా!' యని వేడగా భగవానుఁ డిట్లు ప్రత్యుత్తరించెను—

అసంశయం మహాబాహో మనోదుర్నిగ్రహం చలమ్
అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే.

అనగా ఓ అర్జునా! మనస్సు చపలము, నిగ్రహించుటకు కష్టము అనువార్త సత్యమే. అయినను అభ్యాసము చేతను, వైరాగ్యముచేతను అయ్యది తప్పక నిగ్రహింపబడును. ఈ భావమునే పతంజలిమహర్షియు,

'అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః'

అను సూత్రముద్వారా స్పష్టపఱచియున్నారు. కాబట్టి ఆధ్యాత్మిక సాధనయందు మహావశ్యకమై పఱగుచున్న ఈ వైరాగ్యముయొక్క సంపాదనమునందు ముముక్షువు అతి జాగరూకుడై, అప్రమత్తుడై వర్తించవలెను.

ఇక ఆ వైరాగ్యముయొక్క స్వరూప మేమిటో విచారించెదము—

'దృష్టానుశ్రవికవిషయ వితృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యమ్'

అని పతంజలి వైరాగ్యముయొక్క లక్షణమును పేర్కొనియున్నాడు. అనగా, చూడబడినట్టియు, వినబడినట్టియు, దృశ్యవిషయములందు ఆసక్తి లేకయుండుట వైరాగ్యమని భావము. ఈ యర్థమునే శంకరులు మఱియొకవిధముగ నిరూపించియున్నారు. ఎట్లనిన,

ఐహికాముష్మికార్థేషు హ్యనిత్యత్వేన నిశ్చయాత్
నైస్పృహ్యం తుచ్ఛబుద్ధిర్యత్తద్వైరాగ్యమితీర్యతే.

అనగా! ఈలోకమునను పరలోకమునను గల పదార్థములు అనిత్యములని నిశ్చయించుటవలన వానియందు కోరిక లేకుండుటయు, అవి తుచ్ఛములని భావించుటయు వైరాగ్యమని చెప్పబడును. మఱియొక సందర్భమున ఆ భగవత్పాదులే వైరాగ్యమునుగూర్చి యిట్లు వర్ణించియుండిరి—

తద్వైరాగ్యం జుగుప్సాయా దర్శనశ్రవణాదిభిః
దేహాదిబ్రహ్మపర్యన్తే హ్యనిత్యే భోగ్యవస్తుని,

అనగా 'ప్రత్యక్షానుభవము శ్రుతివాక్యము మున్నగు వానిచే అనిత్యములని తెలియవచ్చు దేహాము మొదలు బ్రహ్మదేవుని వఱకుగల భోగ్యపదార్థములయందు రోత గలిగియుండుటయే వైరాగ్యము.' విషయములయెడల అనాసక్తి, నిస్పృహ యెపుడు జనించునో అపుడిక చిత్తవృత్తులు బహిర్ముఖముగ ప్రసరింపక అంతర్ముఖములై క్రమముగ ఆత్మయందు లయించిపోవును, కట్టెలు లాగివేయబడగా అగ్ని

చల్లారిపోవునట్లు వృత్తులు క్షయింప చిత్తమున్ను తనరూప మును గోలుపోయి ఆత్మయందు శమించును. ఈ క్రింది ఉప నిషత్ప్రమాణ మీ భావమునే వ్యక్తీకరించుచున్నది.

యథా నిరింధనో వహ్నిః స్వయోనావుపశామ్యతి
తథా వృత్తిక్షయాచ్చిత్తం స్వయోనావుపశామ్యతి.

మఱియు ఎపుడు చిత్తమునకు వైరాగ్యాతిశయముచే దృశ్యవస్తువులయెడ రోతగలుగునో అపుడిక వానిపై వ్రాలుట కద్దాని కెంతమాత్రమున్ను ఇచ్ఛ పొడమదు. అత్తఱి స్వయ ముగనే యది శమించిపోవును; 'నౌకాగ్రకాకము'ను గుఱిం చిన దృష్టాంతము నిచట వచించుట చాల సమీచీనముగా నుండును. ఒకానొక సముద్రపురేవునందు ఒకపెద్ద ఓడ ప్రయాణమునకు సంసిద్ధముగనున్నతఱి దాని తెఱచాపస్తంభ ముపై నొక కాకి వ్రాలెను. ఇంతలో నా యోడ బయలు దేఱి మహాసముద్రములోనికి చాలదూరము తరలివెళ్ళెను. కొంతసేపటికి ఆ కాకి యటనుండి ఎగిరిపోవ ఏదిక్కున జూచి నను సముద్రమయమై యుండెను. నిలుచుట కాధారము దాని కేమియు గన్పింపకుండెను. కొంతసేపు ఇటు నటు ఎగిరి తిరిగి ఆ స్తంభముపైకే వచ్చి వ్రాలుచుండెను. అదేరీతిగ చిత్తమునకున్ను ప్రాపంచికదృశ్యపదార్థములయెడల విరాగ ముద్భవించినపుడు వాని దేనిపైనను వ్రాలుటకు మనస్సొప్పక అంతర్ముఖమై ఆత్మయందే స్థితిగలిగియుండును. దీనినిబట్టి ఆత్మసాక్షాత్కారరూప లక్ష్యసాధనమందు వైరాగ్యము

మహోన్నతస్థాన మలంకరించుచున్నదని సుస్పష్టమగు చున్నది. కావున అద్దానిని ముముక్షువులు లెస్సగ సాధన చేయవలయును.

## తీవ్ర వైరాగ్యము

ఏదైన ఆపద సంభవించినపుడుగాని, రోగము వచ్చినపుడుగాని, ధనాదులు అపహరింపబడినప్పుడుగాని, వ్యాపారమునందు విశేషనష్టము కలిగినపుడుగాని, భార్యాపుత్రాదులతోటి కలహము సంప్రాప్తించినపుడుగాని, బంధుమిత్రాదులు మరణించినపుడుగాని, పెద్దలయొద్ద పురాణధర్మశాస్త్రాదులు వినినపుడుగాని, గొప్ప గొప్ప ఆశ్రమములను సందర్శించినపుడుగాని జనుల కొకింత వైరాగ్యము కలుగుచునే యుండును. అత్తటి ఈ సంసార మసారమనియు, దానిలో ఏమాత్రము సుఖము లేదనియు, పుత్రదార గృహాదులు మహాబంధకరములనియు, అన్నిటిని వదిలిపెట్టి పోయిగా నిశ్చింతగా ఏ అడవియందో కొండగుహయందో నదీతీరముననో ఆశ్రమముననో ఏ గొడవయు లేక నివసించిన బాగుగా నుండుననియు తలంపు కలుగును. కాని అయ్యది ఒకానొక క్షణిక భావనాతరంగము, లేక, తాత్కాలిక ఆవేశము (temporary emotion) మాత్రమే. అశాంతికారణములు తొలగిన వెంటనే మరల ఆ నిందితపదార్థముల వైపునకే మనస్సు మరలును. తాను దూషించిన వస్తువునే తిరిగి పట్టి వ్రేలాడును. ఆ తాత్కాలిక వైరాగ్యభావమే స్థిరముగా

నిలిచినచో అంతకు మించినది లేదు. కావుననే పెద్దలిట్లు చెప్పిరి.

గర్భే వ్యాధౌ శ్మశానే చ పురాణే యా మతిర్భవేత్
సా యది స్థిరతాం యాతి కో న ముచ్యేత బన్ధనాత్.

అనగా! తల్లిగర్భమందున్నపుడు, * వ్యాధి సంభవించినపుడు, శ్మశానమునకు బోయినపుడు పురాణమును వినినపుడు ఎట్టి వైరాగ్యబుద్ధి కలుగునో అట్టి బుద్ధి యెల్లపుడు నుండినచో సంసారబంధమునుండి యెవడు విడువబడడు? కాని బహుజన్మసుకృతము, పుణ్యపరిపాకము లేనిచో వైరాగ్యమునం దట్టి స్థిరత్వము జీవునకు గలుగదు, ఒకవేళ కలిగినట్లు తోచినను అది నిలువదు. కాబట్టి,

బహుజన్మ కృతైః పుణ్యైర్వైరాగ్యం ఖలు జాయతే
వైరాగ్యేణ వినా జ్ఞానం కదాచిన్నోపజాయతే.

అని అనుభవజ్ఞులు పలికిరి. అనగా అనేక జన్మార్జిత పుణ్యసంపత్తిచేతనే తీవ్రవైరాగ్యము జనించును. తీవ్రవైరాగ్యము లేకున్న ఆత్మజ్ఞాన మెన్నటికిని గలుగనేరదు. పుణ్యాతిశయము లేనందున జీవులకు తీవ్రవైరాగ్య ముదయింపక

* ప్రతి జీవుడును తల్లిగర్భమునందున్నపుడు ఆ గర్భయాతనలు భరింపలేకయు, పూర్వజన్మల స్మృతిచే సంసారభీతి నొందియు వైరాగ్యభావమును జేపట్టుననియు, కాని గర్భమునుండి వెలుపలికివచ్చుటతోడనే వైష్ణవీమాయ కప్పివేయ, ఆ సమస్తము మఱచిపోవుననియు గరుడపురాణమునందు ప్రసిద్ధమై యున్నది.

మందవైరాగ్యము మాత్రమే ఒకపు డుదయించుచున్నది. 'ఇపుడేమి తొందర? దేవుడు, మోక్షము మొదలైన అన్ని విషయములనుగూర్చి నెమ్మదిగా తరువాత చూచుకొన వచ్చును' అను భావము వారికపుడు కలుగును. సామాన్య ముగా రోగులలో మూడు తెగలవారుందురు. శరీరములో రోగము జనించియుండియు 'నా కేమియు రోగము లేదు' అని తలంచి ఔషధమునకై ప్రయత్నమే చేయనివారు కొందఱు. రోగమున్నట్లు తెలిసినను, అది ప్రకోపించినపుడు మాత్రము డాక్టరువద్దకు పరుగెత్తియో, లేక, తన యింటికి మందు తెప్పించుకొనియో తాత్కాలిక రోగోపశమనము గావించు కొనువారు కొందఱు. వీరికి రోగప్రకోపము తగ్గునే కాని అసలు రోగము పోదు. ఇక మఱికొందరు తమకు దీర్ఘకాల రోగమున్నట్లు తెలిసికొని వెంటనే గొప్పడాక్టరువద్దకో, లేక జనరల్ ఆసుపత్రికో పోయి, అది సమూలముగ నశించు వఱకు తీవ్రచికిత్సలు గావించుకొనుచునే యుందురు. వారికి అనతికాలములో రోగము సమూలముగ నశించిపోవును.

ఆ రీతిగనే జనులకందఱకును లోన భవ (సంసార) రోగము బాగుగ జనించియున్నప్పటికిని అజ్ఞానవశమున ప్రాపంచికజను లద్దాని నివారణమునకై ప్రయత్నమే చేయుటలేదు. మఱికొందఱు విపత్కాలములందు మాత్రము ఒకింత వైరాగ్యము కలిగి దైవాన్వేషణము చేయుదురు. ఇంక కొందఱు తీవ్రవైరాగ్యోపేతులై, శమదమాది సాధన చతుష్టయ సంపత్తి నాశ్రయించి, ఆత్మవిచారణాతత్పరులై

అచిరకాలములోనే భవరోగమును సంపూర్ణముగ ఉన్మూలనము చేసికొందురు. వీరికి మరల జన్మాది దుఃఖము కలుగదు.

మందవైరాగ్యమును గూర్చి ఇంతదనుక ముచ్చటించితిమి. ఇక తీవ్రవైరాగ్యముయొక్క లక్షణమును తెలిసికొందము.

'బ్రహ్మలోకతృణీకారో వైరాగ్యస్యావధిర్మతః।'

అని వైరాగ్యముయొక్క అవధి శాస్త్రములందు పేర్కొనబడినది. అనఁగా (చతుర్ముఖ) బ్రహ్మలోకమును గూడ (అదియు దృశ్యమందంతర్గతమే కావున నశించు స్వభావము గలది కాబట్టి) తృణప్రాయముగా నెంచు నంతటి తీవ్ర విరాగబుద్ధి గలిగియుండుటయే వైరాగ్యముయొక్క పరాకాష్ఠయని అర్థము. శంకరులు తమ సర్వవేదాంత సిద్ధాంత సంగ్రహమున వైరాగ్యమునుగుఱించి ప్రస్తావించునపుడు తీవ్రవైరాగ్యలక్షణము నీ క్రిందివిధమున వర్ణించిరి :-

కాకస్యవిష్ఠావదసహ్యబుద్ధి
ర్భోగేషు సా తీవ్ర విరక్తిరిష్యతే.

అనగా 'కాకి రెట్ట*యందునలె విషయభోగములందు అసహ్యబుద్ధి గలిగియుండుట తీవ్రవైరాగ్య మనబడును.' నీటిలో ముంచబడినవాడు ప్రాణవాయువునకై యెట్లు తల్లడిల్లునో, నిప్పుకణిక శిరస్సుపై పెట్టబడినవాడు తాపమును

* ప్రపంచమందలి ఏ పదార్థమైనను ఏదో యొక కార్యమునకు ఉపయోగ పడుననియు, కాకిరెట్ట మాత్రము దేనికిని ఉపయోగించదనియు, కాబట్టి అత్యంత గర్హితమనియు లోకమున ప్రసిద్ధి.

సహింపజాలక దానిని తొలగింప నెంత యాతురతజెందునో, వేసవి మధ్యాహ్న సమయమున సలసలకాగుచున్న ఇసుకపై పడవేయబడిన చేప శీతలోదక సంగమమునకై యెట్లు వేగిర పడుచుండునో, గృహము జాజ్వల్యమానముగ దహింపబడు చుండ లోనున్న ప్రాణి బయటికి వచ్చుటకై యెట్లు తహ తహలాడుచుండునో, తీవ్రవైరాగ్యము గలవాడును ఈ సంసారమను జంజాటములోనుండి తప్పించుకొని యెపుడు బయట పడుదుమా యని తల్లడిల్లుచుండును. సంసారనిదాఘనిపీడితుడై ఆత్మానందమను శీతలజాహ్నవీతోయమున నెపుడు క్రుంకు లిడుదుమా యని యువ్విళ్ళూరుచుండును. వైరాగ్యమున నింత తీవ్రత్వము లేనిచో మనుజునకు జ్ఞాన ప్రాప్తి కలుగదు, కలిగినను నిలువదు. కావుననే,

> వైరాగ్యం పుష్కలం న స్యాన్నిష్ఫలం బ్రహ్మదర్శనమ్
> తస్మాద్రక్షేత విరతిం బుధో యత్నేన సర్వదా.

అని చెప్పుటకు కారణమైనది. అనగా, వైరాగ్యము పుష్కలముగా లేనిచో బ్రహ్మసాక్షాత్కార యత్నము నిష్ఫలమై పోవును. కాబట్టి విజ్ఞుడగువాడు నిరంతరము ప్రయత్నపూర్వకముగ తీవ్రవైరాగ్యమును రక్షించుకొనవలెను. ఈ భావమునే శంకరులున్ను వివేకచూడామణియందు రూఢిపఱచిరి, ఎట్లనిన—

> వైరాగ్యం చ ముముక్షుత్వం తీవ్రం యస్య తు విద్యతే
> తస్మిన్నే వార్థవన్తస్స్యుః ఫలవన్తశ్శమాదయః.

అనగా ఎవనియందు వైరాగ్య ముముక్షుత్వములు తీవ్రముగ నుండునో, అతనియందే శమదమాదులు సార్థకములై ఫలవంతము లగును. తక్కినవారియందు,

'మరౌ సలిలవత్తత్ర శమాదేర్భానమాత్రతా'

యనునట్లు 'మరుభూమియందలి జలమువలె, శమదమాది సాధనసంపత్తి నామమాత్రముగనే యుండునుగాని ఫలప్రదము కాదు'. బీజము వృక్షరూపమున వృద్ధినొందుటకు మృదుస్థల మెట్లావశ్యకమో అట్లే జ్ఞానమభివృద్ధినొందుటకును తీవ్రవైరాగ్య మావశ్యకమైయున్నది. కనుకనే గురువు లగు మహాత్ములు తమశిష్యులకు బ్రహ్మజ్ఞానమును బోధించుటకు మునుపు 'ఈతడు దానికి తగినవాడా? ఈతని చిత్తమున దృశ్యవిషయములయెడల తీవ్రవిరతి యావిర్భవించియున్నదా? యని చాలకాలము పరీక్షించుదురు. త్వరపడి జ్ఞానదానము చేయరు. అట్లు చేసినచో, 'భస్మనీవ హుతం యథా', 'గోక్షీరం శ్వదృతావివ' యనునట్లు-అనగా బూడిదయందు వేల్చు హావిర్ద్రవ్యమువలెను, కుక్కతోలునందు పోయు ఆవుపాలవలెను ఆ జ్ఞానము వ్యర్థమైపోవును. శిష్యుని హృదయమున ప్రకాశింపదు. కావున జనులు వైరాగ్యయుతులై ఆత్మజ్ఞానమును బడసి జీవితములను సార్థకము చేసికొనవలయును.

పూర్వము నచికేతుడను యువకునియొక్క వైరాగ్యమును పరీక్షింపదలంచి యమధర్మరాజు నాయనా! విషయ

విలాసములను చక్కగ అనుభవింపరాదా? యని పలికిన అందులకు నచికేతు డిట్లనియె—

'శ్వోభావా మర్త్యస్య యద న్తకై తత్సర్వేన్ద్రియాణాం జరయ న్తి
తేజః। అపి సర్వం జీవితమల్ప మేవ తవైవ వాహా స్తవ నృత్యగీతే...'
...'అభిధ్యాయన్వర్ణరతిప్రమోదానతిదీర్ఘే జీవితే కో రమేత'

"మహాత్మా! ఈ ప్రాపంచికభోగములన్నియు అశాశ్వతములు. పైగా అవి ఇంద్రియములయొక్క తేజమును హరించివేయును. నాకు దీర్ఘజీవిత మొసంగబడినప్పటికిన్ని అనంతకాలమున అది బహుస్వల్పమైనదే యగును. కాబట్టి నశ్వరములగు ఈవాహనములను, ఈ ధనమును, ఈ సంపద లన్నింటిని నీవే యుంచుకొనుము. పదార్థములయొక్క ఆ పైపై తళుకుబెళుకులకు మురిసిపోయి ఆ క్షణికరూప సౌందర్యాదులను ధ్యానించుచు దీర్ఘజీవితము నెవడు గడుప నెంచును? కాబట్టి (నిత్యానందప్రదమగు) ఆత్మవిద్యనే నా కుపదేశింపుడు" అని ప్రార్థించెను.

ఈ ప్రకారముగ యముడు నచికేతుని హృదయస్థ తీవ్రవైరాగ్యభావనను గుర్తెఱిగి ఆత్మజ్ఞానోపదేశమునకు అర్హుడగు వ్యక్తి లభించెను గదా యని సంతసించి ఆతనికిట్లు బోధించెను—

శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేతస్తౌ సంపరీత్య వివిన క్తి ధీరః
శ్రేయో హి ధీరోఽభిప్రేయసో వృణీతే ప్రేయోమన్దో యోగ క్షేమా
ద్వృణీతే.

అనగా, 'ఓ నచికేతా! సామాన్యముగ లోకములో ప్రతిమానవుని జ్ఞానము, భోగము అను నీ రెండును సమీపించును. అత్తఱి ధీరుడగువాడు తన విచక్షణాబుద్ధిచే చక్కగ వివేచించి భోగము లనిత్యములు తుచ్ఛములని తలంచి ఆ రెండిటిలో జ్ఞానమునే వరించును. అజ్ఞానియో యోగక్షేమముల నపేక్షించినవాడై భోగములనే కోరుకొనును కాని నీవుమాత్రము మొదటి తరగతికే చెందినవాడవు. ఎట్లనిన,

'విద్యాభీప్సినం నచికేతసం మన్యే నత్వా కామా బహవోఽలోలుప న్త'—'ఏ కారణముచే నీకు విషయభోగము లెవ్వియు రుచింపకున్నవో, ఆ కారణముచే నిన్ను జ్ఞానాభిలాషిగనే నేను తలంచుచున్నాను.' ఈ ప్రకారముగ వచించినపిమ్మట యమధర్మరాజు నచికేతునకు అమూల్యమగు ఆత్మతత్త్వోపదేశమును గావించెను. ఆ బోధలన్నియు కఠోపనిషత్తునందు గానందగును.

అట్లే మొట్టమొదట శ్రీరామచంద్రుని హృదయము* నుండి పొంగి పొరలినట్టి వైరాగ్యభావములన్నింటిని వినిన పిమ్మటనే వసిష్ఠమునీంద్రుఁడాతనికి యోగవాసిష్ఠ మహారామాయణము (వసిష్ఠగీత) అను అత్యుత్తమ జ్ఞానోపదేశమును గావించి నిర్వాణమార్గమును లెస్సగ ప్రదర్శింపజేసి మోక్షమును కరతలామలకముగ నొనర్చెను. అరిష్టనేమి

* శ్రీరామచంద్రుని వైరాగ్యభావము అన్నియు వసిష్ఠగీతయందలి వైరాగ్యప్రకరణమున బాగుగ విశదీకరింపబడినవి.

యనురాజు తనరాజ్యాదిసమస్తమును త్యజించి ఏకాంతముగ అరణ్యమున తపం బొనర్చుకొనుచుండ దేవేంద్రుం డాతనిని స్వర్గసౌఖ్యము లనుభవించుటకై రమ్మని యాహ్వానించుటయు ఆతడు నిరాకరింప అంతట జ్ఞానోపదేశమునకై యాతనిని దేవదూతద్వారా వాల్మీకిమహర్షి వద్దకు పంపుటయు అమ్మహర్షి వాసిష్ఠమహారామాయణమును అతనికి బోధించుటయు ఈ మున్నగు విషయములు యోగవాసిష్ఠమున (వసిష్ఠగీతయందు) గానంబడుచున్నవి. ఈ చరిత్రలన్నింటిని బట్టియు తీవ్రవైరాగ్యము విషయభోగవిముఖత్వముగలవాడే జ్ఞానోపదేశమున కధికారియని స్పష్టమగుచున్నది.

ఇక నట్టి తీవ్రవైరాగ్యమును సాధించు మార్గ మేమియో విచారించెదము.

> భీభత్సం విషయం దృష్ట్వాకో నామ న విరజ్యతే
> సతాము త్తమవైరాగ్యం వివేకాదేవ జాయతే.

అని వసిష్ఠులు తెలిపినట్లు మరణాది భయోత్పాదక విషయములను గాంచినపుడు ఏదియో యొకవిధమగు వైరాగ్యము అందఱికిని కలుగుచునేయుండును. కాని బుద్ధిమంతులకు ఉత్తమ(తీవ్ర) వైరాగ్యము వివేకమువలననే కలుగును. అనగా నిత్యానిత్య వస్తువిచారణవలననే ప్రాదుర్భవించును. మఱియు,

> పరామృశ్య వివేకేన సంసార రచనా మిమాం
> వైరాగ్యం యేఽధిగచ్ఛన్తి త ఏవ పురుషోత్తమాః.

అనియుగూడ అమ్మహర్షి వ్రాక్రుచ్చియున్నాడు. అనగా '-ఈ సంసార మెట్టిది? దీనియందేమైన సారముగలదా? అను -ఈ ప్రకారముగ వివేకముతో ఈ జగత్స్థితిని బాగుగ పరామర్శచేసి పొందు వైరాగ్యమే సర్వశ్రేష్ఠమైనది. మఱియు నద్దానిని పొందువారే ఉత్తమపురుషులు. వివేకమువలనను, భోగములందు దోషమును గాంచుటవలనను మనుజునకు ప్రబలమగు వైరాగ్య ముదయించునను ఈ భావమును శంకరులున్ను ధ్రువపఱచియున్నారు. ఎట్లనిన,

'నిత్యానిత్యపదార్థవివేకాత్పురుషస్య జాయతే సద్యః
స్రక్చన్దనవనితాదౌ సర్వత్రానిత్యవస్తుని విరక్తిః.'

మఱియు, 'విరక్తిస్తీవ్రత్వవిధాన మాహుర్భోగ్యేషు దోషే క్షణమేవ సన్తః' అనఁగా 'ఇది నిత్యవస్తువు' ఇది అనిత్యవస్తువు అని వివేచించుటవలన మనుజునకు వెంటనే అనిత్యములగు చందనపుష్పవనితాది పదార్థములందంతటను విరక్తి కలుగుచున్నది. రెండియు భోగ్యవస్తువులందు దోషము గలదని యెంచుటయే తీవ్రవైరాగ్యమునకు హేతువని చెప్పబడినది'—మహాత్ము లీప్రకారముగ తెలిపియున్నారు. కాబట్టి వైరాగ్యోత్పాదనకై ఈ జగత్స్థితిని, సంసారరచనను ఒకింత విచారించి చూచెదము—

ఈ ప్రపంచమున సమస్తపదార్థములును అనిత్యములు. శాశ్వతసుఖమును గలుగజేయు పదార్థమొకటేని ఈ దృశ్యవర్గమున గలదా? లేదు—భోగములా, ఆరంభమున సుఖప్రదములుగ తోచి తుదకు మహాదుఃఖదాయకములుగ

పరిణమించుచున్నవి. సంపదలు మెఱపుతీగవలె చంచలములై యున్నవి. బంధువులా, కళ్లార నశించిపోవుచున్నారు. ఈ దేహమున్ను నేడో, రేపో, ఎన్నడో కాలిపోనున్నది. మహా మహాచక్రవర్తులు, రాజాధిరాజులు భూమినంతను ఏక చ్ఛత్రాధిపత్యముగ నేలిన అఖండమహిమాన్వితులు, వీరులు, బలాఢ్యులుకూడ నామరూపములు లేక నశించిపోయిరి. ఇక తక్కినవారేమి శాశ్వతము? గొప్పగొప్పసృష్టులు, బ్రహ్మాండ ములు, లోకములు కూడ కాలగర్భమున విశీర్ణములై పోయినవి. ఇక ఈ గృహారామక్షేత్రాదులా స్థిరములు? ఆయువు తరిగిపోవుచున్నది. చిల్లిపడిన కుండయందలి నీటి వలె అయ్యది దినదినము సంక్షయమైపోవుచున్నది. మృత్యువు జీవుని కబళించివేయుటకు సంసిద్ధముగనున్నది. అంత్యకాల మున ఈ ధనముగాని, ఈ బంధువులుగాని, ఈ సంపదలు గాని, ఈ రూపసౌందర్యాదులుగాని, ప్రాపంచిక యశస్సు గాని ఏమైన అక్కరకు వచ్చునా? ఈ సందర్భమున విష్ణు భగవానుడు గరుత్మంతునకు చెప్పిన వాక్యములను వినుడు-

'ఈతడు నా పుత్రుడు, ఇది నా భార్య, ఇది నా ధనము, వీరు నా బంధువులు-అని డంబములు చెప్పుకొను మనుష్యుడను మేకను మృత్యువను తోడేలు బలాత్కార ముగా పట్టుకొనిపోవుచున్నది. ఇది చేయబడినది, ఇది యింకను చేయబడలేదు, వాడు దానిని చేసెను, వీడు దీని నింకను చేయలేదు-అని యీ ప్రకారముగ యోచించుచుకొను చుండగానే యముఁ డాతనిని తనవశము చేసికొనుచున్నాడు.

ముసలితనము మార్గము చూపగా ప్రచండవ్యాధి యను సైనికుడు పైబడి ఆక్రమింప మృత్యువను శత్రువు నిన్ను (జీవుని) పట్టుకొని పోవుచున్నాడు. కాబట్టి రక్షించువానిని (భగవంతుని) గూర్చి వెతుక వేల? విషయభోగములు దుఃఖమునకు మూలము. వానిని త్యజించువాడే సుఖవంతుడు గాని అన్యుడు కాడు. మాంసలుబ్ధమగు మత్స్యము గాలమును తెలిసికొనజాలనట్లు ప్రాపంచిక సుఖలుబ్ధుడగు జీవుడు యమ బాధను తెలిసికొనజాలకున్నాడు. మనుజు డెంతెంతగ విషయ భోగములతో సంబంధమును కలుగజేసికొనుచుండునో, అంతంత తీవ్రముగ దుఃఖములనెడి మేకులు వాని హృదయ మున గొట్టబడుచుండును. కాబట్టి,

> శ్వః కార్యమద్య కుర్వీత పూర్వాహ్ణే చాపరాహ్ణికం
> న హి మృత్యుః ప్రతీక్షేత కృతం వాప్యథవాఽకృతమ్.

అనగా, రేపటిపనిని ఈ దినమే చేయవలెను. మధ్యాహ్నము చేయవలసినదానిని ప్రొద్దుననే చేయవలెను. చేసినను, చేయకున్నను మృత్యువుమాత్రము వేచియుండదు.

సాక్షాత్ భగవంతుడు వచించిన ఈ వాక్యములను సంస్మరించినచో ఎవని హృదయమున వైరాగ్య ముప్పొంగ కుండును? జగత్స్థితినిగూర్చి బాగుగ విమర్శించినవానికి ఇట్టి భావములు హృదయాంతరాళమున తప్పక ఉద్భూతము లగును. ఇదియే వైరాగ్యసాధన.

జ్ఞేయమగు ఆత్మను సాక్షాత్కరించుట కుపకరించునట్టి జ్ఞానగుణములను వివరించుచు శ్రీకృష్ణపరమాత్మ—

'జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్' అని వచించెను గావున, తీవ్రవైరాగ్యప్రాదుర్భావమునకై జన్మము, మృత్యువు, వార్ధక్యము—వీనివలన గలుగు దుఃఖములను, దోషములను మనుజుడు తప్పక విచారించవలె ననియు, అట్లు విచారించి వైరాగ్యమును తెస్పగ ఆశ్రయించవలెననియు స్పష్టమగుచున్నది.

అయితే, ప్రత్యక్షముగ సుఖమును గలుగజేయు ఈ బాహ్యవిషయములయెడల విరక్తి యేల కలిగియుండవలెనని కొందఱు ప్రశ్నించవచ్చును. అవిద్యాప్రభావమున విషయములందు సుఖమున్నటుల తోచుచున్నదేగాని వాస్తవముగ నట సుఖము లేదు.

'అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచిసుఖాత్మఖ్యాతి రవిద్యా' అని పతంజలిమహర్షి అవిద్యయొక్క నిర్వచనమును గావించెను. అనగా, అవిద్యామదిరమును త్రావి ప్రమత్తుడై యుండువానికి అనిత్యమైనవస్తువు నిత్యముగను, అపవిత్రమైనది పవిత్రముగను, దుఃఖము సుఖముగను, (శరీరాది) అనాత్మపదార్థములు ఆత్మరూపములుగను తోచును. మాయయొక్క మహిమ యిది. అట్టి మాయకు లోనైన వారి కందరికిని ఆప్రకారముగ భ్రమ తప్పక కలుగును. భక్తి, వైరాగ్య, వివేక, విచారణాదులద్వారా ఆ మాయ యొక్క రహస్యమును తెలిసికొనినవానికి అనిత్యము అనిత్యముగనే కన్పట్టును. అశుచి అశుచిగనే తోచును. దుఃఖము దుఃఖముగనే స్ఫురించును (సుఖముగ గాదు); అట్లే అనాత్మ

అనాత్మగనే వ్యక్తమగును. కాబట్టి బాహ్యవిషయములందు గలది ఆపాత రమణీయత్వమేకాని వాస్తవ రమణీయత్వము కాదు; ఆపాత సుఖమేగాని వాస్తవసుఖము కాదు. అట్లు కాకున్న పూర్వ మనేకచక్రవర్తులు, సిరిసంపదలతో తుల తూగు మహామహులు తమ సర్వస్వమును విడనాడి, స్వర్గ తుల్యములగు తమ సంపద లన్నింటిని తృటిలో వదలివైచి ఏకాంతారణ్యములకు విజనస్థలములకు బోవలసిన పనియే లేదు. ఆయా ప్రాపంచిక విషయసౌఖ్యములందు, సాంసారిక సంపదలందు ఏదియో యొక దోషముండబట్టియే వారట్లు చేసిరి. పూర్వమున్న స్థితికంటె ఉన్నతస్థితి కేగుటకే విజ్ఞులు ప్రయత్నించుచుందురు గదా! కావున నశ్వరసుఖమును దుఃఖభూయిష్ఠములైన సాంసారిక ఐశ్వర్యములను త్యజించి శాశ్వతమై నిరతిశయమైనట్టి ఆత్మానందమును గ్రోలుటకే వారాప్రకారముగ సర్వత్యాగమును గావించిరని తేలు-చున్నది.

దీనినిబట్టి విషయములు సారహీనములని మనము నిశ్చయింపవచ్చును. అవి సాత్త్వికసుఖమును కలుగజేయవు. రాజససుఖమునే కలిగించును.

విషయేంద్రియ సంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్.

అనగా శబ్దస్పర్శాది విషయములయొక్కయు ఇంద్రియములయొక్కయు సంబంధముచే కలుగునదియు, మొదట అమృతమువలె తోచి తుదకు విషమువలె

యొప్పునదియు నగు సుఖము రాజసమని గీతాచార్యుడు పేర్కొనెను. దృశ్యవిషయము లట్టి రాజససుఖమునే జనింప జేయును. సుఖము రవ్వంతయున్నచో అందు దుఃఖము పర్వత సమముగ ప్రక్కనే భాసిల్లును. కావుననే 'సౌఖ్యం బిందు మాత్రేణ దుఃఖం పర్వతమేవ చ' అని విషయసౌఖ్యము లను గూర్చి పెద్దలు నుడివియున్నారు. శంకరులు వచించినది చూడుడు—

సుఖమల్పం బహుక్లేశో విషయగ్రాహిణాం నృణామ్
అనన్తం బ్రహ్మనిష్ఠానామితి వేదాన్తడిండిమః.

'విషయసౌఖ్యములకై ప్రాకులాడు జనులకు సుఖము అల్పముగను, దుఃఖము అధికముగను కలుగును. బ్రహ్మ నిష్ఠులకో అనంతానందము లభించును - అని వేదాంతభేరి చాటుచున్నది'. కనుకనే శ్రీకృష్ణభగవానులు భక్తులందఱి కిని ఈ క్రిందిరీతి హెచ్చరిక చేసియున్నారు—

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే
అద్యన్తవన్తః కౌన్తేయ న తేషు రమతే బుధః.

అనగా శబ్దస్పర్శాది విషయభోగములు దుఃఖమే మూలముగా గలవి, మఱియు నశ్వరములు. కాబట్టి విజ్ఞు డగువాడు వాని నభిలషింపడు. మఱియు భగవత్పాదుల యొక్క ఈ క్రింది వైరాగ్యోద్బోధక వచనములు ముముక్షు వులు సదా స్మృతిపథమున నుంచుకొన దగినవి—

విషయాఖ్య గ్రహో యేన సువిరక్త్యసినా హతః
స గచ్ఛతి భవామ్భోధేః పారం ప్రత్యూహవర్జితః.

అనగా ఎవడు శ్రక్చందనాదివిషయములను మొసలిని తీవ్రవైరాగ్యమను ఖడ్గముచే ఛేదించివేయునో, అట్టివాడు ఈ సంసారసాగరమును నిర్విఘ్నముగ దాటివేయగలడు.

మోక్షస్య కాంక్షా యదివై తవాస్తి
త్యజాతి దూరాద్విషయాన్విషం యథా
పీయూషవత్తోష దయా క్షమార్జవ
ప్రశాన్తి దాన్తీర్భజ నిత్యమాదరాత్.

అనగా 'నీకు మోక్షమందపేక్షకలదేని విషయములను విషమువలె దూరముగ త్యజించివైచి సంతుష్టి, దయ, ఓర్పు, ఋజుత్వము, అంతరేంద్రియ బాహ్యేంద్రియ నిగ్రహము—వీనిని అమృతమువలె అత్యాదరముతో సేవింపుము.'

శబ్దాది దృశ్య విషయములందు సారము లేదను సత్యమును కనుగొనియే బుద్ధదేవుడు రాజకొమరుడై విలసిల్లినను, సమస్త భోగభాగ్యములతో తులతూగుచున్నను, క్షణకాలములో వాని నన్నింటిని విడనాడి 'ఉరూవల' యను అరణ్యమున కేగి ఏకాంతమున బహుకాలము తపంబొనర్చి తుదకు నిర్వాణమార్గమును కనుగొనెను. అట్లే భర్తృహరియు గొప్పరాజై, సర్వప్రాపంచిక సౌఖ్యముల ననుభవించుచును, కడకు వానియందు వాస్తవసుఖము లేదని నిశ్చయించినవాడై ఆత్మశాంతికై తపనపడి, ప్రబలవైరాగ్యము నాశ్రయించి, బ్రహ్మధ్యానమున పరమానంద మనుభవించుచు—

'సర్వంవస్తు భయాన్వితం భువి నృణాం వైరాగ్య మేవాభయమ్'

అని యెలుగెత్తి పాడెను. అనగా, ప్రపంచములోని సమస్త పదార్థములును మనుజులకు భయాన్వితములై దుఃఖ భాజనములై యున్నవి. కాని వైరాగ్యమొక్కటిమాత్రము అభయ ప్రదమై, సుఖదాయకమై యున్నది. అదేరీతిగ యయాతి చక్రవర్తియు తన కుమారుని యౌవనమునుగూడ పరిగ్రహించి బహుకాలము విషయసుఖముల ననుభవించి అంతమున వానియందు సారములేదని గ్రహించినవాడై వైరాగ్య మవలంబించి ఆత్మశాంతిని బడసెనను విషయము భాగవతమున గానంబడుచున్నది.

ఈ ప్రకారముగ పెక్కురు మహనీయులు విషయ భోగములను బాగుగ పరీక్షించి తుదకు అవి సారహీనము లనియు, పరమార్థ లక్ష్యమునకు అడ్డుయనియు, నిశ్చయించిన వారై వానిని దూరముగ త్యజించివైచిరి. ఒకవేళ అనుభ వించినను వానియందెప్పటికైన తృప్తికలుగునాయని తలంచిన, అదియును లేదు. పైపెచ్చు అనుభవించినకొలది వానియందు తృష్ణ యింకను వృద్ధియగుచునే యుండును.

న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే,

అను యయాతివాక్యమే యిందులకు ప్రమాణము. అనగా ఆజ్యము మున్నగు హవిర్ద్రవ్యములను వ్రేల్చుటచే అగ్ని వృద్ధియగునేకాని శమించనట్లు, కోరికలును అనుభ

వించుటద్వారా అవి ప్రవర్ధమానములగునే కాని శమన మొందవు.

ఏదైన యొక పదార్థమును మరలమరల ననుభవించినపుడు అదియొక సంస్కారరూపమున చిత్తఫలకమున బాగుగా హత్తించిపోవును. దానినే వాసన యందురు. అది మలినమని, శుద్ధమని రెండు విధములు. విషయసేవనముద్వారా మలిన వాసనయెపుడు దృఢపడునో, అపుడయ్యది ఘనవాసనగా పరిణమిల్లును. అట్టి ఘనవాసన జీవునియం దెంతవఱకుండునో, అంతవర కాతనికి జన్మపరంపర తప్పదు. అత్తఱి వాసనవలన జన్మకలుగుట, జన్మవలన (కర్మద్వారా) వాసన దృఢపడుట సంభవించుచు క్రమముగ రెండును పరస్పరము వృద్ధియగుచుండును. కనుకనే విషయములకంటె విషమే శ్రేష్ఠమని పెద్దలు వచించిరి. విషము ఒక దేహమునే హరించును. విషయములో, సంస్కారములద్వారా అనేక జన్మలను కలుగజేసి అనేక దేహములను హరించును. కాబట్టి వైరాగ్యసాధన ద్వారా జీవుడు అట్టి విషయవాసనను నిర్మూలించుకొని పరమశాంతిని బడయవలెను.

విషయసేవనమువలన గలుగు అనర్థమునుగూర్చి యమధర్మరాజు నచికేతునకు ఈ క్రిందివిధముగ నుపదేశించెను—

పరాచః కామాననుయన్తి బాలా
స్తేమృత్యోర్యన్తి వితతస్య పాశమ్
అథ ధీరా అమృతత్వం విదిత్వా
ధ్రువమధ్రువేష్విహ న ప్రార్థయన్తే.

అనగా, అవివేకులే తుచ్ఛములగు బాహ్యవిషయము లను వెన్నంటుదురు. విశాలమగు మృత్యుపాశమును (జనన మరణప్రవాహమును) బొందుదురు. కాని వివేకవంతులగు ధీరులు అమృతపదమగు పరమాత్మను నిత్యస్వరూపునిగ నెఱింగి అనిత్యములగు సాంసారిక పదార్థముల వేనిని గోర కుందురు.

విషయవ్యామోహజనితమగు మఱియొక అనర్థమును గూడ ముముక్షువు లిచట జ్ఞప్తియందుంచుకొనవలెను. అదియేదనగా మనస్సు నయ్యది విశేషముగ బహిర్ముఖ మొనర్చివేయును. దానిచే భగవద్ధ్యానమున, ఆత్మచింతన మున ఏకాగ్రత కుదురనే కుదురదు. ఒక్క-క్షణమైనను మనస్సును నిశ్చలముగనుంచుట బహుకష్టము. కనుకనే గీతయందు ఈ విషయమును నిరూపించుచు బహుజాగరూకులై వర్తించులాగున భగవంతుడు జనులకు హెచ్చరిక చేసి యున్నాడు. ఎట్లనిన,

భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృతచేతసాం
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే.

అనగా భోగ, ఐశ్వర్యములం దాసక్తిగలిగి వానిచే నపహరింపబడిన చిత్తముగలవారలకు ధ్యానసమాధులందు ఏకాగ్రబుద్ధి కలుగనేరదు. అత్తఱి బుద్ధి చంచలమై యుండును. మఱియు ఏ మనస్సు ఇంద్రియములతో కూడుకొని విషయములమీాదికి పోవునో, అట్టి మనస్సు సముద్రమునందలి ఓడను తుఫానుగాలి ముంచివేయువిధమున బ్రహ్మనిష్ఠుని

యొక్క ఆత్మజ్ఞానమును నశింపజేయుచున్నది. అనగా నట్టి వాడు సంసారసాగరమున మునిగిపోవును అనియును శ్రీకృష్ణ భగవానుఁ డానతిచ్చియున్నాడు. కాబట్టి,

> తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః
> ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

ఎవని యింద్రియములు మనస్సు ఇంద్రియార్థములగు శబ్దాదివిషయము లన్నిటినుండియు మరలింపబడి నిగ్రహింప బడుచున్నవో, అతని జ్ఞానమే సుప్రతిష్ఠితమై స్థిరమై నిరపాయమై విలసిల్లునని గీతాచార్యు లుపదేశించినారు.

అజ్ఞానులే సుఖము బాహ్యమునగలదని తలంచి దానికొఱకై పరువిడుదురుగాని విజ్ఞులు కాదు. వాస్తవముగ సుఖమనునది బాహ్యమున లేదు. బాహ్యమున గానుపించునది ప్రతిబింబితసుఖము, అదియును చిత్తమున కలదుగాని పదార్థమున లేదు.

> 'ప్రతిబింబితశాఖాగ్ర ఫలాస్వాదన మోదవత్'

అనురీతి బాహ్యపదార్థములం దానందమున్నదని యెంచి అద్దానికై దేవులాడువాడు సరోవరజలమందు ప్రతిబింబించిన తీరస్థవృక్షఫలముల నాస్వాదించి యానంద మొందువాని చందమునసే యుండును. కుక్క ఎచటనో యొక ఎముకను సంపాదించి దానిని కొరుకుచు చిగుళ్ళనుండి రక్తముకారి ఆ యెముకపైపడ అద్దానిని నాకుచు ఆ యెముక నుండియే రక్తము జనించుచున్నదని భావించి యానం

దించుచు తుదకు మహాదుఃఖము నెట్లు పొందునో, అట్లే మనుజుడున్ను యథార్థసుఖము ఆత్మయందుండ అజ్ఞానవశమున బాహ్యపదార్థమందే సుఖము గలదని తలంచి దానికొఱకై అహర్నిశములు అన్వేషించుచు కడకు దుఃఖమునే పొందుచున్నాడు.

ఏదైన యొక పదార్థము ననుభవింపవలెనని అపేక్ష గలిగినపుడు చిత్తము చంచలమగును. ఆ చంచలచిత్తము తత్పదార్థప్రాప్తిచే నిశ్చలముకాగా ఆ నిశ్చలచిత్తమున ఆత్మ ప్రతిబింబింప జీవునకు సుఖమనుభూతమగును. దీనిచే సుఖము బాహ్యపదార్థమందు లేదనియు చిత్తముననే కలదనియు, అదియు బింబభూతమగు ఆత్మయొక్క ప్రతిబింబము మాత్రమే యనియు స్పష్టమగుచున్నది. బింబభూతమగు ఆత్మానందమే నిరతిశయమైనది. అక్షయమైనది. అనంతమైనది. ప్రతిబింబానందము క్షణికమైనది. అంతముతో గూడినది. అట్టిచో, శాశ్వతమైనట్టి ఆత్మసుఖమునకై యేల ప్రయత్నింపరాదు? క్షణికమై దుఃఖమిశ్రితమైనట్టి విషయ సుఖమునకై యేల పాట్లు పడవలెను?

కాబట్టి ప్రబలవైరాగ్యము నాశ్రయించుటద్వారా విషయసుఖములందు విముఖత్వముగలిగి చిత్తమందున్నట్టి సమస్తవాంఛలను త్యజించివైచి ఆత్మాభిముఖుఁడైనచో, అచిరకాలములోనే జీవుడు పరమాత్మరూపగమ్యస్థానము నిచటనే పొందుచున్నాడు, కావుననే,

యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే.

అని శ్రుతి యుద్ఘోషించుచున్నది. అనగా 'హృదయ మందున్నట్టి కామనలు, సంకల్పములు అన్నియు తొలగగా మనుజుడు జననమరణరహితుడై యిచ్చోటనే పరబ్రహ్మ మును బొందుచున్నాడు.' మఱియు నట్టివాడు 'సుఖమక్షయ మశ్నుతే' అనగా నాశరహితమగు ఉత్తమపరమాత్మరూప సుఖమును బొందునని శ్రీకృష్ణభగవానులానతిచ్చిరి. అదియే మోక్షము. అదియే నిర్వాణపదము. అట్టి సర్వోత్కృష్ట పదవినొందుటయే జీవులందఱియొక్క లక్ష్యము. అట్టి లక్ష్య మును భక్తిజ్ఞానములద్వారా, తీవ్రవైరాగ్యసాధనద్వారా జీవుడు అనతికాలముననే పొంది, కడతేరి జీవితమును కృతార్థ మొనర్చుకొనవలెను. ఈ ప్రకారముగ వైరాగ్యమును చక్కగ అవలంబించి, మనస్సును బాహ్యవిషయములనుండి మఱలించి కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞాన విచారణాదుల ద్వారా అద్దానిని పునీతమొనర్చి ఆత్మయందు లయింప జేయవలెను. అదియే మోక్షము.

"మోక్షోహి చేతో విమలం"—నిర్మలచిత్తమే మోక్షము—అని వసిష్ఠమహర్షి పలికియున్నారు. మనస్సు నందు ఏవిధమైన మాలిన్యములేనిచో అట్టి విశుద్ధమనస్సు అధిష్ఠానమగు ఆత్మయందు లయించిపోవును. అదియే మోక్షము, కైవల్యము, నిర్వాణము. కావున మోక్ష ప్రాప్తికై చిత్తమందుగల మూడు దోషములు అనగా మల,

విక్షేప, ఆవరణములు పూర్తిగా తొలగవలెను. మలదోషమ
అనగా పాపము పుణ్యసముపార్జనముచేతను, విక్షేపదోషమ
అనగా చపలత్వము ఉపాసనాధ్యానాదులచేతను, ఆవర
దోషము అనగా అజ్ఞానము జ్ఞానవిచారణచేతను తొల
పోవును. ఈమూడుదోషములు రహితమైనపుడు ఇక మనస
ఏమాత్రము విలంబము లేక తత్క్షణమే మోక్షస్థితిని బ
యును. పుణ్యకార్యములను చక్కగ ఆచరించుటచేతన
నిష్కామకర్మమును శీలించుటచేతను, భగవద్భక్తిని లెస్స
సముపార్జించుటచేతను మొదటిదియగు పాపదోషము చి
మందు సమూలముగ తొలగిపోయి చిత్తము శుద్ధమ
కాగలదు. కావున సాధకుడు కర్మయోగముయొక్క రహస
మును చక్కగ తెలిసికొనియుండవలెను. శ్రీకృష్ణపరమాత
గీతయందు దానినిగూర్చి చక్కగ నిరూపించియుండెను.

---

# 14 వ అధ్యాయము

---

## కర్మయోగసాధన

"కర్మ చెడ్డదికాదు; వ్యవహారము దూష్యముకాదు. నీ దృష్టిని పవిత్రమొనర్చుకొనుము. అత్తఱి నీవు చేయుకర్మ మహాయజ్ఞమై భాసించును. నీ భావమును శుద్ధపఱచు కొనుము, అత్తఱి నీవు చేయు వ్యవహారము నిశ్శ్రేయస కరమై చెన్నొందును"—అని గీత ఘోషించుచున్నది. కర్మచేయక ఒక్కక్షణమైనను మనుజు డుండజాలడు. కావున కర్మను దూషించుచు, నిషేధించుచు చేయుబోధలు సామాన్యునకు ప్రయోజనకరములుగ నుండవు. పైగా అట్టి బోధలచే నతడు అకర్మణ్యుడుగ, జడప్రాయుడుగ తయారగును. జీవితము నిరర్థకమై పోవును. లోకములో నూటికి తొంభైతొమ్మిదిమంది గృహస్థులుగను, బ్రహ్మచారులుగను నున్నారు. వారు కర్మను పరిత్యజింపలేరు. సర్వసంగపరిత్యాగముచేసి, ఏకాంతమున కాలము గడుపు సన్న్యాసులు, సాధువులు చాల అరుదుగా నున్నారు. కావున ఎక్కువ మందికి ఉపకరించు బోధయే ఇపుడు కావలసియున్నది. ఈ విషయములన్నియు గీతాచార్యుడు చక్కగ ఆలోచించి వ్యవహారమును దూషింపక, దానిని పవిత్రమొనర్చు ఉపాయముల నన్వేషింపదొడగెను. మఱియు అట్టి వ్యవహారముల

ద్వారా, కర్మాచరణద్వారా చిత్తశుద్ధిని సంపాదించి క్రమముగ జ్ఞానానుభవమును బడసి మోక్షమును జెందవచ్చునని యాతడు బాహాటముగ ప్రకటించెను.

స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః. (18-46)

'తమ తమ కర్మలద్వారా పరమాత్మ నర్చించి మానవుడు ముక్తినొందగలడు—అని భగవానుడు వాక్రుచ్చెను. ఇందులకు ప్రబలదృష్టాంతము అర్జునుడే యగును; వలయనిన, నేను యుద్ధముచేయను; నాకు రాజ్యము వలదు; జోలె తీసికొని ఏకాంతమునకు బోయి భిక్షాన్నము భుజించుచు కాలక్షేపము చేసెద'నని పలికిన అర్జునుడు శ్రీకృష్ణమూర్తియొక్క దివ్యబోధలచే కర్మరంగమున దుమికి, యుద్ధముచేసి, 'నేనేమియు చేయలేదు' అను నిర్లేప భావముకలవాడై భయంకరసంగ్రామమును పవిత్ర యజ్ఞముగా మార్చివైచెను. శ్రీకృష్ణుని ముందుపెట్టుకొని అర్జునుడు యుద్ధమను వ్యవహారమును నడిపెను. వ్యవహారము మోక్షసోపానముగ పరిణమించుటకు ఉపాయమిదియే అయియున్నది (భగవదున్ముఖత్వమే). భగవంతుని స్మరించుచు కార్యమును చేయుటయే ముక్తికి మార్గము.

'మా మనుస్మర యుధ్య చ'

'నన్ను స్మరించుచు యుద్ధము చేయుము'—ఇదియే కర్మరహస్యము. యుద్ధముచేయుట గొప్పదికాదు. దేవుని స్మరించుచు యుద్ధముచేయుట గొప్పది. అప్పుడు 'కర్మ'

కర్మగానుండక కర్మయోగముగా మారిపోవును. (Work will be transformed into worship). అత్తఱి ఏకాంతమున సమాధినిష్ఠయందుండు యోగిపుంగవునకు, ప్రపంచమధ్యమున వివిధకార్యకలాపములందు నిమగ్నుడగు కర్మిష్ఠునకు ఒకేఫలము లభించును. ఆత్మశాంతి యిరువురికిని సంప్రాప్తించును; భగవద్గీత బోధించిన తత్త్వమిదియే. లోకములో కొన్ని శాస్త్రములు కర్మను పూర్తిగ నిషేధించుచున్నవి. అవి నివృత్తిమార్గమునే ఎక్కువగ పోషించుచుండును. మఱికొన్ని శాస్త్రములు కర్మను లెస్సగ ప్రోత్సహించుచున్నవి. అవి ప్రవృత్తినే ఎక్కువగ బలపఱచుచుండును. కాని గీత అటు ప్రవృత్తి కాక, ఇటు నివృత్తి కాక మధ్యమార్గమును కనిపెట్టినది. అది అందఱికిని ఆచరణయోగ్యముగ నున్నది. శరీరము ప్రవృత్తియందున్నను మనస్సును నివృత్తియందుంచుకొనుము. (Hands in the society and head in the forest)—అని గీత బోధించుచున్నది. ఈ గీతాభావము నాధారపఱచుకొనియే జనకుడు రాజ్యమేలెను. విష్ణుమూర్తి ముల్లోకములను పాలింపగలైను. ఇవ్విధముగ గీతాచార్యుడు వేదాంతులు సామాన్యముగ ఏవగించుకొనుచుండు లోకవ్యవహారమునకు క్రొత్తరూపమిచ్చి దానికి పరమార్థస్థాయిని కల్పించెను. ఇట్టి అపూర్వ సిద్ధాంతమును, మున్నెవరును, ఏ శాస్త్రమును ప్రతిపాదించలేదు. కనుకనే గీతకును, గీతాచార్యునకును ఇంత ఘనత చేకూరినది.

కావున ఏ నిష్కామకర్మమును గూఁ
రముగ ఉద్ఘోషించుచున్నదో అద్దానిని
సమాశ్రయించి చిత్తశుద్ధిని బడసి తద్ద్వా
ఆత్మానుభూతిని బొంది తరించవలయును.

## కర్మ - కర్మయోగము

కర్మ వేఱు, కర్మయోగము వేఱు
ముతో, ఫలాపేక్షతో, సక్తముగ నాచరిం
నిరహంభావముతో, ఫలాభిసంధిరహితము
ముగ, దైవార్పణబుద్ధితో నాచరింపబడునది
బండచాకిరిగా తలంచుకొని చేయబడునది
త్సేవగా భావించుకొని చేయబడునది కర్మయో
యందలి కర్తృత్వభావమును తీసివైచినచో క
ముగ మారిపోవును. కర్మను నిష్కామ భా
రించినచో కర్మ యజ్ఞముగ రూపొందును.
యందలి రహస్యము. దీనినే శ్రీకృష్ణభగవాన
బహిర్గతమొనర్చి లోకమునకు మహోపకార

ఈ ప్రకారముగ కర్మను కర్మయోగ
కొను పద్ధతి తెలిసికొనినచో ఇక కర్మ బంధ
రదు. వాస్తవముగ సక్తతయందే బంధము క
యందు కాదు. అహంభావము, కర్తృత్వము
బంధము కలదు కాని కర్మయందు కాదు *

* యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం క

కర్తృత్వభావమను విషమును పెరకివైచినచో ఇక కర్మ దూష్య మెన్నటికిని కానేరదు. పై పెచ్చు చిత్తశుద్ధిజనకమై అయ్యది మోక్షమునకున్ను దారితీయగలదు. ఇవ్విధముగ కర్మ జీవుని శ్రేయోభివృద్ధి కెంతయో ఉపకరించుచున్నది.

కర్మచేయక ఎవడును ఉండ లేడు. పైగా, ప్రపంచములో ఎక్కువమంది ప్రవృత్తిమార్గమునవే కలరు కాని నివృత్తిమార్గమున గాదు. కేవలము నివృత్తిని ఆశ్రయించి నిరంతరము ధ్యాన నిష్ఠలందు, నిర్వికల్ప సమాధులందు కాలము గడుపువారు చాల అరుదు. కాబట్టి ఎటుతిరిగి అందఱును కర్మ చేయవలసియే యుందురు, చేయుచున్నారు కూడను. అట్టిచో ఆ కర్మను యజ్ఞముగ ఏల మార్చుకొనరాదు? బంధహేతువును మోక్షహేతువుగ ఏల పరివర్తన మొనర్చుకొనరాదు? ఆ కర్మనే అనాసక్తముగ, దైవార్పణబుద్ధితో చేసిన చాలును. అద్భుతమగు ఫలితము కలుగును. ఈ కీలకమును తెలిసికొనియే జనకుడు మొదలైనవారు రాజ్యములనుగూడ పరిపాలించిరి. ఇట్టి అనాసక్తిని ఆశ్రయించియే సాక్షాత్ భగవానుడున్ను 'త్రీన్ లోకాన్ పాలయామ్యహమ్' అని చెప్పినట్లు మూడులోకములను పాలించుచున్నాడు. అట్టిచో ఒక చిన్నగృహమును, గృహవ్యవహారములను మనుజులు పాలింపలేరా?

కర్మలను త్యజించి వేసి సోమరిగ కూర్చొనుటవలన ఏ ప్రయోజనమున్ను లేదు. పైగా తమోగుణాభివృద్ధిచే

జనావళికి ఆ యవతారమూర్తి చక్కని గుణపాఠములను బోధించెను.

జ్ఞానగుణములలో అమానిత్వ, అదంభిత్వములకు ప్రముఖస్థాన మీయబడినది. అట్లే అసురగుణములలో దంభ దర్పములకు సముచితస్థానము కల్పింపబడినది. కావున విజ్ఞుడగువాడు అమానిత్వాది మహోన్నత దైవికగుణములను తన హృదయసీమయందు తావొసంగి, దంభదర్పాది అసుర గుణములను శాశ్వతముగ తర్పణముగావించి, కర్మరంగ మును పరిశుద్ధ మొనర్చుకొనవలెను. కర్మనిస్సంగముగ నాచరింపబడినపుడు అది చిత్తమును శుద్ధమొనర్చి జ్ఞానోదయము ద్వారా ఆత్మసాక్షాత్కారమును కలుగజేయగలదు. ప్రతి జీవికి కర్మాచరణము అనివార్యము కావున ఆ కర్మను జ్ఞాన సాధనముగ వినియోగించుకొనుటద్వారా సామాన్యమైన కర్మను మహత్తరదైవసాధనగా రూపొందించుకొనుట శ్రేయస్కరము.

చెప్పులు కుట్టువాడు చెప్పులు కుట్టుకొనుచు దైవస్మరణను, దైవభావమును విడనాడినచో ఒకానొక మహాయజ్ఞము యొక్క ఫలితమును అతడు తప్పక పొందగల్గును. అట్లే పాకీ వాడు పాకీపని చేయుచు దైవబుద్ధిగల్గి తాను దైవస్వరూపు లగు ప్రాణికోట్లకు సేవచేయుచున్నానను భావన గల్గియుండి నచో, మహత్తర పుణ్యమును సముపార్జింపగల్గును. అట్లే వ్యాపారి వ్యాపారమును చేసికొనవచ్చును, ఉద్యోగి ఉద్యోగ మాచరింపవచ్చును. వ్యవసాయదారుడు వ్యవసాయమును

గావించుకొనవచ్చును. పనిలో దోషము లేదు. పనిచేయు విధానములో దోషము కలదు. కర్తృత్వబుద్ధియే దోషము, అహంభావమే దోషము, అది లేనపుడు కర్మ బంధమును గాక మోక్షమునే కలుగజేయును. ఎట్టిపని చేయుచున్నాడు అను ప్రశ్న భగవంతునియొద్ద ఉదయించదు. ఆ పనిని ఏ ప్రకారముగ నాచరించుచున్నాడను ప్రశ్నమాత్రము ఉదయించును. కావున లౌకికరంగముననుగాని, పరమార్థక్షేత్రమున గాని జనులు వారివారి కర్మలను వా రాచరించుకొనుచు అహంభావము లేక, సంగబుద్ధిని త్యజించి, ధర్మనిష్ఠతో, న్యాయబుద్ధితో, భక్తిభావముతో మెలగినచో అచిర కాలములో భగవత్కృపకు పాత్రులై మోక్షధామమును చేరగలరు.

ఆదర్శకర్మయోగియగు శ్రీకృష్ణమూర్తియొక్క జీవిత విశేషములను నిరంతరము సంస్మరించుకొనుచు, ముముక్షువు తన జీవితమును సవ్యమార్గమున నడుపుకొనుచు పోవలెను. కర్మ శుద్ధము కానిచో భక్తి కలుగదు. భక్తి కలుగనిచో జ్ఞానము ఆవిర్భవించదు. జ్ఞాన మావిర్భవించనిచో మోక్షము చేకూరదు. కాబట్టి మోక్షప్రాప్తికి విశుద్ధకర్మయే పునాది. దానిని ఉపేక్షించినచో మోక్షమును గూర్చిన వార్తయే సంభవింపదు. కావున సాధకుడు ఉదయము నిద్రలేచినది మొదలు రాత్రి పరుండబోవునంతవరకు తా నొనర్చు ప్రతి కార్యమును జాగ్రత్తగ పరిశీలించుచు అది సవ్యముగా జరుపబడు లాగున యత్నించుచు మహనీయుల జీవితములనుండి గుణ

అహంభావరహితమగు కర్మ, నిస్స్వార్థబుద్ధితో గావింపబడు కర్మ, పరోపకారయుక్తమగు కర్మ అంతఃకరణమును శుద్ధ మొనర్చి ఆత్మసాక్షాత్కారమునకు దోహదమును కలుగ జేయును. అహంభావముతో గూడి, కర్తృత్వబుద్ధితో చేయ బడు కర్మయే బంధహేతువై జీవునకు పరమదుఃఖమును కలుగజేయుచుండును. కావున కర్మచేయునపుడు ఎంతయో జాగరూకతగలిగి పాపాదరణమును పరిపూర్తిగ విసర్జించి, అహంబుద్ధికి చోటీయక తాను కేవలము భగవంతునియొక్క ఉపకరణమని భావించి ప్రవర్తించుచుండవలెను.

కర్మ చేసినను దానిలో తగులుకొనకుండ చూచు కొనుటలోనే ఉన్నది మానవుని బుద్ధికుశలత. దేహము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి—వీనితోకూడిన ఉపాధియే కర్మ నాచరించుచుండును. వాస్తవముగ జీవుడు వీని యన్నింటికిని సాక్షిగనున్న ఆత్మయేకాని, ఉపాధిసంబంధ మైన వస్తువుకాదు. ఉపాధితోటి సంసక్తియే బంధము. దేహేంద్రియాదులు కర్మ నాచరించుచున్నను నిర్వికార ఆత్మస్వరూపుడైయున్న తాను వానితో సంసక్తిని ఏకాల మందును బొందరాదు. 'ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా' అని గీతాచార్యుడు సెలవిచ్చినట్లు మానవుడు బుద్ధికి సాక్షియై, బుద్ధికంటె పరమై వెలుగు ఆత్మయే తానని యెఱిగి, క్షేత్రజ్ఞ స్థానములోనున్నవాడై క్షేత్రమగు దేహేంద్రియాదులతో ఆ యా కార్యములను నెరవేర్చుకొనుచు అసంగుడై వర్తింప వలెను. అట్టివాడు ఎంతకర్మ ఆచరించినప్పటికిని ఏమియు

ఆచరింపనివాడే యగును. కర్మబంధనమును అతడు ఏమాత్రము బొందకుండును. లోకములో పరోపకారము చేయు మహాప్రవక్తలు ఇట్టికోవకు చెందినవారే యగుదురు.

శ్రీకృష్ణమూర్తి తాను అవతారమూర్తి అయినను, వినయవిధేయతలు గలిగి సాందీపుడను గురువరేణ్యుని సేవించి యుండెను. యుద్ధరంగములో పార్థుని రథమున యజమానుడుగ నుండక సారథిగ నుండుటకే సంసిద్ధుడయ్యెను. యుద్ధ సమయమున సాయంకాలమగుసరికి సంగ్రామము నిలుపుదల చేయబడినపుడు, అందఱును వారి వారి గృహములకు జని స్నానసంధ్యాదులను నిర్వర్తించునపుడు, శ్రీకృష్ణుడు తన నాలుగుగుఱ్ఱములను జలాశయముయొద్దకు తీసికొనివెళ్లి వానిని బాగుగ కడిగి, మేతపెట్టుచుండెడివాడు. ఇంతియే కాదు. రాజసూయయాగసందర్భమున ఏతెంచిన భక్తశిఖామణుల పాదపద్మములను కడిగి పరమతృప్తిని బడయుచుండు వాడు. నిర్ధనుడైనను దైవధనుడై విలసిల్లిన సుదాముని తన సింహాసనముపై గూరుచుండబెట్టి సేవాశుశ్రూషలు కావించిన భక్తవత్సలుడు. ఈ ప్రకారముగ శ్రీకృష్ణమూర్తి తన జీవితకాలమున ఆదర్శవంతమైన కార్యముల నెన్నిటినో జరిపి యుండెను. అతడు ఆదర్శకర్మయోగి. తన జీవితముద్వారా యతడు లోకమునకు నిరహంభావమును తెస్సగ చాటి చూపెను. గర్విష్ఠులై, ధన, అధికారమదాంధులై తమ్ముమించినవారు లేరని కన్నుమిన్ను తెలియక ప్రవర్తించు

నట్టి స్థితి మహాప్రమాదకరమైయున్నది. వాసనాక్షయము కానివాడు, కర్తృత్వబుద్ధి, అహంభావము వదలనివాడు ఏ కర్మను చేయక ఊరకనున్నను గంపెడు కర్మను నెత్తిన వేసికొనువాడే యగును. వానికి అకర్మయందును కర్మ తగులుకొనుచునే యున్నది. ("అకర్మణి చ కర్మ యః") ఆతడు కర్మేంద్రియ ప్రవృత్తిలేక నిశ్చలముగనున్నను, ఏకాంతమున వసించినను, కొండగుహాలలో కాపురమున్నను, నిర్జనవనముల నాశ్రయించినను, దృశ్యసంకల్పములు మన స్సును వదలని కారణముచే, అహంభావము, జన్మార్జిత వాస నలు నశింపని కారణముచే, తమోగుణము అంతరించని కారణముచే కర్మబద్ధుడే యగుచున్నాడు. కాబట్టి కర్మలను చేయకుండుట కంటె చేయుటయే మేలు. (కర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే). అయితే కర్మలను దైవార్పణ బుద్ధితో, నిష్కామభావముతో నాచరించుటను అభ్యసించ వలెను.

'నీవు ఏపని చేయుచున్నా'వని భగవంతుడు ప్రశ్నిం పడు. 'ఏ భావముతో చేయుచున్నా'వని మాత్రమే ప్రశ్నిం చును. ఏమి చేయవలెనో శాస్త్ర మాదేశింపదు. ఎట్లు చేయవలెనో—అదిమాత్రమే ఆదేశించును. వ్యవహారము చెడ్డదికాదు. ప్రవృత్తి నీచముకాదు. వ్యవహారమునకు వేదాంతమును జోడించినచో ఆ వ్యవహారమిక వ్యవహార స్థాయిని అతిక్రమించి వేదాంతస్థాయిని జేపట్టును. అట్లే ప్రవృత్తిలో నివృత్తిభావమును మేళవించినచో ఇక ఆ

ప్రవృత్తి ప్రవృత్తిగా నుండక నివృత్తిఫలమును గలుగ జేయును. ఇదియే కర్మయందలి కీలకము. దీనిని తెలిసికొన్న నచో ఇక ఎంత కర్మ నాచరించినను మనుజుడు బంధింపబడ నేరడు. మహానీయులందఱున్ను ఈ రహస్యమెఱిగియే లోక మున ప్రవర్తించిరి. కావున ముముక్షువులగువారు అకర్మ ణ్యులై ఊరక నుండక, కర్మయోగముయొక్క కీలకము నెఱిగి, దైవార్పణబుద్ధితో కార్యముల నాచరించుచు, చిత్తశుద్ధిని బడసి, బ్రహ్మజ్ఞానప్రాప్తిచే పరమానందరూప కైవల్యమును బడయువలయును.

## ఆదర్శసేవ

పశువులు కర్మచేయుచున్నవి. పక్షులు కర్మచేయు చున్నవి. కృమికీటకాదులు కర్మచేయుచున్నవి. కర్మచేయుట గొప్ప కాదు. ఆ కర్మవలన జన్మసార్థకత ఏర్పడుచున్నదా యని ప్రశ్నించుకొని, తదనుగుణ్యముగ దానిని ప్రవర్తింప చేసికొనుటలోనే ఉన్నది గొప్పతనము. కర్మచేయక ఒక్క ప్రాణియైనను ఉండజాలదు. ఏదియో యొక కర్మ ప్రతి జీవియు నిరంతరము చేయుచునే యుండును. అట్టితఱి ఆ కర్మను సద్వినియోగపఱచుకొనుపద్ధతి తెలిసికొనియుండి నచో, ఇక కర్మ బంధనమునుగాక మోక్షమునే కలుగ జేయును.

కర్తృత్వము లేని కర్మ, ఈశ్వరార్పణబుద్ధితో చేయ బడు కర్మ, ఫలాభిసంధిరహితముగ ఆచరింపబడు కర

పాఠములను నేర్చుకొనుచు, వారి ప్రబోధముల ద్వారా బలమును, శక్తిని సంతరించుకొనుచు నిర్మలహృదయుడై, నిర్భయుడై అభివృద్ధిని బడయవలయును. వినయవిధేయతలు గలిగి చక్కని సేవాభావమును అలవఱచుకొనవలెను.

సేవకుమించిన సద్గుణము లేదు. అది లోకసేవ అగుగాక, దైవసేవ అగుగాక, గురుసేవ అగుగాక, సంఘసేవ అగుగాక – ఏ సేవ అయినను అహంభావమును తొలగించి చిత్తశుద్ధిని కలుగచేసి జీవుని దైవమునకు సన్నిహితునిగ జేయగలదు. కాబట్టి జీవితములో అవలంబింపదగిన ప్రముఖ గుణమది. సేవాధర్మమును ఆదర్శవంతముగ నెరవేర్చిన వారిలో శ్రీకృష్ణుడు, ఆంజనేయుడు ముఖ్యులని చెప్ప వచ్చును.

శ్రీకృష్ణుడు లోకమున కొసగిన సందేశమేమియని ఎవరైన ప్రశ్నించినచో ఆ మహనీయుని జీవితమే అతని సందేశము (His life is his message) అని నిష్కర్షగ చెప్పవచ్చును. లోకాధీశుడైనప్పటికిని బండితోలు పనిని అతడు స్వీకరించెను. ఇకార్యమున అతని నిరహంభావము, నిరభిమానము, భక్తిసేవాపరాయణత్వము కండ్లకు కొట్టినట్లు గోచరించుచున్నవి. శ్రీకృష్ణుని జీవితమున, అతని నిస్స్వార్థ గురుసేవ, ప్రగాఢపరహితవాంఛ, భక్తజన పరిచర్యాభిలాష, నిష్కామసేవాపరాయణత ఎన్నియోచోట్ల చక్కగ వ్యక్తమగుచున్నవి. కావున శ్రీకృష్ణుడు లోకమున కొసర్చినది ఆదర్శసేవయే యని స్పష్టమగుచున్నది.

అట్లే భక్తాగ్రేసరుడగు ఆంజనేయుని జీవితమున్ను సేవాధర్మమునకు పరిపూర్ణముగ అంకితమైపోయెను. రామ సేవాధురంధరుడగు ఆ మహాయశస్వి సేవయొక్క పరిపూర్ణ రూపమును లోకమునకు సుపరిచితము చేసెను. లంకలో తన బృహద్రూపమును చూపినవేళ రాక్షసులు 'నీ వెవరవు?' అని ప్రశ్నించగా—

'దాసోహం కోసలేన్ద్రస్య రామస్యాక్లిష్టకర్మణః
హనుమాన్ శత్రుసైన్యానాం నిహన్తా మారుతాత్మజః.'

'పవిత్ర కార్యతత్పరుడును, కోసలాధీశుడునగు శ్రీరామ చంద్రుని దాసానుదాసుడను నేను. శత్రుసైన్యమును సంహ రించునట్టి మారుత తనయుండైన హనుమంతుడను నేను'— అని పలికిన పలుకులు అంజనేయుని వినయవిధేయతలను, గాంభీర్యమును, రామసేవాతత్పరతను వెల్లడించుచున్నవి. ఆంజనేయుడు మహాబలశాలి. అరచేతిపై కొండను మోసెను. శ్రీకృష్ణుడును మహాబలశాలి. చిటికెన వ్రేలిపై కొండను మోసెను. ఈ ప్రకారముగ ఇరువురును మహాభౌతికశక్తి సంపన్నులైనప్పటికిని, సర్వజ్ఞులైనప్పటికిని ఏమాత్రము అహంకరించక, విధేయులై లోకమునకు తమ అపార ఆధ్యా త్మికశక్తిని దిగ్దర్శన మొనర్చిరి.

నిరహంభావముతో నొనర్చు సేవయే ఆదర్శవంత మైనది. మహనీయు లెందరో తమ తమ జీవితములం దిట్టి మహోన్నత సేవాధర్మమును ఆచరణయందుంచి ధన్యులైరి.

ఒక వ్యక్తికి సేవయొనర్చుట సాక్షాత్ భగవత్సేవ యని తలంచువాడు అధ్యాత్మరంగమున శీఘ్రముగ పురోగతిని బడయగలడు. మానవసేవ మాధవసేవ అయినప్పటికి, అంతటితో ఆగక తమ సేవాపరిధిని ఇంకను విస్తరింపజేసి సమస్తభూతకోట్ల సేవకూడ మాధవసేవయని భావించి "సర్వభూతహితే రతాః" అను సూక్తిని అమలుపఱచువాడు ఆదర్శసేవకుడు. వాస్తవదైవభక్తుడు అయియున్నాడు.

సేవాభావము అహంకారమును చంపివేయును. దేహాభిమానమును పారద్రోలును. గర్వమును తెగద్రుంచును. పుణ్యరాశిని పెంపొందించును. పెద్దల అనుగ్రహమును సంపాదించి పెట్టును. శ్రీకృష్ణహనుమదాదులు ఆశ్రయించిన ఇట్టి మహోన్నత ఉదాత్తసేవాధర్మమును ముముక్షువులు సత్వరము చేబట్టి తమ జీవితమును పునీత మొనర్చుకొని సర్వేశ్వరుని అపారకరుణకు పాత్రులు కావలయును.

చిత్తమందలి మొదటి దోషమగు మలము అనగా పాపము తొలగిపోవుటకు కర్మయోగముతో బాటు భక్తియోగమున్ను లెస్సగ ఉపకరించును.

—◆—

# 15 వ. అధ్యాయము

## భక్తియోగసాధన

'అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి—

'నన్ను శరణుబొందిన వారియొక్క సమస్తపాపములను నేను తొలగించివేసెదను'—అని శ్రీకృష్ణభగవానుడు సెలవిచ్చిన వాక్యమును ముముక్షువులు సర్వదా స్మృతిపథమున నుంచుకొని భగవద్భక్తిని బాగుగ అభివృద్ధిపఱచుకొనవలయును. దైవశక్తిముందు మానవునిశక్తి బహు అల్పమైనదని యెఱింగి మనుజుడు దైవముయెడల అపారభక్తి కలిగి వినయాన్వితుడై పఱగవలయును.

### దైవ శక్తి

అనంతములైన బ్రహ్మాండములతో వెలయుచు వ్యవహార సంకులితమైయున్న ఈ సమస్త ప్రపంచము భగవంతునియొక్క ఒకానొక అంశమే అయియున్నది. "పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి" అను వేదవాక్యమున్ను 'విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్' అను గీతావాక్యమున్ను ఈ యర్థమునే ప్రతిపాదించుచున్నవి. విశ్వమంతయు భగవంతుని ఒక్క పాదముచే (స్వల్పభాగముచే) వ్యాప్తమైయున్నదనియు

మూడు పాదములు (అధిక భాగము) అమృతరూపమై వెలయు చున్నదనియు భావము. కావున ప్రపంచసంపర్కము లేని భాగము ఇంకెంతయో ఉన్నదని స్పష్టమగుచున్నది. "అత్యతిష్ఠద్దశాంగులమ్"—బ్రహ్మాండమంతయును దాటి యింకను పది అంగుళములు (కొంత) అధికముగనే యున్నాడు భగవంతుడు అని వేదవాక్కు తెలుపుచున్నది. అట్టి వర్ణనయంతయు సామాన్యులకు భగవంతుని అనంత స్వరూపముయొక్క పరిచయమును స్థూలముగ నొసర్పుట కొఱకే అగును. వాస్తవముగ పరమాత్మ కొన్ని భాగములుగ విడగొట్టబడువాడుకాడు. అతడు అవిభక్తుడు. దృశ్యప్రపంచముయొక్క సంపర్కమేమాత్రము లేనివాడు. అసద్రూపమగు జగత్తు సద్వస్తువగు పరమాత్మలో నొక భాగమెట్లు కాగలదు? లేనిది ఉన్నదానిలో ఏ భాగమునకు చెందును? ఇది వాస్తవస్థితి. కాని ఇట్టి అతీతబోధ జనసామాన్యమునకు అందుబాటులో నుండదు. కావున స్వప్నలోకమునందంతటను జాగ్రత్పురుషుడు వ్యాపించి యింకను దానికి అతీతుడుగనే యుండులాగున పరమాత్మ ఈ విశ్వమంతటను ఒక భాగముచే వ్యాపించి తక్కిన భాగములచే ఇంకను అతీతుడుగనే యున్నాడని వర్ణించి చెప్పబడినది. ద్వైతరూపముగ భావించినను, అద్వైతరూపముగ భావించినను పరమాత్మ బ్రహ్మాండమంతయు వ్యాపించి విశ్వాతీతుడుగ వెలయుచున్నాడను విషయము మాత్రము స్పష్టము.

దైవము విశ్వాతీతుడను సత్యము నెరుంగుటకు ముందుగా విశ్వముయొక్క స్వరూపము నొకింత అవగాహనము చేసికొనుట ఉత్తమము. కోట్లకొలది మైళ్ళ దూరములో తేజోవంతములగు బ్రహ్మాండమైన గోళములు, సూర్యులు, చంద్రులు, ఎన్నియో మన దృష్టికి అందనివి వానివాని కక్ష్యలందు నిర్దుష్టముగ పరిభ్రమించుచున్నవి. అగణితములగు గ్రహములు ఉపగ్రహములు అనంతకోటి జీవరాసులకు నెలవులై యొప్పుచు విశాలాకాశమున సంచరించుచున్నవి. ఇట్టి అనంతమగు భూతాకాశము సూక్ష్మమగు చిత్తాకాశమున నొకమూల తిరుగాడుచున్నది. అట్టి అనంత చిత్తాకాశము అత్యంతసూక్ష్మమగు చిదాకాశమున కేవలము కల్పితమై ఒకమూల నక్కి ఉన్నది. చూచితిరా! చిదాకాశస్వరూపుడగు పరమాత్మయొక్క మహిమాతిశయము! అట్టి అనంతకోటి బ్రహ్మాండములకు నాయకుడై చిదాకాశస్వరూపుడైన పరమాత్మ కావలెనా ? లేక, ఎక్కడో భూతాకాశమున, ఎక్కడో జంబూద్వీపమున, భరత వర్షమున, భరతఖండమున, మేరుపర్వతముయొక్క దక్షిణ దిగ్భాగమున, ఏకదేశమునవర్తించు అల్పభోగసముదాయము కావలెనా ? విజ్ఞులే యోచించుకొనవలసినది.

శ్లో॥ నాథే నః పురుషోత్తమే త్రిజగతామేకాధిపే చేతసా
సేవ్యే స్వస్య పదస్య దాతరి సురే నారాయణే తిష్ఠతి
యం కంచిత్పురుషాధమం కతిపయగ్రామేశమల్పార్థదం
సేవాయై మృగయామహే నరమహో మూకా వరాకా వయమ్.

(ముకుందమాల)

"పురుషోత్తముడును ముల్లోకముల కేకైక ప్రభువును అగు శ్రీమన్నారాయణుని మనసార సేవించినంత మాత్రమున అతడు తనయొక్క అనంత బ్రహ్మపదమునే ఇచ్చివేయుచుండ దానిని వదలి ఏవియో కొన్ని గ్రామముల కధికారియైన ఒకానొక అల్పమనుజుని చుట్టు చేతులు కట్టుకొని తిరుగాడుచున్నాము. ఎంత మూఢులము మనము!" అని కులశేఖరాళ్వారు విస్తుపోయెను. కావున పరమాత్మయొక్క అనంతవిభూతులనుగూర్చి, విశ్వవ్యాపక విశ్వాతీత స్వరూపమును గూర్చి బాగుగ మననము చేయుచుండినచో జనుల యొక్క అహంకారము అణగిపోగలదు. "దాసోఽహం" భావన చక్కగ అలవాటు కాగలదు. భగవద్భక్తి అభివృద్ధి నొందగలదు.

దైవశక్తి ముందు మానవునిశక్తి ఎంత అల్పమైనది! గాలి లేనపుడు విసనకఱ్ఱతో విసరుకొందుము. కాని ఎంత అవస్థపడినను ఒకింత గాలి మాత్రమే వచ్చును. ఒక్క ఝంఝామారుతము వీచినచో గ్రామగ్రామములుకూడ వ్యాపించునంతటి మహావాయువు ఉద్భూతము కాగలదు. ఇది దైవశక్తి! మొదటిది మనుష్యశక్తి! అట్లే బావిలో తోడుకొనినగాని, మోటార్లతో పంపుచేసినగాని కొన్ని నీళ్లు మాత్రమే వచ్చును. బ్రహ్మాండమైన వర్షము కురిసినచో ఊళ్లు చెరువులు ఏకమగునంతటి జలము ఆవిర్భవించును. ఇది దైవశక్తి! మొదటిది మానవశక్తి. రాత్రి చీకటిలో ఒక దీపము కాని, ఎలక్ట్రిక్ దీపముగాని వెలిగించిన కొద్ది

చోట మాత్రము ప్రకాశము కల్గును. ఉదయము సూర్యు డుదయించినచో సర్వదిక్కులు ప్రకాశమానములై పోవును. ఇది దైవశక్తి. మొదటిది మానవశక్తి. ఈ ప్రకారముగ భగవానుని అనంతశక్తిసమ్ముఖమున మానవుని అల్పశక్తి వెలవెలపోవుచున్నది. కావున తన అల్పత్వమును తెలిసికొని విట్టివీగక భక్తిప్రపత్తులతో తన చిత్తమును దైవమునందు హృదయస్థ పరమాత్మయందు విలీనము చేయవలెను. మానవుడు చేయకలిగినది యింతియే. తన్ను భగవంతునికి సమర్పించుకొనుటకంటె అధికముగ నాతడు చేయుకల్గినది ఏది? అట్లు చేయుటవలన తనకు ఏమాత్రము తగ్గుటలేదు. పైపెచ్చు ఆ అనంత భగవచ్ఛక్తికి తానే వారసుడగుటవలన జలబిందువు సముద్రములో పడి తన వ్యష్టిత్వమును అల్పత్వమును గోల్పోయి విశాల సముద్రరూపమే అగునట్లు దైవరూపుడే అగుచున్నాడు. భగవద్విభూతియొక్క చింతనచే కలుగు మహోపకారమిది. కాబట్టి తమ తమ అల్ప ప్రాపంచిక వైభవములను, సంపదలను జూచి మురిసిపోక జనులు సర్వేశ్వరుని అనంత మహిమాతిశయమును దివ్యవిభూతిని అనవరతము సంస్మరించుచు తద్ద్వారా భక్తిని అభివృద్ధి పఱచుకొని, అహంకారమును చంపుకొని విశ్వాత్మయందు తల్లీనులై బ్రహ్మానందస్వరూపులుగ వెలయవలయును.

పరమాత్మ అఖండశక్తిసంపన్నుడు. అతడు కాల కాలుడు. కాలము అన్నిటిని మ్రింగివేయుచున్నను ఆ పరమాత్మ కాలమునే మ్రింగివేయుచున్నాడు. కాలముచేత

అతడు పరిచ్ఛిన్నుడు కానివాడు. కాలమును తన గుప్పిట యం దుంచుకొనినవాడు. 'కాలేన అనవచ్ఛేదాత్' అని పతంజలి మహర్షి నుడివినట్లు కాలప్రభావమునకు లోను కానివాడు. పైగా కాలమునే తన వశమం దుంచుకొనిన వాడు. కాలవశుడగు జీవుడు అట్టి కాలాతీతుడగు పరమాత్మ నాశ్రయించిననే గాని శాంతి లభించదు. మృత్యుగ్రస్తుడగు జీవుడు అమరస్వరూపుడగు ఆ పరాత్పరుని అండ జేరిననేగాని ఆశ్వాసము లభించదు.

గీతాచార్యుడగు శ్రీకృష్ణపరమాత్మ తన బోధ నంతను పరిసమాప్తము చేయుచు తుట్టతుదకు అర్జునున కీ విధ ముగ బోధించెను—'ఓ ధనంజయా! సర్వాంతర్యామియైన పరమేశ్వరుడు సమస్తప్రాణులయొక్క హృదయమందు వర్తించుచు మాయచే జీవరాసులన్నిటిని చక్రమునందు తగు లొ్కనిన వస్తువులనువలె త్రిప్పుచున్నాడు. ఆ ఈశ్వరునే శరణుబొందుము. అతని యనుగ్రహముచే సర్వోత్తమమగు శాంతిని, శాశ్వతమగు మోక్షపదవిని నీవు పొందగలవు.'' కాబట్టి జీవునకు వేఱు తరుణోపాయము లేదు. బద్ధుడగు జీవుడు ముక్తుడగు పరమాత్మయొక్క పాదముల నాశ్ర యించియే తీరవలెను. కాలముచే పరిచ్ఛిన్నుడగు మానవ ునకు కాలాతీతుని పదపంకేరుహములు తప్ప అన్యమగు శరణ్యము లేదు. పరమాత్మను ఆశ్రయించిన వారికిక యముని గూర్చిన భీతి ఏకోశమునను ఉండనేరదు.

'చంద్రశేఖరమాశ్రయే మమ కిం కరిష్యతి వై యమః.'—చంద్రమౌళియగు పరమశివుని నమ్ముకొని యుండు వానినిక యము డేమిచేయగలడు? అని పెద్దల వాక్యము.

ఈ దృశ్యప్రపంచమంతయు కాలగర్భమున విలీనమై వినష్టమై పోవుచున్నది. కాలమను తిఱుగలియందు పడి జీవరాసులన్నియు పిండిపిండి అయిపోవుచున్నవి. ఎందఱో రాజులు అంతరించిరి. ఎన్నియో లోకములు కాలగర్భమున పుట్టి పెరిగి గిట్టుచున్నవి. కాలము గ్రసింపని పదార్థమెద్దియు ప్రపంచమున లేదు. నదీప్రవాహమున కొట్టుకొనిపోవువాడు తనవెంట కొట్టుకొనిపోవుచున్న పదార్థములను పట్టుకొనినచో కాపాడబడజాలడు. స్థిరముగనున్న ఒడ్డునుమాత్రమే పట్టుకొనవలెను. ఈ ప్రపంచమున కాలప్రవాహమున అనాదికాలమునుండి కొట్టుకొనిపోవుచు నానాదుఃఖముల పాలుబడుచున్న జీవులు స్థిరస్వరూపుడై, తీరరూపుడై వెలయునట్టి పరమేశ్వరుని ఆశ్రయించి కడతేరవలెనే కాని, ఇతరమగు దేనిని ఆశ్రయించినను ప్రయోజనములేదు. ఆ ప్రకారముగ భగవంతుని ఆశ్రయించినవారి నిక మాయగాని, ప్రకృతిగాని, అవిద్యగాని, యమధర్మరాజుగాని, మఱియొకరుగాని ఏమియు చేయజాలరు.

'కాలకాల ప్రపన్నానాం కాలః కిం ను కరిష్యతి?' కాలకాలుడై పఱగు పరాత్పరుని నమ్ముకొనిన వారినిక కాలమేమి చేయగలదు? కాబట్టి అనాదికాలమునుండి మాయాచక్రమున పరిభ్రమించుచు, పుట్టుచు, గిట్టుచు, వివిధయోగ

ములందు తిరుగాడుచు దుర్భరయాతన లొందుచున్న జీవ
రాశి ఎంత శీఘ్రముగ భగవత్పాదారవిందములను ఆశ్ర
యించిన అంత శ్రేయస్కరము. ఇట్టి దైవాశ్రయమే జీవిత
లక్ష్యము. అది లేనిదో చుక్కానిలేని పడవవలె జీవితము
నిరర్థకమై పోగలదు. కావున ముముక్షువు దైవమువెడల
భక్తిభావమును పెంపొందించుకొని హృదయమందు విరాజిల్లు
శాశ్వత పరమాత్మను తక్షణమే ఆశ్రయించి, కాలకాలుని
సన్నిధిజేరి కాలప్రభావమునకు లోనుగాక అనంతానంద
మును అనుభవించవలయును.

## భగవచ్ఛరణాగతి

త్రిగుణాత్మకమగు మాయచే జనులు ఆవరింపబడి
యుండుటచే, త్రిగుణములకు అతీతముగా నున్న అట్టి భగ
వంతుని స్వరూపమును ఎఱుంగజాలకున్నారు.

త్రిభిర్గుణమయైర్భావై రేభి స్సర్వమిదం జగత్
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్. (7-13)

సత్త్వరజస్తమోగుణములను మూడు త్రాళ్ళచే పెన
వేసికొని యుండుటచే మాయ చాల దుర్భేద్యముగ నున్నది.
దీని ప్రభావమువలననే జనులు జనన మరణాది ఈ సంసార
సముద్రమున దరిగానక ఈదులాడుచున్నారు. ఈ మాయా
వశముననే మలమాంసములతో గూడిన ఈ శరీరమును
జీవుడు తానుగా భావించుచున్నాడు. మఱియు నశ్వరము
లగు భోగవిలాసములందు పరమప్రీతితో రమించుచున్నాడు.

క్షణికములగు దృశ్యపదార్థములందు శాశ్వతత్వబుద్ధి కలిగి వానివెంట పరుగిడుచున్నాడు. ఉన్న దేవుని లేడనుచున్నాడు. లేని జగత్తును ఉన్నదనుచున్నాడు. తత్ఫలితముగ - కట్టెపుల్ల నదీప్రవాహమున బడి కొట్టుకొని పోవుచు కొంతసేపు ఒక ఒడ్డుకు తాకి, మరల కొట్టుకొనిపోయి మఱియొక యొడ్డును తాకునట్లు - ఒక జన్మ నాశ్రయించి, అటనుండి మఱియొక జన్మను పొందుచు, ఇట్లు అనాదికాలమునుండి భవదుఃఖప్రవాహమున కొట్టుకొని పోవుచున్నాడు. ఈ ప్రకారముగ బలీయమగు మాయయొక్క ప్రభావముచే మనుజుడు భగవంతుని తెలిసికొనజాలక జనన మరణములకు లోనగుచున్నాడు. అయితే ఇక జీవునియొక్క గతి యింతియేనా? ఈ మాయనుండి తప్పించుకొనుటకు తెరవు లేదా? ప్రకృతియొక్క గుప్పిటనుండి విడివడుటకు ఉపాయము లేదా? తరతరములు జీవుడిట్లు బాధపడవలసినదేనా? కాదు. తప్పించుకొనుటకు ఉపాయము కలదు. మాయ భయంకరమైనదే. దాటుటకు కష్టసాధ్యమైనదే. కాని అసాధ్యము మాత్రము కాదు. మాయను దాటుటకు చక్కని యుపాయమును భగవానుడు సెలవిచ్చెను—

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే. (7-14)

'నన్ను ఎవరు శరణుజొచ్చెదరో అట్టివారు ఈ మాయను దాటివేయగలరు' అని శ్రీకృష్ణపరమాత్మ జనులందఱికిని అభయ మొసంగెను. ఈ శ్లోకము సాధకులకు అతి

ముఖ్యమైనదిగా నున్నది. ఏలయనిన, ప్రతిజీవియూ త్రిగుణాత్మకమై, దుఃఖప్రదమైనట్టి ఈ మాయచే నానాబాధలు పడుచు, దాని పీడను వదలించుకొనుటకై తబ్బిబ్బులు పడుచున్నాడు, కాని ఏవేవో ప్రయత్నములు చేసినను, ఆత్యంతిక దుఃఖరాహిత్యము వానికి కలుగుటయే లేదు. సర్వదుఃఖనివారణకు, సమూల మాయావినాశమునకు సరియైన యుపాయ మాతనికి గోచరింపక అవస్థపడుచున్నాడు. అట్టి సందర్భమున శ్రీ కృష్ణభగవానుడు జీవరాసులపై కరుణ గలిగి జనన మరణ ప్రవాహమునుండి వానిని తప్పించుటకై, భవసాగరమును దాటించుటకై ఈ ప్రకారముగ అమూల్యమగు సాధనను వెల్లడించెను. భగవంతుని శరణు బొందుటయే అ సాధన. సత్యవస్తువును ఆరాధించుటయే ఆ యుపాయము. శ్రీశంకరభగవత్పాదాచార్యులను ఒకానొక శిష్యు డిట్లు ప్రశ్నించెను.

అపార సంసార సముద్ర మధ్యే
సమ్మజ్జతో మే శరణం కిమ స్తి
గురో కృపాలో కృపయా వదైతత్—

కరుణామయుడగు ఓ దేవా! అపారమగు సంసార సముద్రమున మునిగిపోవుచున్న నాకు శరణ్య మేది? దయచేసి వచింపుడు. అందులకు గురువర్యుడగు శ్రీ శంకరు లిట్లు సమాధాన మొసంగిరి—

'విశ్వేశపాదామ్బుజదీర్ఘ నౌకా'

'లోకేశుడగు భగవానుని పాదపద్మములను విశాల నావయే అట్టివారికి శరణ్యము. కదలుచున్నవానికి కదలని వస్తువే శరణ్యము. అనిత్యమైనవానికి నిత్యవస్తువే శరణ్యము. దేశకాల క్రియలకు లోబడినవానికి దేశకాల క్రియాతీతుడే శరణ్యము. అట్టివాడు భగవంతుడొకడే. కావున జీవరాసులకు అతనిని ఆశ్రయించుట తప్ప వేఱు మార్గము లేదు. కొన్ని కొన్ని ఉత్సవములు జరుగునపుడు అనేక వినోదవస్తువులు, ఆటవస్తువులు ప్రదర్శింపబడుచుండును. అందులో 'రంగులరాట్నం' అను యంత్రము విశేషముగ జనులను ఆకర్షించుచుండును. కొయ్యతో చేసిన ఏనుగు, ఒంటె, గుఱ్ఱము మొదలైనవి ఇనుపకమ్ములకు బిగింపబడియుండును. పిల్లలు కొంత డబ్బు చెల్లించి వానిపై నెక్కి కూర్చుందురు. యంత్రము త్రిప్పబడును. వాహనములు, వానిపై కూర్చున్న పిల్లలు అందఱు గిరగిర తిరుగుచుందురు. ఇంతలో ఒక పిల్లవానికి కండ్లు తిరిగినవి యనుకొనుడు; అతడేమి చేయును? ఇనుపకమ్మిని వదలివేసినచో క్రిందపడి మరణించును. అట్లే కూర్చున్నచో కండ్లు తిరుగుచున్నవి? అత్తఱి యాతడు యంత్రమును త్రిప్పువానిని కేకవేయును. 'ఓయీ, యంత్రమును నిలుపుము' అని యఱచును. ఇది తప్ప వేఱొక యుపాయ మాతనికి లేనే లేదు. పిల్లవాని యాక్రందనమును విని యంత్రమును త్రిప్పువాడు దానిని నిలుపును. అట్లే ఈ సంసార చక్రమున తగుల్కొని, కర్మప్రభావముచే ఊర్ధ్వాధోలోకములకు జనుచు, దుఃఖాతురులై యున్న జీవకోటికి శాంతి

సుఖములు లభించవలెననిన, ఆ చక్రమును త్రిప్పుచున్న చైతన్యశక్తిని ఆశ్రయించవలెను. అతడే పరమాత్మ; అతనిని శరణుబొందినవానికి కిక భవభీతి యుండనే యుండదు. ఎట్లనిన—

కొన్ని గొప్పగొప్ప భవనములందు, బంగళాలలో ద్వారముకడ కావలి కాచు కుక్క యుండును. అది వీధిలో తిరుగు సామాన్య శునకమువలె మత్తుగా నుండదు. మహా పౌరుషముతో గూడియుండును. ఇంటివారు తప్ప క్రొత్తవారెవరు వచ్చినను అఱచును. సందర్భపడినచో కఱచును కూడ. ఒకపర్యాయ మొక పెద్దమనిషి ఒకానొక బంగళాయొద్దకు రాగా ద్వారముకడ నున్న కుక్క అడ్డుపడెను. అది చాల భయంకరముగ నుండెను. అతని కేమియు తోచలేదు. దాని నెదుర్కొనుట కాతనికి తగినశక్తి సాహసములు లేవు. వెంటనే ఆ ఇంటి యజమాని నతడు కేక వేసెను. యజమాని లోపలినుండి రాగానే కుక్క తన భీషణాకృతిని వదలి శాంతరూపమును ధరించి ఆ క్రొత్తవానిని లోపలికి పోనిచ్చుటయే కాక అతనికి మిత్రుడుగను వ్యవహరించెను. ఈ యానుకూల్య మెటు లేర్పడెను? యజమానుని ఆశ్రయించుటవలన, అట్లే మోక్షసౌధములోనికి పోనీయక మాయయను భయంకర శునకము జీవుని యడ్డగించుచున్నది. క్లేశములపాలు చేయుచున్నది. అట్టిసమయమున మోక్షాధీశుడగు పరమేశ్వరుని శరణుబొందుటయే జీవులకు ఏకైకమార్గము. ఈ మార్గము నవలంబించియే యెందఱో మహానీయులు

పూర్వము తరించియుండిరి. ఇపుడును తరించుచున్నారు. కాబట్టి మాయావిజయమునకు భగవదాశ్రయమే ఏకైక శరణ్యమని నమ్మి సర్వులును హృత్పూర్వకముగ ఆ భగవానునే సేవింపవలయును.

## సంసార సాగరతరణము

భక్తిమార్గము సర్వులకును అతిసులభమైనది. పండితులకు, పామరులకు అందుబాటులోనిది ఆచరణయోగ్యమై యున్నది. మఱియు భక్తిని ఆశ్రయింపనిదే, భగవత్కృపాకటాక్షమును బడయనిదే భయంకరమగు ఈ మాయను ఎవరును దాటలేరు. కాబట్టి ప్రతివారును ఈభక్తిని చేపట్టియే తీరవలెను. భగవద్భక్తిచేతను, పుణ్యకార్యాచరణముచేతను చిత్తము శుద్ధమగును. నిర్మలచిత్తమున జ్ఞానావిర్భావము కలుగును. ఇక్కారణమున అంతఃకరణశుద్ధి ముముక్షువునకు పరమావశ్యకమై తనరారుచున్నది. భక్తిలేని జ్ఞానము కేవలము శుష్కమైయుండును. పరిపూర్ణ భక్తుడు జ్ఞానమయుడై పరిపూర్ణజ్ఞాని భక్తిసంభరితుడై యుండును. కావున సంసారబంధవిచ్ఛిత్తిని, దుఃఖరాహిత్యమును కాంక్షించువాడు భక్తిని తప్పక ఆశ్రయించవలసి యున్నది.

తదేవ రమ్యం రుచిరం నవం నవం
తదేవ శశ్వన్మనసో మహోత్సవమ్
తదేవ శోకార్ణవ శోషణం నృణాం
యదుత్తమ శ్లోక యశోఽనుగీయతే.

(భాగవతము 12_12_49)

తా. ఏ వచనముద్వారా భగవానుని పరమపవిత్ర మగు యశస్సు గానము చేయబడునో, అదియే అత్యంత రమణీయమై, నిత్యనూతనమై విరాజిల్లును. దానిచే బహు కాలమువఱకు మనస్సునకు పరమానందముయొక్క అను భూతి కలుగగలదు. మఱియు మనుజులయొక్క శోకము సముద్రమువలె విశాలమై, లోతుకలదై యున్నప్పటికిని అది యంతయు తద్వచన ప్రభావముచే సదా శుష్కించి పోగలదు.

శ్రీ శుకమహర్షి పరీక్షిన్మహారాజునకు భగవత్ స్తోత్ర మహిమను గూర్చి ఈ ప్రకారముగ నెఱిగించెను. శ్రీ శుకుల వారు అవధూతయై, నిరంతర బ్రహ్మనిష్ఠాగరిష్ఠుడై యొప్పా చున్నను పరీక్షిత్తునకు భక్తిమార్గమును లెస్సగ నుపదే శించుటను జూడ, ఆత్మసాక్షాత్కారమునకు భక్తి ఎంత ఆవశ్యకమో తేటతెల్లము కాగలదు. కనుకనే భగవద్గీత యందు గూడ శ్రీకృష్ణపరమాత్మ దాదాపు ప్రతి అధ్యాయ మందును భక్తినే ప్రోత్సహించుచు వచ్చెను.

భగవంతుని స్తుతించు వాక్యములు నిత్యనూతన ములై, కర్ణానందదాయకములై, రమణీయములై యుండు నని శుకులవారు ఆనతిచ్చిరి. ఆ వాక్యములు మనస్సునకు 'మహోత్సవము' వంటివి. వాస్తవముగ ప్రపంచములో లౌకిక ఉత్సవము లెవ్వియు ఇంత ఆనందము కలుగజేయ జాలవు. అవి క్షణికసుఖమునే కలుగజేయును. భగవత్కథ, భగవత్ స్తోత్రము, శాశ్వతసుఖము నొసంగును. భగవత్

స్తోత్ర వాక్యము లెంతయో నూతనోత్తేజమును గలుగ జేయును.

సంసారదుఃఖము ఒక గొప్పసముద్రమువంటిది. సముద్ర మెంతయో విశాలముగను, లోతుగను క్రూర జలచర ములచే భయంకరముగను నుండును. జనన మరణ రూప సంసారమును అంతియే. ఇప్పటికి ఎన్ని జన్మలనుండియో జీవుడు లెక్కలేనన్ని ఆపదలను అనుభవించియున్నాడు. అజ్ఞానవశమున ఘటీయంత్రమువలె ఈ కాలచక్రమున తిరు గాడుచు నానాయోనులందును జన్మించి యాతనల నొందు చున్నాడు. సముద్రమెంత విశాలముగను, గహనముగను నున్నను ఒక చిన్న తెప్పచే అది దాటివేయబడునట్లు, భక్తి యను నావచే ఆ శోకార్ణవమంతయు అవలీలగ దాటివేయ గలదు. ఇంతియే కాదు. భగవద్వాక్యములందు ఆ శోక సముద్రమునంతను ఒక్కత్రుటిలో శుష్కించివేయుగల అను పమ సామర్థ్యము కలదు. కావున ముముక్షువు లెల్లరు అట్టి మహాశక్తిసంపన్నములగు భగవత్స్తోత్రమునుగానము చేయుచు, భగవత్కథలను శ్రవణము చేయుచు, భగవన్నామములను ఉచ్చరించుచు జన్మమును సార్థక మొనర్చుకొనవలెను.

సంసార సిన్ధుమతిదుస్తర ముత్తితీర్షో
ర్నాన్యః ప్లవో భగవతః పురుషోత్తమస్య
లీలాకథారసనిషేవణ మన్తరేణ
పుంసో భవేద్వివిధదుఃఖ దవార్దితస్య.

(భాగవతము 12-4-40)

"మహాదుస్తరమైనట్టి సంసారసముద్రము దాట దలంచు వారికిని, పలువిధములైన దుఃఖరూపదావాగ్నులచే దహింపబడువారికిని, పురుషోత్తముడగు భగవంతునియొక్క లీలాకథామృతమును సేవించుట తప్ప మఱియొక సాధనము లేదు. అట్టి భగవత్కథామృతపానమను నావచేతనే జనులు సంసారసాగరమును అవలీలగ దాటగలరు."

సంసార దుఃఖతరణమునకీ ప్రకారముగ సులభమైన ఉపాయము శ్రీ శుకులచే బోధింపబడెను. అదియే భగవల్లీలా కథాశ్రవణము. హరికథామృతపానము. జనులు అనన్య భక్తిసంయుతులై భగవంతుని లీలలను వినుచు, అట్టి దివ్యచరితములను హృదయమున సంస్మరించుచు నుండినచో చిత్తము పాపరహితమై, సత్త్వగుణయుక్తమై, నిర్మలమై, దైవానుభూతిని క్రమముగ బడయగలదు.

సముద్ర మెట్లు అనంతముగ తోపట్టునో అట్లే ఈ సంసారమున్ను జననమరణ పరంపరలతోడ అంతము లేనిదై దుఃఖాకులమై, దుస్తరమై తోపట్టుచున్నది. సముద్రమునం దెట్లు మొసళ్లు, తిమింగలములు తదితరములగు భయంకర జలజంతువులు కాపురముండు చున్నవో, అట్లే ఈ సంసారమందును కామక్రోధాదులు, దంభదర్పాసూయాదులు మొదలగు బాధాకరవృత్తులు తిష్ఠవేసికొని యున్నవి. సముద్ర మెట్లు అగాధమై యున్నదో, అట్లే ఈ సంసారదుఃఖమున్ను అత్యంతగహనమై వర్తించుచున్నది. అయితే సముద్ర మెంత విశాలమైనప్పటికిని, ఎంత లోతు గలిగియున్నప్పటికిని ఒక

చిన్ననావచే అది యెట్లు దాటివేయబడగలదో, అట్లే భగవద్భక్తి, భగవత్కథాసంసేవనము, భగవల్లీలామృతపానము అను తెప్పచే ఈ సంసారరూప మహోదధియంతయు త్రుటిలో దాటివేయబడగలదు. ఈ రహస్యమునే శ్రీ శుకులవారు భాగవతమున స్పష్టమొనర్చిరి. కావున ఇక ప్రాణికోట్లు భగవదాశ్రయముచే నిర్భయులై ఈ ప్రపంచమున వర్తించవచ్చును.

శ్రీ కులశేఖరు లీ తత్త్వమునే క్రింది శ్లోకముద్వారా చక్కగ వర్ణించియుండిరి—

తృష్ణాతోయే మదనపవనోద్ధూత మోహోర్మిమాలే
దారావర్తే తనయసహజగ్రాహసంఘాకులేచ
సంసారాఖ్యే మహతిజలధౌ మజ్జతాం నస్త్రిధామన్
పాదాంభోజే వరద భవతో భక్తినావం ప్రయచ్ఛ.

(ముకుందమాల)

'సర్వవ్యాపకుడవును, వరప్రదుడవు నగు ఓ పరమాత్మా! ఆశయను జలమును, మన్మథుడను సుడిగాలియు, మోహమను తరంగ సముదాయమును, భార్యయను సుడిగుండమును, పుత్ర సహోదరులను మొసళ్లను గలిగియున్న ఈ సంసారమహాసముద్రములో మునిగిపోవుచున్న మాకు నీ పాదాంబుజ భక్తియను నావ నొసంగి రక్షింపుము.'

ఇట్టి భక్తియే జీవులకీ దుఃఖభూయిష్ఠమగు ప్రపంచమునందు శరణ్యమై యున్నది. 'నాన్యఃప్లవో' అని శుకులవా

రానతిచ్చి యుండుటవలన భక్తియను నావతప్ప మఱియొంక తరణోపాయము లేదని స్పష్టమగుచున్నది. భక్తియను పుష్పము వికసించినపుడే జ్ఞానమను ఫలము ఆవిర్భవించును గావున, సాక్షాన్మోక్ష సాధనమగు జ్ఞానమునకున్ను, ఈ భక్తియే హేతువై యున్నదని ముముక్షువులు గమనించవలసి యున్నది. కనుకనే అద్వైత ప్రతిష్ఠాపకులగు శ్రీ శంకరు లున్ను భక్తిని వదలలేదు. కేవల సచ్చిదానంద పరబ్రహ్మము ననుభూత మొనర్చుకొనిన శ్రీ శుకబ్రహ్మమున్ను భక్తిని త్యజించలేదు. పై పెచ్చు భాగవతాదులం దాతడు భక్తి నెంతయో ప్రోత్సహించెను.

కాబట్టి ముముక్షువు లెల్లరును అత్యంత సులభోపాయమై, మోక్షమునకు రాజబాటయై యెన్నొందు ఈ భగవద్భక్తిని, భగవత్కథారస నిషేవణమును, భగవల్లీలామృతపానమును లెస్సగ నాశ్రయించి, ప్రహ్లాదునివలె భగవద్దివ్య గుణానువర్ణన సుధాప్రాప్తైక చిత్తులై పఱగి అగాధమై, అనంతమైనట్టి ఈ సంసారమహోదధిని పల్వల తుల్యముగ నొనర్చి, భక్తి నౌకాశ్రయముచే అవలీలగ దాటినైచి దుఃఖ విముక్తులై, బంధరహితులై ఆత్మానందమున నోలలాడుచు జీవితమును వసంతముగ గావించుకొనవలయును.

శ్రీకృష్ణపరమాత్మ ఉద్ధవున కీప్రకారముగ హితోపదేశము చేసెను___

నృదేహమాద్యం సులభం సుదుర్లభం
ప్లవం సుకల్పం గురుకర్ణధారమ్
మయానుకూలేన నభస్వతేరితం
పుమాన్ భవాబ్ధిం న తరేత్ స ఆత్మహా!

(భాగవతము 11-20-17)

మానవశరీరము సమస్తశుభఫలములకును మూలమై యున్నది. మఱియు అత్యంత దుర్లభమైనప్పటికిని భగవత్కృపచేతను, స్వకీయప్రయత్నముచేతను అనాయాసముగ లభ్యమగుచున్నది; సంసారసముద్రమును దాటుటకిది యొక గట్టి ఓడవంటిది. శరణాగతిమాత్రముచేతనే గురుదేవుడు దీనికి కర్ణధారుడై (చుక్కాణిపట్టుకొని నడపువాడై) వర్తించుచున్నాడు. మఱియు స్మరణమాత్రముచేతనే నేను అనుకూలవాయురూపమున దీనిని లక్ష్యమువైపునకు త్రోయుచున్నాను. ఇన్ని యనుకూలములు లున్నప్పటికిని ఎవరీ శరీరముద్వారా సంసారసముద్రమును దాటకయుండునో, అతడు తన ఆత్మను (తన్ను) చంపుకొనినవాడే యగును. (తన్ను అధఃపతనమును బొందించుకొనువాడే యగును.)

ప్రపంచములో అనేకలక్షల జీవరాసులున్నప్పటికిని మోక్షప్రాప్తికి వలయు సాధనములను చక్కగ ఆచరించుటకు అనువైన జన్మ మానవజన్మయే యగును. ఇది సర్వోత్కృష్టమగు జన్మము, మహాదుర్లభమైనది. బహుజన్మార్జిత సుకృతమువలననే ఇది లభించును. కనుకనే 'సుదుర్లభం' అని-ఈ మానవశరీరమునుగూర్చి భగవానుడిచట పలికెను. అయితే

సుదుర్లభమైనప్పటికిని జీవుని సత్ప్రయత్నము చేతను, భగవత్కృపచేతను సులభముగ అనాయాసముగ సంప్రాప్తించగలదు. ఖరీదు చెల్లించినవారికి వస్తువెట్లు లభించగలదో, అట్లే పుణ్యమను మూల్యము చెల్లించిన జీవునకు బ్రహ్మసాక్షాత్కారయోగ్యమగు మానవజన్మము లభించుచున్నది.

ఈ సంసారమను మహాసముద్రమును దాటుటకు మానవదేహమను ఓడ ఎంతయో అవసరమై యున్నది, తక్కిన క్రిమికీటకాది జీవరాసులన్నియు ఇట్టి ప్రజ్ఞాయుతమగు ఉపాధిలేక నానాబాధలు పడుచు, జ్ఞానమును తద్ద్వారా మోక్షమును బడయజాలక దుఃఖించుచు ఈ జననమరణరూప చక్రమునందు తిరుగాడుచున్నవి. కావున సంసారసాగరతరణయోగ్యమగు ఈ మానవజన్మమును, మానవదేహమును బడసినవాడు ధన్యుడు. అట్టి జన్మము నాతడు భక్తి, జ్ఞాన, వైరాగ్యాదుల సంపాదనమునందు వినియోగించి జీవితమును సార్థకమొనర్చుకొనవలెనే కాని, అలసుడై, ప్రయత్నరహితుడై వ్యర్థము చేయరాదు.

ఇట్టి మోక్షప్రయత్నమున జీవునకు మహత్తర సహాయమొనగూర్చువాడు సద్గురువు. కనుకనే ఈతనిని మానవశరీరమను పడవకు చుక్కాణి పట్టుకొను వ్యక్తిగా పోల్చి చెప్పిరి. చుక్కాణియే పడవయందలి కీలకవస్తువు. దానిని పట్టుకొనువాడు తన నైపుణ్యముచే పడవను జాగ్రత్తగ గమ్యస్థానమునకు చేర్చును. ప్రతిబంధములను తప్పించి పడవను కాపాడును. అట్లే సద్గురువు అజ్ఞానియగు జీవునకు

జ్ఞానమును ప్రసాదించి జీవితపథమందలి ప్రమాదములను గూర్చి హెచ్చరించి, వానినుండి తప్పించుకొనుటకు ఉపాయములను సెలవిచ్చి, సాధనక్రమమును బోధించి పరమానంద దాయకమగు మోక్షమను గమ్యస్థానమునకు చేర్చును.

మఱియు అనుకూలవాయువు పడవ కెట్లు సహాయపడునో అట్లే భగవదనుగ్రహమను గొప్ప అనుకూలశక్తి గమ్యస్థానమువైపునకు భక్తిని నెట్టుచున్నది. కనుకనే యాతడు శీఘ్రముగ గమ్యమును చేరగల్గుచున్నాడు. తెడ్లు ముున్నగువానిచేత బెస్తవాడు పడవను ఎంతయో వేగముతో నడుపుచున్నప్పటికిని, అనుకూలవాయువు సహాయపడినచో పడవ వేగము ద్విగుణీకృతమై గమ్యప్రాప్తి శీఘ్రాతిశీఘ్రముగ సిద్ధించగలదు. అట్లే భగవదనుగ్రహమను ప్రచండమారుతము జీవుని సత్ప్రియత్నమను గమనమునకు ఎంతయో తోడ్పడి మోక్షరూపగమ్యమును త్వరితముగ సాధించుచున్నది. కాబట్టి శరణాగతిద్వారా, అనన్యభక్తిద్వారా, జపధ్యాన పూజాదులద్వారా భగవదనుగ్రహమను మహత్తరవస్తువును జీవు డెట్లైనను సంపాదించుకొనవలెను.

ఈ ప్రకారముగ, దుర్లభమగు మానవశరీరమను నౌకయు, సద్గురువను కర్ణధారుడును (చుక్కానిపట్టువాడును) భగవదనుగ్రహమను అనుకూలవాయువును పొందికూడ ఎవడు మోక్షమను గమ్యమును చేరుటకై యత్నశీలుడు కాకుండునో, సంసారసముద్రమును దాటకుండునో అట్టివాడు ఆత్మఘాతకుడే యగును. తన్ను తాను అధోగతికి త్రోసికొను

పాజే యగును. కాబట్టి మానవులు జాగరూకులై తమ జీవిత లక్ష్యమును గుర్తెఱింగి, అద్దాని సాక్షాత్కారమునకై భగవద్భక్తిని అనవరతము సంపాదించుచు భగవన్నామమును సదా స్మరించుచు సచ్చిదానందరూప పరమాత్మయొక్క దివ్యాను గ్రహమునకు పాత్రులు కావలయును.

## భగవన్నామ ప్రభావము

భగవన్నామమహిమనుగూర్చి భాగవతమున ఈ ప్రకారము తెలుపబడినది—

> ఆపన్నః సంసృతిం ఘోరాం యన్నామ వివశో గృణన్
> తతః సద్యో విముచ్యేత యద్బిభేతి స్వయం భయమ్.
>
> (భాగవతము 1-1-14)

ఘోరమగు సంసారదుఃఖమును బొందినవాడు ఆ భగవంతుని నామమును స్మరించినచో వెంటనే అద్దానినుండి విముక్తుడగుచున్నాడు. మఱియు అట్టివానిని జూచి భయము కూడ భయపడుచున్నది. (భయములన్నియు నశించుచున్న వని భావము)—అని భాగవత వచనము.

భగవన్నామప్రభావ మెంత గొప్పదో ఈ శ్లోకమునందు చెప్పబడినది. సంసారవిషవృక్షచ్ఛేదనమునకు భగవన్నామము గండ్రగొడ్డలి, సంసారభీష్మతాపోపశమనమున కియ్యది శీత లోదకము. సంసారసర్పవిషదంష్ట్రములలో లగ్నమైన మానవునకు నామస్మరణము దివ్యామృతము, సంజీవిని. సంసార సాగరములలోపడి దరిగానక కొట్టుకొనుచుండువానికి నావ

స్మరణము తారణనావ. ఎంతటి సంసారవిపత్తులో, దావానలములో తగుల్కొనినవాడైనను ఈభగవన్నామస్మరణము నాశ్రయించినచో ఇంద్రజాలమువలె వానికి దుఃఖములు రహితములగును, శమించును. ఏలయనిన, నామము, నామి అవినాభావసంబంధము గలవి. ("వాచ్యవాచకయోరభేదః,") కావున నామమునకు నామికి భేదము లేదు. అనగా భగవన్నామమునకు భగవంతునకు ఏమాత్రము భేదము లేదు. నామోచ్చారణచే ఆ నామమున కాధారమగు మూర్తి స్వరూపము స్మరణకు వచ్చును. రామనామస్మరణ జేసినచో రాముని స్మరించినట్లే యగును. భగవన్నామమును స్మరించినచో వెంటనే అతనిరూపము మనస్సున నిలుచును. అప్పుడచట భగవానుడున్నట్లే యగును. అచట భగవానుండుండియే తీరును. "మద్భక్తా యత్ర గాయన్తే తత్ర తిష్ఠామి నారద" అని భగవద్వాణి.

ఈ ప్రకారముగ భగవన్నామస్మరణ చేయుచున్న తొడల ఘోరసంసారదావానలము టప్పున శమించిపోవును. కావుననే శ్రీశుకులు "సద్యోవిముచ్యేత"—భగవత్స్మరణ గావించువాడు వెంటనే విముక్తుడగుచున్నాడు—అని నుడివిరి. ఈ విషయమునే శ్రీకృష్ణభగవానుడున్ను గీతయందు "అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే, తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్" అని సెలవిచ్చిరి. అనగా 'అనన్యచిత్తముతో నన్ను స్మరించువారిని, ధ్యానించువారిని మృత్యుసంసారసాగరమునుండి నేనుద్ధరించెద

దను' అని భగవానుడు పలికెను. గతచరిత్రను పరికించిన ఎందరో మహానుభావులీ భగవన్నామస్మరణ చేతనే సంసారసముద్రమును దాటిరని తెలియబడుచున్నది. నాటి వామదేవుడు, శాండిల్యుడు, నారదుడు, ప్రహ్లాదుడు, ఉద్ధవుడు మొదలుకొని నేటి గౌరాంగుడు, నామదేవుడు, వల్లభాచార్యులు, మీరాబాయి, నరసింహమెహతా, రామదాసు (గోపన్న)లవరకు ఈ భగవన్నామము నాశ్రయించి ఎందఱో తమ సంసారదుఃఖమునుండి విముక్తులైరి. భగవంతునకు భగవన్నామమునకు ఏవిధమైన భేదము లేదు. కావున భగవంతునివలె భగవన్నామమున్ను సత్యశివసుందరము. ఆనందస్వరూపము. ఆనందస్వరూప భగవన్నామస్మరణమున్న యెడల దుఃఖస్వరూప సంసార మెట్లుండును? ఉండనేరదు. రెండు పరస్పర విరుద్ధప్రకృతు లొకచో నుండనేరవుగదా. దీపమున్నచోట చీకటి యుండనేరదు. అట్లే తేజస్స్వరూపమైన భగవన్నామము గానము చేయబడుచోటునుండి సంసారదుఃఖమను పెనుభూతము దూరముగ పారిపోవును. కొండంత దూదియైనను ఒక్క నిప్పురవ్వచే భస్మమగునట్లు ఈ మహాసంసారదుఃఖము భగవన్నామస్మరణచే గహించి నశించుచున్నది.

సంసారము అజ్ఞానజనితములగు అహంకారము మమకారములను బీజములు గలది. భగవన్నామస్మరణచే అహంకార మమకారములు నాశమగుచున్నవి. భక్తుని మనస్సు భజనయందు దేహభావనను వీడి, దృశ్యభావనను వీడి అనం

కల్యాణగుణుడగు భగవానుని దివ్యగుణకీర్తనలో, ఆ భగవద్భావనలో లీనమగుచున్నది. కావున మనస్సు తన ప్రకృతి రూపమును విషయవాసనారూపమును వదలి భగవంతుని రూపము నాశ్రయించి తదాకారాకారితమగుచున్నది. అట్టి యెడ ప్రపంచము రహితమై భగవానుడొకడే మిగులును. కనుక ఇక సంసార మెచట? శోక మెచట! ఈ నామస్మరణ మాధుర్య తల్లీనతయందు ఘోరాకుంభారునకు తాను త్రొక్కునది ఏదియో తెలియలేదు. నామమాధుర్యానుభవజన్యవర్తనమే తెలియును. అట్లే మీరాబాయికి నామస్మరణాయత్తచిత్తమందు విషమైనదీ తెలియలేదు, అమృతమైనదీ తెలియలేదు. కావుననే విషమైనను తన విషత్వమును వదలి అమృతమైనది. ఆహా! నామస్మరణ ఎంత ప్రభావయుతము! ఆనాడు వానరములు రామనామమును స్మరించుచు పెద్దపెద్ద రాళ్ళను, కొండలను సముద్రములో వేయుచుండ నవి తేలియాడుచు వారధియైనవి. రామనామప్రభావముచే రాళ్లు తమ గురుత్వాకర్షణశక్తినిగూడ ధిక్కరించినవిగదా!

ఇట్టి భగవన్నామస్మరణ చేతనేగదా ప్రహ్లాదుడు భగవానునితో "నైవోద్విజే భవదురత్యయ వైతరణ్యాః। త్వన్నామగాయన మహామృత మత్తచిత్తః"—నీ నామగానామృతపాన మత్తచిత్తుడగు నేను ఈ ఘోరసంసార (సముద్రమునకు) వైతరిణికి వెరువను—అని చెప్పగల్గెను.

ఈ భగవన్నామస్మరణము చేయువానిని చూచి "బిభేతి స్వయం భయమ్"—భయము భయపడుచున్నది. ఇది యెంతయో సత్యము. భయ మెవనికి? చీకటిలోనున్న వానికి. భూతప్రేతములను గాంచువానికి. కాని భగవానుడు తేజోరూపి. అట్టి తేజస్వి సమీపములో చీకటి ఎచట? లేదు. కావున అచట భయమే లేదు. సర్వభూషణుడున్న చోట సర్వభయ మెచట? కాలాంతకుడున్నచోట కాలభయ మెట్లుండును? అభయస్వరూపుని చెంత భయ మెట్లుండును? కావుననే భయ మచట భయమొంది పరువిడుచున్నది. ఈ విషయమునే ప్రహ్లాదుడు 'రామనామజపతాం కుతో భయమ్?' అని తెలిపెను. ఏల? ఆ నామము సర్వతాపశమనైక భేషజము. ఈసత్యమునే శ్రుతిమాతయు 'భయాదస్యాగ్ని స్తపతి! భయా త్తపతి సూర్యః! భయాదింద్రశ్చ వాయుశ్చ, మృత్యు ర్ధావతి పంచమః! (కఠోపనిషత్తు)—అని ఎలుగెత్తి చాటినది. భాగవతమున (శ్రీ) శుకులు చెప్పినట్లు భగవన్నామస్మరణ చేయువానిని చూచి భయము భయపడి పరుగెత్తుచున్నది. సంసారదుఃఖము లుపశమించుచున్నది. ఇట్టి ఏ సందియమున్ను లేదు. కాబట్టి జనులు భయమునుగూర్చి భయపడక, సంసారతాపమును గూర్చి తాపత్రయపడక, భయమును భయపెట్టు అభయస్వరూపుని ఆశ్రయించి తన్నామస్మరణ చేయుచు తదాయత్తచిత్తులై జీవించుచుండిన చాలును. అపుడు విగతభయస్కులై, సంసారబంధ వినిర్ముక్తులై, పాపవిముక్తులై దివ్యానందములో చిందులు

ద్రోహ్యము నుందురు. ఇంతకుమించి జీవునకు కావలసినది యేమి కలదు?

శ్రీ శుకులవారు పరీక్షిత్తున కీ ప్రకారము హితోపదేశము గావించిరి—

కలేర్దోషనిధే రాజన్ అస్తిహ్యేకో మహాన్గుణః
కీర్తనాదేవకృష్ణస్య ముక్తబన్ధః పరం వ్రజేత్.

"ఓ పరీక్షిన్మహారాజా! కలికాలము పెక్కు దోషములతో గూడియున్నదై నప్పటికిని, దానియం దొక మహాసుగుణము కలదు. అది యేదనగా, కలికాలమున శ్రీకృష్ణ పరమాత్మయొక్క సంకీర్తన మాత్రముచే మనుజుడు బంధవిముక్తుడై పరంధామమును (మోక్షమును) బొందును."

కలికాలమున ధర్మము ఏకపాదమున వర్తించుచునను ప్రతీతి ననుసరించి కలికాలము పెక్కుదోషములతో గూడియుండునని తలంచినప్పటికిని వాస్తవముగ విచారించినచో యుగము మానవుని నిర్మింపదు. మానవుడే యుగమును నిర్మించును. ఎవని హృదయమున అపవిత్రత, దోషము, దుర్మార్గము ఉండునో అతడు కృతయుగమున నుండువాడైనను కలియుగ మానవుడే యగును. ఎవని మనస్సు నిశ్చలముగ, నిర్మలముగ భగవద్భక్తి సంయుతముగ నుండునో అతడు కలియుగమున నున్నవాడైనను కృతయుగ మానవుడే యగును.

కలౌ కృతయుగం తస్య కలిస్తస్య కృతేయుగే
యస్య చేతసి గోవిన్దో హృదయే యస్య నాచ్యుతః.

అను శ్లోక మీ యర్థమునే బోధించుచున్నది. పవిత్ర మని భావింపబడుచున్న కృతయుగమున హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు మున్నగు లోకకంటకులు జన్మించి యుండిరి. దోషభూయిష్ఠమని తలంపబడుచున్న కలియుగమున బుద్ధదేవుడు, ఏసుక్రీస్తు, శంకరాచార్యులు, రామకృష్ణపరమహంస మొదలగు నిర్మలాత్ము లుదయించిరి. కావున యుగము మానవుని యే మాత్రము ప్రభావితము చేయజాలదు.

అయినను లోకప్రతీతి ననుసరించి ఈ కలికాలము కృతయుగాదులతో సమానము కాదని ఒక వేళ తలంచినను, మానవుడు తరించుటకు, పరమానందము నొంది బంధవిముక్తుడగుటకు వలసిన సామగ్రి కిచట ఏమియు కొఱత లేదని శ్రీ శుకులవా రానతిచ్చుచున్నారు. ఏలయనగా ఈ కలికాలమున భగవత్సంకీర్తన మాత్రముచే మానవుడు శుద్ధుడై దైవసాక్షాత్కారమును పొందగల్గుచున్నాడు. విష్ణుపురాణమునందు తెలుపబడిన రహస్యము నాలకింపుడు—

ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞైస్త్రేతాయాం ద్వాపరేఽర్చయన్
యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్.

(విష్ణుపురాణము)

"కృతయుగమున ధ్యానాదులచేతను, త్రేతాయుగమున యజ్ఞయాగాదులచేతను, ద్వాపరయుగమున అర్చనలచేతను ఏ పరమపదవి లభించునో, అయ్యది కలి

యుగమున కేశవుని (పరమాత్మని) కీర్తించుటచేతనే లభించుచున్నది." కృతయుగాదులందువలె పెద్దపెద్ద తపస్సులెవ్వియు లేకనే భగవన్నామ సంకీర్తనమాత్రముచే కలికాలమున జీవులకు మోక్షప్రాప్తి కలుగునని యిచట వచింపబడినది. నామసంకీర్తన యనునది ప్రతివానికిని అందుబాటులో నుండుసాధన. గొప్పగొప్పసాధనలు, తపస్సులు, ధ్యానాదులు చేయలేనివారికి చిన్నసాధననాశ్రయించి భక్తిపూర్వకముగ శ్రద్ధానిని నెరవేర్చినచో జీవితలక్ష్యమగు దైవసాక్షాత్కారమును తప్పక బొందగల్గుదురని శ్రీ శుకులవారు హామీనొసంగిరి.

దీని యంతరార్థమేమనగా, సంకీర్తనను భక్తిపూర్వకముగ నాచరించువారికి భక్తిపారవశ్యముచే భగవానుని యనుగ్రహము లభించుటయేకాక చిత్తమున్ను దైవానుభవములచే పరిశుద్ధమగును. నిర్మలచిత్తమున భగవత్కృపచే జ్ఞానోదయమగును, జ్ఞానవిచారణచే మోక్షము లభించును. కాబట్టి చిత్తశుద్ధికరమగు దైవసంకీర్తనను ముముక్షుజనులు తప్పక ఆశ్రయించవలసియున్నారు. చిన్నసాధనమైనను పట్టుదలతో విడువకుండ సాధించినచో అచిరకాలములో జీవుని హృదయమున గొప్పపరిణామము కలుగగలదు. మఱియు భక్తియను పుష్పము వికసించి వికసించి జ్ఞానమను ఫలముగ నావిర్భవింపగలదు. గీతాచార్యుడున్ను ఈ విషయమునే క్రింది శ్లోకముద్వారా స్పష్టీకరించియున్నాడు—

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే.

అనగా 'నిరంతరము ప్రీతిపూర్వకముగ నన్ను భజించువారికి నేను జ్ఞానవిచారణాసంబంధమైన బుద్ధియోగము నొసంగెదను. దానిద్వారా వారు నన్ను పొందగలరు.' కాబట్టి భక్తిపూర్వకముగ భగవానుని సేవించువారికి, కీర్తించువారికి ఆతడు క్రమముగ జ్ఞానమును ప్రసాదించును. జ్ఞానముచే మోక్షము మానవునికి లభించుచున్నది. కనుకనే శ్రీ శుకులవారు 'కీర్తనాదేవ కృష్ణస్య ముక్తబన్ధః పరం వ్రజేత్'—అని భగవత్సంకీర్తనచేతనే మనుజుడు బంధవిముక్తుడై పరమాత్మపదము నొందగలడని భాగవతప్రారంభమున పేర్కొనియుండుటకు కారణమై యున్నది.

మహనీయుల ఇట్టి వాక్యములందు పూర్ణవిశ్వాసము గల్గి ముముక్షువులు శ్రద్ధాభక్తులతో, ప్రీతిపూర్వకముగ నామసంకీర్తనము కావించుచు, భగవద్గానసుధారసమున నిమగ్నులై ఆనందవీచికలందు తేలియాడుచు, అపారదైవకృపకు పాత్రులు కావలయును.

భగవంతుని ఆశ్రయించి, భగవత్సేవానిరతులై, సదా భగవత్స్మరణ యొనర్చుచుండువారు లోకమున యముని గూర్చికాని, లేక మరెవరినిగూర్చికాని భీతినొందవలసినపని లేదు. అజామిళుని మరణానంతరము యమదూతలాతనిని పట్టి బంధించి యమలోకమునకు తీసికొనిపోవుచుండగా, దేవదూతలు, సిద్ధులు కొందఱు వచ్చి వాని పాశములను

ఛేదించివైచి అజామిళుని విడుదల చేసిన సందర్భమున యమ దూతల నుద్దేశించి యమధర్మరాజు ఈ ప్రకారముగ పలికెను—

తే దేవ సిద్ధ పరిగీత పవిత్రగాథా
యే సాధవః సమదృశో భగవత్ప్రపన్నాః
తాన్ నోపసీదత హరేర్గదయాభిగుప్తాన్
నైషాం వయం న చ వయః ప్రభవామ దణ్డే.

(భాగవతము 6-3-27)

"ఓ దూతలారా! సమదృష్టిగలవారు, భగవంతుని ఆశ్రయించినవారు నగు సాధుమహాత్ములయొక్క పవిత్ర చరిత్రములను దేవతలు, సిద్ధులుకూడ లెస్సగ గాన మొనర్చుచుందురు. విష్ణుభగవానుని గద వారిని సదా కాపాడుచుండును. అట్టివారికడకు మీరెన్నటికిని వెళ్ళవద్దు. అట్టి పుణ్యాత్ములకు దండన మొసంగగల సామర్థ్యము మనకు లేదు."

జిహ్వా న వక్తి భగవద్గుణ నామధేయం
చేతశ్చ న స్మరతి తచ్చరణారవిన్దమ్
కృష్ణాయ నో నమతి యచ్ఛిర ఏకదాపి
తానానయధ్వమసతోఽకృత విష్ణుకృత్యాన్.

(భాగవతము 6-3-29)

ఎవరి నాలుక భగవంతునియొక్క గుణములను, నామములను కీర్తింపదో, ఎవరి చిత్తము భగవానుని పాద కమలములను స్మరింపదో, ఎవరిశిరస్సు ఒక్క పర్యాయ

మైనను శ్రీకృష్ణపరమాత్మకు వంగి నమస్కరింపదో భగవ త్సేవావిముఖులగు అట్టి పాపాత్ములను పట్టి నాకడకు తీసి కొనిరండు !!

భాగవతషష్ఠస్కంధమునందు మూడవ అధ్యా యమున అజామిళోపాఖ్యానసందర్భమున జరిగిన యమ, యమదూత సంవాదమున యమధర్మరాజుచే ఈ శ్లోకములు చెప్పబడెను. ఈ శ్లోకములద్వారా ఈక్రింది ధర్మరహస్య ములు బోధపడుచున్నవి—

(1) పుణ్యాత్ములయొక్క సచ్చరిత్రములను భూలోక మున మానవులే కాక, స్వర్గాదిలోకములందు దేవ, సిద్ధ, గంధర్వాదులున్ను గానము చేయుచుందురు.

(2) భగవంతుని ఆశ్రయించినవారికి ఏకాలమందును, ఎవరివలనను చేటు కలుగదు. ఎవరును వారికి చేటుకలిగింప జాలరు.

(3) విష్ణుభగవానుని గద పుణ్యాత్ములను సర్వదా రక్షించుచు వారికి ఏ కీడు కలుగనీయక చూచుచుండును.

(4) ఎవరు తమయొక్క నేత్రాదింద్రియములను, మనస్సును దైవకార్యములందును, దైవచింతనయందును వినియోగింపక వ్యర్థమొనర్చుదురో, అసత్కార్యములందు ప్రవర్తింపజేయుదురో అట్టివారు యమదూతలవశమందు పడి నానాబాధల ననుభవింపవలసివచ్చుదురు.

కాబట్టి ప్రతివారును కడుజాగరూకులై తమ జీవితములందెట్టి దుష్ప్రవృత్తులు లేక, సత్సాంగత్యము, సదాచారములు, దైవచింతన, పరోపకారము మున్నగు సద్గుణసంపత్తి నలవఱచుకొని, జీవితమును శోభాయమానముగ నొనర్చుకొనవలయును. ఇంతదనుక అనేకజన్మలనుండియు ఇంద్రియములకు, చిత్తమునకు బహిర్ముఖ ప్రాపంచిక విషయవృత్తులనేకములు అలవాటైపోయినవి. భోగవిలాసములనే జీవుడు పరమావధిగ దలంచుచున్నాడు. సర్వశక్తిమంతుడు, దేశకాలక్రియాఽపరిచ్ఛిన్నుడునగు సర్వేశ్వరు డొకడు కలడని అతడు నమ్మకున్నాడు. అందువలననే ఇంద్రియములకు కానుపించు ఈ పాంచభౌతిక ప్రపంచమే పరమసత్యమని నమ్మి దానివెంట పరుగిడుచు ఆయా యింద్రియసౌఖ్యములనుభవించుచు అదియే సర్వస్వమనియెంచి పరాత్పరుని విస్మరించుచున్నాడు. అట్టివారు దుష్ప్రవృత్తి జనితపాపములను బడయుటయేకాక, దైవవిస్మరణరూపమగు పాపమును గూడ పెంచుకొనుచున్నారు.

మహాత్ములగు సద్గురువుల సాంగత్యముచేతను, శాస్త్రపరిచయముచేతను పూర్వకాలపు పాత అలవాట్లన్నిటిని మార్పుచేసికొని నూతన దైవప్రపంచమున అడుగిడవలెను. ధర్మమార్గమును జేబట్టవలెను. ఇంద్రియమనంబులను పవిత్రములుగ నుంచుకొని ఆత్మానుభూతికై, దైవసాక్షాత్కారమునకై వానిని వినియోగించుచుండవలెను.

లేకున్న అసత్ప్రవర్తనచే, జీవితమందు వాస్తవ సుఖము దూరమగుటవలన, బ్రతుకే భారముగ తోచును. అపార సచ్చిత్సుఖసాగరమున నోలలాడవలసిన జీవుడు భవ దుఃఖముచే క్రుంగిపోవుచుండును. అట్టి దౌర్భాగ్యదశ జీవున కేనాటికిన్ని కలుగకుండుటకై యాతడు మహనీయుల సాంగత్యము నవలంబించి, సచ్ఛాస్త్రములను పఠించుచు, విశ్వమందలి శాశ్వతపదార్థమగు భగవంతునియొక్క అస్తిత్వము నందు విశ్వాసముగలవాడై ప్రవర్తించవలెను. అత్తఱి వానికి యమదూతలవలనగాని, యమునివలనగాని, కర్మదేవతలవలనగాని, లేక మఱి యెవరివలనగాని ఏ హానియు నుండబోదు. భగవంతుని గద వానిని సదా పరిరక్షించుచుండును. కాబట్టి త్వరపడి జీవితమును సన్మార్గయుతముగ గావించుకొనవలెను. క్షణక్షణమును దైవగంధమయముగ నొనర్చుకొనవలెను. గొప్ప పురుషప్రయత్నము నాశ్రయించి బహుజన్మార్జిత పాపవాసనలను, దుస్సంస్కారములను భక్తిజ్ఞాన వైరాగ్యధ్యానాదులచే సమూలముగ విధ్వంస మొనర్చి, విజ్ఞానమయుడై, ఆత్మతేజోవిలసితుడై వర్తించవలెను.

## అభయప్రాప్తి

భగవదాశ్రయముచే మానవునకు నిర్భయత్వము చేకూరగలదు.

> తస్మాద్భారత సర్వాత్మా భగవాన్ హరిరీశ్వరః ।
> శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ స్మర్తవ్యశ్చేచ్ఛతాభయమ్ ॥
> (భాగవతము 2-1-5)

"అభయమును గోరువాడు సర్వస్వరూపుడును ఈశ్వరుడునగు శ్రీహరినే కీర్తింపవలెను. అతనినే స్మరింపవలెను, ఆతనిని గూర్చియే వినవలెను," అని శుకులవారు ఆనతిచ్చిరి.

సంసారదుఃఖరాహిత్యమును గోరువాడు, భయరాహిత్యమును కాంక్షించువాడు త్రికరణములతోటి భగవత్సేవ జేయవలెను. తాను వినునదియంతయు దైవమును గూర్చినదిగనే యుండవలయును. తలంచునదంతయు (దైవసంబంధమైనదిగా నుండవలయును. పలుకునదంతయు దైవ (సంబంధ) వాణిగనే యుండవలయును. దైవమునకన్యములగు దృశ్యజాతములన్నియు అసత్యములు, నశ్వరములు. అవి అజ్ఞానమును అభివృద్ధి జేసి, మోహమును పెంచి జననమరణ రూప సంసారబంధమును గలుగజేయును. కావున అవి భయస్థానములగుచున్నవి. కనుకనే భర్తృహరి "భోగములందు రోగభయము, బలమునందు తనకంటె బలవంతుడగు శత్రువును గూర్చిన భయము, మంచిరూపమునందు ముసలితనము వచ్చునని భయము. ధనమునందు రాజులు పన్నులు వేయుదురని భయము"—ఈ ప్రకారముగ "సర్వం వస్తుభయాన్వితం భువినృణామ్" సమస్త దృశ్యపదార్థములందును భయము కలదని నుడివియున్నారు. మఱియు శ్రుతియు "ద్వితీయాద్వై భయం భవతి" అని వచించినది. అనగా పరమాత్మకన్యమగునది ఉన్నదని నమ్మినవెంటనే భయమావరించుచున్నదని భావము, ఒక్క పరమాత్మయే అభయస్వరూపుడు. కావుననే శ్రుతియందు "అభయం వైజనక ప్రాప్తోసి" అను

చోట పరమాత్మకు అభయమని పేరు చెప్పబడినది. ఆ పర మాత్మ సత్యము, నిత్యము కావున నాశరహితమైనది. ఆనంద ఘనము కావున శోకరహితమైనది. ఏకము కావున అపరిచ్ఛిన్నమైనది. కనుకనే దానికి అభయమనుపేరు సార్థక మైనది. అందుచే అభయమును గోరువాడు అట్టి నిత్యసత్య ఆనంద అభయస్వరూప పరమాత్మనే, శ్రీహరినే ఆశ్రయించ వలయును. ఆ పరమాత్మ సర్వస్వరూపుడు—ఆతడు లేని చోటే లేదు. కావున సర్వము ఆతనియందున్నది. ఈ విషయ మునే భగవానుడు గీతలో "సర్వాణి భూతాని మత్థానీ త్యుపధారయ", "మయా తత మిదం సర్వం జగదవ్యక్త మూర్తినా" అని చెప్పియున్నాడు. ఇంకను ఆ పరమాత్మ ఈశ్వరుడు అనగా శాసకుడు—సర్వనియంత, అంతయు ఆతని ఆజ్ఞకు లోబడినదే. ఆతనిని ఆజ్ఞాపించువాడు లేడు. అతడు "అణోరణీయాన్ మహతో మహీయాన్"— మహచ్ఛక్తిసమన్వితుడు కావున అతనికి మించినది లేదు. సర్వమును మించినవాడాతడే. "భయాదస్యాగ్ని స్తపతి భయా త్తపతి సూర్యః, భయాదింద్రశ్చ వాయుశ్చ, మృత్యు ర్ధావతి పంచమః" అను శ్రుతియు ఈ పరమాత్మకు లోబ డియే అందఱును తమ పనులు జరుపుకొనుచున్నారని తెలిపినది.

కావున శ్రీహరికి (భగవానునికి) సర్వాత్మ, ఈశ్వరు డను విశేషణము లెంతేని తగియున్నవి. ఇట్టి సర్వాత్మ, ఈశ్వరుడునగు భగవంతుని సేవించువానికి సంసారదుఃఖ

భయ మెట్లుండును? అయితే యీ భయరాహిత్యమునకు శ్రీహరిని సేవించు విధాన మెట్టిదనిన—ఆ భగవంతునే కీర్తించుట, స్మరించుట, వినుట కావించవలెను. (తచ్చింతనం తత్కథనం, అన్యోన్యం తత్ప్రబోధనం). దీనినే బ్రహ్మాభ్యాస మని శాస్త్రము చెప్పినది.

ఇంద్రియములకెల్ల నాయకుడు మనస్సు. ఆ మనస్సు ఎటుపోయిన మిగిలిన జగడములగు ఇన్ద్రియములు దాని ననుసరించును. కావున మనస్సు ప్రపంచమును వీడి భగవంతునే స్మరించినచో ఆ రూపమునే పొందును. మనస్సులో ఏ చింతనలు, ఆలోచనలు ప్రబలములుగ నుండునో ఆ భావనలు అధికమై తత్సంబంధవాక్యములే అధికముగా వచ్చుచుండును. కావున జనులు నిరంతరము మనస్సుచే భగవంతునే స్మరించుచుండవలయును. అట్లు నిరంతర భగవత్స్మరణచే, ధ్యానముచే మనస్సు తద్రూపతనొందును. అట్టియెడ వాక్కునందును ఆ భగవత్కథలే వచ్చుచుండును. గోపికలు సదా శ్రీకృష్ణస్మరణ, ధ్యానము చేయుటంబట్టియే గదా నగరమున పెరుగు అమ్మబోయియు శ్రీకృష్ణస్మరణచిత్తలై 'పెరుగు పెరుగు, అని అరచుటకు బదులు "గోవింద! దామోదర! మాధవ!!" యని బజారున అరచిరి. అయితే మాయ, ప్రాక్తన వాసనలు జనులయొక్క చిత్తమును మరల మరల ప్రపంచమువైపు లాగుచుండును. దానిచే దైవస్మరణయందు ఏమరపాటు, సోమరితనము గల్గును. కావున ఆ ప్రమాదమునుండి మేలుకొనవలయుననిన మాటిమాటికి దైవకథాశ్రవణము

జరుగుచుండవలయును. శ్రవణముద్వారా వినిన విషయము లోన మనస్సుపై ప్రతిబింబించి అట్టి ఆలోచనలందే ముంచును. సదా దైవస్మరణ యుండవలెననిన శ్రవణము చేయునది దైవ చరిత్రలుగనే యుండవలయును. ఆ కథలనే ఇతరులకు చెప్పుచుండవలయును. అపుడు మానసికముగా చింతనయు దైవసంబంధముగా జరుగుటకు వీలుండును. శ్రీహరి సంబంధ కార్యములే చేయుటచే మనస్సు అట్టి ఆలోచనలందే నిలుచును. అట్టియెడ శ్రీహరిస్మరణ కేలాటి అంతరాయము లేక మరింత దృఢముగా జరుగును.

ఈ ప్రకారముగ భగవద్వాక్య (భగవన్నామ) ప్రబోధము, భగవత్కథాశ్రవణము, భగవత్స్మరణ (ధ్యానము) చేయుటచే మనస్సు భగవదాకారమును పొందును. కీటము భ్రమరమును (తుమ్మెదను) గూర్చియే చింతించుటచే భ్రమరముగా మారునట్లును, నీరు ముత్యపుచిప్పలోబడి ముత్యమగునట్లును, ఉప్పు నీటిలోబడి తనస్వరూపమునువీడి నీటిలో కలసిపోవునట్లును, ఇనుము నిప్పులోబడి నిప్పుగా యగునట్లును మనస్సున్ను దైవస్మరణచే తన ప్రాపంచికరూపమునువీడి దైవరూపములో లీనమగును. అపుడు అమనస్కతగల్గి దైవము మాత్రము శేషించును. ఆ ఏకమైన, అద్వితీయమైన సచ్చిదానందాత్మానుభూతిలో ఇక భయ మెచట? అచలమైన, నిశ్చలమైన పరమాత్మలో తాను లీనమగుచుండ ఇక సంసార మెచట? ఆనంద సముద్రములో తాను లీనమగుచుండ ఇక సంసారదుఃఖ మెచట? కావుననే సంసారదుఃఖమునుండి

విడివడి అభయమును గోరువారు శ్రీహరినే స్మరించుడు, కీర్తించుడు, శ్రవణము చేయుడు అని శ్రీశుకులవారు చెప్పిరి. కావున ఈ క్షణమునుండియే జనులు సర్వాంతర్యామి, సర్వశాసకుడు భగవంతుడునగు శ్రీహరినే స్మరించి భగవదాయత్తచిత్తులై, ఆనందముతో చిందులు త్రొక్కుచు "హరేరాం, హరేకృష్ణ, రాధే గోవింద" అని కీర్తించుచు సంసారభయమును వీడి పాపరహితులు కావలయును.

ఇట్టి అపూర్వ భగవద్భక్తి మహాత్ములయొక్క సాంగత్యము ద్వారా ద్విగుణీకృతము కాగలదు. సత్సంగము యొక్క మహిమ వర్ణనాతీతము. ధ్రువుడు పలికిన వాక్యములను ఆలకింపుడు—

## సత్సంగమహిమ

భక్తిం ముహుః ప్రవహతాం త్వయి మే ప్రసఙ్గో
భూయాదనన్త మహతా మమలాశయానామ్
యేనాఞ్జసోల్బణమురువ్యసనం భవాబ్ధిం
నేష్యే భవద్గుణకథామృతపానమత్తః.

(భాగవతము 4-9-11)

'అనంతుడవగు ఓ పరమాత్మా! నీయందవిచ్ఛిన్నమగు భక్తిభావము కల్గియున్నట్టి విశుద్ధహృదయులగు భక్తమహాత్ములయొక్క సాంగత్యమును నాకు కలుగజేయుము. వారి సాంగత్యమునందు నేను నీయొక్క గుణగణముల యొక్కయు, లీలలయొక్కయు కథామృతమును

త్రాగి త్రాగి మదించిపోవుదును. మఱియు వివిధ దుఃఖములచే పరిపూర్ణమై, భయంకరమైనట్టి ఈ సంసార సముద్రమును అవలీలగ దాటిపోవుదును.'

మధువనమున ధ్రువుడు భగవద్దర్శనమునకై తీవ్ర తపం బాచరించుచుండ, భగవంతుడు సంతుష్టుడై యాతనికి దర్శన మొసంగెను. అత్తఱి ధ్రువుడు హర్షోత్ఫుల్లమానసుడై భగవానుని పైన తెలిపిన ప్రకారముగ స్తోత్రము చేయ దొడగెను.

'అనన్య భక్తి గలిగియున్నట్టి మహనీయులయొక్క సాంగత్యమును నాకు కలుగజేయుము'—అని ధ్రువుడు విష్ణు భగవానుని ప్రార్థించెను. అధ్యాత్మపథమున పురోగమింప దలచు మానవునకు సత్సాంగత్యము అత్యంతావశ్యకమై యున్నది. దుర్మార్గుల సహవాసము జీవుని అధోగతి త్రోసి వేయును. ప్రాపంచిక విషయభోగలోలసులతో గూడియుండు మనుజునకు భగవత్సంబంధమైన సంస్కార మెన్నటికిని అభివృద్ధిని బడయనేరదు. అంతేకాదు, క్రమముగ అది సన్నగిలిపోవు ప్రమాదమున్ను కలదు. ఎందఱో ముముక్షువులు పరమార్థరంగమున ఒకింత అభివృద్ధిని బడసియు, ప్రాపంచిక జనుల సహవాసముచే విషయగర్తమున కూలిపోయిన ఉదంతములు కలవు. ''పరమపదసోపానపటము''న ఎన్నియో నిచ్చెనలు ఎక్కినప్పటికిని ఒక పెద్దపాము నోటిలో పడినచో క్రింది స్థానమునకు వచ్చివేయునుగదా! కనుక నే ముముక్షువు

లకు సత్సాంగత్యము పరమావశ్యకమని, ముఖ్యాలంబనీయ మని శాస్త్రములందు పేర్కొనబడినది.

నారదుని సాంగత్యమువలననే ధ్రువునకు భగవత్ప్రాప్త్యుపాయము లభించినది. సప్తర్షుల సాంగత్యము వలననే రత్నాకరునకు భవసాగర తరణోపాయమగు తారక మంత్రము దొఱకినది! రామకృష్ణుని సాంగత్య ప్రభావము వననే వివేకానందునకు పరమార్థానుభవము కలిగినది! ఈ ప్రకారముగ ఎందఱో జనులు సత్సాంగత్యమహిమచే తమ తమ జీవితములను పునీత మొనర్చుకొని కడ తేరిరి. అందు వలన ధ్రువుడు భగవంతుని ప్రార్థించుచు ఎవరి హృదయసీమలందు భగవద్భక్తి నిరంతరము ప్రవహించుచుండునో, ఎవరి చిత్తము నిర్మలమై, విషయదోషవర్జితమై యుండుచుండునో, అట్టి మహాత్ముల సాంగత్యమును తనకు కలుగ జేయుమని వేడెను. వారి సాన్నిధ్యమందు భగవత్కథాశ్రవణము, భగవన్నామస్మరణము గావించుటకు మనుజునకు చక్కటి అవకాశము లభించును. ఈ ప్రకారముగ ముముక్షువు శేషించిన తన జీవితమును అధ్యాత్మరంగముననే గడుపును గాని, విషయదోషములతో గూడిన సాంసారిక క్షేత్రములందు గాదు. మందారమకరంద మాధుర్యమును గ్రోలు మధుపము పుష్పరహిత కంటకావృత కాననమునకు ఎన్నడైన చనునా? అట్లే భగవద్దివ్యగుణానువర్తనసుధా ప్రాప్తైకచిత్తులగు భక్తవరేణ్యులు దురితసంసారదుఃఖ పరిపూర్ణమగు విషయసుఖముల నెన్నటికిని వాంఛింపరు.

కనుకనే ధ్రువుడు "ఉరువ్యసనం భవాబ్ధిం నేష్యే భవద్గుణ కథామృత పానమత్తః"—అని పలికియున్నాడు, అనగా "నీయొక్క కథామృతపానముచే మదించిన చిత్తము గల్గి, నేనిక మహాసంతాపకరమగు సంసార సముద్రమును దాంటించనే దాంటించను" అని భగవానునితో మనవిచేసికొనెను. దీనినిబట్టి భగవదనుభూతి, పారమార్థిక శాంతి, నిర్వాణసుఖముయొక్క రుచి తెలియనివారే విషయ సుఖము వైపు పరుగెత్తుదురే కాని తెలిసినవారు కాదని స్పష్టమగుచున్నది. బింబముయొక్క మహిమను తెలిసినవాడు ప్రతిబింబమువైపున కెన్నడును పరువిడడు. పైగా ఎండమావులను దాంటించువాడు వివేకశూన్యుడనియే చెప్పవచ్చును.

ఈ ప్రపంచముయొక్క అస్తిత్వముగాని, అందలి విషయములయొక్క సుఖముగాని క్షణికమైనది. అద్దానికి స్థిరత్వము లేదు. ఒక వేళ ఒకింత శాంతిసుఖములు గోచరించినను, మహాదుఃఖముచే అవి ఆవరింపబడియుండుటచే, ఆ శాంతి సుఖములు శోభించుట లేదు. అందువలననే కాబోలు శ్రీకృష్ణభగవానుడీ ప్రపంచమును గీతయందు వర్ణించుచు 'మృత్యు సంసారమని' దానిని పేర్కొనియున్నాడు. ఎంతటి గొప్పవస్తువైనను, ఎంతటి సుందర పదార్థమైనను నాశశీలమైనపుడు దానికి విలువ లేదు. దృష్టాంతమునకు ఈ స్థూల దేహమును గైకొనవచ్చును. అది మహాసుందరముగనున్నను కొంత కాలమునకు మృత్యువుచే గ్రసింపబడుటవలన మహాత్ములు దానికి విలువ నొసంగరు. దాని సౌందర్యముచే వారు

పొరిసిపోరు. అది అశాశ్వత మని తలంచి వైరాగ్యము గలిగి యుందురు.

కావున విజ్ఞులగువారు పరమశాంతిదాయకమై, నిర్వాణప్రదమైనట్టి భగవత్తత్త్వము నవలంబించి, భగవత్సేవాపరాయణులై ప్రాపంచిక దృశ్యవిలాసములందు మునుంగక భగవన్నామ సంస్మరణజనిత సుఖము ననుభవించుచు, భగవత్కృపకు పాత్రులై, ధ్రువునివలె తమ తమ జీవితములను పరమార్థసేవకై అంకిత మొనర్చవలెను.

భక్తిని చక్కగ అభివృద్ధిపఱచుకొనినచో జ్ఞానము దానంతట నదియే హృదయమున స్థాన మేర్పఱచుకొన గలదు. మొదట 'దాసోఽహమ్' అను మంత్రమును జపించినచో, 'శివోఽహమ్' అను భావము కాలక్రమమున ఏర్పడ గలదు.

## దాసోఽహం

శ్రీరామకృష్ణపరమహంసయొక్క గృహస్థశిష్యులలో నాగమహాశయుడను నాతడు చాల ముఖ్యుడు. సన్న్యాసి శిష్యులలో వివేకానందుడు చాల గొప్పవాడు. నాగమహాశయుడు పరమభక్తుడు, వివేకానంద పరమజ్ఞాని. ఒకడు 'దాసోఽహం' మార్గావలంబి, మఱియొకడు 'శివోఽహం' పథగామి. ఒక పండితోత్తముడు వా రిరువురిని దర్శించి ఇరువురి స్వభావములను, మనస్తత్త్వములను తత్క్షణమే హృదయంగమ మొనర్చుకొని వారిఁగూర్చి యిట్లు వర్ణించెను. 'మాయ అను

మహాశృంఖలము (గొలుసు) నాగమహాశయుని, వివేకా నందుని ఇరువురిని కట్టివైచినది. కాని నాగమహాశయుడు తన కాయమును చిన్నదిగ, చిన్నదిగ తగ్గించుకొనుచువచ్చి తుట్టతుదకు ఒక చిన్న పురుగువంటి ఆకృతికలవాడై ఆ గొలుసుయొక్క రింగులోని సందుగుండా దూరి,తప్పించుకొని పారిపోయెను. వివేకానందుడో, తన శరీరమును పెద్దదిగ, పెద్దదిగ కావించుకొని, విజృంభించి ఆ గొలుసును బ్రద్దలు చేసి పారిపోయెను. ఈ ప్రకారముగ ఇరువురును మాయా బంధనమునుండి విముక్తిని బడసిరి—నాగమహాశయుడు భక్తి భావనగల్గి తన అహంకారమును చంపుకొని—

త్వద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య
భృత్యస్యభృత్య ఇతి మాం స్మర లోకనాథ.

—'దేవా! నేను నీ దాసానుదాస తద్దాసానుదాస దాసుడను'—అని భగవానుని కీర్తించుచు తన ఉపాధిని తన మనస్సును చిన్నదిగ, చిన్నదిగ చేసికొని తుదకు పర మాత్మయందు లయింపజేయును. జ్ఞానమార్గావలంబియగు వివేకానందుడు—

మత్తో నాన్యత్కించిదత్రాస్తి విశ్వం
సత్యం బాహ్యం వస్తు మాయోపక్లృప్తమ్
ఆదర్శాంతర్భాసమానస్య తుల్యం
మయ్యద్వైతే భాతి తస్మాచ్ఛివోఽహమ్.

—ఈ ప్రపంచము నాకంటె అన్యముగ ఒకింతైనను లేదు. మాయచే ఈ ప్రకారముగ అది బాహ్యమున

కల్పింపబడియున్నది. అద్దమునందు వస్తువెట్లు కల్పితమై భాసించునో అట్లే అద్వయమగు నాయందీజగత్తు మిథ్యారూపమున భాసించుచున్నది. కావున వాస్తవముగ ద్వైతము లేదు. పరమాత్మయే కలడు. అట్టి అద్వయ శివస్వరూప పరమాత్మనే నేను'—అని ఎలుగెత్తి పాడుచు తన ఉపాధిని (మనస్సును) విశాలమొనర్చి, విశాలమొనర్చి తుట్టతుదకు అనంత పరమాత్మగనే భాసిల్లును. కావున ఏవిధముగ జూచినను ఇరువురును ఏదో యొకవిధముగ తమ మనస్సులను లయముచేసి ఆత్మమాత్రులై శోభించియుండిరి.

భక్తియొక్క పరాకాష్ఠయు, జ్ఞానముయొక్క పరాకాష్ఠయు రెండును ఒకటియే. పైన దెల్పిన నాగమహాశయ, వివేకానందులలో ప్రధానమైన గుణము ఎత్తిచెప్పబడినదే కాని, వాస్తవముగ నాగమహాశయునియందు జ్ఞానము లేకపోలేదు. వివేకానందునియందు భక్తి లేకపోలేదు. కాబట్టి ముముక్షువులు ఈ భక్తి, జ్ఞానములగూర్చిన తర్కవితర్కములందుబడక ప్రధాన కర్తవ్యమగు శీలసంపాదన (Ethical Training) యందు కాలమును వినియోగించవలెను. అది సిద్ధించినచో అన్నియు సిద్ధించినట్లే. భగవద్గీతయొక్క హృదయము ఈ సచ్ఛీలసంపాదనయే అయియున్నది. హృదయనైర్మల్యము, చిత్తశుద్ధి, మనఃపవిత్రత ఎచట నుండునో అచట పరమాత్మ దేదీప్యమానముగ ప్రకాశించుచుండును. కావున ముముక్షువులెల్లరును తీవ్ర పురుష ప్రయత్నము నాశ్రయించి, అనన్యభక్తిసంయుతులై, తమ

హృదయమందలి అసూయా ద్వేషాది దుర్గుణము లన్నింటిని పారద్రోలి, భగవంతునకు అతిప్రియులై ఆ పరాత్పరుని కరుణచే ఈ మహాభయంకరమగు మృత్యు సంసారసాగరమును అవలీలగ దాటివేయుదురుగాక!

సామాన్యముగ జనులు దేవాలయములోనికి ప్రవేశించినపుడు ద్వారము బయటనే తమ తమ చెప్పులను వదలివేయుదురు. ఇది యొక చక్కని సంప్రదాయము. భగవత్సన్నిధానమున గర్వము, అహంకారము, ఆర్భాటము పనికిరాదని తెలుపుటకే కాబోలు పెద్ద లట్టి సత్సంప్రదాయమును నెలకొల్పిరి. ఎంతయో వినయవిధేయతలతో దేవుని సమీపించవలెను. దేవాలయధ్వజస్తంభము చెంతనుండు బలిపీఠముపై దంభాహంకారములను, మదమాత్సర్యములను ముందుగా బలిచేసి తదుపరి గర్భగుడిలోనుండు మూలవిరాట్ సాన్నిధ్యమున కేగవలెను.

తృణాదపి సునీచేన తరోరివ సహిష్ణునా
అమానినా మానదేన కీర్తనీయస్సదా హరిః.

అభిమానమును వదలి, తాను తృణముకంటె చిన్నవాడనని భావించి, వృక్షము పగిది కష్టసహిష్ణుత్వముతో గూడి భగవానుని కీర్తింపుడని పెద్దల ఆదేశము.

తృణముపై మనుజుడు కాలుపెట్టినపుడు అది వంగును, అంతియేకాని ఆ త్రొక్కిన మనుజుని అది బాధింపదు. తృణముయొక్క ఈ అపూర్వ విధేయతను గమనించి బ్రహ్మ

దేవుడు దానికి పూజలో స్థానమును కల్పించి గౌరవించెనట. తనుకనే పూజచేయునపుడు గరికెను తెప్పించి వాడుచుందురు. ఇక వృక్షమో, ఎంతెంత ఫలసంపన్నమైయుండునో అంతంత వినమ్రమై యొప్పును. తాను ఫలములు గలిగియున్నానని గర్వించదు. పైగా ఫలసంపదచే ఇంకను వంగి వంగి వర్తించును. ఇంతియే కాదు, వృక్షమును ఎవరైన రాయితో కొట్టినచో అది కొట్టినవారికి అపకారము చేయకపోగా, వారికి తన ఫలములను సమర్పించి గౌరవించును. అపకారికి ఉపకారము చేయు ఈ సత్స్వభావము వృక్షముయొక్క ఒక విశేషత. జడములైన తృణవృక్షములే ఇట్టి వినయాది సద్గుణములు కలిగియుండ చైతన్యవంతుడై, ప్రజ్ఞాప్రాభవములు గలిగియున్న మానవు డెంతటి సౌశీల్యము గలిగి వర్తింపవలెనో యోచించుకొనవలెను.

ఒకని శిరస్సు దేవునియొద్ద, పెద్దలయొద్ద ఎపుడు వంగునో, ప్రపంచముయొక్క శిరస్సు అతని యొద్దవంగును ప్రపంచ మాతనికి జోహారు లర్పించును. అట్లుకాక ఎవడు దేవుని, పెద్దలను తృణీకరించునో, తిరస్కరించునో, అపుడు ప్రపంచ మాతనిని అదరింపదు. పైగా వీవగించుకొనును. దేవద్విజగురుప్రాజ్ఞపూజనమును ఒక మహాతపస్సుగ శ్రీ కృష్ణపరమాత్మ గీతయందు వర్ణించి చెప్పుటకు కారణము అధ్యాత్మక్షేత్రమున అది యొక అత్యావశ్యక సుగుణముగుట వలననే.

ఆంజనేయు డెంతటి బలసంపన్నుడై యున్నను, ప్రతిభాశాలియై యొప్పినను శ్రీరామచంద్రునియొద్ద తలవంచుకొనియే యుండును. అత్యంత విధేయతతో మెలగును. హనుమంతుడు అసామాన్యబలపరాక్రమము కలవాడు. కొండను అరచేతి యందు మోసిన భీమబలుడు. తల తిరిగిన రాక్షసులను సైతము పాదాక్రాంతులుగ నొనర్చిన అఖండశక్తిమంతుడు. అయినను గురుదేవుడగు శ్రీరామచంద్రునియెడల, పెద్దల యెడల ఎంతటి భక్తిభావయుతుడై, విధేయతతోగూడి, బాష్పవారిపరిపూర్ణలోచనుడై, వినమితశిరస్కుడై యుండునో సర్వులకును విదితమే. వినయవిధేయతలు, భక్తిశ్రద్ధలు అంజనేయునకు కొట్టినపిండి. రామాయణములోని ఈ క్రింది సంఘటన ఆంజనేయుని వినమ్రభావమును కొట్టవచ్చినట్లు చూపుచున్నది—

హనుమంతుడు లంకాపట్టణమునంతను కాల్చివైచి నపుడు ఆ మారణహోమమునకు కారకు లెవరని రాక్షసులందరును తమలో ఆలోచించుకొనుచు కొత్తవారెవరైన లంకాపట్టణమునకు వచ్చిరా యని లంకయంతయు గాలించుచుండ సముద్రపుటొడ్డున తోకను చల్లార్చుకొనుచున్న ఆంజనేయుని గాంచిరి. ఆతడే తన దివ్యనగరమును ధ్వంసమొనర్చిన వాడని పరిపూర్ణముగ నిశ్చయించుకొనినవారై రాక్షసులు తండోపతండములుగ అచటికి రాజొచ్చిరి. తత్సమయమున ఆంజనేయుడు తన శరీరమును పెంచి పెంచి పర్వతసమానుడై వారికి తోపట్టెను. విశ్వరూపుడై, భీషణాకారుడై వెలసిన

ఆంజనేయునితో చిన్నపురుగులచందమున నున్న రాక్షసులు 'నీ వెవడవు?' అని ప్రశ్నించగా అపుడా వాయునందను డీ ప్రకారముగ చక్కటి సమాధానమును జెప్పెను—

దాసోఽహం కోసలేన్ద్రస్య రామస్యాక్లిష్టకర్మణః
హనుమాన్ శత్రుసైన్యానాం నిహన్తా మారుతాత్మజః.

'ఓ రాక్షసులారా! నే నెవరని మీరు ప్రశ్నించు చున్నారా? మహానుభావుడై, పరమపవిత్రుడైనట్టి శ్రీరామ చంద్రునియొక్క దాసానుదాసుడను నేను. నా పేరు హను మంతుడు. నేను వాయుపుత్రుడను. శత్రువులగు మిమ్ములను రూపుమాపుటకే ఇచటకు వచ్చితిని' — ఈ ప్రకారముగ శత్రువుల గుండెలలో కుంపటిని వెలిగించి అజేయుడై వర్తిం చిన ఆ గంభీరసమయమునకూడ ఆంజనేయుడు తన్ను శ్రీరామచంద్రునియొక్క దాసానుదాసునిగనే వర్ణించు కొనెనుగాని తన్ను గొప్పగా చెప్పుకొనలేదు. ఆంజనేయుని ఇట్టి అపూర్వ వినయవిధేయతలే, అచంచల గురువిశ్వాసమే అతని చరిత్రకు వన్నె తెచ్చినవి. కావున నిరభిమానము, నిరహంభావము, వినయాదిశీలసంపద విజయమును కాంక్షించు ముముక్షువునకు అత్యావశ్యకములై యున్నవి.

మోక్షప్రాప్తికి జ్ఞానము ముఖ్యహేతువైనప్పటికిని, ఆ జ్ఞానము భక్తిద్వారానే సంభవించుచుండును. ఫలము ముఖ్యమైనప్పటికిని, ఆ ఫలము పుష్పముద్వారానే ఏర్పడునని మఱువరాదు. జ్ఞానరూపఫలము భక్తిరూపపుష్పముద్వారా సంభవించును. 'సోఽహమ్' అను జ్ఞానము లభించవలెనన్న

ముందుగా 'దాసోఽహమ్' అను భక్తి చక్కగ అనుభూతము కావలెను. అహంకారములను వదలి, అభిమానమును పరిత్యజించి, దైవముయెడల, పెద్దలయెడల వినయవిధేయతలు గలిగి, దంభదర్పాదులకు తిలాంజలియొసంగి, హృదయము శుద్ధమైనపుడు మాత్రమే 'తాను పరబ్రహ్మమను' 'సోఽహమ్' భావనకు నిలుకడ ఏర్పడును. మధుసూదనసరస్వతి వచించిన ఈ క్రింది వాక్యములు ఈ పరమసత్యమునే నిరూపించుచున్నవి—

దాసోఽహ మితి యా బుద్ధిః పూర్వ మాసీ జ్జనార్దనే
దాకారోఽపహృత స్తేన గోపీవస్త్రాపహారిణా.

'నేను మొట్టమొదట 'దాసోఽహమ్' అను భావన గలిగి భగవంతుని ధ్యానించుచుంటిని. ఇట్లుండ కొంతకాలమునకు గోపీవస్త్రాపహారియగు ఆ యదునందనుడు నా 'దాసోఽహమ్' మంత్రములోని మొదటి అక్షరమగు 'దా' అను దానిని అపహరించుకొని పారిపోయెను. అందువలన నాకు 'సోఽహమ్' అనునదియే మిగిలిపోయెను—అనగా భక్తి ద్వారా వారికి జ్ఞానము ఏర్పడినదని స్పష్టమగుచున్నది. గీతయందు శ్రీకృష్ణపరమాత్మకూడ ఇట్టి భావమునే ప్రస్ఫుటీకరించియుండెను—

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే. (10-10)

'ఎవరు నిరంతరము ప్రీతిపూర్వకముగ నన్ను భజించుచుందురో అట్టివారికి బుద్ధియోగమును నే నిచ్చెదను. దాని

ద్వారా వారు నన్ను పొందగలరు'—బుద్ధియోగ మనగా ఆత్మానాత్మ వివేకము, నిర్మలభక్తి కలిగియున్న వారికే దానిని ఒసంగెదనని భగవానుడు వాక్రుచ్చియున్నాడు. కాబట్టి మోక్షహేతువగు అఖండజ్ఞానమునకు ఆధారము సునిర్మల భక్తి. 'సోఽహమ్'కు ఆధారము 'దాసోఽహమ్', 'దాసోఽహమ్' భావనయందు ఆరితేరనిదే 'సోఽహమ్' అనుభవము ఎవరికిని కలుగజాలదు. ఈ పరమసత్యమును గుర్తెఱిగి జనులు భక్తిభావసమన్వితులై, వినయాది సద్గుణసంపత్తి కలవారై తద్ద్వారా అఖండవిజ్ఞానమును సముపార్జించి భగవత్కృపకు పాత్రులగుదురు గాక!

## విశేషభక్తి

ప్రేమ అను ఒకేవస్తువు నశ్వరపదార్థముల పైకి వ్యాపించినపుడు బంధరూపమును, శాశ్వతరపరమాత్మపై వ్యాపించినపుడు ముక్తిరూపమును అగుచున్నది. ఆప్రేమయే మొదటిదానియందు కామము, రాగము అని పిలువబడుచు, రెండవదానియందు భక్తియని కీర్తింపబడుచున్నది. ఈ భక్తియు సామాన్యమనియు, విశేషమనియు రెండు విధములు. పుష్పములతో భగవంతుని పూజించుట, ధూప దీప నైవేద్యాదులతో సేవించుట, తీర్థయాత్రలు గావించుట మున్నగునవియన్నియు సామాన్యభక్తియొక్క లక్షణములు. 'భక్తి' అనగనే ఈ పూజాది వివిధ కర్మకలాపము లన్నియు స్మృతిపథమునకు వచ్చుచుండును, కాని 'భక్తియోగ' మని పేరు

పెట్టినప్పటికిని శ్రీకృష్ణభగవానుడు గీతయందు అట్టి ధూప దీపాది యుక్తములగు పూజలను వేనిని చెప్పలేదు. మనోనిగ్రహమును గూర్చియు, చక్కని శీలమును (Ethics) గూర్చియు మాత్రమే ప్రవచించెను. 'అద్వేష్టృత్వాదు'లను ఇఱువదియారు సద్గుణములను బోధించి, వానిని గలిగియుండువాడే తనకు మిక్కిలి ప్రియుడని బాహాటముగ నుడివెను. ఇట్టి సచ్ఛీలము, సదాచారము లెస్సగ పొందియుండుటయే 'విశేష భక్తి', లేక 'పరాభక్తి' యగును. కాబట్టి భక్తియోగమున ప్రతిపాదింపబడిన భక్తి సామాన్యమైనది కాదనియు, విశేషమైనదనియు విజ్ఞులు వెంటనే గ్రహించవచ్చును. ఎల్లపుడు సామాన్యస్థితియందుండుట ప్రగతిశీలుడగు మానవుని లక్షణము కాదు. పాఠశాలలో విద్యార్థి నిరంతరము ఒకే తరగతి యందుండునా? ఉండడు. ఒక్కొక్క సంవత్సరము ఒక్కొక్క క్లాసు దాటిపోవుచుండును. అట్లే అధ్యాత్మ క్షేత్రమున పురోగమించుచుండు సాధకుడు ఎల్లకాలములందును పిల్లలతరగతి (Kindergarten)లో నుండగూడదు. 'ద్వైతము'నందే కాలక్షేపము చేయగూడదు. క్రమముగ విశిష్టాద్వైతమునకు, అద్వైతమునకు ఎగబ్రాక వలయును. మహాత్ముల జీవితములందిట్టి క్రమవికాసమే గోచరమగుచుండును. అయితే ఒక్కొక్క స్థితినిదాటి పైకి పోవుచుండినచో దానియర్థము క్రింది స్థితులను అల్పదృష్టితో చూడవలెనని కాదు. వికాసము నొందుచుండువార లెన్నటికిని చేయరు. పై దానిని గ్రహించుచు క్రిందిదానియందు విశ్వాసముగలిగి

వర్తించుచుందురు. కావున పరాభక్తిశీలురు సామాన్యభక్తి యందు విశ్వాసము గలిగియే యుందురు.

జనులు ప్రారంభములో విగ్రహాదులను, బాహ్యపుష్పాదులచే పూజించుచు, క్రమముగ మనోవికాసము సిద్ధించినపుడు సద్గుణములచే, సదాచారములచే ఆత్మదేవుని పూజించుచు నుందురు. అదియే పరాపూజ యనబడును. బాహ్యపుష్పములు ఎప్పటికైనను వాడిపోవును. కాని పరాపూజ యందు, ఆత్మదేవుని పూజయందు వాడబడు పుష్పము లెన్నటికిని వాడవు, ముకుళింపవు, శిథిలములు కావు. పైపెచ్చు దినదినము నవనవోన్మేషయుతములై సొంపులను వెదజల్లుచుండును. అవియే అహింసాది పుష్పములు, అవియే అద్వేష్టృత్వాది కుసుమరాజములు.

అహింసా ప్రథమంపుష్పం పుష్పమిన్ద్రియనిగ్రహః
సర్వభూతదయాపుష్పం క్షమాపుష్పం విశేషతః
శాంతిపుష్పం తపఃపుష్పం ధ్యానపుష్పం తథైవచ
సత్యమష్టవిధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్.

—అహింస, ఇంద్రియనిగ్రహము, సర్వభూతదయ, క్షమ, శాంతి, తపస్సు, ధ్యానము, సత్యము—అను ఈ యెనిమిది విధములైన పుష్పములు భగవానునకు ప్రియతమములైనవి! బాహ్యకుసుమములను దేవునకు భక్తిపూర్వకముగ సమర్పించుట మంచిదే కాని, వానికంటె ఉత్తమములైన ఈ అహింసాది పుష్పములను సమర్పించుట ఇంకను శ్రేష్ఠతరమైనది. జనులీ సత్యమును నెఱుగజాలక ఎల్లప్పుడును

సామాన్యస్థితియందే యుండుచున్నారు. అట్టివారి కనువిష్వ
కొఱకై శ్రీకృష్ణభగవానుడు భక్తియొక్క పై అంతస్తును
గీతయందు బోధించెను. 'ఓ జనులారా! ఎల్లప్పుడును ప్రాథ
మికావస్థయందే యుండుట వివేకశీలుర స్వభావము కాదు.
క్రమముగ నూర్ధ్వస్థితికి పొండు. మీ చిత్తములను శుద్ధము
చేసికొనుడు. అద్వేష్టృత్వాది గుణముల నవలంబించి హృద
యమును సత్త్వగుణవంతముగ నొనర్చుకొనుడు. 'మన
స్సును మలినముగ నుంచుకొని బాహ్యపుష్పములచే నన్నా
రాధించినను విశేషఫలితము లభించదు. కాబట్టి బాహ్య
పూజతో పాటు అభ్యంతరపూజయు అలవాటు చేసికొనుడు.
అనగా అహింసాది పుష్పములతోను, అద్వేష్టృత్వాదిసంభా
రములతోను నన్నర్చింపుడు' అని భగవానుడు కరుణతో
నుపదేశించుచున్నాడు.

బాహ్యపుష్పములను, పత్రిని మనుజుడు తయారు
చేయుట లేదు, అది సర్వేశ్వరుని సృష్టి. దేవుడు నిర్మించిన
దానిని దేవునకు సమర్పించుటలో అంత గొప్పతనము లేదు.
మానవుడు తాను సొంతముగ నిర్మించిన పుష్పములను, భగ
వంతునకు అర్పణచేసినచో అది అమోఘమైన అర్చన
యగును. తన మనస్సును నిర్మల మొనర్చుకొని అట్టి నిర్మల
మనఃకుసుమమును సర్వేశ్వరుని పాదపద్మములందు సమర్పిం
చినచో భగవంతు డెంతయో సంతుష్టినొందును. 'భక్తాస్తేఽ
తీవ మేప్రియాః'-అట్టి భక్తులు నాకు అపరిమితప్రియులు అని
గీతాచార్యుడు తెలిపియేయున్నాడు. ఈ సందర్భమున శ్రీ

శంకరభగవత్పాదుల హృదయకుహరమునుండి వెల్లుబికిన భావనాప్రవాహమును వీక్షింపుడు—

గభీరే కాసారే విశతి విజనే ఘోరవిపినే
విశాలే శైలే చ భ్రమతి కుసుమార్థం జడమతిః
సమర్ప్యైకం చేతస్సరసిజ ముమానాథ భవతే
సుఖేనావస్థాతుం జన ఇహ న జానాతి కిమహో.

(శివానందలహరి)

—'ఆహా! మానవు డెంత వెఱ్ఱివాడు. పుష్పములకొఱకు అడవులలోను, కొండలలోను, చెఱువులలోను, దొఱువులలోను తిరుగుచున్నాడు. కాని మనస్సను పద్మము నొక్కదానిని నీ పాదారవిందములందు సమర్పించి హాయిగా నుండుటను అతడు తెలిసికొనలేక యున్నాడే! ఏమి యాశ్చర్యము!!' కావున హృదయోద్యానమున సత్యము, అహింస, భూతదయ, వైరాగ్యము, భక్తి మున్నగు అద్భుత పుష్పపంక్తులను తయారు చేసికొని వానిని భగవంతునకు సమర్పించుట నేర్చుకొనిన చో ఇక మానవుడు ముక్తిధామముయొక్క అంచులను జేరినట్లే యగును. అధ్యాత్మరంగమున చక్కని యభివృద్ధి సాధించి నట్లే యగును. ఈ సత్యమును జనులకు తేటతెల్లమగునట్లు బోధించు నిమిత్తమే గీతాచార్యుడు భగవద్గీతయందు భక్తి యొక్క వాస్తవస్వరూపమును దిగ్దర్శనము చేయుచు శీలాభివృద్ధిని నొక్కి వక్కాణించి యున్నాడు. కాబట్టి జనులు చక్కటి శీలముగలవారై పవిత్రములగు తమ హృదయకుసు

ములను భగవానునకు సమర్పించి జీవితమున పురోవృద్ధిని సాధించవలెను.

భక్తి గలిగియున్నవారికి భగవద్దర్శనము లభించగలదు. దర్శనమే కాదు, ప్రవేశనముకూడను లభించగలదు. అనన్యభక్తిచే దేవుని తెలిసికొనుట, దేవుని చూచుట, దేవుని యందు ప్రవేశించుట అను ఈ మూడున్ను సంభవింపగలవని గీతాచార్యుల యభిమతము. 'భక్త్యాత్వనన్యయా శక్య అహమేవం విధో౽ర్జున, జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరన్తప'— ఈ ఒక్క వాక్యమునందు సాధకుని పారమార్థిక క్రమవికాసము లెస్సగ చిత్రింపబడినది. ప్రారంభమున శాస్త్ర గురువాక్యములద్వారా సాధకుడు భగవంతు డెట్టివాడో తెలిసికొనును. అత్తరి భగవంతుని చేరుటకు భక్తుడు తన అధ్యాత్మిక యాత్రను ఉపక్రమించును. ఉపక్రమించెనే కాని అతనిని ఇంకను సమీపించలేదు. కావుననే అతనిని తెలిసికొనుట (జ్ఞాతుం) సంభవించెనే కాని చూచుట సంభవించలేదు. ఇది ప్రాథమిక దశ, ద్వైతస్థితి. ఈ స్థితిలో భగవంతుడు వేఱు, భక్తుడు వేఱుగ నుండును. భక్తిమాత్రము కుంటుబడక నుండును.

కాని ఇట్టి స్థితి చాలదు. సాధనను, భక్తిని తీవ్రతర మొనర్చి యింకను ముందునకు కొనసాగిపోవలెను. ఇట్లు చేయుచుండ చిత్త పరిపక్వత ననుసరించి కొంత కాలమునకు దేవుని అతిసమీపమునకు వచ్చును. దేవుని స్పర్శించును. దేవునితో మాట్లాడును. దేవునిలో తా నొక భాగముగా

(అంశముగా) తయారగునంతటి దశకు వచ్చును. అత్తఱి దేవుని తెలిసికొనుట అను స్థితిని దాటినవాడై దేవుని ప్రత్యక్షముగ (face to face) చూచునట్టి స్థితికి వచ్చును. (ద్రష్టుం), ఇది మాధ్యమికదశ. విశిష్టాద్వైత స్థితితో దీనిని పోల్చవచ్చును. అయితే ఇదియును చాలదు. దేవుని చూచుట మాత్రముతో సంతుష్టిపడక దేవునిలో ప్రవేశించుటకై ప్రయత్నింపవలెను, (ప్రవేష్టుం). ఇది చరమస్థితి. అభ్యాస దశమున సాధనయొక్క తీవ్రతచేత, భక్తియొక్క పరాకాష్ఠ చేత ఇట్టి సాక్షాత్కారదశ జీవునకు లభించగలదు. దేవుని ఎంతగా తెలిసికొనినను ఎంతగా చూచినను, దేవునిలో ప్రవేశించినంతటి ఔన్నత్యదశ వానికి ఉండదు. దేవుడు, తాను వేఱుగా నున్నంతవరకు ఏదో విధముగ భయము ఉండుచునే యుండును. (ద్వితీయాద్వై భయం భవతి). కావున దేవునిలో ఐక్యమైపోయి నపుడే, దేవునియందు ప్రవేశించినపుడే పూర్ణ నిర్భయత్వము, పూర్ణానందము జీవునకు సంప్రాప్తించ గలవు. ఇదియే అద్వైతస్థితి. ఈ ప్రకారముగ గీతాచార్యుడు "జ్ఞాతుం, ద్రష్టుం, చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప" (11-54) అను ఈ మహోన్నత వాక్యముద్వారా లోకమునకు ద్వైత, విశిష్టాద్వైత, అద్వైతములను మూడిటిని ప్రతిపాదించి ఒక్కొక్క మెట్టు పైకి పోయి తుదకు భగవంతునిలో ప్రవేశించుట యను చరమాద్వైతస్థితిని సర్వులును పొందులాగున ఆదేశించెను.

అట్టి పరిపూర్ణ అద్వైతస్థితియందే జీవునకు సర్వ దుఃఖములున్ను శమించిపోయి పరమానందప్రాప్తి కలుగును. అత్తరి ఇక మానవుడు మానవుడుగా నుండడు. మాధవుడుగా మారిపోవును. వ్యష్టిసమష్టియందు విలీనమై సమష్టిరూపము గనే శేషించును. ఉప్పుకల్లు సముద్రములో ప్రవేశించి సముద్ర రూపముగనే పరిణతమగునట్లును, అగ్నియందు అహుతి ప్రవే శించి అగ్నిరూపముగనే మారునట్లును, జీవుడు పరమాత్మ యందు ప్రవేశించి పరమాత్మరూపముగనే చెన్నొందును. కాబట్టి సాధకుడు దేవుని తెలిసికొనుటమాత్రముతో సంతుష్టి పడక చూచుట మాత్రముతో తృప్తిపడక, యింకను పైకి పోయి, దేవునిలో ప్రవేశించి తానే దేవుడై ఇక విశ్రాంతి నొందవలెను. ఒక మామిడిపండు కలదనుకొనుడు. అది ఇంటి వద్ద లేదు. బజారులో నున్నది. దాని రుచి, రూపురేఖలను గూర్చి ఎవరో చాల గొప్పగా చెప్పగా విని తెలిసికొని అనందించితిమి. ఇది మొదటి దశ. వినుటమాత్రముతో, తెలిసి కొనుట మాత్రముతో తనివి తీరనందున వెంటనే బజారునకు పరుగెత్తి దానిని కొని ఇంటికి తెచ్చినాము. తెచ్చి దానిని ఎదురుగ పెట్టుకొని దాని అందచందముల చూచి ఆనంద పడుచున్నాము. ఇది రెండవదశ. అంతటితో మనస్సు ఆగక ఒక కత్తి తెచ్చి దానిని, కోసి లక్షణముగ ఆరగించినాము. ఇక అ పండు బయటలేక మనలో ప్రవేశించినది. పండు మన మొకటై పోయినాము. దాని మాధుర్యముచే పరమానంద మనుభవించినాము. ఇది మూడవ దశ. మొదటి రెండు దశలు

దాటి మూడవదశ వచ్చినపుడే ఆనందముయొక్క పరాకాష్ఠ చేకూరును. అట్లే దేవుని మొట్టమొదట తెలిసికొని తదుపరి ప్రత్యక్షముగ చూచి, ఆ పిమ్మట అతనిలో ప్రవేశించి "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" అనునట్లు భక్తుడు భగవంతుడు ఒకటై పోవలెను. అప్పుడే "అహం బ్రహ్మాస్మి" (నేను బ్రహ్మను) అని గుండెపై చేయివేసి ధైర్యముగ చెప్పగల్గును. అపుడు కల్గు ఆనందము వర్ణనాతీతము. ఆనందమే తానై పోవును. ఆనందఘనస్వరూపుడై విలసిల్లును. శ్రీ శంకరాచార్యులా స్థితిని ఎంత చక్కగ వర్ణించిరో చూడుడు—!

శ్లో॥ వాచా వక్తు మశక్యమేవ మనసా మన్తుం నవా శక్యతే
స్వానందామృత పూరపూరిత పరబ్రహ్మాంబుధే ర్వైభవమ్
అంభోరాశి విశీర్ణ వార్షిక శిలాభావం భజన్మేమనో
యస్యాంశాంశల వే విలీనమధునానందాత్మనా నిర్వృతమ్.

(వివేక చూడామణి)

"ఆత్మానందమను అమృతప్రవాహముతో నిండిన పరబ్రహ్మసాగరముయొక్క వైభవమును నోటితో వర్ణించుటకుగాని మనస్సుతో తలంచుటకు గాని అలవికాదు. సముద్రమునందు పడి కరిగిపోయిన వడగండ్లవలె ఆ బ్రహ్మమునందు లీనమైన నా మనస్సు పరమసుఖ మనుభవించుచున్నది." భగవంతునియందు (ఆత్మయందు) ప్రవేశించిన చిత్తముగల జీవుల యానందస్థితి ఇవ్విధముననే యుండును. దీనినే అమనస్కస్థితి యందురు. అయితే ఇట్టి అమనస్కము సిద్ధించవలయునని తారక, సాంఖ్యములందు లెస్సగ అరి

చేరి యుండవలెను. ద్వైతవిశిష్టాద్వైతములందు ప్రావీణ్యము సంపాదించనిదే అద్వైతస్థితి ఎవనికిని లభింపజాలదు. కాబట్టి భక్తిని అభివృద్ధిపరచుచు తత్త్వవిచారణ గావించుచు మనస్సును క్రమముగ ఊర్ధ్వముఖముగ గొనిపోవలెను. "తస్యైవాహం", "తవైవాహం" అను రెండు స్థితులను అతిక్రమించి "త్వమేవాహం" అను స్థితికి రావలెను. అనగా "నేను దేవుని భక్తుఁడను" అను స్థితికి మొట్టమొదట వచ్చి పిమ్మట "నేను నీ భక్తుడను" అని ఎదురెదురుగా దేవునితో చెప్పగల్గునట్టి స్థితికిచేరి, ఆ పిదప "ఆ నీవే నేను" అని అనగల్గు ధైర్యమును బడయవలెను. సాధకునియొక్క ఈ మూడుదశలను వివేకానందులు వైజ్ఞానిక భాషలో నిపుణముగ ఇట్లు వర్ణించి చెప్పెను.

Dwaitism = Small circle different from the big circle only connected by Bhakthi.

Visistadwaitism = Small circle within the big circle, motion regulated by the big circle.

Advaitism = Small circle expends and coincides with the big circle.

"రెండు వృత్తములు (సున్నలు) కలవు. ఒకటి పెద్దది. ఒకటి చిన్నది. పెద్దది దేవుడు. చిన్నది జీవుడు. ద్వైతస్థితియందు పెద్ద సున్న చిన్న సున్న వేర్వేరుగ నుండును. కాని భక్తిచే కట్టబడియుండును. విశిష్టాద్వైతస్థితియందు పెద్ద

సున్నలోపల చిన్న సున్న యుండును. పెద్దదియే చిన్నదానిని గ్రసించుచుండును. అద్వైతస్థితియందు చిన్నసున్న పెరిగి పెరిగి పెద్దదిగ పెద్దదానిలో ఐక్యమైపోవును. కాబట్టి "సాధకుడు" అభ్యాసమును వదలక అనన్యభక్తిని చేకూర్చుకొనుచు పరమార్థ వికాసము నొందుచు ఒక్కొక్క మెట్టు పైకిపోయి తుట్టతుదకు ధ్యేయవస్తువగు పరమాత్మయందు విలీనమైపోవలెను. అపుడే మానవజన్మ సార్థకమైనట్లు, అట్టి మహోన్నతస్థితి ఈ జీవితమున చేకూరుటకై జీవుడు అహర్నిశములు పాటుపడవలయును.

ఈ ప్రకారముగ కర్మయోగ, భక్తియోగ సాధనముల ద్వారా మనస్సునందలి మలదోషమును నిర్మూలించివేయవలెను. పరమాత్మను చేరుటకు, మోక్షసిద్ధిని బడయుటకు మలినమనస్సు ఒక పెద్ద అంతరాయముగ నున్నది. మనస్సునందలి తమోగుణ, రజోగుణములు తొలగనిదేచిత్తమందలి జన్మాంతర వాసనాదోషములు హరించి పోవనిదే, అధిష్ఠానముగ నున్న ఆత్మ చక్కగ ప్రకాశింపదు. మలినమైన అద్దమునందు ముఖము చక్కగ గోచరింపదుగదా! కావున మోక్షసిద్ధిని బడయదలంచు సాధకుడు తన మనస్సును ఇంద్రియములను బాగుగ జయించి వానిని లెస్సగ నిగ్రహించి దుర్గుణజాలమును దూరీకరించి, మనస్సును విశుద్ధదర్పణము భంగి అతినిర్మలముగ గావించుకొనవలయును.

# 16 వ అధ్యాయము

## శీలసంపాదనము
### సచ్ఛీలము

ప్రపంచములో కొన్ని పదార్థములు జాగ్రతగా వాడుకొనినచో ఉపకారమును, అజాగ్రతగ వాడుకొనినచో అపకారమును కలుగజేయును. తెలిసి వాడినచో మేలును, తెలియక వాడినచో కీడును కలుగజేయును. జాగ్రతగ వాడినచో నిప్పు మేలు కూర్చును. అజాగ్రతగ వాడినచో ఆ నిప్పే గొప్ప కీడును కలుగచేయును. కత్తి, విద్యుత్తు మొదలైన వస్తువులున్ను ఆ ప్రకారమే మేలును, కీడును కూడ కలిగించును. వానిని ఉపయోగించుకొను పద్ధతిలో వున్నది మానవుని తెలివి.

అట్లే ఇంద్రియములను వశపఱచుకొనినచో అవి మనకు మిత్రులవలె వ్యవహరించును. వానికి దాసులైనచో శత్రువుల చందమున వర్తించును. శ్రీకృష్ణపరమాత్మ గీత ఆఱవ అధ్యాయప్రారంభముననే ఈ విషయమును గూర్చి హెచ్చరిక చేసిరి—

బన్ధురాత్మాఽఽత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్. (6-6)

ఇంద్రియములను మిత్రులుగా చేసికొనగల శక్తి మానవుడు సంపాదించవలెను. వానిని జయించినచో, వాని శీలక మెట్టిగినచో, అవి చెప్పినట్లు మనము ఆడక మనము చెప్పినట్లు అవి ఆడగలస్థితికి వచ్చినచో ఇక ఇంద్రియముల ఆట కట్టినట్లే.

మోక్షమార్గమున ఇంద్రియములు గొప్ప ప్రతిబంధకములుగ నున్నవి. వానిని దాటిననే కాని పరమాత్మదర్శనము కానేరదు. 'పెన్న దాటితే పెరుమాళ్ళ సేవ' అనునట్లు ఇంద్రియ సమూహమును నిగ్రహించి ఆ అడ్డుగోడను దాటినపుడు మాత్రమే జనులకు దైవసాక్షాత్కారము కలుగగలదు. జీవుడు మోక్షధామమును చేరవలెనని ఎంతయో ఉబలాటపడి, ఆతురతతో ప్రయాణమై పోవుచుండ ఈ ఇంద్రియములు మధ్యలో వచ్చి నిరోధించుచున్నవి. 'ఇక పోవలదు, దయచేసి ఆగుడు!' (Thus far and no further) అని ఆదేశమొసంగుచున్నవి. మహా మహా మేధావులు కూడ వాని ధాటికి తట్టుకొనలేక కొందఱు మధ్యలో నిలిచిపోవుటయో, మఱికొందఱు వెనుకకు మఱలుటయో సంభవించినది. చరిత్రను ఒకసారి తిరుగవేసిన ఇటువంటి దృష్టాంతము లెన్నియో తటస్థపడగలవు. 'కశ్చిద్ధీరః' అనునట్లు ఏ ఒకానొక మహనీయుడో, ఏ శూరవీర ధీరుడో ఇంద్రియముల యొక్క మదమును అణగద్రొక్కి, అంతర్ముఖుడై ఆత్మను పొందగల్గుచున్నాడు.

ఇంద్రియము లన్నిటిలో ప్రబలమైనవి రెండు కలవు. అవియే జిహ్వేంద్రియము, గుహ్యేంద్రియము. తక్కిన వన్నియు సామాన్యమైనవి. వానిని జయించుట ఒక పెద్ద విషయము కాదు. పై రెండుమాత్రమే మహాశక్తివంతము లైనవి. ఆ రెండిటిలో కూడ మొదటిదియగు 'జిహ్వను స్వాధీనపఱచుకొనినచో ఆ రెండవది దానంతట అదియే వశపడగలదు. గాంధి మహాత్ముడు తన జీవితచరిత్రలో జిహ్వేంద్రియ నిగ్రహము, బ్రహ్మచర్య పరిపాలనకు ఎంతగనో తోడ్పడగలదని, తనకావిధముగ తోడ్పడినదని స్పష్టముగ తెలిపియున్నారు. నాలుకపై ఏమాత్రము సంయమము లేక ఇష్టము వచ్చినదంతయు తినుచు, వశము తప్పి ప్రవర్తించి నచో ఇక జననేంద్రియము కూడ వశపడజాలదు. బ్రహ్మచర్యపాలన దుస్సాధ్యమై పోవును.

శాల్యన్నం సఘృతం పయో దధియుతం భుంజన్తి యే మానవాః
తేషామింద్రియనిగ్రహో యది భవేత్ వింధ్యః ప్లవేత్ సాగరే.

'మినమినలాడు విలువైన బియ్యపు అన్నమును, నెయ్యి, పాలు, పెరుగు, వెన్నలతో సహా మూడుపూటలు సుష్టుగ భుజించు మానవులకు బ్రహ్మచర్యము సాధ్యపడునా? అట్లు సాధ్యమైనచో వింధ్యపర్వతము సముద్రమున తప్పక తేలియాడగలద'ని భర్తృహరి సముచితముగ పలికెను. కావున బ్రహ్మచర్యసాధనకు, నాలుకను అరికట్టుట, ఆహారవిషయమున నియమనిష్ఠలు కలిగియుండుట ఎంతయో అవసరము; 'జితం సర్వం జితే

రసే' అని గీతాచార్యుడు ఉత్తరగీతయందు సెలవిచ్చినట్లు రసనేంద్రియమును జయించినచో తక్కిన ఇంద్రియములే కాక ప్రపంచములోని సమస్తమున్ను జయింపబడినట్లే యగును. కనుకనే శ్రీశంకర భగవత్పాదులు—

'యోగస్య ప్రథమం ద్వారం వాఙ్నిరోధః'

అని వచించినవారై జిహ్వేంద్రియ నిగ్రహమును యోగముయొక్క ప్రథమద్వారముగ పేర్కొనిరి. అనగా జిహ్వను స్వాధీన పఱచుకొనిననే తప్ప యోగద్వారమున, లేక, మోక్షద్వారమున ఎవరికిని ప్రవేశము కలుగనేరదని భావము. మానవునకు ఇంద్రియము లనేకము లున్నప్పటికిని, అన్నిటికిని ఒక్కొక్క పనిమాత్రమే బ్రహ్మదేవుడు నిర్ణయించెనుగాని, పైన తెలిపిన రెండింద్రియములకు మాత్రము రెండేసి పనులను (Double Work) ఏర్పాటు చేసెను. మాట్లాడుట, రుచిచూచుట అను రెండు పనులు నాలుకకు కలవను విషయము అందఱికి తెలిసినదే కదా. ఈప్రకారము రెండుపనులు చేయవలసి వచ్చుటవలన నాలుక మహాప్రబలముగ సృష్టింపబడినది. అయినను యత్నశీలునకు దానిని జయించుట ఒక పెద్ద సమస్యకాదు. నాలుకను జయించుటకు ఒక చక్కని ఉపాయము అది అడిగినదానిని అద్దానికి ఒసంగకుండుటయే. ఆహార విషయములో ఒకింత సంయమముగ ప్రవర్తించుటచే నాలుక తప్పక స్వాధీనపడగలదు. దేనిని తినవలెనని నాలుకకు ప్రబలవాంఛయున్నదో, దానిని కొన్నాళ్లైనను మానివైచినచో నాలుకయొక్క మదము

కొంత తగ్గగలదు. శ్రీ వసిష్ఠమునీంద్రుడు యోగవాసిష్ఠము (వసిష్ఠగీత)లో ఇదే ఉపాయమును శ్రీరామచంద్రునకు సూచించెను. చాతుర్మాస్యాది మహావ్రతములందు, ఏకాదశ్యాది వ్రతదినములందు సాధకులైనవారు జిహ్వపై కొంతనిగా ఉంచియుందురు.

లోకములో సామాన్యమైన ఒక వస్తువును సంపాదించుటకే మనుజుడు ఎంతయో శ్రమపడుచున్నాడు. అంగడిలో డబ్బు చెల్లించనిదే వస్తువు దగ్గఱకు వచ్చుటలేదు. ఒకదానిని త్యాగము చేయనిదే ఇంకొక వస్తువు లభించుటలేదు. అల్పసుఖ మొసంగు సామాన్యమైన పదార్థములకొఱకే మనుజుడు ఎన్నియో గొప్ప గొప్ప త్యాగములు చేయుచున్నాడు. చివఱకు తన శరీరమును పణముగబెట్టియైనను ఆ వస్తువులను అతడు సాధించుచున్నాడు. అట్టిచో అన్ని లాభములకంటెను గొప్పలాభమై, జనన మరణ దుఃఖవర్జితమై, నిరతిశయసుఖ స్వరూపమైనట్టి ఆత్మప్రాప్తికై ఒకింత ఇంద్రియసుఖమును త్యజించినచో ఒరిగిన దేమి? కావున విజ్ఞులగువారు ఇంద్రియ జయమునకై, అందును జిహ్వాది ప్రబల శత్రు నిరోధమునకై తమ యావచ్ఛక్తిని వినియోగించి ఇంద్రియగ్రామ సంగ్రామమున విజయోపేతులు కావలయును.

సద్గుణములను సాధించి దుర్గుణములను దూరీకరించవలెను. సమత్వమును సాధించి అసమత్వమునకు తిలాంజలి యొసంగవలెను. సమత్వ మనగా శీతోష్ణాదులందు, సుఖ

దుఃఖాదులందు సమదృష్టి కలిగియుండుట. మఱియు చరాచర ప్రాణికోట్లయందు సమరూపుడగు భగవానుని వీక్షించుట.

నిందాస్తుతులయందు, మానావమానములందు సమానముగ నుండవలెనని శాస్త్రము లాదేశించుచున్నవి. లోకములో సామాన్యముగ తన్నెవరైన స్తోత్రము చేయుచుండినచో మనుజుడు ఉబ్బిపోవును. కన్నుమిన్ను తెలియకుండ ప్రవర్తించును. ఆనందములో తన్మయుడై పోవును. అత్తఱి జీవితము అత్యంతాహ్లాదకరముగ తోచును. ఇక ఎవరైన దూషించినచో, లేక అపహసించినచో, నిండుమనిషి పాతికమనిషి అగును. క్రుంగిపోవును. తలవంచుకొనును. జగత్తంతయు అత్తఱి నీరసముగా తోచును, పరమాత్మనాశ్రయించదలచుకొను వానికి ఇట్టి అవలక్షణములు తగవు. ఒకడు స్తోత్రము చేసినచో తనకు ఒరిగినదేమి? నిందించినచో తరిగినదేమి? బాగుగ విచారించవలెను.

ప్రాపంచిక ఝంఝామారుతములచే అటు నిటు చెదరిపోవు దీపకళికలము కాదు తాను; అచంచలమగు మేరుపర్వతమే తానని గుర్తించవలెను. దీర్ఘముగ యోచించినచో అత్యంత పవిత్రమగు తన ఆత్మ ఒకడు తన్ను సంస్తుతించినచో పెరుగుది కాని దూషించినచో తరుగునది కాని కాదు. ఇక తనదేహమో జడమైనది కావున పరుల నిందాస్తుతులచే అది ప్రభావితము కానిదే యగును. ఇక మిగిలినది మనస్సు. తన మనస్సు అపవిత్రముగా నున్నపుడు ఒకడు దూషించి

నచో, ఆ దూషణము భూషణముగనే యుండును. ఏల యనిన, తన అపవిత్రతను ఎదుటివాడు వ్రేలుపెట్టి చూపి ఆక్షేపించుచున్నాడు. కావున ఆ దోషమును తొలగించుకొని ఇకమీదట జాగరూకుడై యుండవలెను, అంతియేకాని నిందించినాడని క్రుంగి కృశింపనక్కఱ లేదు. ఒకవేళ తన మనస్సు పవిత్రముగా నున్నపుడు ఎవరైన దూషించినచో, తన అంతరాత్మ సాక్షిగ తాను శుద్ధుడనను భావ మున్నందువలన ఆ దూషణమును లెక్కచేయగూడదు. తన హృదయమును సర్వేశ్వరుడొకడు చూచుచున్నాడను ధైర్యముండిన చాలును. తన సుగుణములను జూచి యెవరైన స్తోత్రము చేసినచో 'భగవంతుని అనంతవిభూతిలో ఈ నా ఉపాధి ఒక లవలేశము. ఇందు ప్రత్యేకముగ నా గొప్పతనమేమిటి! నేను నిమిత్తమాత్రుడను. పరమాత్మయొక్క విశుద్ధత్వముతో పోల్చి చూచిన నే నింకను చాల వెనుకబడియున్నాను. ఇంకనూ ఎంతయో పవిత్రుడను గావలసియున్నాను'—అని ఈ ప్రకారముగ తలంచుకొని కర్తృత్వమును పారద్రోలి నిగర్వియై యుండవలెను.

దూషణ భూషణములకు జంకకుండ చేసికొనుట ఒక గొప్ప సాధన. పారమార్థిక అభ్యున్నతికి అది ఎంతేని అవసరమై యున్నది. కనుకనే శ్రీకృష్ణమూర్తి భగవద్గీతయందలి అద్వేష్టృత్వాది దైవికగుణముల పట్టికలో దానిని గూడ జేర్చెను. మహనీయులందఱును అనేక యుక్తులతో, ఉపాయములతో తమ మనస్సులను మానావమానములను

అతీతముగ జేసికొనుచుందురు. వా రవలంబించు వానిలో ఒకటి రెండు యుక్తుల నిచట పొందుపరచెదను. ఏలయనిన సాధకులకు ఇది అవసరమైన ఘట్టము.

మన్నిందయా యది జనః పరితోష మేతి
నన్వప్రయత్నజనితో ఽయమనుగ్రహో మే
శ్రేయోర్థినో హి పురుషాః పరతుష్టి హేతోః
దుఃఖార్జితా న్యపి ధనాని పరిత్యజన్తి.

'నన్ను తిట్టి ఎవడైన సంతోషపడుచున్నచో అది అప్రయత్నముగ నాకు లభించిన గొప్ప ఉపకారము. ఏల యనగా లోకములో జనులు ఇతరులను సంతుష్టిపఱచుట కొఱకై (దానములుచేయుట, చెఱువులు త్రవ్వించుట, సత్రములు కట్టుట మున్నగు కార్యములందు) కష్టార్జితమగు తన ధనమును ఖర్చుపెట్టవలసి వచ్చుచున్నది. నేనో ఒక్క పైసా కూడ వ్యయముచేయకయే మఱియొకనిని ఈ ప్రకారముగ సంతోషపెట్టగల్గితిని. ఓహో! ఎట్టి ఉపకారము నాకు గలిగినది!' అని ఒక భక్తుడు ఒకానొక దుర్మార్గుడు తన్ను దూషించిన సమయమున పలికి ఆనందములో చిందులుత్రొక్కెను. ఇదియొక యుక్తి. ఇట్టి యుక్తిచే శత్రువు ప్రయోగించిన ప్రాణాంతమగు అస్త్రమును నిర్వీర్యమొనర్చి సాధకుడు తన కనుకూలముగ అద్దానిని వాడుకొనగల్గెను. దూషణము భూషణముగా మారిపోయెను. శాపము వరముగా పరిణమించెను. మఱియొక యుక్తిని వినుడు—

న మేఽపరాధః కిమకారణం నృణాం
మదభ్యసూయేత్యపి నైవ చిన్తయేత్
న యత్కృతా ప్రాగ్భవబన్ధ నిష్కృతి
స్తతోఽపరాధః పరమో ను కిం భవేత్.

'నే నేమియు తప్పుచేయు లేదు. అకారణముగ వాడు నన్నెందులకు దూషించెను?' అని యెవరును చింతపడ నక్కరలేదు. ఏలయనగా నీ వొక గొప్ప తప్పు చేసితివి. పూర్వజన్మమునందు మోక్షమునకై, బంధవిముక్తికై తీవ్రప్రయత్నము చేయకుండుటయే ఆ తప్పు. 'ఏమయ్యా! నేను పూర్వజన్మలో మోక్షమునకై తీవ్రప్రయత్నము చేయలేదని మీకెట్లు తెలియును?' అందువేమో, అట్లు చేసియుండినచో ఇపుడు పుట్టనే పుట్టవుకదా! జన్మించినావు కనుక జన్మరాహిత్యప్రయత్నములో పూర్వము లోపము చేసినావని అర్థము. ఈ ప్రకారముగ క్రిందటి జన్మయందే మోక్షమును సాధించి వేయకుండుట నీయొక్క గొప్ప అపరాధము. అట్టి అపరాధమును నీవు చేసియు, నాలో ఏ తప్పు లేదు. వాడెందుకు నన్ను దూషించెను? అనుచున్నావే! ఈ ప్రకారముగ నిన్ను దూషించుటద్వారా నీ లోపమగు మోక్షప్రయత్న విరహితత్వము నాతడు వ్రేలెత్తి చూపుచున్నాడు. కాబట్టి ఈ జన్మలోనైనా ఆ లోపమును సవరించుకొని గట్టెక్కుము మహానుభావా!' అని దూషకుడు నిన్నాశీర్వదించుచున్నాడన్నమాట!

వాస్తవముగ విచారించిన నిందగాని, స్తుతిగాని వాయు తరంగములు మాత్రమే యగును. అవి జడములైనవి. అట్టి వానిచే జీవు డేల ప్రభావితుడు కావలెను! ఆకాశమున శబ్దము పుట్టినది. ఆ శబ్దరూపమే నింద. ఆ శబ్దరూపమే స్తుతి.

Censure and praise are mere vibrations of the air.

ఈ రహస్యమును తెలిసికొనినచో ఇక రోజంతయు ఎవరైన తిట్టుచున్నప్పటికిని ఆవగింజంతైనను రోషము కలుగదు. ఒక చెవితో విని మఱియొక చెవితో బయటకు సాగనంపు చుండవచ్చును.

ఈ ప్రకారము ముముక్షువగువాడు మనోనైర్మల్యము కొఱకై దైవసంపదను లెస్సగ అభ్యసించి అసుర సంపదను పారద్రోలు చుండవలెను.

పూర్వము బుద్ధదేవుడు గయలో తపస్సు చేసికొను చుండ ఒక వ్యక్తి వచ్చి వారిని అదేపనిగ దూషించుట ప్రారంభించెనట! బుద్ధుడేమియు పలుకలేదు. ఆ వ్యక్తి తన అక్కసు అంతయు వెళ్ళబోసికొనినపిదప బుద్ధదేవుడు డతనిని పిలిచి 'నాయనా! నీ యింటికి ఎవరైన అతిథి వచ్చినపుడు అతని నెవరును లక్ష్యపెట్టక, అతనితో మాట్లాడకయున్నచో అత డేమిచేయును?' అని ప్రశ్నించెను. వెంటనే యతడు 'తిరిగి వెళ్ళిపోవును' అని ప్రత్యుత్తరమిచ్చెను. అట్లే నీవు నన్నింతవరకు దూరము అపహాసించితివి. నీ దూషణములను నేను స్వీకరింపలేదు. కావున అవి తిరిగి నీయొద్దకే పోయినవి

వానిని నే నంగీకరించినచో అవి నన్ను బాధించియుండెడివే, కాని నే నట్లు చేయలేదు. నీ సొత్తును నీకే సమర్పించితిని అని గంభీరముగ వచింప వాడు తెలివితెచ్చుకొని తనదారిని తాను పోయెను. ఒకరికి మనియార్డరు వచ్చినచో దాని నాతడు స్వీకరించినచో సరి, స్వీకరింపనిచో అది త్రిప్పివేయ బడునుగదా! అట్లే నిందాస్తుతులున్ను. మనము వానిని స్వీకరింపనిచో అవి మనల నేమియు చేయజాలవు. కావున వానిని లక్ష్య పెట్టగూడదు.

Few only know the Truth, the rest will hate
And laugh at thee, but pay no heed.

కొందఱే సత్యమెఱుఁగుచుందు రిలను, కాని తక్కినవారు
ఘనుడ నిన్ను జేరి నవ్విన లక్ష్యంబు సేయబోకు.

అని వివేకానందుల గంభీరనినాదము. భౌతికవాదము, నాస్తికత్వము ప్రబలుచున్న ఇక్కాలమున సహజముగనే జనులు పరమార్థతత్త్వాన్వేషకుని జూచి హేళనచేయవచ్చును, పరిహసించవచ్చును. అత్తఱి సాధకుడు తల్లక్రిందులు కాగూడదు. తన ఆధ్యాత్మిక దృఢనిశ్చయములను జారవిడువ గూడదు. బాణములు పర్వతమును భేదింపజాలనట్లు తన హృదయమును అవి ఏ మాత్రము కదలింపజాలని స్థితియందుండవలెను. ఇదియే సమస్థితి. నిందాస్తుతులం దిట్టి సమభావము గలిగియుండుట పరమార్థసాధకుని యొక్క లక్షణము. ఇద్దానిని ముముక్షువును లెస్సగ సాధించి యోగపథమున అగ్రసరులు కావలయును.

## దైవసంపద

సంపద యనగా సిరి, ఐశ్వర్యము, ధనము, సామాన్యముగ లోకములో సువర్ణము, ఆభరణములు, భవనములు, క్షేత్రములు, కరెన్సీనోట్లు, డాలర్లు మున్నగునవి ధనమని, సంపదయని ప్రాపంచిక జనులు తలంచుచుందురు. కాని భగవంతుని దృష్టియందు సచ్ఛీలమే ధనము, సదాచారమే సంపద, బ్రహ్మజ్ఞానమే ఐశ్వర్యము. ప్రాపంచిక ధనముతోటి సంబంధము మనుజునకు ఈ శరీర ముండునంతవఱకే కలుగుచుండును. శరీరవియోగముచే ఆ రెండిటికిని ఎడబాటు కలుగును. జ్ఞానసంపద అట్లుకాదు. ఉత్తమ సంస్కారరూపమున అయ్యది మోక్షపర్యంతము వాని వెంటనేయుండి నీడవలె వెంబడించుచు అభ్యుదయపథమున ఆతనిని ప్రవేశపెట్టుచు తుట్టతుదకు గమ్యముగు భగవంతునియొద్దకు చేర్చును. కాబట్టి భౌతిక సిరిసంపదలకంటె ఎన్నిరెట్లో శ్రేష్ఠతరమైనది ఈ ఆధ్యాత్మికసంపద. కనుకనే మహనీయులు భౌతికముగ ఈశ్వరు డిచ్చినదానితో సంతృప్తిపడి పారమార్థిక ఐశ్వర్యమునే అభివృద్ధి నొందించుటకు యావచ్ఛక్తి ప్రయత్నించుచుందురు.

మనుజుని విలువ అతని రూపసౌందర్యములందు లేదు. ఆస్తిపాస్తులందు లేదు. సంతతియందు లేదు. ప్రాపంచిక అధికారములందు లేదు. క్షేత్రవిత్తాదులందు లేదు. విద్యావైదుష్యమందు లేదు. శీలమందుమాత్రమే కలదు. భక్తియందు మాత్రమే కలదు. పారమార్థిక సుగుణములందు

మాత్రమే కలదు. కోట్లకొలది జీవరాసులలో అట్టి సుగుణ వంతుడే భగవంతునకు ప్రీతిపాత్రుడు కాగల్గును. కావున మనుజుడు తన అల్పమగు జీవితకాలమున అట్టి సుగుణసంపాదనమందే తన దృష్టిని ఎక్కువగా కేంద్రీకరించవలెను. ధన ముండుగాక, విద్యయుండుగాక, భవనములుండుగాక, క్షేత్ర ములుండుగాక, కాని వానితోబాటు కోమలహృదయము కూడ ఉండవలెను. దైవీసంపత్తికూడ ఉండవలెను. అంతః కరణ శుద్ధత్వముకూడ ఉండవలెను. సర్వేశ్వరునియెడల అచంచలమైన భక్తి, సర్వభూతకోట్లయెడల దయ - ఇవి ప్రధానముగ ఉండవలెను. తక్కినవి యెట్లున్నను మనుజుడు తన నైతిక, ఆధ్యాత్మిక (moral and spiritual) దృష్టిని పూర్ణముగ వికసింపజేసికొనవలెను. కేవలము భౌతికబలము పైననే ఆధారపడువాడు ఎప్పటికైనను నిరాశపొందియే తీరును.

విశ్వామిత్రుడు మొట్టమొదట తన శారీరక, మానసిక బలములపై ఆధారపడి, భౌతికశక్తినే నమ్ముకొని వసిష్ఠునితో పోరునకు తలపడి అస్త్రశస్త్రములను ప్రయోగింప, వసిష్ఠుడు ఒకింతైనను చలింపక తన యోగదండమును అడ్డుగా పెట్టగా విశ్వామిత్రుని ఆయుధరాశియంతయు కుంఠితమైపోయెను. అది కాంచి విశ్వామిత్రుడు—

ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలమ్
ఏకేన బ్రహ్మదండేన సర్వాస్త్రాణి హతాని మే.

'ఛీ! ఈ క్షత్రియబలమునకు, ఈ భౌతికబలమునకు ధిక్కారముగాక! బ్రహ్మబలమే నిజమైన బలము. దైవబలమే బలము. అధ్యాత్మశక్తియే శక్తి. ఏలయనిన, వసిష్ఠుని ఒక్క బ్రహ్మదండముచే నా అస్త్రశస్త్రములన్నియు వమ్మైపోయినవి' అని ఘోషించెను. అప్పటినుండియు విశ్వామిత్రుడు దైవశక్తియొక్క అద్భుతమహిమను గుర్తెఱింగి తీవ్రతరసాధన గావించి ఎట్టకేలకు బ్రహ్మర్షి అయ్యెను.

భౌతికశక్తులను నమ్ముకొని అవియే తనను కడతేర్చగలవని భావించిన దుర్యోధనుని గతి ఏమైనది? 'అక్షౌహిణుల సైన్యము కావలెనా, నే నొక్కడను కావలెనా?' అని శ్రీకృష్ణమూర్తి అర్జున దుర్యోధనుల నిరువురిని ప్రశ్నించినపుడు 'నాకు సైన్యమే కావలెన'ని దుర్యోధనుడును, 'కృష్ణా! నీ వొక్కడవే నాకు చాలున'ని కౌన్తేయుడును పలికిరి' తుదకు విజయము అర్జునునిపక్షముననే వరించెను. చరిత్రయం దిట్టి దృష్టాంతములు కొల్లలుగ కలవు.

సున్న (Zero) ఎంత పెద్దదైనను దానికి విలువ లేదు. ఒకటి అను సంఖ్యతోను దానికిని సంబంధమే లేదు. స్వప్నమందలి సైన్యము కోట్లసంఖ్యలో ఉన్నను, మేలుకొనిన మనుజునకు అదియంతయు తీసికట్టేగదా! నశ్వరభూతాకాశవికారములగు ఈ జగత్పదార్థము లెచట, శాశ్వత చిదాకాశస్వరూపమగు పరమాత్మ యెచట! భౌతికశక్తు లెచట, ఆధ్యాత్మిక బలమెచట! రెండిటికిని సంబంధమే లేదు. ఒకటి జడమైనది, రెండవది చైతన్యవంతమైనది. కావున విజ్ఞులగు

వారు పరమార్థసంపదనే అభివృద్ధిపఱచుకొనుచు, ప్రయత్న పూర్వకముగ అసురప్రవృత్తులను తమ మనస్సునుండి దూరీకరించుకొనుచు ఆధ్యాత్మికశక్తిని కూడగట్టుకొని పవిత్రమానవ జీవితమును సార్థక మొనర్చుకొనవలయును.

శాంతిని, సుఖమును కాంక్షించు ప్రతిమానవుడును ఈప్రకారముగ నిర్మలనైతికవర్తనముద్వారా తనయందుగల నిగూఢ ఆధ్యాత్మికశక్తులను బహిర్గత మొనర్చుకొనవలెను. అట్టి సచ్ఛీల సదాచరణమే దైవసంపద. జన్మజన్మాంతరముల నుండి అజ్ఞానప్రభావముచే జీవుని యంతఃకరణమున ఆసురిక శక్తులు తాండవమాడుచున్నవి. వానిని అరికట్టు తాహతు జీవునకు లేకపోయెను. కనుకనే అవి విచ్చలవిడిగ తిరుగాడ సాగెను. చీకటి ఎంతెంత దట్టముగ నుండునో అంతంత అధికముగ నిశాచరప్రాణులు సంచరించుచుందురు. చీకటి తగ్గినకొలది వాని సంఖ్యయు తగ్గుచు వచ్చును. కావున అవివేకము, అజ్ఞానము, అవిద్యయను అంధకారము అంతఃకరణమును ఆవరించియుండుటవలన కామక్రోధాది నిశాచరవర్గము యొక్క దుశ్చేష్టలకు పట్టపగ్గము లేకుండపోయెను.

కాని సౌభాగ్యవశమున మానవజన్మ లభించి జీవుడొకింత కండ్లు తెరువగా, తనయం దింతవఱకు జరుగుచున్న అసురప్రభుత్వ దురాచారములన్నియు అతనికి ప్రత్యక్షముగ అగపడజొచ్చెను. అపుడు వెంటనే పురుషప్రయత్నము నాశ్రయించి, ఆ దుష్టవాసనలను, దుస్సంస్కారములను, దుర్వృత్తులను ఒక్కొక్కటిగా ఏరి పారవేయుట కతడు

కృతనిశ్చయుడయ్యెను. ఇదియే మానవత్వము. అసురికమగు పాత్రప్రభుత్వమును తొలగించి, దైవికమగు క్రొత్తప్రభుత్వమును స్థాపించుటయే మానవత్వచిహ్నము. ప్రాకృతిక గుణములను పారద్రోలి పవిత్రగుణములను చేర్చుకొనుటయే జన్మసార్థకత.

> అకృత్వా శత్రుసంహారమగత్వా ఽఖిల భూశ్రియమ్
> రాజాహమితి శబ్దాన్నో రాజా భవితుమర్హతి.

'శత్రువులను సంహరింపక, సకలభూమండలాధిపత్యము నొందక, 'నేను రాజును' అనుకొనినంతమాత్రముచేతనే ఎవడును రాజు కాజాలడు' అని (శ్రీ) శంకరాచార్యులవారు వివేకచూడామణియందు తెలిపియున్నారు. అట్లే అరిషడ్వర్గమును జయింపక, నిరతిశయానందరూప ఆత్మసామ్రాజ్యమును బడయక, దైవీసంపదను జేపట్టక 'నేను ముక్తుడను' అని అనుకొనినంతమాత్రముచే ఎవడును ముక్తుడు కాజాలడు.

జన్మాంతర దుష్టవాసనలు అత్యంత బలీయములైనవి. ఒక్కొక్కదానినిపట్టి బాగుగ విచారించి హృదయకుహరము నుండి దానిని పారద్రోలవలెను. మనుష్యుడై పుట్టినందులకు ముఖ్యముగ ఆచరించవలసిన కార్యమిదియే. తన పూర్వపు దుస్సంస్కారములను మార్చుకొనవలెను. ఒక్కొక్కనికి లెక్కలేనన్ని చెడ్డ అలవాట్లుండును. అభ్యాసవశమున వివేకవశమున వాని నన్నింటిని పోగొట్టుకొనవలెను. ఒక చిన్న చెడ్డఅలవాటును మార్చుకొనలేనివారు మహాబలసంపన్నమగు మాయ నెట్లు జయించగలరు ? జంతువునకును మనుష్యునకును

గల భేద మిచటనే యున్నది. జంతువు తన జన్మాంతర సంస్కారమును మార్చుకొనజాలదు. పులి తన క్రౌర్యమును విడనాడజాలదు. నక్క తన కాపట్యమును వదలలేదు. కాని మనుష్యుడు 'జన్మతః' తనకు సంక్రమించిన క్రూరస్వభావమును, మలినసంస్కారమును 'కర్మతః' మార్చుకొనజాలడు. ప్రయత్నము చేతను, సాధన చేతను, అభ్యాసము చేతను సన్మార్గావలంబి కాగలడు.

కావున పుట్టుకతో వచ్చిన అసురస్వభావమును, ప్రాకృత వాసనలను ప్రయత్నపూర్వకముగ తొలగించుకొని 'దైవీసంపద'ను చేబట్టుటవలననే మానవత్వము సార్థకత జెందుచున్నది. 'మా' అనగా మాయను (అజ్ఞానమును), 'న' అనగా లేకుండ, 'వ' అనగా వర్తించువాడు మానవుడనబడును. 'మానవ' శబ్దము స్ఫురించినవెంటనే ఈ మహోన్నతభావములు హృదయమున ద్యోతకములై జనులను కర్తవ్యమునకు పురికొల్పవలెను. కావున ఇక కాలవిలంబన చేయరాదు. దైవీసంపదను (సచ్ఛీలమును) లెస్సగ అభ్యసించుచు రావలెను. "మా చిత్తమంతయు దుష్టవాసనలతో నిండి నిబిడీకృతమై యున్నదే, ఇట్టి సత్సంస్కారములు మనకు అబ్బునా?" అని యెవరును నిరుత్సాహపడవలసిన పనిలేదు. పాపి పుణ్యాత్ముడగుటచే ఈ వేదములును, ఈ శాస్త్రములును-అని యెవరును మఱువరాదు.

క్షిప్రం భవతి ధర్మాత్మా

సుదురాచారపరుడుకూడ అభ్యాసవశమున, భగవద్భక్తి సాహాయ్యమున శీఘ్రముగ ధర్మాత్ముడు కాగలడని గీతాచార్యుడు నొక్కి వక్కాణించుట గమనింపదగియున్నది. భగవానుని ఈ వాక్యము జనుల హృదయసీమలందు గొప్ప ధైర్యసంచారమును గలుగజేయుచున్నది. పాపి ఏనాటికైనను పుణ్యాత్ముడు కాగలడను విశ్వాసము జనులకు ఎంత శీఘ్రముగ గలిగిన అంతమంచిది.

ఎటువంటి పాపాత్ముడైనను, అనన్యభావముతో సర్వేశ్వరుని చింతించుచో, అతడు క్రమముగ తన దుష్టస్వభావమును గోల్పోయి ధర్మాత్ముడగును. సాధుశీలుడగును. కావున "పాపి యెల్లప్పుడు పాపియే" యను సిద్ధాంతము సరికాదు. ప్రతిజీవి హృదయమునందును పరమపావనమగు ఆత్మ వెలయుచున్నది. కావున ఏనాటికైనను ఆ ఆత్మప్రకాశము సర్వులయందును బహిర్గతము కావలసినదే. అయితే కొందరికి శీఘ్రముగ వ్యక్తమగును. మరికొందరికి నిదానముగ వ్యక్తమగును. కావున ఎటువంటి పాపాత్మునిగూడ ఉపేక్షింపక వానిలో నిగూఢముగ నున్న దివ్యత్వమును లేపుటకై చక్కని బోధ గావించుట యుచితము. అట్టిబోధచే నిద్రాణమై యున్న శక్తులు మేలుకొనును. సప్తర్షులు దారిదోపిడి వ్యక్తి (Highway-Robber) అగు రత్నాకరునకు చక్కని హితవాక్యములు చెప్ప, కాలక్రమమున నాతడు వాల్మీకిగా మారిపోయెనుగదా! ఇట్లెందరో పాపాత్ములు, "సుదురాచారులు" దైవచింతనచే, పశ్చా

తాపముచే మహాపుణ్యాత్ములుగ మారిపోవుట చరిత్రప్రసిద్ధమై యున్నది. కావున ఎవరినీ, "నీవు అల్పుడవని" కించపరచరాదు. ఎవరును తాను పాపిని (పాపోఽహం) అని అనుకొనరాదు.

"పాపోఽహం"

అని నిరంతరము అనుకొనుటకంటె,

"అచ్యుతోఽహం అనన్తోఽహం గోవిన్దోఽహం సదాశివః"
అని నిరంతరము అనుకొనుట ఉత్తమము. అయితే దానికి తగినట్లు వర్తించవలెను. అనుకూలచింతన (Positive thoughts) వలన అనుకూలుడుగను, ప్రతికూలన చింతన (Negative thoughts) వలన ప్రతికూలుడుగను మనుజుడు మారిపోవు అవకాశము గలదు. ఇంటియందు కొంటెచేష్టలు చేయు పిల్లవానిని పట్టుకొని "నీవు అల్లరివాడవు, నీవు ఎందుకు పనికిరావు, నీవు శుంఠవు" అని ఊదరపెట్టుచుండినచో, అతని అల్లరి తగ్గకపోవుట అట్లుండ కాలక్రమమున నాతడు గజదొంగగ మారిపోగలడు. ఈ మధ్య ఒకరింటిలో ఒక పెద్దమనిషి ఒక పిల్లవానిని 'ఓరీ మూర్ఖుడా! ఏల అల్లరి చేయుచున్నావు' అని ప్రశ్నింప, ఆ పిల్లవాడు "అయ్యా! నేను మూర్ఖుడను గనుకనే అల్లరి చేసినాను, తాము పెద్దవారు గనుక బాగుగ ప్రవర్తించండి!" అనెనట.

కావున ఎవరిని కించపఱచ యత్నము చేయరాదు. ఇది భగవదాదేశము. ప్రతివానిలోను దాగియున్న అఖండశక్తిని

లేపుట కే నర్వులును ప్రయత్నించవలెను. పశ్చిమ దేశములలో కొన్ని జైళ్ళయందు దొంగలను సంస్కరించుటకు చక్కని బోధనపద్ధతులను కనిపెట్టిరి. భారత దేశమందును కొన్ని చోట్ల అట్టి యత్నములు జరుగుచున్నవి. కావున "అపి చేత్సుదురాచారో" (9-30) అను గీతాశ్లోకము ననుసరించి ప్రతిమానవుని దైవమార్గమున అగ్రేసరు డగులాగున ప్రోత్సాహపరచుచుండవలెను. ఎపుడు దేవభక్తుడగునో ఇక నాతనికి దుర్గతి యెన్నటికిని కలుగదు. అచిరకాలములోనే పరమశాంతిని ఆతడు బడయుగల్గును. (శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి). ఈ సత్యమును వెల్లడించుచు శ్రీకృష్ణభగవానుడు గీతయందు అమోఘమగు నొక వాక్యమును బల్కెను.

"కౌన్తేయ ప్రతిజానీహి నమే భక్తః ప్రణశ్యతి"　　(-391)

'ఓ అర్జునా! నా భక్తున కెన్నిటికిని దుర్గతి గలుగదు. ఆత డెన్నడును చెడడు. ఇది నత్యమని ముమ్మాటికిని ప్రతిజ్ఞ చేయుము' అని గంభీరముగ పలికెను. కావున భక్తుడు కావలెనే కాని, అయినచో ఇక అతని పంట పండినట్లే, అయితే, భక్తుడగుటకు ఉపాయమేమి?

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు"　　(9-34)

"చిత్తమును దైవమునందు నిలుపుము. దైవభక్తుడవు కమ్ము. దైవమును భజింపుము. దైవమునకు నమస్కరింపుము." ఇదియే భక్తుడగుటకు గీతాచార్యుడు సూచించిన పద్ధతి. మనస్సును భోగవిలాసములనుండి వివేకముచే మర

లించి, ఆత్మయందు, దైవమునందు స్థాపించవలయును. కామక్రోధాదిరూపమగు పిశాచమునకు నమస్కరింపక, పరమానందరూపమగు పరమాత్మకే నమస్కరింపవలయును. ఈ ప్రకారముగ సాధించుచు రాగా రాగా, చిత్తమునందలి దృశ్యవాసనలన్నియు క్రమక్రమముగ క్షీణించిపోవ, ఆవరణము నశింప, హృదయాంతర్వర్తియగు ఆత్మజ్యోతి తెల్లగ ప్రకాశింపదొడగును. అంతవరకు నరుడుగా నున్నవాడత్తరి నారాయణుడుగ మారిపోవును. జీవుడు శివుడై యొప్పును. మానవుడు మాధవుడుగా విలసిల్లును. అదియే మోక్షము, అదియే కైవల్యము, అదియే నిర్వాణము.

అట్టి మహోన్నతస్థితి పట్టుదలతో కూడిన సాధనచే జీవునకు చేకూరగలదు.

నిరంతర సాధనచేతను, తీవ్రతర అభ్యాసముచేతను ఎటువంటి కార్యమునైనను జగత్తులో సాధించవచ్చును. ఇక మానవునకు గల దుస్సంస్కారములను పోగొట్టుకొనుట ఒక లెక్కా? అయితే పట్టుదల, శ్రద్ధ, లక్ష్యమునందు ప్రీతి-ఇవి తప్పక ఉండవలెను. ఈ ప్రకారముగ పట్టుదలతో ఈ జీవితమునందే దైవసంపదను సాధించివేయుటకును, తద్వారా పరమానంద ప్రాప్తినొందుటకును మానవుడు కృతనిశ్చయుడు కావలయును. దైవసంపదచే, సుగుణరాశిచే సామాన్యమనుజుడు సాక్షాత్ బ్రహ్మర్షి కాగలడు. బ్రహ్మర్షిత్వము ఒకరిచ్చునది కాని, పుచ్చుకొనునది కాదు. అది ప్రయత్నముచే వారు వారు సంపాదించు మహత్తర స్థితి.

ప్రయత్నముచే మానవుడు సాధింపరాని దీ ప్రపంచ మున ఏదియును లేదు. భౌతికక్షేత్రమందుగాని, ఆధ్యాత్మిక క్షేత్రమందుగాని వ్యక్తి తన అధ్యవసాయముచే మహోన్నత శిఖరముల నధిష్ఠింప గల్గుచున్నాడు. చిన్న రాజ్యమునకు అధి నేతయైన సిద్ధార్థుడు తన వివేక వైరాగ్యములచేతను, గొప్ప పట్టుదల చేతను, ఇంద్రియనిగ్రహ, మనోనిగ్రహములను సాధించివైచి అచిరకాలములో ఆత్మసామ్రాజ్యమునకు అధి నేతయైన బుద్ధదేవుడుగ విఖ్యాతినొందెను గదా! అట్లే శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద, గాంధిజీ మొదలైన ఆధునికవ్యక్తులు తమ యకుంఠిత దీక్షచేతను, భగవద్భక్తిచేతను, సాధనాతిశయముచేతను విశ్వవంద్యులై, లోకోత్తరపురుషులై, బ్రహ్మర్షులై విలసిల్లిరి.

మహర్షిత్వముగాని, బ్రహ్మర్షిత్వముగాని ఒకరిసొత్తు గాదు. అది ఒకానొక జాతిచేగాని, వ్యక్తిచేగాని, వర్ణముచే గాని గుత్తకు (Contract) తీసికొనబడు పదార్థముకాదు. యోగ్యతగలవారందఱును బ్రహ్మర్షిత్వమునకు అర్హులే. పవిత్రత, సహనము, పట్టుదల (Purity, Patience, Perseverence) గలవారు ఏనాటికైనను బ్రహ్మర్షిత్వమును సాధించియే తీరుదురు. వ్యక్తియందు దుర్వృత్తులు, దుర్గుణ ములు, దుస్సంకల్పములు ఉండునపుడు, భగవంతుని దృష్టి యందుగాని, లోకులయొక్క దృష్టియందుకాని యతడు చాల అల్పుడుగనే యుండును. బంగారము ఇతర లోహములతో గూడియున్నపుడు దానికి విలువ చాల తక్కువగనే యుండును

గదా! ఆ బంగారమే అగ్నిహోత్రముపై బాగుగ పుటము పెట్టబడినపుడు దానియందలి ఇతర లోహములన్నియు ఆవిరియై పోగా, స్వచ్ఛమగు మేలిమి బంగారుగ మాత్రమే శేషించును. ఆపుడు దాని విలువయు చాల పెరుగును. అట్లే తపస్సు ఇంద్రియనిగ్రహము, భగవద్భక్తి మున్నగువానిచే మనస్సునందలి దోషములన్నియు పరిహరింపబడినపుడు, పాపాత్ముడున్ను పుణ్యాత్ముడై పరగును. అల్పుడు లోకోత్తరుడుగ చెన్నొందును. సామాన్యుడు విశ్వవంద్యుడై యలరారును. మహాత్ములు తమ జీవితముల నీ ప్రకారమే ప్రయత్నపూర్వకముగ సంస్కరించుకొని లోకములో గణనీయస్థానము నలంకరించిరి.

ఆధ్యాత్మిక చరిత్రయం దౌన్నత్యము నొందిన మహనీయుల జీవిత చరిత్రములన్నిటిని పరికించినచో ఏదియో యొక అద్భుతసంఘటన (miracle) వలన ఒక్కపర్యాయము ఆకస్మికముగ వారు పైకి వచ్చినట్లు కానబడుట లేదు. ఒక క్రమపద్ధతిని నెమ్మది నెమ్మదిగా వారు చేసిన సాధనల ననుసరించి ఉన్నతస్థానమున కెగబ్రాకినట్లే కనుపించుచున్నది. అనుష్ఠానమందు ప్రీతి, నియమబద్ధమగు జీవితమును గడుపుటయందు పట్టుదల, దైనందిన వ్యవహారములందును చక్కని క్రమశిక్షణ మున్నగు సుగుణములే వారి ప్రగతికి కారణము.

''సర్వజీవరాసులయెడల ప్రేమ, దయ, కరుణ గలిగి యుండుడు! భక్తి, జ్ఞాన, వైరాగ్యములను మందుతో బాటు

సర్వభూతదయ యను పథ్యమునుగూడ అవలంబింపుడు" అనునది వారి బోధలలో ప్రధానమైనది. ఇట్టి విశాలహృదయము, విశ్వప్రేమ ముముక్షువుల కత్యావశ్యకమై యున్నది. బ్రహ్మర్షిత్వమున కర్హతయు నిదియే. సంకుచితహృదయులు, దయాదాక్షిణ్యవర్జితులు భగవంతు నెన్నటికిని బొందజాలరు. కావున, ముముక్షువులెల్లరు తమ భక్తి, జ్ఞానాద్యుపకరణములతోపాటు ప్రాణికోట్లయెడల దయనుగూడ అభ్యసించవలయును. అనన్యభక్తి, నిరంతరతత్త్వచింతన, ఆధ్యాత్మికక్రమశిక్షణ, నియమపాలన, సర్వభూతదయ మొదలగు ఉదాత్తగుణముల నవలంబించి జనులు ప్రయత్నపరులై సామాన్యస్థితినుండి బ్రహ్మర్షిస్థితికి చేరవలయును.

ఈ ప్రకారముగ ప్రయత్నపూర్వకముగ తమయొక్క ఉన్నతిని సాధించుటకు జనులు బద్ధకంకణులు కావలయును. అనేకయుక్తులద్వారా ఇంద్రియములను జయించి జన్మాంతర వాసనలను, దుర్గుణములను అరికట్టవలెను. హృదయమందలి అసురప్రకృతిని పారద్రోలి, దైవప్రకృతికి అవకాశ మీయవలెను.

శ్రీమద్రామాయణమందు దండకారణ్యమునుగూర్చిన ప్రస్తావన కలదు. శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణ సమేతుడై వనప్రదేశములందు పాదచారియై పయనమగుచుండ త్రోవలో భయంకరమైన దండకారణ్యము ఎదురుపడెను. కోదండధారియగు రాముడు నిర్భయుడై అందు ప్రవేశించెను. విరాధుడు, ఖరుడు, మారీచుడు, కబంధుడు, శూర్పణఖ

మొదలైన అగణిత రాక్షస సమూహములకు ఆలవాలమైన ఆ భీకరారణ్యమునందు రాముడు ధైర్యోత్సాహములతో సంచరించి దుష్టచరిత్రులు, దుశ్శీలురునగు ఆ దానవులందఱిని తుదముట్టించెను. శరభంగుడు, అగస్త్యుడు, సుతీక్ష్ణుడు, జటాయువు, శబరి మొదలగు పవిత్రహృదయులు, భక్తవరేణ్యులు నివసించుచున్న ఆ దండకవనమును నిష్కంటకముగ నొనర్చి మునులకు రాక్షసబాధ లవలేశముకూడ లేకుండ జేసెను. శ్రీరాముని పాదస్పర్శచే దండకారణ్యమందలి అణువణువు పునీతమైపోయెను. వారి రాకచే మునుల హృదయసీమలు బ్రహ్మానందముచే పరిప్లావితములైనవి. దండకారణ్యము నందనవనమై విలసిల్లినది, శత్రుబాధ తొలగిపోయినది. రాక్షసులు పలాయనము చిత్తగించిరి. ఋషులు సంతుష్టాంతరంగులైరి.

ఆ దండకారణ్యము ఎచటనో దూరముగ లేదు. అజ్ఞాని హృదయమే దండకారణ్యము. దేహాభిమానియగు జీవుని హృదయక్షేత్రమే ఆ దండకవనము. కామక్రోధాదులే ఆ రాక్షసులు. భక్తి వైరాగ్యాది సుగుణసంపత్తియే దండకారణ్యవాసులగు మునీంద్రులు. ప్రతిజీవియొక్క హృదయమందు మంచి, చెడ్డ, ధర్మము, అధర్మము, న్యాయము, అన్యాయము, సత్యము, అసత్యము, క్రూరత్వము, దయ వసించుచున్నవి. దండకారణ్యములో జనులను బాధించు దుర్మార్గులు, జనులకు బోధించు సన్మార్గులు ఇరువురును ఉండినట్లే జీవుల హృదయాంతరాళమునందు దైవాసుర ప్రకృతులు

రెండును ఉండియుండును. కొందఱియందు దైవసంపద అధికముగ నుండును. మఱికొందరియందు ఆసురసంపద ఆధిక్యత గలిగియుండును.

అసురప్రకృతిని కూలద్రోయుటకై ముముక్షువు వివేకమను శ్రీరామచంద్రుని తన హృదయసీమకు ఆహ్వానించును. అత్యంత సూక్ష్మబుద్ధియను తీక్ష్ణశరములచే ఆ వివేకము కామక్రోధాది దానవపరంపరనంతను అచిరకాలములో రూపుమాపి, రామ బాణముయొక్క శక్తిసామర్థ్యములను లోకమునకు చక్కగ నిరూపించును. ప్రతి జన్మయందును అనేక దుఃఖపరంపరలను బొందుచు, జనన మరణ రూప సంసార చక్రమందు తగుల్కొని బహు యాతనల ననుభవించుచున్న జీవుడు ఏనాటికైనను వివేకమను శ్రీరామచంద్రుని ఆశ్రయించనిచో అతని హృదయమను దండకారణ్యము ఎన్నటికిని నిష్కంటకము కానేరదు. తత్ఫలితముగ అతడు కామాది దానవుల ప్రతాపముచే సతమతమైపోవుచు పరమ అశాంతిని బడయుచుండును.

> కోఽహం కథమిదం చేతి యావన్న ప్రవిచారితమ్
> సంసారాడమ్బరం తావదన్ధకారోపమం స్థితమ్.
>
> (వసిష్ఠగీత)

"నే నెవరను? ఈ జగత్తు ఏప్రకారము ఏర్పడినది" అని మనుజు డెంతవఱకును విచారింపడో అంతవఱ కాతనికి ప్రపంచమంతయు చీకటిగనే (దుఃఖమయముగనే) యుండును. అని వసిష్ఠమహర్షి శ్రీరామచంద్రునకు బోధించెను. మఱియు

ప్రపంచమున సత్యవస్తువు లేనిచో అసత్య వస్తువుకొఱకు ప్రాకులాడుటలో కొంత అర్థము కలదు. కాని సత్యవస్తువు తనకు అతిసమీపముగనే తన హృదయాంతరాళములో విరాజిల్లుచుండగా అసత్యమగు నామరూపముల వెంట పరుగెత్తుట హాస్యాస్పదమే యగును. కాబట్టి విజ్ఞుడగువాడు బాగుగ యోచించి, ప్రజ్ఞయను దీపము నాశ్రయించి, తన హృదయగుహాయందు బహుకాలమునుండి దాగియున్న రక్కసులను చీల్చి చెండాడి, వారిని అటనుండి తరుమగొట్టి, హృదయమును ఆసురవర్జితముగ గావించుకొనవలెను. తన హృదయమను దండకారణ్యమునందు నిత్యానిత్యవస్తు వివేకమను శ్రీరామచంద్రుని ఆహ్వానించి ఆ కోదండధరుని ధాటిచే హృదయక్షేత్రమును కామాది శత్రుశూన్యముగ నొనర్చుకొనవలెను, నిష్కంటకముగ గావించుకొనవలెను, సత్యాహింసా శమదమాది సద్గుణరూప మునీశ్వర సంయుక్తముగ నొనర్చుకొనవలెను. అత్తఱి జీవునకు కలుగు ఆనందము అపారము. ఆతనికి కలుగు శాంతి అనంతము. అదియొక దివ్యానుభూతి. అట్టి మహత్తర లక్ష్యమునకై మానవ జీవితము అంకిత మొనర్పబడవలెను.

## దుర్గుణజయోపాయములు

మనస్సునందు అనేకజన్మలనుండి బాగుగ పేరుకొనిపోయి, నిగూఢములై యున్న దుర్గుణములను తొలగించుటకు సాధకుడు కొన్ని యుక్తులను ఉపాయములను అవలంబించ

వలసియుండును. ఆ ఉపాయములు భాగవతమునందు ఈ క్రిందివిధముగ చక్కగ వర్ణింపబడియున్నవి.

అసంకల్పాజ్జయేత్కామం క్రోధం కామ వివర్జనాత్
అర్థానర్థేక్షయా లోభం భయం తత్త్వావమర్శనాత్.
(భాగవతము 7-15-22)

"సంకల్పములను వదలివేయుటద్వారా కామమును, కామమును (కోరికలను) త్యజించుటద్వారా క్రోధమును, ప్రాపంచికవస్తుసంపదలయందు అనర్థమును చూచుట ద్వారా లోభమును, తత్త్వవిచారణచే భయమును జయించవలయును" అని ఈ శ్లోకముయొక్క తాత్పర్యము.

ఈ శ్లోకము భాగవతమునందలి సప్తమస్కంధములో పదునైదవ అధ్యాయమందు కలదు. నారదుడు ధర్మరాజునకు మోక్షప్రాప్తికి వలసిన సాధనల నుపదేశించుచు ఈ శ్లోకమును చెప్పెను. దీనియందు కామ, క్రోధ, లోభ, భయములను నాలుగు దుర్గుణములను మనుజు డెట్లు జయించగలడో ఆ పద్ధతులు పేర్కొనబడినవి.

1. కామము :- సంకల్పమును వదలివేయుటద్వారా దీనిని జయించవచ్చును.

2. క్రోధము :- కోరికలు లేకుండుటచే ఇది వశపడును.

3. లోభము :- ప్రాపంచికసంపదలందు అనర్థమును వీక్షించుటద్వారా దీనిని జయించవచ్చును.

4. భయము :- తత్త్వవిచారణచే ఇది తొలగిపో గలదు. ఈ నాలుగు దుర్గుణములను గూర్చి యిపుడు బాగుగ విచారించెదము.

కామము :-

శ్లో॥ కామం జానామి తే మూలం సంకల్పాత్త్వం హి జాయసే
న త్వాం సంకల్పయిష్యామి సమూలస్త్వం వినశ్యసి.

"ఓ కామమా! నీ 'అంతు' నే నిపుడు కనుగొంటిని. సంకల్పమునుండియే నీవు పుట్టుచున్నావు. నిన్ను నే నిక సంకల్పించను. కావున నీవు సమూలముగ నశించిపోగలవు" అని పూర్వము కచుడను మహర్షి పలికిన చందమున కామము సంకల్పమునుండియే ఆవిర్భవించునుగావున కామ జయమునకు ఉపాయము (కామ) సంకల్పత్యాగమే అయి యున్నది. శ్రీకృష్ణపరమాత్మయు గీత రెండవ అధ్యాయ మందు "విషయములనుగూర్చి సంకల్పించుటవలన వానితో మనుజునకు సంగమేర్పడగలదనియు, అట్టి సంగమువలన కామ ముద్భవించగలదనియు (సఙ్గాత్సంజాయతే కామః) స్పష్ట ముగ బోధించియున్నారు. కాబట్టి కామావిర్భావమునకు తత్సంబంధమైన సంకల్పమే మూలకారణము. విచారణాబల ముచే అట్టి సంకల్పమును విడనాడుటచే ఇక కామమునకు బీజము నశించినట్లే యగును. దానిచే నయ్యది సమూలముగ ధ్వంసమైపోవును. కాబట్టి కామమువలన అనర్థమే వాటిల్లు నను వివేకముగల్గి తత్సంబంధమైన సంకల్పము హృదయ

మున అసలు పుట్టకుండగనే చూచుటవలన కామము సంపూర్ణముగ జయించి వేయబడుచున్నది.

జీవులకు కామమును దుర్గుణము మోక్షమార్గమున మహాప్రతిబంధకమై యున్నది. అది 'మహాశన' మని, మహా పాపజనకమని గీతయందు వర్ణింపబడినది. అనగా ఎంత అనుభవించినను తృప్తిలేనిదనియు, మహాపాపమును గలుగ జేయుననియు అర్థము. అది నరకద్వారమనిగూడ భగవాను డొకచోట పేర్కొనియుండెను. కాబట్టి అద్దానిని జయించుట అత్యావసరమై యున్నది. దానినిగూర్చిన సంకల్పమును గావింపకుండుటయే తజ్జయోపాయమని ముముక్షువు లెఱింగి, ఈ ప్రకారముగ తమ హృదయకుహరమునుండి కామమును పెకలించివేసి పరమశాంతిని అనుభవించవలయును.

క్రోధము :- కామ క్రోధ లోభములను నరకద్వారముల మూడింటిలోను రెండవది క్రోధము. ఇదియు గొప్ప దుర్గుణము. కామమువలె నిదియు రజోగుణ జనితమైనది. క్రోధము ప్రవేశించినపుడు మనస్సు కల్లోలముతో గూడి మహావిక్షేపయుక్తముగ నుండును. 'కామాత్క్రోధోఽభిజాయతే' అనునట్లు సామాన్యముగ క్రోధము కామము నుండియే ఆవిర్భవించుచుండును. కావున క్రోధమును జయించవలెననిన దానికి హేతువగు కామమును తొలగించుకొనవలయును. ఈ రహస్యమే 'క్రోధం కామ వివర్జనాత్' అను భాగవతశ్లోకమునందు తెలుపబడినది. క్రోధమునకు కామము బీజము కావున కామము తొలగుటచే

క్రోధమున్ను తొలగుచున్నది. కాబట్టి క్రోధజయోపాయము కామనాత్యాగమే అయియున్నది.

ముముక్షువగువాడు క్రోధమునుగూర్చి ఈ క్రిందివిధముగ సంబోధించవలయును.

'ఓ క్రోధమా! ముముక్షువులమైన మాకు నిన్ను జూచినచో ఏ విధమైన భీతి ఉండబోదు. అక్రోధమను సుగుణమును ప్రయత్నపూర్వకముగ అభ్యసించుచున్న మాకు క్రోధమను నీవు చుక్కెదురు అయినప్పటికిని, నిన్ను జయించుటకు కావలసిన పరికరములన్నియు మాయొద్ద నిలవయుండుటచే నీబోటి వారెందఱు వచ్చినను మాకు దిగులు లేదు. నీవు నీ చుట్టములగు కామము, లోభము, ద్వేషము, రాగము మొదలైన వారందఱిని తీసికొనివచ్చినప్పటికిని మహాత్ముల సాంగత్యము చక్కగా చేసియున్న మాకు నీవేలాటి అపకారమున్ను చేయజాలవు. క్రోధమా! నీ ప్రతాపము అవివేకులయొద్దనే చెల్లును. వివేకవంతులదగ్గఱ, భగవద్భక్తులదగ్గఱ నీ ఆటలు సాగవు. నీ పప్పులు వారిదగ్గఱ ఉడకవు. వారు అహోరాత్రములు బహుజాగరూకులై దైవసంపత్సమేతులై నీబోటి అసురసంప్రదాయులను దఱికి జేర్చకుందురు. అంతియేకాదు, దూరముగ గెంటివేయుదురు కూడను. రామనామము, కృష్ణనామము, శివనామము మున్నగునవి సదా జపించుచుండు పరమభాగవతోత్తముల కడ నీపస చెల్లదు. కాబట్టి పలాయనము చిత్తగింపుము.'

ఓ క్రోధమా! గీతయందు శ్రీకృష్ణపరమాత్మ నీవు రజోగుణసముద్భవుడవని, జ్ఞానులకు నిత్యవైరివని, నరక ద్వారమని వర్ణించి చెప్పెను. కాబట్టి ఇప్పటికైనను బుద్ధి తెచ్చుకొని ఎవరినీ బాధింపక, ఎక్కడనైనా ఏకాంతమునకు బోయి కాలము గడపుము. భక్తజనులుండు చోటునకు నీవు రానేవద్దు. వచ్చితివా నీకు తగినశాస్తి జరిగియే తీరును. ఏలయనగా, నిన్ను జయించుటకు వారిదగ్గర చక్కని ఆయుధములు సమకూడియున్నవి. ఆ ఆయుధము లెవ్వియని అడిగెదవేమో, కొన్నిటిని మచ్చుకు చెప్పెదను వినుము —

(1) ఎవరికైనను క్రోధము వచ్చినచో వెంటనే నవ్వుట.

(2) అందఱును భగవత్స్వరూపులే కాబట్టి ఇక ఎవరి మీద క్రోధము? అని తలంచుట.

(3) క్రోధముపై క్రోధమును జూపుట.

(4) క్రోధమను భూతసికరంగము వచ్చి రాకమునుపే దానిని సాక్షిగ గమనించి తొలగించివేయుట.

(5) జీవితము క్షణికము కాబట్టి బ్రతికిన కొద్దిరోజులు భగవత్స్మరణచేయక 'ఈ పాడు వికారము లేమి?' అని తలంచి సిగ్గుపడుట. ఈప్రకారముగా భక్తజనులు చక్కటి ఆయుధములను సమకూర్చుకొని క్రోధమగు నిన్ను పరి మార్చుటకై సిద్ధముగ నున్నారు. కావున వారి జోలికి పోకుము.

ఈ ప్రకారముగ క్రోధమునకు హెచ్చరిక చేసి ముముక్షువు అద్దానిని దరికి చేర్చరాదు. కోపము కల్లు వంటిది. అది మనుజునియందు ప్రవేశించునపుడు ఆతని స్వరూపస్వభావములే మారిపోవును. ముఖము వికృతమగును. చిత్తము వికలత్వమును జెందును. క్రోధముయొక్క ఉద్రేకము శరీరమునందలి నరముల క్రమమును చెడగొట్టును. సూక్ష్మశరీరముపై ఒత్తిడిని కలుగజేయును. మనస్సునందు కలిగెడు కోపావేశముయొక్క ఫలితము కొద్దికాలములో ఒకవేళ తగ్గిపోయినను ఆ స్పందనము (Mental wave) కొన్నిరోజులవఱకు, లేక కొన్ని వారములవఱకు లింగశరీరమందు నిలిచియుండును. ఆ పుండు మానుటకు చాలాకాలము పట్టును. ఈ ప్రకారముగ కోపముయొక్క దారుణఫలితములను తెలిసికొని విజ్ఞుడగువాడు దానికి ఆహుతి కాకుండ చూడవలయును. క్రోధమును అరికట్టుటకు క్రింది ఉపాయములను అవలంబించవచ్చును.

(1) కోపముయొక్క ఆవిర్భావము ఎపుడు సంభవించునో కడుజాగ్రతగ గమనించుచునుండి, అది ప్రవేశించక ముందే హెచ్చరికతో దానిని లోనికి రానీయక చూడవలెను. విచారణచే దానిని తరుమగొట్టవలెను. ఇది ఉత్తమోత్తమపద్ధతి. కోపము ప్రవేశించినపిదప వెంటనే దానిని తొలగించుట మధ్యమపద్ధతి. కోపము ప్రవేశించి, చాలసేపు బాధించిన వెనుక దానిని పోగొట్ట యత్నించుట అధమపద్ధతి.

(2) క్రోధముయొక్క తరంగములు పుట్టినవెంటనే కనిపెట్టి క్షమ, ప్రేమ, దయ, సహనము ఇత్యాది సుగుణ సంపత్తిచే దానిని నివారించవలెను. చిత్తము ఆ దుష్టవికార ముచే ఏమాత్రము కదలిక లేకుండునట్లు, సమరూపముగ నుండునట్లు (Poise) ప్రయత్నించవలెను.

(3) అందఱును భగవత్స్వరూపులే యను భావన గాని, ఆత్మస్వరూపులే యను నమ్మకముగాని యుండవలెను. అపుడు క్రోధావిర్భావమునకు అవకాశమే లేదు (తత్రకో మోహః...)

(4) కోపమను వృత్తితో తాదాత్మ్యము నొంద రాదు. సాక్షిగా ఉండి దానిని వీక్షింపవలెను. అపుడు క్రమ ముగ దానంతట నదియే తొలగిపోవును.

(5) ఎవరైన దూషించినచో, అది మన మంచి కొఱకే యని తలంచవలెను. దూషింపదగిన పొరపాటు ఉన్నచో, దానిని పోగొట్టుకొనుటయు, అకారణముగ దూషించినచో, 'ఇది నా సహనశక్తిని పరీక్షించుట కొరక అవకాశ' మని తలంచియు, చిత్తమునందు ఏ వికారమున్ను రానీయక శాంతముగా నుండవలెను.

(6) కోపము వచ్చినపుడు ఆ చోటువిడిచి మఱియొక చోటికి వెళ్లుట మంచిది. అచట ప్రశాంతముగ అన్నియు ఆలోచించుకొనవచ్చును.

(7) కోపము కలిగినపుడు చన్నీళ్ళస్నానము చేయుటయో, లేక ఒకటి, రెండు, మూడు అని ఈ ప్రకారముగ ఇఱువదివఱకు సంఖ్యలు లెక్కపెట్టుటయో జరిపిన, అది కొంత శమించవచ్చును.

(8) కోపము వచ్చినవారు అద్దము చూచుకొనినచో, వారి వికారవంతమగు స్వరూపము వారికే సిగ్గు కలుగజేయు గలదు. మానవుడు దానవుడుగా మారిపోవుట అత్తఱి గమనించగలడు.

(9) క్రోధమునకు పుట్టినిల్లు కామము. కామమువలన క్రోధము జనించును. (కామాత్క్రోధోఽభిజాయతే). కాబట్టి కోరికలు తగ్గించుకొనినచో, లేక పూర్తిగ తొలగించుకొనినచో ఇక క్రోధావిర్భావమునకు అవకాశముండదు.

(10) నవ్వుగాని, పాటగాని సత్త్వగుణస్థితియందు సంభవించును. కోపము రజోగుణమువలన కలుగును. కాబట్టి కోపము వచ్చినపుడు ఒకపాట పాడుటయో, లేక నవ్వుటయో ఒనర్చిన ఆ వికారమును రూపుమాపవచ్చును.

(11) కోపము కలిగినపుడు సాధకుడు వెంటనే 'శత్రువును పట్టుకొనుటకు, నాయొక్క సంయమనశక్తిని, సహనశక్తిని దిగ్దర్శన మొనర్చుటకు ఇదియే తగిన వేళ' అని నిశ్చయించుకొని పొంచియుండి, అది రాగానే విచారణాదులచే దానిని తత్క్షణమే అరికట్టివేయవలెను.

(12) కోపమునకు ఆశ్రయమొసంగినచో ఘోరపాపమును మూటకట్టుకొనినట్లే అను విశ్వాసముగలిగి, పాపభీతి గలవాడై దానిని దరికి చేర్చకుండ చూడవలెను.

(13) గీత రెండవ అధ్యాయమున 62, 63-వ శ్లోకములందు క్రోధముయొక్క విపత్కరపరిణామములను భగవానుడు చెప్పినవానిని అపుడపుడు బాగుగ మననము చేయుచు, ఆ క్రోధరూపభయంకర దుర్గుణపిశాచమును దరికి జేర్చనీయక కడుజాగరూకుడై మెలగవలెను.

1 ధ్యాయతో విషయాన్......

2 క్రోధాద్భవతి...... (గీత 2-62, 63)

ఇక లోభమునుగూర్చి విచారించెదము. నరకద్వారములలో మూడవదియగు లోభము, సంపదలందు, భోగములందు, ప్రాపంచిక వస్తుజాలమందు అనర్థమును వీక్షించుట వలన తొలగగలదు. ప్రాపంచిక వైభవములు జీవుని భోగవిలాసములలోనికి దింపి భగవంతునకు దూరునిగ నొనర్చుచున్నవి. ఇక్కారణమున అవి అనర్థకరములే యగును. ఈ సత్యము నెఱుగుటవలన ఇక జీవుడు వానిని ఆశింపక తనకున్న సంపదలలో కొంతభాగమును దీనులకు, దరిద్రులకు అన్నాతురులకు త్యాగమొనర్చును. మఱియు అపు డాతనికి లోభబుద్ధి అంతరించును. సంగ్రహబుద్ధి తొలగిపోవును. కాబట్టి లోభ జయోపాయము దృశ్యవస్తువులందు, సంపదలందు, భోగవిలాసములందు అనర్థమును వీక్షించుటయే యగును.

భయము:—'తాను దేహమని' తలంచుటచే జీవునకు భయము కలుగుచున్నది. 'తాను దేహము కాదు ఆత్మయే' అని తలంచుటవలన జీవునకు నిర్భయత్వము కలుగుచున్నది.

రజ్జుసర్పవదాత్మానం జీవం జ్ఞాత్వా భయం వహేత్
నాహం జీవః పరాత్మేతి జ్ఞాతశ్చే న్నిర్భయో భవేత్.

(ఆత్మబోధ)

"త్రాటియందు సర్పమువలె తన్ను జీవుడని భావించుటవలన మనుజునకు భయము కలుగుచున్నది. 'నేను జీవుడనుకాను పరమాత్మను' అని యెఱుఁగుటవలన నిర్భయత్వము కలుగుచున్నది" అని శ్రీ శంకరభగవత్పాదాచార్యులు ఆత్మబోధయందు తెలిపిన చందమున దేహభ్రాంతియే, జీవభ్రాంతియే భయమునకు మూలమై యున్నది. తత్త్వవిచారణచే, తాను శాశ్వతమగు ఆత్మయేకాని నశ్వరములగు దేహాదులు కాదని జీవు డెప్పు డెఱుగునో, అప్పుడాతనికి అపరిమిత నిర్భయత్వము కలుగగలదు. 'భయం తత్త్వావమర్శనాత్' అని ఈ శ్లోకమందు తెలుపబడిన దాని భావమిదియే అయియున్నది. కాబట్టి వివేకవంతుడు చక్కగ ఆత్మానాత్మవిచారణమును గావించుకొని, దేహభ్రాంతిని వీడి, అఖండసచ్చిదానందపరమాత్మయే తానని యనుభూతమొనర్చుకొని భయమను పెనుభూతమును హృదయమునుండి సంపూర్ణముగ పారద్రోలవలెను.

ఈ ప్రకారముగ కామ, క్రోధ, లోభ, భయములను దుష్టచతుష్టయమును, పైన పేర్కొనిన యుపాయము

లచే జయించివైచి హృదయమును నిష్కంటక మొనర్చి ఆత్మానందమును, పరమశాంతిని అనుభవించవలయును.

1. అన్వీక్షిక్యా శోకమోహౌ దమ్భం మహదుపాసయా
యోగాన్తరాయాన్ మౌనేన హింసాం కాయాద్యనీహయా.
(భాగవతము 7-15-23)

2. కృపయా భూతజం దుఃఖం దైవం జహ్యాత్ సమాధినా,
ఆత్మజం యోగవీర్యేణ నిద్రాం సత్త్వనిషేవయా. (7-15-24)

తత్త్వవిచారణచే శోకమోహములను, మహనీయుల నుపాసించుటచే (వారియొక్క సేవాప్రార్థనాదులచే) దంభమును. మౌనముచే యోగవిఘ్నములను, శరీరాదులను చేష్టింపకుండుట ద్వారా హింసను, దయచే భూతజనిత దుఃఖమును, సమాధినిష్ఠచే ఆధిదైవిక పరితాపములను, యోగబలముచే ఆధ్యాత్మిక దుఃఖములను, సాత్త్వికాహారాదుల సేవనముచే నిద్రను జయించవలెను.

భాగవతమునందలి సప్తమస్కంధమున నారదుడు ధర్మరాజునకీ ప్రకారముగ దుర్గుణములను జయించు వివిధ మార్గములను సూచించెను. చిత్తశుద్ధిని బడయనిచో మనుజుడే కాలమందును పరమాత్మ సాక్షాత్కారమును బొందజాలడనుట నిక్కము. కాబట్టి ముముక్షువు మొట్టమొదట తనయందలి దుర్గుణములను అనవరతసాధనచేతను, పెక్కు యుక్తులచేతను ఎట్లైన జయించివేయవలయును. భావశుద్ధియే జ్ఞానసిద్ధికి కారణము. ఇకారణమున చిత్తశుద్ధి నిమిత్తము దుర్గుణజయోపాయములను మనుజుడు క్షుణ్ణముగ

నెఱిగియుండవలెను. ఆ యుపాయముల నిచట కొన్నిటిని విచారించెదము.

(1) శోకమోహములు :- శోకమోహములకు కారణము అవిద్యయే. తన స్వరూపమును బాగుగ తెలిసికొనజాలకపోవుటయే దుఃఖమునకు హేతువు. తాను వాస్తవముగ సచ్చిదానంద పరబ్రహ్మమే కాని పాంచభౌతిక జడ సంఘాతము కాదను సత్యము నెఱింగిన వాడిక శోకమునుగాని, మోహమునుగాని యెట్లు పొందగలడు. కనుకనే శోకమోహములను జయించుటకు తత్త్వజ్ఞానమే (ఆత్మ విచారణయే) ఏకైక ఉపాయము.

(2) దంభము :- దంభము, అభిమానము, గర్వము- ఇవియన్నియు దాదాపు ఒకే తరగతికి జెందిన దుర్గుణములు. మహనీయులయొక్క సాంగత్యముచే అవియన్నియు పటాపంచలై పోగలవు. పెద్దలను సేవించుటవలన, వారిని ఉపాసించుటవలన మానవుడు తనయొక్క అహంకారమును రూపుమాపకొనగలడు. భౌతికశక్తి యెంత గొప్పదైనను ఆధ్యాత్మికశక్తి ముందు తీసికట్టేయగును. కావున మనుజుడు ప్రాపంచికముగ ఎంత సమున్నతస్థానమును అక్రమించి యున్నను, పరమార్థ విజ్ఞానానుభూతిని బడసిన మహాత్ముల చెంత నాతడు గణనకు రానివాడే యగును. ఈ సందర్భమున భర్తృహరి పలికిన పలుకులు ఉల్లేఖింపదగియున్నవి—

యదా కించిజ్జ్ఞోఽహం ద్విప ఇవ మదాన్ధః సమభవం
తదా సర్వజ్ఞోఽస్మీత్యభవదవలిప్తం మే మనః
యదా కించిత్కించిద్బుధజనసకాశాదవగతం
తదా మూర్ఖోఽస్మీతి జ్వర ఇవ మదో మే వ్యపగతః.

"వాస్తవముగ నాకేమియు తెలియనపుడు నా కంతయు తెలియుననెడి అహంభావము గలిగియుండి నేనే సర్వజ్ఞుడనని భావించుచు ఏనుగువలె మదాంధుడనై యుంటిని. కాని యెపుడు మెల్లమెల్లగ నేను మహాత్ములయొక్క సాంగత్యము నవలంబించుచు వచ్చితినో, అపుడు నేను 'సర్వజ్ఞుడను కాను, అల్పుడనే' అను విషయము చక్కగ బోధపడగా, నా మదమను జ్వరము తొలగిపోయెను"— కాబట్టి మహనీయుల సేవాశుశ్రూషచే, ప్రార్థనాదులచే జీవులయొక్క దంభాహంకారాది దుర్గుణములు తొలగి పోగలవు.

(3) <u>యోగవిఘ్నములు</u> :— యోగవిఘ్నములను ధ్యానముచే జయించవలెనని ఇచట (భాగవతమున) తెలుపబడినది. ధ్యానము రెండు విధములు—(1) బాహ్యధ్యానము (2) మనోధ్యానము—అని. సహనముకల్గి సుఖదుఃఖములకు ఏమాత్రము బెదరక, ధ్యానముతో, సమభావముతో భగవద్విశ్వాసముతో విఘ్నములన్నిటిని అధిగమించవలెనని యిట సూచింపబడినది. 'మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి' 'నాయందు చిత్తమును నెలకొల్పినచో నా యనుగ్రహముచే నీవు సమస్త ఆపదలను, విఘ్న

ములను దాటివేయగలవు' అను భగవద్వాక్యానుసారము దైవ విశ్వాసముగలవారు, మౌనముతో సుఖదుఃఖములను సహించుకొనువారు, క్రమముగ ఆయా ద్వంద్వములను, విఘ్నములను దాటివేయగలరు.

(4) <u>హింస</u> :- శరీరాదులను చేష్టింపకుండుటద్వారా హింసను జయింపవలెను. 'శరీరాదుల'ను పదముతో ఇంద్రియ, మనోబుద్ధులు కూడ చేరియున్నవి. ఏ క్రియకైనను కారణము మనస్సే యగును. ఆ మనస్సు (తన సంస్కారము ననుసరించి) శరీరేంద్రియములచే తత్కార్యములను (పుణ్యాపాపములను) చేయించుచుండును. వివేకము నాశ్రయించి మనస్సును దుష్టసంస్కార రహితముగ నొనర్చినచో, ఇక నయ్యది శరీరాదులచే ఆయా పాపకార్యములను చేయించకుండును.

(5) <u>భూతజనిత దుఃఖము</u>:—భూతకోట్లచే తనకు గలుగు దుఃఖమును సాధకుడు 'దయ' యను సద్గుణము నభివృద్ధిపఱచుకొనినచో జయింపవచ్చును. దయాశీలున కెవని యందును ద్వేషముండదు. తన కపకారము చేసినవానిని గూడ దయాదృష్టితో నతడు వీక్షించి క్షమించుచుండును. కావున అట్టి కరుణామయులను, దయావంతులను భూతజనిత దుఃఖమేమియు బాధింపకుండును. దయాదిసద్గుణములచే వారట్టి దుఃఖమును సంపూర్ణముగ అధిగమించివేయుదురు.

(6) ఆధిదైవిక ఆధ్యాత్మిక పరితాపములు :- సమాధి నిష్ఠచే అధిదైవిక పరితాపములను, యోగబలముచే ఆధ్యాత్మిక దుఃఖములను జయింపవలెనని నారదులు ధర్మజున కెఱింగించెను. సామాన్యముగ దుఃఖములు మూడు విధములుగ చెప్పబడుచుండును——(1) ఆధ్యాత్మిక (2) ఆధిభౌతిక (3) ఆధిదైవికములని-రోగములు, మనోవికారములు మున్నగునవి ఆధ్యాత్మిక దుఃఖములనియు, భూతకోట్లవలన కలుగునవి ఆధిభౌతిక దుఃఖములనియు, వర్షాభావము మున్నగునవి ఆధిదైవిక దుఃఖములనియు పేర్కొనబడును. అందు ఆధిభౌతిక దుఃఖములను దయాదిసద్గుణసంపత్తిచే జయింపవలెను. సమాధినిష్ఠచే ఆధిదైవిక సంతాపములను, యోగబలముచే ఆధ్యాత్మిక క్లేశములను జయించవలెను. సమాధినిష్ఠుడు తన ఇంద్రియమనంబులను దృశ్యవిషయములనుండి, ప్రపంచక్షేత్రమునుండి మరల్చి అంతర్ముఖ మొనర్చి ఆత్మయందు స్థాపించును గావున ఇక నాతనికి భౌతికజగత్తునకు సంబంధించిన సంతాపము లెవ్వియు నుండనేరవు. కావున తద్దుఃఖ నివారణార్థము మనుజుడు సమాధినిష్ఠను, ఆత్మసంస్థితిని తప్పక అభ్యసించవలెను. అట్లే యోగాభ్యాసము చేతను ప్రాణాయామాదులచేతను, రోగాది దుఃఖములను, మనోవికారములను జయించివేయవలెను.

రజస్తమశ్చ సత్త్వేన సత్త్వం చోపశమేనచ
ఏతత్సర్వం గురౌ భక్త్యా పురుషోహ్యంజసా జయేత్.

(భాగవతము 7-15-25)

"రజోగుణ, తమోగుణములను సత్త్వగుణముచే జయించివేయవలెను. (నిర్వికల్పాత్మస్థితియను) ఉపరతి ద్వారా సత్త్వగుణమును దాటిపోవలెను. దుర్గుణములన్నింటిని సాధకుడు గురుభక్తియొక్క సాహాయ్యముచే శీఘ్రముగ జయించివేయగలడు."

భాగవతసప్తమస్కంధములోని పదునైదవ అధ్యాయమున నారదుడు ధర్మరాజునకు మోక్షప్రాప్తికి వలసిన సాధనముల నుపదేశించుచు దుర్గుణసమూహము నెట్లు జయించివేయవలెనో ఈ ప్రకారముగ విశదీకరించి చెప్పెను. అంతఃకరణము నిర్మలముగ నుండిననేతప్ప ఆత్మసాక్షాత్కార మెవరికిని కానేరదు. కావున దానియందలి దోషములన్నిటిని సాధకుడు బాగుగ పరిశీలించి, ఒక్కొక్కదానిని వివేకముయొక్క సహాయముచే లెస్సగ తొలగించి వేయవలెను.

రజోగుణ తమోగుణములు పరమార్థ లక్ష్యసంసాధనయందు గొప్ప ప్రతిబంధకములై యున్నవి. వానిని ముముక్షువు దూరీకరించవలెను. వానిని తొలగించివేయు మార్గమిచట తెలుపబడినది. సత్త్వగుణసంపాదనమే ఆ మార్గము. ఋణము పోవలెననిన ధనము నెట్లు సంపాదించవలెనో, అంధకారము తొలగవలెననిన ప్రకాశావిర్భావ మెట్లేర్పడవలెనో, అట్లే రజోగుణ, తమోగుణరూప దుష్టద్వయ మంతరించవలెననిన, సత్త్వగుణరూప సల్లక్షణమునే జీవు డాశ్రయించవలెను.

అధికనిద్ర, మత్తు, సోమరితనము (ఆలసత్వము) మున్నగునవి తమోగుణలక్షణములు. కామక్రోధాది దుర్గుణములు రజోగుణలక్షణములు. కరుణ, దయ, ప్రేమ, పరోపకారము మున్నగునవి సత్త్వగుణలక్షణములు. కావున సత్త్వగుణలక్షణములైన దైవికగుణములను జీవు డాశ్రయించి రజోగుణ తమోగుణ లక్షణములను హృదయమునుండి పారద్రోలవలెను. పాపమును గెంటివేయుగల సామర్థ్యము పుణ్యమునకు గలదు. కావున జీవుడు మొట్టమొదట పుణ్యసంపత్తి నాశ్రయించవలెను. "రజస్తమశ్చ సత్త్వేన" అను భాగవత వాక్యముయొక్క భావమిదియే అయియున్నది.

అయితే కేవలాత్మస్థితియందు, అనగా నిర్వికల్ప సమాధియందు జీవుడు సత్త్వగుణమును గూడ దాటివైచి గుణాతీతస్థితిని, లేక నిర్గుణస్థితిని బడయును. అత్తఱి శుభాశుభ సంకల్పము లెవ్వియు లేక కేవలము నిస్సంకల్పస్థితి, ఆత్మస్థితియే జీవున కుండును. అది సర్వోత్తమ దశయని యెఱుఁగవలెను. సత్త్వగుణము పవిత్రవంతమైనను అదియు దృశ్యవర్గమున జేరినదగుటచే ప్రకృతిస్వరూపమే యగును. కావున ఏనాటికైనను మనుజుడు దానినిగూడ దాటివైచి దృక్స్వరూపమగు కేవలాత్మస్థితిని గ్రహించవలెను. అయితే సత్త్వగుణము నిర్మలమైనదియు, ప్రకృతియొక్క శుద్ధాంశము అయియుండుటవలన జీవన్ముక్తులగు మహనీయులు తమ వ్యుత్థానదశయందు ఆ సత్త్వగుణము నాశ్రయించి, దైవీసంపత్తిని జేబూని లోకోపకార కార్యముల నొనర్చు

చుందురు. కావున సాధకుడగువాడు మొట్టమొదట రజస్తమో గుణములను, వాని కార్యములను త్యజించివైచి సత్త్వగుణము వరకు వచ్చి, దానిని లెస్సగ పదిలపఱచుకొనవలెను. ఆ పిమ్మట క్రమముగ అభ్యాసవశమున దానినిగూడ దాటివైచి నిర్గుణ కేవలాత్మస్థితిని బొందవలెను. ఇదియే జీవితలక్ష్యము.

ఇదివఱలో చెప్పిన కామాది దుర్గుణములన్నిటిని మనుజుడు గురుభక్తిచే బాగుగ జయించివేయగలడని పై భాగవతశ్లోకము విశదీకరించుచున్నది. ఏలయనగా, గురుభక్తి పరిపూర్ణముగ గలవాడు గురువాక్యములను కార్యాన్వితమొనర్చుటకై బద్ధకంకణుడై యుండును. గురువు నడచిన పంథాను తానున్ను చక్కగ అనుసరించును. గురువుయొక్క ఆచరణయే తానున్ను గలిగియుండులాగున యత్నించును. కాబట్టి గురుభక్తిగలవాడు దుర్గుణములన్నిటిని అవలీలగ దాటివేయగల్గును. మఱియు గురుభక్తివలన మనుజుడు గురుకృపకు పాత్రుడు కాగల్గును. సర్వేశ్వరునియొక్కయు, సద్గురునియొక్కయు కృపాని శేషముకలవాడు, వారల యనుగ్రహమును జూరగొనినవాడు మాయాబంధమును, ప్రకృతి దాస్యశృంఖలమును సులభముగ ఛేదించివేయగలడు. కావున మోక్షకాంక్షియగు మానవునకు గురుభక్తి, దైవభక్తి అత్యంతావశ్యకములై యున్నవి. దుర్గుణజాలమును విచ్ఛిన్నమొనర్చుటయందు దియ్యవి ప్రముఖపాత్రను వహించుచున్నవి. కావున ముముక్షువు వీనినే కాలమందును వదలరాదు. ఈ ప్రకారముగ పెక్కు ఉపాయములచే జీవుడు తన యందున్న

కామాది దుర్వాసనలను పారద్రోలి, దుర్గుణములను రహిత మొనర్చుకొని, విశుద్ధహృదయుడై బ్రహ్మానుభూతిని బడయ వలయును. దుర్గుణములకు, దుర్వాసనలకు, దుస్సంకల్పములకు తన హృదయమందు ఏమాత్రము చోటీయరాదు. అవి అగ్ని నంటివి. హృదయమును తాపముతో, దుఃఖముతో, అశాంతితో అవి నింపివేయును. కావున శీఘ్రమే ఆ అగ్నులను తొలగించుకొని సంతాపరహితుడై వఱగవలయును.

సామాన్యముగ తాటియాకుమంట త్వరలో చల్లారి పోవును. చింతకట్టెలమంట కొంతసేపుండి మఱల చల్లారి పోవును. భోగిమంట ఒక రాత్రియంతయు మండి తదుపరి ఉపశమించిపోవును. ఏ అగ్నియైనను రగుల్కొల్పిన కొంత సేపటికిని దానంతట నదియే శాంతించిపోవును. కాని రావణ కాష్ఠము మాత్రము ఇంతవరకు చల్లార లేదట. ఇవ్విషయమున ఆశ్చర్యపడవలసిన పనిలేదు. ఎందుకనగా దానిని మించిన అగ్నులు కొందఱి జనుల హృదయసీమలందు ప్రచండవేగముతో జ్వలించుచున్నవి. అవియే కామాగ్ని, క్రోధాగ్ని, అసూయాగ్ని, ద్వేషాగ్ని, రోషాగ్ని మున్నగు నవి. వానిని చల్లార్చవలెనను సంకల్పముగాని, చల్లార్చినచో అనంతానందము తమకు కలుగునను భావముగాని జనులయం దుదయించుటలేదు. ఉదయించెనా కడతేరినట్లే యగుదురు.

దూరముగ అగ్ని ఉన్నపుడు కూడ ప్రమాదమునకు అవకాశముండగా, ఇక దగ్గఱగా, అతిసమీపముననున్నచో వేఱుగ చెప్పవలెనా? తన యంతఃకరణముననే అగ్ని

యున్నచో ఇక శాంతికి ఆస్కారమెచట? దుష్టగుణములను సామాన్యముగ అగ్నితో పోల్చుదురు. అగ్నికి దహించివేయు గుణము కలదు. అట్లే దుర్గుణములు జీవుని చిత్తమును దహించివేసి నరకకూపమున నాతనిని బడద్రోయును. గీత 3 వ అధ్యాయమున కామక్రోధములను గూర్చి చెప్పు ప్రసంగమున భగవానుడు వానిని 'అనలమ్' అని పేర్కొనెను.* 'అనలమ్' అనగా అగ్నియని అర్థము. "కామాగ్నిని, క్రోధాగ్నిని ముందు చల్లార్చివేయుడు! అపుడు ఆత్మజ్ఞానము మీకు చక్కగ లభించగలదు"—అని శ్రీకృష్ణమూర్తి జనులను హెచ్చరించెను. కాబట్టి హృదయమున అట్టి అగ్నులు రగుల్కొనకుండ చూచుట, ఒకవేళ రగుల్కొనినచో జాగరూకతతో వానిని చల్లార్చివేయుట, నశింపజేయుట విజ్ఞుల పరమకర్తవ్యమై యున్నది.

కొందఱు తమ హృదయమును అతినిర్మలముగ గావించుకొని మహాజాగరూకులై కామమునకుగాని, క్రోధమునకుగాని తదితర వికారములకుగాని ఒకింతైనను అవకాశమివ్వకుందురు. వీరు ఉత్తమోత్తములు. మఱికొందఱు క్రోధాది వికారములు తమయందుదయించిన వెంటనే జాగ్రతపడి వానిని తరిమివేయుదురు. వీరు ఉత్తములు. ఇక కొందఱు ఆ యా వికారములు జనించి కొంత దుష్పరిణామము కలిగిన వెనుక తెప్పరించుకొని తదుపరి వానిని ప్రయత్నపూర్వకముగ సాగనంపుదురు. వీరు మధ్యములు. కొందఱు కామ

* దుష్పూరేణానలేన చ.

క్రోధాదు లుత్పన్నమైనపుడు, అజాగ్రతవహించి, ప్రమత్తులై, ఆ దుష్టవికారములను పారద్రోలక, వానికి ఆశ్రయ మొసంగి ఆ దుష్టరాక్షసులను యావజ్జీవితము చక్కగ మేపుచుందురు. అట్టివారు అధములు. జనులలోని ఈ వివిధ సంస్కారములను శాస్త్రకారు డెంత చక్కగ వర్ణించెనో చూడుడు:—

ఉత్తమే క్షణకోపం స్యాన్మధ్యమే ఘటికాద్వయమ్
అధమే తు అహోరాత్రం నీచే తు మరణాన్తికమ్.

"ఉత్తములకు ఎప్పుడైన కోపము వచ్చిన, క్షణకాలము మాత్ర ముండును. తదుపరి సమసిపోవును. మధ్యములకు రెండుఘడియల సేపుండును. అధములకు ఇరువదినాలుగు గంటల కాలముండును. నీచులకు యావజ్జీవితము ఉండి వేధించుచుండును." ఉత్తములకు వచ్చు కోపము నీటిపై వ్రాతవంటిది. నీటిపై అక్షరము వ్రాసినచో వ్రాసిన వెంటనే క్షణమే అంతమైపోవును. మధ్యములకు వచ్చు కోపము ఇసుకపై వ్రాతవంటిది. ఇసుకపై అక్షరము వ్రాసినచో కొంత సేపుండి మరల గాలికి తుడుచుకొనిపోవును. అధములకు వచ్చు కోపము నల్లరాతిపై చెక్కిన అక్షరమునంటిది. అది చాలకాలముండును. కాబట్టి విజ్ఞులగువారు జాగరూకులై ఆ కామక్రోధాది అసురసంపత్తిని దరికి జేరనీయక చూడవలయును.

జీవుడు అజాగ్రతగ నున్నపుడు దుష్టగుణము ఒక చిన్నమిణుగురువలె అంతఃకరణమున ప్రవేశించును. అది

క్రమముగ పెద్దదై, పెద్దదై జ్వాలారూపమును ధరించి తన ప్రచండ తీక్ష్ణత్వముచే ఆ జీవుని, అతని చెంతనుండు తదితరులనుగూడ బాధించును. అత్తతి దానిని చల్లార్చుటయు చాల ప్రయాసగా నుండును. కాబట్టి మిణుగురుగ నున్నపుడే దానిని అంతమొందించివేయవలెను.

మాయ మహాప్రమాదకరమైనది. అది నెమ్మదిగా జీవుని దగ్గఱకు వచ్చి కొద్దిచోటుమాత్రమే ఇమ్మని అడుగును. "Give me room to sit down, and I can make room to lie down" 'నాకు కూర్చొనుటకు చోటిన్వండి, పండుకొనుటకు చోటు నేనే చేసికొనగలను"—అని మాయ మనుజుని అర్థించును. అట్లు అర్థించి ఒకింత నెలవు సంపాదించి, పెరిగి పెరిగి, తుదకు తనకు చోటిచ్చినవానినే అధోగతికి త్రోసివేయును. కావున కామముగాని, క్రోధముగాని, అసూయగాని హృదయములో ప్రవేశించిన వెంటనే కనిపెట్టి, విచారణాబలముచే వానిని సమూలముగ తొలగించివేయువాడు ధన్యుడు. అట్టివాని హృదయము నిష్కంటకమై, నిరావరణమై, నిర్మలమై ప్రకాశించును. అట్లుకాక రావణకాష్ఠమువలె వానిని చల్లారకుండ చేయువాడు ఘోరమగు ఆపత్తును బొందగలడు.

ఆరోగ్యము చక్కగనున్నపుడే, ఈ శరీరము పతనమైపోవుటకు పూర్వమే, ఇంద్రియపటుత్వము బాగుగ నున్నపుడే, జీవుడు తనయందలి ఈ విఘ్నములను రహితమొనర్చు యత్నముల దత్తచిత్తుడు కావలెను. "ప్రాక్శరీరవిమోక్ష

నాత్''—అనగా శరీరము వీడిపోవుటకు ముందుగానే కామ క్రోధాదుల వేగమును అరికట్టగలుగువాడే పరమసుఖమును పొందగలడని గీతాచార్యులానతిచ్చిరి.* ఈ విషాగ్నులు హృదయమున తిష్ఠ వేసికొని యున్నంత కాలము జీవుడు గుహా గహ్వరములందు కాపురము చేసినను, తీర్థస్థానములందు కాలము గడపినను, పరమైకాంతస్థలముల నాశ్రయించినను, పుణ్యక్షేత్రములందు వర్తించినను శాంతిని నోచుకొనలేక యే యుండును. కాబట్టి ఎక్కడో ఒకచోట కూర్చొని, ఆత్మపరిశోధన చేసికొనుచు, తనలో ఏయే రాక్షసులు ప్రవేశించుచున్నారో బాగుగ కనిపెట్టి వివేకదండముచే వారిని తరుమగొట్టుటయే మనుజుడు చేయవలసినపని. 'గమనార్థం తు రక్షసామ్'—అను వాక్యమును స్మృతిపథమున నుంచుకొని ఆ దుష్టదానవ సంఘమునకు తనలో ఏమాత్రము నెలవొసంగక, 'ఆగమార్థం తు దేవానామ్' అను పూజవాక్యమును సదా స్మరించుచు తదనుసారముగ అమానిత్వాది సుగుణరాశిని, దైవసంపత్తును, సురసంఘమును తనలోనికి ఆహ్వానించి, సన్మానించి, సత్కరించి హృదయక్షేత్రమును దివ్యదేవాగారముగ రూపొందించుకొనవలెను. దుర్గుణములకు వీడ్కోలు (Send-off), సద్గుణములకు సత్కారము (Welcome) ఏకకాలమున గావించవలెను.

---

* శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః.
(భ. గీ. 5-23)

ప్రేమయను జలముచే ద్వేషమను అగ్నిని చల్లార్చి వేయవలెను. వైరాగ్యమను శీతల వర్షధారలచే కామమను భీషణ దావాగ్నిని ఉపశమింపజేయవలెను. దయ, కరుణ, సర్వభూతసమత్వము అను తోయముచే అసూయాగ్నిని, ఈర్ష్యాగ్నిని అంతమొందింపజేయవలెను. ఈ ప్రకారముగ ఏదియో యొక ఉపాయముచే, మార్గముచే హృదయస్థ భీకరవిషాగ్నులను చల్లార్చివేయవలెనే కాని రావణకాష్ఠము వలె వానిని ఇంకను ప్రజ్వలించులాగున చేయరాదు. ముముక్షువు లివ్విషయమును సదా జ్ఞప్తియందుంచుకొని ప్రయత్న పూర్వకముగ అసురసంపత్తును తెగటార్చి తమ హృదయ సీమలను దైవసంపద్విలసితములుగ గావించుకొని, సుగుణాన్వితులై పఱగవలయును.

దుర్గుణములలో అసూయ చాల ఘోరమైనది. అ ఒక్క దుర్గుణము తక్కిన సుగుణములనెల్లను సర్వనాశనము చేసివేయగలదు. చెట్టునకు వేరుపురుగు ఎట్లో, సద్గుణసమలంకృతమగు మనస్సునకు అసూయ అట్టిది.

ఒక మహావృక్షము శాఖోపశాఖలుగ విస్తరించి ఫలపుష్పసమన్వితమై కళకళలాడుచు చూపరులకు పరమానందము గొల్పుచు ఉన్నప్పటికిని దానియందు వేరుపురుగు ప్రవేశించినచో అది అకస్మాత్తుగ శుష్కించిపోవును, సర్వాంగసుందరమై విలసిల్లు అ వృక్షరాజమున కపుడు దీన దశ సంభవించును.

అట్లే కొందఱు వ్యవహారరంగమునను, మఱికొందఱు పరమార్థక్షేత్రమునను తమ ప్రయత్నాతిశయముచే మహోన్నతస్థితిని జేబట్టినను, గొప్పస్థాన మలంకరించినను అకస్మాత్తుగ పతనమైపోవుచున్నారు. దీనికి కారణమేమి? వారిలో ఒక వేరుపురుగు ప్రవేశించుచున్నది. అదియే అసూయ. అది ప్రవేశించి వారిలోనున్న సద్గుణరాశినంతను బూడిద పాలుచేసివైచుచున్నది. అపుడు మానవుడు దానవుడుగా రూపొందును. కాబట్టి ముముక్షువులీ పరమశత్రువిషయమై కడుజాగరూకులై మెలంగి అద్దాని నెన్నడును దరికి జేరనీయక చూచుచుండవలెను.

జనులలో మూడుతరగతులవారు కలరు. కొందఱు పరుల ఔన్నత్యమునకు కారకులై, వారు వృద్ధినొందుటను జూచి పరమానందపడుచుందురు. వీరు ఉత్తమతరగతివారు. మఱికొందఱు ఇతరుల అభివృద్ధికి ఏమాత్రము సహాయము చేయక తమ అభివృద్ధినిమాత్రము చూచుకొనుచుందురు. వీరు మధ్యమతరగతివారు. వీరివలన పరులకు ఉపకారము లేకపోయినను అపకారముకూడ లేదు. కావున ఒకవిధముగ మంచివారే యగుదురు. ఇక మూడవతరగతివారు తాము ఉన్నతిని పొందకపోయినను ఒకరి ఔన్నత్యమును జూచి ఓర్చలేరు. వీరు అధములు. ఇట్టి అసూయాపరులవలన సంఘమునకు తీరని కళంకము సంభవించుచుండును. ఇది చాల హేయమైన ప్రవర్తన. అసూయాగ్రస్తుని బాధకు కారణాం

తర మేమియు నుండదు. ఒకరు బాగుపడుటయే అతని ఏడుపు నకు కారణము.

దుర్గుణము లన్నిటిలోను ఈ అసూయ మహాప్రమాద కరమైనది. శ్రీకృష్ణభగవానుడు—

1. ఇదంతు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే.
2. న చా శుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి.

అని గీతయందు వచించినవాడై అసూయపరులకు పవిత్ర మైన శాస్త్రమును బోధించినను నిరుపయోగమగునని సెల విచ్చెను. అసూయ అనునది ఒకవిధమైన కల్లు. అది త్రాగిన వారికి మంచి, చెడ్డ తెలియదు. సర్వభూతములందును వెలుగుచున్న పరమాత్మను వారు గ్రహించజాలరు. పరుల సుఖమును జూచి ఓర్చలేకుందురు. పాత్ర మంచిది, వండిన వారు దక్షులు; అయినను వండిన పప్పుపులుసులును త్రాగి అందఱును వాంతిచేసికొనిరి, కారణమేమి? ఆ పాత్రకు లోన కళాయిలేదు. అది యేవిధమున ఎన్ని సుగుణములున్నను ఒక్క అసూయ యను దుర్గుణమున్నచో వ్యక్తి లోకము నందు పతనమైపోవును. భగవద్దృష్టియందు, లోకులదృష్టి యందు ఆతడు క్రమముగ తన పూర్వపుఔన్నత్యమును గోల్పోవుచుండును.

ఇక, అసూయకు కారణమేమియో విచారించెదము. అజ్ఞానమే దానికి కారణము. ఎదుటివాడు, తాను వేఱు వేఱని తలంచుటయే ఆ దుర్గుణమునకు హేతువు. సర్వుల

యందును ఒకే భగవత్స్వరూపము వెలుగుచున్నదని తెలిసి నపుడు, తన ఆత్మయే సర్వభూతాత్మయని గ్రహించినపుడు ఇక పరులను అత డేల హింసించును? పరుల అభివృద్ధినిజూచి ఏల దిగులు నొందుచుండును?

> యస్మిన్సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః
> తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః.

అను ఈశావాస్యోపనిషన్మంత్ర మీ సత్యమునే వెల్లడించుచున్నది. "ఓ జీవులారా! సమస్తప్రాణికోట్లయందును మీ హృదయాంతర్వర్తియగు ఆత్మయే విరాజిల్లుచున్నదని తెలిసికొనినపు డిక కామముగాని, క్రోధముగాని, శోకముగాని, అసూయగాని ఏల కలుగగలదు?" అని ఆ ఉపనిషత్తు జనులను నిలదీసి యడుగుచున్నది. కాబట్టి సర్వాత్మభావమును చక్కగ అలవఱచుకొని, సర్వత్ర ఏకత్వానుభవము గలవారై జనులు తమయందలి ఈ అసూయాది దుర్గుణరూప పరమశత్రువులను పారద్రోలి జీవితమును నిష్కంటకముగ, శాంతిమయముగ, పరమానందప్రదముగ నొనర్చుకొనవలెను.

ఈ ప్రకారముగ అసూయాది దుర్గుణములను అనేక యుక్తులద్వారా, ప్రయత్నములద్వారా పారద్రోలి మనస్సునందలి 'మల' దోషమును తొలగించి వినిర్మల సరోవరము భంగి స్వచ్ఛముగ గావించుకొనవలెను. మోక్షప్రాప్తికి ఇట్టి మనోనైర్మల్యము పరమావశ్యకమైయున్నది. మఱియు నైర్మల్యముతో బాటు విక్షేపరాహిత్యమున్ను మనస్సునకు

చాల అవసరమైయున్నది. 'మల' దోషముతోబాటు 'విక్షేప' దోషమున్ను తొలగవలెను. ఏలయనగా కుండలోని నీటి యందు సూర్యప్రతిబింబము స్వచ్ఛముగా పడవలెనన్న అ నీరు నిర్మలముగా నుండవలెను. మఱియు అది ఏమాత్రము కదలగూడదు. నీరు నిర్మలముగానున్నను కదలుచుండినచో ప్రతిబింబము స్పష్టముగా కనుపించదు. అట్లే మనస్సునందు పరమాత్మయొక్క ప్రకాశము విస్పష్టముగా భాసిల్లవలె నన్న మనస్సు నిర్మలముగా (పాపరహితముగా) నుండ వలెను, మఱియు నిశ్చలముగా నుండవలెను. మనస్సు విషయములపైకి పరిపరివిధముల పరుగెత్తుచుండినచో, అట్టి నిశ్చలత్వము చేకూరదు. కాబట్టి దృశ్యవిషయములపైకి పరుగిడనీయక, పగ్గములతో గుఱ్ఱములను లాగిపట్టునట్లు, మనస్సును నిగ్రహించవలెను. కావున మోక్షప్రాప్తికి మనస్సంయమము, మనోనిగ్రహము అత్యావశ్యకమై యున్నది. మనస్సును సంయమన మొనర్చుటలో ధ్యాన యోగము లెస్సగ ఉపకరించగలదు. అందుచే ముముక్షు వగువాడు ధ్యానము నెట్లు సలుపవలెనో, ధ్యానయోగము ద్వారా మనస్సు నెట్లు వశీకరించుకొనవలెనో మనస్సు నందలి విక్షేపదోషము నెట్లు తొలగించుకొనవలెనో తెలిసి కొనియుండుట అవసరము.

—•—

# 17 వ అధ్యాయము

## ధ్యానయోగసాధన

### ధ్యానముచేయు పద్ధతి

పరమార్థపథమున పురోగమించు సాధకునకు ధ్యానయోగము అత్యంతావశ్యకమై యున్నది. ఒక వస్తువును గూర్చి ఏకాగ్రనిష్ఠతో ధ్యానించునపుడు ధ్యాతయొక్క చిత్తమంతయు ధ్యేయాకారముగ పరిణమించిపోవును. ఇది ప్రకృతిలో గల నియమము. కీటకము (పురుగు) భ్రమరము (తుమ్మెద)ను నిరంతరము చింతనజేయుటవలన భ్రమరాకారముగ మారుచుండునని లోకప్రతీతి. దీనినే 'భ్రమరకీటన్యాయ' మనియు అందురు. చిత్తము ఒక అద్దమువంటిది. అద్దము తన పురోభాగమున నేది యుండునో దానిని తనయందు ప్రతిబింబింపజేసికొని తద్రూపమును బొందుచుండును. అట్లే చిత్తమున్ను, అసురసంపత్తిని, దయ్యపు స్వభావమును దాని ముందుంచిన చిత్తమా యసురరూపమునే పొందును. దైవసంపత్తిని, సత్త్వగుణస్వభావమును దాని ముందుంచిన చిత్తమా సత్త్వగుణరూపమునే పొందును. కావున పారమార్థికశ్రేయముకోఱకై, నిత్యశుద్ధబుద్ధముక్తమగు హృదయస్థపరమాత్మనే ధ్యానించుచు చిత్తమును అద్దానియందే ప్రతిష్ఠింపజేయవలెనని భగవానుడు గీతలో తెలిపియున్నాడు.

'ఆత్మసంస్థం మనఃకృత్వా న కించిదపి చిన్తయేత్'

'మనస్సును బాహ్యమునుండి మరల్చి అంతర్ముఖ మొనర్చి ఆత్మయందు స్థాపించి ఆత్మేతరమగు ఎద్దానిని చింతింపరాద'ని గీతాచార్యుడు ఆదేశించెను. ధ్యానమందు ఏమిచేయవలెనో ఈ శ్లోకపాదము స్పష్టముగ పేర్కొనినది. ఈ ప్రకారముగ మనస్సు ధ్యాననిష్ఠచే క్రమముగా తన యందలి రజోగుణ, తమోగుణములను, వాసనామాలిన్యమును పారద్రోలి క్రమముగ ధ్యేయాకారమగు ఆత్మ స్వరూపమునే పొందుచున్నది. ఉప్పుకల్లు సముద్రములోపడి సముద్రాకారమును జెందునట్లు సామాన్యమగు చిత్తము ధ్యానాదులచే ఆత్మయందు విలీనమై మహత్తరమగు ఆత్మ రూపముగనే మారిపోవుచున్నది. అదియే మోక్షము. ఈ ప్రకారము ధ్యానము మోక్షప్రాప్తికి హేతుభూతమగుటచే సర్వులకును ఇయ్యది అత్యావశ్యకమై యున్నది. 'జ్ఞానాద్ధ్యానంవిశిష్యతే' (వాచాజ్ఞానముకంటె ధ్యానము ఎన్నియో రెట్లు అధికమైనది) అని భగవానుడు దీని యాధిక్యతను గూర్చి తెలిపియేయున్నారు. కావున అట్టి ధ్యానము నెట్లు శీలించవలెనో ఇపుడు తెలిసికొందము.

గృహమందుగాని, మఠమందుగాని ధ్యానించుట కొకచోటు నెన్నుకొని దానిని చాల పవిత్రముగ నుంచవలెను. "బాహ్యాభ్యన్తరశ్శుచిః" అనునట్లు అంతఃకరణ శుద్ధితోబాటు బాహ్యపరిసరములున్ను శుద్ధముగా నుండునట్లు చూడవలెను. మలినప్రదేశములందుండువారికి మలిన

సంకల్పమే ఉదయించుచుండును. దేవాలయములను ప్రతి రోజు ఊడ్చి, కడిగి, ధూపదీపములు వెలిగించి పవిత్రవంత ముగా నుంచుటకు కారణమేమి? అచట ప్రవేశించినవారికి అందఱికిని ఆ శుచిశుభ్రతలవలన, దైవసాన్నిధ్యమువలన ఉదాత్తభావములు కలుగుటకొఱకే. కనుకనే ధ్యానపద్ధతిని చెప్పుట కుపక్రమించుచు, శ్రీకృష్ణభగవానుడు, 'శుచౌ దేశే' (నిర్మల ప్రదేశమందు) అని సెలవిచ్చెను. దేశే (ప్రదేశమందు) అని సర్వసామాన్యము (general) గ చెప్పుటవలన ఇల్లుకాని, వనముకాని, మఠముకాని, పర్వత గుహకాని ఏదియైనను సరియే ధ్యానమునకు యోగ్యమే యని తెలియుచున్నది. అట్లు కానిచో, 'మఠే ఆశ్రమే, మందిరే' అని చెప్పియుండెడివారు. అట్లు చెప్పలేదు. కాబట్టి గృహస్థాశ్రమమునందున్న వారు ''ఇండ్లలో ధ్యానము జరు గునా?'' అను సందియమేమాత్రము పెట్టుకొనక ఇంటిలో నొక గదిని ప్రత్యేకముగ పూజార్చనాధ్యానాదులకై నియ మించి భగవానుడు తెలిపినట్లు దానిని శుచివంతముగ నుంచుకొనవలయును. దానిని గోమయముతో అలికి, ముగ్గులుపెట్టి, అగరువత్తి, సాంబ్రాణి మొదలగు సుగంధ ద్రవ్యములను వెలిగించి, దీపారాధన గావించి అవతారపురు షులు, మహనీయులు నగువారి పటములతో ఆ ప్రదేశము నలంకరించి దేవమందిరముగ తయారుచేసికొనవలయును. చంటిపిల్లలను లోనికి రానీయగూడదు. ఏలయనగా వారు శబ్దము చేయుదురు. పశువికారములను గలుగజేయు శృంగార

పటములను వేనిని అచట చేర్చరాదు. ఒకవ్యక్తి ఏస్థితియం దున్నాడో, ఏ గుణము నాశ్రయించి యున్నాడో, అతని యింటిలో తగిలించియుండు పటములను చూచి చెప్పివేయ వచ్చును. సత్త్వగుణము నాశ్రయించియుండు వ్యక్తి తన యింటిలో రామకృష్ణాద్యవతారముల యొక్కయు, ఇతర దేవతలయొక్కయు, మహాత్ముల యొక్కయు పటములను తగిలించుకొనును. రజోగుణము నాశ్రయించియుండువాడు ప్రాపంచిక వ్యక్తులయొక్క పటములను తగిలించుకొనును. తమోగుణము నాశ్రయించి యుండు వ్యక్తి పాశవికభావ ములను రగుల్కొల్పు బూతుబొమ్మలను తగిలించుకొని ఆనందించుచుండును. కాబట్టి తరింప నుద్దేశముగల సాధకుడు తన పరిసరములను పునీతముగ నొనర్చుకొని అపవిత్రవస్తువు లను జేర్చక, ఉన్నతభావములకు అవకాశమిచ్చు కార్యము లనే చేయుచు, క్రమముగ ధ్యానమును అభ్యసించవలెను.

ధ్యానము చేయునపుడు సాధ్యమైనంతవఱకు ఒంటరిగ నుండుటయే మంచిది. సామాన్యముగా ఇద్దఱు ముగ్గుఱు కలిసి ఒకేచోట ప్రక్క ప్రక్కన కూర్చుండి ధ్యానము ప్రారంభించినచో, వాడేమి చేయుచున్నాడో చూడవలెనని వీనికి, వీడేమి చేయుచున్నాడో చూడవలెనని వానికి సంకల్ప ములు కలిగి విక్షేపము జనించుచుండును. "ఏక్ నిరంజన్" అను సామెత లోకములో కలదుగదా! మఱియు "దో గడ బడ్" అను విషయమునుగూడ జ్ఞాపకమునం దుంచుకొన వలసియున్నది. కనుకనే గీతాచార్యుడు ధ్యాన మెట్లు చేయ

వలెనో చెప్పుటకు ప్రారంభించుచు 'రహసి స్థితః' (ఏకాంతముగ ధ్యానము సలుపవలయును), 'ఏకాకీ' (ఒంటరిగ ధ్యానింపవలెను) అని హితవు పలికియున్నాడు. కొందఱు ధ్యానించునపుడుకాని, సంధ్యావందనము చేయునపుడుకాని బహిరంగస్థలములందు కూర్చొనుచుందురు. తాను పరమ భక్తుడని నలుగురు తెలిసికొనవలెనని వారి ఉబలాటము. ఇట్టి ప్రదర్శన (Exhibition) స్వభావము ధ్యాతకు ఉండ రాదు. ధ్యానముకాని, ప్రార్థనకాని, జపముకాని. పూజ కాని భక్తునకు భగవంతునకు సంబంధపడిన క్రియయేకాని, దారినపోయేవారితో సంబంధపడినదికాదు, పైగా ఒకరి మెప్పుకొఱకు చేయబడునదియు కాదు. తాను ధ్యానించు చున్నాడని పత్రికలలో పడవలసిన అగత్యమున్ను లేదు. తమ హృదయసాక్షియగు సర్వేశ్వరు డొకడు తెలిసికొనిన చాలును. ఆతనికో, జనులు ఏమూల ధ్యానించినను తెలిసి కొను శక్తి ఉండనే ఉన్నది. కాబట్టి సాధకుడు ఏకాంత ముగ, ఒంటరిగ ధ్యానించుట శ్రేయస్కరము.

మిక్కిలి ఎత్తుగాను, మిక్కిలి పల్లముగాను లేనట్టి స్థానమున (అనగా ఒకింత ఎత్తుగానున్న చిన్నపీట మొద లగువానిపై) దర్భాసనము పఱచుకొని, దానిపై జింక చర్మ మునుగాని, పులిచర్మముకాని వేసికొని, దానిపై గుడ్డపఱచి ఈ ప్రకారముగ మెత్తగ కదలకయుండు ఆస్తరణముపై తనకు అనుకూలమైన ఆసనము వైచికొని కూర్చుండి ధ్యాన మును ప్రారంభింపవలెను.

స్థిరసుఖమాసనమ్

అని పతంజలి నుడివినట్లు ఏ ఆసనము వేసికొనిన తాను కద లక నుండగలడో, ఏది తనకు అనుకూలముగ నుండునో దానినే ధ్యానకాలమున సాధకుడు అవలంబించవచ్చును. అయితే కూర్చొనునపుడు శరీరము, శిరస్సు ఏమాత్రము వంగకుండ నిటారు (Perpendicular) గ నుండవలెను. ఏలయనిన బొడ్డుక్రింద మూలాధారమున నిద్రించుచునుండు కుండలినీశక్తి తీవ్రధ్యానముయొక్క ప్రభావముచే లేచి ఊర్ధ్వముఖముగ ప్రవహింపజొచ్చును. మూలాధారమునుండి బయలుదేరి స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయ, సహస్రారములను షట్చక్రములగుండ అది ప్రవ హించును. అత్తఱి శరీరాద్యవయవములు తిన్నగనున్నచో ప్రవాహము నిరాటంకముగ జనును. వంకరగనున్నచో కొంత ప్రతిబంధము కలుగవచ్చును. కనుకనే శ్రీకృష్ణపర మాత్మ 'సమంకాయ శిరోగ్రీవం' అని పేర్కొనెను. ఈ ప్రకారముగ కూర్చుండి, దృష్టిని ముక్కుచివఱ (నాసికా గ్రమునందు) ఉంచి దిక్కులను చూడకుండ మనస్సును ఏకాగ్రపఱచి పరమాత్మచింతనమును ప్రారంభించవలెను. ధ్యానయోగమునుగూర్చి చెప్పునపుడు గీతయందు నాసి కాగ్రదృష్టి చెప్పబడినది. కొందఱు హృదయస్థానమందు నిలుపుదురు. వేఱొకరు సహస్రారమందు నిలుపుదురు. వారి వారి అనుకూలమునుబట్టి ఏదియో యొకచోటు స్థిరపఱచు కొని అచ్చోట దృష్టినుంచి మనస్సును దృశ్యవిషయములపైకి పోనీయక ఏకాగ్రముగ దైవధ్యానము సలుపవలెను.

కాని కొందఱికి ప్రారంభములో మనస్సు ధ్యేయ వస్తువగు పరమాత్మయందు నిలుకడను బొందక పూర్వ వాసనాబలముచే బయటకు పరువెత్తుచుండును. వారికి పాపము ధ్యానము చేయవలెనను కుతూహలముండునుగాని మనస్సు చంచలముగానున్నదై వేధించుచుండును, లక్ష్యమునందు నిలువక పారిపోవుచుండును. అపుడు సాధకుడేమి చేయవలెను? దానికి శ్రీకృష్ణమూర్తి యిట్లు సమాధాన మొసంగెను.

యతోయతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్
తత స్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్. (6-26)

మనస్సు చంచలముగను, అస్థిరముగనున్నదై ఏ యే విషయములపైకి పరుగెత్తునో; ఆ యా విషయములనుండి దానిని మరల్చి, దానికి బుద్ధిచెప్పి, మరల ఆత్మయందే యుంచవలెను. "లాలయేత్ చిత్తబాలకమ్" అని వసిష్ఠులానతిచ్చినట్లు, చిత్తమును బాలకుని హితవాక్యములచే మెల్లగ లాలించి దారికి తీసికొనిరావలెను. అంతయేకాని బలాత్కారము చేసినచో అయ్యది తిరుగబడును. ప్రతిక్రియ (Reaction) కలుగజేయును. అట్టి మోటుపద్ధతులను ధ్యాననిష్ఠు డెన్నటికిని ఆవలంబించగూడదు.

ఉద్దాలకుడు తన ఇంద్రియములకు, మనస్సునకు ఎంత నయముగ బోధించి వానిని స్వాధీనపరచుకొనెనో సాధకులు జ్ఞాపకమునకు తెచ్చుకొనవలెను. "ఓ మనస్సా! ఓ ఇంద్రియములారా! మీ రేచటికి పరుగెత్తెదరు? విషయముల

పైకా? చాల పొరపాటు. అయితే అది మీ తప్పుకాదు. అనేక జన్మార్జితములగు ప్రాపంచిక వాసనలవలననే మీకట్టి బుద్ధికలుగుచున్నది. ఇంతకాలమువఱకు మిమ్ములను ప్రేరేపించిన యీ బుద్ధి అవిద్యావృత్తమై అంధకారమున బడి యున్నది. ఇప్పుడు సద్గురుకటాక్షమున జ్ఞాన ముదయింప ఆ అవిద్య అంతరించిపోవ వస్తువుయొక్క యథార్థతత్త్వము గోచరించినది. మీరింతగ నభిలషించుచున్న యీ పదార్థములు సత్యములు కావు. ఎల్లప్పుడు నుండునవి కావు. ఆనంద జనకములు అంతకంటెను కావు. క్షణికపదార్థము ఆనంద మెట్లు కలుగజేయగలదు? నాశశీలముగు వస్తువునుండి నిరతిశయసుఖమెట్లావిర్భవించగలదు? ఒకవేళ ఆ పదార్థములు రమణీయములుగ నున్నవనియందురా? ఆది ఆపాతరమణీయత్వమే కాని వాస్తవసౌందర్యము కాదు. పంచభూతాత్మకములై కాలక్రమమున నశించిపోవునవియు, క్రుళ్ళి క్రుళ్ళి కృశించిపోవునవియు నగు పదార్థములందు ఏలాటి రమణీయత్వముండునో మీరే యోచించుకొనుడు. మోసపోవద్దు. (బంగారులేడిని చూచి సీత మోసపోయినది. అది సత్యమని భ్రమించి దానిని కాంక్షించినది. ఫలితమేమైనది? ఆమె శ్రీరామచంద్రుని పోగొట్టుకొనినది. ఆత్మారామునకు (సుఖమునకు) దూరమైనది. అత్తఱి అమెకు శోక మావిరించినది."

"ప్రపంచముయొక్క తళుకు బెళుకులను చూచి మురిసిపోయి వానివెంట పరుగెత్తితిరా ఎదురుదెబ్బలు

తగులగలవు. ఓ ఇంద్రియములారా! ఎండమావులను జూచి చెంబులు తీసికొని పరుగెత్తువారికి ఎన్ని నీళ్లు లభించునో మీకును అన్నియే లభించును. మీజన్మసార్థకమగు ఆత్మానందము ననుభవించుటకై సన్నద్ధులు కండు. దాని కొఱకై మీరు దూరముగ పరుగిడ నవసరము లేదు. అది మీ చెంతనే యున్నది. బహిఃప్రవృత్తిని వదలి అంత ర్ముఖులుకండు. మీ కది కరతలామలకమై పోవును. జన్మ సఫలమగును. కావున ఓ ఇంద్రియములారా! ఓ మనస్సా! అనేక జన్మలయందు బాధపడినది చాలును. ఇప్పటికైనను బుద్ధి తెచ్చుకొని, చెంపలు వాయించుకొని భగవానుని యాదేశమును పాటించి

'న తేషు రమతే బుధః'

అనునట్లు భోగజాలమందు రమింపకుడు. పదార్థవ్యామోహ మును విడనాడుడు. జీవితము అతిస్వల్పమైనది. మృత్యువు శరీరమును కబళించుటకు పూర్వమే మీ లక్ష్యమగు పర మాత్మను చేరుకొనుడు. "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య వరాన్ నిబోధత-లెండు! మేలుకొనుడు! పెద్దల నాశ్రయించి అవిద్యనుండి తెప్పరించుకొనుడు!" అని ఈ ప్రకారముగ అ యింద్రియమనంబులకు మెల్లగా హితబోధచేసి దృశ్యవిషయ ములనుండి వాని నెట్లైన మరల్చి ఆత్మయందు స్థాపితము చేయవలెను. ఇంత బోధించినప్పటికిని మనస్సు ఒప్పుకొన్నట్లు ఒప్పుకొని, కొంతసేపటికి మరల తటాలున జారిపోవును. అత్తరి నిరుత్సాహపడకుండ మరల వెనువెంటనే దానిని

తీసికొనివచ్చి అధిష్ఠానమగు ఆత్మయందు, హృదయమందు చేర్చవలెను. ఇంతకు మినహా వేఱొక దారిలేదు. ఇట్లు చేయుచురాగా, కొంతకాలమునకిక ఆ మనస్సు తన పాత పద్ధతులను మార్చుకొని, పాతదారులను వదలిపెట్టి స్వాధీన పడగలదు.

పూర్వము శ్రీరామకృష్ణపరమహంసను ఒక భక్తుడు సమీపించి అయ్యా! నా మనస్సు ధ్యానకాలములో నిశ్చలముగ నుండుటలేదు. ఏదైనా ఉపాయము సెలవిండు- అని ప్రార్థింప నాత డిట్లనియె—"మీ ఇంటికి ఒక రోజున ఒక కుక్క వచ్చినది యనుకొనుడు. అది చూచుటకు బాగున్నదని తలంచి ఒక పిడికెడు అన్నము దానికి పెట్టినచో అది ఏమి చేయును? తిని వెళ్ళి మరుసటిరోజు మరల వచ్చును. మరల ఒక పిడికెడు అన్నము మీరు దానికి పెట్టినచో, ఇక ప్రతిరోజున్నూ మీ యింటికి వచ్చుచునే యుండును. ఈ ప్రకారముగ కొన్ని సంవత్సరములు దానిని బాగుగా పోషించినచో, అలవాటుపడి ఇక మీయిల్లు అది వదలనే వదలదు. కొట్టినను తిట్టినను పోదు. దానిని వదిలించు కొనవలె ననిన మీ రేమి చేయవలెను? ఒకటే ఉపాయము కలదు. అది వచ్చినపుడు దానిని వెంటనే తరిమి వేయవలెను. ఇవ్విధముగ కొన్నిరోజులు వరుసగా దానిని దండించుట మొదలుపెట్టినచో, అది చూచి, చూచి విసుగెత్తి మరల రాకుండును. ఆ ప్రకారముగనే అనేక జన్మలనుండి మనస్సు పలు దృశ్యపదార్థములయందు మేపు లభించుచుండెను. అది

అడిగినది యంతయు మనము ఇచ్చుచుంటిమి. కోరినది యంతయు కిక్కురుమనకుండ సమకూర్చుచుంటిమి. ఇవ్విధముగ శబ్దస్పర్శాది విషయభోగములను అది బాగుగా తిన మరగినది. ఇక అది చెప్పిన మాట వినునా? బయటకు పోవలదనిన ఒప్పుకొనునా? ధ్యానమందు నిశ్చలముగ నుండుమని హితము చెప్పిన పాటించునా? పాటింపదు. తనకు అలవాటు పడిన త్రిభువనసంచారమునే ఆశ్రయించును. ప్రాపంచిక భోగవస్తువులపైననే ప్రాలుచుండును. అప్పు డేమి చేయవలెను? కుక్కబెడద తప్పించుకొనుటకు ఏమి చేసితిరో అదియే చేయవలెను. మనస్సు విషయములపై ప్రాలినపుడు దానికి ఆ విషయాహార మొసంగక, భోగముల ననుభవింప జేయక వివేక మను కఱ్ఱ చేబూని, అటునుండి తరిమి వేయవలెను. అట్లు తరిమినను, పూర్వాభ్యాసవశమున మరల పోవుచునే యుండును. కాని ప్రయత్నము వదలక మరల మరల గెంటివేయుచుండినచో కొన్నాళ్ళ కిక మరల నచ్చోటికి వెడలకుండుచు, ఈ ప్రకారముగ మన స్సెపుడు బాహ్యవస్తువ్యామోహమును వదలించుకొనునో, అపుడు స్వస్థానమగు హృదయమందే(ఆత్మయందే) నిలకడ గలిగియుండును. అత్తఱి పరమాత్మధ్యానము చక్కగ జరుగును.

కొన్ని ఇండ్లలో దొంగపశువు లుండును. అవి పగలు కాని రాత్రిళ్లు కాని ఇతరుల చేలలో పడి దొంగమేపు మేయుచుండును. పొలముల యజమానులు వానిని తరిమివేసినచో దూరముగ పారిపోయి మరల ఏ తోటలలోనో జొరబడి

అల్లకల్లోలము చేయుచుండును. దానిచే పశువుల సొంత దారునకు ఊరివారినుండి పెక్కు ఫిర్యాదులు వచ్చుచుండును. ఆ యవమానమును భరింపలేక అత డేమి చేయును? బయట ఏ గడ్డి దొరకుచుండునో దానికంటె మంచిగడ్డిని ఇంటి యొద్దనే వేసి మేపును. అపు డిక నయ్యావి బయటకు పోక ఇంటినే కనిపెట్టుకొని యుండును, అట్లే తుచ్ఛమై, క్షణికమై, నశ్వరమై, దుఃఖమిశ్రితమై, ప్రతిబింబరూపమైనట్టి అల్పానందమునుండి మనస్సును విరమింపజేయవలెననిన, అనంతమై, శాశ్వతమై, బింబభూతమైనట్టి ఆత్మానందమునందు దానిని ప్రవేశపెట్టవలెను. దాని మహిమను మనస్సునకు చవిచూపవలెను. ఒక్క పర్యాయము రుచి చూచెనా, ఇక వదలదు. కాబట్టి ఆట్టి సచ్చిదానందమునుగూర్చి చిత్తమునకు బోధించి, బాహ్యవిషయములనుండి దానిని మరల్చవలెను. దీనినే ప్రత్యాహార మందురు.

ఇవ్విధముగ ఇంద్రియమనంబులకు హితము చెప్పవలెననిన బుద్ధి ఎంతయో తీక్ష్ణముగను ధైర్యోత్సాహ సమన్వితముగను నుండవలెను. 'బుద్ధ్యా ధృతి గృహీతయా' (ధైర్యముతో గూడిన బుద్ధిచే మనస్సును స్వాధీనపఱచుకొని ఆత్మయందుంచవలెను)—అని భగవానుడు తెలిపియే యున్నాడు. అధైర్యమునకు, పిరికితనమునకు అధ్యాత్మరంగమున తావు లేదు. ప్రకృతిని, అవిద్యను జయించుట సామాన్యమైన పని కాదు. ఆ పనికి, ''ఇనుపకండరములు, ఉక్కునరములు, గంభీరబుద్ధులు'' అవసరములై యున్నవి. ఉపనిషత్తు

లన్నియు ఈ సత్యమునే ఘోషించుచున్నవి. ఆత్మ బలహీనునిచే పొందబడజాలదని ముండకోపనిషత్తు తెగవేసి చెప్పినది. ఒకానొక ధీరుడు మాత్రమే దృష్టిని అంతర్ముఖముగ మఱల్చి ప్రత్యగాత్మను దర్శింప గలుగుచున్నాడని కఠోపనిషత్తు పలుకుచున్నది. ధైర్యమును చేపట్టినచో మాయను తరిమి కొట్టవచ్చును. ధైర్య మొకింతేని సడలినచో మాయ మనలను తరిమికొట్టును. ఇదియే ఇచ్చటగల రహస్యము.

ఒక పిల్లవానిని కోతి తరుముచుండెను. వాడు పారిపోవుచుండ త్రోవలో నొక పెద్దమనిషి 'నాయనా పారిపోవద్దు' వెన్ను చూపినచో అది ఇంకను నిన్ను తరుమగలదు. కావున వెనుకకు తిరిగి కోతిని ధైర్యముతో ఎదుర్కొనుము. (Face the devil) అని చెప్ప నాత డట్లే చేయగా తత్క్షణమే కోతి భయపడి పారిపోయెను. ప్రకృతితోటి సాధకుడు చేయు సంగ్రామమున్ను ఇట్లే యుండును. ధైర్యము, నిర్భయత్వము, నిర్విచారత్వము—ఇవియే పరమార్థరంగమున మూలమంత్రములు. ఇవి కలవానికే ఆటదారి దొఱకును. తక్కిన వారికి దొఱకదు.

కావున భగవానుడు తెలిపినట్లు ధైర్యము నవలంబించి మెల్లమెల్లగ మనస్సును స్వాధీనపఱచుకొనవలెను. గడబిడ పడగూడదు. కంగారు పడువాడు తన కర్తవ్యమును గూడ మఱచిపోగలడు. ఉరిత్రాటిని నెమ్మదిగ ఊడదీసికొనవలెను. తొందరపడినచో ఉచ్చు ఇంకను బిగిసి ప్రాణాంతమును కలుగజేయగలదు. కనుకనే గీతాచార్యుడు సాధకుని

ఉద్దేశించి "శనైః శనైః" (మెల్ల మెల్లగా) అని ఉపదేశించెను. కొందఱు తీవ్రవైరాగ్యముచే ప్రేరితులై అంతయును వదలిపెట్టి ఒక్కపర్యాయము అమాంతముగ మోక్షమునకు గంతువేయవలెనని తలంచి తుదకు తన మనస్సును జయింపనేరక, దేహమునుమాత్రము ఉపవాసాదులచే క్షోభపెట్టి ఉభయభ్రష్టతను బొందుచున్నారు. అది చూచియే శ్రీకృష్ణమూర్తి 'సాధకుడా! ఒక్కొక్క నియమమును ఆచరణలో పెట్టుకొనుచు, తొందరపడక, మనస్సును ప్రశాంతముగ లోంగదీసికొనుము'' అని హితము చెప్పెను.

ధ్యానయోగమందు సాధకుడు అవలంబించవలసిన మఱికొన్ని జాగ్రత్తలనుగూడ భగవానుడు గీతయందు పొందుపఱచెను. అవి యేవియనిన, అధికముగ తినగూడదు. తిండిలేకుండను ఉండరాదు. ఇవ్విధముగ మధ్యమార్గమవలంబించవలెనని గీతాచార్యుని యభిప్రాయము. అధిక భోజనమువలన కడుపు బరువెక్కి ధ్యానము సరిగా జరుగదు. ధ్యానముమాట అట్లుండనిండు. కొంచెముసేపు కూర్చొనుటకు కూడ సాధ్యపడదు. క్రిందపడి దొర్లుచు నానావస్థలు పడుచుండును. ఆయాసమును పోగొట్టుటకు భోజన మేర్పడినది. కాని మితిమీరి తినినచో ఆ భోజనమే ఆయాసమును కలుగజేయును. దాని పేరే 'భుక్తాయాసము' జనులు కోరి తెచ్చుకొను జబ్బు ఇది. దానివలన మూడు అనర్థములు కలుగుచున్నవి. (1) భుక్తాయాసము తీర్చుకొను క్రిందపడి దొర్లుటలోను, నిద్రించుటలోను ఒకటి

రెండు గంటలసమయము అమూల్యమగు ఈ మానవజీవిత ములో ప్రతిదినము వ్యర్థమగుచున్నది. (2) తాను అధిక ముగా తినుటవలన, ప్రాణియొక్క ఆహారములో కొంత భాగము తస్కరించినట్లే యగుచున్నది. తాను మితముగా భుజించినచో తనకు మిగిలిన ఆహారమువలన 'అన్నమో, రామచంద్రా' యని అల్లాడు బీదజను డొకడు పోషింప బడునుగదా! కావున అధికభోజనమువలన పరప్రాణియొక్క ఆహారమును దొంగిలించిన మహాపాతకము సంభవించు చున్నది. (3) తన ఆరోగ్యము భంగమైపోవుచున్నది. డాక్టర్లను అడిగినచో ఎక్కువ రోగములు సంయమము తప్పి భుజించుటవలననే కలుగుచున్నవని చెప్పుదురు. ఇవి యన్నియు ఇచ్ఛాప్రారబ్ధమునలన కలుగు రోగములు, కోని తెచ్చుకొను వ్యాధులు. కావున ఈ మూడు అనర్థములున్ను లేకుండుటకొఱకై సాధకుడు ఆహారవిషయములో బహు జాగ్రత వహింపవలసియుండును. మితాహారమును సేవించ వలెను. మితాహారలక్షణము లేవి యనిన—

ద్వౌ భాగౌ పూరయేదన్నైః తోయేనైకం ప్రపూరయేత్
మారుతస్య ప్రచారార్థం చతుర్థ మవశేషయత్.

కడుపు మొత్తమును నాలుగు భాగములుగ విభ జించినచో, అందు రెండు భాగములను, అనగా సగము కడుపును అన్న శాఖాదులతో నింపవలెను. ఒక భాగమును, అనగా పాతిక కడుపును నీళ్ళతో నింపవలెను. మిగత పాతిక భాగమును గాలియాడుటకొఱకు ఖాళీగా నుంచవలయును.

శాస్త్రము లీప్రకారముగ చెప్పుచుండ మనవారు రెండు భాగములు కాదు, మూడు భాగములు కాదు. నాలుగు భాగములున్ను అన్నముతో నింపి, నీళ్లు త్రాగుటకు కూడ చోటులేక, గాలి ఆడుటకు ఆసలే లేక, త్రేపు వచ్చినచో కొంత ఖాళీ కాగా దానినికూడ ఒకటి రెండు గారెలతో తిరిగి నింపుటకు యత్నించుచుందురు. ఇట్టివారికి ఎన్ని జన్మలకు ధ్యాన మబ్బునో భగవంతున కెఱుక.

అయితే ఆహారమును ఏమాత్రము స్వీకరింపక కేవలము నిరాహారులుగ నుండువారికిన్ని ధ్యానము కుదరదని గీతయందు చెప్పబడినది. ఏలయనగా, శరీరము ఆహారము యొక్క స్థూలాంశముచేతను, మనస్సు సూక్ష్మాంశముచేతను ఏర్పడును. ఎపుడు ఆహారమే లేకయుండునో, అప్పుడు తత్ఫలితముగ శరీరము, మనస్సు రెండున్ను కృశించును. అత్తఱి చింతనకే అవకాశముండదు. జడముగ రాతివలె పడియుండవలసియుండును. లేక నిద్రించవలసి వచ్చును. తమోగుణ సంబంధమగు అట్టి స్థితివలన జీవున కేమాత్రమున్ను ప్రయోజనము లేదు.

పూర్వము ఉరూవలారణ్యమున తపస్సు చేయునపుడు బుద్ధదేవుడిట్లే పొరబడి ప్రారంభమున ఆహారము నేమియు గైకొనక శరీరమును క్షీణింపజేసెను. దానివలన మనస్సున్ను జడత్వము నొంది ధ్యానమే కొనసాగలేదు. కూర్చొనుటకున్ను శక్తిలేక యుండెను. అత్తఱి సమీపగ్రామమునకు బహుప్రయాసతో జని కొంచెము పెరుగన్నము భుజించి

తెప్పరించుకొనెను. అప్పటినుండియు బుద్ధదేవుడు "యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు" (ఆహార విహార వ్యవహారములన్నియు మధ్యరకముగ నుండవలెను) అను గీతాచార్యుని యుపదేశమును శార్యాన్వీత మొనర్చుచు నిరాటంకముగ ధ్యాననిష్ఠ సలుపసాగెను. ఆహారమునకు తెలిపిన ఈ నియమము నిద్రకు కూడ వర్తించునని గుర్తెఱుగవలెను. అనగా ధ్యానశీలుడు అతినిద్రను, కేవల జాగరణమును రెండింటిని విడనాడి మితమైన నిద్ర కలిగియుండవలెను. దీనినిబట్టి సాధకుడు ధ్యాననిష్ఠానులందు పురోభివృద్ధిని బడయుటకు ఇరువురు డాక్టర్లను ఆశ్రయించవలసి వచ్చుననియు, వారిరువురును క్రమముగ ఆహారము, విశ్రాంతి ("Doctor Diet, Doctor quiet") అనియు తెలుచున్నది. వారిరువురి సలహాలను పాటించినచో ధ్యానము చక్కగ సాగిపోగలదు.

ఇంతవఱకు ధ్యాననిష్ఠుడు అవలంబించవలసిన పద్ధతులు, తీసికొనవలసిన జాగ్రత్తలు, మున్నగునవి చెప్పబడినవి. అనగా ధ్యాన మువక్రమించుటకు ముందు గైకొనదగు పర్పాట్లన్నియు (Preliminary arrangements) వివరించబడినవి. క్షేత్రమును దున్ని, కలుపు తీసివేసి శుద్ధపఱచినాము, ఇక విత్తనము నాటవలెను? అదియే ధ్యానము. ధ్యానమనగా నేమి? దేనిని ధ్యానించవలెను? ఎట్లు ధ్యానించవలెను? అను ప్రశ్నలను సాధకుడు ముఖ్యముగా తెలిసికొనవలసియున్నాడు.

'తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్'

'ఇతరత్ర మనస్సును పోనీయక ధ్యేయవస్తువు పైననే నిలుపుట ధారణ యనియు ఆ వస్తువునుగూర్చి తదేకనిష్ఠతో చింతనజేయుట తదీయ భావనాప్రవాహము కలిగియుండుట ధ్యానమనియు పతంజలి నుడివియున్నాడు. సాకారధ్యానమందు, మనుజులు వారివారి ఇష్టదైవములయొక్క మూర్తిని మనస్సున నిలబెట్టి, తద్రూపమునే చింతనజేయుచు, తచ్చరిత్రలనే భావించుచునుందురు. నిరాకార ధ్యానమందు జనులు హృదయస్థమగు పరమాత్మనుగూర్చి చింతనజేయుచు, ఆతని నిత్యత్వ, నిర్వికారత్వ, అనంతత్వ, శుద్ధత్వ, నిరతిశయానందత్వములను భావించుచుందురు. జీవుడు వాస్తవముగ ఆత్మస్వరూపుడే కనుక ఈ ప్రకారముగ ఆత్మధ్యానము చేయుచురాగా క్రమముగ మనస్సు అధిష్ఠానమందు లయింప తన సహజ (ఆత్మ) స్వరూపమునే జీవుడు పొందుచున్నాడు. ప్రారంభములో ఆత్మానుభవము కలుగక పోయినప్పటికిని ఆ ఆత్మనే (బ్రహ్మమునే) నిరంతరము చింతచేయుచుండవలెననియు, కొంత కాలమునకు ఆత్మ సాక్షాత్కారము తప్పక కలుగగలదనియు శ్రీ విద్యారణ్యస్వాములవారు సెలవిచ్చిరి——

అనుభూతేరభావేఽపి బ్రహ్మాస్మీత్యేవ చిన్త్యతామ్
అప్యసత్ప్రాప్యతే ధ్యానాత్ నిత్యాప్తం బ్రహ్మ కిం పునః.

(పంచదశి — ధ్యానదీపము.)

"అనుభవము కలుగకున్నను బ్రహ్మమునే (ఆత్మనే) చింతన జేయవలెను. ధ్యానము ద్వారా ఆస్వరూపములగు దృశ్యపదార్థములే లభించుచుండ, ఇక సత్యమై, వాస్తవముగ తన స్వరూపమే ఆయియున్నట్టి బ్రహ్మము నేల పొందలేడు?" కావున శ్రీకృష్ణ పరమాత్మ సాధకులకు ధ్యానపద్ధతిని బోధించుచు, మనస్సును బాహ్యప్రపంచమునుండి మరలిచ్చి అంతర్ముఖ మొనర్చి హృదయస్థమగు చైతన్యాత్మనే లెస్సగ భావించుచుండవలెనని చెప్పెను. "మచ్చిత్తోయుక్త ఆసీత మత్పరః" అను వాక్యముయొక్క అర్థమిదియే. శ్రీకృష్ణమూర్తి సర్వజీవుల హృదయాంతర్వర్తి, సర్వాంతర్యామి.

'అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః'　　　(10-20)

అనునట్లు అతడు సమస్తచరాచర ప్రాణికోట్లయందును ఆత్మ స్వరూపుడై వెలయుచున్నాడు. కావున తనయందు చిత్తమును నిలుపుమని చెప్పినపుడు దేహబుద్ధీంద్రియాదులకు సాక్షిగ వెలుగొందుచున్న ప్రత్యగాత్మయందు మనస్సును నిలుపవలెనని యర్థము. లేక ప్రారంభస్థితిలో శ్రీ కృష్ణమూర్తియొక్క ఆకారమును హృదయమున భావించియైనను భక్తితో నాతనిని ధ్యానింపవచ్చును. ధ్యానమనునది క్రొత్తగ ఒకరు నేర్చుకొనవలసినది గాదు. అది అందఱికిని ఇదివఱకే అభ్యాసమై యున్నది. అయితే యింతవఱకు వారు ధ్యానించుచున్నది. ప్రాపంచిక దృశ్య విషయములను, నశ్వర భోగవిలాసములను. ఇప్పుడో, ఆ ధ్యానమునే పరమాత్మ వస్తువుపై మార్చుకొనుచున్నారు. అంతియే.

యా చిన్తా భువి పుత్రపౌత్ర భరణ వ్యాపార సంభావణే
యా చిన్తా ధన ధాన్యభోగయశసాం లాభే సదా జాయతే
సా చిన్తా యది నందనందన పదద్వంద్వారవిన్దే క్షణం
కా చిన్తా యమరాజభీమ సదన ద్వారప్రయాణే ప్రభో.

"జనులకు తమ పుత్రపౌత్రాదులను పోషించుట యందును, ప్రాపంచిక సంభాషణలయందును, ధనధాన్యభోగ యశస్సులను సంపాదించుటయందును ఎంత ప్రీతికలదో, దానిని గూర్చిన యెట్టి చింతకలదో, అట్టిచింత శ్రీ కృష్ణపరమాత్మ యొక్క పాదారవిందములపై క్షణకాల ముండినచో ఇక యమధర్మరాజుయొక్క భీషణ గృహద్వారమున ప్రవేశింప వలసిన అగత్యము ఉండదు. కావున ధ్యానప్రవాహమును దృశ్యవైభవములనుండి మఱలించి ఆత్మవైపు, భగవంతుని వైపు ప్రవేశపెట్టవలెను. విద్యార్థి పరీక్షలు దగ్గఱకు వచ్చి నపుడు మిగుల ఏకాగ్రతతో తదేకదీక్షతో, పట్టుదలతో పాఠ్యవిషయములను ధ్యానించుచుండును. ఉత్సవసమయము లందు కాని సంత జరుగునపుడు కాని, వ్యాపారికి తుమ్ముటకు కూడ సమయముండదు. అతని చిత్తమపుడు వ్యాపారమందే పూర్ణముగ నిమగ్నమై యుండును. ఇంటిలో వివాహమేదైన తటస్థించునపుడు, దానికి ముందు ఒకనెల రెండు నెలలనుండి మగవారికిగాని, ఆడవారికిగాని ఊపిరి తిరుగదు. తదేకధ్యాన ముతో పనులు చేసికొనుచుందురు. తక్కిన విషయములన్నియు మఱచిపోవుదురు. పతివ్రతయగు స్త్రీ తన భర్త దూరదేశ

ములకు వెళ్ళినపుడు నిరంతర మాతనినే ధ్యానించుచుండును. అట్లే భార్యపై మక్కువగల భర్త భార్య పుట్టింటికిగాని, బంధువుల యిండ్లకుగాని వెళ్లినపుడు ఆమెనే సతతము ధ్యానించుచుండును. అత్తఱి తక్కిన కార్యములు అంతగా పట్టించుకొనడు.

అన్యాశ్రయాణాం త్యాగో అనన్యతా

(నారద భక్తిసూత్రములు)

అని నారదులు చెప్పినట్లు ఇతర విషయములను మఱచి తదేక నిష్ఠతో ఒకానొక వస్తువును ధ్యానించుటవలన పైన తెలిపినవారికి అనన్యత్వము సిద్ధించినదే యగును. కాని యేమి లాభము? వారు ధ్యానించునవి యన్నియు అశాశ్వతపదార్థములు. నశ్వర వస్తువుల చింతన మోక్షమొసంగనేరదు. కావున ఆ క్రియలు వారికి పారమార్థిక ఫలమును కలుగ చేయకున్నవి. కనుకనే వరము కోరుకొనుమని విష్ణుభగవానుడు ప్రహ్లాదునితో జెప్పినపుడు ప్రహ్లాదుడు తనయభీష్టము నిట్లు తెలియజేసెను—

యా ప్రీతిరవివేకానాం విషయేష్వనపాయినీ
త్వామనుస్మరతస్సా మే హృదయాన్మాపసర్పతు.

"మహాప్రభూ! నాకు ఇతర వరములతో పనిలేదు. అవివేకులగువారికి చంచలములగు విషయభోగములందెట్టి ప్రీతికలదో, అట్టిప్రీతిని నీ పాదారవిందములను సంస్మరించుట యందు నాకు కలుగజేయుము. మఱియు అట్టిప్రీతి నాహృదయ కుహరమునుండి యెన్నటికిని వీడనట్లు అనుగ్రహింపుము."

దీనినిబట్టి సర్వులకును ధ్యానపద్ధతి తెలిసియే యున్నను, అజ్ఞానమువలన ఆ ధ్యానమును ఆ యేకాగ్రతను, ఆ పట్టుదలను, ప్రాపంచికవస్తువులపై వినియోగించుచు, శాశ్వత ఫలమును జన్మరాహిత్యమును పొందకయున్నారు.

కావున ప్రాపంచిక పదార్థములపైగల మక్కువను, ప్రీతిని దైవము వైపునకు త్రిప్పి, తదేకనిష్ఠతో నాతనిని ధ్యానించుచు మనుజుడు పరమానందము ననుభవించవలెను.

పూర్వమొకపుడు దత్తాత్రేయులవా రెచటికో యాత్రగ బోవుచుండిరి. ఒకచోట మూడు దారులు కలిసి యుండెను. ఏమార్గముగుండా పోవలెనో వారికి తెలియక, చుట్టు ప్రక్కల యెవరైన యుండినచో కనుగొందమని యోచించి చూచెను. కాని ఆచట యెవ్వరును లేరు. సమీపమున ఒకనది ప్రవహించుచుండెను. దానియొడ్డున ఒక బెస్తవాడు గాలమును నీళ్ళలో వైచి చేపలు పట్టుచుండెను. దత్తాత్రేయులు దూరమునుండి వానిని పిలచెను. కాని అతడు పలుకలేదు. మరల పెద్దగ పిలచెను. కాని యాతడు విని పించుకొనలేదు. మూడవ పర్యాయము ఇంకను పెద్దగ కేక వేసెను. కాని బెస్తవాడు కిక్కురుమనలేదు. అపుడు దత్తాత్రేయులు వాని సమీపమునకుబోయి వీపు తట్టి ఏమయ్యా, మూడుసార్లు కేకవేసినను పలుకలేదేమి! అని యడుగ, మహాత్మా! నా దృష్టియంతయు బెండుపై నున్నది. అది మునుగునేమో, చేప పడునేమో యను చింతయందే యుంటిని. కావున మీ కేకలు వినిపించలేదు. క్షమించుడు'

అని యాతడు ప్రత్యుత్తరమిచ్చెను. వెంటనే దత్తాత్రేయు లిట్లు యోచించిరి—అహా! అల్పమగు చేపకొఱకు బెస్తవా డెంతటి యేకాగ్రతను, దీక్షను సంపాదించినాడు. ఓహో! తాపసులందును నిట్టి సంయమము, ఏకాగ్రత అపురూపమే! ఈ ఏకాగ్రతలో, పదునాఱవ పాలైనను భగవంతునియం దుంచి ధ్యానించినచో జనులు ఎప్పుడో మోక్షమును పొంది యుండెడివారు. చక్కటి పాఠమును ఇతడు నాకు నేర్పినాడు. ఈతడు నా గురువు' అని వచించుచు నాతనికి సాష్టాంగదండ ప్రణామం బాచరించి వెడలిపోయెను.

కావున జనులు ప్రపంచ కార్యములందు అనవసరముగ వ్యర్థముచేయు కాలమును, శక్తిని, బుద్ధినైపుణ్యమును కొంతనైనను పరమాత్మచింతనమునందు వినియోగించి ధన్యతను జెందవలెను. ప్రారంభములో కొంతసమయమును ధ్యానమునకు ప్రత్యేకించి, క్రమముగ దానిని పెంచుచు రావలెను. కోరికలను తగ్గించుకొనుచు క్రమముగ పూర్తిగ విడనాడవలయును. ఒకవైపు ధ్యానము, ఒకవైపు కామము, ఒకవైపు యోగము, ఒకవైపు భోగము—ఈ రెంటికిని పొత్తు కుదరదు. కావుననే భగవానుడు—

సంకల్పప్రభవాన్కామాం స్త్యక్త్వా సర్వానశేషతః    (6-24)

ధ్యానమునందు చక్కని నిలకడ బొందవలెననిన, సంకల్పజనితములగు కోరికలన్నిటిని సంపూర్ణముగ తొలగించివేయవలెనని హెచ్చరికచేసెను. మొదటిలోనే కోరికలన్నియు తొలగకపోయినను క్రమముగ ఆ స్థితిని అభ్యాసము

చేసికొనవలెను. అపుడిక చిత్తము బహిర్ముఖము కాక నిశ్చలముగ దైవచింతనయందు మగ్నమై యుండును. గాలి వీచని స్థలమందలి దీపమువలె అచంచలముగ నుండును.

ఈ ప్రకారముగ వైరాగ్యము నవలంబించి దృష్టి నంతర్ముఖ మొనర్చి పరమాత్మధ్యానము చేయువారికి కలుగు ఫలిత మేమి? ప్రయోజనము లేక మందుడున్ను ఏ కార్య మందును ప్రవృత్తుడు కాడుకదా. ఇపు డెవరినైనను కొంచె ముసేపు దైవచింతన చేయుమని యడిగినచో దానివలన మాకు వచ్చు లాభ మేమి? అని వెంటనే ప్రశ్నించుదురు. లాభములేనిది ఎవరును ఏ కార్యమును చేయరు. చివరకు వర్తకుడు ధ్యానము కొలచునపుడుకూడ 'లాభం' అనియే ప్రారంభించును. కావున పరమార్థసాధకునకు ఈ ధ్యానా దులవలన కలుగు ఉపకార మేమి యనగా – దానిని గీతా చార్యుడే చెప్పివై చెను.

శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి. (6-15)

బ్రహ్మరూపమై, పరమనిర్వాణ (జననమరణనివృత్తి) దాయకమైనట్టి శాంతినే ధ్యానయోగి పొందుచున్నాడు. ప్రపంచములోని అన్నిలాభములకంటెను అది ఉత్తమమైన లాభము. అన్నివస్తువులకంటెను శ్రేష్ఠమైన వస్తువు. అన్ని పదవులకంటెను శ్రేష్ఠమైనదది. ముల్లోకములందలి ఎంత గొప్పపదవిని పొందినను మనుజుడు పుట్టుకచావులనుండి మాత్రము తప్పించుకొనలేడు. కావున పరమార్థదృష్టిలో అవి గొప్పవి అనిపించుకొనవు. దేనిని పొందినచో మరల

సంసారచక్రమున మనుజుడు తగుల్కొనడో, ఏ స్థితియందు మహత్తరదుఃఖము సంప్రాప్తించినను చలింపకనుండునో, దేనిని పొందిన పిదప మఱల చతుర్దశభువనములందలి ఏ వస్తువుపైనను అపేక్ష కలుగక యుండునో, ఏది ఆత్యంతిక సుఖస్వరూపమో అదియే ప్రపంచములోకెల్ల గొప్ప వస్తువు. దానినే ధ్యానయోగి పడయుచున్నాడు. అంతకుమించి ఇక జీవునకు కావలసినదేమి? జన్మసార్థకమైనట్లే. మఱియొక విశేషమేమియనిన, ప్రపంచములోని జీవరాసులన్నియు సుఖమెక్కడ, సుఖమెక్కడ అని సుఖముకొఱకై అల్లాడుచు వెతకుచుండ, సుఖము దానియంతటనదియే బ్రహ్మనిష్ఠుని వెతకుకొనుచువచ్చి వాని పాలిట పడుచున్నది.

ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్
ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూతమకల్మషమ్. (6-27)

'ప్రశాంతచిత్తుడును, రజోగుణవికారరహితుడును బ్రహ్మస్వరూపుడును, పాపరహితుడు నగు ధ్యానయోగిని ఉత్తమసుఖము వచ్చి పొందుచున్నది. మోక్షలక్ష్మి వచ్చి అతని మెడలో పూలహారము వేయుచున్నదని యర్థము. వడగళ్లు సముద్రములో పడి సముద్రరూపమే యగునట్లు చిత్తము ప్రత్యగాత్మను అనవరతము చింతించుచు ప్రత్యగాత్మరూపమే యగుచు నిరతిశయసుఖమును చేబట్టుచున్నది. ఇంతటి అమూల్యసుఖము తన జన్మహక్కు అయియున్నను దానికొఱకు అన్వేషించక మనుజుడు క్షుద్రవిషయసౌఖ్యములకొఱకై అఱ్ఱులు చాచుట చాల శోచనీయము. కావున

భోగవాంఛలను త్యజించి గీతయందు భగవానుడు తెలిపిన విధముగ సంయమమును, ధ్యానయోగమును అభ్యసించి తద్ద్వారా మనస్సునందలి విక్షేపదోషమును పోగొట్టుకొని బ్రహ్మానందవారాశిలో నోలలాడవలెను.

ధ్యానయోగము నభ్యసించుటయందు సాధకునకు పరబ్రహ్మవాచకమగు ప్రణవమునుగూర్చిన విచారణ మిక్కుటముగ ఉపకరించగలదు. ప్రణవోపాసన, ప్రణవచింతనము, ప్రణవార్థభావన సాధకుని చిత్తమును వినిర్మలమొనర్చుట యందు, ద్వైతానుభూతియందు లెస్సగ తోడ్పడును.

పరమాత్మకు అనంతకోటి నామములు కలవు. కాని ప్రత్యేకముగ ఏ ఒకానొక మతమునకును జెందనిదియు, సమస్తమును తనయందిమిడ్చుకొనునదియు, వేదసారమైనదియు, ఉచ్చారణమాత్రముచే జీవుని పునీతునిగ నొనర్చునదియునగు ప్రణవము (ఓంకారము) వాని యన్నింటి కంటెను మిన్నయై యొప్పుచున్నది. అకార, ఉకార, మకార, అర్థమాత్రలతో గూడిన ఆ నామము సర్వశాస్త్రార్థ సంగ్రహమని చెప్పవచ్చును. వేదశాస్త్ర పురాణేతిహాసములు దాని మహిమను వేనోళ్ళ వర్ణించినవి; దాని కీర్తిని శ్లాఘించినవి. కనుకనే ప్రణవము లేని మంత్రము కాని, ప్రణవముతో ప్రారంభించని శాస్త్రముకాని, పూజకాని హైందవమతమున లేనేలేదు.

ప్రణవము (ఓంకారము) తక్కిన శబ్దము లన్నిటికిని చైతన్యమును ప్రసాదించును. గీతయందు భగవానుడు

'ప్రవణ స్సర్వ వేదేషు'-సమస్తవేదములందును నేను ఓంకారమును, 'గిరామస్మ్యేక మక్షరమ్'-'వాక్కులలో ఏకాక్షరమగు ఓంకారమే నేను' - అని ప్రణవముయొక్క ప్రాధాన్యతను వెల్లడిచేసెను. క్రైస్తవులు ప్రార్థనానంతరము చెప్పు 'Aumen' 'ఆమెన్' అను పదము ఓంకారము 'Aum' యొక్క రూపాంతరమే అయియున్నది. సర్వమతములందును ఏదియో యొక రూపమున ఈ ఓంకారనాదము ఉచ్చరింపబడుచునే యున్నది. అట్టి పవిత్రమగు భగవన్నామము యొక్క ఉచ్చారణచే జీవుని స్థూలసూక్ష్మశరీరములు రెండును శుద్ధపడుచున్నవి.

తస్య వాచకః ప్రణవః

పరమాత్మయొక్క నామధేయము ప్రణవము (ఓంకారము) అని పతంజలి మహర్షి నుడువుచు అ ప్రణవమును జపించువారు, దాని యర్థమును చక్కగ మననము చేయువారు సాధకు డెదుర్కొను విఘ్నపరంపర లన్నిటిని దాటివైచి అచిరకాలములోనే ప్రత్యగాత్మను సాక్షాత్కరించుకొనగలరని ఘంటాపథముగ చెప్పియున్నాడు. శ్రీకృష్ణమూర్తియు 'స యాతి పరమాం గతిమ్'—ప్రణవమును ధ్యానించువాడు పరమగతియగు మోక్షము నొందగలడని గీతయందు వచించియుండెను. కావున ముముక్షువులు కైవల్యదాయకమగు అట్టి మంత్రరాజము నవలంబించి, అద్దాని జపధ్యానాదులచే అక్షరమగు పరబ్రహ్మమును ఈ జన్మయందే సాక్షాత్క-

రించుకొని సంసారబంధవిముక్తులై పరమశాంతిని బడయ వలయును.

అయితే ఆ ప్రణవధ్యానమును ఏ ప్రకార మాచరించవలయును? దాని పద్ధతి యేమి? మున్నగు వివరములన్నిటిని గీతాచార్యుడు భగవద్గీతయందలి 8-వ అధ్యాయమున చక్కగ తెలిపియున్నాడు. సాధకులు వాటిని శ్రద్ధగా గమనించవలెను. భ్రూమధ్యమున దృష్టిని నిలిపి, మనుజుడు భక్తిసమన్వితుడై, ఇంద్రియములను బహిర్ముఖముగ పోనీయక అరికట్టి నిశ్చలమనస్సుతో ప్రణవోచ్చారణాపూర్వకముగ భగవంతుని ధ్యానింపవలయును. నిర్మలభక్తికలవాడు సర్వేశ్వరుని కృపచే మాయను అవలీలగ దాటివేయుగలడు. జ్ఞానమే ప్రధానము కదా, ఇక భక్తితో పనియేమి ? అని తలంచువారు పొరపడుచున్నవారే యగుదురు. అది అనుభవముతో చెప్పిన వాక్యము కాదు. జ్ఞానము, స్వస్వరూప విచారణ, ఆత్మచింతన ప్రధానములైనప్పటికిని అనేకజన్మార్జిత పాపపంకిలమును, మాయాప్రతిబంధమును ఎదుర్కొనుటకు వానిని నిర్జించుటకు భగవత్కృప అత్యావశ్యకము గనుక పరమార్థరంగమున భక్తియొక్క సముచితస్థానము ఎప్పుడును తొలగనేరదు.

ఈ ప్రకారముగ (ప్రణవ) ధ్యాత సర్వేశ్వరునియెడ అచంచలమగు భక్తికలవాడై మనస్సును అన్యత్ర పోనీయక అనగా దృశ్యపదార్థములపైకి వ్యాపింపనీయక హృదయమునందు (ఆత్మస్థానమందు) స్థాపిత మొనర్పవలెను. మనస్సు

మర్కటమునుబోలి మహాచపలముగా నుండును గావునను, ఇంద్రియములద్వారా శబ్దాది విషయములపైకి పరుగెత్తు చుండును గావునను, దానిని నయముగా, ఉపాయము ద్వారా, విషయములందలి దోషమును బోధించుటద్వారా మెల్లగా నిశ్చల మొనర్పవలయును. ధ్యానము చేయునపుడు 'సర్వద్వారాణి సంయమ్య'—ఇంద్రియద్వారము లన్నిటిని మూయవలసినదిగా (సంయమన మొనర్పవలసినదిగా) గీత యందు భగవాను డాదేశించెను. కిటికీ తలుపులు, ద్వార బంధనముల తలుపులు బార్లగా తెఱువబడియున్నచో ఇంటి లోపలనున్న ప్రమిదదీపము అరిపోవుటయో లేక చంచలముగ నుండుటయో తటస్థించునట్లు శరీరమను గృహమున దశేం ద్రియముల ద్వారములు బాహాటముగ తెఱువబడియున్నచో ఇక మనోదీపము ఏమాత్రము నిశ్చలముగ నుండదు. మనస్సు నిశ్చలముగ నుండనిచో ధ్యానముం దాత్మానుభూతి యెన్నటి కిని కలుగనేరదు. కాబట్టి మనోనిశ్చలత్వము, ఇంద్రియ సంయమనము ధ్యానమున కత్యావశ్యకములై యున్నవి. అవి యెట్లు సిద్ధించగలవు?

ప్రదృశ్యతే వస్తుని యత్ర దోషః
న తత్ర పుంసోఽస్తి పునః ప్రవృత్తిః.

అనునట్లు దృశ్యపదార్థములందలి అశాశ్వతత్వము, ఆపాత రమణీయత్వము, అల్పసుఖత్వము మున్నగు దోషము లను చక్కగ తెలిసికొనియుండినచో ఇక మనస్సుగాని, ఇంద్రియములుగాని వాని వెంట పరుగెత్తనేరవు. ఈ ప్రకా

రముగ ఇంద్రియమనంబులను చక్కగ సంయమన మొనర్చి సాధకుడు ప్రణవోచ్చారణ పూర్వకముగ పరమాత్మను ధ్యానించవలయును.

ఓంకారము నుచ్చరించునపుడు దాని యర్థమును బాగుగ మననము చేయవలెను.

'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామను స్మరన్' అను వాక్యమునందు 'అనుస్మరన్' అని భగవానుడు హెచ్చరించుటవలన ఓంకారముయొక్క ఉచ్చారణ మాత్రము చాలదనియు, దాని భావమును గూడ (లక్ష్యార్థమగు పరబ్రహ్మమును) హృదయమున మఱలమఱల చింతన జేయవలెననియు స్పష్టమగుచున్నది. ఇక్కాలమున అనేకులు మంత్రజపము చేయుచున్నను కొందఱు ఆశించిన ఫలములను పొందకపోవుటకు కారణ మీ రహస్యమును తెలిసికొనకపోవుటయే యగును. వారు మంత్రము నుచ్చరించుచున్నారేకాని మంత్రార్థమును చక్కగ భావించుట లేదు. అట్టివారికి మంత్రజపముచే ఒకింత పుణ్యము లభించునే కాని (పరిపూర్ణ మంత్రఫలమగు) మోక్షము లభించుట దుస్తరము. కాబట్టి అర్థసహితముగ, భావసహితముగ ధ్యానింపవలయును.

ఈ ప్రణవమును ఎవరైనను ధ్యానించి తరించవచ్చును. ఇచట జాతి, మత, కుల, లింగ వివక్షత లేనే లేదు. భక్తి, శ్రద్ధ లుండిన చాలును. కనుకనే ఈ ప్రణవధ్యానమును గుఱించి చెప్పునపుడు శ్రీ కృష్ణభగవానుడు గీతయందు

'యః ప్రయాతి'—అని యచ్ఛబ్దప్రయోగము చేసియుండెను. అనగా ఎవడైనను సరియే దానిని భక్తితో జపించి, ధ్యానించి తరించవచ్చునని స్పష్టమగుచున్నది. కావున ఈ మహోన్నత మంత్రరాజమగు ప్రణవమును (ఓంకారమును) ముముక్షువు లెల్లరు శ్రద్ధాభక్తులతో ధ్యానించి, పరమశాంతిని బడసి బంధవిముక్తు లయ్యెదరు గాక!

ఈ ప్రకారముగ ప్రణవోపాసన ద్వారాగాని, ఇతర దివ్యమంత్ర జపముచేగాని సాధకుడు తన మనస్సును దైవోన్ముఖము గావించి దైవమందు స్థాపించి ఆత్మసాక్షాత్కారమును బడయవలయును, అదియే మోక్షము. మోక్షసిద్ధికి చంచలమనస్సు గొప్ప ప్రతిబంధకము కావున అనేక ఉపాయములచే దాని నెట్టిన లోంగదీసికొని హృదయస్థ ఆత్మయందు దానిని లెస్సగ స్థాపించవలెను.

## మనోనిగ్రహము

మనస్సు మహాచపలమైనది. అట్టి చపలమానసమును అరికట్టనిచో మనుజునకు శాంతి లభించదు. ప్రతిజీవియొక్క సహజస్వరూపము పరమానందాత్మ అయి యున్నను ఈ మనస్సు అను అడ్డువలన అట్టి నిరతిశయానంద మనుభూతమగుటలేదు. కనుకనే మహనీయులందరున్ను మనోనిగ్రహమునకు, మనస్సంయమమునకు, మనోనాశమునకు అధిక ప్రాధాన్య మొసంగినవారై యద్దానిని ఆత్మసాక్షాత్కారమునకు ప్రథమ సాధనగా పేర్కొనిరి.

చిత్తం నాభిః కిలాస్యేహ మాయా చక్రస్య సర్వతః
స్థీయతే చేత్తదాక్రమ్య తన్నకించిత్ప్రబాధతే. (వసిష్ఠగీత)

"ఈ జగన్మాయ యను మహాచక్రమునకు మనస్సు నడిబొడ్డు అయి ఉన్నది. దానిని పట్టుకొనినచో (నిగ్రహించినచో) ఇక ఈ మాయ ఒకింతైనను జీవుని బాధింపనేరదు" అని వసిష్ఠమునీంద్రులు శ్రీరామచంద్రునకు బోధించెను. ఇంతియేకాదు. ఇట్టి మనోనిగ్రహమును పరమౌషధముచే దప్ప మరి దేనిచేతనుగూడ ఈ సంసారమహారోగము శమించనేరదనియు, ఒకింత విచారణచే తన మనస్సును కొంచెముగా నిగ్రహించినప్పటికిని మనుజుడు జన్మసాఫల్యమును బొందినట్లే అనియు అమ్మునీంద్రు డుపదేశించెను.—

మనాగపి విచారేణ చేతసః స్వస్యనిగ్రహః
మనాగపి కృతో యేన తేనాప్తం జన్మనః ఫలమ్. (వసిష్ఠగీత)

దీని యర్థము పైన తెలిపినదే. కావున ప్రతిమానవుని యొక్క ప్రథమకర్తవ్యము తన మనస్సును తాను జయించుకొనుటయే యగును. మనస్సనునది వాస్తవముగ ఆత్మకంటె ఎంతయో క్రిందిస్థానమున నున్నవస్తువు. అట్టిది అనేకజన్మల యందు వాసనలను ప్రోగుచేసికొని బలమును సంపాదించి పైన ఉన్న ఆత్మను అణగద్రొక్కివేయుచున్నది. "గ్రుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించిన చందమున" ప్రవర్తించుచున్నది.

పూర్వ మొక రాజుండెడివాడు. అతనికి పెక్కు భూములు, తోటలు, "ఎస్టేట్లు" కలవు. వాని నన్నింటిని

తాను స్వయముగ చూచుకొనుటకు వీలులేక ఒక ప్రతినిధిని అకార్యమునకై వినియోగించెను. ఆ ప్రతినిధియో, క్రమముగ అధికారము చేబట్టి, అహంకరించి, రాజును చిన్న చూపు చూచుచు కొంతకాలమునకు "నీ వెవరయ్యా" అని రాజును ప్రశ్నించు స్థితికి వచ్చెను. అట్టి సందర్భమున రాజునకు రెండే రెండు మార్గములు గలవు. తన యధికారమును చలాయించి ఆ ప్రతినిధిని లోబరచుకొనుటగాని తొలగించివేయుటగాని ఒకటి, లేక అతనికి తలయొగ్గి దాసానుదాసుడై బానిసవలె వర్తించుట రెండవది. వివేకముతో గూడిన రాజు గనుక అతను తన హోదాను గమనించి ఆ ప్రతినిధిని ఉద్యోగమునుండి తొలగించివేసి సుఖముగ నుండెను. అట్లే ఆత్మ అను రాజు చిరకాలము క్రిందట మనస్సు అను ప్రతినిధిని (Agent) ఈ జగద్వ్యవహారమంతయు చూచుకొనుటకు నియోగింపగా అతడు క్రమముగ విషయవాసనలచే బలపడి, క్రొవ్వెక్కి, ఆత్మను (జీవుని) బానిసగా చేసి వైచెను. ఇట్టిస్థితి చాల శోచనీయమైనది. కనుక దాని నెట్టిన జయించి తమ సార్వభౌమాధికారమును నిలబెట్టుకొనవలసినదిగా జనులకు విజ్ఞప్తిచేయుచున్నారు పరమఋషులు, శాస్త్రకారులున్ను.

వాస్తవముగ జీవుడు స్వతంత్రుడేకాని, పరతంత్రుడు కాడు. యజమానియే కాని కానిసకాడు. అధికారియే కాని, నౌకరుగాడు. ఎవడు తన యింద్రియములను, మనంబును జయించుకొనునో, ఆతడు ఈ నవద్వారపురంబునకు

సార్వభౌముడై, ఈ దృశ్యజగత్తునకు ఏకచ్ఛత్రాధిపతియై విలసిల్లును. మరియు ఆ జయింపబడిన ఇంద్రియములు తనకు మిత్రులుగా వ్యవహరించును. సహాయపడును. అట్లుగాక ఎవడు తన యింద్రియములను మనస్సును జయింపనేరక, వానికి లోబడిపోవునో అట్టివాడు ఈ నవద్వారనగరంబగు దేహమున భృత్యుని పగిది దీనముగ వర్తించుచు శోకాన్వితుడై యుండును. అత్తరి ఆ జయింపబడని ఇంద్రియములు తనకు శత్రువులుగా వ్యవహరించును.

దీనినిబట్టి మిత్రుడు తనలోనే కలడు. శత్రువు తనలోనే కలడని నిర్ణయమగుచున్నది. శత్రువును ప్రక్కననే ఉంచుకొనినవాడు శాంతి నెన్నడైన పొందకల్గునా? దొంగ ఇంటియందే కలవాడు సుఖము నెన్నడైన నోచుకొనగలడా? కట్టుకొనిన పంచలోగాని, చీరెలోగాని తేలు ఉన్న వారికతి ఎంత బాధాకరముగ నుండునో, అజితేంద్రియుల స్థితియు నట్లే యుండును. కావున ప్రతివారున్ను తమయందు శత్రువులకు ఆలంబన మొసంగక, జీవితమున పరమసౌఖ్యమనుభవించుటకు చూడవలయును. ఇందుల కేకైక ఉపాయము తన మనస్సును, ఇంద్రియములను వివేకాదులద్వారా సంయమన మొనర్చుటయే అగును. దీనినే ఇంగ్లీషుభాషలో (Mind Control) "మైండు కంట్రోలు" అందురు. యుద్ధకాలములోను తదనంతరమున్ను ప్రభుత్వమువారు అన్ని పదార్థములను కంట్రోల్ చేసిరి. దానినిగూర్చి ప్రజలకు నేర్పిరికూడ. కాని ఒక్కదానిని మాత్రము నేర్పలేదు.

అదియే మనస్సును గూర్చిన కంట్రోలు (నిగ్రహము). దానిని ప్రభుత్వమువారు నేర్పకపోయినను గీతాచార్యుడు గీతయందును, మహర్షులు ఉపనిషదాదులందును చక్కగ నేర్పివైచిరి. ఆ పద్ధతులను బాగుగ తెలిసికొని విషయవిరక్తి, అభ్యాసాదులద్వారా మనస్సును లెస్సగ నిగ్రహించి పరమ శాంతిని బడయవలయును.

ఉపనిషత్తులలో ఇంద్రియాదులను గూర్చి సుందరమైన ఉపమాన మొకటి ఈయబడినది. ఈ శరీరమే రథము. ఆత్మయే రథికుడు. (యజమాని) బుద్ధియే సారథి, మనస్సే కళ్లెము, ఇంద్రియములే గుఱ్ఱములు, విషయములే బాట. ఎవనియొక్క బుద్ధి ప్రజ్ఞావంతమై ఇంద్రియములను చెడ్డ గుఱ్ఱములను మనస్సను కళ్లెముతో లాగిపట్టి విషయభోగము లను గోతులందు బడకుండ చక్కగ తప్పించి నడుపునో, అట్టివాని దేహమను (ఉపాధియను) రథము నిరాటంకముగ గమ్యస్థానమగు పరమాత్మను చేరగలదు. లేకున్న గోతు లలో, చెఱువులలో పడిపోవు రథమువలె వినాశమునే పొందగలదు.

ఒక్కొక్క ఇంద్రియము తన ఇంద్రియార్థమగు విష యమువైపు జీవుని లాగుచున్నది. చెవి ప్రాపంచిక శృంగార శబ్దజాలమును వినుటకై తహతహ లాడుచున్నదేగాని భగవ న్నామమును, వేదఘోషను వినుటకు సిద్ధపడుట లేదు. పైగా ఏవగించుకొనుచున్నది. అట్లే త్వగింద్రియము విషయస్పర్శనే అభిలషించుచున్నది. కాని భగవంతుని పాదపద్మములను

స్పృశించుటకు ఇష్టపడుట లేదు. నేత్రము తళుకుబెళుకు ప్రాపంచిక రూపములనే చూచుటకు కాంక్షించుచున్నది. కాని భగవానుని దివ్యస్వరూపమును గాంచ నిచ్ఛగించుట లేదు. ఈ ప్రకారముగనే తక్కిన రసనేంద్రియ, జ్ఞానేంద్రియములున్ను వానికి అభిలషితములైన వస్తువులనే కోరుచున్నవి. ఇట్లుండ నిక జీవునకు శాంతి ఎట్లు కలుగగలదు? పదిమంది భార్యలుగల భర్తయొక్క దుర్గతియే ఈ జీవునకు పట్టుచున్నది. కాబట్టియే ఇంద్రియనిగ్రహము, మనోజయము అత్యావశ్యకములనియు, అవి లేనిచో జీవునకు శాంతి మృగ్యమనియు గీతాదిగ్రంథములందు తెలుపబడినది.

అయితే అట్టి నిగ్రహము, సంయమము అలవడుట ఎట్లు? మనోజయ మెట్లు సిద్ధించును? ఈ విధమైన ప్రశ్నలను పూర్వము అర్జునుడే గీతయందు వేసియుండెను-ఎట్లనిన—

"చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్.
(6-34)

"ఓ శ్రీకృష్ణా! మనస్సును నిగ్రహింపవలెనని చెప్పుచున్నావు. నా మనస్సో, మహాచపలముగా ఉన్నది. బలవత్తరముగ నుండుటవలనను, విషయములందు గట్టిపట్టువల గలిగియున్నందునను దానిని లొంగదీయుట గాలిని పట్టుకొనుటవలె మహాదుష్కరముగ తోచుచున్నది. ఇట్టి పరిస్థితిలో ఇక నాకర్తవ్యమేమి?" ఇది అర్జునుని ప్రశ్న. అర్జునుడు ఒకానొక వ్యక్తిగా జనులకు గోచరించినను వాస్తవ

ముగ వ్యక్తిగాడు. భూత భవిష్యద్వర్తమాన కాలములందలి పరమార్థ సాధకులందరియొక్క మూర్తీభవించిన ప్రాతినిధ్యమే అర్జునుడు. అనగా సర్వులయొక్క ప్రతినిధిగా నట వ్యవహరించుచున్నాడు. అర్జునుడు అడిగిన ప్రశ్న చాల గొప్పది. సర్వులకు అత్యావశ్యకమైనది. దానికి భగవానుడు ఏమి సమాధానము చెప్పునో వినవలెనని అందరికిని సహజముగనే కుతూహలముండును. మనోనిగ్రహ మెట్లు సంభవించునో వినవలెనని ఎవరికి జిజ్ఞాస యుండదు? ఈ ప్రకారముగ జనులందరును ముఖ్యముగ సాధకులందరున్ను వెయ్యి చెవులతో, వినుటకు సిద్ధపడియుండు సమయమున శ్రీకృష్ణ పరమాత్మ యిట్లు ప్రత్యుత్తర మొసంగెను.

"అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్
అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే. (6-35)

"ఓ అర్జునా! నిస్సందేహముగా మనస్సు చపలమైనదే, నిగ్రహించుటకు కష్టసాధ్యమైనదే; అయినను అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను అయ్యది నిగ్రహింపబడ గలదు."

ప్రయత్నముచేయనివారికి మనోనిగ్రహము కష్టముగా నుండును, కాని ప్రయత్నించువారికి అది సులభముగనే ఉపాయముచే లభ్యమగును. కావున పార్థా! ప్రయత్నము సలుపుము." గీతాచార్యుని ఈ యుపదేశము సోమరులకు గొడ్డలిపెట్టుగా పరిణమించినది. మనస్సంయమము ఒక వరమువలె హఠాత్తుగ ఆకసమునుండి ఊడిపడి జీవుని హృదయమందు

చేరునది కాదనియు, అది ఒక రిచ్చునది ఒకరు పుచ్చుకొను నది అంతకంటే కాదనియు వారికివారే పరిశ్రమచేసి, ప్రయ త్నముసలిపి పొందదగినదియనియు భగవానుడు స్పష్టీక రించెను.

అర్జునుడు శ్రీకృష్ణునకు పరమమిత్రుడు, సన్నిహితుడు, సఖుడు, ప్రీతిపాత్రుడు. (ఇష్టోసి మే ధృఢమితి'') అని అత డొకప్పుడు చెప్పివేసినాడుకూడ. అట్టితడే అర్జునుడు ''నా మనస్సు నిలుచుట లేదు బాబో'' అని విలపించుచుండ, ''మిత్రుడవగు ఓ అర్జునా! నీవు మహావిపత్తులో నున్నావు. నేను సర్వశక్తివంతుడను. మదీయ ప్రజ్ఞాప్రభావముల నుప యోగించి నీ మనస్సును ఒక్క నిమిషములో అరికట్టివైచె దను''-అని కృష్ణుడు చెప్పలేదేమి? అంత ఆప్తుడుకదా, ఈ కొంచెము సహాయము ఆతనికి ఏల చేయలేదు? ''అభ్యా సము చేసుకోవయ్యా మహానుభావా'' అని అతనిమీదనే ఏల భారముంచెను? దీనికి గారణము - ఎవరి ఆకలిని వారే (భుజించి)పోగొట్టుకొనవలయును. ఎవరి బరువును వారే దించు కొని సుఖపడవలెను. ఎవరి కండ్లతో వారే చూడవలెను, మహాత్ములు ఒకింత సహాయము చేయుదురేకాని ప్రయ త్నించి సాధించవలసినది ఎవరికి వారే. కావున పురుషప్రయ త్నము నాశ్రయించి గొప్ప పట్టుదలతో ప్రతివారున్ను తమ మనస్సును తామే వైరాగ్య విచారణ, ధ్యానాదులద్వారా విగ్రహించుకొనవలయును.

శ్రీ శంకరాచార్యులవారు ప్రపంచములోని బాధలన్నిటిని ఒక తరగతిగను, ఆకలిబాధను మాత్రము మరియొక తరగతిగను విభజించెను. ఏలయనగా ప్రపంచములోని బాధలన్నియు ఇంకొకని సహాయముచే తొలగిపోగలవు. కాని ఆకలిబాధ మాత్రము మరియొకనిచే తొలగదు. తనకు తాను భుజించి నివారించుకొనవలసినదే.

1. మస్తకన్యస్తభారాదేర్దుఃఖమన్యైర్నివార్యతే
   క్షుధాదికృతదుఃఖం తు వినా స్వేన న కేనచిత్.
2. పథ్యమౌషధసేవా చ క్రియతే యేన రోగిణా
   ఆరోగ్యసిద్ధిర్దృష్టాస్య నాన్యానుష్ఠితకర్మణా.
3. ఋణమోచనకర్తారః పితుస్సన్తి సుతాదయః
   బన్ధమోచనకర్తా తు స్వస్మాదన్యన్న కించన.

(వివేకచూడామణి)

"తలపై కట్టెలమోపు బరువుగనున్నచో, ఆ బరువును మరియొకని సాహాయ్యమున దింపించుకొని బాధను తొలగించుకొనవచ్చును. కాని తన కాకలి అయినచో ఆ బాధను ఎవరు తీర్చగలరు? ఎవరైన భుజించిన తన అకలి తీరునా? తీరదు. తనకు తానే భుజించి ఆ బాధను నివారించుకొనవలయును. తనకు రోగము వచ్చినచో మరియొకడు మందు తినిన ఆ బాధ పోవునా? పోదు. తానే స్వయముగ ఔషధమును సేవించి పథ్యాదులను జరుపవలసియుండును. తండ్రి అప్పుచేసినచో ఆ అప్పును కుమారుడు తీర్చవచ్చును. కాని తండ్రి అజ్ఞానబంధనమందున్నచో దానిని కుమారుడు

పోగొట్టలేదు. తండ్రి జ్ఞానోపార్జనద్వారా తనకుతానే దానిని తొలగించుకొనవలయును" అని ఈ ప్రకారముగ శ్రీ శంకరాచార్యులు అనతిచ్చిరి. కావుననే అర్జునుడు మనశ్చాంచల్యమునుగూర్చి ఫిర్యాదు చేసినపుడు శ్రీకృష్ణపరమాత్మ "అభ్యాసవైరాగ్యములద్వారా దానిని నీకు నీవే పోగొట్టుకొనవలెనని" సమాధానమొసంగుటకు కారణము. "ఉద్ధరేదాత్మనాత్మానం" (తన్నుతానే ఉద్ధరించుకొనవలెను) అని గీతయందు భగవానుడు హెచ్చరిక చేసియే యున్నాడు. ముముక్షువులగువారు సద్గురువులవద్ద కేగి "మహాత్మా! అజ్ఞానము బాధించుచున్నది. మనస్సు చపలముగా నున్నది. దుఃఖనివారణోపాయములు సెలవిండు" అని ప్రశ్నించునపుడు, గురువులు "నాయనలారా" ఆ అజ్ఞానమును కొనితెచ్చుకొనినది యెవరు? మనస్సునకు చాంచల్యమును అలవాటుచేసినది ఎవరు? అనాదికాలమునుండి దృశ్యవాసనలచే మేసి ఆ మనస్సును చెడగొట్టినది యెవరు? అసుర సంప్రదూపమైన నిషిద్ధాహారము మీ ద్వారా కడుపునిండా దానికి లభించుటవలన, అది బాగుగ తినమరిగి, క్రొవ్వెక్కి మీ పైననే తిరుగబడుచున్నది. కావున బంధన మెట్లు పోవునో, మమ్ములను అడుగుటకు పూర్వము ఆ బంధనము ఎట్లు వచ్చినదో మీరే యోచించుకొనుడు. మనస్సు చపలముగా నున్నదని మాతో విన్నవించుటకు మునుపు ఆ చాపల్యమును ఎవరు కలుగజేసికొనిరో మీరే విచారింపుడు. అపుడు తన్నివారణము సులభముగ జరుగగలదు" అని వచించుచున్నారు.

"అలివర్ గోల్డుస్మిత్" అను ప్రముఖుడు "వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డు" (Vicar of Wakefield) అను గొప్ప నవలను రచించెను. అందులోని ఒక చక్కని కథను ఈ సందర్భమున తెలుపుట సమంజసముగా నుండునని తోచుచున్నది.

ఒక గ్రామములో ఒక రైతుకుటుంబము కలదు. వారికి ఆ గ్రామములో ఒక సొంత యిల్లు గలదు. దానిని వారి పూర్వీకులలో నెవరో చాలకాలము క్రిందటనే నిర్మించియుండిరి. దానిలోనుండి ఆ కుటుంబమువారు మరియొక ఇంటిలోనికి మారవలసివచ్చెను. కావున సామానులన్నిటిని అందుండి బయటకు తరలించుచుండిరి. అన్నివస్తువులను బయటకు తీయగల్గిరి. కాని ఒక పెద్ద అద్దము మాత్రము బయటకు రాలేదు. గదిగుమ్మము చిన్నది. అద్దము పెద్దది. వచ్చిన చిక్కు అది. ఎందఱో ఎన్నియో విధముల ప్రయత్నించిరి. కాని సఫలము కాలేదు. పెద్ద చిక్కుసమస్య వారికి ఏర్పడినది. ఆ సందర్భమున చుట్టు ప్రక్కలనున్న నలుగురు పెద్దలు ఒకచోట చేరి ఉపాయమును అన్వేషింపనారంభించిరి. "గది గుమ్మమును వెడల్పు చేయవలసినదే అని ఒకరి సలహా; కాదు, అద్దమును రెండుగా చీల్చి బయటకు తీసుకొని వెళ్ళి మరల జోడించుకొనవచ్చును అని మరియొకరి సలహా. ఇట్లు పలువురు పరిపరివిధముల పలుకుచుండ అందు ఒక వ్యక్తి లేచి ("Let us now think over how it ever came-in") అసలు గదిలోపలికి అది యెట్లు రాగలిగెను? అని ప్రశ్నిం

చెను. గంభీరములగు ఆవాక్యములు అచటచేరిన వారినంద రిని ఆలోచనగా నిమగ్నులుగ చేసివైచెను. అట్లు ప్రకారముగనే అజ్ఞానము యొక్క-గాని మనశ్చాంచల్యము యొక్క-గాని నివారణోపాయముల నన్వేషించుటకు పూర్వము, అవి జీవున కెట్లు సంభవించినవో యోచించుకొనిన చాలును. జీవుని అజాగ్రతవలన, ప్రయత్నరాహిత్యమువలన అవి ఏర్పడినవి. కావున ఇపుడు జాగ్రతగలిగి ప్రయత్నము నాచరించినచో అవి తొలగిపోగలవు. ఇక్కారణముననే శ్రీకృష్ణమూర్తి అర్జునుని ప్రశ్నకు సమాధానముగ "నీవు నీవే వైరాగ్య పూర్వకమగు అభ్యాసమును, ప్రయత్నమును సలుపుకొనుము. అపుడు మనస్సు అదుపులోనికి వచ్చును." అని సెలవిచ్చెను. కాబట్టి ముముక్షువు లందఱున్న భగవానుని యాదేశప్రకా శము వారివారి మనంబులను సుస్థిరములుగను, నిశ్చలములు గను నొనర్చుటకై మహత్తర పురుషప్రయత్నమును గావింప వలసియున్నది.

అధ్యాత్మికరంగమందు మనోనిగ్రహము ప్రముఖ స్థానము నాక్రమించియున్నది. జీవుని దైనందిన వ్యవహార మందు అది చాల ప్రధానమై యొప్పుచున్నది. కావున దాని నెట్లు సిద్ధింపజేసికొనవలయునో సాధకుడు తప్పక తెలిసికొన వలసియున్నది. మనస్సును జయించినచో అన్నిటిని జయించి నట్లే. దానిని జయించనిచో ప్రపంచములో ఎన్ని జయించి నను వ్యర్థములే కాగలవు. కాబట్టి ముముక్షువునకు అతి ముఖ్యమైనదియు, మోక్షప్రాప్తికి హేతుభూతమైనట్టిదియు

నగు ఈ మనోజయమును గూర్చి ఒకింత విచారించెదము, (1) అభ్యాసము, (2) వైరాగ్యము. అను రెండు ఉపాయములచే మనస్సుయొక్క ఆటను కట్టివేయవచ్చునని గీతలో పరమాత్మ వచించెను. ఇందులో అభ్యాసము మాత్రముండి వైరాగ్యము లేకున్నను, వైరాగ్యముండి అభ్యాసము లేకున్నను మనస్సు పూర్ణముగ నిలుకడను బొందజాలదు. కావున మనోనిగ్రహముకై రెండింటిని చక్కగ సాధించవలెను.

మనోనిగ్రహముకై శ్రీకృష్ణపరమాత్మ వచించిన అభ్యాస, వైరాగ్యములను రెండు సాధనలను గూర్చి ఇచట విచారించెదము.

ఒకానొక కార్యమును సాధించుటకై మరల మరల నొనర్పబడు ప్రయత్నమునకే అభ్యాసమని పేరు.

"స తు దీర్ఘకాలనైరన్తర్య సత్కారసేవితో దృఢభూమిః"

అని పతంజలి మహర్షి నుడివినట్లు దీర్ఘకాలము, నిరంతరము, ప్రీతిపూర్వకముగ యత్నము నాచరించినచే మనోనిగ్రహము సాధ్యపడగలదు. అనేక జన్మలయందు మనస్సు మాయాప్రవాహమున నెమ్మదిగ కొట్టుకొని పోవుచుండెను. ఇపుడు సద్గురూపదేశముచే మాయను, ప్రకృతిని, అజ్ఞానమును ధిక్కరించి ప్రవర్తింపవలసి యుండుటచే ప్రవాహమునకు ఎదురీదవలసివచ్చుచున్నది. ఎన్నియో కోట్లవత్సరములు, జన్మలు, దుష్టవాసనావలంబనమునందు వినియోగింపబడినవి. ఇప్పుడు

సద్వాసనాశ్రయమందు కొలది వత్సరములైనను నియోగింప నక్కరలేదా? కావున మరల, మరల అభ్యాసముద్వారా మనస్సును లొంగదీయవలెను. కోతి, ఎలుగుబంటు, పులి, మొదలగు నోరులేని జంతువులకుగూడ మరల మరల నేర్పుట ద్వారా "సర్కస్" యజమాని వానిని స్వాధీనపరచుకొని ఇష్టము వచ్చినట్లు ఆడించుటలేదా? ఇక యెంతయో ప్రజ్ఞ గలిగిన మానవుడు ఏల దారికిరాడు? అతని మనస్సు ఏల లొంగదు? తప్పక లొంగును. కాని తదేక యత్నముతో, దీక్షతో, అభ్యసించుచు రావలెను.

"అజ్ఞోఽపి తజ్జ్ఞతామేతి శనైః శైలోఽపి చూర్ణ్యతే
బాణోఽప్యేతి మహాలక్ష్యం పశ్యాభ్యాసవిజృమ్భితమ్. (వసిష్ఠగీత)

"ఓ రామచంద్రా! మరల మరల (జ్ఞానము) అభ్యసించుటవలన అజ్ఞానియు, జ్ఞాని యగుచున్నాడు. పెద్దపెద్ద కొండలున్ను పిండిచేయబడుచున్నవి. బాణమున్ను అతి సూక్ష్మమగు లక్ష్యమును భేదించివేయుచున్నది. చూచితిరా! అభ్యాసముయొక్క ప్రాబల్యము! అని శ్రీవసిష్ఠమునీంద్రుడు శ్రీరామునకు తెలిపియున్నాడు. "రసరీ ఆవత జాతతే శిల్ పర్ హోత నిశాన్"—అని హిందీభాషయందు ఒక సామెత గలదు. అనగా శిలపై రోజూ చీమలు ప్రాకుచుండినచో దానిపై దారి ఏర్పడగలదు అని అర్థము. కఠినమైన శిలను గూడ అల్పమగు చీమ భేదించగలిగినది దేనిచేత? నిరంతర గమనరూపమగు ప్రయత్నముచేత. కొన్ని గ్రామములలో బావులకు చుట్టును కట్టబడు తొట్టికట్టడముపై జనులు నీళ్లు

తోడుకొని కుండలు పెట్టుటవలన కొంతకాలమునకు అ రాతిపై గుంటలు ఏర్పడుచుండుట మనము చూచుచున్నాము కదా! కుండ ఎచట? కఠినమగు రాయి ఎచట? దానిని ఆ కుండయే ప్రతిరోజు కొంచెము కొంచెము అరగదీసి కాల క్రమమున కఠినశిలను సిర్జించి వేయుచున్నది. దీనినే అభ్యాస మందురు. ఇట్టి అభ్యాసమునే మనోజయమునం దుపయో గించవలెనని భగవానుని ఆజ్ఞ.

మనోజనోపాయములలో ఇక రెండవది వైరాగ్యము. అనగా విషయవిరక్తి. ఇది లోపించినందువలననే అనేకులకు మనస్సు నిలుకడ లేకయున్నది. ఇంద్రియములు, ఇంద్రియా ర్థములగు శబ్దస్పర్శాదులవైపు పరుగిడుచున్నంతవరకు మన స్సునకు నిశ్చలత్వ మెట్లుండగలదు? ఇంద్రియములు విషయ ముల వెంటపోవునపుడు మనస్సున్ను వాని ననుసరించి పోవును. కావున కిటికీలు తెఱచియున్న ఇంటియందు గల ప్రమిదదీపము గాలివలన కదులుచునే యుండువట్లు, అట్టి మనస్సు నిరంతరము చపలముగనే యుండును. కావున విష యములయందు దోషదృష్టిని చూచుటద్వారా మనస్సును వానినుండి మరల్చి అంతర్ముఖ మొనర్పవలెను. ఆత్మయందు చేర్చవలెను. దీనినే వైరాగ్యమందురు. అయితే విషయము లందు దోషమును అనవసరముగ కల్పించవలసిన అగత్యము లేదు. వానియందు స్వతఃదోషము ఉండనేయున్నది. దానిని చింతించిన చాలును. ఆదోష మేమి? నశ్వరత్వము, పరిణామ

శీలత్వము వినాశము. ఇవియే ప్రాపంచిక పదార్థములందు గల దోషములు.

కాబట్టి దృశ్యపదార్థము లన్నిటియందును అవి యెంతటి మహిమాతిశయముతో గూడుకొనినవైనప్పటికిని, వినాశము, మృత్యువు మున్నగుదోషము లుండనే యున్నవి. నశించు పదార్థమునందు సౌందర్య మెచట? నాశ శీలమగు వస్తువు ఎంతటి ఆనందము నొసంగగలదు? ఒకవేళ ఒసంగినను ఆ ఆనంద మెంత పర్యంతముండగలదు? అనుభవించు వ్యక్తి, అనుభవింపబడు పదార్థము రెండును కొంతకాలము నకు శైథిల్యమే పొందుచుండ ఇక వాని సంయోగమువలని సుఖము ఎంత చంచలమైనదో, క్షణికమైనదో యోచించు కొనుడు. మఱియు అట్టి తుచ్ఛసుఖమునకై వాపోవు మను జుడు ఎంతటి విజ్ఞానవంతుడో ఊహించుకొనుడు. ఈ ప్రకారముగ దృశ్యపదార్థములందలి దోషములను చక్కగ విచారించి పూర్వకాలమున ఉద్దాలకాది మహర్షులు, జనక, బలి, ప్రహ్లాదాది రాజశ్రేష్ఠులు విషయవిరక్తి కల్గి సత్యవస్తువగు పరమాత్మ నాశ్రయించుటద్వారా పరమోన్నతిని బొంది యుండిరి. 'యద్దృశ్యం తన్నశ్యం' (ఏది దృశ్యమో అది నశించియే తీరును)-అను శాస్త్రోక్తి ముమ్మాటికిని సత్యము. ప్రపంచములో దృగ్వస్తువగు ఆత్మతప్ప దృశ్యరూపమగు ఈ సంసారమంతయు కాలుని కరాళవదనమునకు ఏనాడైన ఆహుతి కావలసినదే. మహారాజులు, వారి రాజ్యములు, వారి వైభవములు, పర్వతాలు, బ్రహ్మాండములన్నియు

తద్గతవస్తుజాలమంతయు కాలగర్భమున అంతరించియే పోవు చున్నవి.

The spider weaves its web where Caesars ruled. 'ఒకనాడు రోమన్ చక్రవర్తులు రాజ్యమేలిన దివ్య భవనములందు ఈనాడు సాలీళ్లు గూళ్లు పెట్టుచున్నవి' అను సామెత కలదు. అనగా అవియన్నియు శిథిలమైపోయినవని భావము. ఎంతయో వైభవముతో తులతూగిన విజయనగర సామ్రాజ్య మిపు డేమైనది? అశోకుని కాలమున, నాగార్జ నుని కాలమున వెలసిన ఆ కట్టడములు, రాజప్రసాదములు భూమిలో పూడిపోవ, పురావస్తుశాఖవారు వానిని పెల్ల గించుచుండుట మనము చూచుచున్నాముకదా!

ఇవన్నియు విచారించిచూచినచో ప్రపంచములో దైవము (ఆత్మ) ఒకటి తప్ప తక్కిన పదార్థములన్నియు నాశశీలములని స్పష్టము కాగలదు. ఇట్లెఱిగి భోగజాలము లపై ఆశవదలి, మనస్సును సత్యమగు పరమాత్మధ్యాన మందు వినియోగించవలెను. ఇవ్విధముగ వైరాగ్యభావన కలిగియున్నచో మనోనిగ్రహము సులభతరము కాగలదని శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు గీత 6 వ. అధ్యాయమున బోధించెను.

ఇంతవరకు మనస్సును బయటకు పరుగెత్తకుండ చేయుటకు వలసిన వైరాగ్యాది సాధనసంపత్తినిగూర్చి విచా రించినాము. బాహ్యవస్తువులయందలి నశ్వరస్వభావము, ఆపాతరమణీయత్వము, చంచలత్వము, అల్పసుఖత్వము,

జడత్వములను పరిశీలించినచో వివేకవంతునకు సహజముగనే వానియెడల విరాగము జనింప మనస్సు దృశ్యములపైనుండి మఱలును. ఈ ప్రకారముగ మనస్సు బహిర్ముఖము కాకుం డుట ఆధ్యాత్మికసాధనలయందు గొప్ప సహాయమే అగును. కాని అంతమాత్రముతో మనపని పూర్తి కాలేదు. బాహ్య మునుండి మరలించిన ఆ మనస్సును అంతర్ముఖము చేయునట్టి పని యింకను మిగిలియున్నది. ఇది చాల ముఖ్యమైనది. అసలు ప్రధానమైన పని ఇదియే. అనగా మనస్సును అంత ర్ముఖముచేసి ఆత్మయందు స్థాపించుట అన్నిటికంటెను ముఖ్య మైన కార్యము. ఇక్కార్యమును సాధించుటకు విషయ విరక్తి, దృశ్యవిముఖత్వము సహాయపడును. అంతమాత్రమే. ఏలయనిన, మనస్సు ఒకవేళ బహిర్ముఖము గాకుండనుండి నను ఊరక తమస్సునందు పడియుండినచో నేమి ప్రయో జనము? ఆ విరక్తచిత్తమును ఆత్మధ్యానమునందు ప్రవే శింపజేయవలెను. అపుడే జీవుని కర్తవ్యము పూర్ణముగ నెరవేరగలదు. జన్మసార్థకము కాగలదు. కావున విషయ విరక్తి, ఆత్మాసక్తి రెండును అవసరములు. మొదటిది మాత్రముండి రెండవది లేనిచో సాధన అపూర్ణముగనే యుండును. కనుకనే "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను బ్రహ్మ సూత్రము వైరాగ్యాదిసాధనచతుష్టయసంపత్తిని బొందినపిదప ఊరకయుండక బ్రహ్మచింతన, ఆత్మధ్యానము, ఆత్మవిచారణ తప్పక చేయవలెనని శాసించుచున్నది. బ్రహ్మసాక్షాత్కార నకు వైరాగ్య మొక్కటియే చాలదని ముముక్షువులు

జ్ఞప్తియందుంచుకొందురుగాక! వైరాగ్యానంతరము మనస్సును అంతర్ముఖమొనర్చి తదేకనిష్ఠతో ఆత్మయందు నెలకొలుపవలయును. ఆత్మధ్యానము గావింపవలయును. ఒకడు అప్పుచేసెననుకొనుడు. ఋణబాధచే బాధపడుచున్న యాతడు హాయిగా నుండవలయుననిన కేవలము అప్పుమాత్రము తీర్చివేసిన చాలదు. అప్పు తీర్చినంతమాత్రమున తినుటకు తిండి ఎచట దొరకును? కావున అప్పు తీర్చవలెను, పొంతముగ మరికొంత ధనమును సంపాదించవలయును. ఈ రెండును జరిగినప్పుడే ఋణగ్రస్తునకు పూర్ణశాంతి కలుగగలదు. ఆ ప్రకారముగనే జీవుడు దృశ్యమను ఋణభారమును ముందు తొలగించవలెను. ఆ పిదప దృక్స్వరూపము (ఆత్మ) అను ఆస్తిని సంపాదించవలెను. మొదటిది వైరాగ్యాదులచే కల్గును. రెండవది ధ్యానజ్ఞానాదులచే సిద్ధించును.

కర్మయోగ, భక్తియోగసాధనలద్వారా మనస్సునందలి 'మల' దోషమును, మనోనిగ్రహముద్వారా, ధ్యానయోగసాధనద్వారా విక్షేపదోషమును తొలగించుకొని తదుపరి ఆత్మతత్త్వవిచారణద్వారా ఆవరణదోషమును నిర్మూలించుకొనవలెను. ఆ త్రితి మనస్సునందలి మల, విక్షేప, ఆవరణములను మూడు దోషములు రహితములు కాగా, మనస్సు పరమశుద్ధమై, ఆమనస్కస్థితిని బడయగలదు. అధిష్ఠానమగు ఆత్మయందు లయించగలదు. అదియే మోక్షస్థితి. కుండలోని నీరు నిర్మలముగా నున్నను నిశ్చలముగా నున్నను కుండపై మూతపెట్టబడియున్నచో, ఆ నీటి

యందు సూర్యప్రతిబింబము పడనేరదు. అట్లే మల, విక్షేప దోషములు రెండును తొలగినప్పటికిని, ఆవరణదోషమున్నంతవఱకు, మనస్సు అజ్ఞానముచే ఆవరింపబడియున్నంతవఱకు ఆత్మానుభూతి జీవునకు కలుగనేరదు. కాబట్టి జ్ఞానవిచారణచేత ఆ యజ్ఞానమును పారద్రోలవలెను. ఆ విచారణ మెట్టిదో, జ్ఞానమనగా నేమియో ఇపుడు పరిశీలించెదము—

# 18 వ అధ్యాయము

## జ్ఞానయోగసాధన

ఈ ప్రపంచమున ఆత్మ, అనాత్మ, క్షేత్రము, క్షేత్రజ్ఞుడు, దృక్కు, దృశ్యము అన్నియు ఏకమై అజ్ఞానికి గన్పట్టుచున్నవి. వానిని విడదీయుటయే జ్ఞానము. వానిని విభజించి జడమును జడముగను, చైతన్యమును చైతన్యముగను భావించుటయే జ్ఞానము. కనుకనే 'విభాగ' యోగములను పేరుతో కొన్ని అధ్యాయములు గీతయందు ప్రత్యేకముగ చెప్పబడినవి. (క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము, గుణత్రయవిభాగయోగము, దైవాసురసంపద్విభాగయోగము, శ్రద్ధాత్రయవిభాగయోగము అని), 'విభాగ' మనగా కలిసియున్న వానిని విడదీయుట (Division) అని అర్థము. మంచి, చెడ్డ కలిసియున్నపుడు వానిని వేఱుచేసి, మంచిని గ్రహించి చెడ్డను విసర్జించుట లోకములో పరిపాటి. గుజ్జు తొక్క రెండును కలిసియున్న అరటిపండును పిల్లవాని కిచ్చునపుడు అతడు వెంటనే దానిని ఒలిచి గుజ్జును తిని, తొక్కను పారవేయును. ప్రతిదినము ఉదయముననే ఇండ్లయందు గృహిణులు బియ్యము, రాళ్లు కలిసియున్న వస్తువును చేటలో వేసికొని బియ్యము నట్టిపెట్టుకొని రాళ్ళను ఏరి పారవేయుదురు. అట్లే ఆత్మ, అనాత్మ కలిసియున్న ఈ ఉపాధియందు

గాని, దృశ్యప్రపంచమునందుగాని వానిని విభజించి ఆత్మయందే చిత్తమును నెలకొల్పి అనాత్మయందు విరక్తి కలిగియుండవలెను. ఇదియే జ్ఞానము. క్షేత్రమునుండి క్షేత్రజ్ఞుని వేఱుచేసి క్షేత్రజ్ఞుడే తానని భావించి క్షేత్రముయెడల అనాసక్తిని కలుగజేసికొనవలెను. 'అస్తి, భాతి, ప్రియ, నామ, రూపము'లను ఐదింటితోఁగూడిన ప్రతివస్తువునందును మొదటి మూడును సత్యమనియు, తక్కిన రెండును అసత్యమనియు భావము కలిగియుండవలెను.

ఇక క్షేత్రమనగా నేమియో క్షేత్రజ్ఞుడనగా నెవరో యోచించెదము. పంచమహాభూతములు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము, కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, శబ్దస్పర్శాదివిషయములు, ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, దేహేంద్రియాదిసమూహము, అంతఃకరణవృత్తులు మున్నగునవియన్నియు క్షేత్రమనబడును. దీనిని తెలిసికొను ప్రజ్ఞారూపమగు చైతన్యమే క్షేత్రజ్ఞుడు.

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత. (13-3)

'ఓ అర్జునా! సమస్తక్షేత్రములందును క్షేత్రజ్ఞుడను నేనే యని యెఱుగుము' అని శ్రీకృష్ణపరమాత్మ వచించిన అమోఘమగు సత్యము జనులపాలిటి వరప్రసాదమై యున్నది. ఏలయనిన సాక్షాత్ పరంధాముడు, వైకుంఠనాథుడు, విశ్వవ్యాపక చిన్మూర్తి ప్రతివానియొక్క హృదయాంతరాళము వెలుగొందుచున్నాడే కాని దూరమున లేడని దీనిచే

స్పష్టమగుచున్నది. ఆత డతిసమీపముననే వర్తించు చున్నాడు. సర్వసాక్షియై మనలోనే ప్రకాశించుచున్నాడు. కాబట్టి ప్రయత్నముచే మన మాతనిని తప్పక పొందగలము— అను ధైర్యము దీనిచే కలుగుచున్నది. 'సర్వక్షేత్రేషు'—అని చెప్పబడినందువలన జాతి, మత, కుల, విచక్షణలేక సమస్త చరాచరములందును క్షేత్రజ్ఞుడగు పరమాత్మ అధివసించి యున్నాడని విస్పష్టమగుచున్నది. విచారణచే, అన్నమయ, ప్రాణమయ, విజ్ఞానమయ, ఆనందమయములను పంచకోశములను వేఱుచేసి చూసినచో వాని యభ్యంతరమున సర్వసాక్షియగు ఆత్మ ప్రతివారియందు తప్పక అనుభూతము కాగలదు. అట్టి ఆత్మానుభూతియే జ్ఞానముయొక్క ఫలము. అదియే మోక్షము. కాబట్టి జ్ఞానవిచారణ జీవుని మహోన్నత ఆధ్యాత్మికశిఖరములకు గొనిపోయి, స్వస్వరూపానుభవముద్వారా జీవుని దేవునిగ జేసి పరమానందమును, జీవన్ముక్తిని ఇచటనే కలుగజేయుచున్నది. (జ్ఞానవాన్ మాం ప్రపద్యతే.)

జ్ఞానము కలిగిన పిమ్మట మనుజునిచే ఆచరింపబడు కర్మ మహాపవిత్రమై, నిర్లేపమై యుండును. ఏలయనిన బుద్ధికి ఆవలనున్న (బుద్ధేః పరం) పరమాత్మను ఎఱిగినవాడు, అచ్చోట స్థితిని బొందినవాడు, దేహేంద్రియాది సంఘాతమునంతను, అంతఃకరణమును సాక్షిగ వీక్షించును. అత్తతి తాను కర్తకాదు. దేహేంద్రియాదులు వానివాని పనులను అవి చేసికొనుచుండును. వానియం దేమియు తగుల్కొనక

చక్కగ నభ్యసించవలెను. అట్టి జ్ఞానగుణముల నభ్యసించనిచో జ్ఞేయవస్తువగు పరబ్రహ్మము అనుభూతము కానేరదు.

మఱియు భగవద్గీత ఏడవ అధ్యాయమున నాలుగు రకములగు భక్తులు చెప్పబడిరి—వారు క్రమముగ— ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని అని పేర్కొనబడిరి.

ఉదారాస్సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మే మతమ్. (7-18)

"వారందరున్ను శ్రేష్ఠులే కాని జ్ఞాని సాక్షాత్ నేనే అని నా అభిప్రాయము." అని శ్రీకృష్ణమూర్తి జ్ఞానముయొక్క సర్వోన్నతస్థితిని విశదీకరించెను. జ్ఞాని సాక్షాత్ భగవంతుడు. భగవంతునకును జ్ఞానికిని ఏమాత్రము భేదములేదు— అని ఆ వాక్యములయొక్క అర్థము. ద్వైతసాధనలన్నియు క్రమక్రమముగ వికసించి వికసించి అద్వైతములోనికి గొని పోయినవి. ఇక భగవంతుడు, భక్తుడు అను భేద మచట లేదు. ఇరువురును ఒకే సచ్చిదానందఘనస్వరూపమై యలరారు చుదురు. అదియే జీవితముయొక్క చరమస్థితి. అదియే సాధనల యొక్క అంతిమదశ. అదియే జీవన్ముక్తి. జ్ఞానముయొక్క ఫలిత మింత మహిమతో గూడియున్నది. కాబట్టి ప్రతి వారును తమ జీవితమునం దిట్టి అమోఘమగు జ్ఞానస్థితిని తప్పక సంపాదించవలయును.

జీవుని లక్ష్యమగు అట్టి ఆత్మసాక్షాత్కారము (మోక్ష పదవి) చాల గొప్పది. కాని సమయము చాల స్వల్పము. విఘ్నములు మెండు. కావున అతడు తన కీశ్వరుడిచ్చిన స్వల్ప

ఆయుర్దాయమునందే తత్ప్రాప్తికై జ్ఞానసాధనరూప మహాప్రయత్నమాచరించవలెను. చక్కటి నియమము లేర్పరచుకొని ఇంద్రియములను మెల్ల మెల్లగ వశీభూత మొనర్చుకొనుచు చిత్తమునందుగల ఆసురిక సంస్కారములను క్రమక్రమముగ పారద్రోలుచుండవలయును. తన స్వరూపము పాంచభౌతికముగాదనియు, సచ్చిదానందఘనమనియు మఱల మఱల చింతనజేయవలెను. ఈ ప్రకారముగ నియమము తప్పక ప్రతిదినము సాధన చేయుచుండినచో అచిర కాలములో నతనికి గొప్ప మనశ్శాంతి, పరమానందానుభూతి తప్పక కలుగగలవు. ఇట్టి పరమసత్యములను జ్ఞాపకముచేసికొనుచు, స్వస్వరూపానుభవమను పరమలక్ష్యమును సాధించుటకై జీవుడు ఈ క్రింద తెలుపబడినప్రకారము కొన్ని తీవ్రతర ప్రతిజ్ఞలను గావించుకొనవలసియున్నది.

1. తాను ఆత్మయే కాని దేహము కాదు. తనకు ఏకాలమందును వినాశము లేదు. నశించునది, వికారము నొందునది, మరణించునది దేహమే కాని దేహియగు తాను కాదు. ఈ ప్రకారముగ తనయొక్క 'సత్' అంశమును మాటిమాటికి మననము చేయుచుండవలెను.

2. తాను జడమగు ఒకానొక మట్టిబొమ్మ కాదు. మృణ్మయుడు కాదు. చిన్మయుడు. ప్రజ్ఞానఘనస్వరూపుడు. సుషుప్తియందును మేలుకొనియుండు చిద్రూపాత్మయే తాను —ఈ ప్రకారముగ తనయొక్క 'చిత్' అంశమును మఱల మఱల చింతన చేయుచుండవలెను.

అతడు నాశరహితమగు సనాతనపరబ్రహ్మమునందే నిలుకడ కలవాడై స్వస్వరూపానుభవము నొందుచు, అసక్తబుద్ధి గల్గి యుండును. జ్ఞాని యగువాడు ఒకవేళ లోకహితార్థము కర్మ చేసినను అట్టి అసక్తబుద్ధితోనే, నిర్లిప్తమానసముతోనే చేయును. అత్తఱి ఆ కర్మ పరమపునీతమై, అత్యద్భుత మహిమతో గూడియుండును. జ్ఞానిచేయు కర్మకున్ను, అజ్ఞానిచేయు కర్మకున్ను గల వ్యత్యాస మిదియే. అజ్ఞాని దేహేంద్రియాది సంఘాతముతో ఐక్యమై, 'దేహమే నేను' అని భావించి సక్తచిత్తుడై కర్మల నాచరించి బద్ధుడగును. జ్ఞాని 'నేను దేహమును కాను, సచ్చిదానందరూపమై, జననమరణరహితమై, సనాతనమై, అవ్యయమైనట్టి ఆత్మయే నేనుగాని నశ్వర దేహాది సముదాయమును కాను'— 'తద్బ్రహ్మ నిష్కలమహం న చ భూతసంఘః' అని దృఢముగ నిశ్చయించి, అహంభావమును పారద్రోలి, మమత్వరహితుడై, కర్తృత్వమును వీడి అసక్తబుద్ధితో కర్మల నాచరించి ముక్తుడగును. కావున కర్మల నాచరించుటకు పూర్వము వాని యందు కుశలత్వము నెట్లు సంపాదింపగలరో ఆ రహస్యము నెఱుగవలెను. అట్టి కర్మకుశలత్వము జ్ఞానము వలననే కలుగును.

కనుకనే శ్రీకృష్ణపరమాత్మ రెండవ అధ్యాయమున తొలుదొల్తనే జ్ఞానము నుపదేశించి, కర్మయందు కుశలత్వము (Non-attachment) ను సంపాదించు కీలకమును బోధించి ఆ పిదప కర్మయోగమున కుపక్రమించెను.

'యోగస్థః కురు కర్మాణి'—(ఆత్మయందు నిలుకడ కలిగి అసక్తబుద్ధితో కర్మలను చేయుము) అను మహామంత్రమును అత్తఱి బోధింప మొదలిడెను. కాబట్టియే మహాత్ములు జ్ఞాన ప్రాప్త్యనంతరము చేయు లోకసేవ, సామాన్యులు చేయు సేవకంటె ఎన్నిరెట్లో అధికమై, నిష్కళంకమై యొప్పారును. జ్ఞానమును పొందిన పిదప వారివారి సంస్కారము ననుసరించి కొందఱు నివృత్తి నవలంబించుచుందురు. మరికొందఱు ప్రవృత్తిని స్వీకరింతురు. అత్తఱి ప్రవృత్తిని స్వీకరించి నప్పటికిని వారికి నివృత్తిఫలమే కలుగును. శ్రీకృష్ణుడు, జనకుడు, ఇక్ష్వాకువు మొదలగు చక్రవర్తులు, శంకరాచార్యులు, వివేకానంద మొదలగు సన్న్యాసులు జ్ఞానానంతరము లోక హితార్థము ఎంతయో కర్మకాండ నాచరించిరి. అయినను జ్ఞానప్రభావముచే వారలను కర్మ ఏమాత్రము బంధింప కుండెను. కాబట్టి ప్రవృత్తికైనను, నివృత్తికైనను జ్ఞానము సర్వజీవులకును అవశ్యము సంపాదింపదగియున్నది. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ—

న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే. (4-38)

'జ్ఞానముతో సమానమైన పవిత్రమగు వస్తువీ ప్రపంచమున ఎచటను లేదు.' అని గీతయందు జ్ఞానప్రభావమును ఎలుగెత్తి చాటెను. అయితే అపరోక్షజ్ఞానము హృదయమున చక్కగ కలుగవలె ననిన గీత 13-వ అధ్యాయమున చెప్పబడిన అమానిత్వాది జ్ఞానగుణములను సాధకుడు

3. తాను సంసారదుఃఖములందు పడి క్రుంగిపోవు కీటకము కాదు, ఆనందసాగరమున నోలలాడు బ్రహ్మాండాధిపతి. నిప్పును చెదలు అంటజాలనట్లు దుఃఖశోకము లెవ్వియు తన్ను స్పృశింపజాలవు. ఈ ప్రకారముగ తనయొక్క 'ఆనంద' అంశమును మాటిమాటికి మననము చేయుచుండవలెను.

ఈ రీతిగ తాను 'సత్, చిత్' ఆనంద'రూపుడగు పరబ్రహ్మమే యను పరమసత్యమును ప్రతిదినము పెక్కుసార్లు జ్ఞాపకము చేసికొనవలయును,

'తద్బ్రహ్మనిష్కలమహం న చ భూతసఙ్ఘః.'

'నిష్కళమగు ఆ పరబ్రహ్మమే నేనుగాని పంచభూతసముదాయమగు దేహముకాదు' అని శ్రీ శంకర భగవత్పాదులానతిచ్చినట్లు ప్రతిజీవియు తన నిజరూపమును దినమునకు ఎన్నియో పర్యాయములు స్మృతిపథమునకు తెచ్చుకొనుచుండవలెను. తాను దరిద్రుడు కాదనియు, సమ్రాట్టనియు, మహాచక్రవర్తియనియు, విశ్వసామ్రాజ్యాధిపతియనియు భావించవలెను. ఇదియే జ్ఞానసాధన.

యద్భావం తద్భవతి

తానెట్లు భావించునో అట్లే యగును. కావున ప్రాతఃకాలము నిద్రలేచినది మొదలు మరల పరుండువరకును, వ్యవహారమధ్యమునగూడ నిట్టి మహోన్నత గంభీర భావములను పలుసార్లు జ్ఞప్తికి తెచ్చుకొనుచుండవలెను. అట్లు

జ్ఞాపకము చేసికొనునపుడు 'ఓమ్, ఓమ్, ఓమ్' అని ప్రణవమునుగూడ స్మరించుచుండుట ప్రారంభమున చాల సహాయకారిగ నుండగలదు.

మఱియు, జనులు వారివారి సంస్కారము ననుసరించి కర్మమార్గమునుగాని, భక్తిమార్గమునుగాని, ధ్యానమార్గమునుగాని, జ్ఞానమార్గమునుగాని చేబట్టి, వైరాగ్యమును, సర్వభూతదయను అన్నిమార్గములకు తోడుగ దీసికొని అధ్యాత్మపథమున అగ్రసరులై ఆత్మస్వరూపమునుగూర్చిన విజ్ఞానమును చక్కగ బడసి అచిరకాలములోనే ఆత్మసాక్షాత్కారరూప చరమలక్ష్యమును సాధించివేయవలెను. అట్టి లక్ష్యసాధనకు మిక్కుటముగ ఉపకరించు ఏ ఆత్మతత్త్వవిచారణకలదో అద్దాని నిపుడు కావించెదము.

## ఆత్మతత్త్వవిచారణ

ఏది వేదముయొక్క సారమై యలరుచున్నదో, సమస్త చరాచర ప్రాణికోట్లును ఏ యానందస్వరూపమును పొందదలంచుచున్నవో, ఎద్దాని ప్రాప్తికై జీవులు భిన్నమార్గముల ననుసరించుచున్నారో అట్టి ధ్యేయాకారమగు పరబ్రహ్మమే ఆత్మ. సర్వవ్యాపకమై, సర్వజీవులందును సాక్షిరూపమున వెలుంగుచు, ప్రపంచమున కంతకును ఆధారభూతమై యొప్పుచు, జగత్తు అంతయు నశించినను తానుమాత్రము నశింపక జన్మజరామరణాది క్లేశములచేగాని, పదార్థముల యొక్క వికారములచేగాని యంటబడక విశుద్ధమై, ఇంద్రి

యాతీతమై బుద్ధ్యాదిసంఘాతమునంతయును గూడ ప్రకాశింపజేయుచు నెయ్యది వెలయుచున్నదో, అదియే ఆత్మ. వ్యాస వసిష్ఠాది మహామునీంద్రులు విహరించు స్థానమదియే. సనకాది మహర్షులు సంచరించు క్షేత్రమయ్యదియే. జీవన్ముక్తులగు యోగీశ్వరు లందఱును క్రీడించు దివ్య ఆనందమయరంగమదియే. ఆ క్షేత్రము బుద్ధికి ఆవలనున్నది కావున మనోబుద్ధులకు వశులైనవారికి ఇంద్రియములను జయింపనివారికి అద్దాని తత్త్వము బోధపడనేరదు.

లౌకికవిద్యలెన్ని గడించినను చిత్తశుద్ధిలేనిచో ఆత్మతత్త్వము లేశమైనను అనుభూతముకాదు. ఎట్టిమహాపండితుడైనను నేత్రములేనిచో వస్తువులను జూడగల్గునా? సకలశాస్త్రపారీణుడైనను, విద్యాధురంధరుడైనను నిద్రబోవుచో జాగ్రత్ప్రపంచవిషయము లాతనికి గోచరించునా? సామాన్యుడైనను నేత్రము లుండినచో చూడగల్గునట్లును, మేలుకొనినచో సమస్తవస్తుజాలమును గాంచగలిగి యితరులనుగూడ ప్రబుద్ధులుగజేయ గలుగునట్లును, ఈ ఆత్మవిద్యనుగూర్చియు నట్లే యెఱుంగవలెను.

పశ్యన్నపి ప్రస్ఖలతి శృణ్వన్నపి న బుధ్యతి,
పఠన్నపి న జానాతి దేవమాయావిమోహితః.

'చిత్తశుద్ధిగలుగకపూర్వము జనులు మాయావృతులై యున్న కారణమున అట్టివారు పరమార్థతత్త్వమును చూచినను చూడకయే యున్నారు. వినినను తెలియజాలకయేయున్నారు. చదివినను అర్థము చేసికొనజాలకయే

యున్నారు!' అని విష్ణుభగవానుడు గరుత్మంతునకు శెలవి గించెను. ఇదియే తక్కిన విద్యలకును ఈ ఆత్మవిద్యకును గల భేదము కనుకనే అనేకులలో నెవడో యొకడు మాత్రమే ఈ విద్యనుగూర్చి ప్రయత్నించుటయు, అట్లు ప్రయత్నించిన యనేకులలో నెవడో యొకడు మాత్రమే సఫలుడగుటయు సంభవించుచున్నది. మఱియు పరిపూర్ణ స్థితినిబొంది ఆత్మ వస్తువును కరతలామలకముగ నెఱింగిన జ్ఞానులు లోకమున బహు కొద్దిమంది మాత్రమేయుండుటకును నిదియే కారణము.

దృశ్యవాసనలన్నియు సంపూర్ణముగ నశించుట చేతను, సంకల్ప వికల్పములన్నియు ఉడిగి మనస్సు ధ్యేయా కారమున సంలగ్నమగుట చేతను, భ్రమరకీటన్యాయమువలె ఆత్మతో తదాకారాకారితమగుటచేతనుదప్ప మఱిదేనిచేతను ఈ ప్రబలమగు మాయ నశింపదు. తక్కిన యోగములు, ధ్యానములు, పూజలు, జపములు అన్నియు అంతఃకరణము నందలి మాలిన్యమును తొలగించివైచి క్షేత్రమును శుద్ధము చేయును. అట్టి శుద్ధాంతఃకరణమున ఆత్మ ప్రతిబింబించును. అనాత్మభూతములగు దృశ్యవృత్తులన్నియు తొలగిననే ఆత్మ స్థితి ఘటిల్లును. అపుడే ఆత్మ నిరావరణమై భాసిల్లును.

నిజముగ విచారించినచో ఆత్మయొక్క ఆవరణము తొలగించుటయే మనపనిగాని, లేని ఆత్మవస్తువును క్రొత్తగా పొందుటగాదు. శంకరులు వచించినది చూడుడు.—

> ఆత్మాతు సతతం ప్రాప్తోఽప్యప్రాప్తవదవిద్యయా,
> తన్నాశే ప్రాప్తవద్భాతి స్వకంఠాభరణం యథా.

అనగా, ఆత్మ ఎల్లప్పుడును జీవులకు సంప్రాప్తించియే యున్నది. కాని అవిద్యచే అయ్యది లేనిచందమున వర్తించు చున్నది. ఆ అవిద్య నశించిన వెంటనే మఱచిన నిజకంఠా భరణమునువలె తిరిగి దానిని జీవుడు పొందుచున్నాడు. కాబట్టి జీవులందఱును యథార్థముగ ఆత్మస్వరూపులే. భ్రమచే తాము బద్ధులమని అజ్ఞానులమని తలంచుచున్నారు. ఇయ్యది అతీతబోధ. ఇదియే పరమసత్యము. రజ్జువునకు ఏకాలమందును వికారము లేదు. సర్పభ్రమ కలుగక మును పును, కలుగుకాలమునను, భ్రమ నివారణానంతరమును గూడ అయ్యది ఒకే విధముననున్నది. ఘటమున్నప్పుడును, లేనప్పుడును అందలి జలము చలించుచున్నపుడును, నిశ్చల ముగ నున్నపుడును గూడ సూర్యుడు ఒకేవిధముగ ఎల్ల కాలములందును ప్రకాశించుచున్నాడు. అదేరీతిగ మార్పు అంతయు చిత్తమునకు కలుగుచుండ ఆత్మస్వరూపుడగు జీవుడు అజ్ఞానకాలమున ఆ మార్పు తనపై నారోపించుకొని ఆ యుపాధితో తాదాత్మ్యమొంది దుఃఖితుడగుచున్నాడు. ఎట్లనగా కదలుచున్నది రైలుబండి, కాని అందున్న బాలుడు చెట్లు కదలుచున్నవని తలంచుచున్నాడు. తిరుగుచున్నది భూమి, కాని ఆ సత్యము తెలియనివాడు సూర్యుడే పరిభ్ర మించుచున్నట్లు భావించుచున్నాడు.

"దృశ్యతేఽభ్రేషు ధావత్సు ధావన్నివ యథా శశీ"

అనఁగా పరుగిడుచున్నవి మేఘములు. కాని అవి వేకి చంద్రుడు పరుగిడుచున్నట్లు తలంచుచున్నాడు. వెయ్యేల—

త్రివిధ శరీరములతోటి తాదాత్మ్యమే జీవునకు బంధహేతువు. దీనినిబట్టి యథార్థముగ ఈ జన్మపరంపరలు, సుఖదుఃఖాది ద్వంద్వములు అన్నియు అంతఃకరణమునకేగాని ఆత్మకు కావని స్పష్టమగుచున్నది. ఆత్మ సదా నిర్వికారమై, ఏకరసమైయే యొప్పుచున్నది.

మనస్సునకు ఈవలనుండి చూచిన శరీరము, జగత్తు, బంధము మున్నగునవియన్నియు గోచరించును. అట్లు మనస్సునకీవల నున్నంతవఱకును జీవుడు సంసారచక్ర పరిభ్రమణమునుండి తప్పించుకొనజాలక, అనేక జన్మపరంపరాది దుఃఖముల ననుభవింపవలసినదే. దాని నివారించుట కెవరికిని శక్తిలేదు. ప్రకృతియొక్క అప్రతిహతమైన నియమమది. అనగా, దృశ్యవాసనలు, సంస్కారము లుండునంతవఱకును, లింగశరీరమున్ను ఉండియే తీరును గావున నపుడు జన్మాది దుఃఖములు కలుగుచునే యుండును. ఎపుడు మనస్సును దాటి ఆవలకు పోవునో, అపుడీ జగత్తుగాని, దేహముగాని, యేవియు నుండవు. ఒకే పరమాత్మచైతన్యము తానై వెలుగుచుండును. స్వప్నమునుండి మేల్కాంచిన, స్వప్న జగత్తు అసత్యమగునట్లు, మనస్సును దాటినచో మనఃకార్యము జగత్తున్ను అసత్యమై, ఒకే సద్వస్తువు ప్రత్యక్షము కాగలదు. అపుడు రెండవ వస్తువే యుండదు. అ యేకమగు సద్వస్తువే బ్రహ్మము; అదియే ఆత్మ.

అట్టి ఆత్మయొక్క స్వరూపమేమిటో ఒకింత యోచించెదము. అది సాంతమా, అనంతమా? సాకారమా, నిరా

కారమా? క్షణికమా, శాశ్వతమా? ఈ మున్నగు విషయములు విచారణీయములు. జాగ్రతగ ఏకాగ్రబుద్ధితో పరిశీలించిన ప్రతివానికిని తనలో ఏదో యొకవస్తువు ఎల్లకాలములందును సమముగ ఏ మార్పును లేకయున్నట్లు గోచరము కాగలదు. అది 'నేను' 'నేను' 'నేను' అని స్ఫురించునదియే. అదియే ఆత్మ. బాల్యకాలమందు ఏ 'నేను' అనునది కలదో, యౌవనకాలమందును, వృద్ధాప్యమందును ఆ 'నేనే' కలదు. దేహమే పరిణామ మొందుచున్నది. కాని ఆ 'నేను' అనునది ఎపుడును, అన్నిదశలందును సమానముగనే యున్నది. అట్లే భూత భవిష్యద్వర్తమాన కాలములందును, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలందును ఆ 'నేను' నిర్వికారమై, సమముగ వర్తించుచున్నది. ఏలయనగా, పూర్వమున్న 'నేను', ఇప్పుడున్న 'నేను' ఒకటి కానిచో పూర్వము చూచిన వస్తువుయొక్క స్మృతి యిపుడు కలుగనేరదు. అదేరీతిగా, 'నేను స్వప్నమును గాంచితిని. 'నేను హాయిగ నిదురించితిని' అను ప్రత్యభిజ్ఞ జాగ్రత్తునందు కలుగుటవలన జాగ్రత్స్వప్న సుషుప్తుల మూడిటియందును ఒకే 'నేను' అనువర్తించియున్నదను సత్యమును అన్వయవ్యతిరేకములద్వారా మనము స్పష్టీకరింపగలుగుచున్నాము. దీనినిబట్టి ఆత్మ ('నేను' అనునది) నిర్వికారమని ఋజువైనది. ఏ వస్తువు నిర్వికారమో అది తప్పక అనంతమై యుండవలెను. ఈ విషయమును వైజ్ఞానిక శాస్త్రరీత్యా యిపుడు తెల్పుటకు యత్నించెదము.

ప్రపంచములోనున్న సమస్తపదార్థములును ఆకారముతో గూడినవే, అనగా అనేక అణువులయొక్క సంఘాతములే అయియున్నవి. ఆ అణువులు స్థూలపంచభూతమయములు అయినను, లేక సూక్ష్మపంచభూతమయములు అయినను సరియే, కాబట్టి ఏదియో యొక సమయమున అయణువులు తమ కారణరూపమున లీన మొందవలసియే యుండును. అనగా తమ యాకృతి గోల్పోవును. లేక వికారవంతములగును. అట్లుగాక నిర్వికారముగ నున్నచో, ఆ వస్తువు అణువుల సంఘాతముకాక యుండవలెను.

అణువుల సంఘాతముకానిది ఆకారవర్జితమై, అత్యంతసూక్ష్మమై యుండును. ఏది ఆకారవర్జితమో, అత్యంతసూక్ష్మమో అయ్యది తప్పక అనంతమై పరగవలయును. దీనినిబట్టి సర్వావస్థలందును నిర్వికారమై చెన్నొందు ఆత్మ అనంతమనియే స్పష్టమగుచున్నది.

ప్రతివారిలోను ఈ ఆత్మ ('నేను') కలదు. పై నిర్వచనమునుబట్టి అందరిలోను అది అనంతమైయే యుండవలెను. అయితే అనంతమైనది ఒకటే యుండునుగాని రెండు అనంతములుగాని, అనేక అనంతములుగాని యెప్పటికిని సంభవింపవు. అట్లు సంభవించుచో అది అనంతమనియే చెప్పబడదు; సాంతమేయగును. దీనినిబట్టి అందఱి ఆత్మయు ఒకటే యని తేలినది. ఇంతవఱకు విచారించిన దానినిబట్టి ఆత్మ ఏకమని, సత్యమని, నిర్వికారమని, అనంతమని నిశ్చయించినాము.

అయితే ఇక జగత్తు మాటయేమిటి? అది యెక్కడినుండి వచ్చినది? ఆత్మ, జగత్తు రెండును ఎట్లు సత్యము కాగలవు? ఒకేరాజ్యమునకు ఇద్దరు చక్రవర్తులెట్లుండగలరు? కావున నిది ఏమిటో విచారించెదము—పాశ్చాత్యసిద్ధాంతమునందు జగత్థితినిగూర్చిన రెండు వాదములు కలవు—(1) విజ్ఞాన వాదము (Idealism) (2) భౌతికవాదము (Realism or materialism) అని. మొదటిపక్షమువారు జగత్తు కేవలము భావములచే నేర్పడినదనియు, స్థూలముగ కానుపించు ఈ జగద్రూపము సత్యము కాదనియు చెప్పుదురు. ఈ వాక్యము నందు కొంత సత్యము కలదుగాని అయ్యది పూర్ణసత్యము కానేరదు. ఏలయనిన భావములకు ఆధారమే దేని యుండవలయే తీరవలెను. భిత్తిలేక చిత్రముండనట్లున్ను, జలము లేక తరంగ ముండనట్లున్ను, ఆధారమేదేని లేనిచో అధేయములగు భావ ములు నిలువజాలవు. ఆ యాధారమే అనగా అధిష్ఠానమే ఆత్మ. అట్టి ఆత్మ యను అధిష్ఠానముపై రజ్జువునందు సర్పము వలె అజ్ఞానముచే కల్పింపబడినదై ఈ జగత్తు పరమార్థ దృష్టిచే ఆత్మకంటె వేఱుగాక వర్తించుచున్నదే యగును.

ఇక భౌతికవాదులు ఈ జగత్తు ఏ రీతి కానుపించు చున్నదో అదియే సత్యమని చెప్పుదురు. ఈ సిద్ధాంతమున్ను సరికాదు. ఏలయనగా, ఈ దృశ్యజగత్తు స్వప్నమునగాని, సుషుప్తియందుగాని లేదు. ఏది సత్యమో అది యెల్లకాల ములందును ఉండవలెను. మఱియు సత్యమైనవస్తువు అంద ఱికిని అన్ని వేళలందును ఒకేవిధముగ గన్పించవలెను. ఈ

జగత్తో జంతువుల కొకవిధముగను, పక్షుల కొకవిధముగను, మనుజుల కొకవిధముగను భిన్న భిన్నముగ కానుపించుచున్నది. ఇక మనుజులలోగూడను వారివారి మనస్తత్త్వములనుబట్టి కొందఱికి ఒకప్పుడు దుఃఖమయముగను, మఱికొందఱికి ఆనందయుక్తముగను గోచరమగుచున్నది. కాబట్టి ఈ కానుపించు జగత్తు సత్యము కాదు. అజ్ఞానముచే కల్పింపబడిన దేహేంద్రియమనోరూపమగు ఉపాధివలన ఆత్మయే యీ జగద్రూపముచ దృశ్యమాన మగుచున్నదనుటయే పూర్ణ సత్యము.

అట్లుకాక ఒకవేళ ఆత్మనుండియే ఈ జగత్తు పుట్టుచున్నదని తలంచుచో అప్పు డాత్మ వికారవంతమగును, మఱియు దాని అనంతత్వ, నిత్యత్వములకున్ను హానియు కలుగును. కాబట్టి ఆ సిద్ధాంతమున్ను సమ్మతము కాదు. నిజమేమనిన ఆత్మ నిర్వికారముగ ఎప్పటియట్లే నిజసచ్చిదానంద స్వరూపముతోటి వెలయుచున్నది. మనస్సను అద్దముగుండా జూచువారలకది జగద్రూపమున గోచరించుచున్నది. కావున నామరూపాత్మకమును, క్షణికమునగు ఈ జగత్తువలన ఆత్మయొక్క నిత్యత్వ, అనంతత్వ, నిర్వికారత్వములకు ఏహానియు లేదు.

ఇక ఆత్మ అనంతమను విషయమును మఱియొకవిధముగ స్పష్టపఱచెదము—భూతాకాశము, చిత్తాకాశము, చిదాకాశము అను మూడాకాశములు కలవు. అందు చిదాకాశమే ఆత్మ. భూతాకాశమును గ్రమింగునది చిత్తాకాశము,

చిత్తాకాశమును గ్రసింగునది చిదాకాశము. భూతాకాశ మే యెంతయో గంభీరమై, విశాలమై, సర్వవ్యాప్తమై, అతి సూక్ష్మమై యుండ ఇక చిదాకాశమెంత మహిమాతిశయము గలిగియుండునో! ఈ విషయము నేయిపుడు వివరముగ తెలిసికొందము-అనేక వేలమైళ్ళ విస్తీర్ణముగల భూఖండములును, మహాసముద్రములును గొప్ప గొప్ప పర్వతములును గలిగియున్న ఈ భూగోళముయొక్క నిడివి 8 వేల మైళ్లు. భూమికంటె సూర్యు డనేకరెట్లు పెద్దది. దాని నిడివి దాదాపు 8 లక్షలమైళ్లు ఉండును. అంత పెద్దదైనను 9 కోట్ల మైళ్ళ దూరమున నుండుటబట్టి ఆసూర్యగ్రహము చాలచిన్నదిగ మనకు కనుపించుచున్నది. సూర్యుడు అగ్నిమయము. అపుడపుడందు ప్రచండవాయువులు వీచుటచే అగ్నిజ్వాలలు వీచుచుండును. ఆవిధముగ వీచునట్టి ఒక్కొక్క అగ్నిజిహ్వాయందు మన భూగోళము లెన్నియో పట్టును. దీనిచే సూర్యబింబముయొక్క అతివిశాలరూప మొకింత అవగాహము కాగలదు. ఇక నక్షత్రము లేపదార్థములు, ఆకాశము నలంకరించు చిన్నచుక్కలా? కాదు. ఒక్కొక్క నక్షత్రమున్ను సూర్యునివంటి అతివిశాలపదార్థమే. ఇంతే కాదు. ఈ సూర్యునికంటె అనేకరెట్లు పెద్దవగు నక్షత్రము లనేకములు కలవు. కాని ఈ మన సూర్యునికంటె చాలదూరమున నుండుటచే అయ్యవి చిన్నచుక్కలపగిది దృగ్గోచరమగుచున్నవి. నక్షత్రము లెంత దూరముననున్నవో యూహించుట కొకమార్గము కలదు. అది యేదనిన—ప్రకాశము

యొక్క వేగము సెకండునకు దాదాపు 186 వేల మైళ్లు, అనగా కనుఱెప్పపాటు కాలములో ప్రకాశము 186 వేల మైళ్లు పోవునని యర్థము. ఇంత మహా వేగముగల ప్రకాశమున్ను నక్షత్రములనుండి బయలుదేఱి భూమిని జేరవలెననిన ఎన్నియో సంవత్సరముల కాలము పట్టును. అంతియే కాదు. కొన్ని నక్షత్రముల ప్రకాశము భూమినింకను జేరలేదనియే కొందఱు ఖగోళశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఆహా! ఎంత వైశాల్యము! అటువంటి అసంఖ్యాకములగు విశాల నక్షత్ర, సూర్య, చంద్రగ్రహాదులను తన కుక్షియందుంచుకొనిన యీ భూతాకాశ మెంత విశాలమైనదో ఒక్క పర్యాయ మూహింపుడు! ఇట్టి యనంతాకాశము చిత్తమున కన్యముగ లేదు. ఏలయనగా సంకల్పమువలననే ఈజగత్తు ఉద్భూతమగుచున్నది. ఆ చిత్తమో,

'విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్'

అనునట్లు ఆత్మయందు దేచటనో కల్పితమైయున్నది. ఇక నట్టి ఆత్మ యెంత విశాలమైనదో, అనంతమైనదో యూహింపుడు! ఏ సచ్చిదాకాశమున చిత్తాది సూక్ష్మప్రపంచము, స్థూలరూపములగు ఈ యనంతకోటి బ్రహ్మాండములు ఉదయించి, స్థితిగలిగి, తుదకు లయించుచున్నవో అట్టి పరమాత్మ అనంతమని వేఱుగ చెప్పనలయునా?

ఇంకను ఆత్మ స్వప్రకాశరూపము గలది; దేనిచేతను అది ప్రకాశింపబడదు. అదియే సమస్త దృశ్యపదార్థములను

ప్రకాశింపజేయుచున్నది. ఈ ప్రకాశమానుడగు సూర్యునకు గూడ స్వతః సత్తలేదు. ఆత్మసత్తచేతనే యాతడు ప్రకాశించుచున్నాడు. కాబట్టి సూర్యుడాయాత్మను ప్రకాశింపచేయజాలడు. ఘటము దీపమును ప్రకాశింపచేయగల్గునా ? కావుననే శ్రుతులు—

'తమేవభాన్తమనుభాతి సర్వం, తస్యభాసా సర్వమిదం విభాతి'

అని పేర్కొనినవి. అనగా ఆ యాత్మ యుండుటచేతనే యీ సమస్తపదార్థములును సత్తగలిగియున్నవి కాని, లేకున్న వానికి ఉనికియే సంభవింపదని భావము. ఘటమునుండి మృత్తికను తీసివైచిన ఇక మిగులునదేది ? తరంగమునుండి జలమును తీసివైచిన ఇక తరంగ మెచట ? కాబట్టి ప్రతి పదార్థమునందునుగల అస్తి, భాతి, ప్రియ, నామరూపములను అయిదు అంశములలో మొదటి మూడును అనగా అస్తి, భాతి, ప్రియములు (లేక సత్, చిత్, ఆనందములు) బ్రహ్మరూపములగుటచే సత్యములును, తక్కిన నామరూపములు రెండును జగద్రూపములగుటచే మిథ్యయు అయియున్నవి. చిత్ అనగా ప్రజ్ఞానము, తెలివి.

శ్లో॥ యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ ।
స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞానముదీరితమ్ ॥

అని ఈప్రకారముగ ప్రజ్ఞానముయొక్క స్వరూపము ఉపనిషత్తులయందు నిర్వచింపబడినది. అనగా, దేనిచే ప్రాణి చూచుచున్నాడో, వినుచున్నాడో, మూర్కొనుచున్నాడో,

వచించుచున్నాడో, రుచులను తెలిసికొనుచున్నాడో అట్టి తెలివియే ప్రజ్ఞానము, లేక ఆత్మ. అయితే వినునది, చేయునది, చూచునది ఆత్మకాదు. ఏ తెలివి (ప్రజ్ఞానము)చే వినుచున్నామో, చేయుచున్నామో, చూచుచున్నామో అది ఆత్మ. అట్లుకాక ఆత్మ చేయునది, చూచునది యగుచో త్రిపుటి (జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము) యందంతర్గతమై వికారయుక్తమగును. ఆత్మకు వికారము సమ్మతము కాదు. అయ్యది ఆ త్రిపుటికి విలక్షణమై, దాని కాధారభూతమై, అద్దానిని ప్రకాశింపజేయుచు చిద్రూపమై వెలయుచున్నదే యగును.

ఈ ఆత్మ దేహముకాదు, ప్రాణము కాదు, ఇంద్రియములు కావు, మనోబుద్ధ్యహంకారములు కాదు. వీనియన్నిటికిని పరమై, సాక్షిభూతమై యది ప్రకాశించుచున్నది. ఏలయనగా ఆ దేహాదులన్నియు (జాయతే, వర్ధతే-ఇత్యాది) షడ్వికారములతో గూడినవి కావున నశ్వరములు. ఆత్మయో నాశరహితము. అది వాని వికారములచే నంటబడక, వాని చేష్టలన్నింటిని సాక్షిరూపమున గాంచుచున్నది.

శ్లో॥ దేహేంద్రియమనోబుద్ధి ప్రకృతిభ్యో విలక్షణమ్ ।
తద్వృత్తిసాక్షిణం విద్యాదాత్మానం రాజవత్సదా ॥

అని శ్రీ శంకరులు వచించినలాగున, రాజు తన యాజ్ఞచే మంత్రులు మున్నగువారు గావించు వ్యవహారములను సాక్షిభూతముగ వీక్షించునట్లు దేహేంద్రియాదులు ఆత్మసన్నిధాన బలముచే వ్యవహరించుచుండ, వానికి సంబంధింపక ఆ యాత్మసాక్షిగా జూచుచున్నది. కాబట్టి ఈ దృశ్య

మంతయు ఎన్ని వికారములు పొందుచున్నను ఆత్మ నిర్వికారమై, అవ్యయమై, అచంచలమై నాటకమందలి దీపము వలె సదా ఏకరసముగ భాసిల్లుచున్నది. నాటకమం దనేక పాత్రధారులు వచ్చిపోయినను దీపము వారలనందఱిని ప్రకాశింపజేయుచు వారల సుఖదుఃఖములచే నంటబడక వారున్నను, లేకున్నను ఏకరీతి వెలుగుచుండునుగదా! అట్లే ఈ ఆత్మజ్యోతియును.

ఆత్మయొక్క స్వరూప తత్త్వవిచారణములందు కపిలుని సాంఖ్యము చాలవఱకు ఉపకరించును. అది యెట్లో యిపుడు విచారించెదము. ఈ దృశ్యమానమగు పదార్థములన్నియు నిరంతరము పరిణామ మొందుచునే యున్నవి. సూక్ష్మాణువు లహర్నిశము ఆయా పదార్థములనుండి లేచి అన్యపదార్థములందు ప్రవేశించు విశ్రాంతి లేక నిరంతరము సంచరించుచునే యున్నవి. ప్రాణులు భుజించినది మలాదుల ద్వారా బాహ్యప్రదేశమునకు బోయి యెఱువుగా పరిణమించి మరల యే వృక్షమందో సూక్ష్మరూపమున ప్రవేశించి ఫలాదులగుచున్నది. జలబిందువులు ఆవిరియై మేఘరూప మొందుచున్నవి ఒకరు వదిలినగాలి మఱియొకరు పీల్చుచుండుటచే ఒకరియందలి అణువులు మఱియొకరియందు ప్రవేశించుచున్నవి. ఇపుడున్న ఈ దేహము ఇంకొక యేడు వత్సరములకు సంపూర్ణముగ మారి నూతనాణువులతో గూడినదగుచున్నది. ఆ పాత అణువులన్నియు ఇతర జగదార్థములందు జేరబడినవని యర్థము. నేడు ఒకవి దేహగల అణువు రేపు జంతువునందో లేక వృక్షమందో

ప్రవేశింపవచ్చును. లేదా సూర్యాదిగోళములందు చేర వచ్చును.

ఈ రీతిగ ప్రపంచమున అనవరతము గొప్ప పరిణామము జరుగుచున్నది. కాని స్థూలదృష్టిచే జగత్తు స్థిరముగా నున్నట్లె తోచుచున్నది. మన దేహమందలి పృథ్వ్యంశమునకును, బాహ్యమందలి పృథ్వ్యంశమునకును ఏ భేదమున్ను లేదు. అట్లే జలాగ్ని వాయ్వాకాశములనుగూర్చియు నెఱుఁగవలెను. కాబట్టి మన స్థూలదేహము సమష్టి స్థూలదేహము (విరాట్) యొక్క అంశమే యగును. విరాట్ సాగరమున మన స్థూలదేహ మొక తరంగమువంటిది. అనగా మనుష్య పశు పక్షి క్రిమికీటాదుల శరీరములన్నియు ఆ విరాడ్దేహమను సముద్రమున వివిధతరంగములని భావము. కావున వాస్తవముగ జూచిన మనుష్యదేహమునకును, జంతుదేహమునకును, కీటకదేహమునకును ఏమియు భేదము లేదు.

అదేరీతిగ వ్యష్టిమనస్సు, సమష్టిమనస్సు (హిరణ్యగర్భుడు) యొక్క ఒక భాగము కాబట్టి మన మనస్సు, జంతువులమనస్సు అన్నియు ఒకే అపంచీకృత భూతసముదాయమందలి వివిధభాగములై యున్నవి. ఇపుడు వ్యష్టిని సమష్టియం దైక్యపఱచి, అనగా స్థూలశరీరమును విరాడ్దేహము (విశ్వము)నందును, వ్యష్టి మనస్సును సమష్టి మనస్సునందును భావనచే లయమొనర్చి వ్యష్టిసమష్టులకు సాక్షియై నిలిచినట్లు స్వస్వరూపాత్మస్థితియందు నెలకొనియుండుటను లెస్సగ అభ్యసించవలెను. అత్తఱి కష్టపరంపరలన్నియు

పటాపంచలై పోగలవు. సంసారదుఃఖదావానలము పరిపూర్ణ
ముగ శమించిపోగలదు. ఆత్యంతిక భవదుఃఖోపశమనమునకు
ఆత్మతత్త్వవిచారణయే ఏకైకమార్గము. కాబట్టి ముముక్షువు
లెల్లరు అహర్నిశము తత్త్వవిచారణ గావించుచు నిత్యమై,
శుద్ధమై, ముక్తమైనట్టి పరంజ్యోతియగు ఆత్మస్వరూపమును
చక్కగ అవగాహన మొనర్చుకొని అట్టి పరతత్త్వమున,
స్వస్వరూపమున బాగుగ నిలుకడగలిగి పరమానందమును
బడయవలయును.

చంద్రకళలు వృద్ధినొంది వృద్ధినొంది పౌర్ణమినాడు
పరాకాష్ఠస్థితి నందుకొనునట్లు, ఈ ప్రకారముగ మాన
వుడు తన జీవితకాలమున స్వప్రయత్నముచే వికాసమొంది
వికాసమొంది తుట్టతుదకు దేవుడుగా మారిపోవును. మాన
వుడు ఏనాటికైనను పూర్ణత్వమును బొందియే తీరవలెను.
మానవుడు మాధవుడు కాగలడా యను సంశయము జను
లలో పెక్కురికి గలదు ఆ సంశయమును మహర్షులు తమ
జీవిత దిగ్దర్శనముచే పటాపంచలు చేసివైచిరి. అనవరత
పురుషప్రయత్నముచే, సంతతాభ్యాసముచే, గొప్ప పట్టుద
లచే మానవుడు తన జీవితలక్ష్యమును తృటిలో సాధించివేయ
గలడు. అకుంఠితదీక్షతో సాధన నుపక్రమించినచో అచిర
కాలములో యతడు గమ్యము చేరగలడు.

బియ్యపుగింజపై పొట్టు (ఊక) ఉన్నంతవఱకు అది
వంటకు ఉపయోగపడదు. రోటిలో వేసి దంచుట అను
క్రియచే ఆ పొట్టు తొలగిపోవ ఉపయోగార్హమగును. అట్లే

జీవుడు అజ్ఞానమను ఆవరణచే గప్పబడియున్నంతవఱకు తనకు గాని, ఇతరులకుగాని ఉపయోగపడడు. పుణ్యకార్యాచరణ, ధ్యానము, ఇంద్రియనిగ్రహము, మనస్సంయమము, ఆత్మ విచారణ మొదలగు పరమార్థ క్రియలచే అజ్ఞానరూపమగు ఆవరణ తొలగిపోవ, జీవుడు అత్యంతనిర్మలుడై తాను తరించి ఇతరులనుగూడ తరింప జేయుచుండును. మఱియు విత్తువు గింజపై పొట్టు ఉన్నంతవఱకు అది (నేలలో పెట్టినచో) మొల కెత్తుచునే యుండును. అట్లే అజ్ఞానము, అవిద్యయను ఆవరణ యున్నంతవఱకు జీవుడు జన్మపరంపరను బొందుచునే యుండును. దానిని నశింపజేయుటకు మనుజుడు విశ్వప్రయత్నము గావించవలయును. అది యున్నంతవఱకు జీవునకు చేటుతప్పదు. కనుకనే మహనీయులు అట్టి అవిద్యను త్రుంచివేయువఱకు ఏమాత్రము విశ్రమించలేదు. తుదకు తమ లక్ష్యమును సాధించివైచిరి. ప్రతిజీవియు దుఃఖరహిత స్థితి చేరుకొనగలడు. నిర్వాణమను పరమానందస్థితి అందరి యొక్కయు జన్మహక్కు. దానిని ఈ జన్మయందే సాధించ వచ్చును. మహాత్ములయొక్క ఈ దివ్యసందేశమును ఆల కింపుడు—

"ఓ జీవులారా! ప్రయత్నశీలురు కండు! పవిత్రమగు ఈ మానవజన్మ అంతముకాక పూర్వమే లక్ష్యమగు నిర్వాణమును సాధించివేయుడు! సోమరితనమునకు తిలాంజలి యొసంగుడు! పురుషప్రయత్నమును జేబట్టుడు! పట్టుదలతో సాధించుడు! మీరు తప్పక గమ్యస్థానమును జేరగలరు!

పాపకార్యములను చేయకుడు! పుణ్యకార్యములను, ధర్మ కార్యములను ఆత్మోన్నతికి హేతుభూతములగు పవిత్రకార్యములను విరివిగ జేయుడు! చక్కటి శీలమును అభివృద్ధి జేసికొనుడు! పుట్టినది భోగము లనుభవించుటకుగాదు. ఇంతవఱకెన్ని యో జన్మ లనుభవించినది చాలదా? ఇక యోగమునకై మఱలుడు! మనస్సును, ఇంద్రియములను నిగ్రహించుడు. భోగవిలాసములనుండి మనస్సును మఱలించుడు! మనస్సు నిగ్రహింపబడినచో, ఇంద్రియములు అదుపులోనున్నచో అఖండమైన ఆనందానుభూతి కలుగగలదు. ఈ వాక్యమును ముమ్మాటికిని నమ్ముడు! ఆత్మవిశ్వాసము గలిగియుండుడు! మిమ్ములను మీరే యుద్ధరించుకొనుడు! పెద్దలయెడల, సద్గురువులయెడల వినయవిధేయతలు గలిగియుండుడు. పరప్రాణికి మేలుచేయుడు. ఎవరికిని అపకారము చేయకుడు. సర్వభూతదయ, అహింస, సత్యము మొదలగు ఉదాత్తధర్మములను కార్యన్వితి మొనర్పుడు. బాహ్యాభ్యంతర శుచిత్వమును అలవాటుచేసికొనుడు. మిక్కుటమగు ఓర్పుగల్గి ధర్మములన్నిటిని క్రమక్రమముగ సాధించివేయుడు. అట్లు సాధించనిచో జీవితము నిరుపయోగమైపోవును. కావున జాగరూకులై యుండుడు!''

ఇదియే మహర్షులు జనులకు గావించు మహోపదేశము, మనుజుని శీలనిర్మాణము మోక్షరూపలక్ష్యమును సాధించుటయందు అతిముఖ్యమైనది. శీలము సరిగా లేనిచో, సాధనచతుష్టయ సంపత్తి చక్కగ చేకూరనిచో జ్ఞానబీజము

లాతనియం బెట్లంకురించగలవు? కనుక నే గీత యందును శ్రీ కృష్ణభగవానుడు జనుల శీలనిర్మాణ విషయములో అతిజాగరూకత వహించి అనేక సుగుణములను పొందుపఱచెను.

అగాధమగు ప్రేమ, విశాలమగు హృదయము ప్రతివారును కలిగియుండవలెను. ప్రేమ బంధువర్గమునకే పరిమితముగాక, మానవకోటివఱకే హద్దులు నిర్మించుకొనక, చరాచర ప్రాణికోట్లయందును విస్తరించవలెను. ప్రేమప్రవాహము పరిధులు త్రెంచుకొని పరవళ్లుత్రొక్కుచు బయలుదేరి విశాలప్రపంచమునంతను ఒక్కుమ్మడి కౌగలించుకొనవలెను. జంతుజాలముమొదల, కృమికీటకాదుల మొదలగూడ ప్రేమ, దయ, కరుణ విస్తరించవలెను. 'హృదయవైశాల్యము' గలిగి యుండవలెను.

సామాన్య మానవుడు ఈ ప్రకారముగా తన ప్రయత్నాతిశయముచే, తీవ్ర అధ్యవసాయముచే, అకుంఠితదీక్షచే సాక్షాత్ భగవానుడు కాగల్గును. ప్రతి జీవియు తన సత్ప్రయత్నములచే మహోన్నత ఆధ్యాత్మిక శిఖరముల నధిరోహించగలడు. కావున మహాత్ముల జీవితముల నాదర్శముగ గైకొని, వారి యడుగుజాడల నడచుచు వారు కావించిన ధర్మోపదేశములను, అమూల్యబోధనలను జనులు కార్యాన్వితమొనర్చుకొనుచుండవలెను. ప్రతిబింబమగు విశ్వమును బట్టి వ్రేలాడక, దృశ్యముపై పునకే అహంకారమమకారములు పరుగిడక, దృక్స్వరూపమగు చిన్మయపరమాత్మనుగూర్చి సదా విచారణ సలుపుచుండవలయును.

ఏలయనిన విశ్వముకంటె విశ్వేశుడు గొప్పవాడు ముక్కుపుడకను లావణ్యముగ తయారుచేసిన స్వర్ణకారుని కంటె దాని కాధారభూతమగు ముక్కును తయారుచేసిన దేవుడు ఇంకను గొప్పవాడు. విశ్వపరిశోధనకంటె విశ్వేశుని గూర్చిన పరిశోధన మహత్తరమైనది. ఆవశ్యకమైనది. ఆనందమొసంగునది. విశ్వము ప్రతిబింబము. భగవంతుడు బింబము. ప్రతిబింబము క్షణికమై, అస్థిరమై, కాలమునకు అధీనమై యుండును. బింబము శాశ్వతమై, స్థిరమై, దేశ కాలాదులకు వశముకాక యుండును. కావున విజ్ఞుడగువాడు బింబభూతుడగు పరమాత్మను ఆశ్రయించి దుఃఖరహితుడై, జననమరణరూప శృంఖలములనుండి విముక్తిని బడయువల యును. నామరూప ప్రపంచమును బట్టుకొనియే నిరంతరము కాలము గడుపరాదు.

అంత్యకాలమున జీవుని రక్షించునదేదియో ముందు గనే యోచనచేసి దాని విషయమై తగుజాగ్రతలు గైకొన వలెను. 'న హి న హి రక్షతి' అని శ్రీ శంకరులు ఉద్ఘా టించినట్లు ప్రాపంచిక విద్యావైదుష్యముగాని, అధికార కీర్తిప్రతిష్ఠలుగాని, సంపదలుగాని యమబాధనుండి జీవుని తప్పించజాలవు. 'భజగోవిందమ్' అనునది ఒకటియే శర ణ్యము. కావున గోవిందుని ఎంత శీఘ్రముగ భజించిన అంత శ్రేయమును మనుజుడు పడయగలడు. ఆత్మవిజ్ఞానమును ఎంత త్వరితముగ పొందిన అంత కృతకృత్యుడు కాగలడు. తా నెవరో, ఈ జగత్తు ఎట్టిదో, బంధవిముక్తికి మార్గ

మొదిరా పెద్దలవలన, శాస్త్రములవలన గ్రహించి సత్య స్వరూపమైన తనఆత్మయందు నిలుకడకలిగి జీవితలక్ష్యమును సాధించివేయవలెను. ఈపని ఎంత శీఘ్రముగ నెరవేర్చ బడిన అంత మంచిది. ఆత్మానుభూతి విషయమందు ఏమాత్రము జాగుచేయరాదు. జీవితము అనేక ఆటంకములతోను, ప్రమాదములతోను, ప్రతిబంధములతోను గూడియున్నది. ఇట్టి పరిస్థితులందు విజ్ఞుడగువాడు గొప్పపట్టుదలతో గూడి, ఎన్ని అవాంతరములు వచ్చినను లెక్క సేయక, ఆత్మసాక్షాత్కారరూపలక్ష్యమును ఈ జీవితమందే త్వరితముగ సాధించివేయవలెను.

జనులు తమ దృష్టిని యావత్తు బాహ్యవస్తుపరిశోధన మందే నిమగ్న మొనర్చుచున్నారు కాని అభ్యంతరవిచారణ యందు కాదు. వారు విశ్వమును శోధించుచున్నారే కాని హృదయమును సంశోధించుటలేదు. బాహ్యమున లక్షల కొలదిమైళ్లు ప్రయాణము సలుపుచున్నారే కాని అంతర్ముఖముగ ఒక్క అంగుళమైనను పోవుటలేదు. శాంతి తనయందే కలదు కాని బాహ్యమున కాదను సత్యమును మనుజుడెంత శీఘ్రముగ గ్రహింపగల్గిన అంత ధన్యుడు కాగలడు. తన స్వరూపమునుగూర్చి, తన చిత్తమందలి గుణదోషములను గూర్చి, మనస్సున దాగియున్న బహుజన్మార్జిత సంస్కారములనుగూర్చి బాగుగ విచారణసల్పి దోషభూయిష్ఠమగు దానిని తొలగించివేయవలయును. దీనినే ఆత్మపరిశోధన (Self-introspection) అందురు.

దీపపు చిమ్నీని ప్రతిదినము తుడుచుచుండినచో ఎట్లు శుద్ధముగా నుండునో, రాగిపాత్రను ప్రతిరోజు తోముచుండినచో ఎట్లు నిర్మలముగా నుండునో, అట్లే ప్రతిదినము ఆత్మపరిశోధన చేసికొనుచుండినచో జీవునియందిక మాలిన్యము ప్రవేశించుటకు అవకాశముండదు. ఆత్మపరిశోధనచే అసురసంస్కారములను పారద్రోలుటకు, దైవసంస్కారములను రాబట్టుకొనుటకు చక్కని అవకాశ మేర్పడగలదు. ఇంటిలో దొంగలు ప్రవేశించి దొరలవలె మెలగుచున్నారు. ఆ దొరలను దొంగలని గ్రహించుటలోనే ఉన్నది మానవుని విజ్ఞత. ఏక్షణమందు వారు దొంగలుగ ఎఱుఁగబడుదురో, ఆక్షణమందే వారు పలాయనము చిత్తగించుదురు. కామక్రోధాద్యసురవృత్తులన్నియు ఈ రీతిగనే బహుకాలము నుండియు జీవునియందు తిష్ఠవేసికొనియున్నవి. ముముక్షువగువాడు ఆత్మపరిశోధనచే ఆ దుర్వృత్తులను చెండాడి హృదయమును నిష్కంటక మొనర్చుకొనవలెను. ఈ ప్రకారముగ ఆవరణము తొలగినపుడు మలవిక్షేపములు అంతరించినపుడు ఆత్మయొక్క అనుభూతి ప్రత్యక్షముగ సంభవించగలదు. అదియే మోక్షస్థితి. కావున అట్టి మహోన్నత లక్ష్యసాధనకై జీవుడు అనవరతము యత్నించుచు, తన హృదయమును నిరంతరము పరిశోధించుకొనుచు, దుర్వృత్తులకు, దృశ్యవ్యామోహమునకు కించిత్తైనను అవకాశ మొసంగక, సదా ఆత్మపరిశోధన మొనర్చుకొనుచు బహుజాగరూకుడై వర్తించవలెను.

'నాస్తి జాగరతో భయమ్' అని శాస్త్రము లుద్ఘోషించిన చందమున వివేకదీపమును చేతఁగైకొని అజ్ఞానాంధకారమును పటాపంచలు చేయుచునుండువాని నిక సాంసారిక దుఃఖము లేవియు బాధించ నేరవు. జన్మార్జితవాసనాబలముచే ఇంద్రియము లెప్పుడెప్పుడు చెలరేగునో, మాయాప్రవాహము పైపునకు ఉద్వేగించునో, అప్పుడప్పుడు 'హన్యాత్ వివేక దండేన' అని వసిష్ఠు లానతిచ్చినట్లు వివేకమనుకఱ్ఱచే వానిని కొట్టి వశపఱచుకొనవలెను. అనఁగా ఆత్మపరిశోధన మొనర్చుకొని తత్త్వజ్ఞానముయొక్క సహాయముచే వైరాగ్యమును బడసి ఇంద్రియాదులను స్వాధీనము చేసికొనవలెను.

కస్త్వం కోఽహం కుత ఆయాతః
కా మే జననీ కో మే తాతః
ఇతి పరిభావయ నిజసంసారం
సర్వం త్యక్త్వా స్వప్నవిచారమ్.

'నీ వెవడవు? నే నెవరు? మన మెక్కడనుండి వచ్చితిమి! నాతల్లి యెవరు? నాతండ్రి యెవరు? ఈ ప్రకారముగ ఆలోచించి స్వప్నప్రాయమగు ఈ దృశ్యవర్గముపై మమత్వమును త్యజించుడు' అని మహనీయులు పలుకుచున్నారు. శాస్త్రములున్ను అట్లే ఆదేశించుచున్నవి. తా నెవరో చక్కఁగ విచారించి తాను పంచకోశములకు సాక్షియై విరాజిల్లు శాశ్వత ఆత్మయేకాని నశ్వర దేహాది దృశ్యరూపము కాదని నిశ్చయించి అట్టి ఆత్మయందే సదా నిలుకడ కలిగియుండులాగున చూడవలెను. తాను జడవస్తువు కాదనియు

త్రికాలములందును నిర్వికారమై వెలయు చైతన్యమే యనియు నిరంతరము భావించుచుండవలెను. ఇట్టి పరమార్థ యత్నముచే అచిరకాలములో జీవునియందు అపూర్వమగు పవిత్రత ఉదయించగలదు. పుటముచే మట్టము బంగారు మేలిమి బంగారముగ మారునట్లు, సామాన్యుడగు జీవుడు ఆత్మపరిశోధనచేతను, ఆత్మవిచారణచేతను సాక్షాత్ శివుడుగ మారిపోగలడు. నరుడు నారాయణరూపుడై ఔన్నత్యమొందగలడు. బద్ధుడు ముక్తుడై విలసిల్లగలడు. స్వాత్మరూపసింహము చిత్తరూపశృంఖలములను విచ్ఛిన్నమొనర్చివేసి బహుకాల బంధమునుండి తప్పించుకొని, మృత్యుసంసారసాగరమునుండి బయటపడును. అట్టి స్వారాజ్యస్థితి యత్నశీలునకే లభ్యమగునుగాని ఏ సాధనయు చేయని సోమరికి కాదు.

కాబట్టి మానవత్వమను గొప్ప సదవకాశము లభించి, శాస్త్రసజ్జనసాంగత్యమను దివ్యౌషధము సంప్రాప్తమైన ఈ తరుణముననే జనులు ఆత్మతత్త్వవిచారణాదులచే తమ భవరోగములను బాపుకొని నిత్యశాంతిని అనుభవించవలెను. ప్రాపంచికదృష్టిని త్యజించి ఆత్మదృష్టిని, దైవదృష్టిని శీఘ్రముగ అలవఱచుకొనవలెను.

## సమ్యక్ - దృష్టి

జనులలో కొందఱికి దేహదృష్టి, కొందఱికి మనోదృష్టి, కొందఱికి ఆత్మదృష్టి యుండును. దేహదృష్టి గలవారు అధములు. ఒక ప్రాణిని చూచినపుడు ఆ ప్రాణియొక్క దేహ

సౌందర్యమును, పరిమాణమును, రూపురేఖలను మాత్రము వారు చూచుచుందురు. మనోదృష్టి గలవారు మధ్యములు. వీరు ప్రాణియొక్క మనోభావములను, పాండిత్యగరిమను చూచుచుందురు. ఇక ఆత్మదృష్టిగలవారు ఉత్తములు. వీరు ఏ ప్రాణిని చూచినను లోనిఆత్మనే వీక్షించుచుందురు. ఇదియే సుదర్శనము. దేహములు, మనస్సులు వేఱువేఱుగా నున్నను, పరిణామము నొందుచున్నను సర్వజీవులకును ఆత్మ యొకటియే. కావున ఆత్మదృష్టిగల అట్టి ఉత్తములు సమస్త ప్రాణికోట్లయందును సమభావము గలిగియుందురు. సర్వుల యెడల ప్రేమను, దయను వర్షించుచుందురు. విద్యావినయ సంపన్నుడగు బ్రాహ్మణునియందును, గోవునందును ఏనుగు నందును, కుక్కయందును, కుక్కమాంసము వండుకొని తిను చండాలునియందును సమదృష్టి కలవారే పండితులని గీతా చార్యుడు పేర్కొనియున్నాడు. అదియే సమ్యక్ దర్శనము. సు-దర్శనము. అట్టి సుదర్శనమును, సమ్యక్ దృష్టిని కలిగి యుండుటయే మానవుని లక్ష్యము.

విష్ణువు సుదర్శనచక్రమును ధరించియుండునని చెప్పు దురు. ఆ చక్రమునకు ముల్లోకములందును ఏదియు అడ్డు రాదు. ఒకవేళ అడ్డువచ్చినను నిలువనేరదు. అట్లే సుదర్శ నము గలిగియుండువాడు అనగా సమ్యక్ దృష్టి, జ్ఞానదృష్టి, ఆత్మదృష్టి, సర్వాత్మభావముగలవాడు అవిద్యనంతను పటా పంచలుచేసి, తమస్సును, అజ్ఞానమును విధ్వంసమొనర్చి సర్వత్ర పరమాత్మనే వీక్షించుచు, ఆధ్యాత్మిక విజయముందు

ధిని ప్రయోగించుచు బ్రహ్మానందయుతుడై వెలుగుచుండును. పెయ్యేల, సుదర్శనము (సమ్యక్-దృష్టి) గలవాడు సుదర్శన ధారియే (సాక్షాత్ విష్ణువే) అయి చెన్నొందుచుండును.

కాబట్టి ప్రయత్నాతిశయముచే, అభ్యాసప్రాబల్యముచే మనుజుడు తన జీవితమందే దైవదృష్టిని సమ్యక్-దృష్టిని, సుదర్శనమును చక్కగ పెంపొందింపజేసికొనవలెను, నామరూపములను మిథ్యగను, అధిష్ఠానమగు ఆత్మను సత్యముగను వీక్షించవలెను. దృశ్యము లేనిదనియు, ఏనాటికైన మరుగైపోవుననియు భావించి భోగలాలసను పరిత్యజించి, విషయములయెడల విరక్తికలిగి ఆత్మోన్ముఖుడు కావలయును. బాహ్యదృష్టిని తగ్గించుకొనుచు అంతర్దృష్టిని అభివృద్ధిపఱచుకొనుచు నుండవలెను.

'ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చిన్తయేత్' అను గీతావాక్యరూప మహామంత్రమును సదా జపించుచు, బయటకు పరుగెత్తుకొని పోవుచుండు మనస్సును విచారణా బలముచే లోనికి తీసుకొనివచ్చి ఆత్మయందు స్థాపించి పునః విషయములపై దూకకుండ చేయవలెను. దేహాది దృశ్య వస్తువులందుగల జన్మ, మృత్యు, జరా, వ్యాధిరూప దుఃఖములను పదే పదే చింతనజేయుచు, అట్టి దోషానుదర్శనముచే వైరాగ్యమును బలపఱచుకొనుచుండవలెను. అట్లే ఆత్మయొక్క శాశ్వతత్వ, ఆనందరూపత్వములనుగూడ లెస్సగ భావించుచుండవలెను. ఈ రెండిటియొక్క అభ్యాసముచే, అనగా దృశ్యముయొక్క అల్పత్వమును చింతన

జేయుటచేతను, దృక్స్వరూపమగు ఆత్మయొక్క గాంభీర్యమును భావనయొనర్చుటచేతను సమ్యక్-దృష్టి లెస్సగ చేకూరి 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' అనునట్లు సాధకుడు సాక్షాత్ పరబ్రహ్మస్వరూపుడై విలసిల్లును. కాబట్టి జనులు తమ ప్రయత్నాతిశయముచే ఆత్మదృష్టిని చక్కగ బలపఱచుకొని, సుదర్శనయుతులై, విష్ణువుయొక్క సుదర్శనము మాడ్కి ప్రపంచములో ఎదురులేనివారై, ప్రశాంత హృదయులై సర్వత్ర బ్రహ్మమునే వీక్షించుచు జీవితమును దైవమయముగ నొనర్చుకొనవలెను.

ఈ ప్రకారముగ ఆత్మదృష్టి బడయుటకై తీవ్రతర యత్నము సలుపుచు మనుజుడు దేహాభిమానమును పూర్తిగ తొలగించుకొనవలెను. తాను జడమైన దేహము కాదనియు, నిత్యశుద్ధ బుద్ధ ముక్త ఆత్మస్వరూపమేయని అహర్నిశము భావించుచుండవలెను. ఆత్మ సత్యవస్తువు. దేహము కల్పిత వస్తువు. సత్యవస్తువునకు ఉన్న విలువ కల్పితవస్తువునకు లేదు.

మనుష్యునకు ఉన్న విలువ మనుష్యుని నీడకు లేదు. బింబమునకు ఉన్న విలువ ప్రతిబింబమునకు లేదు. అట్లే ఆత్మకున్న విలువ దేహమునకు లేదు. దేహము క్షణకాలము ఉండిపోవునది. అట్టి మూడున్నర మూర్ల దేహమునుధరించి జగన్నాటకమాడి మరల తెరవెనుకకు పోవువాడు, కర్మబంధమున తగుల్కొనియున్నవాడు, అల్పశక్తి గలవాడు అగు జీవుడు అజ్ఞానవశమున తన్ను మించినవాడు లేడని

మిడిసిపడుచుండును. అధికార గర్వముచే ధనమదముచే, సౌందర్యమదముచే, దేహాభిమానముచే పాండిత్యదర్పముచే ఎదుటివానిని లెక్కసేయక తన్ను మించినవాడు త్రిభువనము లందు లేడని ప్రవర్తించుచుండును.

దీనికి కారణము పెద్దల సాంగత్యము లేకుండుటయే. చక్కని శాస్త్రపరిజ్ఞానము కొఱతపడుటయే. ఆధ్యాత్మిక అనుభూతి లేకపోవుటయే.

సత్యము నెఱుగనంతవఱకే మనుజునకు తన అల్ప శక్తులను గూర్చిన గర్వ ముదయించుచుండును. సమ్యక్-జ్ఞాన ముదయించినచో, దేహముయొక్క నశ్వరత్వమును గూర్చిన పరిజ్ఞానము కలిగినచో, ఇక అభిమానము, గర్వము, మదము మున్నగునవి వెంటనే కాలికి బుద్ధి చెప్ప గలవు. కావున జీవుని గర్వభంగమునకు సమ్యగ్జ్ఞానమే ముఖ్య హేతువై యున్నది. అట్టి జ్ఞానమేదియో తెలిసి కొందము :—

'జ్ఞానం సమ్యగవేక్షణం'—అను ఉపనిషద్వాక్యము సమ్యక్ దృష్టియే జ్ఞానమని నిర్వచించుచున్నది. అనగా ఉన్నదానిని ఉన్నట్లుగను, లేనిదానిని లేనట్లుగను చూచుటయే జ్ఞానమనబడును. ఆత్మ సత్యము, దేహాది నామ రూపములు అసత్యములు—అని యెఱుగుటయే జ్ఞానము. ఇట్టి సమ్యక్-జ్ఞానమువలన పరమాత్మ యెడల భక్తి, జగత్తుపై విరక్తి సహజముగనే కలుగుచుండును. అట్టి

జ్ఞానము లేనివానికి 'ఊర్ధ్వమూలం అధఃశాఖం' అనునట్లు అంతయు తల్లక్రిందులుగనే గోచరించుచుండును. ఉన్నది లేనిదిగను, లేనిది ఉన్నట్లుగను గన్పట్టును. త్రికాలములందు సత్యమై, తనక్రింద, తనపైన, తనప్రక్కల, తనలోపల అంతటను వ్యాపించియున్న దైవమును, ఆత్మను గుర్తెరుంగక, తాను ధరించిన బుట్టబొమ్మను (దేహమును) మాత్రము సత్యమని తలంచి దాని సౌందర్యము, దాని అందము, దాని చందము చూచి కులుకుచుండును. ఎంత వెఱ్ఱి! రేపో మాపో కాటికి చేరి పడికట్టెలలో ఒక కట్టెగా రూపొందు తన పాంచభౌతిక కాయముపై ఏ మమత్వము, ఏ అభిమానము, ఏ అహంభావము జీవునకు కలదో అదియే ఆతని పతనమునకు మూలకారణ మగుచున్నది. ఆ ప్రీతి, ఆ ఆసక్తి, ఆ అభిమానము తన ఆత్మపై నున్నచో మనుజుడు ఏనాడో మోక్షము పొందియుండెడివాడు.

అయితే బహుకాలమునుండి జీవుని హృదయమందు రూఢిపడియున్న ఈ దేహాభిమానము, తజ్జనితములగు గర్వాదికము తొలగుట ఎట్లు? గాఢముగ జీర్ణించియున్న ఈ దుర్వాసన వెడలిపోవు మార్గమేది? విచారణ చేయవలెను. విచారణచేతనే హ్రస్వదృష్టి అంతరించగలదు. 'ఈ అనంతమగు విశ్వములో నేనెంత, నా దేహమెంత, నా ఊరెంత, నా పరిజనమెంత?'—— అని మరల మరల చింతన చేయువలెను. ఇట్టి విచారణయందు ఈ క్రింది అంశములు చక్కగ ఉపకరించగలవు.——

రైలుబండియొక్క వేగము 1 గంటకు దాదాపు 60 మైళ్లు.
విమానముయొక్క వేగము 1 గంటకు దాదాపు 300 మైళ్లు.
కాంతియొక్క వేగము 1 గంటకు దాదాపు 67 కోట్ల మైళ్లు.

ఒక సంవత్సరకాలమునకు కాంతి (Light) ఎంత దూరము ప్రయాణము చేయునో దానిని కాంతి సంవత్సరము (Light-year) అందురు. అనగా ఒక కాంతి సంవత్సరము నకు 5865696000000 మైళ్లు (అనగా దాదాపు 6 లక్షల కోట్ల మైళ్లు). ఖగోళశాస్త్రజ్ఞులు ఆకాశముపై గల అగణిత నక్షత్రరాసులయొక్క దూరమును ఈ కాంతిసంవత్సరమను అనుగుబద్దతో కొలిచెదరు. మనకు అతిసమీపమున గల నక్షత్రముయొక్క దూరము 4 కాంతి సంవత్సరములు. అనగా 4×5865696000000 మైళ్లు (అనగా దాదాపు 23 లక్షల కోట్ల మైళ్లు). ఆకాశమున ముగ్గుతో అలికినట్లు కానిపించు పాలపుంతలో ఎన్నికోట్ల నక్షత్రములు కలవో చెప్పతరముగాదు. మన సూర్యుడున్ను ఒక నక్షత్రమే. అయితే అతిసమీపమున నుండుటచేబట్టి తేజోవంతముగ గన్పట్టుచున్నాడు. భూమినుండి సూర్యుని దూరము దాదాపు 9 కోట్ల మైళ్లు. మన సూర్యుని చుట్టు, ఒక్కొక్క నక్షత్రము చుట్టు ఎన్నెన్ని గ్రహములు తిరుగుచున్నవో! దానిలో మనవలెనే ఎన్నెన్ని జీవరాసులున్నవో! ఒక పర్యాయము రాత్రికాలమున ఆకాశమును పరికించినచో, కోటానుకోట్ల మైళ్లు దూరమున ప్రశాంతముగ పరిభ్రమించు చున్న ఆ తేజోరాసులను వీక్షించినచో, ఆ యా గ్రహ

తారామండలమును గూర్చి ఊహించినచో, అనంతవిశ్వము యొక్క గాంభీర్యము, భగవానునియొక్క సర్వజ్ఞత, సర్వ శక్తిమత్త్వములు దృగ్గోచరములు కాగలవు. అపుడే గర్వము పలాయనమై దైవభక్తి ఉదయించగలదు.

మానవుడు అపుడపుడు ఈ అనంతబ్రహ్మాండ విస్తార మును గూర్చి విచారించుచు తనలో తా నిట్లు వితర్కించు కొనవలెను—'ఈ అనంతాకాశములో మన సూర్యు డెంత! సూర్యుని చెంత నలుసువలె గోచరించు ఈ భూమి యెంత! భూగోళములో ఆసియా ఖండములో భారత దేశ మెంత! భారత దేశములో ఆంధ్రప్రాంత మెంత! ఆంధ్రప్రాంతములో నా జిల్లా ఎంత! నా జిల్లాలో నా ఊరెంత! నా ఊరిలో నా యిల్లెంత! నా యింటిలో నే నెంత!'—అని ఈ ప్రకారముగ ఆలోచించినచో ఇక గర్వమునకు, అహంకారమునకు చోటే లేకుండును. ఇట్టి విషయములు యోచింపని కారణము చేతనే అల్పుడగు జీవునియందు దర్పము ప్రవేశించు చున్నది. మఱియు నాస్తికుడై సర్వజ్ఞుడగు పరమాత్మను విస్మరించుచుండుటయు సంభవించుచున్నది. అనంత విశ్వమం దేచోటనో మూలపడియుండు జానెడు జీవుడు, రేపో మాపో నామరూపములు లేకుండ అదృశ్యమైపోవు దేహముగల ఈ క్షణిక జీవి, శాశ్వతుడై సర్వజ్ఞుడై, బ్రహ్మాండవ్యాపకుడైనట్టి పరమాత్మను విస్మరించి దర్పముతో వ్యవహరించుట చాల శోచనీయము. ఇట్టి అహంకారము ఎంత శీఘ్రముగ విలయమైపోయిన అంత శ్రేయస్కరము.

కావున, విజ్ఞుడగువాడు నశ్వరమగు తన ఉపాధి యొక్క ఘనతను గూర్చి చింతింపక శాశ్వతమగు తన హృదయస్థ ఆత్మను గూర్చియే పర్యాలోచించుకొనుచు, గర్వాదులను వీడి భగవద్భక్తియుతుడై, సర్వేశ్వరుని యొక్క అపారకృపకు పాత్రుడై ఆత్మానంద మనుభవించవలెను. దేహాభిమానమును పూర్తిగ విడనాడవలయును. దేహముపై మమత్వమును తొలగించుకొనవలెను. వాస్తవముగ ఈ దేహమునకు తనకు ఏమాత్రము సంబంధము లేదు. దేహము జడమైనది. పంచభూతాత్మకమైనది.

## దేహము - దేహి

ఈ దేహము ఎవరిది? అని భాగవతమునందు ఒక ప్రశ్న లేవదీయబడినది.

దేహః కిమన్నదాతుః స్వం నిషేక్తుర్మాతురేవ చ
మాతుః పితుర్వా బలినః క్రేతురగ్నేః శునోఽపి వా. 1
ఏవం సాధారణం దేహమవ్యక్త ప్రభవాప్యయమ్
కో విద్వానాత్మసాత్ కృత్వా హన్తి జన్తూనృతేఽసతః. 2
(భాగవతము 10-10-11,12)

ఈ దేహము ఎవరిది?

అన్నముపెట్టి పోషించువానిదా? పుట్టించిన తండ్రిదా? తొమ్మిది నెలలు మోసిన తల్లిదా? తల్లిని కనినట్టి తాతదా? దీనిచేత పనిచేయించు బలవంతునిదా? శ్మశానములో దీనిని కాల్చివేయు అగ్నిదా? రుద్రభూమియందు దీనిని కొరికి

కొట్టికి తినివేయు కుక్కలదా! అని భాగవతకారుడు నిలదీసి ప్రశ్నించెను. భాగవతము దశమస్కంధములో నారదుడు నలకూబర, మణిగ్రీవులను దేవపుత్రులకు కావించిన హితోపదేశ సందర్భమున ఈ ప్రశ్న కావింపబడెను. ఆ ప్రశ్నకు నారదుడే ఈ ప్రకారముగ సమాధానము ఒసంగియుండెను—

'నాయకులారా! ఈ దేహము ఎవరిదీ కాదు. ఇది యొక సామాన్యమైన జడవస్తువు. మృత్తికానిర్మితమగు ఘటమువంటిది. ప్రకృతినుండి పుట్టి ప్రకృతిలో లయమైపోవుచున్నది. ఇట్టి అల్పవస్తువును 'నేను' అని తలంచి ఇతరులకు కీడు చేయుదలంచువారు ఎంత అవివేకులు!' కావున వశ్వరమై, పాంచభౌతికమైనట్టి ఈ శరీరము తాను కాదనియు, శాశ్వతమగు చిన్మయ ఆత్మయే తాననియు బాగుగ నిశ్చయించుకొని, సర్వప్రాణులు తన స్వరూపమే యని భావించుకొని, ఎవరికిని అపకారము చేయక జీవితమును గడుపవలయును.

మానవునికి కలుగుచున్న దుఃఖమంతటికిని కారణము ఈ దేహాభిమానమే. దేహముపైనను, దేహమునకు బయట గల పదార్థములపైనను గల మమత్వమే దుఃఖమునకు హేతువు. జీవుడు ఉపాధిని ధరించి లోకమున వ్యవహరించుచున్నప్పటికిని ఆ ఉపాధితోగాని, లోక వ్యవహారములతో గాని సంగములేనివాడై, వానియందు తగుల్కొనక బహు జాగ్రతగ వర్తించుచుండవలెను. పంచకోశ వివేకము చేతను, సాంఖ్యవిచారణచేతను ఆత్మస్వరూపుడగు తనయొక్కయు,

అనాత్మస్వరూపమగు ప్రపంచముయొక్కయు యథార్థ స్వరూపము చక్కగ తెలిసికొని, దేహాదులతో వాస్తవముగ తనకు ఏమాత్రము సంబంధము లేదని గ్రహించి, నాటకములో దీపము భంగి తాను సర్వసాక్షిగా ఈ జగన్నాటకమును వీక్షించు తటస్థుడే యని గుర్తెరింగి ప్రశాంతముగ జీవితమును గడుపవలెను. కార్యము చేయుచున్నను అకార్యము నందు తగుల్కొనకుండుటయే మానవుని విజ్ఞత. దేహము నందున్నను తాను దేహాతీతుడని తెలిసికొని దేహమును సాక్షిగా జూడగల్గుటయే మానవుని గొప్పతనము. అభ్యాసముచే ఇట్టి స్థితి జనులకు తప్పక ఏర్పడగలదు. ఇట్టి దేహాభిమానరాహిత్యముచే జీవుడు అనుభవించు ఆనందము వర్ణనాతీతము. దుఃఖము లవలేశమైనను అత్తఱి అతనికి సోకకుండును.

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే.

అని గీతాచార్యుడు అట్టి మహోన్నతస్థితినిగూర్చి వర్ణించి యున్నాడు. దేనిని పొందినచో ఇక ఇతరులమగు లాభము లన్నిటిని అంత గొప్పగా చూడడో, దేనియందు నిలుకడ గలిగియున్నచో ఘోరదుఃఖము వచ్చి నెత్తిన పడినప్పటికి ఏమాత్రము చలింపడో అట్టి ఆత్మస్థితి దేహాభిమానరహితులకే సిద్ధించగలదుగాని అన్యులకు కాదు. తాను జడమైన దేహమని తలంచుకొనుచుండు వాడెవడును అట్టి పవిత్రస్థితిని

బడయజాలడు. సంసారసాగరముయొక్క ఆవలి యొడ్డును చేరజాలడు.

శరీరపోషణార్థీ సన్య ఆత్మానం దిదృక్షతి
గ్రాహం దారుధియా ధృత్వా నదీం తర్తుం స గచ్ఛతి.

ఒకానొక యాత్రికుడు పాదచారియై తీర్థయాత్ర చేసికొనుచు పోవుచుండ త్రోవలో ఒక నది అడ్డు వచ్చెనట. ఆ సమయమున సూర్యుడస్తాద్రిం గ్రుంకెను. చీకటి నలుదెసల వ్యాపించెను. నదియొడ్డున ఒక్కపడవగాని, పడవ నడుపు మనుష్యుడుగాని ఎవరును లేరు. కాని దూరముగ ఒకచోట నదియొడ్డున నల్లటిమొద్దు ఒకటి పడియుండుటను గాంచి అది కొయ్యయని భావించి దానిపై కూర్చొని ఆతడు నెమ్మదిగ దానిని నీటిలోనికి నెట్టెను. అది కదలిపోవుచుండెను. ఈ ప్రకారముగ అతడు నదీమధ్యభాగమువఱకు రాగా, ఆకాశము మేఘావృతమై మెఱుపు మెఱయగా ఆ మెఱపుకాంతిలో ఆ కొయ్యమొద్దును పరికింప అది కొయ్య కాదనియు మొసలియనియు తేలినది. ఇట్టి పరిస్థితియందు ఆ యాత్రికుడు ఆవలియొడ్డును చేరగలడా యని శ్రీ శంకరాచార్యులవారు ప్రశ్నించుచున్నారు. ఎన్నటికిని చేరలేడు. భయంకరమైన ఆ మొసలి త్రోవలోనే అతనిని కబళించివైచును. అట్లే 'నేను దేహమును' అనుభావము కలవాడెవడును ఆత్మను దర్శింపలేడు. సంసారసముద్రమును దాటలేడు, దుఃఖజాలమును తొలగించుకొనలేడు.

ఈ శరీరము వాస్తవముగ బంకమట్టితో చేయబడిన ఒకానొక ఇల్లు. ఇది కొద్దికాలము నివసించుటకొఱకు భూదేవినుండి బదులుగ తీసికొనబడినది. తిరిగి ఆ భూదేవికి దీనిని సమర్పించి వేయవలసియున్నది. ఎల్లకాలము దీనిలో నివసించుటకు అనుమతిలేదు. ఇది సొంత ఇల్లు కాదు. అద్దె కొంప. అద్దె కొంపలలో శాశ్వతనివాసము సాధ్యపడదు. ఏదియో యొక కాలములో లేవవలసినదే. అట్టిచో దానిపై అంత మమత్వమేల? బాగుగ విచారించి చూచినచో దేహముపైగాని, దేహము నాశ్రయించుకొనియుండిన బాహ్యవస్తువులపైగాని, బంధ్వాదులందుగాని మమత్వము కేవలము కల్పితమే యని తేలుచున్నది. కాబట్టి అట్టి కల్పితభావములను విస్తరించి తాను జడమైన పదార్థము కాదనియు నిత్యశుద్ధబుద్ధముక్త ఆత్మస్వరూపమే యనియు దృఢముగ నిశ్చయించవలయును. దుఃఖరాహిత్యమునకు, బంధవిముక్తికి ఇది యొకటియే మార్గము.

నాన్యః పన్థా విద్యతేఽయనాయ.

దేహాభిమానమను పాశముచే జీవుడు అనాదికాలమునుండియు బద్ధుడై, తత్ఫలితముగ ఈ జననమరణరూప ప్రవాహమందు దిక్కులేక కొట్టుకొనిపోవుచున్నాడు. సుకృతవశమున లభించిన ఈ పరమపవిత్ర మానవజన్మయందు ప్రయత్నపూర్వకముగ జ్ఞానమను ఖడ్గమును సంపాదించి 'నేను దేహమును కాదు, దేహసాక్షియగు ఆత్మను' అను వివేకమును లెస్సగ బడసి, దేహాహంభావరూపపాశమును

ఆ ఖడ్గముచే ఛేదించి వైచి పరమసుఖమును బొందవలయును. తాను జడస్వరూపుడు కాదనియు, కేవలము చిదాత్మయే యనియు మరల మరల మననము చేయుచుండవలెను.

చిదానందరూప శ్శివోఽహం శివోఽహమ్.

అని ఎలుగెత్తి పాడుచుండవలెను. జన్మాంతరసంస్కారమువలన తాను దేహమనుభావన కలిగినప్పుడెల్ల, తద్విరోధియగు ఆత్మసంస్కారమును మరల మరల తెచ్చుకొనుచు అవివేకమును పారద్రోలుచుండవలెను.

నాస్తి జాగరతో భయమ్.

జాగ్రతగ నున్నవానికి, వివేకవిషయమున మేలుకొనియున్నవానికి, దుఃఖమును గూర్చిన భయము లవలేశమైనను ఉండనేరదు. కాబట్టి ముముక్షువులగువారు దేహాభిమానమును దరికి జేర్చక, ఆత్మచింతనపరులై, జీవితమును పరమానందమయముగ నొనర్చుకొనవలయును. దేహమను రథమందు తాము చిన్మయమూర్తియగు దేహియై విలసిల్లుచున్నట్లు భావించుకొనవలెను.

కొన్ని పెద్దపెద్ద దేవాలయములకు సంబంధించి కొన్ని రథము లుండును. సంవత్సరమున కొకపర్యాయమో, లేక రెండు మూడు పర్యాయములో దేవతామూర్తిని (ఉత్సవవిగ్రహమును) రథముపై ఆసీనులుగజేసి ప్రధానవీథుల గుండా ఊరేగించుదురు. మందిరములలో జరుగుచుండు ప్రధాన దైవకైంకర్యములలో ఇది యొకటి. ఆ రథోత్సవ

సమయమున ఊరిలోని పిన్నలు, పెద్దలు అందఱు హార్దాభి
రుచియముతో భక్తిపూర్వకముగ రథమువెంట పురవీథులలో
జనుచు భగవానునకు తమ భక్త్యంజలి ఘటించుచుందురు.

రథోత్సవములో ప్రధానమైనది రథము కాదు, జనము
కాదు, లాగువారు కాదు, అలంకరణము కాదు. రథములో
నున్న దివ్యమూర్తియే ప్రధానము. ఆమూర్తికొఱకే దారి
పొడుగునా టెంకాయలు, పండ్లు కానుకలు సమర్పింపబడు
చుండును. అదియే ముఖ్యము. తక్కినదంతయు గౌణము.
కాని రథోత్సవసమయమున జనసామాన్యముయొక్క దృష్టి
సాధారణముగ బహిర్ముఖముగనే చనుచుండును. వేడుకలు,
అలంకారములు, నృత్యములు-వీనిపైనే వారిదృష్టి హెచ్చుగ
కేంద్రీకరింపబడుచుండును. ఏ కొలదిమందియో మహానీ
యులు తమ చిత్తములను ఏకాగ్రపఱచి రథాంతర్గత దివ్య
మూర్తియొక్క పదకమలములపై దానిని కేంద్రీకరించుదురు.
ఇట్టి రథోత్సవములు సంవత్సరమునకు ఎప్పుడో ఒక పర్యా
యము మాత్రమే జరుగుచుండును.

కాని ఈప్రపంచములో ఇంకొక రథము కలదు. దాని
ఉత్సవము ప్రతిదినము జరుగుచుండును. అదియో శరీరము.
"శరీరం రథమేవ తు"-అని ఉపనిషత్తు లెప్పుడో ఈ సత్య
మును బాహాటముగ చెప్పివైచినవి. శరీరమొక రథము,
బుద్ధి సారథి, ఇంద్రియములు గుఱ్ఱములు, విషయములు దారి,
ప్రత్యగాత్మ యజమాని. ఇట్టి రథములు ఒకటి కాదు, రెండు
కాదు, వందలు కాదు, వేలు కాదు, కోటానుకోట్లు ప్రతిదినము

లోకమున సంచరించుచున్నవి. ఇంతవఱకెన్నియో నిట్టి రథోత్సవములు గడచిపోయినవి, ఇపుడు గడచుచున్నవి, ముందు గడవనున్నవి. కాని వీనినిగూర్చి ఎవరైన పట్టించుకొనుచున్నారా? రథికుడగు ప్రత్యగాత్మ కెవరైన జోహారులర్పించుచున్నారా? అతనికి కనీసము రోజున కొకపర్యాయమైనా వందనము సమర్పించుచున్నారా? రథము (శరీరము) యొక్క అలంకరణములోనే సమయమంతయు గడచిపోవుచున్నది. ఇక మూర్తిని సేవించున దెపుడు? ఈ విషయమై గొప్ప ఆలోచన చేయుదగియున్నది.

విజ్ఞుడగువాడు ఉపనిషత్ప్రతిపాదితమైన ఈ శరీరరథమునుగూర్చి దీర్ఘముగ యోచించి, రథముపై మమత్వముంచక, అభిమానమును కలుగజేసికొనక, రథాంతర్గతుడగు పరమాత్మయందే తనదృష్టిని మఱలించి దేహము నడచుచున్నను, కూర్చొనుచున్నను, మాట్లాడుచున్నను, భుజించుచున్నను అవియన్నియు ఉపాధిజనిత క్రియ లేయనియు, తాను నిష్క్రియుడై, నిర్మలుడై, సర్వసాక్షియైనట్టి ఆత్మయేయనియు సదా భావించుచుండవలెను. మఱియు ఆ ఉపాధికి సంబంధించిన సుఖదుఃఖములను తనపై ఆరోపించుకొనక నిస్సంగుడై వ్యవహరించవలెను.

ఒక్క మానవదేహమే కాదు, ప్రపంచములోని సమస్త చరాచరదేహములున్ను రథము లేయని భావించవలెను. ఆవుశరీరము ఒక రథము, కుక్కశరీరము ఒక రథము, ఏనుగుశరీరము ఒక రథము, అట్లే చీమ శరీరమున్ను ఒక

రథమే యగును. ఆయా ప్రాణులు కదలుచున్నపుడు రథో త్సవములు జరుగుచున్నట్లు భావనచేయవలెను. ఆయా రథములను సందర్శించినపుడు అందున్న రథికుడగు ప్రత్యగాత్మను సందర్శించు విజ్ఞతను జీవుడు సంపాదించవలెను అపుడే సర్వజీవరాసులందును దయ, ప్రేమ, కరుణ మనుజునకు కలుగ గలవు. అపుడే ద్వేషము, వైరము అంతరించిపోగలవు. సద్గుణావలంబనమున కిదియొక చక్కటి ఉపాయము. లోకములో ప్రాణికోట్ల రూపమున నున్న అగణిత రథములందు ఒకే చిదాత్మరూప దివ్యమూర్తి ఆసీనుడైయుండ, ఇక ఎవరిపై క్రోధము? ఎవరిపై ద్వేషము?

యస్మిన్సర్వాణి భూతాని ఆత్మైవా భూద్విజానతః
తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః.

(ఈశావాస్యోపనిషత్తు)

ఉపనిషత్తులు పనికట్టుకొని ఈ ప్రకారముగ బోధించు చుండ ఇక జనులు 'వాడు వేఱు, వీడు వేఱు' అను భేద దృష్టిని గలిగియుండుట, వైరభావమును ప్రదర్శించుట హాస్యాస్పదమే యగును. మణులందు దారమువలె భగవానుడు అన్ని ఉపాధులందు అనుస్యూతముగ వర్తించు చున్నాడు. 'సూత్రే మణిగణా ఇవ' అను గీతావాక్యము యొక్క అర్థమిదియే. కావున జను లిట్టిసత్యమును గుర్తెఱిగి విశాలభావమునే అలవాటుచేసికొని వైర ద్వేషాదులను పార ద్రోలవలెను. సర్వభూతహితమునే వాంఛింపవలెను.

రథోత్సవసమయమున రథాంతర్గత దేవతామూర్తిని జను లెట్లు సేవింతురో, అట్లే ప్రపంచములో ఏ ఉపాధిని చూచినను అది భగవంతునియొక్క రథమేయని భావించి లోనగల ప్రత్యగాత్మకు భక్త్యంజలి సమర్పించవలెను.

'ప్రణమేద్దండవద్భూమావాశ్వ చండాలగోఖరమ్' అని భాగవతము వచించిన చందమున గుఱ్ఱము, ఆవు, గాడిద - వెయ్యేల సమస్త ప్రాణికోట్లకు మానసికముగ సాష్టాంగ వందన మాచరించవలెను. అపుడే విశ్వప్రేమ, విశ్వసౌభ్రాతృత్వము, సర్వజీవకారుణ్యము చక్కగ అభ్యాసము కాగలవు. జనులలో విద్వేషము తొలగిపోగలదు. రామరాజ్యము స్థాపింపబడగలదు. అట్టి సర్వసమత్వరూప మహోన్నత లక్ష్యముకొఱకై పాటుపడి సర్వక్షేత్రములందును వెలయు క్షేత్రజ్ఞుడైన పరమాత్మను సాక్షాత్కరించుకొని భవబంధనమునుండి విముక్తులు కావలయును.

రథికుడైన ఆత్మనుగూర్చిన ఇట్టి పరిజ్ఞానము రణరంగమున సైనికునకు కవచము మాడ్కి వ్యవహారక్షేత్రమందు సాధకునకు చక్కగ ఉపకరించును. జీవితమొక యుద్ధరంగము. మానవుడు అవిద్య, అజ్ఞానము అను శత్రువుతో ముముక్షువు భీకరమగు పోరు సలుపుచున్నాడు. ఈ యుద్ధమున స్వీయరక్షణార్థము ఒక కవచము అతనికి అత్యావశ్యకమై యున్నది. అదియే దైవకవచము, బ్రహ్మకవచము, నారాయణకవచము.

## బ్రహ్మకవచము

దేవదానవసంగ్రామ సమయమున దేవతలకు విజయము లభించు నిమిత్తము దేవపురోహితుడగు విశ్వరూపుడు ఇంద్రునకు నారాయణకవచమును ఉపదేశించెనని భాగవతము షష్ఠస్కంధమున పేర్కొనబడినది. నారాయణకవచ ప్రభావముచే ఇంద్రుడు రణమందు విజయశ్రీని జేబట్టగల్గెను. దానవులు భయభ్రాంతులై పలాయనమును చిత్తగించిరి.

కవచధారణ యోధులకు అత్యవసరము. శత్రువుల ఆయుధప్రయోగములనుండి, ఆఘాతములనుండి కవచము దేహమును సంరక్షించును. భౌతికకవచములకే ఇంతటి అమోఘశక్తియున్నపుడు ఇక అధ్యాత్మికకవచమును గూర్చి వేఱుగ చెప్పవలయునా? విశ్వరూపుడు దేవేంద్రునకు బోధించినది ఆధ్యాత్మికకవచము. దానినే నారాయణకవచమందురు. ప్రతివారును ఇట్టి పరమార్థకకవచమును ధరించియే లోకమున వ్యవహరించవలసియున్నారు.

జీవుడు అనాదికాలమునుండి ఒకానొక భీషణసంగ్రామములో పాల్గొనుచున్నాడు. ఏ యుద్ధమైనను కొలదిరోజులలో సమాప్తమై పోవును. కాని జీవుడు తగుల్కొనిన ఈ ప్రకృతిసమరము అనాదికాలమున ప్రారంభమై ఇంకను తెమలకయున్నది. కామక్రోధాది శత్రువులతో అతడు ఎడతెరపిలేక పోరాడుచున్నాడు. దేహభ్రాంతి, దేహాభిమానము, అహంకార, మమకారములను ప్రతిపక్షశక్తులతో

జీవుడు అనవరతము పోరుసల్పుచున్నాడు. శత్రుపక్షము మహాశక్తివంతమై యుండుటంబట్టియు, స్వపక్షమున తగినంత బలము లేకుండుటంబట్టియు జీవుడు ఈ ప్రకృతిసంగ్రామమున విజయము గాంచలేకున్నాడు. పైగా శత్రుప్రహారములచే నానాబాధల నొందుచున్నాడు. ఇట్టిస్థితిలో జీవుడు తన్ను తాను సంరక్షించుకొనుటకై ఏదియోవిధముగ యత్నము సలుపవలసియున్నది. ఇందులకు కవచము చక్కగ ఉపకరించును. లోహములచే నిర్మితమగు కవచము కాదు. దైవకవచము, ఆత్మకవచము, నారాయణకవచము. భౌతిక కవచము భౌతిక దేహమునే సంరక్షించునుగాని మానసిక బాధలను అది ఏమాత్రము తొలగింపజాలదు. భవదుఃఖమును బాపుటకు ఆత్మకవచమే శరణ్యము. నానావిధ కల్లోలములతో గూడిన ఈ సంసారరణక్షేత్రమున జ్ఞాన కవచమును ధరింపనిదే, దైవకవచమును ఆశ్రయింపనిదే జీవుడు శాంతిని నోచుకొనలేడు.

'రక్తమాంసములతో గూడిన ఈ క్షణిక దేహమును నేను కాను, దేహసాక్షియగు ఆత్మయే నేను' అని నిరంతరము భావించుటయే కవచధారణయగును. 'నాలుగు మూరల చిన్న అస్థిపంజరము నేను కాను, విశ్వవ్యాపక ఆత్మయే నేను' అని సతతము సంస్మరించుటయే దైవకవచమును పరిగ్రహించుట యగును. 'పుట్టుచు, చచ్చుచు కర్మాధీనమై అస్వతంత్రమై యున్న ఈ ఉపాధి నేను కాదు. జననమరణరహితమై, సర్వస్వతంత్రమై, దేశకాలక్రియలకు

ఒకింతైనను సంబంధములేని నిర్వికల్పచిదాత్మయే 'నేను' అను పరిజ్ఞానము కలిగియుండుటయే బ్రహ్మాత్మకవచమును ధరించుట యగును.

ఇట్టి ఆత్మకవచమును, దైవకవచమును ధరింపని వారికి ఈ సంసారక్షేత్రమున దెబ్బలు తప్పవు. దుఃఖము తప్పదు, బాధ తప్పదు. ఎందఱో సత్యము నెఱుంగక, తమ నిజాత్మభావమును మఱచి ఈ దెబ్బలు తినుచు, బాధలు పొందుచు సంసారభారమును ఈడ్చుకొనిపోవుచు జీవయాత్రను కొనసాగించుచున్నారు. దుఃఖముచే కుమిలిపోవుచున్నారు. మానవుడు దుఃఖించుటకొఱకు కాదు ఈ అపూర్వ జన్మను బడసినది. దుఃఖమును పోగొట్టుటకొఱకు. ఆత్మజ్ఞానమొకటియే ఇకార్యమును సాధింపగలదు. దైవకవచమొక్కటియే శాంతిని ప్రసాదింపగలదు. మాయకు అధీనుడగు జీవుడు మాయాతీతుడగు పరమేశ్వరుని ఆశ్రయించినపుడుమాత్రమే మాయాప్రభావమగు దుఃఖమునుండి విముక్తుడు కాగల్గును. గొడుగు వేసికొనినవానికి వర్ష బాధ యెట్లుండదో, చెప్పులు తొడుగుకొనినవానికి కంటకముల బాధ యెట్లుండదో, కవచమును ధరించినవానికి బాణప్రహారజనిత బాధ యెట్లుండదో అట్లే మాయాతీతుడగు పరమేశ్వరుని ఆశ్రయించినవారికి, ఆత్మజ్ఞానము కలిగియున్నవారికి సంసారబాధ లెవ్వియు ఉండవు. ఇట్టి ఆత్మజ్ఞానమును యుక్తి లేనిచో ఈ మహాసాంసారిక కల్లోలయందు జీవితమే అత్యంత దుర్భరముగా పరిణమించును.

జనకభూపాలుడు సంసారమందున్నప్పటికిని ఈ జ్ఞానరూపకవచమును ధరించియే శాంతిని బొందగలిగియున్నాడు. అర్జునుడు రణరంగమున శత్రువులను సాహసోపేతముగ ఎదుర్కొనుచు వివిధకార్యముల నాచరించినప్పటికిని 'మామనుస్మర యుధ్యచ' (నన్ను స్మరించుచు యుద్ధము చేయుము) అను గీతాబోధను స్మృతిపథమునం దుంచుకొని, సదా శ్రీకృష్ణుని తన చిత్తకుహరమున ధ్యానించుచు అట్టి భక్తికవచముచే యుద్ధమును యజ్ఞముగ మార్చివైచెను. భయంకరయుద్ధమాచరించినను పరమశాంతినే పడయగలెను. శ్రీకృష్ణుని అనవరత సంస్మరణముచే వ్యవహారసంకులితక్షేత్రమును విజనారణ్యప్రశాంతివాతావరణమయముగ నొనర్చుకొనగలెను.

భయంకరమగు ఈ సంసారపథమున జను ప్రతిజీవికిని అట్టి దైవకవచరూప రక్షణ అవసరము కావున ముముక్షువులెల్లరు అద్దానిని పరిగ్రహించి జీవితమును ఆనందప్రపూర్ణముగ గావించుకొనవలెను. మిత్రబాంధవులు దేహమున్నంతవఱకే ఒకింత ఆదుకొనగలరు. ఆ తదుపరి జీవునకు దిక్కెవరు? దేహమున్నను, పోయినను సర్వకాలసర్వావస్థలయందును జనులను కాపాడునది నారాయణుడే. ఆ నారాయణుని ఆశ్రయించినవారికి, ఆ నారాయణకవచమును ధరించినవారికి ఇక ఏలాటి ఆపదలు, భయములు ఉండనేరవు. భగవద్భక్తియే ఆ నారాయణకవచము, ఆత్మజ్ఞానమే ఆ నారాయణకవచము. నిరంతర దైవస్మరణమే ఆ నారాయణ

కవచము. అట్టి మహోన్నత అధ్యాత్మకవచమును ధరించి, నిత్యవ్యవహారమాచరించుకొనుచు, దైవదృష్టిని ఏ కాలమందును వదలక జీవుడు సంసారరంగమున పరమశాంతిని బొందవలయును,

ఇట్టి బ్రహ్మకవచధారణచేత జీవునకు గల దుఃఖములన్నియు, భయములన్నియు సమూలముగ తొలగిపోగలవు. అజ్ఞానియగు జీవునకు ఉదయము నిద్రలేచినది మొదలు, రాత్రి పరుండువఱకును ఎన్నియో భయములు పీడించుచున్నవి. అవి యేవియును ఆత్మవిచారణాతత్పరుడగు జ్ఞానిని బాధించనేరవు.

ప్రపంచములోగల భయములన్నిటిలోను మరణభయము అతితీవ్రమైనది. మరణమనుమాట వినుటతోడనే జనులు దద్దరిల్లిపోవుదురు. కాని అట్టి భయమును ఉపనిషత్తులు, గీతాదిసద్గ్రంథములు ఆత్మజ్ఞానప్రబోధముద్వారా సంపూర్ణముగ తొలగించివైచినవి. "ఓ జీవుడా! నీవు జననమరణరహితుడవగు అమృతస్వరూపుడవే నీకు మరణమనునదియే లేదు" అని అవి బోధించినవి. 'చనిపోయెను' అను వాక్యములోని 'చనుట' అను పదమునకు పోవుట, వెళ్ళుట అనియే అర్థము కలదు. అనగా జీవుడు ఒక దేహమునువదలి మఱియొక దేహమును గ్రహించుటకు ఇంకొక చోటునకు వెడలెననియే అర్థము. (పాతవస్త్రమును తీసివైచి క్రొత్తవస్త్రమును ధరించులాగున.) దీనిలో 'నశించుట' అను అర్థమున కాస్కారమే లేదు. కావున మరణమనగా జీవుని

దేహపరిస్థితియొక్క ఒకానొక మార్పేకాని వినాశమెన్నటి కినిగాదు. ఇట్టి అపూర్వసత్యములను మహర్షులు వెల్లడించి జనులకు గొప్ప ఆశ్వాసమును గలుగజేసిరి.

ఆత్మ ఒకటి తప్ప ప్రపంచములోని ప్రతివస్తువు షడ్భావ వికారములకు లోనై యుండును. శరీరమున్ను దృశ్యప్రపంచములో నంతర్భావమే కావున అదియు వికారములనుండి తప్పించుకొనజాలదు. కాబట్టి అదియు పుట్టుట, గిట్టుట కలిగి యుండును. ఆత్మమాత్రము నిర్వికారమై చెన్నొందుచుండును. మంచుకు శీతలత్వమెట్లు స్వభావమో, అగ్నికి ఉష్ణత్వమెట్లు స్వభావమో, అట్లే శరీరమునకున్ను జననమరణములు స్వభావములై యున్నవి. అందుచే మరణమునుగూర్చి యెవరును భయపడనవసరము లేదు.

రామతీర్థులొకపుడు ఒకానొక సభలో ఉపన్యసించుచుండ మధ్యలో ఎవరో ఒక చీటీ తెచ్చి వారికి అందజేసిరి. రామతీర్థులది చదువుకొని దానిని ప్రక్కనబెట్టి మరల ఉపన్యాసమును కొనసాగించెను. సభ పూర్తిఅయిన వెనుక ఒకరు 'అయ్యా! ఆ చీటీలోని విషయము లేమి?' అని రామతీర్థుల నడుగ, 'నాకు ఒకడే కుమారుడు కలడు; అతడు మరణించెనను వార్త దానియందు గలదు' అని చెప్పెను. 'దానిచే తమకు దుఃఖము కలుగలేదేమి?' అని వారడుగ 'నిప్పు వేడిగానున్నది' అను వార్తచేగాని, 'మంచు చల్లగానున్నది' అను కబురుచేగాని ఎవరికైన శోకము జనించునా? జనింపదు. ఏలనన అవి వానికి సహజగుణములు. అట్లే పుట్టిన

వస్తువు గిట్టినది అను వార్తచే విజ్ఞునకు దుఃఖమెన్నటికిని గలుగదు. 'జాతస్య హి ధ్రువో మృత్యుః' అను గీతావాక్యానుసారము పుట్టినదేహము ఎప్పటికైనను నశించియే తీరును' అని రామతీర్థులు గంభీరముగ పలికిరి. మహాత్ములయొక్క అనుభవవాక్యము లిట్లే యుండును.

ఇంతవఱకు దేహమునుగూర్చి విచారించితిమి. ఇక ఆత్మనుగూర్చి యోచించెదము. ఆత్మ నాశరహితమైనది. షడ్భావవికారములు లేనిది. శాశ్వతమైనది. సనాతనస్వరూపమై వెలుగొందునది. ఈ సత్యమునే క్రింద గీతాశ్లోకము నిరూపించుచున్నది.

న జాయతేమ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే. (2-20)

ఇట్టి ఆత్మయే జీవుని యథార్థస్వరూపము. జీవుడు 'దేహి'యే కాని 'దేహము' కాదు. వస్త్రమును ధరించువాడే కాని వస్త్రము కాదు, ఇంటిలో ఉండువాడే కాని ఇల్లు కాదు. పొలము (క్షేత్రమును) చూచువాడే కాని పొలము కాదు. ఇట్టి నిగూఢతత్త్వమును మహర్షులు స్వానుభవము ద్వారా జనసామాన్యమునకు అందజేసి, ధైర్య, వీర్య, గాంభీర్యాదులను వారికి కలుగజేసిరి.

వాస్తవముగ అఖండధైర్యము, నిర్భయత్వము, ఆత్మజ్ఞానముచే దప్ప మఱి దేనిచేతను గలుగనేరవు. 'ద్వితీయా

ద్వైతే భయం భవతి' అను శ్రుతిప్రకారము ఆత్మకంటె వేఱుగ మఱియొక వస్తువును సత్యమని నమ్మినచో వెంటనే భయ ముదయించును. అజ్ఞానిజనులు దేహాదిదృశ్యపదార్థములను సత్యమని నమ్మి భయమును, దుఃఖమును పొందుచున్నారు. జ్ఞాని దేహాదులను నశ్వరములుగను, ఆత్మను శాశ్వతము గను నమ్మి నిర్భయత్వమును, అనంతానందమును బడయు చున్నాడు. ఈ సందర్భమున వివేకానందులు పలికిన ఈ క్రింది వాక్యములు స్మరణీయములై యున్నవి—

It is strength and strength that we want, and the first step in getting the strength is to uphold the upanishads and believe that 'I am the Atman.'

'మనకు కావలసినది బలము, బలము! అట్టి బలమును సంపాదించుటకు ఏకైకమార్గము ఉపనిషత్తులను విశ్వసించి తాను ఆత్మనని తలంచుటయే'. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ దుర్బలత్వమును, నిరుత్సాహమును, దేహాహంభావమును పొందియున్న అర్జునునకు మొట్టమొదట ఆత్మజ్ఞానమునే ఉప దేశించుటకు కారణము.

ఈ ప్రకారముగ ఆత్మవిజ్ఞానమును బడసి తన యథార్థ స్వరూపముయొక్క పరిచయముగలిగి మృత్యుభయమును దూరీకరించుకొనవలెను. మానవుడు జన్మించినది భయము లతో క్రుంగిపోవుటకుగాదు. ఉదయము లేచినది మొదలు ఎన్నియో భయములచే మనుజుడు సతమతమగుచున్నాడు. ఇట్టి దౌర్భాగ్యస్థితి యాతని కెన్నటికిని తగదు. కాలమునకు,

ప్రకృతికి లోబడిన ఒకానొక అల్పవస్తువుకాదు మానవుడు. మృత్యువుయొక్క చెప్పుచేతలలో అణగియుండు తుచ్ఛ వస్తువుకాదు. అతడు బ్రహ్మాండము లన్నిటిని అవరించి కాలు నకు కాలుడై, మృత్యువునుగూడ చప్పళించి వేయుగల శక్తిసామర్థ్యములు గలవాడతడు. ఈ సత్యమును తెలియక, తాను నాలుగుమూరల దేహపంజరమని భ్రమించి జీవుడు నానాబాధలకు లోనగుచున్నాడు. అడుగడుగునకు ఏదియో భయముచే నావరింపబడుచున్నాడు. కాబట్టి జీవుడు తాను నిత్యశుద్ధముక్త ఆత్మయేకాని దేహముకాదని మాటిమాటికి చింతన జేయవలెను. 'తద్బ్రహ్మా నిష్కలమహం న చ భూత సంఘః' అను శంకరుల వాక్యమును పదేపదే స్మరించుచుండ వలెను. దీనిచే ఒక మరణభయమే కాదు, ఏ భయమైన నప్పటికిని పటాపంచలై పోగలదు.

ప్రతిదినము ఉదయము నిద్రలేవగనే పడకపై కూర్చుండి మూడు పర్యాయములు ఓంకారము నుచ్చరించి నిజాత్మస్వరూపమునుగూర్చి లెస్సగ భావనజేసి తదుపరి మాత్రమే దినచర్య ప్రారంభించవలెను. దానిచే అఖండ ధైర్యము చేకూరుటయేగాక దినచర్య నిర్దుష్టముగను కొన సాగగలదు.

---

# 19 వ. అధ్యాయము

## అనుష్ఠాన వేదాంతము

ఈ ప్రకారముగ మోక్షానుభూతికొఱకై సాధకుడు అనేకయత్నముల నాచరించుచున్నప్పటికిని, అనేక యోగము లను శీలించుచున్నప్పటికిని, నిత్యవ్యవహారమందు పరప్రాణి యెడల దయ, కరుణ, ప్రేమ గలిగియుండనిచో ఆ ప్రయత్న ములు పూర్ణసాఫల్యమును గలుగజేయజాలవు. ప్రతి జీవిని తనవలెనే చూచుకొనుచు సాధకుడు ఉదారవైఖరిని అవలం బించవలెను. అట్లుకాక, ఒకవైపు యోగములను, అభ్య సించుచు, మఱియొకవైపు పరప్రాణియెడల ద్వేషభావము గలిగి యుండుచో అతని పరిస్థితి మందు తిని పథ్య మాచరిం చినవానిచందముననే యుండును. అట్టివాడు భవరోగ మతనికి తొలగనేరదు.

రోగికి మందు ప్రధానమైనది. కాని పథ్యము ఇంకను ప్రధానమైనది. మందు తిని పథ్యము సరిగా ఆచరించనిచో, రోగము నయము కాకుండపోవుటయే కాక పైపెచ్చు కొన్ని విపరీతములుకూడ కలుగవచ్చును. కనుకనే వైద్యులు మందు ఇచ్చునపుడు ఆహారవిహారములందు కొన్ని నిషేధములను ప్రత్యేకముగ చెప్పుచు, నిషిద్ధవస్తువులను ఏ పరిస్థితులందును గైకొనరాదనియు, నిషిద్ధక్రియలను ఏ సందర్భమందును ఆచ

రించరాదనియు రోగులకు హెచ్చరిక చేయుచుందురు. వారు చెప్పు హితవాక్యములను రోగులు తప్పక పాటించవలసి యుందురు. అట్లు కానిచో విపత్కర అనారోగ్య పరిస్థితులను వారు ఎదుర్కొనక తప్పదు. మందుగదా ప్రధానము, పథ్య మెట్లుండిన నేమి, అని తలంచి ఇష్టము వచ్చినట్లు ప్రవర్తించుచు స్వేచ్ఛావిహారులై మెలగు రోగులు చేతులార తమ శరీర మును తామే పాడుచేసికొనిన వారగుదురు.

అట్లే అధ్యాత్మక్షేత్రమున శాస్త్రములు, అనుభవజ్ఞు లగు పెద్దల భవరోగనిర్మూలనమునకు చక్కని ఔషధము లను పేర్కొని 'ముముక్షువులారా! వీరిని సేవించి బహు కాలము లోన జతించియున్న ఈ సంసారదుఃఖమను రోగ మును అంతముచేసికొనుడు. కర్మయోగము, భక్తియోగము, రాజయోగము, జ్ఞానయోగము–అను ఔషధములను చక్కగ సేవింపుడు. అయితే, మీ నిత్య అచరణయందు దైనందిన జీవిత వ్యవహారమందు బహుజాగరూకులై ఒక్క ప్రాణికైనను హింసను కలుగజేయక, ఎవరిని బాధింపక, పరోపకార పరాయణులై సదాచారముగలిగి వర్తింపుడు —— ఇదియే పథ్యము అని హితము చెప్పుచున్నారు. వారి హితవాక్యము లను పెడచెవినిపెట్టి మందుమాత్రము సేవించి పథ్య మాచ రింపనివారు శాంతిని దుఃఖరాహిత్యమును ఎన్నటికిని నోచు కొనజాలరు. జపము, ధ్యానము, ఆత్మవిచారణ మున్నగునవి యన్నియు మందు. భూతదయ, పరోపకారము, పవిత్రాచరణ

తమున్నగునవి పథ్యము. కావున రెంటింటిని శీలించువాడు భవరోగరహితుడై పరిపూర్ణ శాంతిని అనుభవింపగలడు.

పూర్వ మొక గ్రామములో ఒకానొక పండితు డుండెడువాడు. అతడు ప్రతిదినము మధ్యాహ్నము 3 గం|| నుండి 4 గం||ల వఱకు దేవాలయములో పురాణము చెప్పు చుండెడివాడు. ఒకనా డాతని కాలక్షేపమునకు అందఱు స్త్రీలే వచ్చి వినుచుండిరి. ఆరోజు పతిభక్తిని గూర్చిన ప్రసంగము నడచెను. కాలక్షేపమంతయు పూర్తిఅయిన వెనుక పౌరాణికుడు శ్రోతల నుద్దేశించి యిట్లు పలికెను— 'అమ్మలారా! ఈరోజు అదృష్టవశాత్తు మీకు తగిన బోధే వచ్చినది. పతిభక్తిని గూర్చిన విచారణే ఇపుడు జరిగినది. పతిభక్తి అనునది చక్కని ధర్మము. అంగనామణులు తమ భర్తనే దైవముగా భావించి వారికి సేవచేయుచుండుట మహాపుణ్యప్రదము. కాబట్టి ఈ పతిభక్తి యను ధర్మమును మీరు నిరంతరము జ్ఞాపకమునం దుంచుకొనుడు. అట్టి ధర్మము సదా మీ స్మృతిపథమున నుండుటకై నేనొక ఉపాయమును చెప్పెదను. అప్రకార మాచరించుడు. ప్రతి రోజు ఉదయము స్నానము చేయగనే ఒక జపమాల తీసి కొని 108 పర్యాయములు 'పతిభక్తి' అను నామమును జపించుచుండుడు. అత్తఱి ఆ బోధ మీ హృదయఫలకము లందు బాగుగ హత్తుకొని పోవును."

పౌరాణికుని యీ హితకరవచనములను విని మహిళా మణులందఱును చాల సంతసించి అట్లే చేయుదుమని వాగ్దా

నము చేసి వారి వారి గృహములకు వెడలిపోయిరి. మఱునటి దినము ప్రొద్దుననే లేచి ఒక గృహిణి స్నానాదులను నిర్వర్తించుకొని జపమాల తీసికొని ఒకచోట కూర్చొని పౌరాణికుని ఆదేశప్రకారము 'పతిభక్తి' 'పతిభక్తి' అని పలుకుచు జపమాల పూసలను త్రిప్పుచుండెను. ఇంతలో ఆమె భర్త అచటికి రాగా వారిరువురికిని ఈ క్రింది సంభాషణము జరిగెను.

భర్త—'ఏమే! ఇంకా పొయ్యి రాజేయలేదేమి? ప్రతిరోజూ ఈపాటికి ఫలహారము పూర్తిచేసేదానవు. నాకు ఆఫీసుటైము అవుతూంది. త్వరగా లేచి ఆపని చూడు.

భార్య—ఏమండీ! జపం అష్టోత్తరం ఇంకా పూర్తి కాలేదండీ. పూర్తిచేసి త్వరలో వస్తున్నా.

భర్త—ఎవరినామం జపం చేస్తున్నావు?

భార్య—తమరిని గూర్చిన నామమే. 'పతిభక్తి'అనే మంత్రజపం చేస్తున్నా.

భర్త—బాగుంది! పతిని ఎండగొట్టి పతినిగూర్చిన జపమేమిటే!—అని భార్యను మందలించెను.

లోకములో ఇపుడు చాలచోట్ల ఈ ప్రకారమే జరుగుచున్నది, భగవంతునిగూర్చి జపముచేయుచు, భగవంతుని స్తోత్రము కావించుచు, భగవంతుని స్వరూపులే యగు జీవరాసులయెడల, పరప్రాణులయెడల ద్వేషము అసూయ, క్రోధము, వైమనస్యము కలిగియుండుచున్నారు

స్వేచ్ఛాచరణ కలిగి ప్రవర్తించుచున్నారు. ఇది మందు తిని పథ్య మాచరింపకుండుటయే యగును.

ఇట్టి క్రియలవలన జనులకు శాంతిసుఖము లెన్నటికిని కలుగనేరవు. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ గీతయందు—

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః.

అని నాలుగు యోగములు (కర్మయోగము, భక్తియోగము, రాజయోగము, జ్ఞానయోగము) చెప్పి వెను వెంటనే—

నిర్వైర స్సర్వభూతేషు యస్స మామేతి పాణ్డవ.

సర్వభూతములందును, దయగలిగియుండవలెనని ఆదేశించెను. నాలుగు యోగములు మందు, భూతదయ, సదాచారము పథ్యము. కావున మందుతోబాటు పథ్య మాచరించు విధమున యోగాచరణతోబాటు జీవకారుణ్యము, సదాచారముకూడ నిత్యజీవితమునందు కలిగియుండవలెను. దేవునకు నమస్కరించి జీవుని తిరస్కరించినచో ఏమి ప్రయోజనము? జీవుడుకూడ దేవుని స్వరూపమే యగును. 'నా అంశమే జీవుడని' గీతాచార్యుడు ఘంటాపథముగ పలికిన వాక్యములను ముముక్షువులు స్మృతిపథమున నుంచుకొని, దేవునివలె జీవునికూడ ప్రేమించుచు, వానియెడల దయాదాక్షిణ్యములు కలిగి ప్రవర్తించుచు నుండవలెను. అపుడు మాత్రమే అనుష్ఠానము పరిపూర్ణత్వము నొందకల్గును.

కావున జనులు అధ్యాత్మక్షేత్రమున ఎన్ని సాధనలాచరించినను నిత్యజీవితమున పరప్రాణియెడల దయగలిగి

యుండుచు సదా జీవకారుణ్యము నలవఱచుకొనుచు, ఇట్లే నియమముగ ఔషధముతో బాటు పథ్యమునుకూడ సేవించి అనుష్ఠాన వేదాంతమును శీలించుచు బహుకాలబాధమగు భవరోగమును బాపుకొని సుఖించవలెను.

ముముక్షువగువాడు తన నిత్యజీవితమున ఎట్లు ప్రవర్తించవలెనో, లోకమునం దెట్లు వ్యవహరించవలెనో, ఎట్టి యాచరణ గలిగియుండవలెనో ఈ సందర్భమున తెలిసికొనుట చాల ముఖ్యమైయున్నది. ఏలయనిన ఇపుడు ప్రపంచములో పెక్కుచోట్ల 'వాచా' జ్ఞానము ప్రబలి అనుష్ఠానము సన్నగిలుచున్నది. కొందఱు ధ్యానకాలమున మాత్రము యోగులవలె ప్రవర్తించి, తదుపరి నిత్యజీవనమున భోగులవలె మెలఁగుచున్నారు. ఇది సరికాదు. ఈ పద్ధతిని భగవానుడు మెచ్చుకొనడు. ఏ శాస్త్రమున్ను ఒప్పుకొనదు.

(1) సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. (6-29)

(2) ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః. (6-32)

అను ఈరెండు శ్లోకములద్వారా శ్రీకృష్ణపరమాత్మ ధ్యాననిష్ఠుని, లేక యోగనిష్ఠుని దైనందినవర్తనమును పేర్కొనియుండెను. సమస్త ప్రాణికోట్లయందును సమబుద్ధి కలిగియుండవలెననియు, సుఖమునందుగాని, దుఃఖమునందుగాని

తనవలెనే ఇతరులనుగూడ చూచుకొనవలయుననియు పర మాత్మ జనులను హెచ్చరించెను. పూజా జపధ్యానాదులు చేయుచున్నప్పటికిని, నిత్యజీవితమునందు సర్వభూతదయ, సమత్వబుద్ధి లేనిచో ఆ జపతపాదులకు ఉత్తమఫలితము చేకూరదు. వ్యాధి తొలగవలెనన్న మందు తినుటతో బాటు పథ్యమునుగూడ సరిగా ఆచరింపవలయును గదా! పూజా జపతపధ్యానాదులే మందు. సర్వభూతదయయే పథ్యము. దైవచింతనయే మందు. ధర్మాచరణయే పథ్యము. భవరోగ వినాశమునకు రెండును అవసరములే యని జ్ఞాపకముంచు కొనవలెను.

సర్వభూతదయ అను ఈ గుఱుతునుబట్టి ఇక అధ్యాత్మ క్షేత్రమున డంబాచారులగు యోగులను(Pseudo Yogins), మిథ్యాచారులగు జనులను, ఉదరనిమిత్త బహుకృతవేషు లను చక్కగ కనిపెట్టవచ్చును. ఎవని హృదయమున ప్రాణి కోట్లయెడల కరుణ, దయ, ప్రేమ యుండదో, ఎవని హృద యము కర్కశమై, పాషాణతుల్యముగ నుండునో అట్టివాడు ఎన్ని పూజలను చేసినను, ఎన్ని ధ్యానముల నాచరించినను, పూర్ణ ఫలితముల నెన్నటికిని బొందజాలడు. అతనిది అను ష్ఠాన వేదాంత మెన్నటికిని కానేరదు. పరప్రాణులను తనవలె జూచుకొనుచు, పరోపకారము, దయ, ప్రేమ, కరుణ మొద లగు ఉదాత్తగుణములు కలిగియుండనిచో, ఇక నాతడు చేసిన ధ్యానమువలన ఫలితమేమి? ఆ ధ్యానము దైవ ధ్యానమా, లేక దేహధ్యానమా? 'సూత్రే మణిగణా ఇవ'

అనునట్లు సర్వభూతకోట్లయందును—మణులందు దారము వలె అనుస్యూతుడై వ్యాపించియున్న పరమాత్మను మనస్సులో ధ్యానించిన పిదప బయటకువచ్చి పరప్రాణులకు అపకారము చేసినచో, తానింతవఱకు ధ్యానించిన పరమాత్మకు అపకారము, తద్ద్వారా అపచారము చేసినట్లే కదా!

ధ్యాన కాలమందలి దైవదృష్టి ధ్యానకాలమువఱకే పరిమితమైయుండరాదని సాధకులు జ్ఞప్తియందుంచుకొందురు గాక! ఆదృష్టి యెల్లకాలములందును ఉండవలెను. మఱియు భగవంతుడు ధర్మస్వరూపుడు. ధర్మమూర్తి. ధర్మము పతనమైనపుడు దాని నుద్ధరించుటయే అతని పని. 'శాశ్వత ధర్మగోప్తా' (ఎల్లప్పుడు ధర్మమును రక్షించువాడు) అను విశేషణముగూడ కలవాడతడు. అట్టి ధర్మస్వరూపుని ధ్యానకాలమునందు, పూజాకాలమందు చింతనజేసి, తదుపరి బయట ప్రపంచములోనికి వచ్చి అధర్మాచరణ గలిగియుండినచో అట్టివారు ధర్మద్రోహులే కాదు, దైవద్రోహులు కూడ నగుదురు.

శాంతి, అక్రోధము మున్నగు దైవికగుణములు ఇంటిలోని పూజామందిరపు హద్దువఱకేయని కొందఱు జనులు తలంచుకొనుచున్నారు. కనుకనే వారు ఇంటిలో యోగులుగను, బయట అసురులుగను ప్రవర్తించుచుందురు. అట్టివారిని జూచినచో సామాన్యజనులకు పరమార్థసంఘము మొత్తముపైననే ఒకవిధమైన ఏహ్యాభావము గలుగగలదు. కాబట్టి దైవమార్గావలంబు లందఱును తమతమ ధ్యాన, పూజా

జప, తపాదులతోబాటు, సర్వభూతదయ, జీవకారుణ్యము మొదలైన పవిత్రగుణములు కలిగియుండవలెను.

పాశ్చాత్యదేశములో సౌభ్రాతృత్వము (brotherhood) అను ధర్మమునకు ఎక్కువ ప్రచారము కలదు. తోటిమానవుని తన సోదరునిగ తలంచుకొని ప్రేమ, సహృదయత కలిగియుండుటయే ఆ సుగుణముయొక్క అర్థము. పూర్వము ఫ్రాన్స్ దేశమందు చెలరేగిన క్రాంతి (French Revolution) సమయమున ప్రజలు తమ విజయమునకొఱకు ఎన్నుకొనిన 'సమత్వము, స్వాతంత్ర్యము, సోదరత్వము' (Equality, liberty, fraternity) అను మూడు నినాదములలో ఈ సౌభ్రాతృత్వము ప్రముఖస్థానము నాక్రమించియున్నది. కాని హైందవమతము ఈ 'సోదరత్వము'తో తృప్తిపడలేదు. ఏలయనగా నూటికి నూఱుపాళ్ళు ప్రేమ అందు కనిపించుట లేదు. సోదరుడు సోదరుని కలహించుకొను సంఘటన లెన్నియో వార్తాపత్రికలందు కానవచ్చుచున్నవి. ప్రత్యక్షముగను అట్టివి యెన్నియో యిరుగుపొరుగులలోనే సంభవించుచున్నవి. ఒక వకీలుగారిని ప్రశ్నించినచో ఇక్కాలమున వారికివచ్చు ఎక్కువ కేసులు సోదరసోదరుల కలహములు, భార్యాభర్తల పేచీలు, తండ్రీకొడుకుల స్పర్ధలు—వీనికి సంబంధించినవే యని తడుముకొనకుండ చెప్పివేయును. కాబట్టి సోదరత్వము మంచిదే అయినను చాలదు. ఇంకను పైకిపోయి ఆత్మోపమ్యత్వమును అలవాటు చేసికొనవలయును. తనవలెనే సర్వప్రాణికోట్లను

జూచుకొను శక్తిని సంపాదించవలెను. ఇదియే అనుష్ఠాన వేదాంతము. భగవంతునకు అత్యంతప్రీతికరమైన ధర్మమిదియే. మోక్షధామమునకు రాజబాటయు నిదియే—

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః.

(భగవద్గీత 6 32)

'సుఖమునందుగాని దుఃఖమునందుగాని ఎవడు తనవలెనే అందఱిని సమముగ జూచుకొనునో అట్టియోగి సర్వోత్కృష్టుడని చెప్పబడును'.

భగవద్గీతయందలి ఈ శ్లోకము అనుష్ఠాన వేదాంతమును బాగుగ నొక్కి చెప్పుచున్నది. సోదరత్వము (Brotherhood) ను దాటి ఒకమెట్టు పైకిపోయి గీత 'ఆత్మౌపమ్యము' (నీవలె ఇతరులను జూచుకొనుము)— అను మహోన్నత సిద్ధాంతమును ప్రతిపాదించినది ఆత్మౌపమ్యమనగా నేమి? సుఖదుఃఖములందుగాని, మఱేపరిస్థితియందుగాని తనవలె నితరులను జూచుటయే ఆత్మౌపమ్యము. దృష్టాంతమునకు – తనకు ఆకలి కలిగినచో 'ఎవరైన నాకు అన్నము పెట్టిన బాగుండును' అని మనుజుడు తలంచును. అట్లే యితరులకు ఆకలి కలిగినచో వారికి తా నన్నము పెట్టవలెను. తనకు దప్పిక కలిగినచో 'ఎవరైన నాకు మంచి నీళ్ళిచ్చిన బాగుండును' అని తలంచును. అట్లే పరులకు దాహము కలిగినపుడు తాను వారికి మంచినీళ్ళివ్వవలెను. తనకు చలిగా నున్నచో 'కప్పుకొనుట కెవరైన నాకు

డుప్పటి ఇచ్చినచో బాగుండును' అని మనుజుడు భావించును. అదేవిధమున ఎవరైన చలిచే బాధపడుచున్నచో వారికి వస్త్రదానమును చేయవలెను. ఇదియే గీతయందు తెలుపబడిన 'ఆత్మౌపమ్య' ధర్మము. ఇదియే ఆచరణవేదాంతము.

పైన తెలుపబడిన శ్లోకమును ప్రతివారును కంఠస్థము చేసి అర్థమును బాగుగ మననము చేయవలెను. ఈ శ్లోకము గీతకు మకుటమువంటిది. వైరులకు, ద్వేషులకు, సోమరులకు గొడ్డలిపెట్టువంటిది. ఎవడును ఏకాలమందును, ఏ పరిస్థితి యందును తనపై తాను ప్రీతిలేకయుండడు. మఱియు తనకు దుఃఖమును వాంఛింపడు. కనుకనే గీత, ఉపనిషత్తులు అట్టి 'ఆత్మౌపమ్యము'నే ప్రేమకు, స్నేహమునకు సాదృశ్యముగ తీసికొనినవి. అంతియే కాని 'సోదరత్వము'ను తీసికొనలేదు. ఏలయనిన, సోదరత్వము గొప్పతత్త్వమైనను, పవిత్రధర్మమైనను, ప్రేమయొక్క పూర్ణత్వమును, పరాకాష్ఠను అయ్యది దిగ్దర్శనము చేయజాలదు.

Do as you would be done by

'నీవు నీకేమి యొనర్పదలంచుకొందువో దాని నితరులకు చేయుము'—'నిన్ను నీవు సుఖపెట్టనలంచుచో అట్టి సుఖమును ఇతరులకు నీవు కలుగజేయుము. నీవు హాయిగ నుండదలంచుచో అట్టి హాయిని ఇతరులకున్ను కలుగజేయ యత్నింపుము. 'నన్నెవరును బాధింపగూడదు' అని నీ వెట్లు తలంచుదువో అట్లే ఇతరులకున్ను నీవు బాధను గలుగ జేయకుము.'

ఒరులేయని యొనరించిన
నరవర యప్రియము తన మనంబునకగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మపథములకెల్లన్. (మహాభారతము)

భారతమందు తెలుపబడిన ఈ ధర్మమే గీతయందు తెలుపబడిన 'ఆత్మౌపమ్య' దృష్టి. ఇట్టిదృష్టి కలిగియున్నచో ఇక మనుజుడు భక్తియందుగాని, యోగమందుగాని, జ్ఞానమందుగాని ఆరితేరినట్లు లెక్క. అది లేనిచో, ఇంకను ఆ యోగములు సరిగ అబ్బలేదని నిర్ణయించుకొనవచ్చును. దేవుని భజించి జీవుని బాధించినచో ఏ ప్రయోజనమున్ను లేదు. నారాయణుని పూజించి నరుని దూషించినచో లాభములేదు. విష్ణువును ధ్యానించి ధర్మమును ధిక్కరించినచో ఆ ధ్యానమునకు విలువలేదు.

అపహాయ నిజం కర్మ కృష్ణ కృష్ణేతి వాదినః
తే హరేర్ద్వేషిణః పాపా ధర్మార్థం జన్మయద్ధరేః.

సత్యమును, ధర్మమును తృణీకరించి 'కృష్ణా, కృష్ణా' యని నోటితో పలికినంతమాత్రమున ఎవడును భక్తుడు కానేరడు. ఏలయనిన కృష్ణుని జన్మ ధర్మోద్ధరణకొఱకే అయియున్నదికదా! కావున కృష్ణుని నామస్మరణముతో పాటు కృష్ణుడు బోధించిన ధర్మములను ఆచరణలో పెట్టుటయు, ఆ కృష్ణుని రూపములే యగు సమస్తప్రాణికోట్ల యెడల దయగలిగియుండుటయు నాచరింపవలెను. ఇట్టి అనుష్ఠానవేదాంతమును ఏకాలమందును సాధకులు మఱువరాదు.

పూర్వ మొక గురువుండెడివాడు. అతనికి ఒక ఆశ్రమము, ఒక శిష్యుడుకూడ నుండెను. శిష్యునకు ప్రతిదినము ఆ గురువు శాస్త్రములను బోధించుచు ఒకరోజున గురుభక్తిని గూర్చి, గురుపూజను గూర్చి, గురుసేవామహిమను గూర్చి విశేషించి చెప్పెను. మఱుసటిరోజున గురువు ఆశ్రమకార్యార్థము బయటికిపోయి సరిగా మిట్ట మధ్యాహ్నము మఠమునకు వచ్చెను. తలుపు వేసియుండెను. శిష్యుడు లోన గురువుగారి పటమునకు పూజ చేయుచుండెను. 'నాయనా! తలుపుతీయి' అని గురువు కేకవేసెను. లోనుండి శిష్యుడు—'స్వామీ, అష్టోత్తరము పూర్తి కాలేదు, పూర్తిచేసి వచ్చెదను' అనెను. 'శంభూ! కాళ్ళు కాలుతున్నవి, త్వరగా తలుపు తీయి' అని మరల గురువు పలికెను. కాని మందమతి యగు ఆ శిష్యుడు, 'స్వామీ! పూజమధ్యలో ఎట్లా లేచేది' అని జవాబిచ్చెను. 'ఎవరిపూజ నాయనా' అని గురువడిగెను. 'తమరి పూజయే స్వామీ' అని యా అంతేవాసి బదులు చెప్పెను. చాలసేపటికి ఎట్టకేలకు తలుపుతీసెను. అపుడు గురువు శిష్యుని చీవాట్లు పెట్టి, 'గురువును ఎండగొట్టి గురుపూజ యేమి?' అని మందలించి గురువాక్యమును పాలించుటయే నిజమైన గురుపూజ యనియు, దైవప్రోక్తమగు ధర్మమును ఆచరించుటయే నిజమైన దైవపూజయనియు బోధించెను.

ఇట్టి తత్త్వము తెలియక అనేకులు పైపైపూజలు, ధ్యానములు, నమస్కారములు చేయుచు హృదయమును మాత్రము కఠినముగ నుంచుకొనుచున్నారు. కొందఱు ఎవ

రైన చిప్పిక గొన్నవాడు వచ్చి వారిని 'కొద్దిగ మంచినీళ్లు పొయ్యండి మహాప్రభో' అని వేడినప్పటికి 'ఛీ, పోండి' అని ఈసడించుకొనుచుందురు. 'అన్నమో రామచంద్రా!' యని అల్లాడుచు వచ్చిన అన్నాతురుని ద్వేషించి వెడలగొట్టుదురు (ఇచ్చుటకు శక్తికలిగి కూడ). ఇవి చిన్న విషయములని ఎవరును ఉపేక్షచేయరాదు. పెద్ద పెద్ద పూజలకంటె హెచ్చుగ ఇటువంటి పరోపకారసంబంధమైన చిన్నవిషయములకే మహాత్ములు ప్రాధాన్యము నొసంగుచుందురు. భగవంతుడున్ను వానినే అధికముగ మెచ్చును.

"The greatness of a man lies not in doing great things in a great way, but in doing small things in a great way."

'మనుజుని యొక్క గొప్పతనము పెద్ద పెద్ద కార్యములను ఆర్భాటముగ చేయుటలో లేదు చిన్నచిన్న కార్యములను గొప్ప మనస్సుతో చేయుటలోనే కలదు' - అని ఆంగ్లభాషలో నొక సామెత కలదు. ఒకడు పరోపకారమును గూర్చి బ్రహ్మాండమైన ఉపన్యాసముచేసి ఇంటికి వెడలుచుండె ననుకొనుడు. ప్రక్కనే మఱియొకడు వీథిని బోవుచు రోడ్డుమీద ఒక రాయిపడియుండుట చూచి 'ఇది యెవరికైన తగిలినచో బాధపడుదురు' అని యెంచి దూరముగ పారవేసె ననుకొనుడు. వీరిరువురిలో రెండవవాడే చాల గొప్పవాడు. ఒక్కవాక్యము పలుకకున్నను గంభీరమైన ధర్మోపన్యాసఫలితము కావించినవాడే యగును. ఏలయనగా అతడు బోధిం

చినది అనుభవవేదాంతము (Practical Vedanta) ఈ రహస్యములన్నిటిని ఆలోచించియే భగవానుడు గీత ఆఱవ అధ్యాయమునందు ధ్యానయోగమును గూర్చి ముందు బోధించినను, అంతటితో వదలిపెట్టక తనుపరి అమూల్యముగు ఆచరణ వేదాంతమును ("ఆత్మౌపమ్యేన...." ఇత్యాది శ్లోకముల ద్వారా) గూడ వ్యక్తపఱచెను. ముంగుతో బాటు పథ్యమును గూడ బోధించకున్నయెడల ఈ ప్రకారముగ రెండిటిని చెప్పుటవలన బోధనసమాప్తమైనది. పరిపూర్ణత్వమును బొందినది. కావున చిత్తైకాగ్రత ప్రాధాన్యముగ గల ధ్యానయోగమున్ను, సర్వభూతహితాత్మకముగు అనుష్ఠానమున్ను రెండును సాధకునకు అత్యంతావశ్యకములై యున్నవి.

'సర్వదేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి'— (ఏ దేవునకు నమస్కరించినను అది పరమాత్మకే చెందును) అను వాక్యముతో బాటు 'సర్వజీవ తిరస్కారః కేశవం ప్రతి గచ్ఛతి'—(ఏ ప్రాణిని బాధపెట్టినను అదియు భగవంతునకే తగులును) - అను వాక్యమును గూడ ఎవరును మఱువరాదు. ఇట్టి భావములను మఱచి మనుజుల స్మరింపని ముముక్షువగువాడు తన ధ్యానానుష్ఠానములతో బాటు తాన సంధ్యావందన జపప్రార్థనాపూజాది కార్యములతో బాటు జీవకారుణ్యమును, సర్వభూతదయను, ప్రేమతత్త్వమును, దయార్ద్ర హృదయమును పొందించుకొనుచుండవలెను. వాస్తవముగ విచారించి చూడ సమస్తభూతకోట్లయందును

సర్వేశ్వరుని అస్తిత్వమును అనుభూతమొనర్చుకొనుచు, కరుణ, దయ, ప్రేమాదులను అభివృద్ధిపఱచుకొనుటయే నిజమైన భక్తియగును. కనుకనే శ్రీకృష్ణభగవానుడు 'అద్వేష్టా సర్వభూతానాం'—ఏ ప్రాణిని ద్వేషింపని వాడే భక్తుడని, తనకు అత్యంత ప్రియుడని గీతయందు పేర్కొనెను. కాబట్టి విజ్ఞులెల్లరు ఈ ధర్మసూక్ష్మమును లెస్సగ గ్రహించి, తమ ధ్యానాదులతోబాటు తమ నైతికప్రవర్తనమును గూడ సంపాదించుకొనుచు, కామక్రోధాదులను రహితమొనర్చుకొనుచు, జీవకారుణ్యముగలవారై, విశాలహృదయులై, సర్వభూతహితతత్పరులై, అనుష్ఠానవేదాంతులై ఆదర్శపరులై వర్తించుచుందురుగాక! ధర్మాచరణయే మానవుడు కడతేరుటకు ఏకైకమార్గమని యెఱుంగవలయును. ధర్మమునుల్లంఘించి ఎవరును దైవమును చేరలేరు.

'ధర్మో రక్షతి రక్షితః' – "ధర్మమును అవలంబించినచో, ఆ ధర్మమే నిన్ను కాపాడును" – అను శాస్త్రోక్తి కలదు. ప్రతిమానవుడును శాంతిని, సుఖమును, దైవమును పొందదలంచుచున్నాడు కాని, ఆయా పదార్థములెట్లు లభించునో యోచించుటలేదు. శాంతికి మార్గమేది? శాశ్వత సుఖమెట్లు లభించును? దైవమెట్లు సంప్రాప్తమగును? – అని జనులు ముఖ్యముగ విచారింపవలసియున్నది. దైవప్రోక్తమగు మార్గమును అనుసరించనిచో దైవమును ఎవడును ఏకాలమందును పొందజాలడు. అదియే ధర్మము, అదియే సత్యము, ఆ సత్య, ధర్మములనే వేదములు ప్రతిపాదించినవి.

వానినే శాస్త్రములు వేనోళ్ళ శాసించినవి. వానినే అవతార మూర్తులు, మతప్రవక్తలు, అనుభవజ్ఞులగు మహనీయులు ప్రజలకు చాటి చెప్పిరి. 'Truth is God' -సత్య, ధర్మములే దైవమని మతములు ఉద్ఘోషించుచున్నవి. కాబట్టి వాని నుపేక్షించినవాడు దైవమును పొందుట కల్ల. వాని నుపేక్షించినవాడు శాంతి లభించుట కల్ల. "మాకు దైవము కావలెనుగాని, ధర్మముకాదు" అని యెవరైన పల్కినచో, వారి యా వాక్యము ఉన్మత్తప్రలాపమే యగును. ఏల యనగా, ధర్మము నాచరింపనిచో దైవ మేకాలమందును పొందబడదు. కనుకనే 'ధర్మో రక్షతి రక్షితః' - ధర్మమును నీవు కాపాడినచో ధర్మమే నిన్ను కాపాడగలదు - అను సూక్తి వెలువడినది. ధర్మావలంబనముచే దైవావలంబనము తప్పక కలుగగలదు. ఈ విషయమున సందేహమే లేదు. కావున దైవప్రాప్తికై అర్రులు చాచువారు తమయందు ఏకోశముననైన ఒకింత ధర్మమున్నదాయని పరీక్షించుకొను చుండవలెను.

భగవద్గీత 'ధర్మ' శబ్దముతో ప్రారంభమైనది. అది కాకతాళీయముగ సంభవించిన ఘటన కాదు. ధర్మముయొక్క మహాత్మ్యమును గమనించియే శ్రీ వ్యాసమహర్షి పరమపవిత్ర మైన గీతాశాస్త్రమును 'ధర్మ'పదముతో ప్రారంభించెను. గీతయొక్క హృదయము ధర్మమే యనుట సుస్పష్టము. ధర్మముయొక్క గ్లానిని భగవానుడు సహింపలేడు. కావుననే ధర్మమునకు హాని సంభవించినపుడెల్ల తా నవతరించి ధర్మ

సముద్ధరణము గావించెదనని గీతయం దభయ మొసంగెను *
మఱియు అర్జునునకు ధర్మవిషయమైన విచికిత్స జనించుట
వలనకే శ్రీకృష్ణపరమాత్మ గీతారూపమగు ధర్మవివరణ
మును గావించి అర్జునునకు చిత్తశాంతిని కలుగజేసెను.
అర్జునునకు ధర్మమునుగూర్చిన పరితపన కలిగెను. (ధర్మ
సమ్మూఢచేతాః)—'ఓకృష్ణా, ధర్మముయొక్క వాస్తవ
స్వరూపమును నాకు తెలియజేయుము' అని భగవానుని
అర్జునుడు ప్రార్థించెను. ఇట్టి ధర్మోత్కంఠ, ధర్మజిజ్ఞాస,
ధర్మమునుగూర్చిన పరితపన ఏక్షణమున జీవునకు కలుగునో,
ఆక్షణమునుండియే అతని జీవితము వికాసమును పొంద
నొడగును.

లోకములో జనులు పరిపరివిధముల విలపించు
చున్నారు. కొందఱు ధనముకొఱకు, కొందఱు ఐశ్వర్యము
కొఱకు, కొందఱు కీర్తిప్రతిష్ఠలకొఱకు, మఱికొందఱు భోగ
ములకొఱకు పరితపించుచున్నారు. కాని అర్జునునివలె ధర్మము
కొఱకు, దైవముకొఱకు విలపించువారెందఱు కలరు? శ్రీ
రామకృష్ణపరమహంసవలె, మీరాబాయివలె, భగవత్సా
యుజ్యమునకై తహతహపడు వారెందఱు కలరు? బిడ్డ
ఊయెలయందు పరుండి ఏడ్చినచో, తల్లి ఎక్కడనున్నప్ప
టికిని అన్నిపనులు వదలుకొని పరుగెత్తుకొనివచ్చి అతని
యోగక్షేమములను విచారించును. అట్లే భక్తుని మొరను

* పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే. (భ. గీ. 4.8)

భగవంతుడు అలరించుచునే యుండును. కావున దైవము కొఱకు, ధర్మముకొఱకు పరితపించువాడే ధన్యుడు. దృష్టిని ప్రాపంచిక సుఖములనుండి మరల్చి ధర్మమునందు, దైవమందు నిలిపి శాస్త్రనిర్దిష్టమగు సన్మార్గమున ప్రవర్తించు నిర్మలచరితుడు ఈ జీవితమునందే సర్వోత్కృష్టమగు బ్రహ్మపదవిని చేపట్టగలడు.

అయితే కొందఱు దేవుని అర్చించుచు, దేవుడు బోధించిన వాక్యములు (ధర్మములు) ఉల్లంఘించుచున్నారు. అట్టివారు శాంతిని ఎన్నడును నోచుకొనలేరు. పరమ సుఖమును బడయలేరు. ధర్మమునకు హానిగలుగజేయువారు, ధర్మదూరులై ప్రవర్తించువారు ఒకవిధముగ భగవంతుని దూషించినవారే యగుదురుగాని భూషించినవారు కారు. కావున ఆధ్యాత్మిక పురోవృద్ధిని బడయదలంచువారు భగవంతుని పరమపవిత్రమగు నామమును ఉచ్చరించుటతో పాటు భగవదుపదిష్టమగు ధర్మమార్గమును గూడ చేపట్టి, సచ్చరిత్రము, ధర్మాచరణము కలిగియుండవలెను. ఇదియే భగవంతునకు పరమ ప్రీతికరమైన విషయము. ధర్మావలంబులు సాక్షాత్ దైవరూపులుగ శోభిల్లుచుందురు. మానవుడు మానవుడై పరిఢవిల్లుటకు ధర్మ మొకటియే శరణ్యము. ధర్మము జీవుని చేయిపట్టుకొని తీసుకొనివెళ్ళి దైవము కడ చేర్చి, దైవములో అతనిని విలీనమొనర్చి జీవుని, దేవుని ఏకముగ జేసివైచును. ఇట్టి మహోత్కృష్టమగు ధర్మమును,

ధర్మమార్గమును ముముక్షువులు ఏకాలమందును విడనాడ రాదు.

ఈరీతిగ ధర్మబుద్ధి, దైవబుద్ధి గలిగి, విశాలదృక్పథముతో సమస్తమును వీక్షించుచు, హ్రస్వభావమునకు చోటీయక ముముక్షువు పరమార్థరంగమున అగ్రసరుడు కావలయును. సంకుచితభావములకు తన హృదయమున ఏమాత్రము అవకాశ మొసంగగూడదు.

హ్రస్వదృష్టి ఏ రంగమందును పనికిరాదు. ఇక పరమార్థరంగమున దానికి అసలు తావే లేదు. సంకుచితభావము కలవారికి, హృదయ వైశాల్యము లేనివారికి ఆధ్యాత్మిక లక్ష్యము ఎన్నడును చేకూరదు. భగవంతుడు ఒకరి ప్రత్యేక సొత్తుకాదు. అతడు అందఱివాడు. అతనిని పొందుటకు, అనుభవించుటకు ప్రతి ప్రాణికిని పరిపూర్ణమైన స్వేచ్ఛ కలదు. ఆ స్వేచ్ఛను త్రోసివేయుటకు విశ్వమం దెవనికిని హక్కు లేదు.

అట్టి పరమాత్మను పొందుటకై ఒకానొకడు విశ్వాసముతో ఒకానొక మార్గమును జేపట్టి పయనమై పోవుచుండ మఱియొకడు అభ్యంతరము తెలుపరాదు. పరమతసహనము ముముక్షువునకు అత్యంతావశ్యకమైయున్నది. తన మతమును అభివృద్ధి పఱచుకొనుచు, ఇతర మతములలో తనకు మంచిదని తోచినదానిని స్వీకరించుచు మనుజుడు తన అభ్యున్నతిని సాధించుకొనుచు పోవలెను. దూషణచేతను, నిందచేతను ఏ

కార్యమున్ను సాధింపబడదు. పైపెచ్చు తన లక్ష్యమునకు కూడ దానిచే అవరోధము కలుగగలదు.

'జోషయేత్సర్వకర్మాణి విద్వాన్యుక్తః సమాచరన్' అని గీతాచార్యులు తెలిపిన చందమున విజ్ఞుడగువాడు తాను చక్కగ ఆచరించుచుండినచో, ఆ తనశుద్ధమగు ఆచరణను జూచి ఇతరులను ఆ మార్గమున ప్రవేశించుటకు ఉత్సహింతురు. ఈ ప్రకారముగ మతోద్ధరణకై ప్రశాంత మార్గములను, నిర్మాణాత్మకపద్ధతులను (Constructive methods) అనుసరింపవలెనే కాని వినాశకరశక్తులను ప్రోత్సహింపరాదు.

శాంతిని జనుల హృదయసీమలలో నాటునది మతము. అట్టి మతముపేరిట అశాంతి ఏనాడును చెలరేగకూడదు. జీవుని దేవునియొద్దకు చేర్చునది మతము. అట్టిమతము దైవప్రాప్తికి అవరోధముగ ఏనాడును పరిణమింపరాదు. మతముపేర, దైవముపేర అల్లకల్లోలములు రేగుట అత్యంత గర్హణీయమై యున్నది. ఆయా మతములవారు వారివారి ఇష్టదైవములను ఆరాధించుకొనుచు, వారివారి ఆచారములను అవలంబించుకొనుచు, వారివారి పరమార్థ సిద్ధాంతములను పరిపోషించుకొనుచు అన్యులను బాధింపక, బలాత్కరింపక అధ్యాత్మపథమున ముందునకు సాగిపోవుచుండవలెను. తమయొక్క నిర్మలమగు ఆచరణచే తుదకు అందఱును గమ్యస్థానమగు సచ్చిదానంద పరబ్రహ్మమును చేరియే తీరుదురు. మతములు చక్కగ వర్ధిల్లుటకు ఇది యొకటియే సవ్యమైన మార్గము.

కాబట్టి మతోద్ధారణకై వినాశకర పద్ధతులను అవలంబింపక, విశాలదృక్పథము గలిగి సమన్వయధోరణిని చేబట్టి సమరసభావము హృదయమున పొంగి పొరలుచుండ వివిధ స్థానములనుండి వివిధ మార్గములద్వారా వివిధ సమయములలో పుష్కరస్నానమునకై గంగానదికి బయలుదేఱిన యాత్రికుల చందమున, మతానుయాయులందఱును మోక్షమార్గమున పయనించుచు తుట్టతుదకు అందఱును ఏదియో యొక సమయమున ఆత్మరూప పావన భాగీరథీతోయములందు గ్రుంకి బ్రహ్మానందపరవశులు కావలయును.

ఈ ప్రకారముగ జనులు మోక్షహేతువులగు పెక్కు సాధనలాచరించి తమ హృదయమందే వెలుగుచున్న పరమాత్మను సాక్షాత్కరించుకొని జీవితమును ధన్యము చేసికొనవలెను. తన జన్మహక్కగు మోక్షసుఖమును ప్రయత్నపూర్వకముగ సంపాదించుకొని ఆనందసాగరమున మునకలిడుచు బ్రహ్మానుభూతిచే పునర్జన్మరహిత శాశ్వతకైవల్య పదవిని అధిష్ఠించవలయును. అదియే పరమావధి. అదియే నిర్వాణనిలయము. అదియే మోక్షము.

# 20 వ అధ్యాయము

## మోక్షమును గూర్చిన శాస్త్రప్రమాణములు

### ఉపనిషత్తులు

మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధ మోక్షయోః
బన్ధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమితి.

మనుజులకు, బంధమోక్షములకు కారణము మనస్సే అయియున్నది. దృశ్యవిషయములందు ఆసక్తమైన మనస్సు బంధమును, విషయరహితమగు మనస్సు మోక్షమును కలుగజేయును.

యస్య సంకల్పనాశస్స్యాత్తస్య ముక్తిః కరే స్థితా
తస్మాద్భావాభావౌ పరిత్యజ్య పరమాత్మధ్యానేన ముక్తో భవతి.

ఎవనికి సంకల్పము నశించునో అతనికి మోక్షము అరచేతియందే యున్నదగును. కాబట్టి పదార్థములఁగూర్చిన సంకల్పమును త్యజించి పరమాత్మధ్యానము చేయువాడు మోక్షమును బడయును.

దృశ్యవస్తుపరిత్యాగాద్విలయం యాతి మానసమ్
మానసే విలయం యాతే కైవల్యమవశిష్యతే.

దృశ్యవస్తువులనుగూర్చి చింతింపకుండుటచే మనస్సు విలయమును బొందుచున్నది. మనస్సు విలయమగుటచే మోక్షము శేషించుచున్నది.

హాస్త్యాసృష్టిభిరాకాశం క్షుధార్తః ఖండయేత్తుషమ్
నాహం బ్రహ్మేతి జానాతి తస్య ముక్తిర్న జాయతే.

ఆకాశమును పిడికిళ్ళచే ఎన్నడైన భేదించవచ్చును. ఆకలిగొన్నవాడు ఊకనుదంచి తిని ఎన్నడైన ఆకలిని తీర్చుకొనవచ్చును. కాని 'నేను బ్రహ్మమును' అని తెలిసికొనకయే ఎవడును ఎన్నడును మోక్షమును బొందలేడు.

దృశ్యం నాస్తీతి బోధేన మనసో దృశ్యమార్జనమ్
సంపన్నం చేత్తదుత్పన్నా పరా నిర్వాణనిర్వృతిః.

'దృశ్యము లేదు' అను బోధచే మనస్సున కెపుడు దృశ్యరాహిత్యస్థితి ఉదయించునో అపుడు ఉత్తమమగు మోక్షము సిద్ధించినదే యగును.

అశేషేణ పరిత్యాగో వాసనానాం య ఉత్తమః
మోక్ష ఇత్యుచ్యతే సద్భిః స ఏవ విమలక్రమః.

వాసనలను సంపూర్ణముగ వదలుటయే మోక్షమనియు, మోక్షమును పొందుట కదియే పవిత్రమగు మార్గమనియు పెద్దలు చెప్పుదురు.

నాహంబ్రహ్మేతి సంకల్పాత్సుదృఢాద్బధ్యతే మనః
సర్వం బ్రహ్మేతి సంకల్పాత్సుదృఢాన్ముచ్యతే మనః.

'నేను బ్రహ్మమును కాను' అను దృఢసంకల్పముచే మనస్సు బంధమును బొందుచున్నది. 'అంతయు బ్రహ్మమే' అను దృఢసంకల్పముచే మనస్సు మోక్షమును పొందుచున్నది.

కృశోఽహం దుఃఖబద్ధోఽహం హస్తపాదాదిమానహమ్
ఇతి భావానురూపేణ వ్యవహారేణ బధ్యతే.
నాహం దుఃఖీ న మే దేహో బంధః కోఽస్యాత్మని స్థితః
ఇతి భావానురూపేణ వ్యవహారేణ ముచ్యతే.

'నేను కృశించినవాడను, దుఃఖమును పొందువాడను, బద్ధుడను, చేతులు, కాళ్లు మొదలగునవి కలవాడను'— అను ఈ ప్రకారములగు భావములచేతను, తదనుగుణమగు వ్యవహారములచేతను మనుజుడు బంధమును పొందుచున్నాడు. నేను దుఃఖమును పొందువాడను కాను. నాకు దేహమే లేదు. నేను కేవలము ఆత్మస్వరూపుడను. ఆత్మకు బంధ మెచట? అను ఈ ప్రకారములగు భావములచేతను, తదనుగుణ్యమగు వ్యవహారముచేతను మనుజుడు మోక్షమును బడయుచున్నాడు.

భోగేచ్ఛామాత్రకో బంధస్తత్త్యాగో మోక్ష ఉచ్యతే
మనసోఽభ్యుదయో నాశో మనోనాశో మహోదయః.

భోగములనుగూర్చిన ఆశలు కలిగియుండుటయే బంధము. వానిని వదలుటయే మోక్షము అని చెప్పబడినది. మనస్సు విజృంభించుటయే జీవునకు వినాశము. మనస్సు లయించుటయే మహాభాగ్యము.

యది తే నేన్ద్రియార్థశ్రీః స్పందతే హృది వై ద్విజ
తదా విజ్ఞాతవిజ్ఞేయః సముత్తీర్ణో భవార్ణవాత్.

ఎపుడు ఇంద్రియార్థములగు దృశ్యవిషయములు నీకు హృదయమున రుచింపకుండునో, అపుడు జ్ఞేయమగు పర

మాత్మను తెలిసికొనినవాడవును, సంసారసాగరమును దాటి మోక్షమును బొందినవాడవును అగుదువు.

దృశ్యమాశ్రయసీదం చేత్తత్సచిత్తోఽసి బంధవాన్
దృశ్యం సంత్యజసీదం చేత్తదచిత్తోఽసి మోక్షవాన్.

దృశ్యమును నీవు ఆశ్రయించినచో అపుడుచిత్తముతో కూడినవాడవై బంధమును బొందుదువు. దృశ్యమును లెస్సగ త్యజించినచో చిత్తరహితుడవై మోక్షమును బడయుదువు.

న మోక్షో నభసః పృష్ఠే న పాతాలే న భూతలే
సర్వాశాసంక్షయే చేతః క్షయో మోక్ష ఇతీష్యతే.

మోక్షము ఆకాశమందు లేదు, పాతాళమున లేదు, భూమిపై లేదు. ఆశలన్నిటిని వదలుటచేత కలుగు మనస్సుయొక్క వినాశమే మోక్షమని చెప్పబడును.

సంకల్పత్వం హి బంధస్య కారణం తత్పరిత్యజ
మోక్షో భవేదసంకల్పాత్తదభ్యాసం ధియా కురు.

సంకల్పమే బంధమునకు కారణము. కావున అద్దానిని వదలిపెట్టుము. సంకల్పరాహిత్యముచే మోక్షము సిద్ధించును. కాబట్టి బుద్ధిచే అట్టి అభ్యాసమును గావింపుము.

అతో నిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా
యతో నిర్విషయో నామ మనసో ముక్తిరిష్యతే.

మనస్సుయొక్క నిర్విషయస్థితియే మోక్షమని చెప్పబడును. కావున ముముక్షువు ఎల్లప్పుడును తన మనస్సును నిర్విషయముగ నొనర్చుకొనుచుండవలెను.

దేహాత్మజ్ఞానవజ్జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకమ్
ఆత్మన్యేవ భవేద్యస్య స నేచ్ఛన్నపి విముచ్యతే.

'నేను దేహమును' అను జ్ఞానమును మనుజుడే ప్రకారము కలిగియుండుచున్నాడో, అప్రకారమే 'నేను ఆత్మను' అను భావము కలిగియున్నచో అపుడు కోరకున్నను అతనికి మోక్షము సిద్ధించియే తీరును.

సమాసక్తం సదా చిత్తం జన్తోర్విషయగోచరే
యద్యేవం బ్రహ్మణి స్యాత్తత్కో న ముచ్యేత బంధనాత్.

దృశ్యవిషయములందు ఏ ప్రకారము మనుజుని చిత్తము సదా ఆసక్తిని గొనుచున్నదో, ఆ ప్రకారము బ్రహ్మమునందు ఆసక్తిని గొనుచో అపుడు ఎవడు మోక్షమును బొందకుండును! (అతడు తప్పక మోక్షము నొందునని భావము.)

యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే.

ఎప్పుడు మనస్సునందలి కోరికలన్నియు వెళ్ళిపోవునో, అపుడు మనుజుడు అమరుడై ఇచటనే బ్రహ్మమును బొందుచున్నాడు. (మోక్షమును బడయుచున్నాడు.)

శ్రీ భగవద్గీత

యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ
సమదుఃఖ సుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే.

పురుషశ్రేష్ఠుడవగు ఓ అర్జునా! ఎవనిని ఈ శబ్ద స్పర్శాదులు బాధింపవో (చలింపజేయవో) సుఖదుఃఖము లందు సమభావముగల అట్టి ధీరుడే మోక్షమును కర్హుడగును.

తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః
గచ్ఛన్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః.

ఆ పరమాత్మయందే బుద్ధిగలవారును, ఆ పరమాత్మ యందే మనస్సును నెలకొల్పినవారును, ఆ పరమాత్మయందే నిష్ఠగలవారును, ఆ పరమాత్మనే పరమగతిగ నెంచువారును, జ్ఞానముచే నెగురగొట్టబడిన పాపముగలవారై పునరావృత్తి రహితమగు (పునర్జన్మరహితమగు) శాశ్వత మోక్షపదవిని బొందుచున్నారు.

యోఽన్తఃసుఖోఽన్తరారామ స్తథాన్తర్జ్యోతిరేవ యః
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి.

ఎవడు లోన ఆత్మయందే సుఖించుచు, ఆత్మయందే క్రీడించుచు, ఆత్మయందే ప్రకాశము గలవాడై యుండునో, అట్టి యోగి బ్రహ్మస్వరూపుడై, బ్రహ్మసాక్షాత్కారమును (మోక్షమును) బొందును.

లభన్తే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః.

పాపరహితులును, సంశయవర్జితులును, ఇంద్రియ ములవంబులను స్వాధీనపఱచుకొనినవారును, సమస్తప్రాణుల

రొక్క క్షేమమం దాసక్తిగలవారు నగు ఋషులు (అతీంద్రియజ్ఞానులు) బ్రహ్మసాక్షాత్కారమును (మోక్షమును) బొందుచున్నారు.

> కామక్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసామ్
> అభితో బ్రహ్మ నిర్వాణం వర్తతే విదితాత్మనామ్.

కామక్రోధాదులు లేనివారును, మనోనిగ్రహము కలవారును, ఆత్మతత్త్వము నెఱిగిన వారునగు యత్నశీలురకు బ్రహ్మసాయుజ్యము (మోక్షము), అంతటను (శరీరమున్నపుడును, లేనపుడును, సర్వత్ర) వెలయుచునే యున్నది.

> యతేన్ద్రియ మనో బుద్ధిర్మునిర్మోక్షపరాయణః
> విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః.

ఎవడు వెలుపలనున్న శబ్దస్పర్శాది విషయములను వెలుపలికే నెట్టివైచి (లోన ప్రవేశింపనీయక) చూపును భ్రూమధ్యమున నిలిపి, నాసికాపుటములందు సంచరించు ప్రాణాపాన వాయువులను సమముగ జేసి, ఇంద్రియమనోబుద్ధులను నిగ్రహించి ఇచ్ఛాభయక్రోధములు లేనివాడై, మోక్షాసక్తుడై (ఆత్మ) మననశీలుడై యుండునో అట్టివా డెల్లప్పుడును ముక్తుడే యగును.

> ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః
> అనేక జన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్.

పట్టుదలతో ప్రయత్నించునట్టి యోగి పాపరహితుడై అనేక జన్మలందు చేయబడిన అభ్యాసముచే యోగసిద్ధిని

బొందినవాడై, ఆ పిదప సర్వోత్తమమగు (మోక్ష) గతిని బడయుచున్నాడు.

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్.

ఎవడు ఇంద్రియద్వారము లన్నిటిని బాగుగ అరికట్టి, మనస్సును హృదయమందు (ఆత్మయందు) లెస్సగా స్థాపించి, శిరస్సునందు (బ్రహ్మరంధ్రమందు) ప్రాణవాయువును ఉంచి, ఆత్మనుగూర్చిన ఏకాగ్రచింతనము (యోగధారణ) గలవాడై పరబ్రహ్మమునకు వాచకమైన 'ఓమ్' అను ఒక అక్షరమును ఉచ్చరించుచు నన్ను ఎడతెగక చింతించుచు శరీరమును వదలునో అతడు సర్వోత్తమస్థానమును (మోక్షమును) బొందుచున్నాడు.

ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున
మా ముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే.

ఓ అర్జునా! బ్రహ్మలోకమువఱకు గల లోకము లన్నియు తిరిగివచ్చెడి స్వభావము కలవి (అనగా వానిని పొందినవారు మరల జన్మమెత్తవలసియే వచ్చుదురు.) నన్ను పొందినవారికో మరల జన్మయే లేదు. వారు మోక్షమును బొందుదురు.

సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్.

సమస్త ప్రాణులయందును లెస్సగ వెలయుచున్నట్టి పరమాత్మను సమముగ వ్యాపించియున్నట్లు జూచుచు మను

జుడు తన ఆత్మను తాను హింసించుకొనడు. కావున అతడు సర్వోత్తమగతిని (మోక్షమును) బొందుచున్నాడు.

యదాభూత పృథగ్భావ మేకస్థ మనుపశ్యతి
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా.

ఎప్పుడు వేర్వేఱుగనున్న ఈ భూతప్రపంచమంతయు ఒక్కదానియందు (పరమాత్మయందు) ఉన్నదానిగను, మఱియు దానినుండియే విస్తరించుచున్న దానినిగను వీక్షించునో అపుడు మనుజుడు (మోక్షమును బడయుచున్నాడు) బ్రహ్మమును పొందుచున్నాడు.

క్షేత్ర క్షేత్రజ్ఞయోరేవ మన్తరం జ్ఞానచక్షుషా
భూతప్రకృతి మోక్షం చయే విదుర్యాన్తి తే పరమ్.

ఎవరు జ్ఞానదృష్టిచేత క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క భేదమును, ప్రకృతి (అవిద్య) నుండి విముక్తిని కలుగజేయు ఉపాయమును తెలిసికొందురో వారు పరమాత్మపదమును (మోక్షమును) బొందుదురు.

గుణానేతానతీత్య త్రీన్ దేహీదేహసముద్భవాన్
జన్మమృత్యు జరాదుఃఖై ర్విముక్తో ఽమృతమశ్నుతే.

జీవుడు దేహోత్పత్తికి కారణభూతములగు మూడు గుణములను దాటినచో పుట్టుక, చావు, ముసలితనము, దుఃఖములు అను వానిచేత లెస్సగ విడువబడినవాడై, మోక్షమును (మరణరహిత ఆత్మస్థితిని) బొందుచున్నాడు.

నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి.

ఎప్పుడు వివేకవంతుడు (సత్త్వాది) గుణములకంటె నితరమును కర్తగా నెంచడో, మఱియు తన్ను గుణముల కంటె వేఱగు వానినిగ తెలిసికొనుచున్నాడో, అపుడాతడు నా స్వరూపమును (మోక్షమును) బొందుచున్నాడు.

మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే.

ఎవడు నన్నే అచంచలమైన భక్తియోగముచేత సేవించుచున్నాడో అతడీగుణములన్నిటిని లెస్సగా దాటి వైచి బ్రహ్మముగా నగుటకు (మోక్షము నబడయుటకు) సమర్థుడగుచున్నాడు.

నిర్మానమోహా జితసఙ్గదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః
ద్వన్ద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్.

అభిమానము (లేక, అహంకారము) అవివేకము లేని వారును, సంగము, దృశ్యపదార్థములం దాసక్తి అను దోష మును జయించినవారును, నిరంతరము ఆత్మజ్ఞానము (బ్రహ్మ నిష్ఠ) గలవారును, కోరికలన్నియు లెస్సగ (వాసనాసహిత ముగ) తొలగినవారును, సుఖదుఃఖములగు ద్వంద్వములనుండి బాగుగ విడునబడినవారును అగు జ్ఞానులు అవ్యయమగు బ్రహ్మపదమును (మోక్షమును) బొందుచున్నారు.

ఏతైర్విముక్తః కౌన్తేయ తమోద్వారైస్త్రిభిర్నరః
ఆచరత్యాత్మనః శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్.

కామక్రోధ లోభములను మూడు నరకద్వారముల నుండి బాగుగ విడువబడిన మనుజుడు తనకు హితమును గావించుకొనుచు సర్వోత్కృష్టమగు మోక్షగతిని పొందు చున్నాడు.

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్
విముచ్య నిర్మమశ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే.

అహంకారమును, బలమును, (కామక్రోధాదిసంయుక్తమగు బలమును లేక మొండిపట్టును), డంబమును, కామమును (విషయాసక్తిని), క్రోధమును వస్తుసంగ్రహణమును బాగుగ వదలివై చువాడును, మమకారము లేనివాడును, శాంతుడును అయియుండువాడు బ్రహ్మస్వరూపము నొందుటకు (మోక్షమునకు) సమర్థుడగుచున్నాడు.

సర్వకర్మాణ్యపిసదా కుర్వాణోమద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్.

సమస్తకర్మములను ఎల్లప్పుడును చేయుచున్నవాడైనను కేవలము నన్నే ఆశ్రయించువాడు (శరణుబొందువాడు) నా యనుగ్రహమువలన నాశరహితమగు శాశ్వతమోక్ష పదమును పొందుచున్నాడు.

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత
తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్.

ఓ అర్జునా! సర్వవిధముల ఆ (హృదయస్థుడగు) ఈశ్వరునే శరణుబొందుము. అతని యనుగ్రహముచే సర్వో

త్తమమగు శాంతిని, శాశ్వతమగు మోక్షపదవిని నీవు పొందగలవు.

## వసిష్ఠగీత

న ధనేన భవేన్మోక్షః కర్మణా ప్రజయా న వా
త్యాగమాత్రేణ కిం త్వేకే యతయోఽశ్నన్తి చామృతమ్.

'ధనముచేగాని, కర్మముచేగాని, సంతానముచేగాని మోక్షము లభింపదు. త్యాగమాత్రముచేతనే ప్రయత్నశీలురు అమృతపదమగు మోక్షమును బొందుచున్నారు.

దృశ్యం నాస్తీతి బోధేన మనసో దృశ్యమార్జనమ్
సంపన్నం చేత్తదుత్పన్నా పరా నిర్వాణనిర్వృతిః.

ఆత్మజ్ఞానముచే 'దృశ్యములేదు' అను బోధద్వారా మనస్సుచే దృశ్యమార్జన మెపుడు సిద్ధించునో, అపుడు ఆత్మజ్ఞానముయొక్క పరాకాష్ఠ, మోక్షస్థితి, ఉత్పన్నమైనదని యెఱుగుము.

అశేషేణ పరిత్యాగో వాసనానాం య ఉత్తమః
మోక్ష ఇత్యుచ్యతే బ్రహ్మన్స ఏవ విమలక్రమః.

వాసనలయొక్క సంపూర్ణపరిత్యాగమే ముఖ్యమైన మోక్షమని చెప్పబడును. అట్టిమోక్షము అవిద్యాదిమలములు లేనివారికే సంప్రాప్తించును.

అవిచ్ఛిన్న చిదాత్మైకః పుమానస్తీహ నేతరత్
స్వసంకల్పవశాద్బద్ధో నిఃసంకల్పశ్చ ముచ్యతే.

మనుజుడు అఖండమైన, ఏకమైనట్టి చిదాత్మయే కాని, అన్యము కాడు. అతడు స్వసంకల్పవశముచే బద్ధుడున్ను, నిస్సంకల్పత్వముచే (సంకల్పరహితుడగుటచే) ముక్తుడున్ను అగుచున్నాడు.

వాసనానవం రామ మోక్ష ఇత్యుచ్యతే బుధైః
పదార్థవాసనాదార్ఢ్యం బన్ధ ఇత్యభిధీయతే.

ఓ రామచంద్రా! వాసనలయొక్క క్షీణత్వమే మోక్షమని విజ్ఞులచే చెప్పబడుచున్నది. మఱియు పదార్థములయొక్క వాసనలు దృఢపడుటయే బంధమని పేర్కొనబడుచున్నది.

జగత్త్వమహమిత్యాదిర్మిథ్యాత్మా దృశ్యముచ్యతే
యావదేతత్సంభవతి తావన్మోక్షో న విద్యతే.

'జగత్తు నీవు, నేను'-ఈ మున్నగు మిథ్యారూపములే దృశ్యమని చెప్పబడుచున్నవి. అవి సత్యములుగ భావింపబడునంతవఱకును మోక్షము లేదు.

అయం సదేవ ఇత్యేవ సంపరిజ్ఞానమాత్రతః
జన్తోర్న జాయతే దుఃఖం జీవన్ముక్తత్వమేతి చ.

'ఈతడే ఆ ఆత్మదేవుడు' అని యెఱుంగుట (సాక్షాత్కరించుకొనుట) మాత్రముచే జీవుని కిక దుఃఖమెన్నటికిని కలుగకుండును. మఱియు నాతడు మోక్షమును పొందును.

స్వప్నే నిర్వాసనాభీజే యథోదేతి సుషుప్తతా
జాగ్రత్యవాసనాభీజే తథోదేతి విముక్తతా.

స్వప్నమందు వాసనలు లేనిచో సుషుప్తి ఉదయించు నట్లు, జాగ్రత్తునందు వాసనలు సంపూర్ణముగ నశింప, మోక్షము ఉదయించుచున్నది.

యది సర్వం పరిత్యజ్య తిష్ఠస్యుత్క్రాన్తవాసనః
అమునైవ నిమేషేణ తస్ముక్తోఽసి న సంశయః.

సమస్తమును త్యజించి వాసనారహితుడవై యున్నచో ఈ నిమిషమందే నీవు ముక్తుడవగుదువు. ఇందు సంశయము లేదు. (బాహ్యాదృశ్యపదార్థములను, అంతర వాసనలను వీడిన ముక్తుడవగుదువు.)

యత్రాభిలాష స్తన్నానం సంత్యజ్య స్థీయతే యది
ప్రాప్తఏవాద్గతన్మోక్షః కిమేతావతి దుష్కరమ్.

ఏ పదార్థమందు అభిలాష కలదో దానిని వదలివేసి నచో మనుజునకు మోక్షము నిక్కముగ సంప్రాప్తించిన దనియే నీ వెఱుంగుము. ఇంతమాత్రపు ప్రయత్నమున ఏమి కష్టము కలదు?

నాహం బ్రహ్మేతి సంకల్పాత్సుదృఢాద్బధ్యతే మనః
సర్వం బ్రహ్మేతి సంకల్పాత్సుదృఢాన్ముచ్యతే మనః.

''నేను బ్రహ్మమునుగాను'' అను సుదృఢ సంకల్పముచే మనస్సు బంధనమును పొందుచున్నది. ''అంతయు స్వాత్మ యగు బ్రహ్మమే'' అను సుదృఢసంకల్పముచే మనస్సు మోక్షము నొందుచున్నది.

తరన్తి తే భవామ్భోధిం స్వప్రవాహాధిరూఢ యే
శాస్త్రేణాసాదితం దృశ్యమితి నిర్వాణసంస్థితాః.

ఎవరు ప్రత్యగాత్మయం దాసక్తమగు బుద్ధితో గూడి తత్త్వమస్యాది మహావాక్యబోధకమగు శాస్త్రముద్వారా దృశ్యమును తుడిచివైచి నిర్వాణరూపమగు ఆత్మయందు స్థితిగలిగియుందురో, అట్టివారు సంసారసాగరమును దాటివైచి మోక్షమును బొందుచున్నారు.

అహంకారానుసన్ధానవర్జనాదేవ రాఘవ
పౌరుషేణ ప్రయత్నాచ్చ తీర్యతే భవసాగరః.

ఓ రామచంద్రా! అహంకారముయొక్క అనుసంధానమును వర్జించుటవలనను, ధైర్యావలంబన, శ్రవణమననాది రూప పురుషప్రయత్నములచేతను ఈ సంసారసాగరము దాటివేయబడును.

శ్రూయతాం జ్ఞానసర్వస్వం శ్రుత్వాచైవావధార్యతామ్
భోగేచ్ఛామాత్రకో బన్ధస్తత్త్యాగో మోక్ష ఉచ్యతే.

జ్ఞానముయొక్క సర్వస్వమును వచించుచున్నాను, వినుము. అది విని దానిని బాగుగ హృదయమున ధారణ యొనర్చుకొనుము. ''భోగములయెడల ఇచ్ఛయే బంధము, భోగేచ్ఛను త్యజించుటయే మోక్షము.''

యదా తే నేన్ద్రియార్థశ్రీః స్వదతే హృది రాఘవ
తదా విజ్ఞాతవిజ్ఞానః సముత్తీర్ణభవార్ణవః.

ఓ రామచంద్రా! ఎపుడు ఇంద్రియార్థములగు శబ్ద స్పర్శాదులు నీకు స్వతః హృదయమందు రుచింపకుండునో, అపుడు విజ్ఞానరూపమగు ఆత్మ నెఱిఁగినవాడవనియు, సంసార

సముద్రమును దాటినవాడవనియు (మోక్షమును బడసిన వాడవనియు) తెలిసికొనుము.

విచారితమలం శాస్త్రం చిరముద్గ్రాహితం మిథః
సంత్యక్త వాసనాన్మౌనాదృతే నాస్త్యుత్తమం పదమ్.

శాస్త్రము లన్నిటిని మేము బాగుగ విచారించితిమి. మఱియు చిరకాలము ఆత్మజ్ఞులతోటి పరస్పర సంవాదము ద్వారా ఆ తత్త్వములను బాగుగ దృఢ మొనర్చుకొంటిమి. కాని, ఎన్ని విచారించినను వాసనలను సంపూర్ణముగ త్యజించి మౌనముగ నుండుటకంటె (నిర్వికల్పాత్మయందు స్థితినొందియుండుటకంటె) ఉత్తమమైన పద మింకొకటి యెద్ది యును మాకు కానిపించలేదు. (అదియే మోక్షపదము)

వివేకం పరమాశ్రిత్య విలోక్యాత్మాన మాత్మనా
ధియా విరాగోద్ధురయా సంసారజలధిం తరేత్.

గొప్ప వివేకము నాశ్రయించి, స్వయముగ ఆత్మను వీక్షించి, వైరాగ్యపూర్ణమగు బుద్ధిచే సంసారసముద్రమును దాటివైచి మోక్షమును బొందవలెను.

దృశ్యమాశ్రయసీదం చేత్తత్స చిత్తోఽసి బన్ధవాన్
దృశ్యం సంత్యజసీదం చేత్తదచిత్తోఽసి మోక్షవాన్.

దృశ్యము నాశ్రయించుచో నీవు చిత్తసహితుడవై బంధము కలవాడవగుదువు. దృశ్యమును లెస్సగ త్యజించుచో చిత్తరహితుడవై మోక్షమును పొందినవాడవగుదువు.

సర్వమాత్మాహ మేవేతి నిశ్చయో యో మహామతే
తమాదాయ విషాదాయ న భూయో యాతి మే మతిః.

"ఈ సమస్త (బ్రహ్మాండమును) ఆత్మయే; ఆ ఆత్మ నేనే" అను నిశ్చయమేది కలదో, ఆద్దానిని అవలంబించి యుండుటవలన నా బుద్ధి మరల యెన్నటికిని దుఃఖమును బొందకయే యున్నది. (అని శ్రీ వసిష్ఠమహర్షి పలికిరి).

తిర్యగూర్ధ్వ మధస్తాచ్చ వ్యాపకో మహిమాత్మనః
సర్వమాత్మేతి తేనాన్త ర్నిశ్చయేన న బధ్యతే.

"ప్రక్కల, పైన, క్రింద అంతటను ఆత్మయొక్క మహిమ వ్యాపించియున్నది. కాబట్టి ఈ సమస్తమున్ను ఆత్మయే" అను నిశ్చయము అంతఃకరణమున గలిగి యున్నచో జీవుడు ఎన్నటికిని బద్ధుడు కానేరడు.

చిచ్చేత్యకలనా బన్ధస్తన్ముక్తి ర్ముక్తి రుచ్యతే
చిదచేత్యాఖిలాత్మేతి సర్వసిద్ధాన్త సంగ్రహః.

చైతన్యముయొక్క విషయాకార (దృశ్య) కల్పనయే బంధము. అట్టి కల్పన లేకుండుటయే మోక్షము. విషయాకార రహితమగు చైతన్యమే పూర్ణాత్మ—ఇదియే సమస్త సిద్ధాంతములయొక్క సంగ్రహము.

పౌరుషం యత్నమాశ్రిత్య ప్రోల్లంఘ్యేన్ద్రియపర్వతమ్
సంసార జలధిం తీర్త్వా పారం గచ్ఛ పరం పదమ్.

పురుషప్రయత్నము నాశ్రయించి ఇంద్రియములను పర్వతమును లెస్సగ లంఘించివైచి, సంసారసముద్రమును దాటి, దాని కావల నున్నట్టి పరమాత్మపదమును జేరుము. అదియే మోక్షపదము.

చిత్తాక్రమణమాత్రాత్తు పరమాదౌషధాదృతే
ప్రయత్నేనాపి సంసార మహారోగో న శామ్యతి.

చిత్తమును జయించుట మాత్రమను పరమౌషధము లేకున్న ఇక ఈ సంసారమను మహారోగము ఎన్ని ప్రయత్నముల చేతనుగూడ శమింప నేరదు. మోక్షమున్ను సిద్ధింపదు.

యావత్సర్వం న సంత్యక్తం తావదాత్మా న లభ్యతే
సర్వావస్థా పరిత్యాగే శేష ఆత్మేతి కథ్యతే.

ఎంతవఱకు సమస్తము లెస్సగ త్యజింపబడకుండునో, అంతవఱకును ఆత్మ లభింపకుండును. (జాగ్రదాది) సర్వావస్థలను (సమస్త పదార్థములను) పరిత్యజింప, ఏది శేషించునో, అదియే ఆత్మ యని చెప్పబడును. అట్టి ఆత్మస్థితియే మోక్షము.

స్వాత్మావలోకనార్థం తు తస్మాత్సర్వం పరిత్యజేత్
సర్వం కించిత్పరిత్యజ్య యద్దృష్టం తత్పరం పదమ్.

కాబట్టి స్వాత్మదర్శనముకై సమస్తమును పరిత్యజింపవలయును. సమస్త దృశ్యమును పరిత్యజింప ఏది (ఇక త్యజించుట కెయ్యది సర్వదా అశక్యమై) కన్పట్టునో, అదియే పరమగు ఆత్మపదము (మోక్షపదము.)

వైరాగ్యాభ్యాస యత్నాభ్యాం స్వపరామర్శజన్మనా
తత్త్వాలోకన పోతేన తీర్యతే భవసాగరః.

అభ్యాస వైరాగ్యములను ప్రయత్నముల చేతను, స్వవిచారణ చేతను, జనించునట్టి తత్త్వజ్ఞానమను గొప్ప

ఓడచే సంసారసముద్రము దాటబడును. మోక్షపదవి లభించును.

ఏతావతైవ దేహేన పరమాత్మానగమ్యతే
కాష్ఠలోష్ఠ సమత్వేన దేహో యదవగమ్యతే.

ఈ దేహము కొయ్యతోను మట్టిగడ్డతోను సమానముగ గాంచబడుచో, అంతమాత్రపు జ్ఞానముచేతనే దేవేశుండగు పరమాత్మ తెలిసికొనబడును. (మోక్షపదవి లభించును.)

దేహ భావనయైవాత్మా దేహదుఃఖ వశే స్థితః
తత్త్యాగేన తతో ముక్తో భవతీతి విదుర్బుధాః.

దేహభావన వలననే ఆత్మ దేహదుఃఖములకు వశమై యున్నదనియు, అట్టి భావనను వీడినచో అయ్యది మోక్షము బొందుచున్నదనియు విజ్ఞులు చెప్పుదురు.

న మోక్షో నభసః పృష్ఠే న పాతాలే న భూతలే
మోక్షో హి చేతో విమలం సమ్యగ్జ్ఞానవిబోధితమ్.

మోక్షము ఆకాశముయొక్క వెనుకభాగమునగాని, పాతాళమునగాని, భూతలమునగాని లేదు. ఉత్తమ జ్ఞానముచే లెస్సగ బోధితమైనట్టి నిర్మలచిత్తమే మోక్షము. (ఆత్మ రూపమును పొందింపబడినట్టి చిత్తమే మోక్షమని భావము.)

సకలాశాస్వసంసక్త్యా యాత్స్వయం చేతసంక్షయః
స మోక్షనామ్నా కథిత స్తత్త్వజ్ఞై రాత్మదర్శిభిః.

సమస్త వాంఛిత పదార్థములందును ఆసక్తి లేనందుచే (ఏవిధమైన ఆశలు లేకుండుటచే) స్వయముగ సంభవించు చిత్తముయొక్క శయమేది కలదో, అదియే మోక్షమను పేరుచే ఆత్మదర్శులగు తత్త్వజ్ఞులచేత చెప్పబడినది.

ఆత్మావలోకనే యత్నః కర్తవ్యో భూతి మిచ్ఛతా
సర్వదుఃఖ శిరశ్ఛేద ఆత్మా లోకేన జాయతే.

మోక్షమును గోరువాడు ఆత్మదర్శనమునకై యత్న మొనర్పవలెను. ఆత్మను దర్శించుటచే సమస్తదుఃఖముల యొక్క శిరశ్ఛేదనము సంభవించును. (దుఃఖము లన్నియు తొలగిపోవునని భావము).

అపారావార మాక్రమ్య ప్రమేయీ కృత్య సర్వతః
సంసారాబ్ధిం గాయతే యః స ఏవ పురుషః స్మృతః.

అపారమగు సంసారసాగరమును ఆక్రమించి తత్త్వ దర్శనముచే అద్దానిని బాధితమొనర్చి ఇవ్విధముగ సమస్త జగత్తును (అధిష్ఠానదృష్టిచే) బ్రహ్మమాత్రముగ గావించి, అట్టి బ్రహ్మస్వరూపమే యగు ప్రపంచమున ఎవడు ప్రవేశించునో, ఆతడే మనుజుడని చెప్పబడును. (ఆతడే మోక్షమును బడసినవాడు).

ఆదర్శ పురుషస్యేవ వ్యవహారవతోఽపిచ
న యస్య హృదయోల్లేఖో మనాగపి స ముక్తిభాక్.

వ్యవహారము సల్పుచున్నప్పటికిని ఎవనియొక్క హృదయమున, అద్దమందలి ప్రతిబింబ మానవునకువలె ఒకిం

త్తైనను విరాగమును గాని మానావమానాది జనిత సుఖ దుఃఖాదులు గాని లేకుండునో, అట్టివాడు మోక్షభాజుఁడగును.

ఏకతత్త్వ ఘనాభ్యాసః ప్రాణానాం విలయ స్తథా
మనో వినిగ్రహశ్చేతి మోక్షశబ్దార్థ సంగ్రహః.

ఏకతత్త్వము (ఆత్మ)యొక్క దృఢాభ్యాసము ప్రాణ, వాయువుల విలయము, మనోనిగ్రహము—అను ఈ మూడిం టిచే మోక్షము సిద్ధించును. కావున ఈ మార్గత్రయమే మోక్షశబ్దార్థ సంగ్రహము. (సంక్షేపముగ వచించిన, ఈ మూడింటిచేతనే మోక్షము లభించునని భావము.)

సర్వమేతద్ధియా త్యక్త్వా యది తిష్ఠసి నిశ్చలః
తదహంకారవిలయే త్వమేవ పరమం పదమ్.

నీవు బుద్ధితో సమస్తదృశ్యమును త్యజించివైచి నిశ్చలముగ నుండుచో ఆ త్తఱి అహంకారము విలయమొందు టచే పరమపదము (ఆత్మ) నీవే అయి యుందువు, (ఆత్మవగు నీవే శేషించుదువు), అదియే మోక్షము.

ఏతావానేవ సంసార ఇదమ స్త్వితి యన్మనః
అస్య తూపశమో మోక్ష ఇత్యేవం జ్ఞానసంగ్రహః.

'ఇది నాకు లభించుగాక' అను నిట్టి ఇచ్ఛతోగూడిన మనస్సే సంసారము. ఇట్టి ఇచ్ఛాసహితమగు మనస్సు శమించుటయే మోక్షము. ఇదియే సమస్తజ్ఞానములయొక్క సారము.

బహునాత్ర కిముక్తేన సంక్షేపాదిద ముచ్యతే
సంకల్పనం మనోబన్ధ స్తదభావో విముక్తతా.

అధికముగ చెప్పనేల, (సారమంతయు) సంక్షేపముగ చెప్పెదను వినుము. సంకల్పమే మనస్సుయొక్క బంధనము, సంకల్పము లేకుండుటయే మోక్షము.

ప్రాప్తేన యేన నో భూయః ప్రాప్తవ్య మవశిష్యతే
తత్ప్రాప్తౌ యత్నమాతిష్ఠేత్కష్టయాపి హి చేష్టయా.

దేనిని పొందినచో ఇక మరల పొందదగిన దేదియు శేషించి యుండదో, అట్టిదానియొక్క (ఆత్మవస్తువుయొక్క) ప్రాప్తికొఱకై (మోక్షముకొఱకై) కష్టముతో గూడిన (ఇంద్రియ మనోనిగ్రహాదిరూప) చేష్టచేనైనను తప్పక ప్రయత్న మాచరింపవలయును.

అత్రాహారార్థం కర్మ కుర్యాదనిన్ద్యం
కుర్యాదాహారం ప్రాణసంధారణార్థమ్
ప్రాణాః సంధార్యా స్తత్త్వ జిజ్ఞాసనార్థం
తత్త్వం జిజ్ఞాస్యం యేన భూయో న దుఃఖమ్.

ఈ ప్రపంచమున ముముక్షువు ఆహారముకొఱకు దోషరహితమగు కర్మను చేయవలెను. ప్రాణసంరక్షణకొఱకు ఆహారమును గైకొనవలెను. ఆత్మతత్త్వము నెఱుంగుటకొఱకు ప్రాణములను ధరింపవలెను. మరల ఎన్నటికిని (జననమరణాది) దుఃఖమును బొందకుండుటకొఱకు ఆత్మతత్త్వమును తెలిసికొనవలెను. (అట్లు తెలిసికొనుటచే కృతదుఃఖరాహిత్యము, మోక్షము కలుగును గాన)

అహమిత్యేవ బన్ధాయ నాహమిత్యేవ ముక్తయే
ఏతావన్మాత్రకే బన్ధే స్వాయత్తే కః మశక్తతా.

'నేను దేహాది దృశ్యరూపుడను' అను భావనయే బంధనమును గలిగించును. 'నేను దేహాది దృశ్యరూపుడను గాను, (అపరిచ్ఛిన్న ఆత్మస్వరూపుడను)' అను భావనయే మోక్షమును గలిగించును. ఇవ్విధమున బంధరాహిత్యము నకై తన యధీనమునచే యున్నట్టి ఇంతమాత్రపు ఆచరణ యందు అశక్తిత్వము, కష్టము ఏమి కలదు ?

మమేద మితి బన్ధాయ నాహ మిత్యేవ ముక్తయే
ఏతావన్మాత్రకే వస్తున్యాత్మాయత్తే కిమజ్ఞతా.

'ఈ గృహాధనాది పదార్థములు నావి' అను భావనయే బంధనమును గలిగించును, 'ఇవి నావి కావు' 'ఈ శరీరాదులు నేను కాను.' అను భావనయే మోక్షమును కలుగజేయును. ఇవ్విధముగ తన యధీనముననే యున్నట్టి ఇంతమాత్రపు ప్రయత్నమందు తెలియకపోవుట యేమి?

అపేక్షైవ ఘనో బన్ధ ఉపేక్షైవ విముక్తతా
సర్వ శబ్దాన్వితా తస్యాం విశ్రాన్తేన కిమీక్ష్యతే.

పదార్థముల యెడల కోరిక గలిగి యుండుటయే బంధము. సమస్త దృశ్యపదార్థముల యెడల కోరిక లేకుండుటయే మోక్షము. పూర్ణకామత్వరూపమగు అట్టి మోక్ష స్థితియందు ఆత్మయందు) విశ్రాంతినొందువానికి ఏ పదార్థము నిచ్ఛగించును ?

యస్య న స్పదతే దృశ్య మదృశ్యం స్పదతే హ్యది
స బాహ్యాభ్యన్తరం శాన్తః స వితీర్ణో భవార్ణవాత్.

ఎవనికి హృదయమున దృశ్యప్రపంచము రుచింప కుండునో, మఱియు దృశ్యరహితమగు ఆత్మ రుచించునో ఆతడే బాహ్యాభ్యంతరములందును శాంతిగలవాడగును. మఱియు నాతడే సంసారసాగరమును లెస్సగ దాటి మోక్షమును బడసినవాడును అగును.

యజ్జాగ్రతి సుషుప్తత్వం బోధాదరసవాసనమ్
తం స్వభావం విదుస్తజ్జ్ఞా ముక్తిస్తత్పరిణామితా.

జ్ఞానము (తత్త్వబోధ)చే రాగ, వాసనాశూన్యత్వ పూర్వకముగ జాగ్రత్తువందే సుషుప్తియందుండుట ఏది కలదో, దానినే విజ్ఞులు బ్రహ్మ (ఆత్మ) స్వభావమని పేర్కొనిరి. అట్టి బ్రహ్మస్వభావముతో నుండుటయే మోక్షము.

మోక్షః శీతలచిత్తత్వం బన్ధః సంతప్తచిత్తతా
ఏతస్మిన్నపి నార్థిత్వ మహో లోకస్య మూఢతా.

శీతల (ప్రశాంత, నిర్వికార) చిత్తము గలిగియుండుటయే మోక్షము. సంతప్త (అశాంత, వికారయుత) చిత్తము గలిగియుండుటయే బంధము. శీతలచిత్తమాత్రరూపమగు ఇట్టి మోక్షమందుగూడ జనులకు కోరిక లేదే! అహః! లోకముయొక్క మూఢత్వ మేమని చెప్పవచ్చును!

స్వసంవేదన యత్నేన విషయామిషతో౽నిశమ్
కించిత్సంరోధితా సంవిత్ప్రాప్తం వైబుధం పదమ్.

స్వకీయ వివేక, విచారణాదిప్రయత్నములచే, చిత్తము విషయమను మాంసమునుండి ఒకింత నిరోధింపబడెనా, తత్త్వవేత్తలయొక్క అనుభవసిద్ధమగు స్వారాజ్య (మోక్ష) పదము పొందబడినట్లే యగును.

హరిః ఓం తత్ సత్.



శ్రీ

# గీతామకరందము

రచయిత:

## శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు

రాయల్ సైజు 1100 పేజీలుగల మహాగ్రంథము

ఇందు శ్రీ భగవద్గీత మూలశ్లోకములు. ప్రతి శ్లోకమునకు అవతారిక, ప్రతిపదార్థము, తాత్పర్యము, వ్యాఖ్యానము, ప్రశ్నోత్తరములు కలవు. ఇంకను గీతనుగూర్చిన అనేక వివరములు గ్రంథాదియందు పొందుపఱుపబడినవి. ఇవిగాక గీతాతత్త్వమును సంబోధకమొనర్పగల దాదాపు నూఱుపేజీలు గల గొప్ప ఉపోద్ఘాతమున్ను ప్రారంభమున గలదు. చిట్ట చివఱ శ్లోకానుక్రమణికయు చేర్చబడినది. గీతాభిలాషులకు చాల ఆవశ్యకమైన గ్రంథము.

పూర్తి క్యాలికో బైండు వెల **22** రు. లు.

ప్లాస్టిక్ జాకెట్టు వెల **2** రు. లు.

(పోస్టేజి ప్రత్యేకము)

---

## భగవద్గీత

(మూలశ్లోక, తాత్పర్యసహితము)

ఇందు శ్రీ భగవద్గీత మూలశ్లోకములు, ప్రతిశ్లోకమునకు తాత్పర్యమున్ను గలదు. ప్రారంభములో గీతాపారాయణ పద్ధతి మొదలైనవి తెలుపబడినవి.

పూర్తి క్యాలికో బైండు వెల రు. **3-00**

# గీతోపన్యాసములు

కాళహస్తి శ్రీ శుకబ్రహ్మాశ్రమ స్థాపకులగు శ్రీ శ్రీ శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు గీతాతత్త్వమును గూర్చి కావించిన 18 ఉపన్యాసముల సంగ్రహమే ఈ గ్రంథము. సర్వులకును గ్రాహ్యమగు రీతి సులభశైలిలో వ్రాయబడినది. భగవద్గీతయందు నిగూఢములైయున్న పెక్కు ధర్మరహస్యములు అనేక కథలద్వారా, సాదృశ్యములద్వారా అధునిక పద్ధతిలో మనోరంజకముగా నిందు వివరింపబడినవి. నేటి శాంతికాముక ప్రజానీకమునకు వలయు పెక్కు ధర్మమార్గములు యిందు బాగుగ వివరింపబడియున్నవి. మఱియు సత్పౌరునకు వలసిన శీలనిర్మాణమును గూర్చి చాల చక్కగ ఇందు వివరింపబడియున్నది. కావున ప్రతి పౌరుడును చదువదగిన గ్రంథరాజము.

క్రౌను 1/8 సైజు 680 పేజీలు—పూర్తి క్యాలికోబైండు

త్రివర్ణ ముఖచిత్రము

వెల 12 రు. లు.

ప్లాస్టిక్ జాకెట్టు 1-50 పై.

(పోస్టేజి ప్రత్యేకము)

(This book is commended for use in Public Libraries by the Government.)

ఓమ్

# శ్రీ వసిష్ఠగీత

## (సంక్షిప్త యోగవాసిష్ఠము)

(ప్రథమసంపుటము 1, 2 భాగములు కలిసి)

(ద్వితీయసంపుటము—3, 4 భాగములు కలిసి)

అనువాదకులు

## శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు

శ్రీ వసిష్ఠమునీంద్రునిచే శ్రీరామచంద్రున కుపదేశింపబడిన శ్రీ యోగవాసిష్ఠమను ఆధ్యాత్మిక గ్రంథముయొక్క సారమే ఈ వసిష్ఠగీత. 32 వేల శ్లోకములతో గూడిన మూలగ్రంథము నుండి ముఖ్యమగు తత్త్వభాగమును గ్రహించియు, బాహుళ్యమును తడించియు, ప్రధానవిషయమును వదలివేయకయు, పాఠకులకు అత్యంతోపయుక్తములైనట్టి శ్లోకములను పీరి అధ్యాయములుగ విభజించి తెనుగు తాత్పర్యమును చేర్చి ఈ వసిష్ఠగీతా గ్రంథ రూపమున ప్రకటింపబడినది. ఇది నాలుగు భాగములు గల్గి యున్నది. అందు మొదటి రెండు భాగములు కలిసి ఒక వాల్యూ ముగను, తక్కిన రెండు భాగములు మఱియొక వాల్యూముగను చేయబడినది. ముముక్షువుల కిది అత్యంత ప్రయోజనకరమగు గ్రంథము.

డెమ్మీసైజు పూర్తిక్యాలికోబైండు.

ప్రథమసంపుటము—1150 పేజీలు. వెల **18-00** రు.

ద్వితీయసంపుటము—1126 పేజీలు వెల **18-00** రు.

ప్లాస్టిక్ రేపరు ఒక్కొక్క సంపుటమునకు వెల **2-00.**

(పోస్టేజి ప్రత్యేకము)

# శ్రీ శుకబ్రహ్మాశ్రమ గ్రంథములు

| గ్రంథము పేరు | వెల |
|---|---|
| 1. గీతామకరందము | 22.00 |
| ప్లాస్టిక్ జాకెట్టు 2.00 | |
| 2. గీతోపన్యాసములు | 12.00 |
| ప్లాస్టిక్ జాకెట్టు 1.50 | |
| 3. వసిష్ఠగీత (సంక్షిప్తయోగవాసిష్ఠము) | |
| ,, (ప్రథమ సంపుటము 1, 2 భాగములు కలసి) | 18.00 |
| ,, (ద్వితీయ సంపుటము 3, 4 భాగములు కలసి) | 18.00 |
| (ప్లాస్టిక్ జాకెట్టు) (ఒక్కొక్క సంపుటమునకు) | 2.00 |
| 4. సూత్రాలంకారి భగవద్గీత | 8.90 |
| 5. భగవద్గీత (మూలశ్లోక, తాత్పర్యసహితము) | 8.00 |
| 6. భగవద్గీత (మూలము) | 1.25 |
| 7. ద్వాదశమఞ్జరి | 0.50 |
| 8. శ్రీ విద్యాప్రకాశానందగిరి... | 0.80 |
| 9. ఆత్మవిద్యావిలాసము | 0.75 |
| 10. యమలోకవార్తలు | 1.50 |
| 11. వివేకానంద సింహనాదము | 1.50 |
| 12. ఆధ్యాత్మిక జడ్జిమెంటు | 1.00 |
| 13. గౌరీపూజావిధానము | 0.50 |

(పోస్టేజి ప్రత్యేకము)

గ్రంథములు కావలసినవారు ఈ క్రింది అడ్రెసుకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

మేనేజరు,
శ్రీ శుకబ్రహ్మాశ్రమము
శ్రీ శుకబ్రహ్మాశ్రమము (పోస్టు)
కాళహస్తి (చిత్తూరుజిల్లా)

